# స్వవిషయం

## మూడవ భాగం



లింగం వీరభద్రయ్యచౌదరి
బి. ఏ. (ఆక్స్‌ఫర్డ్) బార్-ఎట్-లా

ప్రథమ ముద్రణ : అక్టోబరు 1974
స్వామ్యములు గ్రంథకర్తవి
ముద్రణ : త్రివేణి ప్రెస్, మచిలీపట్నం - 1

మూల్యం : 13 రూపాయలు

*Sole Distributors :*
త్రివేణి పబ్లిషర్సు
మచిలీపట్టణము - 1 మదరాసు - 1

# చివరిమాట

నా గొడవ ఏదో వ్రాయాలని మొదలుపెట్టితే, గుంటూరు చాంతాడయింది. ఒక పుస్తకంతో అయిపోతుం దనుకుంటే, మూడు భాగాలుగా మూడు పుస్తకాలైనవి. ఏ 300, 400 పేజీలతో సరిపోతుం దనుకుంటే 1250 పేజీ లైనవి. ఇంత పొడుగవటానికి కారణం నా స్వభావంలోనే వున్నది. టూకీగా, రేఖామాత్రంగా చెప్పటం నాకు చేతకాదు. దేనినైనా ఎత్తుకుంటే లోతుకు పోవాలి. చిలవలు, పలవలు వ్రాయాలి. ఈ లావాటి పుస్తకాలను చూడటంతోనే పాఠకులకు విసుగు కలగవచ్చును. అయితే, చదవా లని శ్రద్ధున్నవారికి పేజీలు తిరగవేస్తూంటే అభిరుచి పెరుగుతుం దనుకోవాలి. లేకపోతే మొదటిభాగం, రెండోభాగం చదివిన కొందరు పెద్దలు బాగున్నాయి, ఆకాలంనాటి స్థితిగతులను విశదపరుస్తున్నాయి, కొంత చారిత్రక ప్రాధాన్యాన్ని కలిగివున్నాయి అని మెచ్చుకోళ్లు పలకరు. ఈ మూడో భాగం కూడా, మొదటి రెండు భాగాల కంటె ఎక్కువ లావుపాటిదైనా ఆసక్తిగల పాఠకులను ఆకర్షిస్తుందని, వారు చదివి సంతోషిస్తారని ఆశించుచున్నాను.

చెప్పితే చిత్తు వ్రాసిన, సరిదిద్దిన తర్వాత సాఫీ వ్రాసిన వ్రాయసకాండ్రు గాక, నే నెవరి నుండి ఎట్టి సహాయాన్ని, ఇతర గ్రంథాల రచనల వలెనే ఈ గ్రంథరచనలో కూడా పొందలేదు. నాకు తోచింది నా స్వంత బాధ్యత మీదనే వ్రాశాను. దోషాలు, గుణాలు పూర్తిగా నావే.

ఇందులో వున్న 9 శీర్షికలలో, 8-వ శీర్షికైన 'బంధువులు - మిత్రులు' అనుదాని క్రింద మిత్రులను గురించి వ్రాసిన దానిలో, కొంత తడవిచూడట మున్నది. మనోభావాలను దాచకూడదనే పద్ధతిలో, కొంచెం విరసమే జొరబడి యుండవచ్చును. ఆ మిత్రులకు, "సుహృద్భావంతో వ్రాసినదేగాని వ్యతిరేకభావంతో కాదు. మీ యందు నాకు గల గౌరవ, ఆప్యాయత భావాల వల్లనే నేను మిమ్ములను గురించి ప్రస్తావించటం జరిగింది" అని వారికి తెలుపుకొనుచున్నాను.

ఈ "స్వవిషయం" నా ముఖ్యరచనగా ఎంచుకొనవచ్చును. ఇక ఏమైనా ప్రచురించగలనేమో ఇప్పుడు చెప్పలేను. అంతయూ శ్రీ సాయిబాబా దయ!

పెదపవగల్లు
1-10-1974

—లింగం వీరభద్రయ్యచౌదరి

# విషయ సూచిక


| | | | పుటలు |
|---|---|---|---|
| 1. | గ్రామ జీవితం | | 767 - 793 |
| 2. | వ్యవసాయం | | 794 - 832 |
| 3. | పశుపోషణ | | 833 - 887 |
| 4. | లలితకళలు : | (ఎ) చిత్రలేఖనం | 888 - 914 |
| | | (బి) శిల్పం | 914 - 926 |
| | | (సి) సంగీతం, నృత్యం, నటన | 926 - 936 |
| 5. | సాంస్కృతిక కలాపాలు | | 937 - 964 |
| 6. | సంచారం : | (ఎ) కుర్తాళం, రామేశ్వరం వగైరా | 965 - 1003 |
| | | (బి) బెంగుళూరు వగైరా | 1003 - 1028 |
| | | (సి) కొడైకెనాల్ | 1028 - 1059 |
| | | (డి) పుదుచ్చేరి | 1059 - 1071 |
| | | (ఇ) కూనూరు | 1071 - 1109 |
| | | (యఫ్) అజంతా గుహలు, షిరిడీ | 1109 - 1112 |
| | | (జి) కల్యాణ వెంకటేశ్వరస్వామి | 1112 - 1113 |
| 7. | గ్రంథ రచన | | 1114 - 1144 |
| 8. | బంధువులు - మిత్రులు | | |
| | | (ఎ) బంధువులు | 1145 - 1175 |
| | | (బి) మిత్రులు | 1176 - 1224 |
| 9. | మిగిలిపోయినవి | | 1225 - 1248 |

# అంకితం

సర్వసంగపరిత్యాగి, మహాయోగసిద్ధుడు

అమృతహృదయుడు, కారుణ్యమూర్తి.

దీనజనమందారము, భక్తకోటి కామధేనువు

శ్రీ శ్రీ శ్రీ షిరిడీ సాయిబాబా సద్గురునకు

భక్తిపురస్సరముగా

—లింగం వీరభద్రయ్యచౌదరి



గ్రంథకర్త, భార్య అన్నపూర్ణమ్మ

# తదనంతరం

నేను రెండవ భాగంలో చెప్పినట్లు నా ఉద్యోగం 30-6-1953 తో పూర్తిఅయింది. అప్పటి నుండి ఇప్పటి వరకు జరిగిన నా జీవితాన్నిగురించి ఈ మూడవ భాగంలో చెప్పు చున్నాను. మొదటి భాగంలో శైశవదశ నుండి ఉద్యోగంలో ప్రవేశించు వరకు నడచిన జీవితయాత్రను ఒక కథ చెప్పినట్లుగా ఏకధారగా చెప్పాను. రెండవ భాగం రచన ఇంచుమించు ఆ విధముగా నడచినా, ఉద్యోగంచేసిన స్థలాల ప్రకారం విభజన జరిగింది. ఈ మూడవ భాగంలో అట్లుగాక జీవిత సంఘటనల, అనుభవాల స్వభావాన్నిబట్టి వేరు వేరు మతలబులక్రింద వ్రాస్తు న్నాను. ఇట్లు వ్రాసిన నా పలువిధ జీవితం, తారీఖులకు లోను గాక, రీతులను బట్టి విస్పష్టమవుతుంది. కాలానుక్రమంగా వ్రాయ టానికి, తారీఖులు సరిగా జ్ఞాపక ముండవు. పైగా, వివిధా వస్థలను విడివిడిగా వ్రాస్తే, నాకు వ్రాయటానికి సులభమే గాక చదివేవారికి గూడ అనుకూలంగా వుంటుంది. ఈ కారణాలవల్ల ఈ మూడో భాగాన్ని తొమ్మిది శీర్షికలక్రింద వ్రాయుచున్నాను.

1. గ్రామజీవితం : ఈ శీర్షికక్రింద గ్రామస్థులతో సాంఘిక, వ్యావహారిక సంబంధాలు, ముఖ్యంగా నా స్వగృహ సంబంధాలు, నేను జరిపించిన వివాహాలు, నా బిడ్డల విద్యా విషయాలు వగైరా చెప్పబడుతవి.

2. వ్యవసాయం : భూములను బాగుచేయించటం, వానిని అభివృద్ధిపరచటం, నీటివనరులను కల్పించుకొనటం, నేనవలంబించిన వ్యవసాయరీతులు, వ్యవసాయానికి కావలసిన పశువులను కొనటం మొదలైనవి ఈ శీర్షిక క్రింద వస్తవి.

3. పశుపోషణ : పాడిఆవులను, గేదెలను కొనటం, వానిని పోషించటం, వాని అభివృద్ధికి తోడ్పడటం తత్సంబంధంగా పశువుల ఆస్పత్రిని పెట్టించటం, పాల అమ్మకపు కేంద్రాన్ని ఏర్పాటు చేయించటం వంటివి చెప్పబడుతవి.

4. లలితకళలు : ఈ శీర్షిక క్రింద నేను ఆంధ్రప్రదేశ లలిత కళా అకాడమి సభ్యుడనుగ వ్యవహరించటం, స్థానిక చిత్ర కళాసంస్థలకు అభిమానం చూపటం, తత్సంబంధమైన విషయాలు వివరించబడుతవి.

5. సాంస్కృతిక కలాపాలు : ఈ శీర్షిక క్రింద నేను అక్కడక్కడ జరిగిన సమావేశాలలో పాల్గొనటం, ఆంధ్రప్రదేశ సాహిత్య అకాడమిలో సభ్యుడనుగా వ్యవహరించటం, గ్రంథ సేకరణ వగైరా విషయాలు వ్రాయబడుతవి.

6. సంచారం : ఈ శీర్షిక క్రింద వినోదయాత్రలు, ఆరోగ్యము కొరకు వెళ్లిన ప్రదేశాలు, అక్కడి విశేషాలు పేర్కొనబడుతవి.

7. బంధువులు, మిత్రులు : ఈ మతలబు క్రింద నా బంధువులను గురించి, నాకు పరిచయమైన వారు, మిత్రులుగా మారిన వారు, నాయందు సదభిప్రాయము కలవారిని గురించి వ్రాస్తాను.

8. గ్రంథరచన : నేను వ్రాసిన పుస్తకాలను గురించి, వాని నితరులు ఏ విధముగా అంచనావేసింది ఈ శీర్షిక క్రింద తెలియబరుస్తాను.

9. మిగిలిపోయినవి : దీనిక్రింద, వివిధ విషయాలు చౌచౌగా, కలగాపులగంగా పై శీర్షికలక్రింద మిగిలిపోయినవి వ్రాయదలచాను.

ఈ పై తొమ్మిది మతలబులక్రింద నా మామూలు ధోరణిలో వివరంగా, విస్పష్టంగా వ్రాయాలని నా ఉద్దేశం. ఎంత వరకు సఫలీకృతుణ్ణైనానో చెప్పలేను. అంతయూ ఈశ్వరేచ్ఛ.

# ౧

# గ్రామ జీవితం

నాకు ౫౫ సంవత్సరాల వయస్సు నిండినందున, ఉద్యోగ విరమణ చేశానని చెప్పియున్నాను. విరమణకు పూర్వం, అప్పుడు మద్రాసు రాష్ట్రానికి ఇన్‌కమ్‌టాక్స్ కమిషనర్‌గా ఉండిన హెచ్. యమ్. చౌధురిగారు, (బెంగాలీ) "ఉద్యోగం పొడిగించినట్లైతే, చేస్తారా?" అని అడిగారు. "చేయను. ఈపని ఇంకా చేయటం విసుగ్గా వుంటుంది. పైగా ఆంధ్ర పబ్లిక్ సర్వీస్ కమిషన్‌లో సభ్యత్వం వస్తుందని ఆశిస్తున్నాను" అని జవాబిచ్చాను.

ఈ పబ్లిక్ సర్వీస్ కమిషన్ విషయం కొంత విపులంగానే రెండో భాగంలో చెప్పాను. ఇక్కడ ఒకటి రెండు ముక్కలు చెప్తాను. శ్రీ పుల్లారెడ్డి రెడ్డికులానికి సమానప్రతిపత్తిగల కమ్మకులానికి చెందినవాడనని గాక, మా ప్రాత ఆక్స్‌ఫర్డ్ స్నేహాభిమానాన్ని బట్టి నాకు సాయం చేయ పూనుకొన్నారు. శ్రీ ప్రకాశం పంతులుగారు మా కుటుంబాన్ని ఎరిగియుండబట్టి, నేను బారిష్టరు వగైరా ఉన్నత విద్యావంతుడనని అభిమానించారు. అలాగే శ్రీ నీలం సంజీవరెడ్డి నేను కమ్మ అనే వ్యతిరేకభావంతో గాక బంధువుల ఒత్తిడికి లొంగిపోయారు. అయితే, శ్రీ వివేకానంద మూర్తి అధ్యక్షుడవటం, ఇంకొక బ్రాహ్మణుడు శ్రీ బి.

సి హెచ్. నారాయణమూర్తి 'లా' శెక్రటరీ అవటం, ప్రకాశం పంతులుగారు కాకపోతే, అలాగే ఒక రెడ్డి మెంబరవటం, శ్రీ నీలం సంజీవరెడ్డిగారు కాకపోతే వారికి కులతత్వం అంటగట్ట వలసి వచ్చేదేమో, అదటుంచి, ఆంధ్రకేసరి రాజకీయ ఒత్తిడికి లొంగిపోవటం, ధైర్యసాహసాలు, స్వతంత్రబుద్ధి గల శ్రీ సంజీవ రెడ్డి బంధువుల ఒత్తిడికి లోబడిపోవటంవల్ల, చేతి కందిన కొమ్మ నా చేతినుండి జారిపోయింది. ఇంతకూ నాకా సేవాభాగ్యం లేదు.

పై విధంగా ఉద్యోగావకాశం పోవటంలో ఇంటికి వెళ్లి వ్యవసాయం చూచుకొనటం కన్న ఇక చేయవలసినదేమీ లేదని నాకు తోచింది. అంతకుముందు డిస్ట్రిక్టు జడ్జిగా పదవిని నిర్వహించి, విరమణచేసి, మద్రాసులో స్థిరనివాస మేర్పరచుకొన్న శ్రీ చలసాని సత్యనారాయణగారు రెండు మూడు సార్లు మద్రాసులోని మా యింటికి వచ్చి "మీరింకను జవసత్వాలు కల్గియున్నారు కదా! మీకు ఇన్‌కమ్‌టాక్సు అనుభవమున్నదికదా! కాబట్టి మీరూ నేనూ కలసి ఇన్‌కమ్‌టాక్స్ విషయాలలో పన్నుదారులకు సలహా నిచ్చే ప్రాక్టీసు పెడదాం" అని చెప్పి, నా అంగీకారానికి ప్రయత్నించారు. కాని నేను తిరిగి ఇన్‌కమ్‌టాక్స్ గొడవలలో పడటానికి పూర్తిగా విముఖుడను. ఎన్నో సంవత్సరాల క్రిందట మానుకొన్న న్యాయవాదవృత్తిని తిరిగి ఆరంభించాలని బుద్ధి పుట్టలేదు. ఇంటికి వెళ్లి "కులవృత్తికి సాటిరాదు గువ్వలచెన్నా" అను సామెత ప్రకారం, తాత ముత్తాతల నుండి అవలంబించి యుండిన సేద్యం చేసుకొందామని, నవంబరు చివరి వారంలో మద్రాసును విడిచి ఈ పెదసనగల్లుకు చేరుకొన్నాను.

చేరుకొన్నప్పటికి మాకు 40 ఎకరాల మాగాణి భూమి, వరండాతో కూడిన వంటయిల్లు, వ్యవసాయానికి బండ్లు, ఎద్దులుండినవి. 1936 లో నా భార్య, ఆమె అక్క 6 గురు కుమారులు, మా మామగారి ఆస్తిని పంచుకొన్నప్పుడు మాకు 32 ఎకరాలు లభించినవి. నా భార్య అక్క కొడుకులకు నూరు ఎకరాలు పైచిల్కు అనుభవంలోకి వచ్చినవి. మా మామగారు 1916 లో చనిపోయినప్పుడు 40 ఎకరాలు పైచిల్కు భూమి, 40 వేలు పైచిల్కు నగదు ఉండినవి. 1926 లో నా భార్య



గ్రంథకర్త అత్తగారు, సూరపనేని రంగమ్మగారు

మేనమామలు చెరుకూరి వారి నుండి వారివ్వవలసిన బాకీ క్రింద 20 ఎకరాలు కట్టుకోవలసి వచ్చింది. కాబట్టి అక్క, చెల్లెళ్ల జాయింటు క్రింద 60 ఎకరాల పైచిల్లు కనపడింది. అందులో సగం 32 ఎకరాలు, మాకు సంక్రమించింది. అయితే, తన పేరను, తన కొడుకుల పేరను నా భార్య అక్క 70 ఎకరాలు కొని యుండినది. అందువల్ల మాకు 32 ఎకరాలు, వారికి 102 ఎకరాలు సంప్రాప్తమైనవి. సామాన్య హిందూధర్మశాస్త్ర పద్ధతిని, ముఖ్యంగా కమ్మ కులాచారం ప్రకారం, అక్కచెల్లెళ్లు సమానంగా తల్లిదండ్రుల ఆస్తులను పంచుకొంటారు. నా భార్య అక్క తన పేరను, తన కుమారుల పేరను కొనియున్న ఆస్తి కుటుంబ ఆదాయము నుండి కొన్నదియే. నా షడ్డకుడు తన పిత్రార్జిత మేమిన్నీ తెచ్చియుండలేదు. కాబట్టి ఈ అన్యాయాన్ని చెల్లెలు లోకువను బట్టి ఆమె అక్క సాధించింది. నా షడ్డకుడు ఒకప్పుడు నాతో "నీ కొడుకు లిద్దరితో బాటు నా ఆరుగురు కొడుకులు సమానంగా పంచుకొన్నారు. అందువల్ల ఈ ఎనమండుగురుకు తలొక 16, 17 ఎకరాలు వచ్చింది" అన్నారు. కాని, మా మామ సూరపనేని సీతారాముడుగారు తన ఆస్తిని యావత్తు తన భార్య రంగమ్మగారికి మరణశాసనము ద్వారా సంక్రమింపజేశారు. ఆమె 1936 లోనే గాక, మొన్న మొన్నటివరకు జీవించియుండినది. పైగా నగ్నన్యాయ సూత్ర మెట్లున్నా, సంప్రదాయం ప్రకారం, కులాచార పద్ధతిని ఒక పుత్రిక నూరు ఎకరాల పైచిల్లు, ఆమె సోదరి ముప్పై రెండు ఎకరాలు పొందటం పూర్తిగా అన్యాయమే.

మాకు 1936 పంపకంలో వచ్చిన వాముల దొడ్డిని ప్రక్క, వెనుక స్థలాలను కొనటం ద్వారా విస్తరింపజేసుకొన్నాం. దాని హద్దులను నిర్ధారణజేసి, 1940 లో ప్రహారీ గోడ కట్టాం. 1942 లో ఇంటికి పునాదులు వేశాం. 1945—46 లో వంటిల్లు వగైరా కట్టాం. 1946 వేసవిలో నేను సెలవు మీద వచ్చి, కట్టిన వంటిల్లు భాగంలో ముందు వేయించిన పెద్ద రెల్లుగడ్డి

వసారా ఆసరాతో కాలం గడిపాం. నెల వానంతరం నేను బదిలీ మీాద అనంతపురుకు వెళ్ళేటప్పుడు. నా వదినె రెండవ కుమారుడు లింగం సీతారామారావు కుటుంబంతో అందులో ప్రవేశించాడు. అతడు అంతకుముందు 2, 3 సంవత్సరాల నుండి మా భూములను కౌలు కిచ్చుట మాని మాకు గాను తగిన హంగులతో వ్యవసాయ మారంభించాడు. కాబట్టి, నేను మద్రాసునుండి ఇంటికి చేరుకొన్నప్పుడు కాపురంచేయుచున్న యిల్లు పంపిణీ అనంతరం మా సొంత డబ్బుతో కొనిన 8 ఎకరాలు కలుపుకొని 40 ఎకరాలు భూమి, ఏవో కొన్ని పశువులు వగైరా కన్పడ్డవి.

నా భార్య, బిడ్డలు మద్రాసులో ఉండిపోయారు. అప్పుడు మద్రాసు కార్పొరేషన్ కమిషనర్ గా ఉండిన శ్రీ సి. నరసింహం గారి ఆధ్వర్యాన కార్పొరేషన్ ఉద్యోగస్థులకని ఏర్పరచిన షెనాయ్ నగర్ కాలనీలో, ఆ యుద్యోగస్థులకు ఇవ్వగా మిగిలిన కొన్ని యిండ్లను ఇతరుల కిచ్చుచుండినారు. కార్పొరేషన్ వారే ఇళ్లను కట్టి, వారికి ఖర్చైన అసలు, వడ్డీ కలుపుకొని 20 సంవత్స రాల వాయిదా బందీ పద్ధతిని నెల కింత కట్టాలనే నియమంమీాద ఇచ్చుచుండినారు. స్థల ఖరీదు నిర్ణయించటంలో కార్పొరేషన్ ఉద్యోగులకు గ్రౌండు ( $266\frac{2}{3}$ చ. అ. ) 1కి 500 రూపాయలు ధర నిర్ణయించగా, ఇతరులకు 800 రూపాయలు నిర్ణయించారు. ఇదొక్కటే భేదం. 1952 లో మాటల ప్రస్తావనలో ఒకనాడు నరసింహంగారు షెనాయ్ నగర్‌ను గురించి చెప్పుచు, "ఇతరుల కివ్వవలసినవి మిగిలిపోయిన" వని చెప్పారు. "నా కొకటిప్పించం" డని కోరగా ఒప్పుకొన్నారు. తీరా పునాదులువేసిన తర్వాత, అది చిన్న ప్లాటుగా నాకు కన్పడింది. నేను 'ఎ' ప్లాటును కోరగా ( 6 గ్రౌండ్సు ), నా కిచ్చింది 'బి' ప్లాటు $4\frac{1}{2}$ గ్రౌండులు మాత్రమే. "అయితే వెనుక చాలా ఖాళీస్థల మున్నది. మీరు దానిలో మీ స్వంత ఖర్చుతో ప్రత్యేకించి వంటయిల్లు వగైరా కట్టుకొనుటకు అనుమతిస్తా"మని చెప్పగా, ఒప్పుకొన్నాను. ఆవిధంగా వంటకు, భోజనానికి, సామాగ్రి నిల్వకు 4 గదులతో ఒక పెద్ద బ్లాకు కట్టి, బ్లాకుపైన మేడ వేసి, దానిని ఇంటితో కలిపి

నప్పుడు పెద్దయిల్లుగా తయారైనది. అప్పటికి మైనాయ్ నగర్‌లో పెద్ద యిల్లు అదియే. కార్పొరేషన్ వారు 'బి' తరగతి ఇంటికి ఖర్చుపెట్టవలసినది మాత్రమే ఖర్చుపెట్టారు. మిగతాది పెద్ద మొత్తమైనప్పటికి, నేనే భరించాను. ఇంటిలో 1953 ఆగష్టు చివరలో ప్రవేశించాము. తర్వాతకాలంలో కుటుంబాన్ని యావత్తు తరలించవలసిన సమయం వచ్చినప్పుడు కార్పొరేషన్ వారికి కట్టవలసిన మాసాల వాయిదాలసొమ్ము, తోట మొదలగు వాని పోషణ ఖర్చులతో, అది తెల్ల ఏనుగుగా తోచి దానిని కొంత నష్టంతో, షణ్ముఖ సుందరనాడార్ అనువారికి 1957 అక్టోబరులో అమ్మివేశాను. అమ్మివేయటాని కింకొక కారణం కూడా వుండినది. నాకు ఇల్లు కేటాయించుటకు కొంచెం పూర్వం ఆచార్య రంగాగారికి, (శ్రీ) గౌతు లచ్చన్నకు 'ఐ' టైపు చిన్న ఇళ్లు ఇవ్వబడినవి. రంగాగారి ఇల్లు 'ఐ' టైపుదైనను ఒక మూల కాచుకొన్న యిల్లగుటచేతను, తతిమ్మా మూడు మూలల యిళ్లకువలె రంగాగారి కిచ్చిన ఇంటికికూడా పైన రెండు గదులు, వరండా, స్నానగదిని కట్టించారు. అందువలన కొంత అనుకూలముగానే యుండినది. 1953లో ఆంధ్ర రాష్ట్ర మేర్పడిన తరువాత రంగాగారు నాతో, "నేను మద్రాసు తరుచు రావటంగాని, ఉండటంగాని సంభవించదు కాబట్టి మీ రీ యింటిని తీసివేసుకొనం"డని చెప్పారు. కార్పొరేషన్ వారు "మీ పేర రెండిండ్లుండటానికి అవకాశం లే"దని చెప్పారు. ఆ కారణాన కూడా, ఆ పెద్ద యింటిని (61, మైనాయ్ నగర్) అమ్మివేసి, రంగాగారి పేరనున్న 'ఐ' టైపు చిన్న యింటిని (155, మైనాయ్ నగర్) నా పేర బదిలీ చేయించుకొన్నాను. అందులో అద్దె కుండుచుండిన ఒక సిరియన్ క్రిస్టియన్ థామస్ అనే ఆయన, ఇంటిని ఖాళీచేయ నని తగాదా పెట్టాడు. అత డివ్వవలసిన 600 రూపాయల బాకీని వదులుకొని, అతనిని తొలగించవలసి వచ్చింది. దాని మీద కొంత ఖర్చుపెట్టి కారుషెడ్డు, ప్రహారీ గోడ కట్టించాను. దానికితోడు, ఇప్పుడు దానిలో నివసించుచున్న నా

పెద్ద కుమారుడు రాధాకృష్ణ కొంత ఖర్చుపెట్టి, ఆ యింటిని వృద్ధి పరచి సౌందర్యవంతమైన దానినిగా చేశాడు.

నా పెద్ద కుమార్తె మలినేని వజ్రాంబ ఏకైక సంతానం, కుమారుడు వీరభద్రరావు, అతని తండ్రి రంగదాస్‌కు సంభవించిన అంటువ్యాధిమూలంగా మా దగ్గరకు అంతకుపూర్వం 20 సంవత్సరాల క్రితంవచ్చి మాతోఉండిపోయాడు. అతని వివాహం 1954–వ సంవత్సరం ఏప్రిల్‌లో జరిగింది. భార్య అన్నపూర్ణాదేవితో కలసి వివాహానంతరం కూడా మావద్దనే ఉండుచుండినాడు. అతని ప్రథమ సంతానం ఆడపిల్ల 1956 మే నెలారంభంలో మద్రాసులో మాయింటివద్దనే కల్గింది. మంజూష అని పేరు పెట్టాము. పైన చెప్పినట్లు, నేను 1953 నవంబరుకే పెదసనగల్లుకు వచ్చేశానుగాని నా పిల్లల చదువులనుబట్టి, కుటుంబం మద్రాసులోనే ఉండవలసివచ్చింది. మా పెద్ద కుమారుడు రాధాకృష్ణ మద్రాసు లయోలా కాలేజిలో ఇంటర్‌మీడియట్ మొదటి తరగతిలో జయము పొంది, గిండి ఇంజనీరింగ్ కాలేజిలో చేరాడు. నా రెండోకొడుకు సుధాకర్ ఇంటర్‌మీడియట్ చదువుచుండినాడు. నా రెండో కుమార్తె కమలకుమారి గుడ్ షెపర్డ్ కాన్వెంటులో మెట్రిక్యులేషన్ పరీక్షలో నెగ్గి, ఎతిరాజా కాలేజిలో పి. యు. సి. లో చేరింది. మనుమడు మలినేని వీరభద్రరావు స్కూల్ ఫైనల్ తప్పినా ప్రైవేటు ట్యుటోరియల్ కాలేజిలో అవి, యివి చదువుచుండేవాడు. అందువల్ల, 1957లో నవంబరు ప్రాంతానగాని నా భార్య పెదసనగల్లుకు స్థిరనివాసానికి రాలేదు.

పై జెప్పిన నా వదినె కొడుకు లింగం సీతారామారావు (వీని తండ్రి సత్యనారాయణ, నా పెదతండ్రి కొడుకు బుల్లి సుబ్బయ్య అనే వెంకట సుబ్బయ్యగారి ప్రథమ పుత్రుడు) 1954 ఏప్రిల్ వరకూ మా పెదసనగల్లు యింట్లోనే వుండినాడు. ఏదో మాట పట్టింపువల్ల అతనిని గట్టిగా చివాట్లు పెట్టవలసి వచ్చింది. పైగా నా పద్ధతుల ప్రకారం నడచుకోవటానికి ఆ వంటిల్లు అతనికి ఇరుకనిపించిం దనుకుంటాను. అతని అత్త వారిది ఈ వూరే, మామ సూరపనేని పద్దయ్యగారి రెండో కుమారుడు

సీతారామయ్య, అత్త లింగంనేని పెద లక్ష్మీనారాయణగారి కుమారుడు ముత్యాలుగారి కుమార్తె గోపమ్మ. ఆ దంపతులకు నలుగురూ ఆడపిల్లలేగాని కొడుకులు లేరు. పెద్ద కూతురు సోమమ్మ సీతారామారావు భార్య. రెండు, మూడు బయట వూళ్ల వారినే వివాహ మాడారు. నాలుగో అమ్మాయి కమలామనోహరం సీతారామారావు నాలుగో తమ్ముడు నాగేశ్వరరావు భార్య అయింది. అత్త మామల డాబా యిల్లు కొంతకాలంగా ఖాళీగా వుండి కొంత దెబ్బతిని యున్నందున, 1954 ఏప్రిల్‌కు ముందే దానిని బాగుచేయించారు. మనుమడు వీరభద్రరావు పెండ్లి 1954 ఏప్రిల్‌లో జరిగిందని పైన చెప్పాను. ఆ సందర్భంగా వీరభద్రరావు స్వగ్రామం గుడివాడ తాలూకా చిన పారుపూడి వెళ్లి తిరిగి వస్తూ, సీతారామారావు, భార్య సోమమ్మ ఈ యింటికి రాకుండా సరాసరి ఆ డాబా యింటికి వెళ్లిపోయారు. అప్పటినుండి ఇంటి బాధ్యతేగాక, వ్యవసాయ బాధ్యతకూడా నా మీద పడింది. నిజానికి 1953 డిశంబరు నుండి ధాన్యం నూర్పుడు పనులలో నేను కొంత జోక్యం కల్పించుకొన్నా, మొత్తం మీద ముఖ్య యాజమాన్యం సీతారామారావే వహించాడు. అందువల్ల నా నిజమైన బాధ్యత 1954 మే నుండి ప్రారంభమైంది.

నా చిన్నతనంలో అనగా నాకు 1911 లో వివాహమై ఇక్కడకు అత్తవారింటికి వచ్చినప్పుడు పెదసనగల్లు మిక్కిలి మోటుగా వుండేది. దారులు మురికి కూపాలు. ఇండ్లు పాత కాలపు పెంకుటిళ్లు. వానిలో చాలా భాగం చిన్న చిన్న నివేశనస్థలాల్లో కట్టబడినవి. 400 గజాలలో నాలుగిళ్లుండి, అందులో 20 మంది పైచిల్లర కాపురం చేసేవారు. దొడ్లు చిందరవందరగా వుండేవి. మరుగుదొడ్లుండేవి కావు. స్త్రీలు చాలా యిబ్బంది పడేవారు. గ్రామస్థులు మిక్కిలి హెచ్చు భాగం చదువు సంధ్యలు లేనివారు. మాటల తీరు, నడవడి, పొరుగిండ్లతో సంబంధాలు మోటుగానే యుండేవి. అక్కడక్కడ భార్యాభర్తలు కలియబడి, ఒకరి జుట్టు నొకరు

పట్టుకొని క్రిందబడి దొర్లి బైట గుమ్మం సరిహద్దు రోడ్డుమీదకు వచ్చి పడేవారు. కొంద రాడంగులు రంకెలు వేస్తూ రోకళ్లు చేత బట్టుకొని రణానికి సిద్ధమయ్యేవారు. ఆ పరిస్థితులు, స్థితులు చాలవరకు మారినా, వయస్సుమళ్లిన వారిలో కూడ కొంత మోటుతనం తగ్గినా, యువకులు పట్టణవాసుల నాగరికత చిహ్నాల నవలంబించినా మన స్తత్వం చప్పున మారేదికాదు. కాబట్టి ఉద్దేశాలలో, మాటలలో, చేతలలో ఈ యూరు ఇప్పటికినీ నావంటి గుడివాడ తాలూకా వానికి మోటని పిస్తూనే వున్నది. నే నిక్కడ స్థిరనివాసానికి చేరుకొన్నది 20 సంవత్సరాల క్రితం. నేను వచ్చి యుండిన క్రొత్తలో (1953) ఈ భేదం కొట్టవచ్చిన ట్లుండేది. ఆ కారణాన ఈ యూరిలో నాకు స్నేహితులనే వారు లేకుండా పోయారు. జ్ఞాతులైన నా వదినె కుమాళ్లు, మా అత్త రంగమ్మగారి అక్క కుమారుడు సూరపనేని వీరరాఘవయ్య తాలూకు, నా రెండవ కుమారుని మామ లింగంనేని పున్నయ్యగారి కుటుంబీకులు నాకు దగ్గర వారైనా, ఒకరితో నొకరు అన్యోన్యానురాగంతో సహకరించు పద్ధతి లేదు. కాబట్టి ఈ యూరిలో స్థిరనివాస మేర్పరచుకొన్నా, మా కుండు కున్న భూములు వగైరా ఈగ్రామానికి సంబంధించినవే యైనా, నా కుమారుల స్థిరనివాసం యిదే యైనా, నే నిక్కడ 20 సంవత్స రాలనుండి స్థిరనివాస మేర్పరచుకొని యుండినా ఈ గ్రామానికి నేను, నాకీగ్రామం పరాయివాళ్లంగాను, లేక సగం పరిచయమున్న వాళ్లంగాను ఉండిపోతున్నాం. ఈ గ్రామంలో ఏ సంఘటన జరి గినా, ఏ వింత వినోదాలు జరిగినా, ఏ తగాదాలు వచ్చినా నేను లేనట్లే వ్యవహరింప బడుతుంది. జ్ఞాతులైన నా వదినె కుమా రులుకూడా పెద్దవాడనైన నాతో సంప్రదించక పోవటమేగాక, ఫలానా విషయమనికూడా చెప్పరు. వ్యవసాయ రంగంలో 'ఎవ రికివారే యమునాతీరే' అన్నట్లుంటారు. పశువుల ఆస్పత్రి కట్టించుటలోను, పాలవిక్రయకేంద్రం స్థాపించుటలోను నేను బాధ్యుడనైనా, ఆ ప్రస్తావనేరాదు. ఈ గ్రామానికి పోస్టాఫీసు, విద్యుద్దీపాలు రావటానికి కొంత కారకుడనైనా, ఆ జ్ఞప్తి వాళ్లకు లేనేలేదు. ఈ ఊళ్లో హైస్కూలు, పుస్తకభాండాగారా లున్నవి. ఒకరో యిద్దరో నన్నభిమానించిన హైస్కూలు

ప్రధానోపాధ్యాయులు, హైస్కూలు వార్షికోత్సవాల వంటి సందర్భాలలో నన్నాహ్వానించి కొంత గౌరవం చూపినా, పుస్తక భాండాగారాన్ని నడిపేవారితో నా కెట్టి సంబంధం లేదు. ఈ గ్రామం కొంత ధనవంతమైన గ్రామమే. మేడలు, మిద్దెలు ఇప్పుడు వెలసినవి. చెప్పుకోతగిన భూవసతిగలవా రున్నారు. గ్రామము చిన్నదికాదు. పంచాయతీ బోర్డున్నది. ఎగ్జిక్యూటివ్ ఆఫీసరున్నాడు. వీధి కరెంటు దీపాలు, నీళ్లతొట్టె, ఇండ్లకు నీరును చేర్చే కొళాయిలు, వీధి కొళాయి లున్నవి. గ్రామపరిపాలనా సంబంధంలోనూ నే నొక అనుభవంకలవాడనుగా ఎంచబడను. పెద్దగా చదువుకొని హెచ్చుస్థాయి ఉద్యోగం చేశాడు, ఆయన సలహా సహాయాలను గ్రామాని కుపయోగించుకొందా మనే యోచన గ్రామస్థులకు తట్టనే తట్టదు. ఎన్నడూ, నే నే రచ్చ బండను ఏర్పరచుకొనలేదు. పొలానికి వెళ్లినప్పుడో, గ్రామాంతరం వెళ్లినప్పుడో బైటకు నాదారిని నేను పోవటంతప్ప వీధి ముఖం చూడను. నా యింటి ముందు వరండాలోనో, మేడపైని పుస్తకాలతో నిండియున్న నా ఆఫీసు హాలులోనో, దాని కెదురు ముందు వరండాలోనో కూర్చొనటం, చదవటం, వ్రాసుకొనటం, విశ్రమించటం, వ్యవసాయ సంబంధమైన ఏదో ఒకపని జూచుకొనటంతో కాలం గడుపుచున్నాను.

నేను 1953 నవంబరుకు పెదసనగల్లు చేరుకొన్న తర్వాత 1954 లో కాపురం ఇల్లు ముఖ్యభాగాన్ని కట్టించడమే గాకుండా 1955 నవంబరు, డిశెంబరులలో ధాన్యపు కొట్లు కట్టించాను. పశువుల కాహారం తవుడు మొదలైన వానికి, ఉలవలు మొదలైనవి కావు వేయటానికి సిమెంటు రేకులతో వేరే షెడ్డు వేయించాను. అప్పుడో తర్వాతనో, కోళ్లను పెంచటానికొక షెడ్డు, అదివరకున్న రెండు పెద్ద తాటియాకు చావిళ్లుగాక, పశువులకొరకు 90 అడుగులు బారు గల ఒక పెద్ద పెంకుటి చావిడి, రెల్లుగడ్డితో నేసిన ఎక్కువ వెడల్పు గల ఇంకొక చావిడి వేయించాను. వెనుక నూతి చుట్టూ కడపరాళ్లతో చప్టా వేయించి, చుట్టూ ప్రహరీ గోడ కట్టించాను. 1946 లో వంటయిల్లు కట్టించినప్పుడు కట్టించిన ఇనుప డోరియా రేకులు పైకప్పుగల బారన్ వంటి పెద్ద కొట్టును

వెనుక భాగంలో, ముందు భాగంలో సిమెంటు రేకులతో మూయబడిన పెద్ద కార్ల షెడ్డును కట్టించి యున్నాను. ముందు ఆవరణలో పూల మొక్కలు, పామ్ చెట్లు, వెనుక ఆవరణలో కొన్ని పండ్ల చెట్లు నాటాను. పశువుల చావిళ్ల వెనుక దొడ్లో గడ్డి, జనుము వాములు, పెంటపోగు, దాని కవతలగా వేరుచేయబడిన దొడ్డిలో మామిడి వగైరా చెట్లు పెట్టాను. కొబ్బరిచెట్లను ఇంటి కిరు ప్రక్కల, చావిళ్ల, కోళ్ల దొడ్లలో నాటాను. తాటియాకుల రెండు చావిళ్లలో పాడిగేదెలను, ఆవులను కట్టటానికి మొదట కట్టిన ప్రహారీ కవతల పెంకుటి చావిడి, రెల్లుగడ్డి చావిడున్న దొడ్డిలో ఎద్దులు, గిత్తలు ఉండటానికి ఏర్పాటు చేశాను. ఈ రెండు దొడ్లకు చెరి యొక పెద్ద గేట్లున్నవి. ఒకటి భట్లపెనుమర్రు వెళ్లే కంకర రోడ్డుకు, రెండోది కూచిపూడికి వెళ్లే కంకర రోడ్డుకు దారితీస్తవి. ఈవిధంగా వసతులు గల ఇల్లు, దొడ్లు, తోటల స్థలం ఎ. 1-75 సెంట్లుంటుంది. మరిన్నీ, 1960 లో డాబా పైన ఒక పెద్ద హాలు, దాని నానుకొని పొడుగుపాటి పడకగది, ముందు విశాలమైన పోర్టికో వంటి వరండా, వెనుక భాగంలో నిండు గది వైశాల్యంగల కమోడుతో గూడిన స్నాన గది కట్టించాను. ఈ మేడ భాగాన్నంతా నే నుపయోగించుకొను చున్నాను. హాలులో పుస్తకాల బీరువాలు, నేను వ్రాసుకొనుటకు సొరుగులు గల మేజాబల్ల వున్నవి. కొన్ని చిత్ర పటాలు, దంతం బొమ్మలు, చంద్రకాంతశిలలో చెక్కిన అవలోకితేశ్వర ప్రతిమ వగైరా లున్నవి. ఇంగ్లీషు, తెలుగు పుస్తకాలు 2200 కు మించి యున్నవి. ఫిలిప్సు రేడియో వున్నది. నా పడక గదిలోని డ్రెస్సింగు టేబుల్ మీద శ్రీ షిరిడీ సాయిబాబా పటం, ఉధి వగైరా లున్నవి. అకాల మరణానికి గురైన మా ప్రథమ పుత్రుడు పూర్ణచంద్రరావు జ్ఞాపకార్థం ఈ ఇంటికి "పూర్ణచంద్రరావు స్మృతి ధామం" అని పేరు పెట్టాను.

పిల్లల చదువు విషయం : పెద్దవాడు రాధాకృష్ణవిషయంలో నాకెట్టి శ్రమ కల్గలేదు. అతడు మొదటినుండీ హెచ్చుస్థాయిలోనే



గ్రంథకర్త పెద్ద కుమారుడు రాధాకృష్ణ, రెండవ కుమారుడు సుధాకర్



గ్రంథకర్త పెద్ద కుమార్తె ములినేని పద్మాంబ

గెలుపొందుచు వచ్చాడు. మద్రాసులోని ముత్తయచెట్టియార్ హైస్కూలులో చదివి స్కూలుఫైనల్‌లోను, లయోలా కాలేజిలో చదివి ఇంటర్‌మీడియేట్‌లోను హెచ్చు మార్కులతో మొదటి తరగతిలో జయంపొందాడు. కాని మెకానికల్ ఇంజనీరింగ్ చదువులో మద్రాసు గిండి ఇంజనీరింగ్ కాలేజిలో అంతగా రాణించలేదు. మొదటి సంవత్సరం పరీక్ష కని రాత్రి ప్రొద్దుపోయేవరకు, తిరిగి తెల్లవారుఝామున చదవటంవల్ల కాబోలు, పరీక్షల సమయంలో అతనికి హెచ్చు డిగ్రీల జ్వరం వచ్చింది అది మెదడు సంబంధమైన జ్వరమేమో అని భయ పడ్డాంకూడా. ఆ దెబ్బనుండి అతడు పూర్తిగా విద్యాకాల మంతయు కోలుకోనేలేదు. అతడు గిండి కాలేజిలో ఇంకను విద్య నభ్యసించుచుండగనే ఆస్ట్రేలియాలోని జాతీయ విద్యార్థుల సమాఖ్యవారు కొంతమంది విద్యార్థులను మన దేశమునుండి ఆహ్వానించగా మద్రాసునుండి అతడు ఆస్ట్రేలియాకు వెళ్లి, మెల్ బోర్న్ నగరంలో ఒక పారిశ్రామిక సంస్థలో పనిజేసి కొంత అనుభవం గడించి వచ్చాడు. కొంత ఆలస్యంగానైనా గిండి కాలేజినుండి ఇంజనీరింగు డిగ్రీని గడించి, కొలదికాలానికి మద్రాసు ఎన్నూర్‌లోని అశోక్ లేలెండ్ లిమిటెడ్ కంపెనీలో చేరి ఇంజనీరుగా పనిచేయుచున్నాడు. రెండవవాడు సుధాకర్ చదువులో అంత అభివృద్ధిని చూపలేదు. సహజంగా తెలివి తేటలు కలవాడైనా శ్రద్ధగా, ఓపికతో చదివే గుణం తక్కువ. అందువలన 1, 2 సార్లు తప్పటం జరిగింది. చివరకు గుంటూరులో

బి. యస్‌సి. డిగ్రీ కోర్సుకు చదివాడు. అన్ని అంశాలలో పాసై నాడు గాని, ఫిజిక్స్‌లో మాత్రం తక్కువ మార్కులు వచ్చాయి. దానిని కూడా పూర్తిచేసి బి. యస్‌సి. డిగ్రీని తన పేరుకు చేర్చుకొనగలడో, లేదో చెప్పలేను. మొదటి కుమార్తె వజ్రాంబ చదువు సామాన్యం. ఆమె నాకు 18 సంవత్సరాలు నిండిన కొలది కాలానికే 1916 అక్టోబరు 2-వ తారీఖున జన్మించింది. ఆమె జన్మించకముందే ఆమె మేనమామ, పితామహుడు చనిపోవటం వల్ల పెడసనగల్లులోనే వుండిపోయింది. తరువాత ఆమె కొక కుమారుడు 1933 మార్చి 5-వ తారీఖున కల్గినాడు. తదనంతరం

ఆమె భర్త శ్రీ మలినేని రంగదాసు దీర్ఘవ్యాధిగ్రస్తుడై అకాల మరణం పొందాడు. వజ్రాంబ ఏకైక సంతానంకు, అతని పితామహుని జ్ఞాపకార్థం వీరభద్రరావని పేరు పెట్టారు. అతనికి 1954 మే నెల 7-వ తారీఖున గుడివాడ తాలూకా తమిరిశ గ్రామం మాగంటి వెంకట రామదాసుగారి రెండో కుమార్తె అన్నపూర్ణాదేవి నిచ్చి వివాహం చేశారు. ఆ దంపతులకు ఇద్దరు ఆడపిల్లలు, ఇద్దరు మగపిల్లలు. మొదటి బిడ్డ ఆడపిల్ల మంజూష మద్రాసులో మాయింట్లోనే 1966 మే 1-వ తేదీన పుట్టింది. ఆమె స్కూల్ ఫైనల్ పరీక్షలో నెగ్గి ఇప్పుడు గుడివాడ స్త్రీల కళాశాలలో చదువుకొనుచున్నది. మంజూషకు కొలదికాలంలోనే వివాహం చేయాలని ఆ బిడ్డ పితామహి, తల్లిదండ్రులు ఆశించుచున్నారు. వాళ్ల రెండో సంతానం మగపిల్లడు, 7-5-1959-వ తారీఖున జన్మించాడు. వానికి మల్లికార్జున ప్రభాకర వరప్రసాద్ అని దీర్ఘమైన పేరుపెట్టారు. వా డిప్పుడు బందరు హిందూ కాలేజిలో ఇంటర్ సీనియర్ చదువుచున్నాడు. మూడో బిడ్డ నళిని అను పేరు గలది, 23-2-1961 తారీఖున జన్మించింది. నాల్గో బిడ్డ సురేష్, 13-12-1962 న పుట్టాడు. ఈ యిద్దరూ స్వగ్రామం చినపారుపూడిలో క్రింది క్లాసుల్లో చదువుకొనుచున్నారు. మా రెండవ కూతురు పాప అనే కమలకుమారి 24-9-1939 తారీఖున అనంతపూర్‌లో జన్మించింది. ఆమెకు భరతనాట్యం నేర్పించాలని కూచిపూడివారి నొకరిని నటరాజ రామకృష్ణగారిని గురువులుగా ఏర్పరచాము గాని, ఆమె కావిద్య అబ్బలేదు. అక్కడక్కడ ప్రథమ దశ దాటిన తర్వాత మద్రాసు గుడ్ షెప్పర్డ్ కాన్వెంటులో ప్రవేశపెట్టాము. అక్కడ మెట్రిక్యులేషన్ పరీక్షలో నెగ్గి, యతిరాజు కాలేజిలో పి. యు. సి. కోర్సులో చేరింది. దానిని పూర్తి చేయకమునుపే ఆమెకు వివాహమయింది.

ఆమె గుడ్ షెప్పర్డ్ కాన్వెంటులో చదువుచున్నప్పుడు అక్కడి ముఖ్య అధ్యాపకులలో నొకరైన మదర్ మేరీ జాన్



గ్రంథకర్త పెద్ద కుమార్తె కుమారుడు మలినేని వీరభద్రరావు, కోడలు అన్నపూర్ణాదేవి



గ్రంథకర్త రెండవ పుత్రి కుటుంబం

ఎడమనుండి : 1. సతీష్, 2. అల్లుడు వెలమాటి ఆంజనేయప్రసాద్, 3. శాలిని
4. కూతురు కమలకుమారి, 5. ఆమె ముందు హరీష్

గారితో పరిచయమేర్పడి, ఆ కాన్వెంటు నిర్వహించే ఒకటి, రెండు సంస్థల కొరకు 2, 3 సార్లు విరాళా లిచ్చాను.

పిల్లలు పెద్దవాళ్లై పెళ్లీడుకు వచ్చారు. పెద్దబ్బాయి రాధాకృష్ణకు పిల్లనిస్తామని అక్కడక్కడనుండి సంబంధాలు వస్తూండినవి. "ఆడపిల్లకు పెళ్లిచేయనిదే మగపిల్లల కెట్లాచేస్తాం" అని సమాధానం చెప్పి ఆడపిల్ల కమలకుమారికి వరుని అన్వేషణ ప్రారంభించాం. మూడు నాలుగు చోట్ల ప్రయత్నించాము గాని అనుకూలపడ లేదు. చివరకు పశ్చిమగోదావరిజిల్లా ఏలూరు తాలూకా కొవ్వలి గ్రామస్థులు శ్రీ వెలమాటి శ్రీమన్నారాయణ మూర్తిగారి మూడవ కుమారుడు ఆంజనేయ ప్రసాద్‌తో సంబంధం ఖాయమైనది. మద్రాసు పచ్చయ్యప్ప కళాశాలలో బి. కామ్. డిగ్రీని పొంది, ఇంగ్లండులో చదువుకొని తిరిగివచ్చిన క్రొత్తలో ఆయన అన్న (శ్రీ) వి. జి. యస్. వి. ప్రసాదుగారి మద్రాసు ఎస్ప్లనేడు నేషనల్ ఇంజనీరింగ్ కంపెనీ ఆఫీసులో చూచాను గాని, అతనికి పిల్ల నిద్దామనే ఉద్దేశం కల్గలేదు. తర్వాత, అతనిని పై జెప్పిన ప్రసాదుగారి వసతిగృహములో చూచినప్పుడు ఆ బుద్ధి పుట్టింది. పిమ్మట ఆ ప్రస్తావన రావటం, అతని పినతండ్రి (శ్రీ) సూర్యనారాయణమూర్తిగారి ద్వారా రాయబారాలు జరపటం, పిల్లను పిల్లవాడు చూడటం, యువతీ యువకులొకరి నొకరు అంగీకరించుకోవటం జరిగి, "సంబంధం ఖాయం అంటే ఖాయం" అనుకున్నాము. కాని, పిల్ల కిచ్చే అరణం విషయంలో కొంత భేదాభిప్రాయం పొడసూపింది. నేను నా కూతురుకు అరణం ఇస్తానని, పిల్లవాని తరఫువారు వరకట్నం కావాలని కొంత పట్టుదల కల్గింది. వారి వరకట్నం పట్టుదల, నా భార్య రెండవ మేనమామ చెరుకూరి వెంకటరత్నంగారి అల్లుడు పెదముత్తేవి కాపురస్తుడు (శ్రీ) కాకర్ల కాకుళేశ్వర స్వామిగారి ప్రయత్నంవల్ల కొంత సడలింది. వరకట్నం సగమైనా యివ్వాలని అవతలివారు కోరగా, సంబంధం బెడిసిపోతుందేమో అని (శ్రీ) కాకుళస్వామి, నా వదినె పెద్దకుమారుడు లింగం సూర్యప్రకాశరావు ఒప్పుకొని వచ్చారని తెలిసి, ఆ షరతు మీద సంబంధం రద్దయి పోయినట్లు ఎంచవలసిందిగా (శ్రీ) వి. జి. వి. యస్. ప్రసాదుగారికి టెలిఫోనులో చెప్పి, వారి తండ్రిగారికి టెలిగ్రాంకూడా ఇచ్చాను.

కాని, పెళ్లికొడుకు ఆంజనేయప్రసాద్ (వి. ఎ. ప్రసాద్) కు ఈ పిల్లనే చేసుకోవాలని గట్టి అభిప్రాయం కల్గటంవల్ల కాబోలు, చివరకు వారి పట్టుదలను వదులుకొన్నట్లుగా నన్ను కొవ్వలికి వచ్చి లగ్న నిశ్చయం చేసుకోండని శ్రీ సూర్యనారాయణమూర్తిగారి ద్వారా జాబు వచ్చింది. నేను కొవ్వలికి నిర్దేశించిన రోజు ఉదయం వెళ్లాను. శ్రీసూర్యనారాయణమూర్తిగారికి ముగ్గురు కొడుకులు, ఒక కూతురు. పైజెప్పిన వి. జి. యస్. వి. ప్రసాదుగారు ఆయన పెద్ద కుమారుడు, మద్రాసులో నేషనల్ ఇంజనీరింగు కంపెని పేరుతో భారీ వ్యాపారం చేస్తారు. రెండోవారు డాక్టర్ రామదాస్ గారు. వీరు ఇంగ్లండులో కూడ విద్యాభ్యాసం జేసి వైద్యంలో పెద్ద డిగ్రీలను సంపాదించారు. మూడవవారు వి. ఎ. ప్రసాదు. కుమార్తె శ్రీమతి శారదాదేవిని కొవ్వలి సమీప గ్రామం పోతునూరు గ్రామ మున్సిఫ్ శ్రీ కొమ్మారెడ్డి రామనాథంగారి కిచ్చి వివాహం చేసియుండినారు. "మీ రుదయ భోజనం చెయ్యాలి గదా, కతికినచోట కుదరదంటారు కాబట్టి మనం పోతునూరు వెళ్లి మాట్లాడుకుందాం" అని చెప్పి నన్ను పోతునూరు రామ నాథంగారింటికి తీసుకొని వెళ్లారు. భోజనా లనంతరం, వారి కింకను ఆశ చావనట్లు, నేను బందరులో చదువుకున్న రోజులలో నాకు పరిచితులైన కొవ్వలి గ్రామ మున్సిఫ్ శ్రీ వెలమూటి పద్మ నాభం గారిని పురికొల్పి తిరిగి వరకట్నం విషయం ప్రస్తావనకు తెచ్చారు. "నా సిద్ధాంతం ప్రకారం వరకట్న మిచ్చి అల్లుణ్ణి కొనుక్కోలేను. నేను మా అమ్మాయికి అరణం ఎట్లైనా ఇస్తాను. ఏమి ఇస్తానో యిదివరకే చెప్పి, మీ సమ్మతిని పొందాను. ఇప్పుడు తిరిగి ఆ ప్రస్తావన తేవటం బాగుండలేదు. లగ్ననిశ్చయం చేసుకొందామని వచ్చాను. దానిని మీరు విఘ్నం చేయకూడదు. నాకున్న ఆస్తిని నా యిద్దరు కొడుకులకు, పెండ్లి కాబోయే చిన్నకూతురుకు ముట్టచెబుతాను. పెద్దకూతురు కేనాడో 1931 లో పెండ్లైనది. కాబట్టి నేనుగాని, నా భార్యగాని ఈ పిల్లకు ఎక్కువగానే ముట్టచెబుతాం. మీరు సంపద బాగుగా వున్నవారు, చదువుకొన్నవారు, వివేకవంతులు, పెద్దమనుషులని

పేరు తెచ్చుకొన్నవారు. నావిషయం, మా లింగం కుటుంబం విషయం, నాచదువు సంధ్యల సంగతి, నా ఉద్యోగహోదా విషయం మీకు తెలుసునుకదా. మనం బరాబరీ అనుకొనేకదా వియ్యమందటానికి సిద్ధపడ్డాం. ఈ చిన్న సందేహాలతో కార్యం చెడగొట్టవద్దు. నేను అనిన మాటను నిలుపుకొనే వాడను. మీరు సందేహించవద్దు. కాదు కూడదు తేల్చిచెప్పండని మీరు పట్టుబడితే నేను వచ్చిన దారినే వెళ్లిపోతాను'' అని మందలించాను. అప్పటికి ఇక లాభం లేదని వారికి తోచినట్లు నా కనిపించి, ''ఇక కొవ్వలిలో లగ్నపత్రిక వ్రాసుకొనే ప్రయత్నాలు చేయం'' డని చెప్పాను. వా రంగీకరించి ముందు మనిషిని పంపారు. నేను కొవ్వలి చేరుకొనేటప్పటికి సుగంధద్రవ్యాలతో, దైవజ్ఞులతో సిద్ధముగా నుండినారు. జరుగవలసిన లాంఛనాలు జరిగిన తర్వాత, లగ్నపత్రికలను ఎదురు బొదురు సమర్పించుకొన్న తర్వాత, నన్ను పూలమాలలతో గౌరవించి సవ్యముగా సాగనంపారు. నే నిక్కడ నుండి కూచిపూడి కనక సుబ్రహ్మణ్య సిద్ధాంతిగారి చేత లగ్నసమయం వ్రాయించుకొని తీసుకొని వెళ్లాను. వారక్కడ వడ్లపట్ల రామచంద్రయ్యచౌదరి గారిచేత సవరణ జేయించి లగ్నం నిశ్చయించారు. ఈ నిశ్చయం 2-5-1958-వ తారీఖున జరిగింది. వివాహం 28-5-1958 రాత్రి గం. 1-41 ని. లకు జరుగునట్లుగా నిర్ణయింపబడింది. మా యింటి వద్ద వివాహ ప్రయత్నాలు ఆరంభించి ఘనముగానే ఏర్పాటు చేశాను. కట్నం విషయంలో వారు కొంత అసంతృప్తిని చెందియున్నారు. ఆ అసంతృప్తిని పోగొట్టాలనే ఉద్దేశముతో ఎక్కువ శ్రద్ధ తీసుకొన్నాను. నాపెద్దకుమార్తె వజ్రాంబ వివాహం, 1931-వ సంవత్సరములో ఆమె మాతామహి రంగమ్మగారి పర్యవేక్షణక్రింద నా జోక్యం, కట్నం మొదలైనవాని విషయాల్లో నా సంబంధం, ఖర్చు లేకుండా జరిగిపోయింది. 27 సంవత్సరాల తర్వాత నేను స్వయముగాచేసిన ప్రథమ వివాహం ఇదే కావటం

వల్లకూడా, ఖర్చుకు వెనుదీయక కొంత అట్టహాసముగానే ఏర్పాటు చేశాను. వివాహం రాత్రి గం. 1-41 ని.లకు కాబట్టి భోజనానంతరం, కూచిపూడివారి యక్షగాన నాటకం "ఉషాపరిణయం" ఆడించాను. వచ్చిన వారిలో చాలామంది ఆ నాటకాన్ని చూచి సంతోషించారు. వివాహం జయప్రదంగా జరిగింది. శ్రీ సర్వేపల్లి రాధాకృష్ణ పండితులు వంటి పెద్దల నుండి శుభసందేశాలు వచ్చాయి. వరుని తరఫువారు సంతోషముతో అంపకాలు జరిపించుకొని తరలిపోయారు. ఆ వధూవరుల కిప్పుడు ది 6-4-1960 లో జన్మించిన 13 ఏండ్ల కుమార్తె శాలిని (పాలిని), ది 27-7-1962, ది 18-2-1964 లలో పుట్టిన 11, 9 ఏండ్లు గల సతీష్, హరీష్ అను కుమారులు వర్ధిల్లుచున్నారు. అల్లుడు శ్రీ వి. ఎ. ప్రసాద్ ఏదో వ్యాపారం పెట్టాలని ప్రయత్నించి విఫలుడై కొన్ని సంవత్సరాలు యస్. వి. వో. సి. (ఇప్పుడు ఎస్సో) పెట్రోలియం కంపెనీలో ఆఫీసరు హోదాలో ఉద్యోగం చేసి, దానిని మానుకొని ఇప్పుడు 6, 7 పాదరక్షల షాపులను నిర్వహించుచు, బాటా కంపెనీకి పంపకం (డిస్ట్రిబ్యూషన్), మోటారు వాహనాల మీటర్సు వగైరాకు పంపకందారుగా, వ్యాపారం మద్రాసులో చేయుచున్నాడు. శాలిని ఇప్పుడు కోడైకెనాల్ లో ప్రెజంటేషన్ కాన్వెంటు హైస్కూలులో చదువుకొనుచున్నది. సతీష్, హరీష్ మద్రాసులో డాన్ బాస్కో స్కూలులో చదువుకొనుచున్నారు.

మా పెద్దబ్బాయి రాధాకృష్ణ మెకానికల్ ఇంజనీరింగు డిగ్రీని మద్రాసు గిండి కాలేజి నుండి పొంది, స్వప్రయత్నం మీద అశోక్ లేలెండు లిమిటెడ్ కంపెనీలో ఫోర్ మన్ గా 1958-59 లో చేరాడు. నే నక్కడక్కడ ప్రయత్నించితినిగాని, నే నప్పటికి 5,6 ఏండ్లక్రిందట ఉద్యోగ విరమణ చేసినందువల్ల కాబోలు నా ప్రయత్నమేమీ ఫలించలేదు. 'ఉద్యోగానంతరమందుచూడవలదా ఆ అయ్య సౌభాగ్యముల్ " అన్నది సార్థకమైంది. బ్రాహ్మణేతరులయందు సానుభూతిగల ఒక మొదలియార్ ఆఫీసరుగారి ద్వారా జీత భత్యములు లేకుండా పని నేర్చుకొనుట కన్నట్లు ఆ



శ్రీ వెలమాటి ఆంజనేయప్రసాద్, శ్రీమతి కమలకుమారి పిల్లలు

**ఎడమనుండి :** 1. హరీష్, 2. శాలిని, 3. సతీష్



వెంపాటి శాలినికి చీర బహూకరించిన సందర్భంగా

ఎడమనుండి : 1. తల్లి కమలకుమారి, 2. శాలిని

చివరపంక్తి : 3. మలినేని అన్నపూర్ణాదేవి, 4. ఆమెకు ముందు ఆమె కుమారుడు ప్రభాకర్

5. లింగం భవాని, 6. శాలిని కుర్చీకి వెనుక లింగం శిరీ..

కంపెనీలో చేరాడు. తర్వాత కొద్ది జీతం మీద తర్ఫీదుపొందే ఆఫీసరుగా పనిచేసి, పర్మనెంటు ఆఫీసరుగా ఖాయమై వృద్ధి పొందుచున్నాడు. అతనికి పిల్ల నిస్తామని అక్కడక్కడనుండి సంబంధాలు రావటం మొదలుపెట్టినవి. పై జెప్పిన నా భార్య మేనమామ అల్లుడు శ్రీ కాకర్ల కాకుళస్వామికి తన కూతురు రాజ్యలక్ష్మి కుమార్తెను రాధాకృష్ణకివ్వాలని అభిప్రాయం కల్గింది. రాజ్యలక్ష్మి గుంటూరు జిల్లా, తెనాలి తాలూకా, దోనేపూడి గ్రామం వెనిగళ్ల రామకృష్ణయ్యగారి ఏకైక పుత్రుడు బసవయ్య చౌదరి గారితో వివాహం జరిగి యుండింది. వారి ప్రథమ సంతానం ఒక ఆడపిల్ల. తరువాత సంతానం యిద్దరు మొగపిల్లలు. శాంతకుమారి అను పేరు గల ఆ ఆడపిల్లను 1949 లో నేను నెల్లూరు నుండి ఇన్ కమ్‌టాక్స్ ఆఫీసరుగా మద్రాసునకు బదిలీ అయినప్పుడు మొట్టమొదటిసారి చూచాను. అప్పటి కా పిల్ల ఏ నాలుగేళ్ల వయస్సుగల పిల్లో. మా కమలకుమారి వివాహమైనప్పటికి ఆ పిల్ల ఈడేరి యున్నది కాని చాలా పిన్నవయస్సులోనే ఉండినది. అప్పటికే శ్రీ కాకుళస్వామి, నాకు చెల్లెలి వరసగు ఆయన భార్య సరస్వతమ్మ ఆ పిల్లను రాధాకృష్ణ కివ్వాలని నిశ్చయించుకొన్నట్లున్నది. కొంతవరకు ఆ కారణం వల్ల కాబోలు ఆడపిల్ల పెళ్లి చేయనిదే మగపిల్లవాని పెళ్లి కమ్మ సంప్రదాయాన్నిబట్టి చేయరు కనుక, కమలకుమారి వివాహ సందర్భములో శ్రీ కాకుళస్వామి కొవ్వలి వారికి, నాకు సామరస్యానికి తోడ్పడటం జరిగిందని తలంచాలి. ఒకనాడు తన భార్యను, కూతురును తీసుకుని శ్రీ కాకుళస్వామి మా యింటికి వచ్చాడు. పెళ్లిప్రస్తావన రాగా నే నాశ్చర్యపోయాను. నా భార్యకూడా వింత పడింది. కాని ప్రాత బంధుత్వం. నా వివాహ కాలమందు, తర్వాత కొన్ని సంవత్సరాలు ఈ గ్రామములో మిక్కిలి బలవంతులుగా, పెద్ద భూస్వాములుగా ఉండిన చెరుకూరి వారు కారణాంతరాలవల్ల క్షీణించిపోయారు. వారి ముగ్గు రన్నదమ్ములలో పెద్దవాడగు రామయ్యగారికి వక్ర నేత్రుడైన కొడుకు కలిగాడు. రెండోవారు వెంకటరత్నంగారికి సరస్వతమ్మ ఒక్కతే ఏకైక సంతానం. మూడవవారు లక్ష్మీపతిగారికి సంతానమే లేదు. రామయ్యగారికి, ఆయన భార్య బుల్లెమ్మగారికి మనస్పర్థలు కలిగి, వా రిద్దరు కోర్టుకు

వెళ్లారు. తన కొడుకు సుబ్రహ్మణ్యాం తనకు పుట్టలేదనే వాదానికి రామయ్యగారు సాహసించారు. రామయ్యగారు కూడా వక్ర నేత్రుడే. సరిగా తండ్రి కన్నులవంటి కన్నులే కొడుక్కు వచ్చాయి. కేసు విచారించిన బందరు సబ్ జడ్జిగారు "యిటువంటి కన్నులు గల కొడుకు నీకు తప్ప మరెవరికీ పుడతాడయ్యా" అని, కేసును భార్య, కొడుకుల కనుకూలంగా తీర్పిచ్చారు. లక్ష్మీపతిగారు 1920-21 లోనే చనిపోయారు. రామయ్య, వెంకటరత్నంగారలు ఊరు విడిచి అల్లుడు శ్రీకాకుళస్వామి ఇంటికి పెదముత్తేవి చేరు కొన్నారు. పెదసనగల్లులో అన్నదమ్ములు నివసించుచుండిన యింటిని బుల్లెమ్మ, సుబ్రహ్మణ్యాలకు విడిచిపెట్టి వెళ్లిపోయారు. బుల్లెమ్మ గడుసుదే అయినా కొడుకు అసమర్థుడు, పైగా సగం గ్రుడ్డివాడు కూడాను. మరిన్ని మా కుటుంబాలకు, బుల్లెమ్మ సుబ్రహ్మణ్యాం కుటుంబానికి సంబంధం లేకుండా పోయింది. సరస్వతమ్మకు తన తండ్రి చెరుకూరి వారి కుటుంబమే లేదనిపించింది. ఆమె నాతోను, తన మేనత్త కూతురు నా భార్యతోను, "నా కన్న వారి కుటుంబం నశించిపోయిందికదా, ఈ యూరిలో మేము కానివారమైపోయాముకదా, మీరు మా పిల్లను చేసుకోండి. మా కింకను పెదసనగంటితో సంబంధమున్న దనుకొనునట్లు చేయండి. ప్రాతబంధువులగు మమ్ము త్రోసివేయకండి" అని గట్టిగా అర్థించింది. ఆ అభ్యర్థనను నాభార్య త్రోసివేయలేకపోయింది. మొదట నేను యిష్టపడకపోయినా, పోనీలే ప్రాత సంబంధం, అమ్మాయి చాలా యిదిగా కోరుకొనుచున్నది, పిల్ల తల్లిదండ్రులు శ్రీమంతులు, వారి కుటుంబములో కొన్ని తరాలకు ఈ బిడ్డయే ఆడపిల్లట, ఘనంగా చూచుకొంటారు, పైగా సరస్వతమ్మ తన ఏకైక పుత్రికను కంటె తన మనుమరాలను ఎక్కువగా చూచు కొంటానంటున్నది అనుకొని అర్ధాంగీకారం తెల్పాను. కొలది రోజులకు తిరిగివచ్చి, "బందరులో న్యాయవాదిగా వుంటున్న మా రెండో కొడుకు దివయ్యచౌదరి ఇంటికి ఫలానారోజు ఉదయం రండి, అక్కడ పిల్లను చూచుకొందురు గాని" అని చెప్పారు. మాట తీసి వేయలేక సరే అని ఒప్పుకొన్నాం. ఆరోజుకు అక్కడకు మేము

వెళ్లి పిల్లను చూచాం. పిల్ల చిన్నదిగా, సామాన్యంగా వుండినా, తీరా వెళ్లిచూచి, వారి మర్యాద మన్ననలను పొందినతర్వాత, అయినవారి విషయంలో "మాకీ పిల్లవ" ద్దని చెప్పటానికి ధైర్యం లేకపోయింది. పైగా, పిల్ల నదివరకే చూచియున్నాముకదా. అందగత్తెయని చెప్పుకొనుట కవకాశముండదని తెలిసియుండినది కదా. అందువల్ల నిరుత్సాహపడక, పిల్ల సామాన్య పద్ధతిలో అంగీకరించతగినదే అని నిశ్చయించుకొని, చదువు సామాన్యమైనా, చురుకైన పిల్లకాబట్టి, తాను నేర్చుకున్న కొద్దివిద్యను వృద్ధిచేసుకొనగల దను నమ్మకముతో సంబంధాని కొప్పుకొన్నాము.

1958 మే 28-వ తారీఖున మా కుమార్తె కమలకుమారి వివాహం జరిగిన కొలది మాసాలకు అనగా 1959 జనవరిలో నా భార్యకు మూర్ఛ వంటి జబ్బు ప్రవేశించింది. దానికి మద్రాసులో చికిత్స చేయించాము గాని పూర్తిగా రహిత మవలేదు. పైగా, రక్తం క్షీణించి, చర్మం పేలెత్తి నల్లబడి పోయింది. అందువల్ల 1959 జూలై - ఆగష్టులలో గుంటూరుకు చికిత్సకు వెళ్లాం. ఆ సమయంలో సరస్వతమ్మకు సుస్తీ చేయగా శ్రీ కాకుళస్వామి గుంటూరు క్రొత్త పట్టాభిపురంలో ఇల్లు నద్దెకు తీసుకొని వైద్యం చేయించుకొను చుండినాడు. వారి ఆహ్వానం మీద మే మా యింట్లో చేరి డాక్టరు చల్లపల్లి సాంబశివరావుగారి చేత వైద్యం చేయించుకొన్నాం. ఈవిధముగా వారితో సంబంధం ధృవపడింది. శ్రీకాకుళస్వామి స్వగ్రామం పెదముత్తేవిలో పార్టీ కలహాల వల్ల, ఒకప్పుడు శ్రీకాకుళస్వామికి ప్రాణభయమే గాక, ఆయ నెవరినో చంపినాడను నింద ఆపాదింపబడి ఆయన జైలుకు వెడతాడని కూడా భయం కల్గింది. ఆ సందర్భములో, సందేహించుచు నా దగ్గరకు వచ్చిన సరస్వతమ్మ, ఆమె కూతురు రాజ్యలక్ష్మి, ఆమె రెండో కోడలు చిట్టెమ్మలకు నమ్మకం చెప్పి, "బావ (శ్రీకాకుళస్వామి) ను జైలులో పెట్టినా, ఏ శిక్ష విధించినా, బావ గతి ఎట్లు జరగవలసి యుండినా, మే మిచ్చిన మాట ప్రకారం మీ పిల్లను మేము చేసుకొనేది తథ్యం" అని

ధైర్యం చెప్పి పంపాను. శ్రీకాకుళస్వామి మీద ఏ నేరమూ మోపబడలేదు కాని, ఆపత్కాల మనుకొన్న కాలములో నే నిచ్చిన వాగ్దానం స్థిరమై 1960 ఏప్రిల్ 28-వ తారీఖున రాధాకృష్ణకు, శాంతకుమారికి వైభవోపేతంగా దోనేపూడిలో వివాహం జరిగింది. ఆ దంపతుల కిద్దరకు ఇప్పటికి 8, 9 సంవత్సరముల వయస్సుగల శిరీష అనే పేరుగల ఆడపిల్ల మాత్రమే కల్గియున్నది. వా రిద్దరు మిక్కిలి అన్యోన్యానురాగముతో సుఖజీవనం చేయుచు, నా మద్రాసు యిల్లు 155, షెనాయ్ నగర్ (రంగవిలాస్) లో ఉంటున్నారు. శాంతకుమారికి శిక్షణ పొందిన చదువు తక్కువైనా, పెండ్లినాటి కింగ్లీషు ఇంచుమించుగా రానిదైనా ఇప్పు డింగ్లీషు కొంతవర కైనను నేర్చుకొన్నది. అరవం ధారాళంగా మాట్లాడగల్గుచున్నది. చిన్నతనంలో నేర్చుకొన్న హిందీని అభివృద్ధి పరచుకొన్నట్లుగా నున్నది. దక్షతతో ఇంటి పనులను నెరవేర్చుకొను చున్నది. అంతకంటె దాంపత్య జీవితమునకు కావలసిన దే ముండును!

ఇక మా రెండవ కుమారుడు సుధాకర్ విషయం మిగిలియున్నది. వాడు చిత్తూరు సెంటరులో స్కూలు ఫైనల్ పాసై మూడు సంవత్సరాల డిగ్రీ కోర్సు చదువుటకు మొదటి సంవత్సరం తిరుపతి కళాశాలలో చేరాడు. అక్కడి నుండి గుంటూరుకు మారి అక్కడి హిందూకాలేజిలో బి. యస్‌సి. డిగ్రీ కోర్సు చదవట మారంభించాడు. డిగ్రీ కోర్సు పూర్తి కాకముందే 1961 ఏప్రిల్ 28-వ తారీఖున వాని వివాహమైనది. ఈ పెదసనగల్లు గ్రామంలో పూర్వమునుండి సంపన్న గృహస్థులైన లింగంనేని కుటుంబానికి చెందిన శ్రీ లింగంనేని లక్ష్మీనారాయణగారి కుమారుడు పున్నయ్యగారి అయిదవ కుమార్తెతో సంబంధం ఖాయమైంది. నా స్వగ్రామం గుడివాడ తాలూకా బొమ్ములూరు. నే నింగ్లండులో ఆరున్నర సంవత్సరాలు విద్యాభ్యాసం పేరున వుండిపోయి, తలకు మించిన ఖర్చు చేసి పిత్రార్జితం పోగొట్టుకొన్నవాడనై, భార్యకు తల్లిదండ్రుల నుండి సంక్రమించిన ఆస్తిగల ఈ యూరు చేరాను. నా వదిన



లింగం రాధాకృష్ణ, భార్య శాంతకుమారి

కుమారులు కూడా మా లింగం కుటుంబంలోని వారైనా, మేమీ యూరిలో గ్రేల్లాడిపిల్లను నేననుకోనలేదు. పైగా నా వదినె కుమారులతో అన్యోన్య సహకారం చాలా తక్కువ. అందువల్ల ఈ యూరివారిలో, అందులో కొంతఆస్తి, బలగముష్న వారితో వియ్యమొందితే నాకు లేకపోయినా నాకుమారునికి, అతని సంతానానికి కొంతస్థాయి చిక్కుతుందని నాకు తోచింది. లింగం నేని పున్నయ్యగారి కిద్దరు కుమారులు, అయిదుగురు కుమార్తెలు. పున్నయ్యగారి భార్య చంద్రమ్మగారు మిక్కిలి స్ఫురద్రూపియే గాక తెలివితేటలు, వ్యక్తిత్వంకల గృహిణి. పున్నయ్యగారు కూడా మిక్కిలి సమర్థులు. నిజానికి శుభాశుభ కార్యాలలో ఆయన కల్పించుకొని తన చేయి వేసి సహాయంచేసే పద్ధతి గలవారు. చాలాకాలం మా బొమ్ములూరు లింగం కుటుంబంలోని వివాహా లకు మా మూడో పెదతండ్రి లింగం ఆదినారాయణగారి పెద్ద కుమారుడు వీరభద్రయ్యగారు పెండ్లికొడుకు, లేక పెండ్లి కూతురు తరఫున పెళ్లి సమయమందు పెత్తనం చేస్తూండేవారు. ఏదో కారణం వలన నా పెద్ద కుమారుని వివాహానికి వారు రావటం తటస్థించలేదు. ఆ సందర్భంలో దోనేపూడికి వెళ్లిన పెళ్లి పెద్దలలో లింగంనేని పున్నయ్యగారొకరు. వారి కార్య నిర్వ హణా సమర్థత, మాయందు వారికిగల అభిమానంవలన మా పెండ్లి బట్టల పెట్టెను, తత్సంబంధమైన భాండాగారాన్ని, డబ్బును, బంగార వస్తువులు వగైరాను వారి చేతికిచ్చి "మీరీ కార్యభారాన్ని నిర్వ హించం" డని కోరి యుండినాను. వారియం దేర్పడిన గౌరవం వారితో సంబంధం చేయాలనే ఉద్దేశానికి దారితీసింది. ఆపిల్ల స్ఫుర ద్రూపం, అందం ఆమెను కోడలునుగా చేసుకోనాలనే ఉద్దేశాన్ని బలపరిచింది. వారితో రాయబారాలు సాగించాను. సంపన్నులైన పున్నయ్యగారు స్వభావసిద్ధంగా మిక్కిలి జాగ్రత్తగలవారు. పైగా ఈ పిల్ల అయిదవ పిల్ల. మొదటి నలుగురు కూతుళ్లలో ఇద్దరిని తన చిన ఓగిరాల మేనల్లుళ్ళ కిచ్చి, తక్కువ అరణంతో పిల్లలను కడతేర్చాడు. మరి ద్దరిలో ఒకరిని మేడూరి వారికి, నాల్గవ పిల్లను ఊళ్లోనే యిచ్చి ఈ యిద్దరు పిల్లలకు కూడా తక్కువ అరణంతోనే సరిపుచ్చాడు. ఈ అయిదవ పిల్లకు కూడా సామాన్య

అరణంతో సరిపుచ్చాలని తలంచాడు. నేను నా రెండో కుమార్తెకు పెద్దగా ముట్టజెప్పాను. అంతకంటె పెద్దగా, నా పెద్ద కోడలు అరణం తెచ్చింది. పైగా మేము బాగా ఉన్న వారమనే అభిప్రాయము ముండినది. మరిన్ని నే నింగ్లండులో చదువుకొని పెద్ద ఉద్యోగము చేసి యుండినాను. నా పద్ధతులు కొంచెం హెచ్చు స్థాయితో వుంటవని, వారికో పిల్లకు ముట్ట చెప్పే దానిలో సరితూగలేే మని సందేహించి వారు మా సంబంధానికి ముందుకు రాలేకపోయారు. నేనే చొరవ తీసుకొని ఒకటి రెండుసార్లు కబురంపించి, "మీకు ఎట్టి సందేహా మక్కర లేదు. మా కితరత్రా వచ్చే అరణ మంత గొప్పగా మీ అమ్మాయి తీసుకొని రావలసిన అవసరం లేదు. మీరు పెద్ద కుటుంబంలోని వారని, మర్యాదస్థులని మీతో సంబంధం చేయాలని గట్టి కోరికగా ఉన్న" దని కొంచెం ఒత్తిడి చేశాను. మా సంబంధం చేసుకొనటమే బాగుంటుందని పున్నయ్యగారి తోడల్లుడు, కురుమద్దాలి నివాసి శ్రీ కొసరాజు శ్రీ రంగనాయకులు గారు ఉద్దేశపడి తన మడ్డకుని ప్రోత్సహించారు. చివరకు శ్రీ రంగనాయకులుగారి ద్వారా సంబంధం ఖాయమైనది. 1961 ఏప్రిల్ 28-వ తారీఖున వారి అయిదవ కుమార్తె సౌభాగ్యవతి భవానితో సుధాకర్‌నకు వివాహం జరిగింది. ఆ దంపతులకు మూడవ సంతానం ఒక ఆడపిల్ల పురిటిలోనే చనిపోగా, మొదటి ఒకటి, రెండు బిడ్డలు ఆడపిల్లలు; నాలుగు, అయిదు సంతానం మగపిల్లలు, గీత, శోభ, విజయ, అజేయ అను పేర్లతో ప్రవర్ధమానమగుచున్నారు. మొదటి పిల్ల గీత 1-8-1962 తేదీన జన్మించింది. ఆమెకు 11 సంవత్సరాలు గడచిన ఆగస్టు 1-వ తారీఖుతో నిండినవి. రెండో బిడ్డ ది 8-1-1964 తారీఖున పుట్టింది గనుక ఆమెకు 1974 జనవరి 8-వ తారీఖుకు 10 ఏళ్లు నిండినవి. ఇద్దరు మగపిల్లలలో పెద్దవాడు విజయ 1965 ఆగస్టు 28-వ తారీఖున జన్మించాడు. వానికి 8 ఏండ్లు నిండి 9-వ ఏడు జరుగుచున్నది. రెండోవాడు అజేయ 1968 ఫిబ్రవరి 23 తారీఖున జన్మించాడు. వానికి వచ్చే 1974 ఫిబ్రవరి 23-వ తారీఖుకు



లింగం సుధాకర్, భార్య భవాని

6 సంవత్సరాలు పూర్తి అవుతవి. భార్యాభర్తలు మిక్కిలి అన్యోన్యానురాగముతో జీవించుచున్నారు. బుద్ధిమంతురాలగు కోడలు వృద్ధదశలోనున్న నన్ను ఆదరాభిమానాలతో చూడటమే గాక, యింటికి వచ్చే బంధువులను, స్నేహితులను ఆదరిస్తూ మృష్టాన్నంతో తృప్తి పరుస్తూ, పేరు తెచ్చుకొనుచున్నది.

దురదృష్టవశాత్తు నాభార్యకు 1959 సంక్రాంతి భోగిరాత్రి మూర్ఛవంటి జబ్బు ప్రారంభించింది. దాని నివారణకొరకు ఆమెను మద్రాసుకు తీసుకొని వెళ్లి న్యూరో సర్జన్ (శ్రీ) బి. రామమూర్తిగారిచేత 1959 మార్చి ఆఖరున చికిత్స చేయించాము. ఆయన ఆమె తలలో ఏదో (ట్యూమర్) పుండు గడ్డ వున్నదని అభిప్రాయపడి ఆమె తల పెకను కోసి, ఏ గడ్డా లేదని తేల్చు కొన్నాడు. కాని, ఇతర హెచ్చు ఖర్చులటుంచి. తలకోసినందుకు 3,000 రూపాయలు పుచ్చుకొన్నాడు. ఆపరేషన్ సఫలం కాలేదు కాబట్టి ఆ హెచ్చు రుసుమును తగ్గిస్తాడేమో అని భ్రమించానుగాని, ధనాపేక్షగల ఆ డాక్టరు ఒప్పుకొన్న 3 వేలు యివ్వాలని తీసుకొన్నాడు. తలలో పుండుగాని, గడ్డగాని లేదని, నా తమ్ముని కొడుకు డాక్టరు సూర్యనారాయణ ఆపరేషన్ సమయంలో దగ్గర లేకపోతే డాక్టరు రామమూర్తిగారి నుండి తెలిసేది కాదనుకొందును. డాక్టరు రామమూర్తిగారికి సంబంధించిన రంగా ఆస్పత్రిలో రోగి తేరుకొనుటకు కొంత హెచ్చుగానే ఖర్చైంది. అంతటితో ఆమె అనారోగ్యం పోలేదు. తిరిగి (1959) జూలై నెలలో గుంటూరుకు వెళ్లి అక్కడ అక్టోబరు వరకు 3 మాసాలుండి డాక్టరు చల్లపల్లి సాంబశివరావుగారిద్వారా చికిత్స చేయించుకోవలసి వచ్చింది. అక్కడ ఆమె కొంత కోలు కొన్నా ఆమె క్రమేణా క్షీణించి ఇతర జబ్బులకు లోనైంది. తర్వాత ఆమె ఉలవకాయ చెడిపోయి, నడుము పూర్తిగా నేల కొరిగిపోయి కాలం గడుపుచు కృశించి, కృశించి బొమికెల కట్టయై చివరకు 23-1-1972 తెల్లవారుఝామున ప్రశాంతంగా నిద్రలో పరలోకప్రాప్తి చెందింది.

మా అత్తమామల ఏకైకపుత్రుడు శ్రీ పున్నయ్య సంతాన విహీనంగా తండ్రికంటె ముందు చనిపోయాడని తెలిపియున్నాను. మా మామగారు మా అత్తగారిపేర తన యావదాస్తిని వీలునామాద్వారా సంక్రమింపజేసియున్నాడు. కాబట్టి, పున్నయ్యగారి భార్యకు మనోవర్తి హక్కుమాత్రమే యుండింది. కాని దురాశచేత, తన భర్త జ్ఞాతివర్గంలోని వాడుగాక, ఇంటిపేరుమాత్రమే గల కుటుంబంలోని ఒక యువకుని జ్ఞాతివర్గంలోని ఒక అమాయకునికి ధనాశ చూపించి, ఆయన అనుమతి పొంది దత్తత చేసుకొని, మా మీద ఆస్తి కంతటికి దావా వేసింది. ఆ దావాను గుడివాడ సబ్ జడ్జి, హైదరాబాదు హైకోర్టు కొట్టివేసింది. సుప్రీమ్ కోర్టుకు అప్పీలుచేయుటకు హైకోర్టు అనుమతిని కోరగా, హైకోర్టు వారు నిరాకరించారని 14-11-1959-వ తారీఖున అప్పుడు మా న్యాయవాదిగా నుండిన శ్రీ ఆవుల సాంబశివరావుగారు వ్రాశారు. అంతటితో 15 సంవత్సరాలు మమ్ము బాధించిన ఆ దుస్సంఘటన సమసిపోయింది.

నే నుద్యోగంలో చేరిన క్రొత్తలో అనగా 1929 లో గోవిందన్ నాయర్ అనే వంటవానిని పెట్టుకొన్నాను. తరువాత కొంతకాలానికి రామన్ నాయర్ అనే వంటవాడు కుదిరాడు. వాడు మావద్ద 23 సంవత్సరాలుండినాడు. గోవిందన్ నాయరు, రామన్ నాయర్ మధ్య ఇంకెవరైనా కొద్దికాలం ఉండినారేమో గుర్తు లేదు. నా ఉద్యోగ విరమణానంతరం 4 సంవత్సరాల వరకు నా కుటుంబం మద్రాసులోనే ఉన్నట్లు పైన చెప్పాను. అందులో కొంతకాలం వరకు రామన్ నాయర్ మా పనిలోనే వుండినాడు. అతడు చనిపోయిన తర్వాత నారాయణన్ నాయర్ అనే వానిని పెట్టుకొన్నాం. వా డిప్పటికిని మద్రాసులో రాధాకృష్ణవద్ద వుంటున్నాడు. నేను మద్రాసునుండి 1958 నవంబరులో పెదసనగల్లుకు వచ్చివేసినప్పుడు ఒక వంటవానిని తీసుకొని వచ్చాను. వాడు కొలదికాలమే వుండి వెళ్లిపోయాడు. తరువాత ఇం కొకడు, ఆ తరువాత మరొకరు ఈవిధంగా 10, 12 మంది వంటవాళ్లు మారారు. వంటవాడు దొరకటం కష్టమైపోయింది.

నే నుద్యోగంలో ప్రవేశించినప్పుడు "మే ముంటాం, మేముంటాం" అని యోగ్యతాపత్రాలు తీసుకొని వచ్చి కాచుకొని ఉండేవారు. ఆవిధముగనే కారు డ్రైవర్లుకూడా. ఇప్పుడు కారుడ్రైవర్లు కరువైనట్లుగా, వంటవాళ్లు అంతకంటె కరువై పోయారు. నా మద్రాసు ఉద్యోగంలో నా జవానులుగా ఉండిన ఒక రిద్దరి సహాయం కోరగా, వాళ్లెవరినో తీసుకొని రావటం, వాళ్లు మద్రాసు ఇంటికి వచ్చి ఆ పూట భోంచేసి, "ఇదుగో వస్తాం. పెట్టె, బేడ తెచ్చుకుంటా"మని చెప్పటం, పదో, ఇరవై యో రూపాయలు పట్టుకువెళ్లటం, తరువాత పత్తాలేకుండా పోవటం జరిగింది. ఒక వంటవాని నిరాధాకృష్ణవద్ద పనిచేయుచున్న నారాయణ్ నాయర్ వెంట సెంట్రల్ స్టేషనుకు పంపి, టిక్కెట్టు కొని రైలులో కూర్చోపెట్టినా అతడు పెడననగల్లుకు చేరనేలేదు. ఈవిధముగా నాలుగు డబ్బులు ఖర్చుపెట్టించి దగాచేశారు. చివరకు, నే నొకణ్ణి ఎక్కువ జీతంమీద వెంటబెట్టుకొని తీసుకొని వచ్చాను. వాడు కొంతకాలమే పనిచేసి "ఆ పని చేయను, ఈ పనిచేయను" అని వంకబెట్టి అక్కడిక్కడ నిద్రపోవటం, సకాలంలో లేచి పనులు చేయకపోవటం మొదలు పెట్టాడు. ఇక లాభంలేదని పంపించి వేశాం. ఇక ఇంటి సంసారాన్ని గడుపుచున్న నా రెండో కోడలు భవానీయే ఒకటిన్నర సంవత్సరములనుండి భోజన మమర్చుచున్నది. పై పనులు, చిల్లరమల్లర పనులు చేయటానికి, అవీ ఇవీ అందించ టానికి నిండుజీతాన్ని తీసుకొనే ఒక నౌకరు, కడసారి పిల్లవానిని ఎత్తుకొని ఆడించటానికని వచ్చిన పనిపిల్ల సహాయం చేస్తున్నారు, ఉపకరిస్తున్నారు. ఇక మళయాళీ వంటవాడు వచ్చే ప్రస్తావనే లేదు. గుడివాడ, బందరు వంటి పట్టణాల నుండి ఎవరినైనా తెచ్చుకొందామంటే అసలు దొరకకపోవట మటుంచి, వారు పనిని సరిగా చేయరు. దుబారాచేస్తారు, దొంగిలిస్తారు, అవిధేయతగా వుంటారు. ఎవరికో అదృష్టవంతులకు దప్ప పల్లెటూళ్లలో వంటవాళ్లు పనిచేయటం ఇంచుమించుగా పూజ్యం. నిజానికి ఈ వూరిలో వంటవానిని మే మొక్కళ్లమే భరించేవాళ్లం. ఇప్పుడా చిరాకు వదలిపోయింది.

నే నిక్కడకు వచ్చిన మొట్టమొదటి రోజుల్లో మళయాళీ వంటవా డొకడు కొన్ని పిచ్చిపనులు చేశాడు. ఆ రోజులలో నా కుటుంబం మద్రాసులో ఉంటుండేదిక దా. నే నొక్కడనే ఇక్కడుండేవాడను. అప్పుడప్పుడు మద్రాసుకు వెళ్లి వారాల తరబడి ఉండేవాడను. అప్పు డింటి పెత్తనం వాడిదే అయింది. ఆ సందు చూచుకొని ఈ గ్రామంలోని కొంతమంది పిల్లలను ప్రోగుచేసి, వాళ్లకు పిండివంటలు తయారుచేసిపెట్టి జల్సాచేసుకొనే వాడట. వాని అలుసు చూచుకొని నే నెక్కడనుండో తెచ్చి దొడ్లోపెట్టిన పూలమొక్కలు వగైరాను త్రవ్వుకొనిపోయో, కొమ్మలను విరగదీసుకొనిపోయో కొందరు తమ ఇండ్లలో పాతుకొనేవా రట. పైగా వాడు ఆ యింటికీ, ఈ యింటికీ పోయి భోజన పదార్థాలో, ఉపాహార పదార్థాలో చేసిపెట్టేవాడట. ఇవన్నీగాక ఇంట్లో పనిచేయుచున్న కుర్రవానితో కలసి నే నిక్కడుండినప్పుడే, నేను వ్రాసుకొనే మేజాబల్లవద్ద వుంచుకొన్న నా చేతిపెట్టె నుండి డబ్బు సంగ్రహించాడు. ఇంట్లో పనిచేసే కుర్రవాడు నేను స్నానానికి వెళ్లినప్పుడో, భోజనానికి వెళ్లినప్పుడో పైగదులు శుభ్రపరచే నెపంతో వచ్చి నా మేజాబల్ల సొరుగులోనున్న తాళం తీసుకొని కొన్నివందలైనా అప్పుడప్పుడు సంగ్రహించి వాడు, వంటవాడు కలసి పంచుకొని యుండాలి. నే నప్పుడు లెక్కలు సరిగా పెట్టకపోవటం వల్ల ఈ దొంగతనాలు తెలియలేదు. తర్వాత తెలిసింది. ఈ యూరి కంసాలితో 6, 7 వందల రూపాయల ఖర్చుతో మెడలో వేసుకొనే బంగారు గొలుసును వంటవాడు చేయించుకొన్నాడట. తన కేవో కొబ్బరితోటలు వగైరా తన స్వగ్రామంలో ఉన్నట్లు, వాని కవులు తాలూకు డబ్బు తెచ్చుకొన్నట్లు చెప్పాడట. ఈ విషయం కొంత కాలానికి గాని నాకు తెలియలేదు. నే నడిగితే ఇదే సమాధానం చెప్పాడు. నే నే గుణంలో వున్నానో గాని దానిని గురించి తర్జన భర్జన చేయలేదు. ఇంటి కుర్రవాడు చేతిపెట్టె నుండి సంగ్రహించినట్లు నిర్ధారణలేదు కాబట్టి నే నేమీ చేయలేకపోయాను. కాని ఆ దుష్టబుద్ధిగల వంటవానిని



గ్రంథకర్త పిల్లలతో

**ఎడమనుండి :** 1. గీత, 2. గ్రంథకర్త, 3. గ్రంథకర్త ముందు అజేయ, 4. విజయ, 5. శోభ

త్వరలోనే పంపించివేశాను. పై జెప్పినట్లు ఇప్పుడు నా రెండో కోడలే వంటవాని సాయంలేకుండా గృహజీవితాన్ని గడుపుకొని వచ్చుచున్నది.

పైన, ఇంకొక సందర్భంలో పేర్కొన్నాను. ఈ గ్రామానికి పశువుల ఆస్పత్రి, పాల అమ్మక కేంద్రం నా వల్ల వచ్చాయి. పోస్టాఫీసు రావటానికి, విద్యుద్దీపాలు రావటానికి నా సహాయం హెచ్చే. గ్రామస్థులకు జ్ఞాపకమున్నా, లేకపోయినా నే నీయూరు చేరినందున కీమాత్రం ఉపకారమైనా చేయగల్గానని కొంత తృప్తి నాకు కల్గుచున్నది.

౨

# వ్యవసాయం

---

వ్యవసాయానికి ఎడ్లు ముఖ్యం కదా. ఈ రోజుల్లో కొలది ధనిక రైతులు అక్కడక్కడ ట్రాక్టర్లు కొంటున్నా మొత్తం మీద వ్యవసాయం అంతా ఎడ్ల ఆధారమే. సొంత వ్యవసాయం మొదలు పెట్టాలని, నే నిక్కడకు ఇంకా రెండు మూడు సంవత్సరాలకు వస్తా ననగా వదినె కుమారుడు సీతారామారావు కౌలు మాన్పించి ఒక జత దున్నపోతులను, ఒకటో రెండో జతల ఎడ్లను నాక్రింద కొన్నాడు. నే నిక్కడకు వచ్చునప్పటికి దున్నపోతులలో ఒకటి చనిపోయింది, రెండవ దానిని అమ్మివేశారు. ఉన్న ఎడ్లు అంత మంచివిగా కన్పడ లేదు. అవి చాలవనుకొన్నాను. కొన్ని పాడి ఆవులను కొందామనుకొన్నాను. ఒకనా డుదయం ఒక మోటారు కారు నద్దెకుతీసుకొని, నా వదినె పెద్ద కుమారుడు లింగం సూర్యప్రకాశరావును, ఇంకొకరు సూరిబాబు అనే దేవినేని సూర్యప్రకాశరావును తీసుకొని మొవ్వ వెళ్లాను. అక్కడ విచారించి తగినవి దొరకనందున ఆ యూరి పెద్దమనిషి, మాయూరు బంధుత్వం కల మండవ కనకయ్యగారిని కూడా వెంటబెట్టుకొని చల్లపల్లి రోడ్డులో వున్న కొడాలి, చిట్టూర్పు, వక్కలగడ్డ గ్రామాలలో చూచుకొని, చల్లపల్లిదాటి రావివారిపాలెంలో ఒక ఆవును, దాని కోడెదూడను, ఇంకో కోడెదూడను కొని చల్లపల్లి తిరిగి వచ్చి నా వదినె ప్రథమ కుమార్తె సౌభాగ్యవతి కొత్రపాటి



వ్యవసాయపు ఎద్దులు

జగదాంబ వద్ద ఒక ఆవును, ఒక జత ఎడ్లను కొన్నాను. ఈ మధ్య గ్రామాలలో ఏ గిత్తగాని, ఎద్దుగాని కుదర లేదు. ఈ ఎడ్ల బేరాలలో తెలుసుకొన్న విషయం నా కిప్పటికిని వింత కల్గిస్తున్నది. ఒక దొడ్డిలోనికి పోయి, ఒక గిత్తను చూచి బేరం మొదలు పెట్టాం. ఒక గంట, గంటన్నరకుగాని గిత్త ఖరీదు బేరం కుదర లేదు. చివరకు 700 రూపాయలకు పరిష్కారం చేసుకొన్నాం. ఇక నేను బయలుదేరి పోవా లనుకొనుచుండగా మా వాళ్లు గిత్త సుడులు చూడా లన్నారు. అక్కడ డిక్కడ చూచి, "ఛీ. తప్పుడు సుడున్నది పనికి రా"దన్నారు. నాకు చిరాకు కల్గింది. నే నప్పు డన్నాను, చూడగానే పశువు నచ్చితేగాని బేరం మొదలుపెట్ట గూడదు. ధర బేరం మొదలుపెట్టే ముందు, సుడులు సరిగా వున్నవో లేవో చూచి, అనుకూలమైన సుడు లుంటేనే బేరం ఆరంభించాలి. అంతేగాని గంటలకొలది కాలాన్ని వృథాచేసి, ధర స్థిరమైన తర్వాత, సుడి బాగా లేదని విడిచి పెట్టటం శుద్ధ అవివేకమని. ఇప్పటికిని, ఈ విధంగానే కొనదలచినవారు కాలాన్ని వృథాచేస్తూ శ్రమ పడుచున్నారు. ఇంకొక విశేషం, కొనటానికి వచ్చినవారు ఇంత కిస్తారా, అని ముందు అడగరట. పశువుల యజమానిని ముందు ధర చెప్పం డంటారు. ఒకప్పుడు అమ్మదలచుకొన్న పశువును ఎంత కివ్వ వచ్చునో యజమానికి తోచదు. ఎక్కువ చెప్పితే అమ్ముడవదని, తక్కువ చెబితే నష్టం వస్తుందని క్రింద, మీద పడతాడు. తరువాతి కాలంలో నా పశువులను నేను అమ్మవలసి వచ్చినప్పుడు ఈ సందిగ్ధావస్థలో పడుచుండేవాడను. నాకు అనుభవం తక్కువ కాబట్టి, ఏ పశు వెంత ఖరీదు చేస్తుందో నా కిప్పటికిని సరిగా తెలియదు. ఇది ముఖ్యముగా ఆడ పశువుల విషయములోను, దూడల విషయములోను. నేను చెప్పిన ధరకంటె మిక్కిలి తక్కువగా అడిగిన కొనుగోలువారి మీద నేను విసుక్కొనటం కలదు. ఇంత అన్యాయంగా అడిగినా రేమని కోపపడటం కలదు. నేను తక్కువ ధర చెప్పి మోసపోతామేమోనసే భయంచేత అమ్మదలచుకొన్న పశువులకు మిక్కిలి హెచ్చుధర చెప్పితే ఆ ధర

కంటె మిక్కిలి తక్కువ ధరను పెట్టదలచుకొన్న వారు జవాబు చెప్పకుండా వెళ్లిపోవటం కలదు. ఈ కారణం వల్ల ధర చెప్పటంలో నేను మిక్కిలి అనిశ్చితస్థితిలో పడుతుంటాను. కాబట్టి నేను కొనేటప్పుడు అమ్మేవారు ముందు ధర చెప్పటం సమంజసమా, నేను అమ్మేటప్పుడు నేనే ముందు ధర చెప్పటం సమంజసమా అని ప్రశ్నించుకొన్నప్పుడు, మొత్తం మీద కొనే వారే ముందు ధర చెప్పటం సమంజసమని తోస్తున్నది.

ఇక్కడున్న మా భూములు నా భార్యవి. భూము లన్నియు మాగాణి భూములు. నాకు మెట్టభూముల మీద ప్రీతిఎక్కువ. మా సరిహద్దు గ్రామాలగు కూచిపూడి, పెదపూడి ఆయకట్టులలో కొన్ని సారవంతమైన మెట్టభూము లున్నవి. నే నిక్కడకు వచ్చిన క్రొత్తలో కొంత మెట్టభూమి అమ్మకానికి రాగా దానిని నా పేరుతో కొన్నాను. 1953 నాటికి మాకు 40 ఎకరాల మాగాణిభూమి వున్నదని పైన చెప్పాను. తర్వాత 1955 లో కొంత మాగాణిభూమిని కొన్నాం. అప్పుడు కొంత మెట్టభూమిని కూడా కొన్నాం. పిమ్మట ఒకటి రెండు చిన్న ప్లాట్లు మాగాణి కొన్నాం. 1955 సంవత్సరంలో నా భార్య తనిద్దరి కొడుకుల పేర తనకున్న భూమి నంతయు దఖలుప్రాసి యిచ్చింది. ఎందుకైనా మంచిదని అప్పుడే ఆమె పేర 4⅓ ఎకరముల మాగాణిని నా డబ్బుతో కొని ఆమెపేర క్రయ దస్తావేజును వ్రాయించాను. పెద్దవాడు రాధాకృష్ణ తన వాటా భూమిలో ఎకరం పైచిల్కు మాగాణిని అమ్మినాడు. అమ్మకం తర్వాత మా కుండినది 53 ఎకరాల పైచిల్కు మాగాణి, 4 ఎకరాల పైచిల్కు మెట్ట. ఈ మెట్టలో ఈమధ్య రెండెకరాల పైచిల్కు అమ్మివేశాం. నా రెండో కోడలు భవానికి ఆమె తల్లిదండ్రులు సుమారు 8 ఎకరాల మాగాణిని అరణంగా యిచ్చారు ఈమధ్య ఆమె రెం డెకరాల మాగాణిని కొనుక్కొన్నది. అందువల్ల మా కిప్పుడు మాగాణి, మెట్ట కలసి సుమారు 60 ఎకరా లున్నది. మెట్టభూమిని ఎప్పుడో ఒకటి రెండు సంవత్సరాలు తప్ప సొంత సేద్యం చేయలేదు. మెట్టభూమిని పసిబిడ్డవలె కాపాడాలి.

ఆ వోపిక, తీరిక మాకు లేదు. అందువలన సాధారణంగా కౌలు కిచ్చుకుంటాం. దానిలో మామూలుగా పసుపు, మొక్కజొన్న, పెండలం, కూరగాయలు పెంచుతారు. నువ్వులు వేయవచ్చును గాని చుట్టూతా తాటిచెట్లుండటంచేత చిలుకలు వగైరాల దోపిడీ వల్ల ఆ పైరు సరిగా ఫలితానికి రాదు. ధనియాలు, కంది వేయవచ్చును. ఈ పైరులు లాభదాయకము కావని వేయరు. పసుపు మొదలైన వానిని వేస్తారు. ఇదివరలో వంగ, మిరప ఎక్కువగా వేసేవారు. శనగ కూడా పండించేవారు. ఇప్పుడు క్వచ్చిత్తుగా వంగమొక్కలు పెట్టినా పూర్వంవలె విరివిగా వంగ, మిరప పెంచటం లేదు. శనగ బొత్తిగా మానివేశారు. మెట్ట వ్యవసాయం నాకు చుక్కెదురైంది. మేము చేయలేము. కౌలు కిస్తే కౌలు డబ్బు సరిగా రావటంలేదు. రెండు సంవత్సరాల పాటు చెరుకు వేసుకోనటానికి కౌలు కిచ్చిన భూవసతి గల ఆసామి నుండి లాభదాయకముగా కౌలు డబ్బు వచ్చిందిగాని, చిల్లర మల్లరగా తీసుకొన్న భూస్థితి లేనివాళ్లు దగాజేసి కౌలు డబ్బు ఎగగొట్టటం, కొం తిచ్చి తర్వా తిస్తా మని మొగం తప్పించటం, మొండికేసి పుర్రచేయి చూపటం సామాన్యమైపోయింది. అందువల్ల ఒక భాగం రెండెకరాల పైచిల్కు మెట్టను అమ్మివేశాము. మిగతా రెండెకరాల లోపును కౌలు కిచ్చి, కౌలు డబ్బు అంతా వస్తుందా రాదా అనే సందేహములో వుంటున్నాం.

మాగాణి భూమి సేద్యం శ్రద్ధగానే చేస్తున్నాం. రసాయనిక ఎరువులు వాడటంలో లోటు చేయటంలేదు. మా పెంటప్రోగు పెద్ద దనే చెప్పవచ్చు. మరిన్ని 1953-54 లో నేను అయ్యంకిలో పాటిమట్టి కొని చేలకు తోలించాను. అనుభవం లేనివాడ నగుటచేత ఎక్కువ డబ్బిచ్చినా, తక్కువ లోతు మట్టి తెగి అనుకొన్నంత ఫలితం జరగలేదు. చేలు మరమ్మతు ఆదిలో ఎక్కువగాను, తరువాత ప్రతి సంవత్సరం చేయిస్తూనే వున్నాం. మెరక పల్లాలు సరిచేసు కోవటం, గట్లు వగైరా మరమ్మతు చేసుకోవటం, పెద్ద రైతు ప్రతి సంవత్సరం చేయవలసిన విధ్యుక్త ధర్మం. కాని, నావిషయంలో చాలా

సంవత్సరాలు కౌలులో వుండినందున, తర్వాత మా సీతా రామారావు స్వంతంగా చేసిన రెండు మూడు సంవత్సరాలలో ఇంచుమించు శ్రద్ధ తీసుకొనక పోవటం చేతను, అధోగతిలో వున్న భూములను సారవంతముగా చేయవలసిన బాధ్యతే గాక ఎత్తు పల్లాలు, గట్లు కన్నాలు బాగుచేసుకో వలసిన అవసరం కల్గింది. మరిన్ని, ముక్కలు ముక్కలుగా నున్న ప్రక్క ప్రక్క భూములను సమీకృతం చేసుకోవలసి వచ్చింది. గట్లను సరిచేసుకొనటంలో ఒకటి చెప్ప దలచాను. ప్రక్క రైతులు దురాశచేత సరిహద్దు గట్లను తమ ప్రక్క సరికి అవతల ప్రక్కకు వేయుటం వల్ల, ఏ తొండంగో గట్లమీద తమ ప్రక్క వూడ్చి, రెండో ప్రక్క నడచి త్రొక్కి, ఆ ప్రక్కను చేలోకి దిగజార్చి, తొండంగి తీసిన తర్వాత, తమ ప్రక్క సరికి అవతలి ప్రక్కన వేయుటం వల్ల, ఏ చీమల పుట్టో పెరిగినందున దానిని తెగగొట్టటంలో, సరిహద్దు గట్లు రెండో ప్రక్క కూడా కొంత తెగగొట్టి తెగగొట్టినంత వరకు తన ప్రక్కనుండి గట్టు పెట్టటం వల్ల, ఏ తుమ్మమొక్కో సరిహద్దు గట్టున పెరిగితే దాని వంకతో రెండో ప్రక్క గట్టును ఎగ త్రోయటంవల్ల, సరిహద్దుగట్లలో వంకర టింకరలు వస్తవి. ఈ పుస్తకం రెండో భాగంలో చెప్పినట్లు, నేను ఒకప్పుడు నా దగ్గర బంధువుతో, "తమ్ముడూ, మన సరిహద్దు గట్టు కొంత భాగం నా భూమిలోకి, కొంత భాగం నీ పొలంలోకి చొచ్చుకొని పోయింది. ఈ గట్టును సరిచేద్దాం. ఎంత భూమి నాకు కలుస్తుందో, నీకూ అంత భూమి కలుస్తుంది. ఒకవేళ నాకు కలిసిన భూమి నీకు కలిసిన దాని కంటె ఎక్కువైతే ముదరా యిస్తాను" అని చెప్పాను. అతడు "ఎందుకులేవే, యిట్లాగే వుండనీవే" అన్నాడు. ఇదీ, ఈ పల్లెటూరి మనస్తత్వం.

యజమాని ఎంత శ్రద్ధాసక్తులను కల్గియున్నా, అత డెల్లప్పుడూ నీళ్లు తగినంత వున్నవో లేవో, పెరిగే పైరు స్థితి ఎట్లున్నదో, గండ్లు అవి సరిగా భద్రపరచ బడినవో లేవో, వాళ్లు వీళ్లు గట్లమీద పచ్చగడ్డినే గాక, చేలో ఎదిగే పైరును కూడా

పశువుల మేత కని కోసికొని పోకుండా చూచేపనిని స్వయముగా నిర్వహించ లేదు. వీనిని జాగ్రత్తగా కనిపెట్టవలసిన వాళ్లు నౌకర్లు, కాపలాదార్లు. ఈ రోజులలో నౌకర్లు కాలం గడుపు కొనటమే గాని, జీతభత్యాలు ఎప్పుడు తీసుకొందామా అనే గాని చేలు బాగుండాలి, బాగా ఫలించాలి, రైతు క్షేమంగా వుండా లనే తలంపు లేనేలేదు. కాపలాదార్లు సామాన్యంగా నెల కొకసారి కనపడ తారు, దేనికి ? కాపలా రుసుం కొరకు. ఈ మధ్య ఎప్పుడైనా కనబడితే, "అయ్యా, పచ్చగడ్డి కోసుకొని పోయారు, ఎదిగే పైరును కోసుకొని పోయారు, లేక కంకులను కోసుకొని పోయారు, కోసిన పైరును నలుపుకొని పోయారు, వేసిన కుప్పను దులుపుకొని పోయారు" అని చెప్పటానికి వస్తారు. "ఏమిరా, నిన్ను పెట్టింది పచ్చగడ్డి కోసుకొనిపోనివ్వటాని కేనా" అంటే, "అయ్యా, నేను ఆ ప్రక్కకు వెళ్లి తిరిగి వచ్చేలోపుగా, లేక యింటికి భోజనానికి వెళ్లి తిరిగి వచ్చేలోపుగా, లేక రాత్రి వేళ కోసుకొని పోయా"రని చెబుతారు. పనను గాని, కుప్పను గాని నలుపుకొనిపోయిన విషయంలో కూడ యిదే గాథ. ఒక సంవత్సరం దగ్గర దగ్గరగా మా రెండు కుప్పలను కాపలా కాయు మని ఒకనిని నియమించాను. అతడు ఆ చుట్టుప్రక్కలనున్న కొన్ని కుప్పలను కాస్తూండినాడట. మా రెండు కుప్పలలో ఒక కుప్పకు నిప్పంటించినారు. "నువ్వు కాపలావున్నావుకదా, నిప్పంటించేఅవకాశం ఎందుకు కల్గిం"దని అడుగగా, "అయ్యా నేను అవతలి కుప్పలను చూసుకొని, మీ మొదటి కుప్పను చూసుకొని మీ రెండో కుప్ప దగ్గర కొంచెంసేపు పడుకొన్నాను. ఇంతలో మొదటి కుప్ప భగ్గుమన్నది" అన్నాడు. తగులబడిపోయినది పోగా మిగిలిన దానిని సొమ్ము చేసుకొన్నాం. తరువాత, రెండో కుప్ప గడ్డికడియానికి కూడా, మొదటి కుప్పకు పెట్టిన ప్రబుద్ధుడే నిప్పుపెట్టాడు. పూర్తిగా ఆహుతైపోయింది. కాబట్టి రైతులు వేయికళ్లతో చూసుకొన్నా, నౌకర్లు, కూలీలు, కాపలా దార్లు కల్మషంతో నడుచుకొంటే సుఖ ముండదు. పూర్తి ఫలిత ముండదు. నావిషయంలో, నే నెంత గింజుకొన్నా

55 సంవత్సరాలు నిండేవరకు ఆటల పాటలలోను, చదువు సంధ్యల లోను, పంశాల క్రింద కాగితాలు చూచుకొనడంలోను కాలం గడపిన నాకు, పుట్టినప్పటినుండి మట్టి పిసుకుకొని బ్రతికే రైతువలె జాగ్రత్త తీసుకొనలేను. తర్వాత 1962 నుండి నా రెండవ కుమారుడు సుధాకర్ వ్యవసాయములో నాకు తోడుగా వచ్చినా అతడు ఆఫీసరు కొడుకుగా, విద్యార్థిగా 24 సంవత్సరాలు గడిపి యున్నందున వ్యవసాయ పద్ధతులు అతనికి చప్పున వంట బట్టలేదు.

మొదటి సంవత్సరాలలో ఊడ్పు ( నాటు ) వేస్తున్నప్పుడు, నేను చేలో దిగి కూలీల వెంట నుండి హెచ్చరిస్తూ పనిచేయించే వాడను. కోతలలో ఆ గట్టునుండి ఈ గట్టుకు, ఈ గట్టునుండి ఆ గట్టుకు తిరుగుచు మునుముల్లో వెనుకబడినవారిని హెచ్చరిస్తూ కోత త్వరగా జరుగునట్లు ప్రయత్నించేవాడను. కట్టివేతలో ఆవిధముగనే ఏ ప్రక్కనుండి, ఏ మూలనుండి మోపులను మోయిస్తే, ఏవిధముగా మోపులను మల్లిస్తే, కుప్పకు సులువుగా, త్వరగా మోపులు చేరుతవో ఆలోచించి ఆ ప్రకారం చేయించే వాడను. మోపులను సకాలంలో కుప్పవద్ద మీద నున్న వారు అందుకొనునట్లు హెచ్చరించేవాడను. అసలు పనలను మోపులు కట్టటంలో ఆలస్యం జరుగకుండా చూచేవాడను. ఒకప్పుడు పడుచువాళ్లు మోపులు కట్టటానికి పూనుకొని ముసలిని, ముతకను మోయమంటే పని సాగేదికాదు. వచ్చిన కూలీలను మోపులను కట్టమంటే చిన్న చిన్న మోపులు కడతారు. అందుకని నౌకర్లను మరీ చిన్న మోపులను కట్టకుండునట్లు కట్టడి చేసేవాడను. దూరములో నున్న మోపులను ముందు పడుచు వాళ్లతో మోయించి, కొంతదూరము వెళ్లిన తర్వాత స్త్రీలను అందుకొనమనేవాడను. దగ్గర మోపులను స్త్రీలకు బెతాయించే వాడను. మరిన్ని, యిద్దరు ముగ్గురు కలసి మోపులకు వచ్చినప్పుడు ఒకరి కొకరు తోడ్పడి మోపులను ఎత్తుకొనునట్లు నియమించే వాడను. ఈ కోత, కుప్పవేయటం విషయంలో మొన్న మొన్నటి వరకు పైవిధంగా జరుపుచుండినాను. సుధాకర్‌కు ఊడ్పు సమయంలో చేనుకడ్డంగా దిగే చొరవ యిప్పటికిని అలవడినట్లు

లేదు. కోత, కుప్ప వేయించే సమయంలో నావలె ఆ గట్టునుండి ఈ గట్టుకు తిరిగే అలవాటు లేదనుకుంటాను. నూర్చునప్పుడు రెండు మూడు సార్లైనా పని సాగటం లేదని కుప్ప పైకెక్కి మోపులను క్రిందకు వేశాను. కొట్టిన, నూర్చిన ధాన్యం తూర్పార బట్టేటప్పుడు పోతకు త్వరగా అందించాలని నేను తూర్పారబోసే పలికలను ధాన్యం రాసుల నుండి నింపి పోతపోసే మనిషి కందించేవాడను. పోతపోసిన ధాన్యాన్ని సంచులలో పట్టునప్పుడు ఒక ప్రక్క సంచి పట్టుకొని ముడతలు లేనట్లు దానిని కుదింపు చేయటానికి సహాయపడేవాడను. రెండు మూడు సంవత్సరాలనుండి ఈ పనిని నేను చేయలేకపోవుచున్నాను. సుధాకర్ ఇప్పుడా పనిని నిర్వహించుచున్నట్లు కనబడుచున్నది. నిరుటి సంవత్సరం అనగా 1972 సంవత్సరం నూర్పిడి వరకు ఉదయం 5 గంటలకు బండ్లతోబాటు పొలం వెళ్లి 8, 8½ గంటల వరకు అక్కడుండేవాడను. సుధా తాను కాఫీ తీసుకొని వచ్చి నన్ను విడిపించేవాడు. నేను 5, 6 సంవత్సరాల వరకు బండ్ల వెనుక నడచిపోయేవాడను. తరువాత, ముందు బండి తొట్లో కూర్చొని వెళ్లేవాడను. తిరిగి ఇంటికి వచ్చేటప్పుడు నడచి రావటమే. ఉదయం బండి ఎక్కి కుప్పకు వెళ్లినా, సాయంత్రం కూడా 4 గంటలకు, ఒక్కొక్కప్పుడు అంతకంటె ముందు తిరిగి పొలం వెళ్లి, 6 గంటలకు కల్లం విడిచి యింటి ముఖం పట్టేవాడను. మొదటి సంవత్సరాలలో నూర్పుడు పూర్తై ధాన్యం బండ్ల కెక్కించిన తర్వాత, బండ్ల వెనుక నడుస్తూ వచ్చేవాడను. నిరుటి నుండి (1973) పొలం వెళ్లటం మానివేశాను. సుధాయే అన్ని పనులు చూచుకొనుచున్నాడు.

5, 6 సంవత్సరాల క్రిందటి వరకు మూడు రకాల ధాన్యాలు వేస్తూండేవాడను. మొదటి సంవత్సరాలలో రామసాగరం అనే ఆట్రగడ ధాన్యం, దేశీయ రకం తప్పకుండా వుండేది. నా స్వగ్రామం బొమ్మ్మలూరులో నా చిన్నతనంలో దేశీయ రామసాగరం వాడుకలో నుండేది. ఈ విత్తనం గాక, పెద్దకుసుమ పండించే వాళ్లం. ఈ రెండు విత్తనాలను చెరి సమానంగా వేసే వాళ్లం. రామసాగరాన్ని భోజనాని కుపయోగించే వాళ్లము.

కుసుమను జీతగాళ్లకు యిచ్చే వాళ్లం. రామసాగరం బియ్యం కొంచెం ముదుకగా వున్నా, అన్నం విచ్చి బాగుంటుంది. కొంత చల్లబడ్డా మెతుకులుగా తయారవదు. పైగా ఏజబ్బూ చేయదంటారు. కొన్ని సంవత్సరాలుగా వేసే 24-వ నెంబరు ధాన్యం సన్నంగా ఉంటుంది. బియ్యం తెల్లగా వుంటవి. కాని అన్నం కొంచెం చల్లారితే బిరుసు అవుతుంది. పైగా ఈ అన్నం పైత్యం చేస్తుం దంటారు. మా తండ్రిగారు ఈ ధాన్యాన్ని పండించినట్లు నాకు గుర్తులేదు. అది ఎట్లున్నా, రామసాగర మనే లేత ఎరుపురంగు గల (రత్నచుడి) ఈ ఆట్రగడ ధాన్యం మీద నాకు మిక్కిలి అభిమానం. అందువల్ల, నే నిక్కడ మొదటి సంవత్సరాలలో ఆ ధాన్యాన్ని తప్పక పండించేవాడను. రెండో ధాన్యం, నంబర్లని పిలిచే తెల్లరంగు (సాంబావు) వడ్లను రెండో రకంగా వేసేవాడను. దీనిని నంబరు 12 అనే వాళ్లు. ఒక్కొక్కప్పుడు దీనిని నంబరు 19 అనేవారు కూడా. దీనిని పెట్టిన కొన్నిసంవత్సరాలు ఎక్కువగా పండింది. క్రమేపి, హెచ్చుగా తెల్లతెగులుకు గురియై, రాలుబడి తగ్గిపోయింది. ఆ విత్తనా న్నిప్పు డీ ప్రాంతంలో వుపయోగించటం మాని వేశారు. మూడవ రకంగాను, లేక నంబర్లు ధాన్యం మాని వేసిన తర్వాత సామర్లకోట నంబరు 15, సన్న కృష్ణకాటుకలు, ఫారం సన్నం లేక గవర్నమెంటు సన్నం, వంకిసన్నాలు, గుత్తి కుసుమ పెట్టాం. గవర్నమెంటు సన్నం, లేక ఫారం సన్నం మిక్కిలి ఎరుపు ధాన్యం. అన్నం బాగుండేది. దానిని కొద్ది సంవత్సరాలు మాత్రమే పెట్టాను. అది యిప్పు డెక్కడున్నదో కనపడటంలేదు. రామసాగరం కూడా మాయమైంది. వంకిసన్నం, కృష్ణకాటుకలు, సామర్లకోట కూడా కనుచూపు మేరలో కనపడటం లేదు. 24-వ నంబరుధాన్యాన్ని క్వచిత్తుగా వేస్తూంటారు. కొన్ని సంవత్సరముల నుండి వాడుకలోకి వచ్చిన ధాన్యం అక్కుళ్లనే రకం. మొదట అక్కుళ్లనగా పాలక్కుళ్లు లేక గోవా అక్కుళ్లు మాత్రమే. ఇప్పుడు గుత్తి అక్కుళ్లనే విత్తనం వచ్చి పాలక్కుళ్ల వ్యాప్తం చాలా వరకు తగ్గించివేసింది. ఆట్రగడ, సామర్లకోట, కృష్ణకాటుకలు, గవర్నమెంటు సన్నం, వంకిసన్నం వాడుక తగ్గిపోవటాని కొక

కారణం వున్నది. అది, వాని రాలుబడి తక్కువగుటయేగాక అవి కోతకు ఆలస్యంగా వస్తవి. పాలక్కుళ్లు నవంబరు 20,25 తారీఖుల మధ్య కోతకు రాగా, అంతకంటె వారం రోజులు ముందుగా గుత్తి అక్కుళ్లు కోతకు సిద్ధమౌతుంది. పైగా గుత్తి అక్కుళ్లు రాలుబడి ఎక్కువగా వుంటున్నది. పాలక్కుళ్ల తౌక్క పలుచ నగుటవల్ల బస్తాకు (75 లేక 76 కిలోగ్రాములు) తక్కువ ధాన్యం తూగినా, పంట దిగుబడి హెచ్చును బట్టి గుత్తి అక్కుళ్లనే రైతులు అభిమానిస్తున్నారు. నేను కొన్ని సంవత్సరాల తర్వాత మూడు రకా లెక్కుడు శ్రమ కల్గిస్తవని రెండు రకాలకు దిగాను. ఇప్పుడు నాలుగైదు సంవత్సరాలనుండి, పాలక్కుళ్లు కొద్దిగా వేసి గుత్తి అక్కుళ్లు ఎక్కువగా వేయుచున్నాం. నిజానికి గత రెండు సంవత్సరాలలో ఒక్క గుత్తి అక్కుళ్లు మాత్రమే నాటాం. ఇప్పుడు వచ్చిన క్రొత్త సంకర రకాలు జయ, పద్మ, హంస, తైసింగు-1, ఐ. ఆర్.-8, ఐ. ఆర్. 20, జగన్నాథ్ మొదలైన వాని జోలి కింతవరకు పోలేదు. కొన్నిరోజులక్రితం నేను అమరావతి పరిశోధక ఫారంకు నా మేనకోడలు భర్త శ్రీ గుమ్మడి రాజారావు ఇంటికి వెళ్లగా, ఆయన అక్కడి నూరెకరాల గవర్నమెంట్ ఎక్సపెరిమెంటల్ ఫారంలో పెంచుచున్న ఆర్. పి. 198-1 చూపించి, "ఈరకం మామూలు అక్కుళ్లవలె నవంబరులో కోతకు వస్తుంది, ధాన్యం సన్నంగా వుంటవి. రాలుబడి ఎకరానికి 30 బస్తాల వరకు వస్తుంది. దీనిని వచ్చే సంవత్సరం, అనగా 1974 జూన్‌లో నాటించం"డని సలహా చెప్పాడు. ఆ విత్తనాన్ని ప్రయత్నించాలనే వున్నది. ఇక్క డింకొకటి. గుత్తి అక్కుళ్లతోపాటు, ఈ మధ్య నిరుడు, ఈ సంవత్సరం (1973 సంవత్సరము) కొన్ని ఎకరాలలో మషూరి అనే రకాన్ని వేశాం. ఆ బియ్యా నిప్పుడు భోజనాని కుపయోగిస్తున్నాం. బియ్యం సన్నం, తెలుపు, అన్నం బాగుంటుంది. ఈ ధాన్యరకాల విషయాలు ముగించే ముందు ఒకటి రెండు విషయాలు చెప్పాలి. ఢిల్లీభోగాలు (టేబుల్

రైస్) సన్నం. అన్నం బాగుంటుంది. దీనిని వేసి చూద్దామని, ఈ ప్రాంతాలలో ఆ విత్తనం దొరకనందున, మారుటేరు రీసర్చి ఫారం సూపరింటెండెంటుకు వ్రాయగా, ఆయన 40 కిలో గ్రాములు బస్సు ద్వారా పంపించారు. దాని పట దిగుబడి తక్కువేగాక, డిశెంబరు 10, 12 తేదీలకు గాని కోతకు రాలేదు. కాయధాన్యాలు అనగా మినుము, పెసర, ఉలవ ఎంత ముందుగా చల్లితే అంత బాగా పంట నిస్తవి. నవంబరు 25 ముందు విత్తనం పడితే పైరు ఏపుగా పెరిగి రాలుబడి ఎక్కువగా వస్తుంది. డిశెంబరు 10–వ తారీఖు దాటితే రాలుబడి క్షీణించిపోతుంది. అందువల్ల నాకీ ఢిల్లీభోగాల ఉత్పత్తి నష్ట మనిపించింది. అదీగాక ఈ చుట్టుప్రక్కల చెరుకు, పసుపు వేస్తున్నారు. వీనికి నీళ్లు కావాలని, మరిన్ని పిల్లి పెసర వేశాం. దానికి కావాలని, పైవూరి వాళ్లేగాక, సమీప పొలాల వాళ్లు కూడా డిశెంబరు 10 వచ్చేటప్పటికి క్రింది పొలాలకు నీళ్లు రానివ్వరు. నేను ఢిల్లీభోగాలు వేసిన పొలం పెద్దకాలువకు అనతి దూరంలో వున్నా ఒక సంవత్సరం నీళ్లు అందకపోవటం చేత, 6 ఎకరాలు పైరువేయకుండా విడిచిపెట్టవలసి వచ్చింది.

పైరు వేయలేదు. నీళ్లు కావాలని వీరంకిలాకు సూపర్ వైజరుకు కబురు పంపితే కలాసువచ్చి "యిదుగో వదులుతా"మని 1, 1½ ఎకరాలు తడుస్తూండగా నీటిని ఆపుదల చేశాడు. తడిసిన భూమి ఎండి పోయింది. తిరిగి కబురు పంపగా మరల కొన్నిగంటలు వదిలాడు. మరల ఆపివేశాడు. ఈవిధంగా రెండు మూడు సార్లు జరగటంవల్ల పైరు వేయటం మానివేశాము.

నీటి సరఫరా అధికారులు చాలా దుర్బుద్ధిగా నడుచుకొను చున్నారు. వీరివల్ల రైతులకు కలిగే బాధ గోడుపెట్టుకోవలసి నంతగా వున్నది. నీటి కెప్పుడు మిక్కిలి అవసరమో అప్పుడు నీటిని బిగపడతారు. పై గ్రామస్థులకు లోబడి, ఆ గ్రామస్థులు కాలవల ప్రవాహాన్ని అడ్డముగా బంధించి ఒక్కచుక్క కూడా క్రిందకు దిగనివ్వకుండా వుంటే చూస్తూ వూరుకుంటారు. ఈ ఊరికి నీటిని సరఫరాచేసే 'భీమనది ఛానెల్' అనే పెద్దకాలువ, 'భట్ల

పెనుమర్రు 'బ్రాంచి కెనాల్' అనే చిన్నకాలువ రెండున్నవి. భట్లపెనుమర్రు సమీపంలో పెద్దకాలువ, చిన్నకాలువలకు రెగ్యులేటర్లున్నవి. భట్లపెనుమర్రు రైతులు రెగ్యులేటరు తలుపులను పూర్తిగా క్రిందకు దింపటమేగాక, ఏ కొద్ది నీరైనా తలుపుల క్రిందిభాగమునుండి దిగజారుతుందేమో అని, ఈతబొండ్లు వగైరా అడ్డముగాపేర్చి గడ్డిమోపులను త్రొక్కి పూర్తిగా ఆపు చేస్తారు. తలుపులపైనుండి నీరు పొంగి, పొరలి యివతలి ప్రక్కకు పడుతుందేమో అని పైన గడ్డిమోపులతో ఎత్తుగా బిగిస్తారు. చిన్నకాలువకు కూడా ఆవిధముగానే చేస్తారు. పైగా దారి పొడుగునా వున్న తమ చేల ముఖాల వద్ద గండ్లు కొడతారు. ఈ సంవత్సరం వర్షాభావంవల్ల జూన్ 20, 25 లలో ఆరంభించవలసిన వూడ్పులు, జూలై ఆఖరు వరకు చాలావరకు ఆరంభం కాలేదు. చూచి చూచి, కబురు పెట్టిపెట్టి విసుగు పుట్టి నౌకరిని పంపి పెద్దకాలువను పూర్తిగా బంధించటం తెలుసుకొని, ఫొటోగ్రాఫర్‌ను పంపి ఫొటోలు తీయించి బందరు సబ్‌డివిజనల్ ఆఫీసరు గారికి పంపాను. ఆయన సమాధానం, భట్లపెనుమర్రు రైతులు నారుమళ్లకు నీరుకావలసి నీటి ప్రవాహం తక్కువగా వున్నందు వలన నీటికి అడ్డం వేశారట, నేను వెళ్లి రేపు విడిపిస్తానన్నాడట. ఇది జూలై 10, 12 తారీఖులలో. నిజానికి ఆకుమళ్లు జూన్ ఆఖరుకో, అంతకు ముందుగానో పూర్తిగా పెరిగియున్నవి. తర్వాత కొన్ని రోజులకు గాని కొంత నీరు రాలేదు. వచ్చి ఆగిపోయింది. తిరిగి కొంత నీరు వచ్చింది. ఈవిధంగా చాలా యిబ్బందితో ఎట్లో నాట్లు పూర్తయినవి. అయితే మామూలుగా జూలై 15 తారీఖు లోపుగా పూర్తిగావలసిన నాట్లు, ఆగష్టు 15-వ తారీఖునకుగాని పూర్తికాలేదు. అప్పుడు కూడా చెదురు మదురుగా నాట్లు నిలిచిపోయాయి. నామట్టుకు నాకు నిడుదు కొంచె మాలస్యమైనా 1971 లో 9 జూలైకి పూర్తికాగా, ఈసంవత్సరం ఆగష్టు 10-వ తారీఖున గాని పూర్తికాలేదు. అనగా నెలరోజులు ఆలస్యమైనది. నా అనుభవాన్నిబట్టి జూన్ ఆఖరుకు నాట్లు పూర్తయితే

మేలు పంట వస్తుంది. జూలై 10-వ తారీఖు వరకైతే ఫరవాలేదు. జూలై 15 దాటితే లేట్ నాసిపంట లభిస్తుంది. జూను ఆఖరు వూడ్పుకు, జూలై ఆఖరి వూడ్పుకు ఎకరానికి 4, 5 బస్తాలైనా భేదం వుంటుంది. ఆగస్టులో ఊడ్పు అథ్వాన్నమే. ఇక్కడొక వింత చెప్పాలి. నీళ్ల కక్కుర్తికి ఎవరో కాల్వకు గండి కొట్టారట. ఆ గండిక్రింద మా భూమి కూడా ఉన్నది. అందువల్ల మా భూమిని కూడా అక్రమంగా ఎక్కువ నీళ్లతో తడుపుకొన్నామని 'బి' ఫారం వ్రాశారట! అనగా మామూలు శిస్తుకు 10, 12 రెట్లు అపరాధం వెయ్యటానికి. నీళ్లు రావటం లేదని ఫోటోలు తీయించి గగ్గోలు పెట్టిన నాకు కూడా అపరాధం! నీటి సరఫరా తూములను మిక్కిలి చిన్నవాని నమర్చినందున, ప్రక్క గండి కొట్టకపోతే చేలు తడవవు. సరఫరాకు చాలని తూముల నమర్చి నీటి సరఫరా ఉద్యోగులు వగైరా తమ మామూళ్లను స్థిరపరచుకొన్నారు.

ఇంకొకటి, గవర్నమెంటు వారామధ్య "పులావు ధాన్యం. బాసంతి వంటి దానిని పండించండి, ఈ ధాన్యానికి ఇతర దేశాలలో గిరాకి వున్నది, మంచి ధరకు ఎగుమతి చేయవచ్చును. విదేశీ ద్రవ్య మారకం మనకు లభిస్తుం"దని పేపరులో ప్రకటించారు. నిజమే అనుకొని, కష్టపడి ఉత్తూరునుండి ఆ విత్తనాలను సంపాదించి సుమారు 5 ఎకరాలలో వేశాను. దిగుబడి చాలా తక్కువైనా 60 బస్తాల వరకు పండింది. అగ్రికల్చరల్ డిప్యూటి డైరెక్టరుకు, సివిల్ సప్లైస్ ఆఫీసరుకు వ్రాయగా "ఆ ప్రోగ్రాం లేదండీ, ఈ చిన్న మొత్తాన్ని ఫుడ్ కార్పొరేషన్ వారు కూడా కొనరు, మీరు ఏ వర్తకుని ద్వారా నైనా అమ్ముకోనం"డని జవాబిచ్చారు, ధాన్యం కమిషన్ వ్యాపారస్తులకు చెప్పగా, "వర్తకులు కొనం అంటున్నా" రన్నారు. చివరకు తక్కువ ధరకు సామాన్య సన్న ధాన్యంగా అమ్ముకోవలసివచ్చింది. ఈ ధాన్యాన్ని పండించటం వల్ల చాలా నష్టంపాలైనాను. ఇది సెప్టెంబరు ఆఖరుకే పాలు పోసుకోవటం ఆరంభించింది. పిట్టలు ఎగబడి పాలుపోసుకొనే గింజలను దూసుకొని పోవుట ఆరంభించాయి. అందుచేత, చేను నాలుగు ప్రక్కల నల్గురు కూలీలను నియమించి వాళ్లతో డబ్బాలు మ్రోగించటం, వడిసెలలతో రాళ్లు రువ్వించటం చేయ

వలసి వచ్చింది. ఈ ఖర్చుల వల్ల, మిక్కిలి తక్కువ రాలుబడి వల్ల మిక్కిలి తక్కువ ధర వచ్చి, ఏదో లాభం గడిద్దాం, పులావు ధాన్యం పండించిన వాళ్ల మాతాం అనే దిలాసాతో చేసిన ప్రయత్నం వృధా అయిపోయి, తిరిగి ఆ ధాన్యం ఊసే ఎత్తకుండా చేసింది. ప్రభుత్వ ప్రకటన లీ విధంగా వుంటవి.

అన్ని ఫిర్కాలలో వలెనే ఇక్కడ కూడా 8 మైళ్లలో వున్న మొవ్వలో పంచాయితీ సమితి వున్నది. దానికి వ్యవసాయ ఎక్స్టెన్షన్ ఆఫీస రున్నాడు. ఆ యుద్యోగి ఏనాడూ ఎట్టి సలహా, సహాయం అందివ్వడు. విత్తనాల సరఫరాకు గాని, నారు మళ్లకు తగిలిన తెగుళ్ల విషయంలో గాని, కాయధాన్యాల పెంపకంలో గాని ఆయన సలహా సంప్రదింపు లేమాత్రం వుండవు. ఆయనను ఎందుకు నియమించారో, ఏమి చేస్తాడో సర్వసాధారణంగా తెలియదు, పైరుకు కాటాకు తెగులు తగిలినప్పుడు ఆయనకు కబురు పంపగా "ఫలానా మందు వేయం"డని చెప్పి వెళ్లినాడు గాని తిరిగి దర్శనము లేదు. ఆ మందు పనిచేసిందో లేదో ఆయన పట్టించుకోలేదు.

ఇక ధాన్యం గాని, అపరాలు గాని అమ్ముకోవటం విషయంలో రైతులు పూర్తిగా కమిషన్ దారుల మీాద ఆధారపడి యున్నారు. ఈమధ్య, అక్కడక్కడ ఫుడ్ కార్పొరేషన్ వారు ధాన్యం కొనుట కారంభించినా కొంతవరకే కొనటం, కొనిన ధాన్యం సరిగాలేదని, తేమ, ధూళి, ధూసర, ఎక్కు వున్నదని ధరలో కోతలు కోయటం రైతులను నిరుత్సాహ పరుస్తున్నది. కమిషన్ దారులు తమకు వచ్చే హెచ్చు కమిషన్ గాక, ధాన్యం బస్తాకు 1 రూపాయ లాభం లేనిదే బేరం పట్టటం లేదు. పైగా గవర్నమెంటు లెక్కప్రకారం బస్తా 1 కి 75 కిలో గ్రాములు కాగా వీరు 76 కిలోగ్రాములకు గాని తీసుకోరు. మరిన్ని, అప్పుడప్పుడు మట్టివున్న దని, నాణ్యం బాగాలే దని, మిల్లర్లు తగాదాపెట్టా రని తగ్గించి యిస్తున్నారు. ధాన్యం విషయంలో అంత మోసం లేకపోయినా, అపరాల విషయంలో చాలా ఘోరం జరుగుచున్నది. వీరు కమిషన్ వ్యాపారులైనా

అపరాలను తాము సొంతంగా కొనుక్కొని, బెజవాడ మొదలైన చోట్ల కొట్లవాళ్లకు అమ్ముకుంటారు. ఈవిషయం నాకీమధ్యనే తెలియవచ్చింది. ఎక్కువ లాభాల కొరకు మార్కెట్టు ధరను కమ్మీచేయుటమే గాక తడిసిన వని, బూజుపట్టిన వని, లేక పురుగుపట్టిన వని బొత్తిగా తక్కువ ధరకు కొంటారు. నిరుడు అపరాలు మాసూలుచేసే కాలంలో (ఫిబ్రవరి, మార్చి) అక్కడక్కడ వర్షం పడ్డది. ఆ సాకు చూచుకొని నిరుడు మా మినుములు 125 రూపాయలకు కొంత, 150 రూపాయలకు కొంత కొన్నారు. అప్పుడు ధర చాలా హెచ్చుగానే, అనగా 175 రూపాయలు, 180 రూపాయలవరకుండి తరువాత 240 రూపాయల వరకు పెరిగి యుండినది. అమ్మిన తరువాత ధర పెరగటం కమిషన్ దారుల తప్పుకాదుగాని, ఆ వంక, ఈ వంక పెట్టి తమకు హెచ్చు లాభాలకోసం ఉత్పత్తిదారులను మభ్యపెట్టటం తప్పకుండా తప్పే. ఇంకొక తమాషా. ఒక ఆసామి వద్ద నూనె మినుము లుంటే వానికి, దేశవాళి మినుము లుంటే వానికి గిరాకి లేదంటారు. లేని మినుములకు గిరాకి ఉన్న దని చెప్పి అవి లేవా అని అడుగుతారు. లేవంటే, ఉన్నవానికి ధరతక్కువ చేస్తారు.

రెండు, మూడు సంవత్సరాలు కొంత మాగాణి పొలంలో చెరుకు వేశాను. ప్రక్క చేల వాళ్లు తమ పొలంలో పిల్లిపెసర వేశామని రాత్రింబగళ్లు కాపలాపెట్టి మా చెరుకుతోటకు సకాలంలో నీళ్లు రాకుండా చేశారు. పిల్లిపెసరకు నీ రివ్వకూడ దని నా అభిప్రాయంకాదుగాని, చెరుకుతోటలను మాడ్చటం శుద్ధ అన్యాయం. గవర్నమెంటు వారి రూల్సు ప్రకారం వేసవిలో పిల్లిపెసరకు ప్రత్యేకించి నీ ళ్లివ్వవలసిన అవసరంలేదు. చెరుకుకు, పసుపుకు యివ్వాలి. అయినా పిల్లిపెసర వేసిన ప్రక్క చేలవాళ్లు "మా కోరిక మీద వీరంకిలాకు సూపర్‌వైజర్ నీరు వదిలాడు కాబట్టి, ఆ నీరు మా చేల వరకే పరిమితమై వుండా"లని మొండికేశారు. నేను మా నౌకరిచేత ఓవర్‌సీరుకు కబురంపగా, "మీ అబ్బాయిని పంపించి నీరు తీసుకొని వెళ్లం"డని జవాబు వచ్చింది. ఈ మాదచ్ఛోదీ వల్ల నీరు సరిగా అందక ఎండిపోయి యుండటం

వల్ల, ఎలుకలు కొట్టి, నక్కలు నివాస మేర్పరచుకొనటంవల్ల చెరుకు దిగుబడి చాలా తగ్గి మాకు ఎక్కువ నష్టం వచ్చింది. అంతటితో చెరుకు వేయటం మానివేశాను.

ఈ వూరు చెరుకు విషయంలో ఉయ్యూరు కె. సి. పి. లిమిటెడ్ పంచదార ఫ్యాక్టరీ ఏరియా లోనిది. అయితే, ఇది దివి తాలూకా చల్లపల్లి ఎస్టేటులోని గ్రామం. ఎస్టేటు పోయినా, చల్లపల్లిరాజా శ్రీమంతు రాజా యార్లగడ్డ శివరామప్రసాద్ బహద్దర్‌గారు "చల్లపల్లి షుగర్స్ లిమిటెడ్" అనే పంచదార మిల్లును 1953 లో స్థాపించారు. దాని డైరెక్టర్ల బోర్డులో నేను 1957 జూను నుండి ఒక డైరెక్టరుగా వుండు చున్నాను. అందువల్ల, నేను పండించిన చెరుకును చల్లపల్లి ఫ్యాక్టరీకి పంపా లని వుద్దేశించి, దాని కొరకు హైదరాబాదు డెపూ్యటి డైరెక్టరు, చెరుకు స్పెషలాఫీసరు, శ్రీ జగన్నాథ రావు గారిని ఆశ్రయించి పర్మిట్టు తెచ్చుకొన్నాను. పర్మిట్టు తెచ్చుకోవటం అంతకష్టమైనది కాకపోయినా, నేను డైరెక్ట రనే అభిమానం చల్లపల్లి షుగర్స్ అధికారులకు లేకపోయింది. రాజాగా రప్పటికే పంచదార మిల్లుతో ప్రత్యక్ష బాధ్యతను వదులుకొని యుండినారు. ఆయన కుమారులు పట్టించుకోలేదు. ఫలిత మే మంటే నేను నానా అవస్థలు పడి బైటి లారీని అద్దెకు తీసుకొని చెరుకును మిల్లుకు తోలటంలో, ఒకరాత్రి ఫ్యాక్టరీకి చేరిన లారీ కొంచెం ఆలస్యంగా చేరిం దని దానిలోని చెరుకును బైట వేయించారు. మరునా డుదయం చల్లపల్లి కాపురస్తుడు, నా వదినె రెండో అల్లుడు శ్రీ కొఠపాటి దుర్గారామచంద్రరావు దానిని తన దొడ్లోకి తోలించి భద్ర పరిపించాడు. తర్వాత దానిని మిల్లుకు తిరిగి అక్కడి నుండి తోలించ వలసి వచ్చింది. ఈవిధంగా నిస్పృహ బలపడి, చెరుకు నుత్పత్తి చేయటానికి పూర్తిగా విముఖత్వం కల్గజేసింది.

నాకు మెట్టభూము లన్నా, తోటలన్నా మిక్కిలి సరదా, మామిడితోట లంటే మిక్కిలి యిష్టం. ఏలూరుకు 10 మైళ్ల లోపులో వున్న విజయరాయి అను గ్రామానికి దగ్గరగా, క్రొత్తగా

సవ్యసించిన కాకరాల సత్యనారాయణగారు 'మునిపల్లె' అను పేరుతో స్థాపించిన కుటీరాల కెదురుగా కొంతదూరములో కొన్ని సంవత్సరాల క్రితం చిట్టడవి ప్రదేశాన్ని వుయ్యూరు జమీందారు గారి నుండి కొంతమందితో కలసి నా వదినె కుమారులు కొని యుండినారు. వారు కొన్న భూమిలో కొంత భాగాన్నదివరకే అమ్మియుండినారు. ఇక మిగిలిన 30 ఎకరాల పైచిల్కు "మీకు మామిడితోటలన్న యిష్టం కదా, అక్కడి మామిడితోటలు వృద్ధిపొంది బాగుగా ఫలిస్తవి. మే మా అడవి భూమిని చౌకగా ఎకరము 1కి 105 రూపాయల చొప్పున కొన్నాము. మీ కాధరకే యిస్తాము, మీరు తీసుకోనం"డని నచ్చచెప్పారు. మామిడితోటల యందలి ప్రీతిచేత 1954-55 లో ఒప్పుకొని, నాతో మాట్లాడిన నొప్పించిన వదినె రెండో కుమారుడు సీతారామారావును, "నీవు నా ఖర్చుమీద వెళ్లి అడవిని కొట్టించి నేలను బాగుచేయించవలసింది, పెద్ద బావి అవసరం కదా, దాని నేర్పరపించవలసిం"దని తెలియించాను. అతడు కొన్నిసార్లు వెళ్లి అడవిని ఇంచుమించుగా కొట్టించాడు. ఒకదానికి బదులు రెండు బావులు త్రవ్వించాడు. కాని అతడు ఈ పనులు చేయించటంలో మధ్య మధ్య ఎక్కువ కాల వ్యవధి అవటంచేతను, పని పూర్తి అయినట్లే అని అశ్రద్ధ చేసి తిరిగి వెళ్లక పోవటం వల్లను నే నొకనాడు వెళ్లి చూడగా, తిరిగి తుప్పలు, పిచ్చిచెట్లు విజృంభించి, ఏ ప్రక్క నేది వున్నదో తెలియ లేదు. త్రవ్వించిన బావు లేప్రక్క నున్నవో కన్పడలేదు. ఆ ప్రదేశమంతా అయోమయంగా వుండింది. ఇక సీతారామారావుతో లాభం లే దని, మునిపల్లెలో సత్యనారాయణ గారిని కలసికొని, వారిని అర్థించి రెండు పాకలను తాత్కాలికంగా ఆక్రమించుకొనుటకు వారిని ఒప్పించి, వంటవానితో బియ్యం, పప్పు, నేయి, వంటపాత్రలు వగైరా సామానులు తీసుకొని బయలుదేరి వెళ్లాను. ఒక పాకలో వంట, భోజనం, రెండో పాకలో విశ్రమించటం నిద్రించటం ఏర్పరచుకొన్నాను. చుట్టుప్రక్కలనుండి నలభై యాభై మంది కూలీలను నియమించి, అడవి నంతా కొట్టించివేశాను. రెండు బావులలో పెద్దదానిని పూర్తిగా మరమ్మత్తు చేయించి, దిగుడు

మెట్లను కట్టించి దానిని ఉపయోగ యోగ్యంగా చేశాను. దాని కొరకు చాటపర్రు మాగంటి సీతారామదాసు సహాయంతో సిమెంటు రాళ్లను తీయించవలసి వచ్చింది. ఈ పనుల కొరకు రెండుసార్లు అక్కడ కాపురం పెట్టి రెండు మాసాలు ఉండవలసి వచ్చింది. అది వేసవికాలం. మునిపల్లె నుండి, నా భూమికి యిసుకలో ఒక మైలు నడవవలసి వచ్చేది. తెలతెల వారుచుండగా బైలుదేరి ఏ 10 గంటలకో తిరిగి వచ్చేవాడను. మరల మధ్యాహ్నం ఏ 2½ గంటలకో బైలుదేరి వెళ్లి సాయంత్రం 6 గంటలకు తిరిగి వచ్చేవాడను. ఈవిధంగా చాలా శ్రమపడి ఒక దశకు తీసుకొని వచ్చాను. మొదటి రెండు సంవత్సరాలలో కొంత ఉలవ వేశాను. అది పండీ పండనట్లు పండింది. కారులో పెదసనగంటి నుండి ఉదయం బైలుదేరి వేలూరు మీదుగా చింతలపూడికి వెళ్లే రోడ్డు మీద వున్న ఆ ప్రదేశాన్ని చూచి తిరిగి ఆ సాయంత్రానికి ఇంటికి చేరటానికి 65-70 రూపాయలు ఖర్చయ్యేది. పైగా నేను వంటరివాడను. అప్పుడప్పుడు ఈ యూరి శిరిపురపు సాంబయ్య అను నతనిని అజమాయిషీకి పంపాను. కాని అతని సాయం నాకు అక్కరకురాలేదు. అందువల్ల నాకు విసుగు పుట్టి అమ్మివేయాలని బుద్ధిపుట్టింది. గన్నవరం తాలూకా ఆకునూరు గ్రామస్థులు కొందరు రైతులు బేరానికి రాగా, నా స్వంత ఖర్చులు గాక వడ్డీ లేకుండా, దానిమీద నేను పెట్టిన ఖర్చును లెక్కకట్టి 14,250 రూపాయలకు 1957 లో అమ్మివేశాను. అంతకు ముందో లేక తర్వాతో దానిని సర్వే చేస్తే 35 ఎకరాలు తేలిందట. ఆ 14 వేలు పైచిల్లు అప్పుడే దేనికో ఖర్చై పోయింది. నేను నష్టపడిన దానిలో మొదటిది, నా 61, షెనాయ్ నగర్, మద్రాసు యిల్లు, రెండవది విజయరాయి భూమి.

నేను ఈవిషయం ముగించే ముందు ఇంకొకటి రెండు చెప్పదలచాను. విజయరాయిలో శ్రీ వైష్ణవులున్నారు. సీతారామారావు వారిలో నొకరికి అప్పుపెట్టి వారిసాయం పొందాలనుకొన్నాడు. ఆ ఆచారిగారు నాకు ఆ భూమి స్వాధీనంలోకి వచ్చిన తర్వాత, 50 మైళ్ల పైచిల్లు దూరంలోవున్న

విజయరాయి నుండి సైకిలు మీద ఎకాఎకి పెడసనగల్లుకు వచ్చే వాడు. భోజనంవేళకు వచ్చినా భోజనం చేసేవాడుకాదు. ఏ పండ్లో, పాలో, మజ్జిగో మాత్రం తీసుకొనేవాడు. తిరిగి ఆ సైకిలు మీదనే వెళ్లేవాడు. యాభై ఏళ్లయినా వయస్సుండిన ఆయన కింత ఓపిక ఎట్లున్నదా యని నేను ఆశ్చర్యపోయేవాడను. ఆయన వ్రాసియుండిన బాకీ ప్రోనోట్లను చివరిసారి వెళ్లి వచ్చే టప్పుడు, ఆయన ముందు వాటిని చించివేశాను.

ఆ ప్రాంతం, అనగా చింతలపూడి తాలూకా మన్యప్రాంతం వంటిది. అక్కడక్కడ ఇంచుమించు మెట్టసేద్యం మాత్రమే. ప్రజలు బీదవాళ్లు. చదువుకొని కొంత స్థిమితంకల రైతులుండినట్లు కనపడలేదు. అందువలన, నియోగి బ్రాహ్మణ కరణాలు రాజ్యం చేస్తూండేవారు. వారంటే ప్రజలకు భయం. వారి కించు మించుగా ఎదురులేదనే చెప్పాలి. సన్యసించిన శ్రీ కాకరాల సత్యనారాయణగారు కూడా వారి కణకువగా నున్నట్లే నాకు తోచింది. ఒక కరణానికి నన్ను ధిక్కరించాలనే అభిప్రాయం కల్గింది. ఇంకొక కరణానికి నా మాట ఖాతరే లేకపోయింది. మూరుమూల నున్న ఆయన కెన్నిసార్లు అవసరముండి కబురు పంపించినా రానే లేదు. నన్నే తన వద్దకు రమ్మని ఎదురు కబురంపాడు. కాకతాళీయంగా ఆయన కన్పడితే "మా కెన్నో పను లుంట"వని సందిగ్ధంగా జవాబు చెప్పాడు. ఈ యిద్దరు కరణాలకు నేను విదేశాలకు వెళ్లి పెద్దగా చదివి యుండిన సంగతి, పెద్ద యుద్యోగం చేసిన విషయం, ఉన్నవాడననే సంగతి తెలిసి యుండినది. అయినా, సామాన్యంగా కరణాలకు రైతుల మీదుంటే నిర్లక్ష్యభావం నామీద కూడా చెలాయించా లని ప్రయత్నించారు.

అక్కడ అడవి కట్టెలను బట్టీపెట్టి బొగ్గులను చేస్తారు. మా అడవి కట్టెలను బొగ్గులు చేసేవాళ్లను బెదిరించి నాకు వాళ్లివ్వ వలసినడబ్బు ఒక కరణం ఎగగొట్టించాడు ఒకసారి బొగ్గులను చేయకూడదని నిషేధించాడు.

శ్రీ సత్యనారాయణగారి స్వగ్రామం నా స్వగ్రామ మగు బొమ్మలూరుకు సమీపగ్రామ మగు వేల్పూరు. అందువలన వారు

నాకు కొంత సన్నిహితంగానే వుండేవారు. ఆయన విద్యాధికుడు. ఏలూరులో న్యాయవాద వృత్తి నవలంబించి, ఆ రోజులలో నెలకు 2,000 రూపాయలు తక్కువ గాకుండా సంపాదించుకొనేవాడు. వృత్తితోబాటు దైవభక్తి పెరిగింది. సాయంత్రం కోర్టు నుండి వచ్చిన తర్వాత కాళ్లకు గజ్జలుకట్టుకొని దైవసంకీర్తనం చేయుచు చిందులు వేసేవాడట. దైవభక్తి పక్వించి, ఏకాంతవాసం కోరింది. భార్య బిడ్డలు ఏలూరులో ఉండిపోయారు. ఈయన విజయరాయి వద్ద కొన్ని కుటీరాలను నెలకొల్పుకొని, దానికి "మునిపల్లె" అని పేరు పెట్టి దైవచింతనలో నిమగ్నుడై యుండేవాడు. మన దేశస్థుల అలవాటుప్రకారం కొందరు స్త్రీలు ఆయన వద్దకు చేరి ఆ కుటీరాల్లో ఉంటూ ఆయన కనుసన్నలలో మెలగుచు వేదాంతుల మైనా మనుకొనేవారు. వాళ్లకు రాగద్వేషాలు నశించిన వని నే ననుకొనలేదు. ఈ స్త్రీలు ఇంచుమించుగా వయస్సుమళ్లిన విధవలు. ఒకామెకు ఎందుకో నాయందు కొంత వ్యతిరేకభావం కల్గింది. నేను ప్రాతఃకాలం లేవటంతోనే నేను నిద్రించుట కుపయోగించుకొనే లుంగీతో బైలుదేరి అడవికి వెళ్లేవాడను. ఆ రోజుల్లో చాలావరకు ముస్లిములు కట్టుకొనే గళ్లలుంగీల నుపయోగించేవాడను. పై జెప్పినామె, "గళ్లలుంగీతో అచ్చం సాయెబ్ లాగా ఉంటాడు. తురకలాగా ప్రవర్తిస్తాడు" అనే ధోరణిలో ఏవేవో ఆడిపోసు కొందని నావంటవాడు చెప్పాడు. ఆమె ఇంకను కొంత వయస్సులోనే వుండినది. నే నా స్త్రీల నా ప్రాంతంలో చూచినప్పుడు, మర్యాదగా పల్కరించి, తప్పుకొని నాత్రోవను పోయేవాడను. ప్రత్యేక శ్రద్ధాశక్తులను చూపేవాడను కాదు. చూపవలసిన అవసరమున్నట్లు నాకు తోచలేదు. ఎందుకా స్త్రీ ఆ విధంగా నన్ను వర్ణించి నిరసనభావంచూపిందో నాకర్థంకాలేదు. ఏ పుట్టలో ఏ పామున్నదో! తర్వాత ఆమెను త్రోవలో కలసికొన్నప్పుడు కొంత వింతపడ్డా, యథాప్రకారమే నడచుకొన్నాను.

నేను మునిపల్లెను విడిచి వచ్చివేసేటప్పుడు, నా వద్దనున్న భాగవతం సెట్టును, ఒకటి రెండు వస్తువులను శ్రీ సత్యనారాయణ

గారి కిచ్చి వచ్చాను. వారు రచించిన భగవద్గీత వ్యాఖ్యను నాకు తర్వాత పంపారు.

ఈవిషయం ముగించే ముం దొకటి చెప్పా లనివుంది. అది భోజన విషయం. నాకు మొదటి నుండియు మాంసాదు లెక్కువ యిష్ట మని అదివరకే చెప్పియున్నాను. ఒకనాడు మా వంటవాడు ఒక ఉడుమును పట్టుకొని వచ్చాడు. "ఛీ, దీని మాంసం తినట మేమి" టంటే, "దీని మాంసం చాలా బాగుంటుంది, నేను వండు తాను చూడండి" అన్నాడు. వండిన తర్వాత రుచిచూస్తే మిక్కిలి బాగుగావుండింది. తర్వాత ఒకసారో, రెండుసార్లో మా పొలంలో, దొడ్లో దొరికితే తిన్నాను. ఉడుము మాంసం రుచికే గాక, నడుం నొప్పులు మొదలైన వానికి మంచి దట.

రైతులకు, సహజంగా భూమి విషయంలోను, సాగు విషయంలోను లోభత్వ ముంటుంది. గ్రామ స్వభావాన్ని బట్టి, ఆ గ్రామస్థుల స్వభావాన్ని బట్టి ఈ లోభత్వం, అవినీతి పనుల నాచరించటంలో హెచ్చు తగ్గు లుంటవి. మరిన్ని, గ్రామ కట్టుబాట్లను బట్టి ఇవి తగ్గటం హెచ్చటం వుంటుంది. ఈ పెడసనగల్లు గ్రామంలో, సంప్రదాయాలు మోటుగా వుంట వని పైన చెప్పాను. గ్రామ కట్టుబాట్లు చాలా తక్కువ. ఇంచు మించుగా లే వనే చెప్పాలి. అందువల్ల, సరిహద్దు గట్లను పడ ద్రొక్కి తనప్రక్కను నరికి రెండవవానిప్రక్క వేయటం, ఆవిధముగా కొంత భూమి నాక్రమించటం, సేద్యానికి పారుదలయ్యే నీటిని తమ పని పూర్తి అయ్యే వరకు ఇతరులకు పోకుండా వివిధ రకాలుగా ఆటంకం కల్గించటం, ఒకప్పుడు దొంగతనంగా యితర చేలల్లోని నీళ్లను తమ చేలకు మళ్లించు కొనటం, కుప్పలు నూర్చుడు సమయంలో, నూర్చుతున్న పశువుల నీళ్లకని తమ చేలుగుండా త్రోలుకొనిపోవుటకు అవకాశముండినా, ప్రక్కవాని చేల కడ్డముగా త్రోలుకు పోవటం, తమ కుప్ప కల్లాం తడుపుకొనుటకో, లేక ఆకుమడి పోయటానికి నేలను తడుపుకొను టకో అని, అడ్డబోదెల నిండా నీరు నింపి, గట్లు సరిగా కట్టక

ధాన్యం కల్లం నుండి తీసుకొనిపోయే బళ్లత్రోవను తడిపి బురద బురదగా చేయటం పరిపాటి. బళ్లు దిగడిపోయి చాలా యిబ్బంది కల్గుతుంది. ఈరోజుల్లో ఇట్టి దుష్టపనులు [illegible]న్నవి.

నౌకర్ల, కూలీల విషయంలో పైన కొంతచెప్పాను. యజమాని కొంత అశ్రద్ధచేస్తే, ఏ పనుండో నూర్పుడు వద్ద లేక పోతే, నూర్చే ధాన్యాన్ని గడ్డికడియంలో పోయటం, పనిచేసే వాళ్లకు భోజనం తెచ్చే గంపలలో ధాన్యం నింపి పంపటం, మంచి నీళ్లకొరకు వెళ్లే కావడి రెండు బిందెలలో ధాన్యం నింపి బైటకు పంపటం, రాత్రి కాపలా పెట్టినవాడు తెల్లవారుఝామున నూర్చే కల్లము నుండి పొట్టుతో సహా ధాన్యం ఎత్తుకొనిపోవటం లేక అర్ధ రాత్రి వచ్చి ఎత్తుకొనిపోవుట కితరులకు కుమ్మక్కు (మద్దతు) ఇవ్వటం, ధాన్యాన్ని ఇంటికి తోలేటప్పుడు బండి నాపి కొంత ధాన్యాన్ని సంగ్రహించటం యిటువంటి దొంగతనాలు చేస్తారు. మా చేలలో జరిగిన పగటి దొంగతనాలను పసిగట్టి, నూర్పుడు మొదలుపెట్టినది మొదలు కొట్టుడు ధాన్యం యింటికి వచ్చువరకు, తండ్రి కొడుకులం కాపలా యుండినాము. ఇప్పుడు సుధాకర్ చీకటితో బండ్లతో వెళ్లి, తిరిగి వచ్చేవరకు కల్లంలోనే వుంటు న్నాడు. ఈ విషయాలన్నీ వివరంగా నా "మారినకాలం," "అభిప్రాయాలు - అనుభవాలు" అను పుస్తకాలలో వివరించాను.

వ్యవసాయ పద్ధతులు నా చిన్నతనంలో కంటె యిప్పుడు చాలా మెరుగైనవి. పూర్వం, 20 కుంచాలు లేక యిప్పటి 26 మరకాల విత్తనాల నారును, పదెకరాలకు ఊడ్చేవారు. బస్తా విత్తనాలను, సామాన్యంగా ఇప్పుడు కూడా 20 సెంట్లులో నారు పోస్తున్నారు. అయితే విత్తనాల స్వభావం వల్లనో, లేక పద్ధతుల మార్పు వల్లనో యిప్పుడు క్రొత్తరకం విత్తనాల నారు 6, 7 ఎకరాలకు మించి రావటంలేదు. దీని కొక కారణం కూడా వుండవచ్చును. పూర్వం వరి కోసిన వెంటనే పైరు చల్లకుండా ఆకుమడి పోయదలచుకొన్న నేలను దున్నట మారంభించి, మొత్తంమీద నాలుగైదుసార్లు దున్ని మడిని మెత్తగా తయారు

చేసేవారు. ఇప్పుడు సర్వసామాన్యంగా పైరువేసి, దానిని తీసిన తర్వాత పంపు నీళ్లతోనో, కాలువ నీటితోనో తడిపి, దున్ని దున్ననట్లుగా మడిని తయారుచేయటంవల్ల కొంత మొలవక పోవటం, పిచ్చిమొక్కలు మొలిచి కొంత పలచ నవటం జరుగు చున్నది. మరిన్ని, ఊడ్పు కూడా పూర్వంకంటె మొక్కలను దగ్గర దగ్గరగా నాటుచున్నారు. తెగుళ్లు కూడా ఎక్కువైనవి. ఈ కారణంచేత 6, 7 బస్తాలు నారు పోయవలసిన ఆసామి, 10 బస్తాలకు తక్కువ గాకుండా పోయుచున్నాడు. కోతలు మామూలే గాని, కుప్పవేత పద్ధతి మారింది. పూర్వం త్రాళ్లు పేని, ఆ త్రాళ్లతో మోపులు కట్టి, కుప్పమీద త్రాళ్లను విడదీసి పనలను పరుచుకొని వచ్చేవారు. తిరిగి ఆ త్రాడుతోనే మరొక మోపు తెచ్చేవారు. అప్పుడు ఎంత పెద్దదాని నైనను, వలయాకారంగా కుప్పగా పేర్చేవారు. ఈరోజుల్లో సర్వసామాన్యంగా గుండ్రముగా గాక, పొడుగుగా వామివలె పెట్టుచున్నారు. ఇదివరకు వలె పేనిన త్రాళ్లతో మోపులు కట్టటంగాక, గింజలు రాల్చివేసిన పరకలను ముడివేసి, ఆ కట్లతో మోపులు బిగించి ఆ మోపుల పాటినే వామిని పేరుస్తున్నారు. కుప్పగా, అనగా గుండ్రంగావేసినా, మోపులతో పూరించటమే పద్ధతి. మొదట కొన్ని మోపులను క్రింద పరచి, దానిని కాలుపన అంటారు. ఈ కాలుపనను మధ్య పోలు అని మూడు పెద్దమోపులను నిలబెట్టి, కడమ మోపులను అడ్డంగా వేస్తారు. ఈ కాలుపన పైన, అడ్డని మోపులను పేరుస్తారు. వానిపైన 'మోటు' అని మరికొన్ని మోపులను పేరుస్తారు. అప్పటికి వామి లేక కుప్ప చాలావరకు పైకి లేస్తుంది. మిగిలిన పనలను విడదీసి ఈ మోటుపైన నేతనేసినట్లుగా అమర్చుతారు. ఈ నేతవల్ల వర్షంనీరు దిగజారిపోతుంది గాని, లోనికి పోదు. ఇక నూర్పుడు విషయంలో, పూర్వం కుప్పచుట్టూ కల్లంచేసి, ఆ కల్లంమీద పైనుండి పనలు వేసి గొడ్లను కుప్ప చుట్టూ త్రిప్పుతూ త్రొక్కించేవారు. ఇప్పు డట్లు గాక వామి లేక కుప్ప కెదురుగా కల్లంచేసి నేత పనను, మోపులను దానిమీద వేస్తారు. గొడ్లు త్రొక్కి నూర్చటం ఆకల్లం చుట్టూతా తిరిగి, మరిన్ని ఇప్పుడు ముందు బల్లలమీద వడ్లను రాలగొట్టి,

రాలగొట్టిన పననుగొడ్లతో త్రొక్కించుచున్నారు. ఇక గడ్డి విషయంలో, నూర్చిన గడ్డిని పూర్వంవలెనే పూర్తిచేయని వలయంగా కల్లం చుట్టూ చాలా మేరకు పేర్చిపెడతారు. కాని, యింటికి తోలేటప్పుడు, పూర్వం గడ్డిని పెద్దబొద్దులుగా చుట్టే వారు. ఆ బొద్దులను కొందరు కలసి శ్రమతో బండ్లమీద కెక్కించేవారు. ఇప్పుడట్లు కాదు. చిన్న చిన్న మోపులుగా కట్టి సులువుగా బండ్లమీద కెక్కించుచున్నారు. ఆ మోపులను మోకులతో బిగించటంగాక, బండి కొక్కివాసంతో బిగిస్తున్నారు. అందువల్ల యిద్దరు మనుష్యులే బండిని గడ్డితో నింపి యింటికి తోలుకొని రాగలరు. పూర్వం బొద్దులు కట్టటానికీ, బండిమీద కెక్కించటానికి 4, 5 గురైనా కావలసి వచ్చేవారు. నా చిన్నప్పుడు, తెచ్చిన గడ్డిని వామిగా వేయుటకు మిక్కిలి శ్రమపడవలసి వచ్చేది. ఏటవాలుగా మొదలుపెట్టిన వామి మీదకు బొద్దును 5, 6 గురు కలసి బలవంతంగా పైకి త్రోసుకొనిపోయే వారు. అప్పుడు హుషారు కొరకు 'లే లే హైలెసా' వగైరా పాటలు పాడుచుండేవారు, ఆ త్రోపుడు, ఆ పాట, వింతను కొల్పించేవి. ఇప్పుడా శ్రమ లేదు గాని, పూర్వంకంటె వాము లిప్పుడు ఎత్తుగా వేస్తున్నారు. వామి లేచిన కొలది మోపులు చిన్నవైనా పెద్దనిచ్చెన్లతో, చాలకపోతే ఒకటి, రెండు కలిపి కట్టిన వానితో పైకి ఎక్కించుచున్నారు. పూర్వం జవసత్వా లిప్పుడు లేవు. అప్పుడు కూలీలు స్వయముగా దంపుకొని దంపుడు బియ్యం తినేవాళ్ళు, త్రాగుడుండినా, యితర దురలవాట్లుండేవి కావు. ఇప్పటి వాళ్లు ఇరస (¼ బస్తా) ధాన్యమైనా మిల్లాడించు కొంటున్నారు. పైగా, పిచ్చి పిచ్చి తిండ్లు, చిరుతిండ్లు తినటం, బీడీలు వంటి వానిని కాల్చుట కలవాటు పడటం వల్ల నిర్వీర్యమై పోయారు. అందువల్ల వామి పూర్తిచేయటం ఒక సమస్యగా పరిణమిస్తున్నది. జనపకాడ విషయంలో వాతం చేస్తుందనో, వేడి చేస్తుందనో కూలీలు చప్పున పని కెక్కటంలేదు. జనప కాడ బండి కట్టటంలో కూడా చాలామందికి నైపుణ్యం తక్కువ. పూర్వంవలె పెద్దబండ్లు కట్టకపోయినా, చిన్నబండ్లు కట్టినా

దారిలో వొరిగి పోయిం దనో, పడిపోయిం దనో ఆలస్యం చేయటం పరిపాటై పోయింది.

ఊడ్పుకు సకాలంలో కాలువ నీరు అందక ఇబ్బంది పడుతూ, చాలాసార్లు వీరంకిలాకు ఓవర్‌సీర్ లేక సూపర్‌వైజర్‌కే గాక, బందరులోని సబ్‌డివిజనల్ ఆఫీసరుకు కూడా వ్రాస్తూండేవాడను. 1, 2 సార్లైనా విజయవాడలోని ఎక్జిక్యూటివ్ ఇంజనీయరుకు, సూపరింటెండింగ్ ఇంజనీయరుకు వ్రాయవలసి వచ్చింది. ఎంత వ్రాసినా, ఆ ఆఫీసర్లకు చీమ కుట్టేది కాదు. మా కాల్వలపై నున్న ఇతర గ్రామాల వారు ముఖ్యంగా మా సరిహద్దు గ్రామం భట్లపెనుమర్రు వారు కాల్వలకు అడ్డాలువేసి, కాల్వగట్లకు గండ్లు కొట్టి ఏ విధముగా మా భూములకు నీరు రానిచ్చేవారుకాదో పైన చెప్పియున్నాను ఈ ఇబ్బందులకు కొంతవరకైనా పరిహారంగా వుంటుం దేమో అని, నీటి ప్రవాహానికి అడ్డులేనప్పుడు ఇరుకు తూముల నుండి చాలని నీరు వచ్చే ఇబ్బందుల నధిగమించటానికి మా క్రొత్త కాలువ (భీమనది ఛానల్) కు అదనపు తూము ఏర్పరచుకొంటే, ఆ ప్రాంతం దక్షిణ పొలాలు సకాలంలో సాగు అగుటయేగాక, ఆ తూమునుండి వచ్చే నీటిని, ఉత్తర పొలం సాగుచేసే గరువు కాలువ (భట్లపెనుమర్రు బ్రాంచి ఛానల్) ప్రవహింపజేసి, గరువు కాలువ నీటిని సమృద్ధి చేసి, తద్వారా ఉత్తర పొలాలను కూడా సకాలంలో సాగుచేసుకొనుట కవకాశముండు నని తలంచి, అదనపు తూము కొరకు అప్పుడు విజయవాడలో సూపరింటెండింగ్ ఇంజనీయర్ గా వుంటున్న శ్రీ ఎన్. సుబ్బారావు గారిని 1964 జనవరిలో ఆశ్రయించాను. వారు కనికరించి ఈ వూరు వచ్చి మమ్ములను తీసుకొని ఆ ప్రాంతమంతా చూచి, నేను చెప్పిన దానిలో సమంజస మున్న దని గ్రహించి, తూమును శాంక్షన్ చేశారు. కాని, శ్రమ ఒకరిది, ఫలితం ఒకరి దన్నట్లు తూము నేర్పరచి, అదివరకే వుండిన బోదెను లోతు చేయించి, నీరు పూర్తిగా ప్రవహించునట్లు ఏర్పాటుచేయు మని నా వదిన కొడుకు సీతారామారావుకు ఒప్పగించాను. ఆ పని నత డింకొకరికి ఒప్పజెప్పాడు. ఆ రెండవవారు తన కనుకూల మగునట్లు దాని నుపయో.

గించుకోనటం వల్ల నే నాశించిన ఫలితం నాకు దక్కలేదు. ఆ రెండో ఆయు నిప్పుడు తన భూములను కౌలు కిచ్చి గరువు కాలువ నుండి సూటిగా నీరును తీసుకొనిపోయే బోదెను త్రవ్వించే విషయంలో తగాదా పెట్టుకొనిసందు వల్ల క్రొత్త కాలువ నుండి పుట్టిన బోదెను గరువు కాలువ వరకు త్రవ్వించలేదు. అందువల్ల నీరు సరిగా రాక ఈ సంవత్సరం నానా ఇబ్బందులు పడవలసివచ్చింది. ఈ యిబ్బందివల్ల, పైనుండి వర్షం లేకపోవటం వల్ల భట్లపెనుమర్రు రైతులు పెద్దకాలువను బిగించి నీరు రాకుండా చేయుటం వల్ల మామూలుగా జూలై 10 కి పూర్తి గావలసిన మానాట్లు(ఊడ్పులు) ఈ సంవత్సరం నెల రోజులు ఆలస్యంగా ఆగష్టు 10 కి పూర్తైనవని పైన వ్రాశాను. శాంక్షనైన తూమును బందోబస్తుగా ఇటుక, సిమెంటుతో ఇంతవరకు కట్టించలేదు. దీని సంబంధంగా డిపార్టు మెంటు వారికి డిపాజిట్ చేయవలసిన డబ్బును కట్టలేదు. భర్త వుండిన విధవ మాదిరి (గ్రాస్ విడో) ఇన్ని సంవత్సరాల నుండి ఈ తూము ఈవిధంగా వుండి పోయింది. ఈకాలంలో పల్లెటూరి రైతుల సహకార మీ విధంగా ఏడుస్తున్నది.

శ్రీ టంగుటూరి ప్రకాశంగారి పూనికవల్ల, వారి మంత్రిత్వ కాలంలో పంచాయతీ రాజ్యం అనే పథకం అమలులోకి వచ్చింది. గ్రామ పంచాయతీలనే గాక, కొన్ని గ్రామాదులను కలిపి, పంచాయతీ సమితు లను పేర సంస్థలను స్థాపించారు. ఈ సమితుల పెత్తనం క్రింద బ్లాక్ డెవలప్ మెంట్ ఆఫీసర్లను నియమించి, వివిధ రంగాలలో అనగా, వ్యవసాయం, పశువులు, కోళ్లు, రోడ్లు వగైరా విషయాలలో సహాయోద్యోగులుగా బ్లాకుకు ఒకరిద్దరు చొప్పున ప్రతి బ్లాకులోను నియమించారు. కొంతమంది గ్రామ స్థాయి వర్కర్లను కూడా నియమించారు. వారి నిప్పుడు గ్రామ డెవలప్ మెంటు ఆఫీసర్లంటున్నారు. ఈమధ్య ఒకటి రెండు సార్లు గ్రామస్థాయి వర్కరు కన్పడినాడు గాని, ఎప్పుడో ఒకప్పుడు వ్యవసాయ సంబంధమైన ఎక్స్టెన్ షన్ ఆఫీసరు కనపడ్డాడు గాని, అసలు ఈ ఎక్స్టెన్ షన్ ఆఫీసర్లు ప్రజల కొరకు గాక, తమ స్వలాభం కొరకే, తమ జీవనోపాధి కొరకే, ఏర్పరచబడ్డట్లు ప్రవర్తిస్తున్నారు. విత్తనాలు సేకరించటంలోగాని, నాకు

మళ్లకు తెగుళ్లు తగిలినప్పుడుగాని, వరిపైరు, మినుము, పెసర వంటి పైరులకు తెగుళ్లు తగిలినప్పుడుగాని నాలుక పీక్కొన్నా కష్టపడ రని, పైన చెప్పియే యున్నాను. ఈ శుద్ధ దండుగ సమితులను ఏర్పాటుజేయుటం ప్రజలను మోసపుచ్చటాని కేమో అనిపిస్తుంది. పోతే, కొలదిమ ది కైనా నిరుద్యోగ బాధ తప్పిం దని సంతో షించాలి.

ఈ గ్రామంలో 25 ఎకరాల మాగాణి భూమి గల నా పెద్ద కుమారునకు ఒకప్పుడు సొంత భోజనానికి మద్రాసుకు బియ్యం పంపవలసి వస్తే, నానా అవస్థ పడవలసి వచ్చింది. హైదరాబాదు సప్లైస్ డైరెక్టరేటు నుండి అనుమతి తెచ్చుకొన్నా, బందరు లోని జిల్లా సప్లయి ఆఫీసరు, జిల్లా కలెక్టరు అలక్ష్యంవల్ల చాలా ఆలస్యమై ఆ అనుమతి ఇంచుమించుగా నిరుపయోగ మైంది. పెద్దపెద్ద జీతాలు తీసుకొనుచు ప్రజాసేవకుల మని డప్పాలు కొట్టుకొనే ఇటువంటి ఆఫీసర్ల నుండి ప్రజల కందే విట్టి సహాకారాలే !

మా కున్న భూములలో చాలాభాగం మా గ్రామ ఉత్తరాన వున్నవి. ఆలస్యంగాగాని, ఆందోళనతోగాని ఆభూములు సేద్యం కావు. పైగా వేసవిలో పోసే ఆకుమళ్లకు, కూరగాయలు వంటి వానిని పండించుటకు అనుకూలంగా ఉంటుం దని భూగర్భ జలాన్ని ఉపయోగించుకుందా మని బుద్ధి పుట్టింది. ఇదివరలో కొందరు మామూలు బావులు త్రవ్వగా ఉప్పునీరు పడింది. ఇక ఆ ప్రాంత మంతా ఉప్పునీటి మయ మని గ్రామంలో దృఢాభిప్రాయం ఏర్పడి యుండింది. అయితే, మామూలుగా కొన్ని అడుగుల లోతు మాత్రమే త్రవ్విన బావుల నుండి ఉప్పునీరు వచ్చిందికాని, ఆ పొరలను దాటించి, యంత్రంచే మిక్కిలి లోతుగా త్రవ్వి స్తే మంచినీరు పడుతుం దేమో ప్రయత్నించి చూద్దాం అని తలంచాను. దాని కొకటి ప్రేరేపణ కల్గింది. కల్నల్ డి. యమ్. హౌన్నెస్సే, టెక్నికల్ ఆయిల్, వాటర్, మినరల్ రాడీఎస్తెసిస్టు నుండి ఒక పెద్ద కరపత్రం వంటిది వచ్చింది. ఆయ నప్పుడు బెంగుళూరులోని లావెల్ రోడ్డు గ్రాండ్ హోటల్ లో వుంటుండి నారు. ఆయన శ్వేతజాతీయుడు. బారిష్టర్ వంటి ఆయన ఇతర

హోదాలు సన్మానించాయి. అందువల్ల, "ఇక్కడకు వచ్చి ఏయే స్థలాలలో మంచినీరు పడుతుందో కనుగొనం" దని ఆయనను కోరాను. కొంత డబ్బు ముందు అడ్వాన్సుగా యివ్వాలనే, మొదలైన షరతులను నెరవేర్చాను. "కాలకృత్యాలు తీర్చుకొనటంలో, స్నానపానాదుల్లో నాకు కొన్ని వసతులు కావాలి, నేను బెజవాడ రైల్వే విశ్రాంతిగదిలో వుంటాను, అక్కడి నుండి ప్రతిపూట మీ కారులో వస్తూ పోతూ వుంటాను" అని తెలియ జేశాడు. "నాకు, కాలకృత్యాలకు యూరపియన్లకు అనువైన కమోడ్ మొదలైన వున్నవి, మీ కనుకూలముగా భోజన, స్నాన, శయ నాదులను ఏర్పాటు చేస్తాను, మీరు ఎట్టి సంకోచం లేకుండా మా యింటిలోనే వుండవచ్చును, బెజవాడ నుండి మిమ్ములను పూటపూటకు తీసుకొని రావటం మాకు శ్రమ కల్గిస్తుం"దని చెప్పాను. ఒప్పుకొని, వారు బెంగుళూరు నుండి బృందావన్ ఎక్స్‌ప్రెస్‌లో మద్రాసు సెంట్రల్ స్టేషనుకు చేరుకొనగా, వారిని నా పెద్దబ్బాయి రాధాకృష్ణ సెంట్రల్ స్టేషన్‌లో కలసికొని మద్రాసు - హౌరా మెయిల్ ఎక్కించాడు. 1968 మార్చి 21-వ తారీఖు ఉదయం నేను బెజవాడ రైల్వేస్టేషన్‌లో కలసికొని, కారులో వారి నిక్కడకు తీసుకొని వచ్చాను. ఇక్కడ 23 మధ్యాహ్నం వర కుండి, ఆ రాత్రి హౌరా-మద్రాసు మెయిల్‌తో మద్రాసు మీదుగా బెంగుళూరు వెళ్లిపోయాడు. ఇక్క డున్న రెండు రోజులు పైచిల్కులో, మా భట్లపెనుమర్రు పొలంలో ఒకచోట, మా మంకినగుంట పొలంలో మరొకచోట, మా సుధాకర్ తోడి అల్లుడు సూరపనేని శ్రీరామదాసు ఈశాన్య మూల పొలంలో ఒకచోట మొత్తం మూడు చోట్ల భూగర్భ జలాన్ని సమృద్ధిగా పొందటాని కవకాశమున్నదని చెప్పి, ఒక్కొక్క చోట ఒక ప్రత్యేక మొన లేక కొన (పాయింట్) ను నిర్దేశించాడు. ఆ మొనలను ఇటుక రాళ్లతో దిమ్మెలు కట్టించాడు. ఆయన రాకపోకల ఖర్చులు, త్రాగుడు ఖర్చులు గాక పాయింటుకు 650 రూపాయలు చొప్పున రుసుం తీసుకొన్నాడు. అక్కడితో ఆయన వల్ల లభించే సహాయం పూర్తైంది.

ఆయన తాను ఐరిష్‌వాడ నని చెప్పుకొన్నాడు. ఐరిష్ యూదు డేమో (జ్యూ) అనుకొన్నాను. యూదులు పంది మాంసం తినరు. కాని ఈయన డబ్బాలలో నిల్వ యుంచిన పంది మాంసం తెచ్చుకొని తిన్నాడు. "రుచి చూడం" డని నాకు కొంచెం ఇచ్చాడు. నా కా రుచి బొత్తిగా సహించక, దానిని విసర్జించాను. అయితే, యూదులలో కొంతమంది క్రైస్తవమతం పుచ్చుకొన్న వా రున్నారు. దాని కేమిగాని, ఆయన సంకుచిత బుద్ధి కలవాడుగాను, మిక్కిలి లుబ్ధుడుగాను, కొంచెం నీచత్వం కలవాడుగాను నాకు తట్టాడు. ఆయన ప్రథమాశయం డబ్బు సంపాదన. "ఎవరైనా నా సలహాను పొందుతా రేమో వారి చిరునామా లివ్వం"డని కోరాడు. నేను వ్రాసి యిచ్చాను. కాని వారిలో ఒక్కరు కూడా ఈయన సలహాను కోరినట్లు లేదు.

శ్రీ కలనల్ హెన్నెస్సే, సారాయి (విస్కీ) తీసుకు వచ్చాడు (ఖర్చుమాదే). దానిలో నేను తెప్పించిన ఐస్ ముక్కలు వేసి సోడానో, నీటినో కలిపి త్రాగేవాడు. నా కివ్వబోయాడు గాని నాకు వద్దని చెప్పాను. మేము, మేడమీది ముందు వరండాలో కూర్చుని మాట్లాడుకొనుచుండగా, త్రాగుచూ త్రాగుచూ, సగం త్రాగిన గ్లాసును సారా వుండిన సీసాలో పోసేసుకొన్నాడు. జ్ఞప్తికి వచ్చి, ఆ అసభ్యకార్యాన్ని నేను చీదరించుకొంటా నేమో అని కాబోలు చప్పున తలెత్తి చూచాడు. నేను చూడనట్లు నటించాను. ఏ కారణం చేతనో శ్రీరామదాసు తనవంతు 3-వ స్థానాన్ని తనిఖీ చేయించుకోడేమో అన్నట్లు నేను అనుమానపడి, మాటల సందర్భంలో ఆయనకు సూచించాను. ఆయన మిక్కిలి చిరాకుపడి, "మీరు మూడుచోట్ల చూపించుకొంటార నే నమ్మకం చెప్పబట్టి నే నిక్కడకు వచ్చాను. తప్పకుండా మూడవ చోటు కూడా తనిఖీ చేయించుకోవలసిందే" అని కోపగించుకొన్నాడు. నిజానికి ప్రయాణం ఖర్చులు, ఇతరఖర్చులు మేము భరించినప్పుడు, 2 పాయింట్లకే సంతోషించవలసింది. ఆయన పద్ధతిని చూచి, నేను "శ్రీరామదాసు చూపించు కొనకపోయినా, అతడు డబ్బివ్వక

పోయినా, నేను మూడు చోట్ల తనిఖీకి డబ్బివ్వటం న్యాయం'' అని నమ్మకం చెప్పవలసి వచ్చింది. చివరకు శ్రీరామదాసు తన మూడవ వంతు పూర్తిగా యిచ్చివేశాడు. ఆర్థికంగా ఆవిధమైన నష్టం నాకు కలుగలేదు.

ఆయన నిర్దేశించిన స్థలములలో గొట్టపు బావులను త్రవ్వటానికి "బొంబాయి నుండి ఒక కంపెనీవారిని రప్పించవలసింది, నేను వారి పేర ఉత్తరం వ్రాసిస్తాను, దానిని మీరు వెంటనే పోస్టు చేయం''డని ఉత్తరం వ్రాయడం మొదలుపెట్టాడు. నే నందుకొని " ఈ ప్రత్యేక కంపెనీకి వ్రాయుట మనవసరం, బొంబాయి చాలా దూరం, వారి ఛార్జీలు హెచ్చుగా ఉంటవి, నేను మద్రాసులోనో, ఇంకొకచోటనో ప్రయత్నిస్తాను'' అని చెప్పగా, కోపంతో నావంక చూచాడు. నేను ధీమాగా ఎదురు చూడటం వల్ల మెత్తబడి ఆ ప్రయత్నం మానుకొన్నాడు.

వీలుపడితే కొంత దబాయింపు చెలాయించే స్వభావం కూడా వుండిం దనుకొన్నాను. ఒక సందర్భంలో, " ఇండియన్లు తమ స్త్రీలను మిక్కిలి హీనంగా చూస్తా'' రని సంభాషణ మొదలు పెట్టాడు. నేను చిరాకుపడి, " మాకు మాతృ పూజ హెచ్చు. మా దేశాన్ని భరతమాతగా ఎంచుకొంటాం. పైగా మా త్రిమూర్తులు ఆది పరాశక్తి బిడ్డలని, సర్వ శక్తులకు మూలం ఆ మహాతల్లియే అని మేము నమ్ముతాం'' అని ఎదుర్కొంటిని. దానితో ఆయన చప్పబడిపోయాడు.

మొత్తంమీద నేను సౌమ్యంగానే వ్యవహరించి, మర్యాద మన్ననలు చేసి, స్నేహ భావంతోనే సాగనంపాను గాని, అంత మంచివాడు కాదని తోచింది.

ఈయనకు, తిరిగి వెళ్లే ప్రయాణంలో కొంత శ్రమ కల్గింది. మేము 23-వ తారీఖు మధ్యాహ్న భోజనానికే బెజవాడ స్టేషనుకు చేరుకొని, మొదటి క్లాసులో బర్తు (పడక) రిజర్వేషను న్యాయపరచినట్లు ఒకటికి రెండు సార్లు అడిగి తెలుసుకొన్నాము. ఆయన రైలెక్కటానికి కొంత ముందే నే నింటికి తిరిగి వచ్చాను. ఆయన తీరా రైలెక్కినప్పుడు పండుకొనటానికి స్థానం దొరకలేదట. ఈయన ఘర్షణ పడటం వల్ల రైలు లాలస్యంగా బైలుదేర

వలసి వచ్చిందట. చివరకొక ప్రయాణికుడు మర్యాద చూపి, తన స్థానం ఆయనకిచ్చి, లగ్గేజి వుంచే బల్లమీద పడుకొన్నాడట. ఇటువంటి మూఢచ్ఛేదీలు రైల్వేవాళ్లు అప్పుడప్పుడు చేస్తూంటారు. ఆయన రైల్వే అధికారులకు వ్రాయటం, వారికి నేను కూడా వ్రాయటం, వారు హెన్నెస్సే గారికి క్షమాపణ చెప్పుకోవటం జరిగింది. కాని, హెన్నెస్సే గారు మిక్కిలి క్షోభకు గురిఅవటం నాకు ఆశ్చర్యాన్ని, విచారాన్ని కల్గించింది.

ఇక గొట్టపు బావులను త్రవ్వించే విషయంలో, ఉయ్యూరు షుగర్ ఫ్యాక్టరీ వారు రెండు రిగ్గులు అనగా త్రవ్వే యంత్ర పరికరాలను ఉపయోగించి, రెండు లోతు బావులను త్రవ్విస్తున్నారని విని ఆ షుగర్ ఫ్యాక్టరీ (కె. సి. పి. లిమిటెడ్) సెక్రటరి, డైరెక్టర్ గారు శ్రీ మైనేని సీతారామారావు గారికి వ్రాశాను. అంతకు ముందు ఏలూరులో గ్రౌండ్ వాటర్ అనగా భూగర్భ జల డివిజన్‌ను స్థాపించారని తెలిసి వారికి వ్రాయగా, "మాకు తీరుబడిలేదు, మా సరంజామా తక్కువ, మావల్లకా" దని జవాబిచ్చారు. అందువల్ల సీతారామారావు గారికి వ్రాయవలసి వచ్చింది. అప్పటికి నీటి పారుదల చీఫ్ ఇంజనీయర్ శ్రీ తంబ మల్లారెడ్డి గారికి, సీతారామారావుగారికి స్నేహముసి వినియుండినాను. నేను సీతారామారావుగారిని అర్థించి, వారి ద్వారా, అదివరకు నేను కొంత ఎరిగియున్న మల్లారెడ్డి గారి నాశ్రయించి వారి అనుమతిని పొందాను. ఏలూరు భూగర్భ జలశాఖ ఎక్జిక్యూటివ్ ఇంజనీయరు గారికి వ్రాసి, వారి ద్వారా ఒక రిగ్గును తెప్పించుకొన్నాను. ఆ రిగ్గు అంత శక్తివంతమైనదికాదు. పైగా ప్రాతది. ఏదోవిధంగా పని సాగించి, 300 అడుగుల లోతు వరకు త్రవ్వి, "ఇక రిగ్గు పనిచేయదు. ఇంతటితో ఆపుకా" మన్నారు. 50 అడుగులలో ఒక జల, 200 అడుగులలో ఒక బ్రహ్మాండమైన జల పడ్డవి. కాని, ఆ నీరు ఉపయోగయోగ్యము కాదని, 300 దాటిన తర్వాత మంచినీరు పడవచ్చని, ఇంకా లోతుకు పోవటానికి మల్లారెడ్డి గారిని ఆశ్రయించి అనుమతి తెచ్చుకొన్నాను. మూడు వందల నలభై (340) అడుగుల లోతు వరకు రంధ్రం వేసింది. అప్పటికిని మరీ మంచినీరు పడలేదు. నాల్గువందల (400)

అడుగుల లోతుకు పోవాలనిపించింది. అయితే, "ఇంతకంటె లోతుకు పోవటానికి ఏమాత్రం అవకాశం లేదు, దిగ్గుచిన్నది, పైగా ప్రాతది, విరిగిపోయే అవకాశం జాస్తి, విరిగిపోతే, దీని ఖరీదు లక్ష రూపాయలు మీరిచ్చుకోవలసి వస్తుం"దని చెప్పారు. ఇక లాభంలేదని అంతటితో ఆపివేశాం. ఇంకొకటి-6 అంగుళాల రంధ్రం వేస్తారని తలంచాను. 6 అంగుళాలు వేయటానికి దీనికి శక్తి చాలదని 4 అంగుళాల గొట్టాలు మాత్రమే దింపారు. శ్రీ మల్లారెడ్డి గారు కూడా 6 అంగుళా లుంటుందని తలచారట. 4 అంగుళా లని తెలిసి నిరుత్సాహ పడినట్లు తెలిసింది. మధ్య కాలంలో మల్లారెడ్డిగారు తనిఖీకి వచ్చి మా యింటి ముందుకు రాగా, "లోపలకు రం"డని ఆహ్వానించాను. "నేను పని తొందరలో వెళ్లి పోవా"లని, చెప్పి, కొంచెం సేపుండి వెళ్లారు. చివరి దశలో వారిని చూడనేలేదు. మాయింటికి ఇంకొకసారి రాగా, నేను నిద్ర పోతున్నానని ఎవరో చెప్పారట. అంతటితో బైట నుండి వెళ్లిపోయారట.

ఈ సందర్భంలో కొన్ని విషయాలు చెప్పాలి. ఏలూరులో ఈ భూగర్భ జలాన్ని పైకితెచ్చుట కేర్పడ్డ ఎక్జిక్యూటివ్ ఇంజనీయరు డివిజను మా పని (1968) ఏప్రిల్ - మే నెలలలో ఆరంభించుటకు 2, 3 మాసాలకు ముందు మాత్రమే ప్రారంభింపబడిందట. అనుభవంగల ఇంజనీర్లతో అదింకా స్థిరపడలేదు. సిబ్బంది తక్కువ, అనుభవం అంతకంటె తక్కువ. అప్పటి ఎక్జిక్యూటివ్ ఇంజనీయర్ గారికి, వారి క్రింది ఆఫీసర్లకు ఇదంతా క్రొత్త విద్య. ఈసంగతి నాకు తెలిసి వున్నట్లయితే, వారిని కోరేవాడను కాను, నేను వారితో బాధపడేవాడను కాను.

క్రొత్తగాపెట్టిన గవర్నమెంటు సంస్థలోని, రైతుల నుద్ధరించటానికి పెట్టినా మనుకొన్న సంస్థలోని ఉద్యోగులకు, ముఖ్యంగా అనుభవంలేని సగం జీర్ణించుకొన్న చిన్న ఉద్యోగులకు దురహంకారం, ఏదో గొప్ప మేలుచేస్తున్నామనే అహంభావం వుండటం సహజమేమో, రంధ్రంవేసి, గొట్టాలను దింపే పనివారి

పనులు సాగుచున్న విధానం యజమాయిషీకి, ఒక అనుభవం లేని యువకుని వేశారు. అతడు చాలా చిన్నవాడగుటచేతను, పైగా నాతో స్నేహభావంగా వుండుచుండిన ఈ వూరి హైస్కూలు సైన్సు మాష్టరు గారి దగ్గర బంధు వగుటచేతను, చాలా సంవత్సరాలు పెద్ద ఉద్యోగం చేసిన వయస్సుమళ్లినవాడ నగుటచేతను కొంత చనువుగా మాట్లాడాను. అది ఆ యువకునికి నచ్చలేదు. నా ఉన్నత విద్య, నా పెద్ద ఉద్యోగ నిర్వహణ, నా వయస్సు అతని మనస్సుకు తట్టలేదు. అతనికి తట్టిందల్లా, నే నొక సామాన్య రైతును, అతని సహాయాన్ని అర్థిస్తున్నానుకాబట్టి, అతనికి నేను అణగిమణగివుండాలనే అభిప్రాయం మాత్రమే కల్గిందనుకుంటాను. అతడయిష్టంగా మాట్లాడటం చాలక, భూగర్భం నుండి వచ్చిన జలాన్ని తనిఖీచేయటానికని వచ్చిన ఒక కన్నడ ఉద్యోగికి ఏవో పుల్లింగాలు చెప్పి వ్యతిరేక భావం కల్గించినట్లున్నాడు. వారిద్దరూ బ్రాహ్మణకులంవారు. ఈ యువకుడు తాను బ్రాహ్మణుడు కాబట్టి నేను సరసనగా చూస్తున్నాననేటువంటి వేవో చెప్పి ఆ ఉద్యోగిని నాకు పూర్తి వ్యతిరేకిగా చేసినట్లున్నది. ఆయన నీటిని శాంపుల్సు తీసుకొని మా యింటికి వచ్చాడు. "భోజనకాలమైంది. భోంచేసి వెళ్లం" డన్నాను. "లేదు. నేను పామర్రుకో, వుయ్యూరుకో వెళ్లి భోంచేస్తా" నన్నాడు. "సరే, పాలో, మజ్జిగో తీసుకోం" డన్నాను. అవీ వద్దన్నాడు. "పోనీలే, మంచినీళ్లైనా త్రాగి వెళ్లం" డన్నాను, దానికీ సమ్మతించలేదు. అందువల్ల నేను నవ్వుచూ, "మీ రింత అన్ సోషల్ గా (కలిసికట్టులేనివారుగా) వున్నా" రేమిటి అన్నాను. చప్పున కోపగించుకొని లేచి వెళ్లుచు "మీకు సోత్కర్ష (యూ థింక్ టూ మచ్ ఆఫ్ యువర్ సెల్ఫ్) ఎక్కువ" అని ఏవేవో గొణిగాడు. ఇట్టి అమర్యాద ప్రవర్తన గల ఉద్యోగి ఏ బాధ్యతగల ఉద్యోగానికీ అనర్హుడని నాకు గట్టిగా తోచింది. ఎగ్జిక్యూటివ్ ఇంజనీర్ శ్రీ సి. రామమోహనరావు మా యింటికి రాగా శ్రీ సుబ్బారావు ప్రవర్తన చెప్పాను.

"ఆయన నొక తమాషా మనిషిలే" అన్నాడు. చివరకు పని ఎట్లో పూర్తిఅయింది. నీటిని పరీక్షించిన ( ఎనాలిసిస్ చేసిన ) వారు "ఈ నీరు సేద్యాని కంత ఉత్తమమైనది కాదని, దీనిలో కొంత సోడియం కార్బొనే టున్న"దని చెప్పారు. అనేకసార్లు వ్రాయగా, చాలాకాలానికి హైదరాబాదు కేంద్ర పరిశోధనాలయం నుండి ఇంచుమించు అట్టి అభిప్రాయమే వచ్చింది. నేను బాపట్లలోని పరీక్షా కేంద్రానికి పంపితే కూడా తృప్తిమైన సమాధానం రాలేదు. అందువలన దానికి విద్యుత్తుతో పంపు సెట్టు పెట్టా లనుకొన్న నా అభిప్రాయాన్ని మానుకొన్నాను. ఆ గొట్టం బావికి మొత్తం 12 వేల రూపాయలు ఖర్చయింది. అది 1968 లో. అయితే, నీరు చూడటానికి, రుచికి, చాలా బాగుం టుంది. ఎన్నిరోజు లా నీరు త్రాగినా పిసరంతైనా జలుబు చేయలేదని కాపలాదారుడు చెప్పాడు. అప్పటి నుండి ఇప్పటి వరకు మేమే గాక, చుట్టుప్రక్కల వాళ్లు ఆ నీటితో నారుమళ్లను పెంచుచున్నారు. నారుమళ్లన్ని మంచి ఏపుగా, సవ్యంగా పెరుగుచున్నవి. కాబట్టి శాస్త్రరీత్యా ఎట్లున్నా ( శాస్త్రానికి పోతే కుక్క పిల్లలు పుట్టారట ) నీరు ఉపయోగానికి తగినదే అని రైతుల అభిప్రాయం. అయితే దానిని వేసవికాలంలో ఉపయో గించటం మంచిది కాదేమో అని అభిప్రాయపడ్డ శాస్త్రవేత్త, మా బంధువు, "వేసవికాలంలో దీనిలో ప్రత్తిని, రాగులను పండించటాని కేమీ అభ్యంతరం లే"దని చెప్పాడు. "ఏది ఎట్లున్నా ఇంక కొంతకాలం చూచి, ఏదైనా దోషం కనపడితే, ఆ దోషాన్ని పోగొట్టటానికి జిప్సమ్ అనే పదార్థాన్ని ఉపయోగిస్తే సరిపోతుం" దని సలహా ఇచ్చాడు. అది ఎక్కడ దొరుకుతుందో ఇప్పుడు తెలుసుకున్నాం. అవసర మనుకొంటే దాని నుపయో గిస్తాం. మొత్తంమీద ఆ గొట్టం బావి ఏదో విధంగా ఉపయోగ కరమౌతుం దనే నా విశ్వాసం.

ఈ శీర్షిక క్రింద ఇదివరకే నౌకర్ల అఘాయిత్యాలను కొంత చెప్పాను. ఒక నమ్మక మనుకొన్న నౌకరొకడు తెల్లవారు ఝామున 4 గంటలకే వచ్చి జనపకట్టలను పెద్ద మోపుగా కట్టి

పట్టుకు పోవుచుండే వాడట. ఒక తెల్లవారుఝామున నేను అల్పాచమానానికి-స్నానగదికి వెళ్ళుచూ క్రిందకు చూడగా ఒక వ్యక్తి కనపడ్డాడు, 'ఎవ'రని పలకరిస్తే 'నేనే' అని ఆ నౌకరు అన్నాడు. "ఎందుకురా ఇంత పెందలకడ వచ్చా"వంటే, "మెలకువ వచ్చింది, వేళ తెలియక వచ్చా"నన్నాడు. ఆ దొంగ వెధవే జనపకట్టలు పట్టుకు పోయాడని తర్వాత తెలిసింది.

ఆంధ్రప్రదేశ్ మాజీ ముఖ్యమంత్రి పుణ్యమంటూ, భూ పరిమితుల గాలిదుమారం వచ్చి పడినప్పుడు, అదివరకొకసారి వచ్చి "నేను డెల్టా రైతుల సంక్షేమానికై పాటుబడుచున్నా" నని చెప్పి 100 రూపాయలు విరాళంగా తీసుకొనిపోయిన యలమంచలి భాస్కరరావు అనే ఆయన మా యింటికి వచ్చారు. "కృష్ణాజిల్లా భూములు ఒకే పంట పండేవి, భూసారము హెచ్చుగా లేనివి, కొన్నిచోట్ల మిక్కిలి నిస్సారమైనవి, కాలువల చివరి భూములు కొన్ని సాగునకు రాకుండా పోవునవి, అక్కడక్కడా దాళ్వాకు నీటి నందించినా, అప్పుడు సముద్రానికి పోయే మిగులు నీరును మాత్రమే ఇచ్చా రంతేగాని, ఆ భూములు రెండో పంట సాగుకు వచ్చేవి కా"వని చెప్పి, ఏవేవో లెక్కలు వల్లించాడు. "ఈ విషయాలన్నీ తగిన అంకెలతో పుస్తకాన్ని ప్రకటిస్తున్నాను, డబ్బులే" దనగా, కాగితం ఖర్చు 105 రూపాయ లవుతుందని తెలుసుకొని ఆ డబ్బిచ్చి పంపాను. మరొకప్పుడు వచ్చి "ఇక్కడ చేసే పని చాలదు, నేను, బాగా తెలిసిన మరొకరిద్దరు ఢిల్లీకి వెళ్ళి మాకు తెలిసిన అక్కడి కేంద్ర మంత్రులను, ఇతర సానుభూతిపరులను కలసికొని నచ్చచెప్పుతా"మని నమ్మకం చెప్పగా "దారి ఖర్చులకు, నివాస భుక్తిఖర్చులకు కొంత ఇస్తా"నని 500 రూపాయలు నేనిచ్చి, మరిద్దరిచేత 80 రూపాయ లిప్పించాను. తర్వాత ఆయన దర్శనమే దుర్లభమై పోయింది. నా ఉత్తరాలకు జవాబు లేదు. వారు ఢిల్లీకి వెళ్ళారో, ఎక్కడున్నారో తెలియలేదు. ఇట్లుండగా అప్పటివరకు ఢిల్లీకి వెళ్లకపోవటానికి ఏవో సాకులు చెప్పి, "అర్జంటుగా 500 రూపాయలు పంపం" డని ఉత్తరం వచ్చింది. ఇదేమి టని ఆలోచించుచుండగా, ఇంకొక

ఉత్తరం వచ్చింది. ఏమి చేద్దామా అని తర్కించుకొనటంలో ఒకటి రెండు రోజులు గడిచాయి. ఇంతలో ఒక మధ్యాహ్నం ఆయన ఊడిపడ్డాడు. మొదట తీవ్రపడినా ఆయన చల్లని అనునయం మాటలకు మెత్తబడి, "మీరిప్పు డెక్కడకు వెళ్లుచున్నా" రనగా, "నే నిప్పుడు చల్లపల్లి వెళ్లుచున్నాను. అక్కడి సంస్థానం రికార్డుల నుండి కొన్ని లెక్కలు తీయాలి. తర్వాత ఉయ్యూరు వెళ్లి అక్కడ కొన్ని లెక్కలు తీస్తాను" అని చెప్పాడు. "మీవద్ద ఇప్పుడు డబ్బెంతుం" దని అడిగితే, "10 రూపాయ లుం" దని చెప్పాడు. పది రూపాయ లేమి చాలుతవని 50 రూపాయ లిచ్చాను. ఆయన వద్దన్నాడు గాని మునిగిపోయేవాడు గడ్డిపోచను పట్టు కొన్నట్లు,కొంతైనా పనిచేస్తాడేమో అని ఆశతో తిరిగి 50 రూపాయ లిచ్చాను. ఆయన చల్లపల్లి నుండి వుయ్యూరు వెళ్లుతానని చెప్పాడుకదా, "అక్కడ భూ పరిమితుల విషయంలో పని చేయు చుండిన శ్రీ వడ్డే శోభనాద్రీశ్వరరావు గారిని కలుసుకొని ఆయనతో సంప్రదించం" డని చెప్పాను. ఆయనను కలసికొన లేదని తర్వాత విన్నాను. తిరిగి పత్తా లేకుండా పోయాడు. నేను వ్రాసిన ఉత్తరాలకు జవాబు లేదు. నేను ఆ సమయంలో హైదరాబాదుకు వెళ్లాను. ఒక మిత్రుని ద్వారా హైదరాబాదులో సాగర్ టాకీస్ దగ్గరున్న రవీంద్ర హోటలుకు కబురంపి తెలుసుకోగా ఆయ నక్కడ లేడని తెలిసింది. అయితే, ఆయన పేరుతో వచ్చియుండిన 2,3 ఉత్తరా లక్కడుండినవట. 2, 3 రోజులకు తిరిగి కబురంపగా ఆ ఉత్తరాలు కూడా లేవట. ఇప్పటికిది జరిగి సంవత్సరంన్నర దాటింది. ఇంత వరకు ఆయన జాడ లేదు. ఈమధ్య ఆంధ్రజ్యోతి దినపత్రికలో, "సరైన నీటిసరఫరా లేక రైతు లిబ్బంది పడుతున్నా" రని ఆయన వ్రాసింది చూచి ఈప్రాంతాన్నే ఉన్నాడని తెలుసుకున్నాను. మాటనిలకడ లేని ఇట్టి బూటకం స్వార్థపరులను నమ్మి డబ్బు తగులబెట్టుకోవటం, శుద్ధ అవివేక మనిపిస్తున్నది.

మొదట ఆయన (శ్రీ యలమంచలి భాస్కరరావు) సలహా ననుసరించి కొన్ని గ్రామాల నుండి మా కృష్ణాజిల్లా భూములు ఒకే పంట భూములని రాష్ట్ర, కేంద్ర ప్రభుత్వాలకు టెలిగ్రాము లను పంపింపజేశాను. పైగా, నేను కరపత్రాలు వేసి ఊరూరా పంచిపెట్టించాను. మరిన్ని, కొన్ని పత్రికలకు వ్రాశాను. ఆంధ్ర జ్యోతి దినపత్రిక వారు, "కృష్ణాజిల్లా రైతులకు విజ్ఞప్తి" అను దానిని, "భూ పరిమితుల శాసనం—వర్తింపు కాలపరిమితి" ప్రచురించారు. నెల్లూరు 'జమీన్ రైతు' పత్రిక వారు, నేను వ్రాసిన పెండెకంటి వెంకట సుబ్బయ్య గారి కమిటీ రిపోర్టును గురించిన పరిశీలన, శ్రీ రేబాల లక్ష్మీనరసా రెడ్డిగారి ఆధ్వర్యాన జరిగిన సభలో శ్రీ నల్లపరెడ్డి శ్రీనివాసులు రెడ్డి, శ్రీ బెజవాడ పాపి రెడ్డిగారు ఉపన్యసించిన విషయాలను ఎత్తుకొని వ్యాఖ్యానించిన దానిని ప్రచురించారు. మద్రాసు ఇంగ్లీషు డెయిలీ 'హిందూ' పేపరుకు రెండు వేర్వేరు వుత్తరాలు పంపగా దానిని లేఖల కాలాల్లో వేశారు. నా "అభిప్రాయాలు–అనుభవాలు" తెలుగు పుస్తకంలో, 'ఇది సాంఘిక న్యాయమా ?' అని వ్రాశాను. పైగా వారికి, వీరికి "రైతులకు అన్యాయం జరగకుండా సాయం చేయం"డని వ్రాశాను. ఇద్దరు ముగ్గురు న్యాయవాదులను సంప్ర దించాను. భూ పరిమితుల బిల్లును తెప్పించి చదివాను. మొత్తం మీద చాలా గందరగోళం పడ్డాను. కారణం మా తండ్రి లింగం వెంకటరత్నంగారు కొంత భూవసతి గల వారగుట చేతనే, నేను ఇంగ్లండులో చదువుకొనుట కవకాశం కల్గింది. నా పిత్రార్జితం హరించి పోయినా, నా భార్యకు తల్లి దండ్రులనుండి కొంత భూవసతి సంక్రమించటం వల్లనే నా కొడుకులు, కూతురుకు చదువుకొనటానికి, వాళ్లకు వివాహాలు సలక్షణంగా జరపటానికి అవకాశం చిక్కింది. ఇప్పుడిద్దరు కొడుకులకు వాళ్ళ భార్యల ఆస్తితో కలుపుకొని, మొదటివానికి 34 ఎకరాలు, రెండోవానికి 30 ఎకరాలు ఆస్తి వున్నది. మా తండ్రిగారి కుండిన ఆస్తితో పోల్చి చూస్తే ఇది అంత పెద్ద ఆస్తి కాదు. ఈ కొలది ఎకరాలు పెద్ద ఆస్తి క్రిందకు రావు. మధ్యరకం

రైతుగా సుఖ జీవనం చేయటానికి సరిపడతవి. భూ పరిమితుల చట్టం ఈ అవకాశాన్ని తీసివేస్తుంది.

భూ పరిమితుల బిల్లు ప్రకారం భార్యాభర్తల భూములను కలిపి, పరిమితి విధించాలి. కృష్ణాజిల్లా భూముల పరిమితిని 18 ఎకరాలని నిర్ణయించారు. ఈ లెక్కను పెద్దవానిది 16 ఎకరాలు, రెండోవానిది 12 ఎకరాలు ప్రభుత్వానికి విడిచిపెట్టాలి. మా భూములు సగటున ఎకరాకు 10, 12 వేల రూపాయలకు తక్కువ ఖరీదుండవు. ప్రభుత్వంవారు ముదరా (నష్టపరిహారం) ఎకరం 1కి ఏ 500 రూపాయలో ఇస్తామంటారు. ఈవిధంగా భూములు లాక్కోవటం, నామమాత్రం ముదరా ఇవ్వటం మిక్కిలి అన్యాయమనిపించింది, అనిపిస్తున్నది.

నా వాదన టూకీగా చెప్పాలంటె, వ్యవసాయ ఖర్చులే గాక, తిండి, బట్ట ఖర్చులు, చదువు పెళ్ళిళ్ల ఖర్చులు అపరిమితంగా పెరిగిపోయిన ఈరోజుల్లో రైతుకు 25, 30 ఎకరాల మంచి మాగాణి లేనిదే గడవదు. అరణంగా పసుపు కుంకం క్రింద తల్లిదండ్రులిచ్చిన భార్య స్త్రీధనాన్ని, భర్త ఆస్తిలో కలిపి పరిమితి విధించటం ఘోరం. మేజరు కుమార్లను ప్రత్యేకించటం, మైనరు కుమార్లకు దెబ్బ. అలాగే పెండ్లికాని మేజరు కూతుళ్లను మినహాయించటం కుటుంబానికి నష్టం. అసలు, భార్యా భర్తలను, మైనరు పిల్లలను ఒక యూనిట్‌గా పరిగణించి, ఆ యూనిట్ కింత భూముండాలని పరిమితి నిర్ణయించటం శుద్ధ తప్పు. పరిమితులకు మించిన భూములను లాక్కొని భూమిలేని హరిజనుల వంటి వారి కివ్వాలనటం కాకులనుగొట్టి గ్రద్దలకు వేసినట్లే గాక, పంచటానికి తలా 10 సెంట్లైన రాదు. ఇది నాగు యోగ్యంకాదు. శ్రమించి పండించే రైతులు వట్టిపోయిన పాల పశువు లవుతారు. పంట నాశన మౌతుంది. మరిన్ని, వేలకు వేలకు కొని, బాగుచేతకు డబ్బుమీద డబ్బు ఖర్చుపెట్టి, రాత్రింబగళ్లు కష్టపడి ఒళ్లు హూనం చేసుకొని అభివృద్ధి పరచుకొన్న భూమికి, దాని మార్కెట్టురేటులో ఇరవైవంతో, పాతికవంతో ఇస్తామనటం దొంగల దోపిడి.

నా వాదం, మదించిన భూస్వాము లుండాలని, తిండికి లేని బీదప్రజ లుండాలని కాదు. సుఖజీవనం చేస్తున్న రైతులను బికారులను జేసి వాళ్ల సంఖ్యతో దరిద్రుల జనాభాను పెంచవద్దని. నేను "సర్వేజనాః సుఖినోభవంతు" అను ధర్మసూత్రాన్ని మనసారా నమ్ముతాను. దీనజనులను సముద్ధరించటానికి ప్రభుత్వమే గాక ఉన్నవా రందరు తోడుపడాలని కోరుతాను. బంజరు భూములను, ఉపయోగంలో లేని పోరంబోకలను, డొంకలను, సాగుకు తెచ్చి బీదజనులకు తోడ్పడాలని, ధనవంతులు, పెద్ద భూస్వాములు సాయపడాలని తలుస్తాను. అయితే, పై జెప్పినట్లు కాకులనుగొట్టి గ్రద్దలకు వేయ వద్దని, సుఖజీవనం చేస్తున్న మధ్యరకం రైతులను బీదవాళ్లను చేసి, దేశం వెన్నెముకను విరుగ గొట్టవద్దని నా మనవి. దేశం సుభిక్షం కావాలని, భాగ్యవంతం కావాలని కోరుకొంటాం. బీదలకు వీలైనన్ని వసతుల నేర్పరచి, వారి సుఖజీవనానికి తోడ్పడాలిగాని, సుఖజీవనం చేస్తున్న వాళ్లను, తిండికి లేని వాళ్లనుగా చేయగూడదని నా ఆతురత. చదువు సంధ్య, పెళ్లి పేరంటం ఒనగూర్చ వలసిన ముగ్గురు నల్గురు బిడ్డల రైతులకు 25 లేక 30 ఎకరా లుండాలనటం, వారి సుఖజీవనం కొరకు మాత్రమే. భోగలాలసత్వం కొరకు కాదు.

## ౩

# పశుపోషణ

---

### పాడి పశువులు - పాలోత్పత్తి వగైరా

వ్యవసాయాని కుపకరించే ఎద్దులను కొనే ప్రయత్నం పైన చెప్పాను. మా తండ్రిగారికి చాలాకాలం కొన్ని బొబ్బిలి దున్నపోతులు, సంకర మాళీ దున్నపోతు లుండేవి కాని, మొదట మా వాడు కొన్న దున్నపోతుల జత మినహా, నా హయాంలో దున్నపోతుల వంకే చూడలేదు. రెండు మూడు జతల ఎడ్లను బయటనుండి కొన్నా, చాలవరకు మా ఆవుల సంతతే మాకు అక్కరకు వచ్చింది, వస్తున్నది. పాడి ఆవుల కొరకు, మద్రాసు సమీపం తిరువత్తియూరులో పెద్ద సంత వున్నదని తెలుసుకొని 1954 జనవరి మొదటి వారంలో అక్కడకు వెళ్లాను. అది వారం వారం జరిగే సంత కాదు. స్థిరస్థాయియైనది. సంవత్సరం పొడుగూతా వుంటుంది. ప్రతిరోజూ బేరసారాలు జరుగుచుంటవి. ఇక్కడ అన్నిజాతుల ఆవులు, గేదెలు అమ్మకానికి వుంటవి. పాశ్చాత్య దేశాల గోజాతి సంబంధం మిశ్రమ ఆవులుంటవి. ఒంగోలు ఆవులు, తూర్పు ఆవులు, దేశీయ ఆవులు వగైరా రకరకాల ఆవులుంటవి. అలాగే ముర్రాజాతి వని, నాగపూర్ వని, దేశివాళీ వని, కర్తీ రకాలు పలు విధాలైన గేదె లుంటవి. సంత నిత్యజీవనం కలదైనా, సంక్రాంతి సమయంలో మిక్కిలి జోరుగా నడుస్తుంది. జనవరి 12, 13 తారీఖులకు ఉద్ధృతం తగ్గటమేగాక, అదివర కున్న

పశువులు చాలావరకు అమ్ముడు పోతవి. నిజానికి పశువుల ఖామందుల కది సంవత్సరం ముగింపు. వాళ్ల ఆశయం, సంక్రాంతి పండుగరోజుకు వ్యాపారం పూర్తిచేసుకొని, స్వగ్రామాలకు వెళ్లాలని. వారక్కడ కుటుంబాలతో కాపుర ముండరు. మధ్య మధ్య ఇంటికి వెళ్లి వస్తూంటారు. అక్కడ వ్యాపారం చేసేవారు ఒక వూరివారని కాదు, ఒక జిల్లావారనికాదు. నలుప్రక్కల నుండి, పలు జిల్లాల నుండి వస్తారు. మద్రాసు నగరానికి ఉత్తరాన వున్న తెలుగు జిల్లాల వారిదే యించుమించుగా పూర్తి వ్యాపారం. అరవలు క్వచిత్తుగా ఉన్నా లెక్కలోకి రారు. ఉత్తర హిందూ స్థానం వారు ప్రత్యేకించి స్టాల్స్ పెట్టినట్లు లేరు. గుంటూరు నుండి ఒంగోలు ఆవులు, తూర్పుగోదావరి జిల్లా నుండి తూర్పు ఆవులు, విశాఖపట్నం ప్రాంతాల నుండి బొబ్బిలి సంబంధమైన గేదెలు, కృష్ణా, నెల్లూరు జిల్లాల నుండి ఆవులు, గేదెలు విరివిగా వుంటవి. ముర్రా, కల్తీ ముర్రాజాతి గేదెలను, ఇంచుమించు స్వచ్ఛంద విదేశీ ఆవులను, కల్తీ ఆవులను కొని అమ్మేది చాలావరకు నెల్లూరు, గుంటూరు, కృష్ణా జిల్లాల వారే. బెజవాడ నుండి కోసూరి కోటయ్య, శివారెడ్డి పెద్ద స్టాల్సును నిర్వహిస్తు పెద్ద వ్యాపారం చేయువారు. నేను సంత లేక మార్కెట్టు చుట్టూతా తిరిగి, యితర స్టాల్సును చూచి పశువులను ఎన్నుకొన్నాను గాని, నాకు సంబంధం ముఖ్యంగా కోసూరి కోటయ్యతోనే. నేను మొట్ట మొదట 1954 జనవరిలో కొన్న రెండు ఆవులలో, ఒకటి ఢిల్లీ అనగా హరియానా సంబంధం, రెండవది తూర్పు ఆవు సంబంధం కోటయ్య నుండే. మొదటిదానికి 500 రూపాయ లివ్వగా, రెండవ దానికి 400 రూపాయ లిచ్చాను. ఆ రెంటిని ఒంగోలు వరకు లారీ మీద, తర్వాత కాలినడకను పెదనగల్లు చేర్పించాను. రెండో సారి, ఒక ఇంగ్లీషు ఐర్షైర్ కల్తీ ఆవును 650 రూపాయలకు, తర్వాత ఒక ఒంగోలు ఆవును 450 రూపాయలకు కొన్నాను. ఈ రెండు ఆవులు కొంతకాలం ఒకదాని తర్వాత మరొకటి మా మద్రాసు షెనాయ్ నగర్ 61 నంబరు ఇంటి దొడ్డిలో వుండేవి. ఇవి ఎండిపోయినప్పుడు పొల్లి, ఈనేవరకు మేపుటకు 350 రూపాయలు, 250 రూపాయలు ఇచ్చే ఒప్పందంమీద మేపేవాళ్లకు

టంగుటూరు ప్రాంతానికి తోలిపెట్టాను. కర్రీ ఇంగ్లీషు ఆవు మొదటి పెయ్యదూడను కూడా ఆ విధంగా తోలిపెట్టాను. ఆ పెయ్య ఈని మద్రాసుకు తిరిగి వచ్చిన తర్వాత దానిని మాకు పాలుపోసే గొల్లవాని కమ్మివేశాను. తల్లిని, దాని కోడె దూడతో పెదసనగల్లుకు పంపాను. కోడె దూడ చిన్నదిగా తయారైంది. దాని నెవరికో అమ్మివేశాను. తల్లి కొంతకాలానికి చనిపోయింది. ఒంగోలు ఆవును కూడా ఈనిన తర్వాత దాని కోడె దూడతో ఇక్కడకు పంపాను. అదిక్కడ కొన్ని ఈతలు ఈనింది. దాని సంతతి కొంతవరకు నిలిచియున్నది. ఆదిలో ఇక్కడకు చేర్చిన ఢిల్లీ ఆవు కొంతకాలానికి జబ్బుచేసి చనిపోయింది. తల్లితో వచ్చిన దాని పెయ్యదూడ మొన్నమొన్నటివరకు జీవించియుండి కొన్ని దూడలను మా కిచ్చి ఈమధ్యనే చనిపోయింది. ఒంగోలు ఆవును కొంతకాలానికి అమ్మివేశాను. దాని సంతానం నిలిచి యున్నది. తూర్పు ఆవును పొట్టి ఆవు అనేవాళ్లం. ఈ పొట్టి ఆవు నొకప్పుడు చల్లపల్లి, వెటరినరి అసిస్టెంట్ సర్జన్, శ్రీ కనకమేడల వెంకట్రామయ్యగారు తెల్ల సింధీ అన్నారు. దాని చళ్లు మిక్కిలి పొడవుగా, లావుగా వుండేవి. పాల సేర్లు పెద్దవిగా, ప్రస్ఫుటముగా వుండేవి. కాని దాని కొక పెద్ద లోప ముండినది. గుత్తివంకాయల గుత్తివలె దాని చళ్లు ఒకదాని నొకటి ఒరుసుకొన్నట్లుండేవి. అందువల్ల అ దివ్వవలసినన్ని పాల నిచ్చేది కాదు. దాని కూతురు చనికట్టు మంచిది. దాని కీమధ్య హోల్‌స్టైయిన్ ఫ్రీజర్ కృత్రిమ సంపర్కం ఇప్పించాం. చక్కని పెయ్యదూడ పుట్టి వున్నది. ఈ జాతివి సంవత్సరంలోగానే ఎదకు వస్తవట. 1953 డెశంబరులో, మొట్టమొదట చల్లపల్లిలో నా వదినె కుమార్తె జగదాంబ వద్దనుండి కొన్న ఆవు పాడిగలదే. మావద్ద నాలుగైదు దూడలను పెట్టింది, చాలావరకు కోడెదూడలే. కాని, దానికి మెయ్యి దిగట మారంభించింది. దానిని మాన్పించటం మా వల్ల కాలేదు. అందువల్ల, అమ్మివేయవలసి వచ్చింది. ప్రప్రథమంలో (1953 డిశెంబరు) రావివారిపాలెం నుండి కొని

తెచ్చిన ఆవు, కోడెదూడల్లో కోడెదూడ అక్కరకు వచ్చి కొన్ని సంవత్సరాలు మాకు వ్యవసాయానికి తోడ్పడింది. అది పెద్ద జంతువు. దాని కొరకు కొన్న పెద్ద ఎద్దు అకాలంగా చనిపోగా, దీని నమ్మివేశాను. నా పెద్ద కోడలుకు కోడెదూడతో అరణంగా వచ్చిన ఆవు, మా చిన్న కోడలుకు అరణంగా వచ్చిన ఆవు నిలిచియున్నవి. వాని కోడె దూడలు అక్కరకు వచ్చినవి. కొన్ని కొన్నింటిని వదిలించగా. మిగిలిన విప్పుడు 5, 6 ఆవులు, 5, 6 పెయ్యలున్నవి.

గేదెలు విషయంలో, పశువుల వ్యాపారి కోసూరి కోటయ్యకు చెప్పగా, 1954 మార్చి మధ్య తూర్పుగోదావరి మండపేటనుండి పెయ్య దూడతో ఒక మంచిగేదెను కొని తెచ్చిపెట్టాడు. ఆ గేదెకైన ఖర్చులు, కమిషన్ 50 రూపాయలతో ఆయన కిచ్చింది 650 రూపాయలు మాత్రమే. ఇప్పుడైతే ఏ 1500 రూపాయలో ఉండేది. అది వెన్ను బారు గల పెద్దగేదె, పాలు బాగా యిచ్చేది. దాని సంతానం కొంతకు గొంత నిలిచి వున్నది. దానితో వచ్చిన పెయ్య దూడ మిక్కిలి ఉపయోగపడింది. మావద్ద 5, 6 ఈతలు ఈనుటయే గాక, పాలు బాగా యిచ్చేది. తర్వాత చెప్పవలసిన గేదెల కొనుగోళ్లు, గుంటూరు దగ్గర లాం ఫారమ్ నుండి. మొట్ట మొదటిసారి వెళ్లినప్పుడు, ఒక లేత గేదెను వేలంపాటలో కొన్నాను. లాం ఫారంవారు, ఇతర పశువుల ఫారమ్‌లలోవలెనే అప్పుడప్పుడు వారికి పనికిరావనుకున్న పశువులను వేలం ద్వారా అమ్మివేస్తారు. ఈసంగతి నేను విని ఆ మొదటి వేలంకు వెళ్లాను. నేను కొన దలచిన గేదెను, మంచిదని వారు, వీరు చెప్పగా కొన్నాను. దానిని, అక్కడ ఈ పనికై కాచుకొని యుండే వాళ్లతో మాట్లాడి, యింటికి తోలించాను. ఈ గేదెకు చాలా పోటీ వచ్చింది. అందులో ఒకరు ధర పెంచుతూ వచ్చాడు. నాకు కావాలను కొన్నదానిని ఇతరులకు పోనివ్వకుండా పోటీపడే స్వభావం నాది. అందువల్ల, హెచ్చు పాడి దానిని తెచ్చుకొన్నాను. ఇంకొక దఫా ఆ ఫారానికి వెళ్లాను. అప్పుడు పొల్లకానికిరాని

2, 3 సంవత్సరాల పడ్డను కొన్నాను. మొదట కొన్న పెద్ద పడ్డ కూతేరు నిలిచి యున్నది, ఉపయోగపడుచున్నది. రెండో పడ్డకు ఈనే ముందు, పెద్ద మెయ్యి వచ్చి, ఎంత ప్రయత్నించినా అదుపుకు రాలేదు. అందువల్ల దానిని హెచ్చుధరకే అమ్మివేశాను. పిమ్మట మా యింటి మంగలి నుండి ఒక పడ్డను, సమీప గ్రామం కూచిపూడి మాలపల్లి నుండి ఒక పడ్డను, అయ్యంకి నుండి ఒక పడ్డను, గుడ్లవల్లేరు నుండి ఒక గేదెను, బెజవాడ వద్ద కానూరు నుండి పెయ్యి దూడతో ఒక గేదెను, ఒక పడ్డను కొనటం జరిగింది. ఇప్పుడు 6, 7 గేదెలు; 7, 8 చిన్న పడ్డలు, దూడ లున్నవి.

లాం ఫారమ్‌కు నేను 1958-59 లో వెళ్లిన రెండు దఫాలు, నెల్లూరు జిల్లా బుచ్చిరెడ్డిపాలెం శ్రీ బెజవాడ రామచంద్రారెడ్డిగారి సన్నిహిత బంధువు, నాకు మిత్రుడుగా పరిణమించిన దొడ్ల సుందర రామిరెడ్డిగారి పినతండ్రి, నా కెక్కువ పరిచితులైన బారిష్టరు డి. యం. కె. రెడ్డిగారి అగ్ర సోదరుడు శ్రీ దొడ్ల లక్ష్మీనరసారెడ్డి గారు పశువుల కొనుగోలుకు వచ్చియుండినారు. మొదటి దఫా వారొక పెద్ద మాలీ గేదె (అనగా ముర్రాకట్టీ) ను కొన్నారు. ఈ గేదెను సమీపించటాని కక్కడి నౌకర్లు కూడా భయపడేవారు, అది మిక్కిలి పొగరుబోతు జంతువు. బుసలు కొడుతూండేది. దాని కప్పు డొక పాలు కుడిచే దూడ కూడా వుండింది. కాని, పాలు బాగా ఇచ్చేదిగా నాకు తోచలేదు. దానిని వేలం పెట్టగా, ఎవరో ఒక రిద్దరు మాదిగలు తప్ప కొనేవారు ముందుకు రాలేదు. రెడ్డిగారు దాని నితర పశువులతో కలిపికొని, బలమైన రెండు పశువుల మధ్య బలవంతంగా ఎక్కించి, లారీలో తీసుకొని వెళ్లారు. ఆ మొండి ధైర్యం ఆయనకే సరిపోయిందని నాకు తోచింది. రెండవ దఫా నేను వారిని కలుసుకొన్నప్పుడు అడుగగా చనిపోయిం దన్నారు. ఇక్కడొక విశేషం చెప్పాలి. వేలంపాటకు ఆతురతగా మాదిగలు వస్తారు. ఎందుకనగా బక్కచిక్కిన, వయస్సు మళ్లిన వానినే గాక ముదించిన గొడ్డుబోతు గేదెలను, దున్నలను చౌకగా

కొనాలని. ఎందుకు? కోసి మాంసం అమ్ముకోవటానికి. సాధారణంగా దున్నపోతులు తక్కువ ధరకు అమ్ముడు పోతవి. గుంటూరు జిల్లా తెనాలి తాలూకా కొల్లూరుకు పోయే త్రోవలో చిన్న రకం దున్నపోతుల బళ్లను చాలా వాటిని చూచానుగాని, లాం ఫారంలో వేలంకు వచ్చిన దున్నలలో చాలా భాగాన్ని మాదిగలే కొనే వాళ్లు. ఇప్పుడు గేదెలను ఇంచుమించుగా తొలగించి కావలి వద్ద చింతలదేవి ఆవుల ఫారంలోని పశువులను చాలావరకు లాం ఫారంకు మార్చారు. నేను గత సెప్టెంబరారంభంలో అమరావతికి వెళ్లుచు, దారిలో నుండిన లాం ఫారమును కారులో నుండి చూచాను. గొడ్డు సరిహద్దున వున్న ఆవరణలో మందలుగా పడి యుండిన ఆవులను చూచాను. అవి చిన్నవిగాను, బలహీనంగాను, ఉసూరుమను చున్నట్లుగా నున్నవి. అమరావతిలో విచారించగా ఆ ఫారం ఏ మంత అభివృద్ధిలో లేదన్నారు. వచ్చిన చిక్కేమి టంటే, గవర్నమెంటువారు ఏదో చెయ్యాలని కొంత ఖర్చుపెడతారు. ఆ పనిని ఏ ఆఫీసరుకో ఒప్పచెప్పుతారు. ఆ ఆఫీసరు తన లాభ సుఖాలను చూచుకుంటాడు గాని, తగిన శ్రద్ధ వహించడు, యజమాయిషీ తీసుకోనడు. 'యథారాజా తథాప్రజా' అన్నట్లు ఈ అలుసును సాకు చేసుకొని ఆయనక్రింద పనిచేసేవాళ్లు నిర్లక్ష్యం చేస్తారు. దీనివల్ల గవర్నమెంటు తలంచిన అభివృద్ధి జరుగదు, ఖర్చుపెట్టిన డబ్బు వృధా అవుతుంది. లాం ఫారమ్ విషయములో కూడా నా కంతే తోచింది.

నేను మద్రాసు నుండి మంచి ఆవులను తెచ్చానని లాం ఫారంలో మంచి గేదెలను కొన్నానని, పశువులను జాగ్రత్తగా మేపి మంచి అభివృద్ధి సాధిస్తున్నానని వాడుక పడింది. ఉయ్యూరులో వెటరినరి అసిస్టెంట్ సర్జన్ డా. సుబ్బారావు అనే వా రుండేవారు. వారు పశువైద్యములో దిట్ట అని, శ్రద్ధగా చికిత్స చేస్తారని, పశుగణాభివృద్ధికి మిక్కిలి ఉత్సాహంతో తోడ్పడుతా రని ప్రసిద్ధి కెక్కారు. వారి కెవరో నావిషయం చెప్పారట. నేను ఊరిలో లేనప్పుడొకసారి ఈదారిన పోవుచు, నాపశువులను చూచి పోయారట. వారు జిల్లా పశుగణాధికారి డా. మల్లాది కామేశ్వర

రావుగారికి చెప్పారు. వారు పశుగణాభివృద్ధిని చేయటంలో గొప్ప ఉత్సాహంతో కార్యదీక్ష వహించేవారు. వారొకనాడు వచ్చి నాతో మాట్లాడి, "బెజవాడలో పాలఫాక్టరీని స్థాపించే ప్రతిపాదన వున్నది. ప్రభుత్వంవారు పాల ప్రణాళికను తయారు చేస్తున్నారు. ప్రతిపాదన ప్రకారం విజయవాడను హైదరాబాదుతో కలిపి సంయుక్త ప్రణాళిక (ప్రాజెక్టు) నేర్పాటు చేస్తారు. ఆ పథకం (ప్లాన్) ప్రకారం గ్రామాల నుండి పాలను సేకరించి అక్కడక్కడ నెలకొల్పబడే శీతలకేంద్రాలలో శుద్ధిపరచి, శుద్ధిచేసిన పాలను విజయవాడ పట్టణంలోను, హైదరాబాద్ నగరంలోను అమ్ముతారు. మిగిలిన పాలను, బెజవాడలో స్థాపించబడే ఫాక్టరీలో పాలపొడి, పిల్లలకు పనికివచ్చే ఆహారాలను తయారు చేస్తారు. మీరు మంచి పశువులను పెంచుచున్నందుకు సంతోషం. మీరు ప్రోత్సహించి, ఇతరులు కూడా పెంచునట్లు చేయండి. కేంద్ర ప్రభుత్వోద్యోగులు వచ్చి విచారించి పోతారు. వారు సిఫారసుచేస్తే మనకు తప్పకుండా ప్రాజెక్టు వస్తుంది. మరిన్ని, యునెస్కో వారి నుండి మనకు పెద్ద ఎత్తున సహాకారంగ్రాంటు వస్తుం" దని చెప్పారు. ఇది 1958 లో.

నిజానికి, నాకు పశువులంటే చాలా యిష్టం. నేను ఉద్యోగములో నున్నప్పుడు కూడా, నేను మకాంచేస్తున్నచోటికి సమీపంలో ఎక్కడైనా పశువుల సంత జరుగుచున్నా, ఎవరివద్దనైనా మంచి పశువులున్నవన్నా వెళ్లి చూచేవాడను. నేను కాకినాడలో ఆఫీసరుగా వున్నప్పుడు పిఠాపురంసంతకు ఒకటి రెండు సార్లు వెళ్లిచూశాను. నేను నాందేడుకు తనిఖీకి వెళ్లినప్పుడు, అక్కడ బలిష్ఠమైన మధ్యరకంఎత్తు, కారుచీకటి నల్ల ఎద్దులను చూచి కొనాలని మోజుపడ్డాను. ఈరోడ్‌లో క్యాంపు చేస్తున్నప్పుడు, పాలెయుంపట్టిపాళేయంగారి పశువుల దొడ్లకు వెళ్లి, వారు పెంచే కాంగేయం జాతి ఎడ్లను చూచి మోజు పడ్డాను. బళ్లారికి మకాం వెళ్లినప్పుడు హోసూరు పశువుల ఫారానికి వెళ్లి అక్కడ పెంచబడు హల్లికర్, అమృతమహాల్ వంటి మైసూరు ఎడ్ల రకాలను, ఇంగ్లండు నుంచి దిగుమతి చేసుకొన్న ఒక పెద్ద ఐర్‌షైర్ గిత్తను చూచి సంతోషించాను.

నేను 1953 జూన్ మాసాంతానికి ఉద్యోగ విరమణచేసి నప్పుడు, నా ఆక్స్‌ఫర్డ్ సమకాలికుడు, మా కాలేజివిద్యార్థి మేజర్ టి. మురారి గారు, పశుగణాభివృద్ధి శాఖకు డైరెక్టరుగా ఉండి నారు. వారిని, వారి డిప్యూటి డైరెక్టర్లు శ్రీ షిరాజి, శ్రీ కృష్ణా రావు గార్లను కలసికొన్నాను. అప్పటినుండి, అనగా 1953 నుండి, నాకు పశుగణాభివృద్ధి శాఖతో సంబంధం కలిగి, ఇప్పటికిని కొనసాగుచున్నది. శ్రీ మేజర్ మురారి గారితో ఒకరో జంటా, 1955 సెప్టెంబరులో బాపట్లలో జరిగిన యావదాంధ్ర దేశ ప్రదర్శనానికి వారు వచ్చినప్పుడు గడపాను. అంతకు ముందే 1954 డిశెంబరులో ఆబోతుల ప్రస్తావన వచ్చి, "మా యూరిలో అంతమంచి ఆబోతు లేదు, ప్రభుత్వం వా రాచరణలోకి దెచ్చిన స్కీము క్రింద ఒక మంచి ఆబోతును, ఒక మంచి విత్తనపు దున్న పోతును ఇవ్వం"డని కోరాను. "ప్రస్తుతాని కిచ్చే మంచి ఆబోతు లేదు, అయితే, ఘంటసాల వారి కొక దాని నిచ్చాము, వారు దానిని సరిగా పోషించటంలేదట, మీరు వెళ్లి ఆ ఆబోతును చూడండి, మీకు నచ్చితే, దానిని మీకు ట్రాన్సఫర్ చేయించుతా" నని చెప్పారు. నేను, మరిద్దరు కలసి వెళ్లి చూచాం. అది బలహీనంగా ఉండటమేగాక, ఇతరంగా కూడా మాకు నచ్చలేదు. విత్తనపు దున్నపోతు నొకటి నిచ్చారు. ఆ స్కీము ప్రకారం, దాని నుచితంగా ఇవ్వటమే గాక దాని పోషణకు 3 సంవత్సరాల వరకు, సంవత్సరమున కింత అని గ్రాంటు యిచ్చేపద్ధతి. ఈ విత్తనం వానిని, ప్రత్యేక శ్రద్ధవహించి పోషించితే తప్ప అవి పూర్తిగా ఉపకరించవు. ప్రత్యేకశ్రద్ధ వహించటం నావల్లకాదని, ఈ యూరి గ్రామస్థుడు, బంధువర్గములో చేరినవాడు సూరపనేని వీరయ్యగారి కుమారుడు లక్ష్మీనరసింహారావుకు ఆ విత్తనపు ముర్రాజాతి దున్నను ఒప్ప జెప్పాను. అసలు లక్ష్మీనరసింహారావుకు దున్నల పోషణలో కొంత అనుభవ ముండింది. 1955-56 సంవత్సరాలకు ముందే, ఈ యూరిలో మొట్టమొదట ముర్రాజాతి విత్తనపు దున్నలను తీసుకొని వచ్చి, పోషించి, ఉపయోగించుకొన్నవారు ఆయన

కుటుంబంవారే. ఈయన పినతండ్రి బ్రహ్మయ్యగారు, వారి మేనల్లుడు పొట్లూరి వెంకటప్పయ్యగారు ఏక కుటుంబముగా వున్నప్పుడు, ఒకటికి రెండు దున్నలను ఒకదానివెంట మరొక దానిని కొని జెర్సీ గేదెల మీద పారించేవారు. ఆ అనుభవం నరసింహారావు కుపయోగపడుతుం దని, అత డుత్సాహంతో నేను తెప్పించిన దున్నను ఉపయోగపరుస్తా డని దున్న నివ్వటం, గ్రాంటు నివ్వటం అంతా నాపేరనే అయినా, అవన్నీ అతనికే వదలివేశాను. మొదటిదాని తర్వాత, తిరిగి నేను కోరనూ లేదు, ఇంకొక దున్న రానూ లేదు.

1958–వ సంవత్సరం ఆగష్టులో జిల్లా పశువుల ఆఫీసరు డాక్టరు మల్లాది కామేశ్వరరావు గారి నుండి జాబు వచ్చింది. "మనము కొందరం పశు పోషకుల సంఘం స్థాపిద్దాం, మీటింగు ఫలానా తే దని, మీరు, మెంబర్లుగా ఉండుట కంగీకరించు వారిని కొంతమందిని తీసుకురండి, బెజవాడలో మా ఆఫీసులో మీటింగు, ఇన్ని గంటలకు సమావేశం" అని తెలిపారు. ఇంకెవరైనా నాతో వచ్చారేమో గుర్తులేదుగాని, నరసింహారావును వెంటబెట్టుకొని సమావేశానికి వెళ్లాను. జిల్లా నలుప్రక్కల నుండి 25, 30 మందైనా హాజరైనారు. సమావేశంలో 'కృష్ణాజిల్లా పశు పోషకుల సంఘం' అని పేరుపెట్టి ఒక సంస్థను స్థాపించాం. ముత్యాల రాజావారు రాలేదు గాని, వారిని ప్రెసిడెంటుగాను, నేను వైస్‌ప్రెసిడెంటుగాను, శ్రీ పర్వతనేని వెంకటరత్నంగారు కార్యదర్శిగాను, శ్రీ ఈడ్పుగంటి బాలవీరరాఘవయ్య గారు కోశాధి పతిగాను ఎన్నుకొనబడినాము. పశు పోషణలో ప్రముఖులు శ్రీ కాట్రగడ్డ భవానీశంకరంగారి వంటి వారు కార్యనిర్వాహక వర్గ సభ్యులుగా ఎన్నికైనారు. కొలదిరోజులకు, ఢిల్లీనుండి "కేంద్ర పశు శాఖ అధికారి, గవర్నమెంటు సలహాదారు యల్. సిక్కా అనేవారు ఈ పాలపథకం విజయవాడలో ఎంతవరకు సఫలీకృత మౌతుందో తెలుసుకొనటానికి వస్తున్నారు, వారు కొన్ని గ్రామాలకు వెళ్లి పాడిపశువుల సంగతి తెలుసుకొంటారు, అందులో మీ పెదసనగల్లుగ్రామం ఒకటిగా ఎన్నికచేశాం,

సిక్కా గారిని ఫలానప్పుడు వెంటబెట్టుకొని వస్తాం, మీరు సర్వసిద్ధం చేయండ''ని శ్రీ కామేశ్వరరావుగారు తెల్పారు. నేను వారికీ, వీరికీ చెప్పి ప్రోత్సాహపరచాను. నిజానికి అప్పుడీ వూరిలో పూర్తి ముర్రాజాతివి కొంచెం మాత్రమే యున్నా, క్రాస్ సంబంధమైనవి కొన్ని మంచి గేదెలే వున్నవి. నావద్ద అచ్చమైన ముర్రాజాతివి యుండలేదుగాని, మధ్యరకం క్రాస్‌వి రెండు మూడు మంచివే యుండినవి. గేదెలను అభిమానంతో పెంచుచుండిన శ్రీ సూరపనేని శ్రీరామదాసు, శ్రీ సూరపనేని చలమయ్య, శ్రీ సూరపనేని మస్తాన్ మధుసూదనరావు, శ్రీ కొల్లి వెంకటాద్రి మొదలైన వారి వద్ద మేలైన పశువులుగా కన్పడేవి జాస్తిగానే ఉండినవి. సిక్కా గారు వచ్చేటప్పటికి 30, 40 మంచి గేదెలను ఈ యూరి చివర, ఆయన వచ్చే త్రోవలో, చెరువుగట్టు వద్దనున్న హైస్కూలు ఆవరణలో చేర్చాం. వారు రావటం కొంత ఆలస్యమైనందున వాని నన్నిటినీ, సమీపంలో వున్న చెరువులోకి త్రోలి కడిగించాం. వారు వచ్చి రావటంతోనే ఒంటినుండి జారుచున్న నీటిబొట్లతో నిగనిగలాడుతూ గేదెలు వచ్చి పడ్డాయి. సిక్కా గారు మనస్సు ఉప్పొంగినదో అన్నట్లు ఉత్సాహవంతులై, బాగున్నవని మెచ్చుకొన్నారు. మేము వారిని ఆహ్వానించి పూలమాలలు వేసి, వినతిపత్రము వంటి నొకదానిని నేనే సమర్పించాను. నే నింగ్లండులో చదువుకొని పెద్ద ఉద్యోగం చేశానని, ప్రక్కనున్నవారు చెప్పారు. అది మరీ మంచిదైంది. ''మీరు విద్యాధికులు, ఉద్యోగము చేసినవారు, ఈ పశువుల వృద్ధి విషయంలో మిక్కిలి శ్రద్ధవహించటం సంతోషదాయక'' మని అన్నారు. తర్వాత, వారు సమీపములో వున్న భట్లపెనుమర్రు, గుడ్లవల్లేరు మొదలైన గ్రామాలకు వెళ్ళి చూచి, మిక్కిలి తృప్తి పడి ఈ ప్రాంతంలో, 25 గ్రామాల కొకటి చొప్పున పాల ఫాక్టరీని స్థాపించ వచ్చునని అన్నారట. ఆ విధంగా, బెజవాడలో స్థాపింప బడదలచుకొన్న పాలపథకానికి గట్టి పునాదులు వేసిన గ్రామాలలో, పెదసనగల్లు ఒకటి.

ఇండియా ప్రభుత్వం, దేశంలో పాల ఉత్పత్తి చాలా తక్కువగా వున్నది, పెరుగుచుండిన పిల్లలకేగాక, పెద్దలకు కూడా కావలసిన పాలలో పదవ వంతైనా నారికి అందటంలేదు, దేశంలో పశువులు చాలా వున్నా అవి సగటున ఇచ్చేపాలు చెప్ప రానంత తక్కువ, విదేశీయుల పాల ఉత్పత్తి, దాని వాడుకలతో సరిపోలిస్తే మన దేశం అధోగతిలో కున్నట్లు తెలుస్తుంది, కాబట్టి దేశములో పశువులను అభివృద్ధి పరచి అవి పాలను ఎక్కువగా ఇచ్చునట్లు చేయాలి, దీనివల్ల రెండు లాభాలు కలుగుతవి, పిల్లలకు, పెద్దలకు పోషక పదార్థాలలో ముఖ్యమైన పాలు తగినన్ని దొరుకుతవి, రెండోది చిన్న కారు రైతులు, సామాన్య కుటుం బీకులు ఒకటో రెండో మంచి పాడిగేదెలను పెంచుకొని, తమ ఉపయోగానికిపోను మిగిలిన పాలను అమ్ముకోవటం వల్ల అదనపు ఆదాయాన్ని పొందవచ్చును, ఈ రెండు లక్ష్యాలతో ప్రతిగ్రామం లోను ముర్రాజాతివంటి మేలైన విత్తనం దున్నలచేత దేశీయ గేదెలను పొల్లించితే. పుట్టిన దూడల ద్వారా గేదెల జాతి పై మెట్టు కెక్కి (అప్ గ్రేడ్ అయి) క్రమేపి జాతి మేలుజాతిగా అభివృద్ధిపొందుతుంది, తద్వారా పాల ఉత్పత్తి పెరుగుతుంది అను లక్ష్యాలతో దేశాని కంతటికి మొదటి తొమ్మిది పథకాలను (కేంద్రప్రభుత్వం) వారు నిర్ణయించారు. అందులో రెంటిని ఆంధ్రప్రదేశ్ లో ప్రవేశపెట్టా లను కొన్నారు. గ్రామంలో మిగిలిన పాలను పాలోత్పత్తిదారు లమ్ము కొనుటకు ప్రతి గ్రామంలో పాలసేకరణ కేంద్రాన్ని స్థాపించి, సరసమైన ధరలకు పాలను కొనా లని రాష్ట్రప్రభుత్వం తలపెట్టింది. ఆ ప్రకారం గ్రామ కొనుగోలు డిపోలు ఏర్పాటైనవి.

ప్రభుత్వం, పాలపథకాలను స్థాపించాలనే ఉద్దేశానికి, ఐక్యరాజ్యసమితి అనుబంధాలలో నొకటగు యునెస్కో వారి ఆహారం, శిశుపోషణ వగైరా శాఖ ఆధ్వర్యాన చాలా పెద్ద విరాళంతో సహాయం చేయదలచు కొన్నది. ప్రథమ ప్రాజెక్టుకు గాను మెషీనరీ వగైరాల రూపంగా 40 లక్షల గ్రాంటును యివ్వవలచుకొన్నది. ఈ లాభాన్ని పొంది విజయవాడ వంటి కేంద్ర ప్రదేశములో పథకాన్ని సఫలీకృతం చేయాలని మన వారి

ఆశ, వాంఛ. ఆ సందర్భంగా, పైవారికి నచ్చచెప్పటానికి కృష్ణాజిల్లా పశుపోషకుల సంఘం స్థాపించటం జరిగింది.

పాల నుత్పత్తిచేసే తెలుగు జిల్లాలలో, ఇప్పటికి కూడా కృష్ణాజిల్లాదే పైచేయి. పైగా, విజయవాడ రైల్వేకూడలియే గాక, జీవనది యగు కృష్ణాతీరమున వున్నది. ఆంధ్రులకు గుండెకాయవంటిది. ఈ కారణాలవల్ల విజయవాడలో పాల ఫాక్టరీని స్థాపించటానికి అవకాశము ఎక్కువగానే వుండింది. గట్టిగా ప్రయత్నిస్తే పాలపథకం తప్పకుండా మనకు వస్తుందన్న నమ్మకంతో పశుపోషకుల సంఘాన్ని స్థాపించాం. దానిని విస్తృతపరచి, గట్టి పునాదులమీద స్థిరపరచి, అనువైన స్థలాన్ని సేకరించి, మంచి బిల్డింగులు కట్టాలని, మంచి ముర్రాజాతి గేదెలను ఉత్తరాది నుండి కొని, ఖరీదులో ముందు కొంత యిచ్చి శేషాన్ని వాయిదాల మీద తీర్చుకొనే పద్ధతిని పాలోత్పత్తిదారులకు వాని నివ్వాలని తలంచాం. పశువులను కొనటానికి, కట్టడం మొదలైనవాటికి కొంత మూలధనం సేకరించాలని, పశువులకు కావలసిన రకరకాల దాణా అనగా తవుడు, వేరుశనగపిండి, నువ్వులచెక్క, శనగపొట్టు, బెల్లంమడ్డి వగైరా సేకరించి, పశుపోషకులకు లాభం లేకుండా అమ్మాలని ఉద్దేశించాం. ఈ సంఘానికి తగిన ప్రణాళిక (కాన్‌స్టిట్యూషన్) ను తయారు చేయుటకు మొదలుపెట్టాం.

ముఖ్యులైనవారుగా వ్యవహరించేవారిలో ఒకడనైన నేను, నరసింహారావు సహాయంతో సంఘానికి సభ్యులను చేర్చటానికి ప్రయత్నించి, ఒక 25 మందిని చేర్పించ గలిగాం. సంవత్సరం చందా 5 రూపాయలు మాత్రమే అయినా పల్లెటూళ్లలో, ముఖ్యంగా ఈ యూరిలో గుప్పిలి బిగించే స్వభావ మెక్కువ. ఎవరైనా మంచి పని చేయదలిస్తే, వారే చేస్తారులే అన్న అవివేకం తప్ప, ఆ సత్కార్యానికి తోడుపడి, లాభం పొందుదామనే తెలివితేటలు తక్కువ. ఈ మనఃస్థితి ప్రబలంగానే వున్నందున, ఒక పెద్ద ఆసామి, "నా పేరు ఎందుకులే, నా కొడుకు పేరు చేర్పించం" డని చెప్పి, రసీదు వ్రాసియుంచినా ఈ స్వల్పమొత్తం 5 రూపాయలు యివ్వనేలేదు. మేము ప్రోగుచేసిన చందా స్వల్పమొత్తంగావున్న

దని చందా గాక, కొంత మొత్తం నేను కలిపి ఇచ్చాను. రెండో సంవత్సరం చందా లిచ్చినట్లు లేదు. నేనే కొంతో, గొప్పో యిచ్చాను. సంఘం కొంత అభివృద్ధిని పొందింది. ఈ యూరి వారి సభ్యుల సంఖ్య పెరుగకపోయినా యితర గ్రామాలవారు, అదివరకు కొంతమంది వచ్చియుండిన గ్రామాల వారు కొంచెం ఎక్కువగానే చేరారు. మేము తలంచిన ఆశయాలు అనగా పశువులను బైటినుండి తెప్పించుట, దాణాలను సేకరించుట, వానిని పాల ఉత్పత్తి దారులకు సరఫరాచేయుట చప్పున ఆచరణలోనికి వచ్చేవికావని తోచినా ముందు స్థలం, బిల్డింగు విషయమై కొంత శ్రద్ధ వహించాము. స్థలం కొరకు ఒకప్పుడు బెజవాడ–బందరు రోడ్డు మీది, పశువుల ఆస్పత్రి ఆవరణలో ఒక భాగం పనికి వస్తుందా అని వెళ్లి చూచాం. ఆ మూల స్థలం ఇరుకుగా వుంటుం దని తలచి వేరొక చోట విశాలమైన దానిని ఎంచుకొందా మని నిర్ణయించుకొన్నాం. "బిల్డింగు ఫండును ప్రోగు చేద్దాం, వెంటనే నేను కొంత విరాళమిస్తా"నని చెప్పాను. "సరే, పదిమందితో విచారించి లిస్టు తయారు చేద్దా" మన్నారు. అంతటితో అది ఆగి పోయింది. తర్వాత పాలపథకం అమలులోకి వచ్చింది. ఇంతలో, "నాకు సుస్తీగా వున్నది, నేను కార్యదర్శి పదవిని నిర్వహించలేను, బాగా చదువుకొని కొన్ని సంగతులు తెలుసుకొన్న నా పెద్ద కుమా రుడు శివరామకృష్ణప్రసాదు నా స్థానే కార్యదర్శిగా ఉంటా"డని పర్వతనేని వెంకటరత్నంగారు తప్పుకొన్నారు. 1965 లో విజయ వాడలో పాలప్రాజెక్టుకు ప్రారంభోత్సవం జరిగినప్పుడు, ఇంకొకటి రెండు సార్లు, శ్రీ ముత్యాలరాజాగారు (శ్రీ) వాసిరెడ్డి రామ గోపాల కృష్ణ మహేశ్వర ప్రసాదుగారు ప్రాధాన్యం వహించారు గాని, సామాన్య సమావేశాలలో ఎప్పుడో ఒకప్పుడు తప్ప పాల్గొన్నట్లు గుర్తులేదు. స్వంతపనులలో నిమగ్నత మొదలైన కారణాలచేత, క్రొత్త కార్యదర్శి ఏమాత్రం శ్రద్ధతీసుకొనక, ఆయన సమావేశపరచిన ఒకటి రెండు మీటింగులలో బాధ్యతాయుతంగా వర్తించక, ఈ పశు పోషకుల సంఘాన్ని పూర్తిగా క్షీణింపజేశాడు. ఫలానా క్రైముకు

బెజవాడ పశువుల ఆస్పత్రి ఆవరణలో సమావేశం జరుగుతుందని అతనిపేర కార్డు వచ్చింది. నేను శ్రమపడి బస్సులో ప్రయాణం చేసి మధ్యాహ్నం ఏ 3½, 4 గంటలకో అక్కడకు చేరాను. సాయంత్రం 6 గంటల వరకు, ఎక్కువగానే వచ్చినవారు, నేను కాచుకొని యుంటిమి గాని, క్రొత్త శక్రటరి రానేలేదు. వెళ్ళిన వాళ్ళం వెళ్ళినట్లుగానే వెళ్ళిపోయాం. ఇట్టి నిర్లక్ష్యంవల్ల, ఆ సంఘ మింకా బ్రతికియున్నదా అన్న సందేహం కల్గుచున్నది.

1964 చివరి భాగంలో ఒకనా డుదయం బెజవాడలో పశువుల డిప్యూటి డైరెక్టరు, పాల అసిస్టెంటు కమిషనర్ పదవులను విజయవాడలో నిర్వహించుచున్న డాక్టర్ డి. సంజీవ రెడ్డిగారు, హైదరాబాదులో హెడ్ క్వార్టర్సు డిప్యూటి డైరెక్టరుగా వుంటున్న డా. మిరాజ్ గారు, జిల్లా పశువుల ఆఫీసరు డా. మల్లాది కామేశ్వరరావుగారు, వారి ఇద్దరు ముగ్గురు అసిస్టెంటులు మా యింటికి వచ్చారు. "పాలపథకం అమలు లోకి వస్తున్నది, దాని సంబంధంగా పశుగణాభివృద్ధి కేంద్రాలను ప్రతి గ్రామంలోను పెట్టాలి, వానితోబాటు ప్రతి గ్రామంలోను పాల సేకరణ డిపోలను పెట్టాలి, మీరు ముందుకు వచ్చి ఈ గ్రామంలో పశువుల ఆస్పత్రి నొకదానిని నిర్మించాలి" అని కోరారు. "మేము పైపు బిల్డింగు ప్లానును తయారుచేశాం, ఆ బిల్డింగు 12 వేలకు తయారవుతుంది. స్థలాన్ని పంచాయతీ వారివ్వా"లని చెప్పారు. అప్పుడు నేను ఈ గ్రామ సర్పంచి శ్రీ సూరపనేని తారక బ్రహ్మానందంను, శ్రీ లింగంనేని పున్నయ్య, శ్రీ సూరపనేని వెంకట కృష్ణయ్య, శ్రీ కొల్లి వెంకటాద్రి మొదలైన గ్రామ పెద్దలను పదిమందిని పిలచి, సంప్రదింపులు సాగించాను. సర్పంచ్ శ్రీ తారక బ్రహ్మానందం, "ఊరికి తూర్పుప్రక్కన లైబ్రరీకి, రాముని గుడికి మధ్య స్థల మున్నది, మరిన్ని చెరువు కెదురుగా పెద్ద స్థల మున్నది ఏది అనుకూల మనుకొంటే దానిని పంచాయతీ యిస్తుంది" అని హామీ యిచ్చాడు. నే నందుకొని, "బిల్డింగుకు ఖర్చు 12 వే లవుతుం దన్నారు కదా, 2 వంతులు అనగా 8 వేలు నే నిస్తాను, మిగిలిన 3-వ వంతు నాల్గువేల రూపాయలు గ్రామస్థు

లివ్వవలసి వుంటుం''దని చెప్పాను. అక్కడ చేరిన పెద్దలు దానికి సమ్మతించా రని నే ననుకొన్నాను. నాకు చప్పున జ్ఞప్తికి వచ్చి, ''ఎక్కువభాగం ఖర్చును నేను భరిస్తున్నా నుకదా, కాబట్టి అకాల మరణం చెందిన బుద్ధిమంతుడు నా పెద్ద కొడుకు పూర్ణచంద్రరావు పేర ఆస్పత్రిని కడదా''మన్నాను. 'సరే' అని ఆఫీసరు, గ్రామ పెద్దలు అంగీకరించారు. తర్వాత కొంతమందిమి వెళ్లి ఆ స్థలాలను చూచాం. రాముని గుడి, లైబ్రరీల మధ్యా స్థలం చాల దనిపించింది. మురుగు గుంటగా తయారై ఉండిన చెరువు కెదురు స్థలం పొడవుగా, తగినంత వెడల్పుతో విశాలంగా ఉన్నది. ''గుంటను పూడ్చుకోవచ్చును, పూడ్చే ఖర్చును కూడా నేను పెట్టుకుంటాను, దీనినే ఏర్పరచుకుందాం'' అని చెప్పాను. అక్కడకు నాతో వచ్చిన వా రందరు ఈ స్థలమే అనుకూల మని అంగీకరించారు. తర్వాత వచ్చిన 1965 వేసవిలో కిరాయి బండ్లచేత చెర్వుప్రక్క మట్టిదిబ్బ లుండినందున వానిని త్రవ్వించి గోయి పూడ్పించాం. ఆ పూడికకు 2,200 రూపాయలు పైచిల్లు అయింది. 60 సెంట్లు వరకు స్థలం ఉంటుం దనుకొన్నాం. పూడ్చే ముందు డా. సంజీవరెడ్డిగారు, డా. కామేశ్వరరావుగారు వచ్చి చూచి వెళ్లారు. తరువాత భవనం కట్టట మారంభించాం. తాపీ మేస్త్రి దురాశాపరుడవటంవల్ల, పనివాళ్లు సరిగా పనిచేయక పోవటంచేతను కట్టడం 1966 మార్చి మాసాంతానికిగాని పూర్తి కాలేదు. తాపీ పనివారిలో ఒక దుర్గుణమున్నది. వారొక బిల్డింగును ఒప్పుకొని దానిని పూర్తిచేసి మరొక బిల్డింగును ఒప్పుకోరు ఏక కాలమందు 3, 4 బిల్డింగులను వెంటనే ప్రారంభిస్తా మని ఒప్పుకొని కొన్నిరోజు లక్కడ, కొన్నిరోజు లిక్కడ పనిచేసి ఏ బిల్డింగును సకాలములో పూర్తిచేయరు. మరిన్ని మా పని ఒప్పుకొన్న మేస్త్రి పొరుగూళ్లలో కూడా పని ఒప్పుకున్నాడట. దానివల్ల, 5, 6 మాసాలలో పూర్తికావలసినపని, సంవత్సరానికి గాని పూర్తి కాలేదు. పని నెమ్మదిగా సాగి కాలహరణం అగుటవల్ల కొంత వృథా ఖర్చైనది. పైగా, డాబాపైన వేసిన సిమెంటు కంకర స్లాబుపైన వేయవలసిన పాలాస్త్రి పెంకు వేసి, గచ్చుచేయవలసిన పని పూర్తిగా చేయనందున తిరిగి దానిని చేయించవలసి వచ్చినది.

ఇవిగాక పరంజాకు పోటీ పెట్టుట కని అడితీనుండి అద్దెకు తెచ్చిన సరుకు బాదులను సకాలములో అడితీకి తిరిగి ఇవ్వైవందున దాని అద్దె 4 వందల రూపాయ లని మేస్త్రి వచ్చి అడిగాడు. చివరకు 300 రూపాయలు ఆ బాదులకు శ్రీ తారక బ్రహ్మానందం మధ్యవర్తిగా పరిష్కరించాను. నిజానికి, ఏ 25 రూపాయలో, 30 రూపాయలో మాత్రమే ఇవ్వవలసిన దానికి 300 రూపాయలు ఇవ్వవలసి వచ్చింది. గోతులను పూడ్చి, బిల్డింగు కట్టటానికి నాకు ఖర్చు 14 వేల రూపాయలకు తక్కువ గాకుండా అయింది. ప్రహారీ కట్టవలసిన విషయంలో నా యందు మిక్కలి అభిమానం గల వ్యక్తులు విరాళంగా యిచ్చిన డబ్బు సుమారు 1500 రూపాయలు ఉండినది. కాంపౌండును, సిమెంటు స్తంభాల్లో అమర్చిన ముళ్ల ఇనుప తీగతో నిర్మించాం. ముఖద్వారం (గేటు) స్తంభాలు పెద్దవిగా, గట్టివిగా కట్టించటం వల్లను, వాని కమర్చిన ఇనుప గేటు దృఢమైన పెద్దది అగుటచేతను ఈ ప్రహారీ ఖర్చు 3 వేలయింది. కాబట్టి నా చేతి డబ్బు 1500 రూపాయల వరకైనా పడింది. మొత్తంమీద నేను పెట్టిన ఖర్చు 15½ వేలైనా అయి వుంటుంది. నా దగ్గర బంధువులే, నాకు కావలసినవారే ఏ విరాళ మివ్వలేదు. దానికి కారణ మేమని విచారించగా, పార్టీ తత్త్వమని తెలిసింది. ఈ యూరిలో చాలా కాలంనుండి గ్రామస్థులు రెండు ముఠాలుగా వ్యవహరిస్తున్నారు. ఒక ముఠాకు నేను ఎక్కువ అభిమాని నని, అందువల్ల నేను ఆ ముఠాకు చెందిన వాడ నని, కాబట్టి రెండవ ముఠా వారు సహకరించకూడ దని నిర్ణయించుకొని ఏ విరాళ మివ్వలేదు. ఈ పశువుల ఆస్పత్రి గ్రామస్థు లందరికీ ఉపయోగ మని, ఎవరు కట్టించినా, అందరూ తలా ఒక చేయి వేసి సాయపడా లని ఈ బుద్ధిమంతులకు తోచ లేదు. పైగా సాకు దొరికిందే చాలని, తమ చేతి డబ్బు దమ్మిడీ ఖర్చుగాకుండా పని జరిగిపోవుచున్నదని, తీరా ఆస్పత్రి కట్టిన తర్వాత మన పశువులను మాత్రం చూడరా అనే దిలాసాలో ఈ విధంగా నడిచా రని నాకు తోస్తున్నది.

ఆ పెద్ద గోతిని పూడ్చటానికి దగ్గ రుండి పనిచేయించిన వారు శ్రీ కొల్లి వెంకటాద్రిగారు. శ్రీ తారక బ్రహ్మానందం కూడా

మిక్కిలి శ్రద్ధ తీసుకొన్నారు. గోతిని పూడ్చటంలోనేగాక బిల్డింగు నారంభించటంలోను, కట్టటంలోను వారి అజమాయిషీ వుండినది. చివరివరకు అంత శ్రద్ధ వహించ లేకపోయినా, మొత్తం మీద వారి శ్రద్ధయే స్థలము, బిల్డింగు తయారగుటకు చాలా తోడ్పడింది. నిజానికి, డబ్బు వారి చేతి కివ్వటం, వారు ఖర్చు పెట్టటం జరిగింది గాని, నా అంతట నేను ఆ బాధ్యత వహించ లేదు, అప్పు డప్పుడు వెళ్లి చూడటం తప్ప. వయస్సు మళ్లిన వాడ నగుటచేత, దగ్గరుండి పని చేయించ లేకపోయాను.

ప్రహారీని నిర్మించునప్పుడు, పూడ్చిన స్థల మంతా గాక కొంతభాగం విడిచిపెట్టి ప్రహారీ నేర్పాటుచేయా లని మావాళ్లు కొంతమంది గట్టిగా అభిప్రాయపడ్డారు. "మరి, డబ్బు నాచేత ఎందుకు ఖర్చు చేయించారు, 'ఇదే మన్యాయ?'" మనగా, "మే మేర్పరచిన సరిహద్దులు చతుర్భుజం సమానంగా వుండే, ప్లాటు చక్కగా ఏర్పరచినట్లున్నది. తతిమ్మాది కూడా విడిచిపెట్టం. తర్వాత దీనిని ప్రత్యేకంగా, ఇంకొక ఆవరణ చేద్దాం" అన్నారు. సమచతురస్రాకారంగా నేర్పాటు చేసిన ప్రహారీ నానుకొని ఆ స్థలానికి పడమర భాగంలో రెండి ళ్లుండినవి. దాని వెనుక 1, 2 దొడ్లు వున్నవి. ఆ దొడ్లకు, తూర్పునుండి బండ్ల రాకపోకలకు తగినంత విశాలమైన బజారు నేర్పరచాం. ఈ బజారు మొదటి యింటి మీదుగా, యింకొక యింటిని దాటి, హైస్కూలు ఆవరణకు తూర్పు సరిహద్దు నానుకొని మాదిగగూడెం పోయే రోడ్డున్నది. అందువల్ల ఆస్పత్రి ఆవరణకు ఎదురుగా వున్న అయ్యంకికి పోయే కంకరరోడ్డు నుండి, ఆస్పత్రికి వెనుక నున్న దొడ్లకు పోవుటకు మే మేర్పరచిన బజారు అనుకూలంగా ఉండినది. ఈ ఆస్పత్రి ప్రహారీ నానుకొని యున్న మొదటి యింటికి, దాని ప్రక్కనున్న మరొక యింటికి తగినంత ప్రాంగణం ఏర్పడింది. కాబట్టి ఈ ప్రాంగణంతో కలసిన బజారు, పై జెప్పిన మాదిగగూడెం పోయే రోడ్డుతో కలవటం వల్ల రెండో యింటి నానుకొని వున్న రెండో వాముల దొడ్డి కే మాత్రం ఆటంక ముండదు. పోతే, రెండో యింటి యజమాని, ఈ సరిహద్దును దాటి, పెడసనగల్లు నుండి అయ్యంకికి పోయే కంకరరోడ్డు వరకు ఆక్రమించుకొని. కొంత

భాగం పశువులశాలగాను, కొంతభాగం పెంటప్రోగు పోసుకొనుటకు ఉపయోగించుకొనుచుండినాడు. అతడు మెరక చేసి పశువులశాల వేసుకొన్న దానికుత్తర భాగాన ఉన్న గోయి నా డబ్బుతో పూడ్చబడింది. అతని యింటిముందు నుంచి రోడ్డువరకున్న పల్లాన్ని మేమే పూడ్చాం. మా వాళ్లు "ప్రస్తుతానికి ప్రహారీ నేర్పాటుచేద్దాం, తర్వాత రెండో యింటివారి చావిళ్లు తీసివేయించి, దాని నింకో విధంగా ఉపయోగించుకొందాం" అన్నారు. వారి మాటను కాదనలేకను, గత్యంతరం లేకను ఊరుకొని ఉండవలసి వచ్చింది. ఆ మొదటి యింటిలో హరిజన హాస్టల్‌ను పెట్టారట. రెండవ యింటివారిని, మాలో ఆయన కిష్టులైనవా రభిమానించారట. ఆ కారణంచేత వారు చెప్పిన రెండవ ప్లాను, ఇప్పు డేర్పడుతుందని నాకు ఆశ లేదు. అయితే, రెం డిండ్లవారు ఆక్రమించుకొన్నది, ఉపయోగించుకొనుచున్నది పోరంబోకయే. పూడ్చినది నా డబ్బుతోనే. కాబట్టి ఆక్రమించుకొన్న స్థలానికి ముదరా తీసుకోవలసిం దని ఒకటి రెండు సార్లు చెప్పాను. సరే అన్నారు గాని, ఏ చర్య ఇంతవరకు తీసుకొనలేదు.

స్థలాన్ని రెండు భాగాలుగా వాడుకొందా మనుకున్నాం. పశువులకు కొంత స్వేచ్ఛగా చికిత్సచేయటాని కనుకూలంగా మొదటి భాగాన్ని, రెండో భాగాన్ని పాడి పశువులకు పుష్టికరమైన "నేపియర్" గడ్డివంటి గడ్డిని పరిశోధనాత్మకంగా పెంచటానికి, కొన్ని కోళ్లను, గొఱ్ఱెలను పెంచటానికి ఉపయోగించుకొందా మని అనుకొన్నాం. మొత్తం స్థలావరణ కంతా ఒక ప్రహారీని ఏర్పాటు చేసి, వీలును బట్టి హెచ్చు తగ్గులుగా రెండు భాగాలు చేద్దా మనుకొన్నాం. అట్టి అవకాశం కలుగుతుందేమో చెప్పలేను.

బిల్డింగు 30 అడుగుల పొడవు, 15 అడుగుల వెడల్పు కలిగి, 8 అడుగుల ముందు వరండాతో కట్టబడింది. దీని వరండాగాక, అసలు బిల్డింగును నాలుగు భాగాలుగా విడగొట్టి మొదట, సామాగ్రిని కడుగటానికి ఒక చిన్న భాగాన్ని, దాని

నానుకొని డిస్పెన్సరీ, అనగా మందుసామాగ్రిని పెట్టుకొనటాని కొక పెద్ద భాగాన్ని, దాని నానుకొని ఆఫీసు భాగాన్ని, దాని ప్రక్క పాలసేకరణ కొక మధ్యరకం గదిని నిర్దేశించారు. అందువలన నాలుగు దరవాజాలు పెట్టారు. కాని, ఇప్పుడు సామగ్రిని కదుగు కొనే దానిని ప్రత్యేకించక, మందులు వగైరా పెట్టుకొనే డిస్పెన్సరి భాగంతో కలిపి ఒక పెద్ద గదిగా ఉపయోగించుచున్నారు. ఆఫీసు గది నట్లే వుంచి, పాలసేకరణ కని తలపెట్టిన గదిలో మిశ్రమ దాణాను నిలువ చేస్తున్నారు. మొదట తలంచినట్లుగా ఆఫీసు గదికి, పాలసేకరణ గదికి మధ్య గోడ కట్టలేదు. ఇప్పుడు కొయ్య పార్టీషన్‌ను అమర్చారు. మొదట అనుకొని యుండినట్లు 'పూర్ణ చంద్రరావు స్మారకార్థ'మని దాబా పైని, దాని ముందు భాగంలో వ్రాయటం, కర్రచెక్కలమీద వ్రాసి ముందు గేటువద్ద నిలబెట్టటం జరిగింది. కాని, బుద్ధిమంతు లెవరో ఆ కర్రచెక్కలను ఎత్తుకొని పోయారు.

సరే, ఎలాగో బిల్డింగు 1966 మార్చి, ఏప్రిల్‌కు తయారైంది. దీనిని ఆవిష్కరించటానికి మంత్రి అని, డైరెక్టరని వారిని, వీరిని బాధించట మెందులకు, ఈ రూపేణా అట్టహాసం చేసి ఖర్చుపెట్టట మెందు కని, కార్యదక్షుడు, స్నేహశీలుడు, డిప్యూటి డైరెక్టర్, పాల అసిస్టెంటు కమిషనర్ శ్రీ డాక్టరు డి. (దువ్వూరి) సంజీవరెడ్డిగారి చేత ప్రారంభోత్సవం చేయించుదామని నిశ్చయించి వారిని కోరగా వా రొప్పుకొన్నారు. ప్రారంభానికి 12-5-1966 తారీఖు ఉదయం అంగీకరింపబడింది. ఈ లోపుగా తాత్కాలిక ప్రహారీని వాసాలతో ఏర్పరచట మేగాక, ఆ ఆవరణ స్థలంలో అక్కడుండిన గుంటలు పూడ్చాలి, పల్లం మెరకలను సమం చేయాలి, కాళ్లకు నల్లరేవడి మట్టి అంటకుండా ముందు భాగాన్ని ఇసుకతో కప్పాలి, భూతలానికి కొంచెం ఎత్తుగా నుండిన వరండా మెట్ల క్రింద భాగంలో కడపరాళ్లు అమర్చాలి, ఇట్టి పను లుండినవి. సమయానికి ఎవరూ తోడురానందున, నేనే స్వయంగా పూను కొని నా కప్పుడు సుస్తీగా వుండినా, నా నాల్గు బండ్లను కట్టించి, నా నౌకర్లతో, ఎండగా వున్నందున గొడుగు వేసుకొని, ఎదురు నిలుచుండి ఆ పనిని 2, 3 రోజులలో పూర్తి చేయించాను.

ప్రారంభోత్సవం, పైన చెప్పినట్లు 12-5-1966 తేదీ నా డుదయం జరిగింది. డాక్టరు సంజీవరెడ్డిగారితోబాటు డా. కామేశ్వరరావు గారు, డా. ఆంజనేయులుగారు, ఇతర ఆఫీసర్లు వచ్చారు. గ్రామస్థులలో కొందరు, యితర గ్రామాల నుండి కొలదిమంది వచ్చారు. పై గ్రామాల నుండి వచ్చిన వారిలో ధారాళంగా ఉపన్యసించగల అంగలూరు సర్పంచి శ్రీ దుగ్గిరాల త్రివిక్రమరావొకరు. ప్రారంభోత్సవం జరిపిన డా. సంజీవరెడ్డిగారు, డా. ఆంజనేయులుగారు, మరొక రిద్దరు మాట్లాడారు. శ్రీ త్రివిక్రమరావు తన సహజ వాగ్ధాటితో తన సంతోషాన్ని తెలిపారు. నేను సమాధానం చెప్పునప్పుడు ఒకవిషయం నొక్కి చెప్పాను. పశువుల యందభిమానంచేత, డాక్టరు సంజీవరెడ్డిగారి వంటి పెద్దల మాటను త్రోసివేయలేక ఈ ఆస్పత్రి కట్టించాను. నేను కొంత ఖర్చుపెట్టి కట్టించాను కాబట్టి, పోనీ మంచి హృదయం గల్గి, సాత్వికుడైన నా ప్రథమ పుత్రుడు పూర్ణచంద్రరావు స్మృతికి చిహ్నంగా ఇది ఉండుటకు ఎందుకు కోరకూడదని తలంచాను. వాని జ్ఞాపకార్థంగా దీనిని తలపెట్టలేదు. 28 సంవత్సరాల క్రితం చనిపోయిన వాని స్మృత్యర్థం ఏదైనా నిర్మించ దలచుకొంటే ఆ పనిని ఎప్పుడో నెరవేర్చేవాళ్లం అని చెప్పాను. కొందరు గ్రామస్థుల మనస్తత్వం, "కట్టించాడుగాని, తనకొడుకు పేరుకోసం కట్టించాడు" అని తేలికగా మాట్లాడుతారేమో అని ఈ మాట చెప్పవలసి వచ్చింది.

ఆస్పత్రి సక్రమంగా నడుస్తూనే వున్నది. నా యందు పితూపరులు, విరాళ మివ్వనివారు, ప్రక్కనున్న అయ్యంకివారు, అన్ని తరగతులవారు, ఈ ఆస్పత్రిని ఉపయోగించుకుంటున్నారు. అంతకంటె నాకు కావలసిన దేమున్నది? వైద్యచికిత్స చాలా వరకు జయప్రదముగానే వున్నదని నాకు తోస్తున్నది. కృత్రిమ గర్భోత్పత్తి విషయంలో మాత్రం, ఇప్పటి వరకు పెద్ద వంతులో ఫలించటంలేదు. శుక్లం గన్నవరము నుండి మొవ్వ కేంద్రానికి వస్తుంది. మొవ్వ నుండి ఇక్కడకు తెచ్చుకోవాలి. ధర్మాస్ ఫ్లాస్కులో తెచ్చినా, ఈ వీర్యం ఇక్క డుపయోగించునప్పటికి,

కొంతవరకైనా నిస్సార మగుచున్నది. ఈ లోపాన్ని కొంత వరకైనా సవరించాలని, ఉపయోగించే శుక్లంలో జీవకణా లున్నవని తెలుసుకొనటానికి మైక్రోస్కోపును కొని యిచ్చాను. అయినప్పటికి, పశువుల స్వభావాన్ని బట్టి కొంతకాబోలు, ఆశించి నంత ఫలితాలు కల్గటంలేదు. మరిన్ని, పశువుల కొన్నిటికి 3, 4 సార్లు పొల్లబడినగాని, గర్భం నిలవదుకదా! ఇక్కడకు ఒంగోలు జాతి వీర్యమే గాక, మొదట జెర్సీ, ఇప్పుడు 'హోల్ స్టైన్ ఫ్రీజర్' శుక్లం కూడా ఉపయోగిస్తున్నారు. నా అనుభవం, మన దేశీయ ఆవులు ఈ పరదేశి గో శుక్లాన్ని చప్పున నిలుపుకో లేవేమో అని. ముర్రా జాతి వీర్యాన్ని ముఖ్యంగా ఉపయోగించు చున్నారు.

ఆస్పత్రి బిల్డింగు 1966 మే లో ప్రారంభమైనా, దాని సంబంధమైన పనులకే గాక, పశువుల చికిత్స కొరకు, అంతకు కొంతకాలంక్రిందనే, లైవ్ స్టాక్ ఇన్ స్పెక్టర్ను ఏర్పరచారు. ఆస్పత్రి భవనం తెరిచే వరకు, ఆయన పంచాయతీ బిల్డింగులో ఆఫీసు పెట్టుకొని, గ్రామస్థుల దొడ్లకు పోయి చికిత్సలు చేసేవాడు. పాలపథకం జయప్రద మవ్వటానికి, పశువులు ఆరోగ్యవంతంగా అభివృద్ధిలో నుండిన గాని, పాలసరఫరా బాగుగా కాదని తెలుసు కొనుట కష్టంకాదు. కాబట్టి, పాలపథకం కోసం గ్రామాదు లలో పశువుల ఆస్పత్రులను పెట్టటం ఆవశ్యకమే గాక, వానిని ముందుగా పెట్టటం కూడా సముచితమే. అందువల్ల కట్టడం లేకపోయినా, ఆస్పత్రిని ముందుగనే మొదలుపెట్టారు.

పాలసేకరణ డిపోను ఈ గ్రామంలో 4-3-1965-వ తారీఖున ప్రారంభించాము. ఈ యూరు పశ్చిమ భాగంలో రేడియో కని గ్రామస్థు లిదివరకు ఒక చిన్న బిల్డింగు కట్టించి యుండినారు. ఆ రేడియోను, ఎదురుగా నున్న పంచాయతీ ఆఫీసుకు మార్చారు. దానిలో, పాలను కొనే డిపోను, పైన చెప్పినట్లు 1965 మార్చి 4-వ తారీఖు సాయంత్రం, ఒక కొబ్బరి కాయ కొట్టి నేనే ఆరంభించాను. విచిత్ర మేమి టంటే, ముఖ్యా

వంగా వుండినవారు, ముఠా తత్త్వాన విరాళ మివ్వనివారు, ముసలి, ముతక కూడా, ఒక చెంబుతోనో, తెపాళతోనో పాలుపోయటానికి చప్పున హాజరైనారు. ఈ గ్రామంలో సంపన్నులైన వృద్ధులొకరు, మధ్యరకం ముసలి రైతొకరు, ఆ తొలిరోజున స్వయముగా పాలను తెచ్చి డిపోకు పోయటం నే నక్కడనుండి చూచి వింతపడుటయేగాక సంతోషించాను.

ఆదిలో పాలు చాలా హెచ్చుగా ఉదయం, సాయంత్రం రోజుకు సుమారు 600 లీటర్లు వచ్చేవి. అయితే, దీనిలో కొంత భాగం ప్రక్కనున్న అయ్యంకి గ్రామంవి. అప్పుడక్కడ ప్రత్యేక పాలసేకరణ డిపో లేదు కాబట్టి ఆ యూరి పాలు కూడా యిందులో కలిసేవి. ఇప్పుడు అయ్యంకిలో ప్రత్యేక డిపో పెట్టారు. అయ్యంకి పాలను మినహాయించినా, గ్రామంలోని పాలు తగ్గిపోయింది. వర్షాభావంవల్ల పచ్చగడ్డి మేత సరిగా దొరకక, మిశ్రమ దాణా, తవుడు, వులవల ధర అపరిమితంగా హెచ్చి పశువుల కుపయోగించే జనుము మేత కూడా అకాల వర్షాలవల్ల, ఇతర కారణాలవల్ల తగ్గి, ఈ కారణాలవల్ల ఎండిపోయిన పాడి పశువులకు బదులు క్రొత్తవాటిని కొనటం మానినందువల్ల, సన్నకారు రైతులు, సామాన్య కుటుంబీకులే గాక, మధ్యరకం రైతులు, పాడి పశువులను బాగా పెంచేవారు కూడా పాలుపోయటం తగ్గించారు. డిపోవాళ్ల చర్యలు కూడా కొంతవరకు తోడ్పడినవి. అప్పుడప్పుడు మంచిపాలను కూడా వెన్నశాతం తక్కువచూపించి, డబ్బివ్వని స్థితికి తెచ్చేవారు. డిపో నౌకరు తన కయిష్టమైన వాళ్లనుండి తీసిన మచ్చు పాలలో నీళ్లు కలిపి వెన్నశాతం తక్కువ వచ్చేటట్లు చేసేవాడు. వెన్నశాతం తెలుసుకొనటానికి ఉదయం, సాయంత్రం కూడా మచ్చు ( శాంపుల్ ) గని పాలను తీస్తారు. ఆ మచ్చు పాలను పరీక్షకు కావలసిన దాని కంటె హెచ్చు తీయటం వల్ల చాలా మిగిలేవి. ఈ మిగిలిన పాలను డిపోను నడిపే ఫీల్డ్ అసిస్టెంటు, పాత్రలను శుభ్రపరచే జవాను పంచుకొనే వారు. ఆ రోజులలో ఆస్పత్రి పశువుల ఇన్‌స్పెక్టరుకు కూడా కొంచె మిచ్చేవారు. జవాను, తాను తీసుకొన్న పాలను కాచుకొని వెన్న,

పెరుగు, మజ్జిగ అమ్ముకొనేవాడట. ఈ రుచి మరిగిన జవాను కళ్లు నెత్తి కెక్కినవి. నాల్గు డబ్బులు కనపడటంతోనే అహం పెరిగింది. తాను పెద్ద ఆఫీసరైనట్లు తలబిరుసుగా వర్తించేవాడు. అది సహించని వాళ్ల శాంపుల్ పాలలో నీళ్లు పోసేవాడు. అతని అయిష్టతకు గురైన వాళ్లలో నేనొకడ ననుకుంటాను. అందువల్ల రెండు మూడు సార్లు నా పాలలో తగినంత వెన్న శాతం లేదని డబ్బివ్వలేదు. అందువల్ల నాకు విరక్తికల్గి పాలుపోయటం మానివేశాను. అసలు, నేను పాలకేంద్ర మారంభించిన కొన్ని మాసాలకు గాని పాలుపోయటం మొదలు పెట్టలేదు. మా గృహ ఖర్చుకు కావలసిన పాల కంటె ఎక్కువ రానప్పుడు, పాలు నిత్యం పోయాలనే అభిప్రాయం లేనందున, క్రొత్త పశువులను కొనే వాడను కాదు. అందువల్ల మధ్య మధ్య కొన్ని మాసాలు కూడా పోసేవాళ్లం కాదు. మొదటి జవాను లారీప్రమాదంలో చని పోయాడు. తర్వాత వచ్చిన జవాను లంత దురాశాపరులు కాక పోయినా, ఒక ఫీల్డ్ అసిస్టెంట్ చాలా అనుచితముగా నడచు కొన్నాడు. అతను భోజనంచేసే యింటివారి పాలను ప్రతిరోజు 10% వెన్న శాతం కలవిగా నమోదు చేసేవాడు. అంత శాతం వెన్నగల పాలనిచ్చే పశువులను కల్గియుండుటకు గాని, వానికి మిక్కిలి పుష్టికరమైన దాణా పెట్టే శక్తిగాని ఆయనకు లేదు. ఒకనాడు పై ఆఫీసరు అకస్మాత్తుగా వచ్చి తనిఖీ చేశాడు. ఈ ఆసామి కాతా ప్రతిరోజు 10 శాతం ఉండటం అతని కనుమానం కలిగి, అతని పాల శాంపులును పరీక్ష చేయించగా, 3 లేక 3½ శాతం తేలిందట. సంజాయిషీ కోరగా, "అయ్యా, నేను చాకలి కులస్థుడను, నా కెవ్వరూ ఆశ్రయ మిచ్చి భోజనం పెట్ట నన్నారు. ఈ ఆసామి భోజనం వగైరా వసతులను కల్పించాడు. ఆయన నుత్సాహపరచి, నాకు సరిగా భోజనం పెట్టు టకు నేను కొంత సహాయం చేయవలసి వచ్చిం" దని చెప్పాడట. తా నభిమానించిన వారి కెక్కువ వెన్న శాతం చూపించినప్పుడు, ఇతరుల వెన్న శాతం తక్కువ చూపించవలసి వచ్చింది. ఈ అవక తవకలవల్ల కొంత అసంతృప్తి పాలుపోసేవారికి కల్గటం సహజమే కదా!

'క్రొత్త బిచ్చగాడు ప్రొద్దెరుగ'డన్నట్లు, రైతులకు నాలుగు డబ్బులు కనపడటంతోనే వెర్రెత్తినట్లయింది. తమకు కావలసి నన్ని పాలను తమకుంచుకోక, సాధ్యమైనంత వరకు తమ పశువుల నుండి వచ్చిన పాల నంతను అమ్ముకోనటం మొదలుపెట్టారు. డబ్బుపిచ్చి ఎక్కువై, పాలలో నీళ్లు కలపటమేగాక, ప్రొద్దున మిగిలిపోయిన పాలను కాచి, మీగడ తీసుకొని చల్లార్చి, సాయంత్రం పాలలో కలిపి డిపోకు పోయుటం, ఈనిన పశువుల పాలను జున్ను అవటం ఆగిన వెంటనే పోయుటం, ఇటువంటి పిచ్చిపనులను చేస్తూండేవారు. మరిన్ని, ఏ విధముగానైనా వెన్న శాతం ఎక్కువగా వుండునట్లు నమోదు చేయించుకోవాలని తహ తహ లాడటం మొదలుపెట్టారు. ఇందువల్ల, ఏ పూట కాపూట "మా పాల వెన్న శాతం ఎంత వచ్చిం" దని అడగటం మొదలు పెట్టారు. "మీరు తక్కువ వేస్తున్నారు, మేము దగ్గరుండి తనిఖీ చేయించుకుంటాం" అని మొదలుపెట్టారు. "ఇదుగో ఫలానవాళ్లకు ఎక్కువ వేస్తున్నారు" అని తగాదాపెట్టారు. మామూలుగా ఉదయం పోయించుకొన్న పాలను బైటికి పంపించిన తర్వాత, మచ్చుకు తీసిన పాలను తనిఖీ చేయించటం, సాయంత్రం పాలతో బాటు తీసుకొని వెళ్లిన అతని లెక్క పుస్తకంలో ఉదయం పాల వెన్న శాతాన్ని నమోదుచేయుటం, సాయంత్రం పాల వెన్న శాతాన్ని మరునా డుదయం నమోదుచేయుటం జరుగుతోంది. కాని, ఉదయం పోసిన పాల కా ఉదయమే వెన్న శాతం తేల్చి చెప్పాలని, సాయంత్రం పోసినపాల కా సాయంత్రమే వెన్నశాతం చెప్పాలని తగాదాపెట్టటం ఆరంభించారు. ఈ ధోరణిలో గుమి గూడటం, లోపలకి జొరబడటం తమంతట తామే ఆసిడ్ శాంపుల్ ట్యూబులలో పోసి వెన్నశాతం తేల్చటానికి ప్రయత్నిం చటం జరుగుచుండేది. ఈ తతంగంలో, పాలకంపెనీని పెట్టించిన వాడను నే నవటంచేత, నా పాలకు అసలు దానికంటె ఎక్కువ వేస్తున్నారని భ్రమపడి, నా పాలను తనిఖీ చేయాలని పట్టుబట్టి, ఫీల్డు అసిస్టెంటు సమ్మతించకపోతే, తామే పరీక్ష చేయటానికి పూను కొనటం జరిగింది. ఈ సంగతి నాకు తెలిసి చాలా చిరాకుపడ్డాను.

నా పాలను తమ ఎదుట తనిఖీ చేయాలని పట్టుబట్టి, తామే చేయటానికి పూనుకొన్న కుర్రవాళ్లు, నాయింటి చుట్టుప్రక్కలవాళ్లు, నాకు దగ్గర బంధువులు కూడా. నేను ప్రత్యక్షంగా జోక్యం కల్గించుకొనటాని కిష్టంలేక, పాలుపోయటమే మాన్పించివేశాను. నా గేదెలు మిక్కిలి మేలైన ముర్రా జాతివి కాకపోయినా, మంచి కల్తీ జాతివి. నేను మొదటి నుండి పంది తవుడు, పుష్టి నిచ్చే తిండిపదార్థాలను తగిన పాళ్లలో కలిపిన ప్రభుత్వం సప్లయి చేసే మిశ్రమ దాణాను, తగినంత జనపకట్టను మేపుతాను. పైగా చాలాకాలం సజ్జకూడు, వేరుశనగపిండి కూడా ఉపయోగించాను. మధ్యమధ్య ఉలవలను రుబ్బి పెట్టటం, ఉడకబెట్టి పెట్టటం చేస్తాను. అందువల్ల నా పాలు నిస్సారంగా వుండుట కవకాశంలేదు.

ఈరోజుల్లో చాలామంది పిల్లలకు, యువకులకు తల్లిదండ్రుల భయం, వారి యందు భక్తి పూర్తిగా పోయిన వనే చెప్పాలి. చదువు సంధ్యల యందు శ్రద్ధ పోయింది. చదువుకొనే వాళ్ల నటుంచి, ఈ గల్లంతు చేస్తుండిన కుర్రవాళ్లలో ఎక్కువమంది బడి మానివేసినవారో, అసలే బడికి వెళ్లనివారో. వీళ్లు జట్టుగా పాలకేంద్రాని కెదురుగావున్న పంచాయతీ బిల్డింగు వెలుపల పడవేసియున్న పెద్ద సిమెంటు తూముల మీద కూర్చొని, సిఘూ వేసినట్లు కాచుకొనియుండి, సందు దొరికినప్పుడల్లా కేంద్రం బిల్డింగు లోపలకు జొరబడి పై విధముగా గలాటా చేస్తూండే వారు. ఇదేమిటని, తల్లిదండ్రులుగాని, పెద్దలుగాని పట్టించుకొనే వారు కాదు. అయితే, యిట్టి దిప్పుడు జరగటం లేదు. కారణం గ్రామాలలో పాలసేకరణ విధానం మార్పుచేయబడింది.

2, 3 సంవత్సరాలక్రితం వరకు పాలను సేకరించటం, దానికి డబ్బివ్వటం ప్రభుత్వ బాధ్యతగా వుండేది. ఇప్పుడా బాధ్యత గ్రామస్థులకే అంటబెట్టబడింది. ప్రతి గ్రామంలో ఒక గ్రామ సంఘాన్ని వర్పాటుచేసుకొని, ఆ సంఘానికి అధ్యక్షుడు, కార్యనిర్వాహక సభ్యుల నేర్పరచుకొని, గ్రామస్థులనుండి పాలను కొని, దానిని శీతలకేంద్రానికి అమ్మి, లాభనష్టాల ననుభవించటానికి ఈ గ్రామ కమిటీల కప్పచెప్పట మైనది. ఇదివరలో వలెనే, ఇప్పుడు

కూడా వెన్న శాతాన్ని బట్టి అమలులోవున్న రేట్ల ప్రకారం, పాల సరఫరాదార్ల కిస్తున్నారు. అయితే, వెన్న శాతం తక్కువని రేటు తగ్గించిన పాలను, అసలు డబ్బివ్వని పాలను కలిపి పంపిన పాలకు శీతలకేంద్రంవారు పాల మొత్తం మీద యావరేజి రేటు ప్రకారం డబ్బిచ్చారు, ఇస్తున్నారు. ఈ సగటురేటు హెచ్చుగా ఉండేది, ఉంటున్నది. ఈ రేటు వ్యత్యాసం శీతలకేంద్రాల ద్వారా గవర్నమెంటుకు వెళ్లేది. ఈ సందర్భంలో మొదటి దశలో, పామర్రులోని శీతలకేంద్రాలవంటి వాటికి డబ్బు మిగిలేది. ఈ మిగిలిన డబ్బులో కొంత, శీతలకేంద్రానికి చేరిన పాలలో కొంత భాగం చెడిపోయినదని వంకబెట్టి, దాని నుండి తీసిన వెన్న డబ్బును కొంత, ఆ శీతలకేంద్ర ప్లాంటుకు చెందిన ఆఫీసర్లు, వారి పై ఆఫీసర్లు మ్రింగివేసేవారని వాడుకపడింది. ఇప్పుడు లాభనష్టాలు గ్రామ కొనుగోలు డిపోలకు చెందుచున్నవి. అందువల్ల ప్రతి గ్రామ సంఘానికి లాభం వస్తున్నది. ఈ గ్రామ కమిటీకి గత రెండు, మూడేళ్లకు గాను 7, 8 వేల రూపాయలు లాభం వచ్చిందట. దీని నుపయోగించి ఈ డిపో, (కొనుగోలు కేంద్రం) బిల్డింగును విస్తృతంచేసి అభివృద్ధి పరచాలని తలంచుచున్నారని విన్నాను. ఈ గ్రామ కమిటీ ఏర్పడటం వల్ల ఇంకొక సౌకర్య మేర్పడింది. పిల్లల ప్రవర్తన కొంత అదుపులోనికి వచ్చింది. ఇప్పుడు, మా వెన్న శాతం వెంటనే తెలపాలని గాని, మాకు తక్కువ వేసి ఆ లోటు పూర్తి చేయుటానికి ఇతరులకు ఎక్కువ వేస్తున్నారని గాని, తగాదా లుండినట్లు లేదు.

తగాదాలు లేకుండా లాభదాయకంగా పాలకేంద్రం నడపటం చాలా మంచిది. అయితే అసలు ప్రభుత్వం, దేశవ్యాప్తంగా పాలపథకాలను ఏ వుద్దేశంతో ఏర్పాటుచేశారో, ఆ వుద్దేశాలు ఈ కమిటీవారికి తెలిసినట్లులేవు. దేశంలో పాల నభివృద్ధిపరచి, పాలు సరిగా దొరకని పట్టణవాసులకు అందించటం ఉద్దేశాలలో ఒకటి. అయితే, గ్రామస్థులు తమకు కావలసినంత పాలను వాడుకోకుండా అమ్మివేయటం పాలపథకం ఉద్దేశం కాదు. గ్రామంలో ఉత్పత్తి చేసిన పాలను గ్రామస్థు లందరూ

తగినంతగా అనుభవించిన తర్వాత మిగిలిన పాలనే పైకి పంపించాలని ముఖ్యోద్దేశాలలో ఒకటి. సన్నకారు రైతు, చిన్నతరహా కుటుంబీకులు ఒక మంచిగేదెనో, వీలైతే రెండు గేదెలనో పెట్టుకొని అదనపు ఆదాయాన్ని పొందాలనే ఉద్దేశం ముఖ్యమైన దైనా, తమకు లేకుండా కడుపు కాల్చుకొని, డబ్బు కాశ పడండనికాదు. పాలు ఆహార పదార్థమేగాక, పుష్టికరమైనది కాబట్టి, ప్రజ లారోగ్యంగా వుండా లంటే పాల నందరుపయోగించాలని పెద్దల కోరిక. అందువల్ల, ముందు గ్రామస్థులు తమకు కావలసిన పాల నుపయోగించుకోవా లన్నది గమ్యం. దీనిని బట్టి, ఏకారణంచేత నైనా, గ్రామీణులలో కొందరు, పాలు తమంతట తాము ఉత్పత్తి చేసుకొనలేకపోతే. అధికోత్పత్తిదారుల నుండి వారికి పాలు లభించాలి. ఈ సూత్రం అర్థంకాకను, దురాశచేతను, కమిటీవారు, పాడిపశువులేని రోగిష్టికి, పసిపిల్లలకు (తల్లి మాటటుంచి) కూడా పాలు అందజేయటంలేదు. కొలదికాలంక్రిందట (1972 మార్చి) మా గేదె లన్నియు ఎండిపోయి, కొనుటకు చవ్వున పాడిగేదె దొరకనందున, "రెండు లీటర్లు పాలు పోయం"డని డిపోకు కబురు పంపాను. ఫీల్డు అసిస్టెంటు వచ్చి "ప్రెసిడెంటుగారిని కనుక్కోవా" లన్నాడు. నేను, "ఊళ్లో వారి కందరికి కావలసినదానికంటె ఎక్కువ వుంటే, మిగిలిన పాలను బైటవాళ్లకు అమ్మటం గాని, వూళ్లోవారిని మాడ్చి, యితరుల కివ్వాలనే అర్థం కా"దని వివరించి చెప్పాను. సరే అని ఆపూటకు పోశాడు. మర్నాడు ప్రొద్దున, "మా ప్రెసిడెంటుగారు పోయవద్దన్నా"రని పంపిన పాత్రను త్రిప్పి పంపివేశాడు. పాల కేంద్రాన్ని, పశువుల ఆస్పత్రిని పెట్టించిన వాడను నాకే పాలను ఖరీదుకు పోయుననటం, నా కాశ్చర్యం కల్గించింది. సరే, అని నా రెండో కోడలు ద్వారా, ఈ యూరిలోని ఆమె అక్క నుండి తెచ్చుకొన్నాం. బంధుత్వంచేత, ఆమె డబ్బు లేకుండానే ప్రతి నిత్యం 2 శేర్ల పాలు రెండు మా సాలు పంపించింది. నేను పాల కమిషనర్ కు వివరిస్తూ హైదరాబాదుకు వ్రాశాను. ఆయనగారు నాకు కొంతకాలంనుండి తెలిసినవారే. నన్నొకప్పుడు తన

ప్రమోషన్ విషయంలో ఆశ్రయించినవాడే. ఆయనగారు నేరుగా సమాధాన మివ్వలేదు. ఆయన అసిస్టెంటు బెజవాడ నుండి వ్రాయుచు, "మాకు పాల వితరుల కమ్యూనిటి కవకాశం లేదు, దాని కొరకు సిబ్బంది పెట్టాలి, ఆ సిబ్బంది మాకు లేదు, పైగా పోసుకొన్నవాళ్లలో కొంతమంది డబ్బు సరిగా యివ్వ"రని జవాబిచ్చాడు. దేశవ్యాప్తంగా పాలప్రణాళికలను పెట్టటంలోని ఉద్దేశం, నే నెందుకు వ్రాశానో ఆలోచించలేదని చింతించి, విషయాల నర్థం చేసుకోగల అప్పటి వ్యవసాయం, పశుపోషణ శాఖ మంత్రిగారికి తెలియపర్చాలని అనుకొనుచుండగా, ఆ మంత్రిగారు అకస్మాత్తుగా మరణం పొందారు. ఇంతలో మంత్రివర్గమే పడిపోయింది. గ్రామ పాలకమిటీవారికి, డబ్బు దండిగా మిగులుచున్నప్పుడు, లెక్కలు వ్రాయటానికింకొక రవసరమైతే, అతనిని వేసుకోవాలి. పా లుపయోగించుకొని కొందరు డబ్బు ఎగగొట్టితే ఆ నష్టాన్ని భరించాలి. అంతేగాని, గ్రామస్థుల నుండి వచ్చిన డబ్బును మూటగట్టుకోవాలని, పాల పథకాల ఉద్దేశం కాదు.

ఇట్లుండగా, పాలోత్పత్తిదారులను, ఉత్తర హిందూస్థానంలోని పాలకేంద్రాలకు పంపి అక్కడ జరుగుచున్న అభివృద్ధికరమైన పద్ధతులను వారికి చూపించాలి, ఆ అనుభవంవల్ల ఎక్కువపాలను ఉత్పత్తిచేస్తారనే భ్రమతో, కృష్ణాజిల్లా నుండి కొంతమంది పాలోత్పత్తిదారులను ప్రయాణం కట్టండన్నారు. నన్ను కలుపుకొని, 34 మంది బైలుదేరాం. నే నాగుంపులో చేరటానికి కారణం, లోకల్ ఆఫీసర్ల ప్రోత్సాహమే గాక, ఈ విధంగా ఉత్తర హిందూస్థానం దర్శించవచ్చునని కుతూహలం. నిజానికి, విదేశాలు చూచినా, ఇండియాలో చాలాభాగం చూడలేదు. ఇంగ్లండు వెళ్లేటప్పుడు, తిరిగి వచ్చేటప్పుడు బొంబాయిని చూడటం, 1934 డిశెంబరులో ఒకసారి కలకత్తా చూడటం తప్ప, ఇతర ఉత్తర భారత ప్రదేశాలను చూడలేదు. సంచారం, 11-3-1966 నుండి 12 రోజులు అనగా 22-3-1966 వరకు. చూడవలసిన ప్రదేశాలు హైదరాబాదు రాజేంద్రనగర్ డైరీ ఫారం, పూనా మిల్కు సప్లై స్కీము, అగ్రికల్చరల్

ఇన్‌స్టిట్యూట్, బొంబాయిలో ఆరె మిల్కు-కాలనీ, ఆదర్శ దుగ్ధాలయం వగైరా, కైరా జిల్లా లోని అమూల్ డైరీ, ఆనంద్ కాలనీ, పాలోత్పత్తిదారుల సహకార సంఘం, ఆనంద్ పాలసీసాల ఫాక్టరి వగైరా, అహమ్మదాబాద్ మునిసిపల్ డైరీ మొదలైన వని నిర్ణయించి ప్రోగ్రాం ఏర్పరచి, బెజవాడ రైల్వే స్టేషనులో మే మందరం కలుసుకోనా లని తెలియ బర్చారు. గుడ్లవల్లేరులో పశువుల అసిస్టెంటు సర్జన్‌గా వున్న వారిని మాకు మార్గదర్శకుడుగా, సహాయకారిగా వుండునట్లు ఏర్పాటు చేశారు. నేను వెంటనే పశువుల శాఖ డైరెక్టరుగారికి వ్రాసి "అసిస్టెంటు సర్జన్ కేడర్ వారు చాలరు, మాకు సహాయంగా ఒక డిప్యూటి డైరెక్టరును పంపం"డని కోరాను. వారు యాత్రలోని ఒక్కొక్కరికి 200 రూపాయలు చొప్పున ఇచ్చునట్లు నిర్ధారణ చేశారు. ఈ 200 రూపాయలకు ఆశపడినవారు మా 34 మందిలో ఎవ్వరూ లే రనే చెప్పాలి. అయినా, ఈ స్వల్ప భత్యానికి లోబడిపోయా మనే అభిప్రాయంతోనో, లేక క్రొత్తగా తాను డైరెక్టరు నయ్యా ననే అతిశయంచేతనో, నా కదివరకు బాగుగా తెలిసియుండి మిక్కిలి చనువుగా వుండే ఆ డైరెక్టరుగారు సకాలంలో జవా బివ్వలేదు. వారి ఆఫీసు నుండి 'వీలులే'దని వ్రాసిన మెమొ నా కక్కడ, నేను తిరిగి వచ్చిన తర్వాత అందింది. అది వారి ఆఫీసు నుండి 19-3-1966 తారీఖున పంపబడింది.

సరే, మే మందరము కట్టగట్టుకొని 10-వ తారీఖు రాత్రి బైలుదేరి 11 ఉదయానికి హైదరాబాదు చేరుకొన్నాం. నేను ఈ ప్రోగ్రాం తెలిసిన వెంటనే రైలుప్రయాణానికి మొదటి తరగతి తిరుగు టిక్కెట్టును కొన్నాను. ఆ పార్టీలో నా కంటె శ్రీమంతు లుండినా, నా ఉద్యోగకాలంలో మొదటి తరగతిలో ప్రయాణం చేసిన అలవాటువల్ల నే నెప్పుడు రైలుప్రయాణం చేసినా మొదటి తరగతిలోనే ప్రయాణంచేస్తాను. తతిమ్మా వా రందరు, వారి అలవాటు చొప్పు ననుకొందును, 3-వ క్లాసులో ప్రయాణం

చేశారు. మేము హైదరాబాదుకు 11-3-66 తారీఖు ఉదయం చేరుకొన్నాం. మొదట నాంపల్లి స్టేషన్ రోడ్డులోని నిరామా కోమల విలాస్‌కు తీసుకొని వెళ్లారు. అది అనుకూలపడదని, క్రొత్తగా లకడీకాపూల్ వద్ద పెట్టిన ద్వారక అనే హోటల్‌కు వెళ్లాం. మధ్యాహ్నం రాజేంద్రనగర్‌కు వెళ్లి అక్కడి డైరీ ఫారంలో పశువులను, వాటిని సాకే విధానాన్ని చూచాం. ఆ రాత్రి బైలుదేరి 12 ఉదయం పూనాకు చేరుకొన్నాం. పూనాలో, మిల్కు సప్లై స్కీమును. అగ్రికల్చరల్ ఇన్‌స్టిట్యూటును సాయంత్రం వరకు చూచాం. పూనా మిల్కు స్కీమును కొంకన్ మిల్కు స్కీము అని కూడా అంటారు. దాని కేంద్ర డైరీకు 1-1-1959 లో ప్రారంభించారట. అప్పటి లక్ష్యం రోజుకు 300 మణుగులు, అనగా 11 వేల ఒక వంద లీటర్స్ మాత్రమేనట. క్రమేణా అది వృద్ధిచెంది మేము వెళ్లిన నాటికి ( 12-3-1966 ) నూరు సహకార సంఘాలలో చేరిన 20 వేల మంది పాల సరఫరా దారులనుండి, రోజుకు 70 వేల లీటర్ల పాలను సేకరిస్తుండినది. 3 వేల పాలడబ్బాలను వాడుతారట. ఈ 70 వేల లీటర్ల పాలలో 18 వేల లీటర్లను మాత్రమే పూనాలో అమ్ముతారట. తక్కిన పాలను బొంబాయికి పంపుతారట. బొంబాయికి పంపటాని కొక టాంకరు కూడా ఉన్నదట. అప్పు డిచ్చే ధర లీటరుకు 1 రూపాయి అట. నూటికి 6 వంతుల తక్కువ వచ్చిన వెన్న పాలను తిరస్కరించే వారట. 8 పాయింట్లున్న పాలకు రు. 1-15 పై. లిచ్చేవారట. 8 పాయింట్లకు పైన ఉన్నదానికి పాయింటుకు 1 పైస ఎక్కువగాను, తక్కువ వున్నదానికి 1 పైస తక్కువగాను ఇచ్చేవారట. 6 పాయింట్ల దానికి 95 పైసలట. ఇది 1966 మార్చినాటి స్థితి. ఇప్పుడు రేట్లు చాలా పెరిగి యుండును. పాలను శీతలపరచే ప్లాంటు శక్తి 1 లక్ష 25 వేల లీటర్లు అట. దీనిని చూచిన తర్వాత వారి వ్యవసాయ క్షేత్రాన్ని చూచాం. మమ్ము ఆహ్వానించినవారు మర్యాదగానే ప్రవర్తించారు గాని, మొత్తం మీద మే మాశించినంత మర్యాద, మన్ననలు జరుగలేదని

నేను తలంచాను. మా భోజనం, ఉపాహారాలు, పానీయాల విషయంలో వారంతగా పట్టించుకోలేదు. దానికి కారణం మా మార్గదర్శి, సలహాదారు స్టేటస్ కొంత కారణమై యుండవచ్చును.

పూనా 7 లక్షల జనాభా గల మంచి పట్టణమే. మేము బస్సుమీద పూనా నలుప్రక్కల చూచాం. ఆ బస్సును అద్దెకు తీసుకొన్నామో లేక అక్కడి మిల్కు స్కీము వారు మాకు సహాయం చేశారో నా కిప్పుడు గుర్తులేదు. పట్టణంలో నన్ను మిక్కిలి ఆకర్షించినది, శివాజీ మహారాజ్ అశ్వారోహణ శిలా విగ్రహం. అది కొట్టవచ్చి నట్లున్నది. రెండోది పట్టణం ఒక మూలనున్న పీష్వా ఉద్యానవనం. అది మెట్లుమెట్లుగా అమర్చ బడి వింతగా తోచింది. దాని కనతిదూరములో నున్న గుట్ట మీద పార్వతి అమ్మవారి గుడి వున్నదట. కొంతమంది వెళ్లి గుట్టనెక్కి అమ్మవారి దర్శనం చేసుకొని వచ్చారు. ఝాన్సీ లక్ష్మీబాయి మిలిటరీ స్కూలు వగైరా కూడా చూచాం. ఆ రాత్రి ఎక్కడ గడిపామో గుర్తులేదుగాని, మర్నా డుదయం (13-3-1966) పూనా, బాంబే మధ్య 80 మైళ్ల దూరం కొలది కాలంలో ప్రయాణించే డక్కన్ రాణి అనే ఎక్స్‌ప్రెస్ రైలు బండిలో బైలుదేరి బొంబాయికి చేరుకొన్నాం. ఆ బండి ప్రయాణం మిక్కిలి సుఖమనిపించింది. బొంబాయిలో 13, 14 తారీఖులు నిల్వ వుండినాం. న్యూజెలండ్ హాస్టల్‌లో మాకు బస ఏర్పాటు చేశారు. భోజనం వగైరా ఈ హాస్టల్‌లోనే. ఇది పెద్ద భవనం. పెద్ద భోజన హాలుతో, సరిపడిన చోటుగల గదులతో, తగినంత సామానుతో ఉండింది. దీనిని న్యూజెలండు ప్రభుత్వం వారి 80 వేల పౌనుల విరాళంతో కట్టించారట. దీనిలో వ్యవసాయం, పశువుల సంతాన మాభివృద్ధులను నేర్చుకొనే విద్యార్థు లుంటారు. ఈ భవనం 'ఆరె' మిల్కు కాలనీ ఆవరణలో వుండినది, ఆరె కాలనీని, ఆదర్శ దుగ్ధాలయాన్ని, వోర్లి డైరీ వగైరాలను చూచాం. ఇక్క డతి ముఖ్యమైనది, నగరం మధ్య, సముద్రాని కెదురుగా నుండినది, వోర్లి మిల్కు ప్లాంట్. ఇది పెద్ద కట్టడాలతో విరాజిల్లుచున్నది. దీనిలో నాలుగు

పాలను శుద్ధిపరచే యంత్రాలయాలు, పాలను నిల్వజేసే టాంకులు, రెండు ఇంకొకరకం యంత్రాలయాలున్నవి. టాంకలలో ఒక లక్షన్నర లీటర్ల పాలను నిల్వచేయ వచ్చునట. ఆదర్శ దుగ్ధాలయాన్ని ఒక పటేలు కుటుంబం వారు నడుపుచున్నారట. అన్నదమ్ము లిద్దరు మమ్ముల నాహ్వానించి మాకు పాల పానీయ మిచ్చి గౌరవించారు. దీని ప్రాంగణంలో పశువులు, దూడలు మిక్కిలి ఆరోగ్యంతో పుష్టిగా ఉండినవి. దూడల పోషణకు మిక్కిలి జాగ్రత్త వహించుచుండినారు. బొంబాయిలో మాకు పూనాలో కంటె ఎక్కువ మర్యాద, మన్ననలు జరిగాయి. వోర్లి ప్లాంటు (ఫాక్టరి) అధికారులు మాకు తోడుగా నుండి శ్రద్ధతో అవి, యివి చూపించారు. మంచి వసతి నిచ్చారు. మేము మెరీన్ డ్రైవ్ వెంట తిరిగాం. మలబార్ హిల్లు వంటి ప్రదేశాలను చూచాం. ముఖ్యంగా ఎలిఫెంటా గుహాలకు స్టీమరు లాంచీలో వెళ్లి అక్కడి శిల్పసంపదను చూచి సంతోషించాం. త్రిమూర్తి, అర్ధనారి, గంగావతరణం మిక్కిలి ఆకర్షణీయంగా వుండినవి.

వెల్లింగ్‌డన్ అతిథి గృహములో మా మకామని చెప్పారు. గదులు, మంచాలు, బల్లలు వగైరా బాగానే ఉండినా, మంచాలకు దోమ తెరలు లేవు. దోమ లుంటవనే చెప్పారు. అందువల్ల అతిథి గృహంలో అజమాయిషీ తీసుకొనే అధికారిని సుముఖుణ్ణి చేసుకొని ఒక దోమ తెరను సంపాదించాను. నా కిచ్చిన గది పెద్దది, మంచిది. నా అనుకూలానికి కొన్ని సదుపాయాలేర్పరచారు. నేను సూటు వేసుకొనటమే గాక ఎండకు, వానకు పనికివచ్చే సన్ (పిత్) టోపీని కూడా పెట్టుకొన్నాను. పైగా, అక్కడి ఆఫీసర్లకు నేను విదేశ విద్యావంతుడనని, ఉద్యోగం చేశానని మా గుంపులోనే కొందరు విశేషాలను చూపించేవారికి చెప్పారు. అందువల్ల ఆ అతిథి గృహంలో కొన్ని ఎక్కువ సదుపాయాలు నాకు లభించినవి. దీని వల్లను, నేను మొదటి తరగతిలో ప్రయాణంచేయుచున్నందు వల్లను నేను కొంత కేటాగా వుంటున్నానని మా గుంపులోని కొంద రభిప్రాయపడి, వారికి

నాయం దసూయ కల్గింది. ఇద్దరు ముగ్గురు నాకు వ్యతిరేకంగా ముఠా కట్టినట్లు వర్తించారు. మా అందరిలో విదేశీ ఆవుల ద్వారా అధికోత్పత్తికి కారకుడైన ముఖ్యుడొకడు నన్ను, "మీరు ఆఫీసరు హోదాలో వచ్చారా లేక రైతు లేక పాలోత్పత్తిదారుగా వచ్చారా?" అని సూటిగా హాలులో కూర్చుని వుండగా పదిమందిలో ప్రశ్నించాడు. "నే నుద్యోగము చేసి యుండినా, రైతు కడుపున పుట్టినవాడను. ఇప్పుడు రైతుగానే వర్తిస్తున్నా"నని చెప్పాను. ఆయ నిప్పుడు భూవసతి గలవాడైనా, వ్యాపారంకొరకు అధిక పాలనిచ్చే విదేశీ ఆవులను పెద్దగా కొని మిక్కిలి హెచ్చు స్థాయిలో పాలను ఉత్పత్తి చేస్తున్నా, చదువు సంస్కారం లేనివాడు, కొద్ది స్థాయి నుండి పైకివచ్చినవాడు. నేను మూడు, నాలుగు తరాలనుండి మిక్కిలి భూవసతి, భుజబలం కల్గిన కుటుంబంలోని వాడను. ఇంగ్లండులో పెద్దగా చదువుకొన్న వాడను. పైగా హెచ్చుస్థాయి ప్రభుత్వోద్యోగం చేసినవాడను. ఈ కారణాలవల్ల అతనికి తాను చిన్న అంతస్థువాడ ననే భావం (ఇన్ ఫీరియారిటి కాంప్లెక్సు) కల్గినందువల్ల కాబోలు, నాయం దసూయ కల్పించుకొని నన్నెట్లైనా కించపరచాలని తలంచి నట్లున్నాడు. ఈయనకు ఆయన వూరువాళ్లొక రిద్దరు తోడ్పడ్డారు. ఈ పరిస్థితి మరింత విషమించటానికి కారణం నాదగ్గర బంధువు, కాలేజి చదువు చదువుకొన్నవాడు, పశు పోషణలోను, పాలోత్పత్తిలోను నిపుణుడని పేరుపొందినవాడు, అనుభవమే గాక శాస్త్రజ్ఞానం కలవాడు మా సమూహములో వుండినాడు. నా పెద్దరికం, ఆయ నభిమానించుచున్న వారికి గిట్టని కారణం చేతనైతేనేమి, చదువుకొన్న వారి కిద్దరికి మనస్పర్ధ కలిగించాలనే దుష్టబుద్ధితోనైతేనేమి, మా యిద్దరి మధ్య అసూయ కల్గడానికి ప్రయత్నించారు. దగ్గర బంధుత్వమే గాక, విద్యార్థిదశ స్నేహితుడిగా వుండిన ఆయనగారు ఈర్ష్యాగ్రస్థుడైనాడని చెప్ప లేనుగాని, చెప్పుడు మాటల వల్ల కొంత విముఖత్వాం పొందినా డేమో యని నాకు తోచింది. కథలలో చెప్పునట్లు, సింహాన్ని అనుసరించే నక్కలవంటి ఇద్దరు ముగ్గురు మూర్ఖులు, అందులో ముఖ్యముగా నొకడు వెకిలి నవ్వు నవ్వుచు, ఆ నా బంధువు నాకు

వ్యతిరేక పార్టీ అయినట్లు హీన భావాలతో కనపరిచాడు. చివరకు ఈ వ్యతిరేక భావం ఆనంద్‌లో అనుకుంటాను ఉద్ధృతమై, అహమ్మదాబాద్‌లో విషమించింది. నేను ఆనంద్‌లో అని గుర్తు, నా ఖర్చులతో ఉన్న వారికందరికి ఐస్ క్రీములు కొని దూరముగా ఒక చెట్టుక్రింద కూర్చున్న అధిక పాలుప్రత్తిదారుని వద్దకు స్వయంగా తీసికొని వెళ్లి యిచ్చి సమాధానపరచ ప్రయత్నించాను. అయినా, ఆయన సుముఖత్వం పొందినట్లు లేదు. ఒకచోటికి రైలులోనో, బస్సులోనో ప్రయాణం చేయుచున్నప్పుడు ఏవో నిరసన వాక్యాలు వినపడగా, నేను వెనుదిరిగి ఆయనతో, "ఏమండీ, నేను మీలో వాడనే కదా, మీ కులం వాడనే, మీ యూరి దగ్గర వాడను, బాగా చదువుకొన్న వాడను, పెద్ద ఉద్యోగం చేసి యున్న వాడను, ఈ అభిమానం కూడా లేకుండా మీరు నన్ను నిరసించటం ఏమాత్రం బాగుండలేదు. నేను మీకు చేసిన అపచారంగాని, అపకారంగాని ఏమి?"టని సూటిగా అడిగాను. దానికి తత్తర బిత్తర పడి ఏదో సమాధాన మిచ్చాడు. తర్వాత అహమ్మదాబాదులో అనుకుంటాను, నేను వారికి నియమించిన గొడ్లచావిళ్ల వంటి బసలో ఉండుట కిష్టంలేక అక్కడి ప్రయాణీకుల బంగళాలో ఏర్పాటు చేసుకొన్నాను. మరునాడు మధ్యాహ్నం నేను కొంచె మాలస్యంగా బైలుదేరేటప్పటికి, నాకు చెప్పకుండానే ఈ గుంపు చూడటానికి బైలుదేరి వెళ్లారు. నేను అదరా బాదరాగా వెళ్లి వారిని కలుసుకొన్నాను. ఇక వారితో వుండటాని కిష్టంలేక, ముందుగానే రైలెక్కి బొంబాయి చేరుకొని ఒక హోటల్లో ఉండి తర్వాత సరాసరి ఇంటికి వచ్చేశాను. తిరిగి వచ్చిన కొన్నిరోజులకు ఆ బంధువు, "మీరేదో నాయందు తప్పు అభిప్రాయంపడ్డారు, అదేమీ లే"దని, సమాధానపరచే ధోరణిలో వ్రాశాడు. నేను జవాబు వ్రాస్తూ, "ఈ విద్యా విహీనులతో, అనామకులతో ఇంకొక సందర్భంలోనైతే మాట్లాడనే మాట్లాడేవాడను కాను. నేనెవరనో తెలియని వాళ్లు కాదు. అందరం కలిసి ఒక గుంపుగా వచ్చాం. వీళ్లతో సామరస్యంగా ఉండాలని మిక్కిలి ఓపిక పెట్టి నేనెంత ప్రయత్నించినా, ఈ మూర్ఖులు న

న్నెదో కించపరచాలని ప్రయత్నించారు. ఈ చర్య నాకు ఆశ్చర్యాన్నే గాక, మిక్కిలి బాధను కల్గించింది '' అని జవాబిచ్చాను. చదువెళ్లున్నా, సంస్కారం లేసివారితో సహచరించటం కష్టమని, సమస్థాయిలో లేనివారితో వ్యవహరించటం తప్పని నాకు తోచింది, తోస్తున్నది. కుల మొక్కటే అయినా, చేసే పని ఒక్కటే అయినా, 'కయ్యానికి, వియ్యానికి సమానస్థాయి ఉండా'లన్నది, ఇతర సందర్భాలలో కూడా వర్తిస్తుంది.

బొంబాయి నుండి బైలుదేరి కైరా జిల్లాలోని ఆనంద్‌కు 16-3-1966 ఉదయం చేరుకొన్నాం. అక్కడి సుప్రసిద్ధ అమూల్ ఫాక్టరీకి వెళ్లాం. ఈ ఫాక్టరీలో వెన్న, జున్ను, పాలపొడి, పిల్లల పోషకాహారం చేస్తారు. అక్కడ మాకు డాక్టరు సుదర్శనం మమ్ము వివిధ విభాగాలకు తీసుకొనివెళ్లి విషయాలను విశదపరుస్తూ చూపించారు. వీరు తెలుగువారు. మేజర్ మురారి తండ్రి సోదరుని కుమారుడట. 17, 18 తారీఖులలో కో-ఆపరేటివ్ మిల్కు ప్రొడ్యూసర్స్ యూనియన్, మిల్కు కలెక్షన్ సెంటరును, పోల్సన్స్ డైరీని, అగ్రికల్చరల్ ఇన్‌స్టిట్యూటును, కంజరీలోని సంస్థను, ఆనంద్ కాటిల్ ఫారమ్‌ను చూచాం. అగ్రికల్చరల్ ఇన్‌స్టిట్యూటును ఒక కమిటీ నిర్వహించుచున్నది. దీనికి యూనిసెఫ్, విదేశాలు సాయం చేస్తూండినవి. ఈ సంస్థ కొన్ని హైస్కూళ్లను, కాలేజీలను నడుపుచున్నది. దీనికి ఆరు వందల ఎకరాల భూమున్నది. అందులో కట్టడాలు వగైరాలకు రెండు వందల ఎకరా లట్టిపెట్టారు. తతిమ్మా నాల్గు వందల ఎకరాలలో మొక్కజొన్న, జొన్న, చెరుకు పండిస్తారు. మధ్యరకం యంత్రాలయంలో వెన్న, పాలపొడి ఉత్పత్తి చేస్తారు, రొట్టెలను కూడా తయారుచేస్తారు, కాంక్రేజ్ ఆవులు, గిత్తలు, విశేషం సుర్తీ గేదెలను పెంచుతారు. పెద్ద కోళ్ల ఫార మున్నది. తెల్ల లెగ్ హారెన్సుకు, అమెరికన్ బూడిదరంగు పిట్టలతో సంకరజాతిని సృష్టించారు. ఈ సంకరజాతి పిట్టలు పెద్ద రక మివి. తక్కువ తిండి తిని ఎక్కువ గుడ్లు నిస్తవట.

కైరా జిల్లా పాలోత్పత్తికి యావద్భారతంలో మిక్కిలి ప్రఖ్యాతి గాంచింది. ఆ జిల్లాలో ఏడువందల గ్రామాలలో

సహకార సంస్థలను స్థాపించి, వానిని సంయుక్తపరచి ( ఫెడరేట్ చేసి ) 250 చదరపుమైళ్లలో నుండిన ఈ ఏడువందల గ్రామాల సహకార సంస్థలనుండి రెండు లక్షల కుటుంబాలు పోసే పాలను సేకరించుచుండినారు. ఇప్పుడా గ్రామాల సహకార సంస్థల సంఖ్య, వాని సభ్యుల సంఖ్య, లభ్యమయ్యే పాలు చాలా పెరిగి యుండును. సేకరించిన పాలలో చాలాభాగాన్ని 266 మైళ్ల దూరంలో వున్న బొంబాయికి ఎగుమతి చేస్తున్నారు. 1955 లో అముల్ పాల ఫాక్టరీని కట్టి, వెన్నను, పాలపొడిని తయారు చేయట మారంభించారు. 1958 లో ఈ ఫాక్టరీని విస్తృత పరచి, తర్వాత దానిని వృద్ధిపరచి పిల్లల ఆహారం మొదలైనవి కూడా ఉత్పత్తి చేస్తున్నారు. ఇప్పుడు సహకార సంస్థలు 766 కు, సభ్యులు 2 లక్షల 15 వేల వరకు పెరిగినట్లు, సంవత్సరానికి 1 కోటి 20 లక్షల కిలోగ్రాముల, అనగా లీటర్ల పాలను సేకరించు చున్నట్లు 23-9-1973-వ తారీఖు హిందూపత్రిక తెలుపుచున్నది. వీరి అముల్ వెన్న, అముల్ పాలపొడి. అముల్ ఛీజ్ పేర్లు వినియే యుందురు. ఇవన్నీ, పై కైరా జిల్లా పాలపథకం క్రిందనే అముల్ పేరుతో ఉత్పత్తి అగుచున్న సరుకులు.

కంజరి గ్రామంలో, పాలను కొని అమ్మే సహకార సంస్థను 1949-50 లో 88 సభ్యులతో ఆరంభించారు. 1964-65 నాటికి, సభ్యుల సంఖ్య 508 కు పెరిగింది. పాల కొనుగోలు 47,585 లీటర్ల నుండి, 4,54,537 లీటర్లకు పెరిగింది. నికర లాభం 16,664 రూపాయలు వచ్చింది. ఇక్కడి విశేషం, వచ్చిన పాలలో సగాన్ని, గ్రామస్థులకు చిల్లరగా, లీటరు 80 పైసలుకు అక్కడనే అమ్ముచుండినారు, వారి ప్రధానోద్దేశం లాభ సంపాదనగాక, ప్రజల కుపయోగపడటం. మే మా ప్రదేశం చేరు కొన్నప్పుడు, పాలను సరఫరాదార్ల నుండి తీసుకొనటం, దానిని కావలసినవారికి అమ్మటం జరుగుచుండింది. ఇది చాలా అనుకూల మైన ఏర్పాటు. ఇది భారత ప్రభుత్వ పాలపథక నిర్మాణ ముఖ్య సూత్రాలలో నొకదానిని నెరవేర్చటం.

ఈ గ్రామంలోపలికి వెళ్లిచూచాం. ఇది 7, 8 వేల జనాభా గల మేజరు పంచాయతి. గ్రామస్థులు చాలావరకు

బీదవారు. సగటున తలసరి వున్న భూమి 2½ ఎకరాలు మాత్రమే నట. కొలది మంది పెద్ద ఆసాములకున్న భూమి, ఏ ఒకరికీ 15 ఎకరాలు మించి లేదట. ఈ గ్రామస్థుల వృత్తి ముఖ్యంగా పశువులను పెంచటం. ఈ పశువులను తమ యిండ్ల క్రింద భాగంలో కట్టి, పై భాగంలో యజమానులు కాపురంచేస్తారు. నిజానికి ఏ రిళ్లు అన్నీ మరగాళ్లమీద (స్టిల్ట్సు) కట్టినవి. ఇంటిపైన ఏ అతుకుల బొతుకుల తోనో గూళ్లవలె కట్టబడిన అంతస్తు ఉంటుంది. క్రింది భాగం వరండాగా ఏర్పడి వుంటుంది. ఈ వరండాలోని స్తంభాలమధ్య పశువులను దగ్గర దగ్గరగా కట్టుతారు. కుటుంబం పై అంతస్తులో చిన్న చిన్న గదులలో నివసిస్తుంది. ఈ ఇళ్ల త్రోవలు యిరుకుగా, మురికిగా వుంటవి. పైగా, దోమల బాధను తప్పించుకొనటానికి సాయంత్రం కాగానే, చెత్త చెదారం పేర్చి, నిప్పుపెట్టి, పొగను కల్పిస్తారు. దట్టమైన పొగతో ఆవరింపబడి గృహాలు చిందర వందరగా వుంటవి. నిజానికి ఊరు పరిశుభ్రంగా వుండదు. మురికిగా, చీదరగా వుంటుంది. బజారులన్నీ యిరుకే.

సామాన్యంగా చెప్పాలంటే, గుజరాతి పశుకాపరులు వంటినిండా పసుపో, ఆవాలనూనెవంటి దానినో పూసుకొని, మురికి ముతక బట్టలతో మకిలిగా వున్నట్లు నాకు తోచారు. సామాన్యరైతు కూడా పరిశుభ్రంగాగాని, నాజూకుగాగాని నాకు కనపడలేదు. అయితే పశుకాపరులలో చాలామంది మిక్కిలి బలిష్ఠులుగా కనపడ్డారు. సామాన్యరైతుల్లో తెలివితేటలు, చదువుకొన్న వారుండవచ్చును. 24 గంటలు పశువుల శాలల్లోనే గడిపే జీతగాళ్లు మురికిగా ఉండటం ఆశ్చర్యకరం కాదేమో! ఎక్కడో గుర్తులేదు గాని, ఒకటి రెండుచోట్ల మంచి దుస్తులు ధరించిన పశు సంస్థల యజమానులు మమ్ములను సత్కరించారు. ఆనంద్‌లో అనుకొందును, ఆకర్షణీయమైన పటేలుగారొకరు మా కార్యక్రమాన్ని నెరవేర్చారు. ఆయనను, సర్దార్ వల్లభ భాయి పటేల్ గారి కుటుంబంలోని వాడనుకొంటే, అంతపొరపాటుండదు. నిజానికి మహాధీరుడు, మహిమాన్వితుడు, మహా

భాగుడు, శ్రీ సర్దార్ వల్లభ భాయిపటేల్ గారా ప్రాంతంలోనే జన్మించారట.

ఆనంద్ లోనని గుర్తు, కొన్ని పదుల ప్రత్యేక ప్రత్యేక పశువుల శాల లున్నవి. కొందరు ప్రముఖులు, ఒక్కొక్కరు ఒకటో, రెండో ఈ పశువుల సముదాయాలను పోషించు చున్నారు. వీరు తమ జీతగాళ్లద్వారా పశువులను పోషణజేసి పాల నమ్మటమో లేక పశువులను పాల సీజనుకు గుత్త కివ్వటమో జరుగుతోందట. మేము చూచిన ఫారాలలో పెంచబడేవి ఆవులే గాని, ఈ ఆనంద్ ఫారమ్‌లో మాత్రం పై జెప్పినట్లు కొన్ని సురితీ గేదెలను చూచాము. ఆనంద్ నుండి స్పెషల్ బస్సులో బరోడా నగరానికి వెళ్లాం. నగరం చేరక ముందు ఒక పెద్ద కర్మాగారాన్ని చూచి, 'మహాలక్ష్మి' అను పేరుగల మహారాజావారి ప్రాసాదానికి వెళ్లాం. ఆ మహాసౌధంలో అనేక చిత్రపటాలు, చంద్ర కాంతశిలా విగ్రహా లున్నవి. ఈ విగ్రహాలలో చాలాభాగం ఇటలీలోని నేపుల్స్ మ్యూజియం లోని విగ్రహాల నకలు లట. మిక్కిలి బాగుండినవి.

ఆనంద్‌ను 19-వ తారీఖు ఉదయం విడిచిపెట్టి అహమ్మదా బాద్‌కు చేరి, ఆ రోజు, మర్నాడు సాయంత్రం వరకు అక్కడ గడిపాం. నేను 19-వ ఉదయం 9 గంటలకు గుజరాత్ రాణి అనే ఎక్స్‌ప్రెస్ రైలులో 10-30 గంటల కల్లా అహమ్మదాబాద్ చేరాను గాని, ఇతరు లందరు మధ్యాహ్నం 3-30 గంటలకు గాని చేర లేదు. అందువల్ల మర్నా డుదయంగాని మే మక్కడి పెద్ద మునిసిపల్ డైరీని చూడ లేదు. దాని వివరా లిప్పుడు జ్ఞాపకం లేదుగాని, చాలా పెద్దఎత్తున సమర్థవంతంగా నడుపబడుచున్నదని తోచింది. ఇక్కడ 19-వ సాయంత్ర మొక పార్కులో పర్‌చాలి అనేవారిని కలసికొన్నాను. తాను రిటైర్డ్ జిల్లా జడ్జి అని చెప్పాడు. ఆయనతో కలసి మ్యూజియంకు వెళ్లి ఆధునిక చిత్రాలు వగైరా చూచాను. కొన్ని బాగానే వున్నవి. సబర్మతి

బ్రిడ్జి దాటి కాంకర్యా అనే ప్రదేశంలో ఒక సరస్సు చుట్టూ వుండిన రింగ్ రోడ్డు ద్వారా తిరిగి వచ్చి, లా కాలేజి, గుజరాతి కాలేజి చూచాను ఆయనతో కలసి చక్కగా, శుభ్రముగా నడుప బడుచున్న ఒకమంచి ఉపహార, భోజనశాలకు వెళ్లి ఉపహారాలు తీసుకొన్నాను.

నే నప్పటికి ఆ గుంపు నుండి విడివడాలని, దానితో సంబంధం లేకుండా, అక్కడికక్కడకు వెళ్లుట కారంభించాను. నాయందు కొంత అభిమాన మున్న పెడనవగల్లుకు దగ్గరి గ్రామాల వారొక రిద్దరు నన్ను దారిలో కలసికొని, ''వెళదాం రం''డని పిలిచారు. ''నే నిక మీ గుంపుతో సంబంధం పెట్టుకో''నని చెప్పి నా దారిన నేను వెళ్లాను. ప్రోగ్రాం ప్రకారం, వా రందరు 20-వ తేది రాత్రి 8 గంటలకు జనతా ఎక్స్ప్రెస్‌లో అహమ్మదా బాదు నుండి బైలుదేరగా, నేను మధ్యాహ్నానికే పూర్వమే బైలుదేరిన ఒక రైలెక్కి బొంబాయి చేరుకొన్నాను. వా రందరు 22-వ తారీఖున బొంబాయి మీదుగా హైదరాబాదు చేరుకొని, 23-వ తారీఖుకు విజయవాడ చేరుకోగా, నేను బొంబాయిలో అపొల్లో బందరు లోని పైరక్స్ అపొల్లో హోటలులో రోజుకు 28 రూపాయ లిచ్చి 24-వ తారీఖు వరకు ఉండినాను. బొంబాయి నుండి సరాసరి విజయవాడకు వచ్చేశాను. బొంబాయిలో ఇండియా గేటు, మలబార్ హిల్లు, అక్కడి వ్రేలాడు (హాంగింగ్) గార్డెన్స్, విక్టోరియా గార్డెన్స్, జహాంగీరు ఆర్ట్ గాలరి, ప్రిన్స్ ఆఫ్ వేల్సు మ్యూజియం చూచాను. దాదాభాయ్ నౌరోజి రోడ్డు లోని కాంటినెంటల్ ఫొటో స్టోర్సుకు వెళ్లి కొన్ని పుస్తకాలు కొన్నాను. క్రాఫర్డ్ మార్కెట్టుకు వెళ్లి బట్టలు కొన్నాను. ఇతరచోట్ల పైలెట్ పెన్ను, చెప్పులు వగైరా కొన్నాను.

చూడడానికి వెళ్లిన 34 మంది జట్టులో నూజెళ్ల వాస్తవ్యులు శ్రీ పర్వతనేని వెంకటరత్నం, గుడ్లవల్లేరు వాస్తవ్యులు శ్రీ వల్లభనేని రంగయ్య, పామర్రు కాపురస్తులు శ్రీ బొమ్మారెడ్డి

అర్జునరెడ్డి, భట్లపెనుమర్రుకు చెందిన శ్రీ చలసాని కుటుంబరావు, కృష్ణాపురంకు చెందిన శ్రీ కోన కుటుంబరావు, పెదపూడికి చెందిన శ్రీ పరుచూరి పూర్ణచంద్రరావు, బార్లపూడికి చెందిన శ్రీ కోనేరు నరసింహారావు,బొమ్ములూరుకు చెందిన శ్రీ లింగం నారాయణరావు ఉండినారు. పేరు గుర్తులేదు గాని, తేలప్రోలుకు చెందిన ఇద్దరు రెడ్లుండినారు. సరే, ఏదోవిధముగా యాత్ర పూర్తి అయింది. సహచరులవల్ల కొంత బాధ కలిగినా, కొన్ని విశేషాలు చూచా నన్న తృప్తికలిగింది. కొన్నాళ్లకు మా మార్గదర్శకుడుగా నుండిన డాక్టరు యస్. వెంకటేశ్వరరావుగారు వచ్చి ప్రభుత్వం వా రివ్వ నిర్దేశించిన 200 రూపాయలు ఇవ్వబోగా "వద్ద"ని చెప్పాను. కాని "మా రూల్సు ప్రకారం ఇవ్వక తప్పదు. మీరు తీసు కోవలం"డని బలవంతంగా నా చేతిలో పెట్టి వెళ్లాడు. ఇక్కడితో ఆ ప్రస్తావన ముగిసింది.

నాకు పశువుల విషయంలో ప్రత్యేకాభిమాన మున్నదని పైన చెప్పాను. ఆ డిపార్టుమెంటులో 1953 లో అప్పటి పశు శాఖ డైరెక్టరు మేజర్ టి. మురారిగారి ద్వారా ప్రథమ పరిచయ మైనతర్వాత వారి స్థానే వచ్చిన శ్రీ పి. యమ్. యన్. నాయుడు, శ్రీ పి. ప్రభాకరరావుగార్లతో బాగా పరిచయమైనది. అది వరకే ఎరిగియున్న శ్రీ సి. కృష్ణారావు, శ్రీ పి.రాజ్ గార్లతో కొంత చనువు కూడా ఏర్పడింది. 1955 లో బాపట్లలో జరిగిన పశు ప్రదర్శనకే గాక అంతకు ముందు 1942 లో బెజవాడలోను, తర్వాత ఇతరచోట్ల జరిగిన ప్రదర్శనాలుగాక అప్పు డప్పుడు జరిగిన ప్రదర్శనాలు కూడా చూచుచుండేవాడను. మూడు నాల్గు సార్లైనా గ్రామాలలో ఏర్పరచిన ఎడ్ల పందాలను, పశువుల ప్రదర్శనాలను చూచాను. ముఖ్యముగా రెండు అఖిల భారత ప్రదర్శనాలకు డెలిగేట్ గా వెళ్లాను. నేను వెళ్లిన మొదటిది 1959 ఫిబ్రవరి చివరివారంలో బెంగుళూరులోని సుభాస్ పార్కులో జరిగింది. రెండవది 1961 లో హైదరాబాదులోని ఎగ్జిబిషన్ గ్రౌండ్సులో జరిగింది. బెంగుళూరులో జరిగినదానికి అప్పుడు పార్లమెంటరి మెంబరుగా నుండిన శ్రీ యన్. శ్రీరామరెడ్డిగారు

ప్రధాన బాధ్యత వహించారు. వారి నదివర కెరిగి యుంటినని నా రెండవ భాగంలో వివరించాను. వారు నన్నెంతో ఆదరించి ఆ కమిటీ, ఈ కమిటీలో సభ్యుడినిగా వేశారు. అప్పుడు వ్యవసాయ పశుపోషణ కేంద్ర డిప్యూటి మంత్రిగా వుండిన శ్రీ యమ్. వి. కృష్ణప్పగారు, ప్రదర్శన జయముగా నిర్వహింప బడటానికి మిక్కిలి శ్రద్ధ తీసుకొన్నారు. పశుప్రదర్శనాన్ని కేంద్ర మంత్రి (శ్రీ) లాల్ బహదూర్ శాస్త్రిగారు ప్రారంభించారు. అఖిల భారత పశుపోషకుల సభను అప్పుడు మైసూరు గవర్నరుగా వుండిన మైసూరు మహారాజావారు (శ్రీ) జయచామరాజవుడయార్ గారు ప్రారంభించి మిక్కిలి చక్కగా ఉపన్యసించారు. వారు, మంచి ఉచ్చారణతో చక్కని ఇంగ్లీషులో ధారాళంగా మాట్లాడారు. ఆ ఉచ్చారణ ఇంగ్లీషు ట్యూటర్లవద్ద గట్టి అధ్యయనంవల్ల కలిగివుంటుంది. ఆ ఉచ్చారణ, భాషాశుద్ధి, ఉపన్యాసధార నాకు మెప్పును కలిగించినవి. ఆ ప్రదర్శనం చాలా విస్తృతమైనది. దేశం నలుమూలల నుండి మేలైన పశువులు వచ్చినవి. కృష్ణాజిల్లానుండి కాటూరు గ్రామస్థుడు శ్రీ మల్లిఖార్జున రావుగారు ఒక మేలైన విత్తనపు గిత్తను, బెజవాడనుండి శ్రీ అచ్చయ్యగారు రెండు మూడు ముర్రాజాతి గేదెలను, గుడ్లవల్లేరు నుండి శ్రీ వల్లభనేని రంగయ్యగారు ఒంగోలు ఆవును తెచ్చినట్లు గుర్తు. రంగయ్యగారి ఆవుకు, అచ్చయ్యగారి గేదెకు మొదటి బహుమతులు లభించినవి. 1961 లో హైదరాబాదులో జరిగిన ప్రదర్శనం కూడా గొప్పదే. అది విశాలమైన ఎగ్జిబిషన్ గ్రౌండ్సులో జరిగింది. ఆ ప్రదర్శనంలో నన్ను ప్రత్యేకించి అభిమానించిన వారెవ్వరు లేకపోయినా, నే నే కమిటీలోను మెంబరుగా వుండకపోయినా నేను తృప్తిగానే ప్రదర్శనం చూచాను. ఆ ప్రదర్శనములో కృష్ణాజిల్లా గుడివాడ శ్రీ అడుసుమిల్లి విశ్వేశ్వరరావు భారీ విత్తనం గిత్త, (శ్రీ) అచ్చయ్య ముర్రా గేదెలు, (శ్రీ) మల్లిఖార్జునరావు గిత్త వుండినవి. (శ్రీ) విశ్వేశ్వర రావు గిత్తకు బహుమతి లభించింది. బెంగుళూరు ప్రదర్శన సందర్భంలో అఖిల భారతీయ గోపాలక సమ్మేళన సభలో నేను

ఉపన్యసించాను. బొంబాయి ప్రాంతంవారికి, ముఖ్యంగా మార్వాడీ గుజరాతీలకు పశువు లనగా ఆవులని, పాడి అనగా ఆవుపాలని మాత్రమే అర్థం. వారు "ఆవులను మాత్రమే పోషించాలి, బక్క చిక్కిన ఆవులను, రోగగ్రస్తమైన వానిని, ఆస్పత్రులద్వారా రక్షించాలి, ఆవు పాలనుమాత్రమే ఉపయోగించాలి. గేదెలను, వాని పాలను నిషేధించాలి" అనే ధోరణివారు. పశురక్షణ అనగా, గోరక్షణ అనియే వారి భావము. నేను ఈ ధోరణిని ఖండించాను, "ఉత్తర ప్రాంతాలలో ఎట్లున్నా, దక్షిణాన కొన్ని ప్రదేశాలలో ఎట్లున్నా, సర్కారు జిల్లాలలో, ముఖ్యంగా మా కృష్ణా, గుంటూరు, ఉభయ గోదావరి జిల్లాలలో మాకు గేదె పాలే ప్రధానం. మా ప్రాంతాలలో ఆవులు ఎక్కువ పాలివ్వవు. వాని కున్న కొంచెంపాలు దూడలకు కూడా పూర్తిగా సరిపోవు. ఆవులను మేపటం యాతన. ఏ గడ్డిఅయినా గేదెలకు సరిపోతుంది. సామాన్య గృహస్థులు పుష్కలమైన పచ్చగడ్డి, పుష్టికరమైన దాణాను పెట్టి ఆవులను పోషించలేరు. అన్నిటికి మించి మేము పెరుగు ఎక్కువగా ఉపయోగిస్తాం. నేయి ఎక్కువగా వాడతాం. చిక్కని పెరుగు కావాలన్నా, కమ్మని నెయ్యి కావాలన్నా ఆవులనుండి లభ్యంకాదు. వీనికి గేదెలే శరణ్యం. ఇప్పుడు ప్రాంతీయ సామాన్య గేదెల జాతిని, ముర్రాజాతి దున్న పోతులతో సంపర్కం కలిగించి, వృద్ధిచేసుకుంటున్నా కొంత మంది పంజాబులోని రోతక్, ఢిల్లీ ప్రాంతముల నుండి సిసలైన ముర్రాజాతి పశువులను దిగుమతిచేసుకొనుచున్నారు. ఈ అభి వృద్ధిని నిరోధించకూడదని ఇంకొకసారి గట్టిగా చెప్పుచున్నా"నని ఉద్ఘాటించాను.

1967 ఏప్రిల్‌లో బెజవాడలో జరిగిన ప్రదర్శనానికి హాజరైనాను. దానికి అప్పటి వ్యవసాయ పశుసంరక్షక శాఖల మంత్రి శ్రీ పెద్దిరెడ్డి తిమ్మారెడ్డిగారు, డైరెక్టరు శ్రీ చిత్తజల్లు కృష్ణారావుగారు, హెడ్ క్వార్టర్సు డిప్యూటి డైరెక్టరు శ్రీ ఎ. యస్. ప్రకాశరావుగారు, ఢిల్లీనుండి వచ్చిన కేంద్ర వ్యవసాయ డిపార్టుమెంటువారు, శ్రీ డి. విశ్వనాథరెడ్డి మొదలైన ఆఫీసర్లు హాజరైనారు. ఆసందర్భంలో సాయంత్రం కృష్ణాజిల్లా పరిషత్

ఛైర్ మన్ శ్రీ పిన్నమనేని కోటేశ్వరరావుగారి అధ్యక్షతన పశుపోషకుల సమావేశం జరిగింది. మంత్రిగారు గాక శ్రీ కాకాని వెంకటరత్నం, డాక్టర్ శ్రీ టి. వి. చలపతిరావు వంటి పెద్దలు చాలామంది హాజరైనారు. ఆ సభలో నేను మాట్లాడుచూ, "పాలోత్పత్తి సంఘా లను పేరున క్రొత్త సంఘాలనుపెట్టి, అసలు సంఘాలైన పశుపోషకుల సంఘాలను త్రోసిరా జనుచున్నారు. ఇది 'ముందువచ్చిన చెవులకంటె వెనుకవచ్చిన కొమ్ములధిక' మన్నట్లున్నది. పైగా పశుశాఖోద్యోగులు సంస్థ నొకదానిని స్థాపించి, పశుగణాభివృద్ధి సంస్థను దానిలో కలపా లంటున్నారు. ఉద్యోగుల సంస్థ వాళ్ల ఉద్యోగాలు, జీతాలు, ప్రమోషన్లు సంబంధమైన సర్వీసు సంస్థ గాని పశుపోషక సంస్థ కానేరదు. కాబట్టి, తల్లి సంస్థయైన పశుపోషక సంఘాన్ని పెంపొందించాలి. స్థిరస్థాయిని చేయాలి. దాని తర్వాతనే తతిమ్మా సంఘా" లని గట్టిగా నొక్కి చెప్పాను. ఈ అభిప్రాయాలతో తా నేకీభ వించుచునట్లు మంత్రిగారు తమ ప్రసంగంలో చెప్పారు. ఇంకొకటి గట్టిగా చెప్పాను. "దేశంలో కేంద్ర ప్రభుత్వంవారు ఏర్పరచిన పాలప్రణాళికల ముఖ్యోద్దేశం పాల అధికోత్పత్తితోబాటు సన్నకారు రైతులకు, సామాన్య కుటుంబీకులకు అదనపు ఆదాయం లభించుట కొరకు. ప్రతి గ్రామంలోను ప్రతి చిన్నరైతు, ప్రతి చిన్న ఆసామి, ఒకటి రెండు బర్రెలను పెట్టుకొని, మిగిలిన పాలను అమ్ముకొని 'వేడినీళ్లకు చన్నీళ్లు తోడైనట్లు' తమ మనుగడకు ఆదాయం పెంచుకొన్నప్పుడే ప్రణాళిక ఉద్దేశం సఫల మౌతుంది. అంతేగాని, పెద్దపెద్ద ఆసామీలు వర్తక సరళిని పెద్దపెద్ద మందలను పెట్టి లాభాలను సంపాదించి మూటలు గట్టుకొనటానికి కాదు" అని ఉద్ఘాటించాను. ఇంకొక విషయం కూడా చెప్పాను. "అందరు ఖరీదు పెట్టి దాణాను కొనలేరు. హెచ్చుధరలో నున్న మిశ్రమ దాణా, వేరుశెనగచెక్క ఉలవలు మొదలైనవానిని కొనలేరు. బియ్యం, తవుడు కూడా ధర పెరిగి యున్నది. కాబట్టి చిన్నకారు ఆసామీలు ముఖ్యంగా వరిగడ్డితో బాటు పచ్చిమేతమీద ఆధారపడవలసి యున్నది. ఈ పచ్చిమేతలలో పిల్లిపెసర చాలా పుష్టికరమైన ఆహారం. ఇప్పటి పరిస్థితులలో పిల్లిపెసరను

వేసవిలో పెంచటానికి నీరు అందటంలేదు. కాబట్టి ప్రభుత్వం వారు అపరాలు మాసూలైన తర్వాత ఏప్రిల్, మే మాసాలలో పిల్లిపెసర వేసిన చేలకు నీ రందించాలి. వాణిజ్య పంటలైన చెరుకు, ప్రత్తికి అందించినట్లే, పిల్లిపెసరకు కూడా అందించాలి. ఒకవిధంగా చెరుకు, ప్రత్తి కంటె పిల్లిపెసర ఎక్కువ అవసరం'' అని నొక్కి చెప్పాను. ఈ సందర్భంలో నాకు బొంబాయి, న్యూజెలెండు హాస్టల్ అనుభవం జ్ఞాపకంవచ్చి ''నేను విదేశాలలో విద్య నభ్యసించినా, ప్రభుత్వోద్యోగంచేసినా, తాత తండ్రుల నుండి సంక్రమించిన రైతు మన స్తత్వం కలవాడను. కాబట్టి నేను ఉద్యోగస్థుడనుగా చెప్పుచున్నానని గాక, రైతుగా కష్ట సుఖాలు చెప్పుచున్నానని మీరు తలంచవలసిం''దని చెప్పాను. నాకు సమీపములో మొదటి వరుసలో కూర్చుండిన శ్రీ కాకాని వెంకటరత్నంగారు, ''మీరు ఆఫీసరు మాట్లాడినట్లే మాట్లాడు చున్నా''రన్నారు. వా రట్లనుటకు బహుశః కారణం నేను నిస్సంకోచంగా. గట్టిగా మంత్రిగారిని సంబోధించుచున్నట్లు మాట్లాడుటయే అనుకుంటాను. సభ ముగిసిన తర్వాత, నేను బైటికి పోవుచుండగా, మా ఉత్తరభారత సంచారంలో మాతో బాటు వచ్చియుండిన ప్రముఖ వ్యక్తి ఒకరు, ''మమ్ములనేమి చేయు మంటారు, ఉన్న ఆవు లన్నిటిని అమ్మివేయమంటారా ?'' అన్నట్లు నిస్పృహతో అన్నాడు. నేను సమాధానం చెప్పక నవ్వి వెళ్లి పోయాను.

1967 అక్టోబరులో అమెరికా సంయుక్తరాష్ట్రాలలో నొకటి యగు కాన్‌సాస్ రాష్ట్ర విశ్వవిద్యాలయ ప్రొఫెసరు ఎరల్. యస్. మూర్ గారు, అక్కడక్కడ పాడిపశువులను, పశువుల ఆస్పత్రులను చూస్తూ ఈ యూరు శ్రీ రఘోత్తమరెడ్డి అనువారితో కలసి వచ్చారు. ఆయన వస్తున్నారని తెలిసి కొన్ని పశువులను ఆస్పత్రి ఆవరణలో చేర్చాం. వారు వాటిని చూచి బాగున్నవని సంతోషించారు. మాటలవరుసను నే నెవరినో చెప్పాను. ''పుల్లా రెడ్డిగారిని మీ రెరుగుదురా ?'' అన్నారు. ''బాగా ఎరుగుదును. నేను ఆక్స్‌ఫర్డ్‌లో చదువుకొనుచున్న రోజులలో క్రొత్తగా అక్కడకు వచ్చిన ప్రొబేషనరు పుల్లారెడ్డిగారి కంటె, ఆ విశ్వ

విద్యాలయ సంప్రదాయ ప్రకారం సీనియర్ విద్యార్థినైన నేను ఎక్కువ అంతస్తు కలవాడనుగా నుండినాను. ఇప్పుడాయన ఐ. సి. యస్. ఆఫీసరుగా నాకంటె చాలా పెద్దవారైనారు" అన్నాను. అందరితో బాటు మూర్ గారు, రఘూత్తమరెడ్డిగారు నవ్వారు.

1970 అక్టోబరు 6-వ తారీఖున మొవ్వలో ప్రాంతీయ పశుగణాభివృద్ధి కేంద్ర భవన ప్రారంభోత్సవం జరిగింది. భవనావిష్కరణను, వ్యవసాయ, పశుశాఖల మంత్రిపదవి నధిష్ఠించి యుండిన శ్రీ కాకాని వెంకటరత్నంగారు చేశారు. అప్పుడు జరిగిన సభకు పరిషత్ చైర్మన్ శ్రీ పిన్నమనేని కోటేశ్వరరావుగారు అధ్యక్షత వహించారు. లేబరేటరీని కృష్ణాజిల్లా కలెక్టర్ శ్రీ సి. శ్రీనివాసశాస్త్రిగారు ప్రారంభించారు. విరాళా లిచ్చిన దాతల చిత్రపటాలను శ్రీ గొట్టిపాటి వీరరాఘవేంద్రరావుగారు ఆవిష్కరించారు. శ్రీ చనుమోలు వెంకట్రావుగారు, శ్రీ రేపాల బుచ్చిరామయ్యశ్రేష్ఠిగారు, శ్రీ కలపాల సూర్యప్రకాశరావుగారు ప్రసంగించారు. అదివరకు జాతీయ పతాకను ఆవిష్కరించిన శ్రీ యార్లగడ్డ అంకినీడు ప్రసాద్ గారు కూడా ఆ సభకు హాజరై ప్రసంగించారు. ఆ సమయంలో నేను రచించిన రెండవ పుస్తకం "మారినకాలం" అన్నదానిని కొందరు మిత్రుల కిస్తూ మంత్రిగారి కందజేశాను. ఆయనగారు ప్రక్కనున్న బుచ్చిరామయ్య శ్రేష్ఠిగారిక్కూడా ఒక టివ్వం డన్నారు. ఆయనగారికి కూడా ఒక కాపీ యిచ్చాను.

శ్రీ కాకాని వెంకటరత్నంగారిని కొన్ని సంవత్సరాలనుండి ఎరిగియున్నాను. ఒకప్పుడు తనను నమ్మిన ఆచార్య రంగా గారికి ప్రదేశ కాంగ్రెసు కమిటి అధ్యక్షపదవి ఎన్నికలో ద్రోహం చేశారని బాధపడ్డాను గాని తర్వాతికాలంలో ఆయన అకుంఠిత ధైర్యసాహసాలను, కార్యదీక్షను, దక్షతను, పట్టుదలను, చేపట్టిన కార్యాన్ని ఎన్ని కష్టనష్టాలు కలిగినా సాధించగల శక్తిని తెలుసుకొని సంతోషించాను. ఒకవిధమైన అభిమానాన్ని పెంచుకొన్నాను. నన్నుకూడా ఆయన ఒకవిధమైన గౌరవ భావంతోనే చూచేవారు. ఒకప్పుడు బీహారు క్షామ బాధితుల

కని శ్రీ పిన్నమనేని కోటేశ్వరరావు, శ్రీ కొల్లి కోటేశ్వరరావు వగైరాలతో మాయింటికి రాగా సత్కరించి వా రాశించిన దానికంటె ఎక్కువ విరాళాన్ని బియ్యం రూపాన ఇచ్చాను. వారీమధ్య ఆంధ్రప్రాంతంలో కలిగిన అలజడిలో మిక్కిలి శ్రమించి, ఆందోళనపడి, తట్టుకోలేక గుండె ఆగి చనిపోవటం ఆంధ్రుల దురదృష్టం.

ఈ సందర్భాన శ్రీ ముక్త్యాలరాజా శ్రీ వాసిరెడ్డి రామ గోపాలకృష్ణ మహేశ్వరప్రసాద్ గారిని గురించి కొంత చెప్ప దలచాను. వారి జమీలో చాలాభాగం మెట్ట. పశువుల పోషణకు అనుకూలమైన ప్రదేశా లున్నవి. వారు తమ కోటవంటి ముక్త్యాల ప్రాసాదానికి సమీప ప్రాంతంలో ఆవులను పెంచటమే గాక, కొంతదూరంలో జగ్గయ్యపేట బెజవాడల మధ్య కంచిలి గ్రామంలో ఒంగోలుజాతి పశువులను పెంచేవారు. ఒక్క పశువులనేకాదు, బర్క్‌షైర్ జాతి నల్ల సీమపందులను పెంచే వారు. పందులనేగాదు, పెద్దజాతి అసీల్ కోళ్లను సాకేవారు. ఇంతేకాదు, వివిధ రకాల పావురాలను పోషించేవారు. వారి దగ్గరబంధువులలో ఒకరైన శ్రీ చిరుమామిళ్ల ప్రసాదుగారి సహా యంలో ఈ పనులన్నీ నెరవేర్చేవారు. చిరుమామిళ్ల ప్రసాదు గారికి పశువుల, పందుల, పావురాల అనుభవ మెంతవున్నదో నాకు బాగుగా తెలియదుగాని, వారు కోళ్ల విషయంలో మిక్కిలి నిపుణులు. అనేక ప్రదర్శనాలలో నిపుణులుగా వ్యవహరించి బహుమతు లిచ్చుటకు ఉత్తమమైన వేవో నిర్ణయించేవారు. అఖిల భారత ప్రదర్శనాలలో కూడా వారికి స్థాన మున్నది. శ్రీరాజా గారి పశుపోషణలోగల అభిమానాన్ని, అనుభవాన్ని పురస్క రించుకొని 1958 జూన్ 7-వ తారీఖున 38 మంది సభ్యులతో కృష్ణాజిల్లా పశుపోషకుల సంఘాన్ని స్థాపించినప్పుడు వారిని, వా రప్పుడు రాకపోయినా అధ్యక్షులుగా ఎన్నుకొనటం జరిగింది. పైన ఇదివరకే చెప్పినట్లు వారు తరుచు సామాన్య సమా వేశాలకు హాజరుకాకపోయినా, ముఖ్య సమావేశాలకు ఢిల్లీ నుండో, యునెస్కో నుండో పెద్దలు వచ్చినప్పుడు వారిని సంఘం తరఫున ఆహ్వానించి మర్యాదచేసేవారు. సంయుక్త

పాలసరఫరా పథక ప్రయత్నం సఫలమైనప్పుడు, విజయవాడ క్రొత్తపేటలో ది 2-10-1963 తారీఖున పాలఫాక్టరీ భవనాల నిర్మాణానికి శంఖుస్థాపన చేయబడింది. శంఖుస్థాపన చేసిన చాలాకాలానికి గాని భవనాలు కట్టటం పూర్తికాలేదు. గృహ ప్రవేశ సందర్భంలో శ్రీ రాజాగారు కార్యనిర్వహణలో ప్రముఖ పాత్ర వహించారు. వారప్పుడు మాట్లాడుచూ మిక్కిలి విస్పష్టంగా, ధారాళంగా, మనోహరంగా ఉపన్యసించారు. ఆ ఉపన్యాసం విని, తర్వాత వారితో "ఎక్కడ ఒత్తును ధృవీకరించవలెనో, ఏ వాక్కును సరళంగా చెప్పవలెనో ఆవిధంగా చెప్పినవారిలో మీరు శ్రీ దేవులపల్లి కృష్ణశాస్త్రిగారితో సమానులు. వారు, మీరు యిద్దరే ఇంత చక్కని ఉచ్చారణతో, జీరలేని కంఠముతో ప్రస్ఫుటంగా చెప్పగల శక్తిగలవారు" అని ప్రశంసించాను. ఇంకొక సందర్భంలో, అనగా 1966 లో శ్రీమంతు రాజా యార్లగడ్డ శివరామప్రసాద్ బహద్దర్ గారి షష్ఠిపూర్తి ఉత్సవమున కవుల సదస్సు జరిగినప్పుడు ఆ యా కవులను పరిచయపరుస్తూ ముక్త్యాల రాజావారు చెప్పింది, వారి ప్రస్ఫుట వాక్యమేగాక, భాషాధోరణి కూడా మిక్కిలి ఆహ్లాదాన్నిచ్చింది. వారు సరసులు, స్నేహశీలురు, నిరాడంబరులు, యుక్తాయుక్త వివేచన కలవారు. అట్టివారు ఇంకను చాలా చిన్నవయస్సులోనే ఈమధ్య పరలోకప్రాప్తి చెందటం విషాదకరమైన సంగతి.

విజయవాడ పట్టణాని కవతలి చివర భాగాన క్రొత్తపేటలో వున్న పాలఫాక్టరీని కట్టే స్థలానికి చేరాలంటే పట్టణం గుండా దానిని దాటి చివరకు వెళ్లాలి. వెళ్లేమార్గం చికాకు కలిగించేదే కాక దూరం కూడాను. మేము బందరు — హైదరాబాద్ ట్రంకు రోడ్డు మీద బందరువైపున పట్టణాన్నానుకొనివున్న మైదానం వంటి విశాలమైన స్థలం లోనో, ఆ ప్రాంతం లోనో పాలఫాక్టరీని కడతారని తలంచాం. కాని విజయవాడ రాజకీయాల ఒత్తిడికి లోబడి, వెనుకబడిన సంఘాల కాకరమైన క్రొత్తపేట ప్రాంతాన పెట్టాలని నిర్ణయించారు. నిజానికి ఈ స్థలం పిరికి నేలకు పునాదులకే చాలా ఖర్చుపెట్టవలసి వచ్చింది, ఇటువంటి సర్వ

ప్రజోపకరమైన పనులలో కూడా రాజకీయాలు ప్రవేశించటం మిక్కిలి దురదృష్టం.

ఆంధ్రప్రదేశ్ పశు సంవర్ధక సంఘాన్ని 1953-వ సంవత్సరములో అనుకుంటాను, పెట్టి కొన్ని సంవత్సరాలు జయప్రదంగా నడిపారు. అప్పుడా సంఘానికి శ్రీ బెజవాడ రామచంద్రా రెడ్డిగా రధ్యక్షులని గుర్తు, ఆ సంఘం 'పశు సంపద' అనే మాసపత్రికను మిక్కిలి ఉపయోగకరమైన సంగతులతో ప్రచురించేది. కొలది సంవత్సరాలు గడచిన తర్వాత ఆ మాసపత్రిక క్షీణించింది. 1961-వ సంవత్సరానికి ముందే పశుశాఖోద్యోగులు తమ ఉద్యోగ వసతుల మీదకు దృష్టిని సారించి, కేంద్రీకరించి ఆంధ్రప్రదేశ్ వెటెరినరి అసోసియేషన్, ఆంధ్రప్రదేశ్ వెటెరినరి అసిస్టెంటు సర్జనుల అసోసియేషన్ పెట్టాలని నిశ్చయించుకొన్నారు. ఈ సంఘాలను లాంఛనపూర్వకంగా ప్రారంభించాలని 1962 సంవత్సరం జనవరి 8-వ తారీఖున అప్పటి పశుగణాభివృద్ధి శాఖ మంత్రి శ్రీ యమ్. నరసింగారావుగారి అధ్యక్షతన విజయవాడ రైస్ మిల్లర్సు అసోసియేషన్ హాలులో సభ నేర్పాటు చేశారు. పశుపోషకుల కళ్లు తుడచటానికో అన్నట్లు ఆరోజునే, రెండు గంటలు ముందుగా ఆ మంత్రిగారి ఆధ్వర్యంక్రిందనే ఫిలిమ్ ఛాంబర్‌లో కృష్ణాజిల్లా పశుపోషకుల సంఘం సభను ఏర్పాటు చేశారు. పశుపోషకుల సంఘం సభ సామాన్యంగా జరిగిపోయింది. నేను పశు సంపద మాసపత్రికను నిలిపివేయకూడదని, పశువుల ఆరోగ్యం, మేత, దాణా విషయం, మంచి పశువులను సన్నకారు కుటుంబీకులకు లాభం లేకుండా సప్లయి చేసే విషయం మాట్లాడాను. తరువాత జరిగిన వెటెరినరి అసోసియేషన్, వెటెరినరి అసిస్టెంటు సర్జనుల అసోసియేషన్ ఉమ్మడి సభలో నేను లేచి "మీరు క్రొత్తగా పెట్టిన సంఘాలు, మీ సర్వీసు సంఘాలు. మీ జీతాలు, ఇతర వసతులు, ప్రమోషన్లు వగైరా మీ ఉద్యోగుల సుఖాలకు, లాభాలకు సంబంధమైనవి. అవి ఎంతమాత్రం పశుపోషణకు, వాని సంవర్ధనకు, పాలోత్పత్తికి సంబంధించినవి కావు. మీరు ఈ సర్వీసు సంఘాల నభివృద్ధిపరచుకొని పశు సంవర్ధక సంఘాన్ని త్రోసి రాజనటం అనుచితం" అని గట్టిగా చెప్పాను.

ఇప్పుడా సర్వీసు సంఘ మెంతవరకు పనిచేస్తున్నదో చెప్పలేను. కాని ఆంధ్రప్రదేశ్ పశు సంవర్ధక సంఘం మూలబడినట్లున్నది. 'పశుసంపద' మాసపత్రిక పూర్తిగా నిలిచిపోయింది.

1966 ఫిబ్రవరి 13-వ తారీఖున పామర్రు శీతలకేంద్రం వార్షికోత్సవం జరుపుకొన్నది. అప్పుడు వ్యవసాయం, పశువుల శాఖల మంత్రిగా నుండిన శ్రీ అ. బలరామరెడ్డిగా రావుత్సవానికి అధ్యక్షత వహించారు. ఆఫీసర్లేగాక, జిల్లాపరిషత్తు అధ్యక్షులు శ్రీ పిన్నమనేని కోటేశ్వరరావు వంటి హోదా గలవారు, శ్రీ పర్వతనేని వెంకటరత్నం, శ్రీ వల్లభనేని రంగయ్య, శ్రీ అడ్సుమిల్లి వెంకటసుబ్రహ్మణ్యంవంటి రైతుప్రముఖులు, అధిక పాలోత్పత్తిని చేసే దక్షులు, చుట్టుప్రక్కల గ్రామాలనుండి అనేకమంది రైతులు వచ్చారు. మంత్రిగారు మాట్లాడుచున్నప్పుడు నేను అంగీకార సూచకంగా తలూపటం, మధ్యమధ్య నేను మాటల నందించటం చూచి, నా ప్రక్కనో, సరిగ్గా ఎదుటనో కూర్చుని వుండిన శ్రీ రంగయ్య, శ్రీ వెంకటసుబ్రహ్మణ్యం నన్ను వారించటానికి ప్రయత్నించారు. వారు పెద్దసంఖ్యలో విదేశీ జాతి ఆవులను పెంచుచుండినారు. నేను వ్యాపారరీతిగా మందలను పెంచవద్దని, ప్రతి సన్నకారు రైతును, సామాన్య కుటుంబీకుని ప్రోత్సహించి వాళ్లు పాడిపశువులను పెంచునట్లు ప్రభుత్వం తోడ్పడాలని గట్టి అభిప్రాయం గలవాడను. అందుచేత పైజెప్పిన యిద్దరకు నే నెక్కడ నా అభిప్రాయాన్ని ఉద్ఘాటిస్తానేమో అని సందేహం. సభ ముగిసిన తర్వాత నేను మంత్రి బలరామరెడ్డిగారిని కలసికొని "నన్ను మీరు గుర్తుపట్టారా?" అని అడిగాను. "మీ రెందుకు జ్ఞాపకముండరు. ఒకప్పుడు ఇన్‌కమ్‌టాక్సు విషయంలో నాకు సాయం చేశారు కదా" అన్నారు. అది పన్ను తగ్గించే విషయం కాదు. శ్రీ బలరామరెడ్డి మంచివారిక్రింద లెక్క. భేషజంలేని మర్యాదస్థుడు. వారి అకాలమరణం విచారకరం.

నేను పశువులను శ్రద్ధగా పోషించుచున్నానని, అధిక పాలోత్పత్తికి తోడుపడుచున్నానని 1965 - 66 లో పాల కమిషనర్‌గానే గాక పశువుల డైరెక్టర్‌గా నుండుచుండిన శ్రీ పి. ప్రభాకరరావుగారు నాకు 10-9-1965 తేదీన, తిరిగి

19-5-1966 న మిక్కిలి మర్యాదగా వ్రాసి తమ సంతోషం తెలియబరచారు. "మీ సహాకారం పూర్తిగా కావా" లని కోరారు. వారు మిక్కిలి సరసులు, సహృదయులు. తాము చేబట్టిన పనిని పూర్తి శ్రద్ధతో శ్రమించి జయప్రదం చేయాలనే కార్యదీక్ష గలవారు. పైగా పశుపోషకులయందు, పాలోత్పత్తిదారులందు సహజాభిమానం కలవారు. నేను పెద్దగా చదువుకొని హెచ్చు స్థాయి ఉద్యోగం చేసియుండినానని వారికి నాయందు ఇంక కొంచెం జాస్తి అభిమానం కలిగియుండవచ్చును.

"ఎక్కడో పశుప్రదర్శనం, ఎవరో వస్తున్నారు, ఫలానా చోట వార్షికోత్సవం" అని పశువుల సంబంధమైన ఆఫీసర్లు వస్తే తృణమో పణమో ఇచ్చి పంపటం నా కలవాటైంది. శ్రీ పర్వతనేని వెంకటరత్నం కృష్ణాజిల్లా పశుపోషకుల సంఘానికి నియమావళి నేర్పరచాలని నా సాయం కోరితే తిరుపతికి వ్రాసి ఆంధ్ర పశు సంవర్ధక సంఘ నియమావళిని తెప్పించి డిశెంబరు 1958 న దాని సాయంతో నే నొక నియమావళిని తయారుచేసి శ్రీ వెంకటరత్నంకు పంపాను. సంఘాన్ని రిజిస్టర్ చేసినట్లు తర్వాత విన్నానుగాని ఎట్టి నియమావళిని తెల్చి రిజిస్టర్ చేయించారో నాకింతవరకు తెలియదు. గ్రామాలలో కమిటీలు ఏర్పడి పాలసేకరణకార్య బాధ్యత వాని కప్పజెప్పబోవుచున్నప్పుడు శ్రీ వెంకటరత్నం వ్రాయగా ఈ యూరి పాలసరఫరాదారుల సమ్మతిమీద ఒక కమిటీని ఏర్పరచాలని ప్రయత్నించాను. దీని కొకరు అడ్డుపడగా ప్రయత్నం విఫలమైంది. నేను వేసవిలో చల్లని ప్రదేశానికి వెళ్లి తిరిగి వచ్చేటప్పటికి ఒక కమిటీ ఏర్పడి పని సాగుచుండినది. కారకుడైన నా ఊసే లేకుండ పోయింది. నేను తిరిగివచ్చిన తర్వాతనైనా కమిటి అధ్యక్షుడు నన్ను కలిసికొనలేదు. వ్యతిరేక పార్టీగా కార్యకలాపాలు జరుగుచున్నవి. మర్యాదచూపక పోయారనే అభిప్రాయం, తప్ప వ్యక్తిగత లాభంగాని, చివరకు పలుకుబడిగాని నేను కోరియుండలేదు, కోరను. నాకు తోచిన, నా శక్తికి చాలిన ధర్మాన్ని ఆచరించటమే నా కర్తవ్యం.

ఇక పశు గ్రాసాన్ని గురించి, పాలపథకం మొదలుపెట్టిన సందర్భంలో గన్నవరంలో స్థాపించిన పశువుల మిశ్రమ దాణాను

తయారుచేసే ఫాక్టరీగాక పశువుల గ్రాసం కొరకు నేపియర్ గడ్డి వంటివానిని పెంచుటకు 'ఫీడర్ అన్డ్ ఫీడ్' ఆఫీసరు నొకగిని నియమించారు. మొదటగా వచ్చిన ఆఫీసరు శ్రీ శొంఠి శ్రీరామమూర్తి గారు. వీరు మిక్కిలి సరసులు. సాయంచేయాలనే బుద్ధికలవారు. 1963 మార్చిలో వీ రిక్కడ నేపియర్ గడ్డి వంటి వానిని పెంచుట కవకాశా లెంతవరకున్నవో, రైతుల నేవిధముగా ప్రోత్సహించవలెనో తెలుసుకొనటానికి వచ్చినప్పుడు నేను వారిని మొదటిసారి కలసికొన్నాను. 1963 అక్టోబరులో వారి డైరీ సర్వేయర్ వచ్చి నాతో మాట్లాడి వెళ్లారు. తర్వాత వారు అప్పు డప్పుడు నన్ను కలసికొనటం, ప్రోత్సాహ మివ్వటం జరిగింది. అయితే 1965 మార్చి, ఏప్రిల్ నెలలోగాని నేను గ్రామస్థులను కొందరిని ఒప్పించి పని ప్రారంభించలేదు. గ్రామ సరిహద్దున వున్న మా మెట్ట భూమిలో ఒక భాగం ఎ. 1-20 సెంట్లలో నేపియర్ గడ్డిని వేద్దామని నిర్ణయించి నాతో కలుపుకొని 8 మందిమి ఒక్కొక్కరికి 20 సెంట్ల చొప్పున 8 ప్లాటులు ఏర్పాటు చేసుకున్నాం. విత్తనాన్ని అనగా నాటటానికి అనుకూలమైన తుండ్లను కంకిపాడు ఫారం నుండి ఆఫీసరుగారే ఉచితంగా సప్లయి చేయించారు. కొంతవరకు గడ్డి బాగానే పెరిగింది. కాని నీటి సరఫరా తక్కువయింది. ప్రక్కనున్న మురుగుకాలువ నుండి నీటిని పంపుసెట్టుతో తోడి కొంతవర కుపయోగించాం. అయితే పంపుసెట్టు తొండం చాలలేదని, ఇంకేవో కారణాలు చెప్పి ఆ పంపుసెట్టు యజమాని నీళ్లు సరిగా అందజేయలేదు. ఆ భూమికి తలకట్టు భాగాన బావి ఒకటున్నది గాని ఆ బావినుండి పంపుసెట్టుతో నీరు తోడినప్పుడు అసమర్థతవల్లనో, అశ్రద్ధవల్లనో పంపుసెట్టు యజమాని ఆ బావిని చెడగొట్టాడు. ఈ కారణాల వల్లను, ఇతర వాటాదారులు కలసి రాకపోవటం వల్లను అది తగినంతగా ప్రతిఫలం ఇవ్వలేదు. పైగా అక్కడ దొంగతనా లెక్కువ. ఏరాత్రిపూటో వచ్చి చుట్టు ప్రక్కల పల్లెలవాళ్లు పెరిగిన గడ్డిని కోసుకొనిపోయేవారు. అందువల్ల ఒకసంవత్సరం తర్వాత మానివేశాం.

శ్రీ రామమూర్తిగారు కంపోస్టు ఎరువుచేయు పద్ధతిని కూడా చెప్పారు. కాని, ఎవ్వరూ తగిన శ్రద్ధ వహించి ఆయన సలహాను పాటించినట్లు లేదు. మేము పెంటపోగును వేయు స్థలం కంపోస్టుకు అనుకూలంగా లేదు. ఇకముందైనా ఆ స్థలాన్ని అనుకూల మగునట్లుగా చేసి కంపోస్టు తయారు చేయుటకు ప్రయత్నించాలని అభిప్రాయ మున్నది. మాకు కంపోస్టు మా టటుంచి పెంటపోగు నైనా సరిగా వృద్ధిచేసుకొనుట కవకాశం లేకపోలేదు. ముఖ్యంగా పశువుల నీరుడును భద్రపరచి గడ్డి, గాదర, పేడతో మిశ్రమం చేస్తే అది మిక్కిలి సారవంతమైన ఎరువుగా తయారవుతుంది. మాకు 30 గజాల పెద్ద పెంకుటి పశువుల చావడున్నది. దీనిని గచ్చుచేయించి ఆ నీరుడును గచ్చుచేయించిన బోదె ద్వారా కుండీలలో సేకరించవచ్చును. ఇదివరలో ఆపని చేద్దా మను కొనుచూ జాప్యం చేశాను. ఇప్పుడు సిమెంటు ధర అపరిమితంగా పెరిగిపోవటమే గాక, దొరకటం కూడా కష్టంగా వున్నది. ఇసుక, కంకర జల్లి సేకరించటం కూడా హెచ్చు ఖర్చుతో కూడిన పనైంది. తాపీవాళ్లు పై మెట్టున కెక్కారు. పని ఒప్పుకోవటంగాని, మొదలుపెట్టటంగాని దుర్ఘటమై పోయింది. అవకాశం చిక్కితే ఎప్పటికైనా ఆ పనిని చేయాలనే వున్నది,

ఈ భాగం ముగించే ముందు ఒకమాట చెప్పుతాను. నాయందెక్కువ అభిమానం చూపించిన డైరెక్టర్లలో నా ప్రాత స్నేహితుడు మేజర్ టి. మురారిగారు సహజంగా ప్రథమస్థాన మాక్రమించుకుంటారు. వీరుగాక శ్రీ పి. ప్రభాకరరావు, ఐ. ఎ. యస్. గారు నాయందు మిక్కిలి అభిమానం చూపించే వారని, నాకు రెండుసార్లు మెచ్చుకున్నట్లుగా వ్రాశారని పైన చెప్పియున్నాను. నే నొకసారి వారి ఆఫీసుకు వెళ్లగా వారేదో కాన్ఫరెన్సులో ఉన్నా, బైటికివచ్చి నాతో ఆదరణతో మాట్లా డారు. విజయవాడలో డిప్యూటి డైరెక్టర్‌గా, అసిస్టెంటు పాల కమిషనర్‌గా తమ ఉద్యోగ ధర్మాలను మిక్కిలి సమర్థవంతంగా, ప్రజారంజకంగా జరపిన శ్రీ డాక్టర్ డి. సంజీవరెడ్డిగారు మిక్కిలి అభిమానంతో వుండేవారు. వారియందు నాకు కలిగిన గౌరవ భావంచేత నాకొడుకు పేర ఈవూళ్లో కట్టించిన పశువుల ఆస్పత్రిని

వారిచేత ప్రారంభింపచేశాను. తమ పదవిని శ్రీ వి. ఆంజనేయులు గారి కొప్పగించి హైదరాబాదుకు సాంద్ర పశుగణాభివృద్ధి బ్లాకు అధికారిగా వెళ్లుచున్నామని తెలిపారు. నేను వారిక్కడ మిల్కు పథకానికి చేసిన సేవలకు అభినందిస్తూ 24-9-65 తేదీన జవాబు వ్రాశాను. ఇప్పుడంత సౌహార్దం కనపడటంలేదు. ప్రస్తుత పశువుల డైరెక్టరు షిరాజ్‌గారు నాతో స్నేహభావంగానే వుంటారు గాని, వృద్ధాప్యంవల్ల ఆసక్తి తగ్గి వారిని కలసికొనటంలేదు.

కోళ్ల విషయం కొంచెమైనా చెప్పాలి. కోళ్లు అన్నా, కోళ్ల పందాలన్నా నాకు మిక్కిలి యిష్టం. నేను బెజవాడలో ఇన్‌కమ్ టాక్సు ఆఫీసరు ఉద్యోగములో వున్నప్పుడు కూడా మొదటి సంవత్సరం కోళ్లను విస్తారంగా పెంచానని, ఒకటి, రెండు సంక్రాంతులకు బెజవాడ దగ్గరి ముత్యాలంపాడుకు కోళ్ల పందాలకు వెళ్లానని, తిరువూరులో మకాం చేస్తూ అక్కడి రహదారి బంగళాలో పందాలు వేయించానని నా రెండవ భాగంలో చెప్పాను. నేను రిటైరై పెడసనగల్లులో స్థిరపడిన మొదటి సంవత్సరం 1954 సంక్రాంతికి ఈ ఊరి మాలపల్లె తోటకు రెండు మూడు పుంజులను తీసుకొని పందాలకు హాజరైనాను. నేను వస్తున్నానని సరదాగల యువకులొకరిద్దరు కొన్ని ఏర్పాట్లుచేసి కుర్చీ లవీ అమర్చారు. మొదటిలో సవ్యముగానే జరిగిపోయింది. ప్రొద్దు తిరిగిన కొలది త్రాగి తందనాలు త్రొక్కే రకంవల్ల కట్టడి తగ్గి విచ్చలవిడితనం పెరిగింది. పందెగాళ్లు ఎక్కువ త్రాగి అనుచితాలు మొదలుపెట్టారు. నాకు చెప్పకుండానే నాకోళ్లను తీసుకొనిపోయి నేను వద్దని చెప్పినా వినకుండా పందాలుకట్టి చంపించారు. నేను కోప్పడగా, నాయందు కొంత గురుత్వమున్న వాళ్లే ధిక్కారం మొదలుపెట్టారు. జనం కలసిపోయి ఎవరెక్కడున్నారో ఏ పుంజెక్కడున్నదో తెలియకుండా పోయింది. ఈ అరాచకం చూచి చప్పునవచ్చేశాను. "ఛీ! ఇది అల్లాపనిగా కనపడుచున్నది. ఇక వెళ్లకూడ" దని అంతటితో మానివేశాను.

అనాదినుండి వేడుకకొరకు కోళ్ళ పందాలను జమీందారులు తగిన కట్టుబాట్లతో మిక్కిలి సవ్యంగా తాము స్వయంగా హాజరయి జరిపించేవారు. పల్లెటూళ్ళలో సర్వసామాన్యంగా ఈ పందాలు గందరగోళంగానే వుంటవి. అయితే, సామాన్య ప్రజల జీవితం ఎగుడు, దిగుడులేని నిస్సారమైన బరువు బ్రతుకు. వారికి పండుగ పబ్బాలకు కొంత స్వేచ్ఛ, కొంత ఆటవిడుపు, కొంత వింత, వినోదం లేకున్నచో వాళ్ళ జీవితం దుర్భరమై పోతుంది. గ్రామాలల్లో సంవత్సరం పొడుగుతా కష్టించిన కృషి ఫలితంగా చేలు పండి సంక్రాంతికి ధాన్యం గింజ ఇంటికి చేరుతవి. వాతావరణ సుఖమే గాక ప్రతివానికి కడుపునిండా బువ్వదొరుకు తుంది. ధాన్యం నూర్పుడు ఆఖరుకు 'పోలుపోలో'యని సంతోషంతో గంతులువేసే ఉత్సాహభావం వెల్లుబుకుతూ వుంటుంది. సుఖ దాంపత్యానికి చక్కని తొలి బిడ్డ ప్రతిఫల మన్నట్లుగా ఈ సంతోష సంభ్రమాలు సంక్రాంతి పండుగలో సమ్మిళితమౌతవి. ఈ సమ్మిళితం కోడి పందాలు వంటి వినోదాలతో, ఉద్రేకాలతో గాని పరిపక్వం పొందదు. కాబట్టి గ్రామస్థులు కోడిపందాలు వేసుకోవటం, ఆనందించటం భావోద్రేకాన్ని చిన్నచిన్న తగవు లాటల ద్వారా ఉపశమనం చేసుకోవటం అభిలషణీయమనే నా యభిప్రాయం. నాఉద్దేశానికి, సంస్కారానికి తగినట్లుగా కోడి పందాలు జరిగితే నే నిప్పటికినీ వెళ్లి చూచి హర్షించగలను.

ఇంటి వద్ద మా భోజనానికి కావలసిన గ్రుడ్లు, మాంసం కొరకు కొన్ని రకరకాల పెట్టలను పెంచాను. అయితే గ్రుడ్ల కంటె మాంసమందే నా కెక్కువ ప్రీతి. అందువల్ల అధికగ్రుడ్లను పెట్టే తెల్లలెగ్‌హారన్స్‌నుగాక, గ్రుడ్లను తక్కువపెట్టినా పెద్దవి గానే పెట్టేవి, మంచి మాంసాన్నిచ్చేవి ఎరుపు రోడ్ ఐలెండ్ రెడ్సును పెంచాను. కాని సరియైన జాగ్రత్తలేక కొన్ని వ్యాధు లతో చనిపోయినవి, కొన్నింటిని ఇంటి నౌకర్లే అయివుండాలి, ఇతరుల సాయంతో 2, 3 సార్లు పెద్దగా దొంగిలించారు. ఒకసారి ఇంట్లో పనిచేసే నౌకరు కుర్రాడు ఎవరి సాయంతోనో మొదటిసారి

గ్రుడ్లుపెట్టే తొమ్మిది మంచి రోడ్ ఐలెండ్సు పెట్టలను దొంగి లించాడు. కోళ్ల కని ప్రత్యేకంగా కట్టించిన పెద్ద గూటికి వేసిన తాళం వేసినట్లే వుంది. ఉదయం చూస్తే ఒక్క పెట్ట కూడా లేదు. సాయంత్రం గూటికి తాళంవేసే బాధ్యత ఆ నౌకరుదే. సాయంత్రం వెళ్లేటప్పుడు తాళంవేయకుండా వుంటాడు, రాత్రి వచ్చి ఎవరితోడుతోనో దొంగిలించి వుంటాడు. తాళం వేయ కుండా వుంటే "వేయుటం మరచిపోయాను, రాత్రి ఎవరో ఎత్తుకు పోయా" రని ఉదయం చెప్పటాని కెక్కువ అవకాశం వుండేది. తాళంవేసి వుండబట్టి వాడే దొంగిలించాడని అనుకోవాలి. ఒకసారి 22 కోళ్లను దొడ్లో పనిచేసే నౌకరు కుర్రవాడి ద్వారా దొంగి లించటం జరిగింది. పైన చెప్పిన కోళ్లగూడు గాక, వేరే కర్ర చెక్కలతో చేసి పైన జింకుషీట్లతో కప్పిన పెద్ద పెట్టె వెనుక దొడ్డి ఆవరణలో వుండినది దాని తాళం పగులగొట్టి మాకు, మా ప్రక్కయింటి వారికి సరిహద్దుగోడ మీదుగా వారి వాముల ప్రక్క త్రోవగుండా ఎత్తుకొనిపోయారు. ఇం కొకసారి మా పశువుల దొడ్డి రెండవ ప్రక్క గోడను దాటి యిం కొకరి ప్రక్క దొడ్డిదారి గుండా కోళ్లను ఎత్తుకుపోయారు. ఇం కొకటి, మావద్ద కొంత కాలం మాకు వంట జేసిపెట్టిన మళయాళీ వంటవాడు అప్పు డప్పుడు తాళం సుతారంగా ఊడదీసి 1, 2 పెట్టల నెత్తుకొని పోయి మా యింటికి కొంచెం అవతల తన ఇంట్లో సారా దొంగ తనంగా కాచి అమ్మేవాని కిచ్చి కడుపు నిండా త్రాగేవాడట. ఈ సంగతి మాకు తెలిసినవెంటనే వాడు పారిపోయాడు.

కొలది మాసాలలో పెద్దగ్రుడ్లు బాగాపెట్టే మాంసకృత్తులు ఎక్కువగా కల సంకరజాతి కోళ్లను పెంచాలని ఇక్కడి పశువుల ఉద్యోగుల ద్వారా ప్రయత్నించాను. "ఇదిగో, అదిగో" అని ఇంతవరకు కాలహరణం జరిగింది. బెజవాడలో కోళ్ల అభివృద్ధి ఆఫీస రున్నాడు. ఆయన కిదివరలో "కొన్ని పిల్లలను హైదరా బాదునుంచి తెప్పించి మా కివ్వం" డన్నాను. "అలాగే" అని చెప్పి యింతవరకు యివ్వలేదు. నేనున్నూ అశ్రద్ధ చేశాను. ఈ నవంబరు, డిశెంబరులలో కొన్నిటిని తెప్పించాలని వున్నది. ఇంత టితో పశుపోషణ, పాలోత్పత్తి పథకం విషయం ముగిస్తున్నాను.

౪

# లలితకళలు

---

(ఎ) చిత్రలేఖనం : నాకు చిత్రపటాలన్నా, శిల్పాలన్నా చిన్నప్పటినుండి చాలా అభిరుచి. నా చిన్నతనములో బొమ్మలాట లెక్కువ యిష్టంగా చూచేవాడ నని మొదటి భాగంలో చెప్పాను. తెరమీద ఆడే బొమ్మలు రంగులతో తయారుచేయబడిన వగుటచేత ఒకవిధమైన చిత్రపటాలుగా తోచటం వల్లనే కాబోలు నా కంత ఆకర్షణ. ఆవిధముగానే దేవాలయాలమీద వుండే చెక్కిన రాతిబొమ్మలు, సున్నం సిమెంటు వగైరాలతో నిర్మించిన బొమ్మలు నా చిన్నతనమందే న న్నెక్కువగా ఆకర్షించేవి. పిన్న వయస్సులోనే సౌందర్యపిపాస రేకెత్తిన నాకు చక్కగా చిత్రించిన రంగురంగుల బొమ్మలు, నైపుణ్యముతో మలచిన లేక నిర్మించిన అంగసౌష్ఠవంగల బొమ్మలు యుక్తవయస్సు రాక ముందే న న్నాకర్షించటం ఆశ్చర్యకరంకాదు. క్రింది తరగతులలో చదువుచున్న విద్యార్థిదశలోనే కాలండర్లు, మాగజైనులు, పుస్తకాలలోని బొమ్మలను ఉత్సుకతతో చూచేవాడను. 1914-1915 సంవత్సరంలో బందరు ఆంధ్ర జాతీయ కళాశాల వార్షికోత్సవములో ప్రదర్శింపబడిన చిత్రపటాలను చూచి ముగ్ధుడనయ్యాను. నా స్వదేశ విద్యార్థిదశలో చిత్రపటాలను, శిల్పాలను అక్కడక్కడ చూచియుంటినిగాని, నా ఇంగ్లండు విద్యాభ్యాసం ప్రపంచప్రఖ్యాతమైన చిత్రాలను, శిల్పాలను చూచి

ఆనందించుట కవకాశం కల్పించింది. ఇంగ్లండులోని నేషనల్ గాలరి, స్టేట్సు గాలరి మొదలైన వానిసేగాక, పారిస్‌లో లూవ్రు వంటి చిత్రమహాశాలలను చూచాను. బెర్లిన్‌లో కూడా అక్కడి పోట్సడమ్ మహారాజ ప్రాసాదాలలో అమర్చబడిన చిత్రాలను, శిల్పాలను, రకరకాల నత్తగుల్లల సంబంధమైన వానిని చూచి ఆనందించాను. ఈవిధముగా పెంపొందిన నా చిత్రకళాభిమానం అనంతపూరులో ప్రఫుల్లించింది. 1937 ఫిబ్రవరిలో నేను జిల్లా జడ్జిగారి బంగళాకు వెళ్లటం తటస్థించింది. అక్కడ ఆ జిల్లా పెనుగొండ వాస్తవ్యులు శ్రీ సి. యన్. వెంకట్రావు అనే వారిచేత చిత్రింపబడ్డ రెండు పెద్ద చిత్రలేఖనాలను చూచాను. తర్వాత నేను పెనుగొండ కాంపుకు వెళ్లినప్పుడు ఆ చిత్రకారుని పిలిపించి, తర్వాత వారింటికి వెళ్లి ఆ రెండుబొమ్మల డూప్లికేట్లను కొన్నాను. శ్రీ వెంకట్రావు ప్రత్యేకించి ఆ రెండు బొమ్మలను 7, 8 ప్రతులుగా నైనా చిత్రించాడు. ఈ డూప్లికేట్లు మక్కీకి మక్కీ నకళ్లు కావు. ఆ విషయాన్నే (థీమునే), ఆబొమ్మనే, ఆ పరిసరాలు (బాక్ గ్రౌండు), ఆ పరిస్థితుల (ఎట్‌మాస్ఫియర్) తోనే క్రొత్త బొమ్మను వేస్తున్నట్లుగా ఇంకొక పటాన్ని చిత్రించేవాడు. అందువల్ల ఒక చిత్రానికి మరొక చిత్రానికి స్వల్ప భేదాలున్నా, అవి అన్నియు ఒకదాని ప్రతిబింబాలే. తర్వాత శ్రీ వెంకట్రావునుండి ఏడు బొమ్మలనైనా కొన్నాను. అందులో రెండు లాండ్‌స్కేప్ తాలూకు. 5 పెద్ద బొమ్మలలో నొకదానిని కాకినాడలో పారుపూడి బాపూరావు అనే వారి కిచ్చివేశాను. తతిమ్మా నాలుగు నావద్ద నున్నవి. ఈవిధముగా చిత్రాలను కొనటం ప్రారంభించాను. 1949 మే మాసములో నేను తిరిగి మద్రాసుకు బదిలీ అయి వెళ్లినప్పుడు మంచి చిత్రాలను కొనటాని కవకాశం ఏర్పడింది. మధ్య ఎనిమిది తొమ్మిది మాసాలు నేను మద్రాసులో లేని కాలములోగాక, నేను 1953 జూన్ ఆఖరులో ఉద్యోగ విరమణ చేసిన కొంతకాలం వరకు, చిత్రపటాలను కొనుచునే యుండినాను. ప్రత్యేకించి పి. వి. రత్నం అనే చిత్రకారునివద్దనుండి కొన్నవిగాక, ఇద్దరు, ముగ్గురు యింటికి వచ్చి చూపించినవి గాక, రాజపుత్ర యువకుడు శ్రీ సూర్యప్రకాశ్ నామ్‌దేవ్ నుండి గ్రహించినవి గాక చాలా

వరకు మద్రాసులోని ఆర్ట్సు అండ్ క్రాఫ్ట్సు సంస్థనుండి కొన్నాను. ఆ సందర్భంలో ప్రఖ్యాత చిత్ర, శిల్పకారుడు డి. పి. రాయ చౌధురిగారి పరిచయమైంది. మరిన్ని, కె. సి. యస్. ఫణికర్ గారి స్నేహం పొసగింది. శ్రీ కృష్ణారావు, శ్రీ ధర్మాంగద వంటి చిత్రకారులతో సంబంధం కలిగింది. అప్పుడే రామమూర్తిగారి వంటి వారి నుండి కొన్ని కంచు ప్రతిమలను కొన్నాను. అందులో 22½ అంగుళాల ఎత్తుగల చక్కని దేవీమూర్తిని ఎగ్మోరులో సెంటినరి హాలు ప్రదర్శనంలో రామమూర్తిగారి నుండి కొన్నాను. ఆ దేవీవిగ్రహం చక్కని అవయవ పొందికలు కలిగి సౌకుమార్యం, ప్రసన్నత, శాంతం ప్రస్ఫుటమయ్యే వదనంతో విరాజిల్లింది. నేను మద్రాసునుండి నా చిత్రపటాలు వగైరా పెడసనగల్లుకు పంపునప్పుడు పెడసనగల్లులో దీని విలువ గ్రహించువారెవ్వరని, మౌంటు రోడ్డులో శిలాఖండాల విక్రయశాలను నడుపుచూనుండిన శ్రీ యమ్. రామమూర్తిగారి ద్వారా అమ్మివేశాను. తర్వాత ఆ విగ్రహాన్ని ఇతర దేశస్థులు కొని పట్టుకొనిపోయారట. తిరిగి దానిని సంపాదించాలని ప్రయత్నించానుగాని లాభంలేక పోయింది. పై చెప్పిన యమ్. రామమూర్తిగారి ద్వారానే రకరకాల చిన్న కాంస్య విగ్రహాలను కూడా అమ్మివేశాను. వానిలో దీపవాటికలు, విఘ్నేశ్వరుడు, లక్ష్మీదేవి మొదలైన వారి ప్రతిమ లుండినవి. ఎందుకు అమ్మివేశానా అని యిప్పుడు చింతిల్లుచున్నాను. ఈ కంచుపోత విగ్రహాలుగాక పై చెప్పిన రాజపుత్ర కళాకారుడు శ్రీ సూర్యప్రకాశ్ నామ్‌దేవ్ చేత ఒక మురళీధర శ్రీకృష్ణ విగ్రహం, బుద్ధ విగ్రహం చెక్కించాను. ఆయన చెక్కిన కొండరాణి, వన్యవనిత వంటి ఫలకాలనుకొన్నాను. ఇవన్నియు చలువరాతితో చెక్కబడినవి. శ్రీకృష్ణ విగ్రహం అంత మందమైన రాతిలో చెక్కబడకపోవటంవల్ల, విగ్రహం కొంత నీరసంగా నాకు కనపడింది. అందువల్ల దగ్గరుండి కొన్ని మార్పులు చేయించాను. నిలుచుండినట్లున్న ఈ విగ్రహం పెద్దదే. దీనిని ఎత్తైన నల్లరాతి దిమ్మలో అమర్చాము. పద్మాసనస్థుడైన బుద్ధుని విగ్రహం నూకమాను (రోజ్ వుడ్) తో చేసిన పీటమీద అమర్చబడింది. ఫలకాలను నూకమాను చెక్కలతో నిలబెట్టుటకు వీలుగా

చిత్రాలలో బిగించాము. పీటను, చిత్రాలను చేసింది సుందరం అనే కళాత్మక వడ్రంగి. ఈయన మంచి నేర్పరి. నా చిత్ర పటాలన్నింటికి చక్కని, వెడల్పాటి అనువైన చిత్రాలను (ఫ్రేమ్సు) తయారుచేశాడు. మరిన్ని, మద్రాసులో జరుగు చుండిన కాంగ్రెసు, ఇతర వస్తుప్రదర్శనాలలో మలబారు (త్రివేంద్రం) శిల్పకారులు తయారుజేసిన రకరకాల దంతపు బొమ్మలను కొన్నాను. వానిలో నొకటి ముగ్గురు సౌందర్యవతులను (త్రీగ్రేసెస్) ఒకే దంతపు ముద్దలో చెక్కినారు. ఈ దంతపు బొమ్మలు ఇప్పటికి 11, 12 వున్నవి. చిత్రపటాలు మొన్నిమధ్య బందరునుండి చిత్రకారుడు శ్రీ బ్రహ్మానందం తెచ్చి యిచ్చిన 31 బొమ్మలతో 70 వరకు సేకరించాను. వీనిలో 3, 4 మా మద్రాసు ఇంటిలో వున్నవి. తతిమ్మా వానిని మా పెడసనగల్లు యింటి అన్ని గదులలోను పెట్టాను.

1961 లో క్రొత్తగా స్థాపించబడిన ఆంధ్రప్రదేశ్ లలిత కళా యకాడమీ సభ్యునిగా, అప్పుడు విద్యామంత్రి శ్రీ బులుసు ప్రభాకర పట్టాభి రామారావుగారి సిఫారసుతో నన్ను ఆంధ్ర ప్రదేశ్ ప్రభుత్వం నియమించింది. సభ్యులు మొత్తం 32 మంది. ఈ సభ్యుల నుండి అధ్యక్షుని, ఉపాధ్యక్షుని, కార్యనిర్వాహక వర్గాన్ని ప్రభుత్వమే నిర్ణయించింది. 5 గురు కార్యనిర్వాహకవర్గ సభ్యులలో నే నొకడినిగా చేర్చబడ్డాను. అకాడమి మనుగడకు పూర్తిగా డబ్బిచ్చేది ప్రభుత్వమైనందున ప్రభుత్వ సంబంధం కల వారి నొకరిని కోశాధికారిగా ప్రభుత్వం నియమించింది. మొదటి సర్వసభ్య సమావేశం; దాని ననుసరించి కార్యనిర్వాహక సభ్య సమావేశం 1961 ఆగష్టులో జరిగినవి. శ్రీ నూకల నరోత్తమ రెడ్డిగారు అధ్యక్షుడుగాను, శ్రీ చామకూరు సత్యనారాయణగారు ఉపాధ్యక్షుడుగాను, ప్రభుత్వ విద్యాశాఖ కార్యదర్శిగా పని చేస్తుండిన శ్రీ ఎల్.ఎన్. గుప్తా, ఐ. ఎ. యస్. గారు కార్యదర్శిగాను నియమించబడ్డారు. శ్రీ మసూద్ అహమ్మద్ గారు కోశాధికారి అయ్యారు. శ్రీ నరోత్తమరెడ్డి రాజకీయవేత్త, పార్లమెంటరిసభ్యులు. హైదరాబాదునుండి వెలువడే గోల్కొండ పత్రికను నడుపువారు.

కొంతకాలం ఆంధ్రప్రదేశ్ కాంగ్రెసు కమిటీకి అధ్యక్షుడుగా కూడా ఉండినారు. శ్రీ ఎల్. ఎన్. గుప్తాగారు పెద్ద హోదాగల ప్రభుత్వాధికారని వేరే చెప్పనక్కరలేదు. శ్రీ చామకూరు సత్యనారాయణగారు (శ్రీ యస్. చామకూర్) ప్రఖ్యాతి వహించిన సంప్రదాయ చిత్రకారుడు. అహమ్మద్‌గారు గవర్నమెంటు ఆర్ట్స్ అండ్ క్రాఫ్ట్స్ కాలేజి ప్రిన్సిపాల్. ప్రథమ కార్యనిర్వాహక సభ్యులు 5 గురులో శ్రీ అంకాల వెంకట సుబ్బారావు, శ్రీ జగదీశ మిట్టల్, శ్రీ దామెర్ల రామారావు భార్య శ్రీమతి సత్యవాణి, నేను, ఇంకొకర మున్నాం. ఈ మొదటి యకాడమి కాలపరిమితి 3 సంవత్సరాలు. 1964 లో దాని రెండవ టరమ్ ప్రారంభమైంది. అప్పటికి కొన్ని ప్రాంతీయ కళాసంస్థలు విజయవాడ వంటి పట్టణాలలో స్థాపించబడి యున్నవి. ఈ సంస్థలను రాష్ట్రకేంద్ర సంస్థయగు ఆంధ్రప్రదేశ్ లలిత కళా యకాడమి తనకు అనుబంధ సంస్థలుగా చేర్చుకొన్నది. ఈ సంస్థలకు తమ సభ్యుల నుండి ఒకరిద్దరు ప్రతినిధులకు రాష్ట్రకేంద్ర సంస్థకు పంపే హక్కు యివ్వబడింది. ఈ హక్కు నుపయోగించుకొని విజయవాడలో అడివరకే 1961 ఏప్రిల్‌లోనే స్థాపించబడి శ్రీ నార్ల వెంకటేశ్వరరావుగారి అధ్యక్షత క్రింద నడుపబడుచున్న ఆంధ్ర యకాడమి ఆఫ్ ఆర్ట్స్ 1964లో నన్ను, శ్రీ ఆమంచర్ల గోపాలరావు గారిని తన ప్రతినిధులుగా ఎన్నిక చేసింది. ఆ విధముగా తిరిగి నేను ఆంధ్రప్రదేశ్ లలితకళా యకాడమిలో సభ్యుడనైనాను. అధ్యక్షుడు, ఉపాధ్యక్షుడు, కార్యదర్శి, కార్యనిర్వాహక సభ్యులు ఎన్నిక ద్వారా పదవులకు రావలసియున్నది. ఏకగ్రీవంగా శ్రీ నరోత్తమ రెడ్డి, శ్రీ ఎల్. ఎన్. గుప్తా అధ్యక్ష, కార్యదర్శులుగా ఎన్నికైనారు. ఈ దఫా శ్రీ చామకూరుకు బదులుగా కళాకారిణియైన శ్రీమతి బి. కరుణారావుగారు అందరి అంగీకారమును పొంది ఉపాధ్యక్షులైనారు. ఎన్నికైన కార్యనిర్వాహక సభ్యులలో నే నొకడను. నాది బొటాబొటి ఎన్నిక. నా సహాయం లేనిదే ఎన్నిక కాకపోవనట్లుండిన ఇంకొకరు నాకంటె ఒక వోటు ఎక్కువ సంపాదించారు. నిజానికి ఆ అభ్యర్థిని చివరివరకు ఎవరును పేర్కొనలేదు. ఆయన పేరైనా ఉండదేమో నని ఆత్రుతతో



1964 లో ఆంధ్రప్రదేశ్ లలితకళా యకాడమి - హైదరాబాదు

ఎడమనుండి_మొదటివరుస: 1. శ్రీమతి దామెర్ల సత్యవాణిగారు, 2. శ్రీమతి బి. కరుణారావుగారు
3. శ్రీ యల్. యన్. గుప్త, 4. శ్రీ నూకల నరోత్తమరెడ్డి
5. శ్రీ చేమకూర సత్యనారాయణ, 6. శ్రీ అంకాల వెంకట సుబ్బారావు
7. శ్రీ పి. ఆర్. రామచంద్రరావు

రెండవ వరుస: 1. శ్రీ గుర్రం మల్లయ్య, 2. గ్రంథకర్త
3. శ్రీ కొమండూరి వీరరాఘవాచార్యులు, 4. శ్రీ కల్లూరి సుబ్బారావు

మూడవ వరుస: 1. శ్రీ వి. మధుసూదనరావు, 2. శ్రీ పైడిరాజు, శ్రీ ఫైజుద్దీన్
4. శ్రీ ఆమంచర్ల గోపాలరావు, 5. శ్రీ. కె. రాజయ్య
6. శ్రీ అబ్బూరి గోపాలకృష్ణయ్య

నాల్గవ వరుస: 1. శ్రీ పి. టి. రెడ్డి, 2. శ్రీ కౌతా రామమోహన్‌శాస్త్రి
3. శ్రీ నార్ల వెంకటేశ్వరరావు, 4. శ్రీ కుమారిలస్వామి
5. శ్రీ మొక్కపాటి కృష్ణమూర్తి, 7. శ్రీ సంజీవదేవ్

నేను ప్రతిపాదించగా ఎదురుగావున్న నా అభిమాని ఒకరు బల పరచారు. అందువలన నాకంటె ఆయనకు ఒకవోటు ఎక్కువ పడటం నా కాశ్చర్యాన్ని కలిగించింది. చివరి దశలో అధ్యక్షుడో, శక్రటరీయో, మరొకరో నా కిచ్చే ఉద్దేశం మానుకొని ఆయన కిచ్చి వుంటారు. ఏది ఎట్లైనా, మిత్రుడు విద్యామంత్రి శ్రీ బలుసు పట్టాభి రామారావుగారి ప్రమేయంలేకపోతే నేను కార్య వర్గములోనే గాక, సభ్యుడనుగా కూడా వుండుటకు అర్హుడనై వుండేవాడను కానని, ఎవరికైనా సందేహముంటే ఈ పోటీలో నెగ్గటం ఆ భావాన్ని తుడిచివేసింది. నాకు లలితకళలలో ఏ దాని యందైనా శాస్త్రజ్ఞానము లేనిమాట నిజమే. బొమ్మను ఏ ప్రమాణంలో గీయాలి, అవయవాలు ఏ పరిధిలలో వుండాలి, బాక్‌గ్రౌండ్ ఏవిధంగా వుండాలి అనే సాంకేతికజ్ఞానం నాకు చాలా తక్కువ. కాని చూచీచూడటంతోనే బొమ్మ స్వరూ పాన్ని, అందాన్ని, ఆకర్షణను, ఉచితజ్ఞతను తెలుసుకొనే స్వభావం, శక్తి, అనుభవం వుండినవి. అప్పటి విద్యామంత్రిగారు నన్ను యకాడమిలో చేర్చుటకు నాకు తగిన అనుభవమే గాక కళాభి మానం కూడా ఉన్నదని వారు తలచుటచేత, బొమ్మలను గీసే వారితోబాటు అభిమానించేవారు, ప్రోత్సహించేవారు కూడా వుండాలని భావించుటచేత వారు నన్ను సభ్యునిగా చేర్చారు. నేను 65, 70 చిత్రపటాలను సేకరించానని, కళాకారులను ప్రోత్సహిస్తానని వారికి స్వయంగా తెలిసి యుండినది.

అన్ని సంస్థలకు వలెనే, ఈ సంస్థకు కాన్‌స్టిట్యూషన్ (నియమావళి) ఏర్పాటు జేశాం. మొదట ఈ నియమావళిలో పేర్కొన్నది 3 సంవత్సరాల కాలపరిమితి మాత్రమే. అయితే 1964 లో తిరిగి ఏర్పడిన సర్వసభ్య సంఘం ఆయువును 5 ఏండ్లకు ప్రభుత్వానుమతితో పెంచింది. కాబట్టి, ఈ రెండవ టరమ్ 1969 అక్టోబరు ఆఖరుకుగాని (ఏ కారణంవల్లనో ఒక మాసమో, హెచ్చుగానో పొడిగించబడింది) పూర్తికాలేదు. కాబట్టి మూడవ టరమ్ 1969 నవంబరులో ప్రారంభించవలసి యుండినది. అనుబంధ సంస్థలు తమ ప్రతినిధులను సకాలము

లోనే పేర్కొన్నవి. కాని యకాడమి నిర్మాణం (కాన్‌స్టిట్యూషన్) ప్రకారం కొంతమంది సభ్యులను సర్వసామాన్య సభకు ప్రభుత్వం నియమించవలసి యుండెను. ఈ సభ్యులు నియమించబడకపోతే సర్వసభ్యసభ (జనరల్ కౌన్సిల్) ఏర్పడదు. జనరల్ కౌన్సిల్ ఏర్పడితేనేగాని అధ్యక్షుడు మొదలైన ఆఫీసర్లను, కార్యనిర్వాహక సభ్యులను ఎన్నుకొనటానికి వీలు లేదు. రాజకీయ కారణాలవల్ల ప్రభుత్వం తాము నియమించవలసిన సభ్యులను నియమించలేదు. అందువల్ల ప్రతినిధిసభ్యు లందరం నిరర్థకులైనాము. యకాడమి పనులు జరగటానికి, గవర్నమెంటు అధ్యక్షుడు, కార్యదర్శి, కోశాధికారులకు ప్రత్యేక అధికారాలిచ్చింది. ఏ బాదరబంది, ఏ జోక్యాలు లేకుండా ఈ ముగ్గురు ఆఫీసర్లు స్వేచ్ఛగా కాలం గడుపుకొన్నారు. ఎలాగో చివరకు 1972 సెప్టెంబరు 24-వ తారీఖున అనగా ఇంచుమించు మూడు సంవత్సరాల తర్వాత, 3-వ టరమ్ యకాడమి ఏర్పడింది. దీని ఆయువు, ఏర్పడిన తారీఖునుండి 5 సంవత్సరాలని ప్రభుత్వంవారు ఉత్తర్వును జారీచేశారు. ఈ దఫా ఎన్నికైన అధ్యక్షులు కార్యదర్శి పాతవారే. (శ్రీ) నరోత్తమరెడ్డి, (శ్రీ) గుప్తాగార్లు. కళాకారులు శ్రీ పైడిరాజు ఉపాధ్యక్షులు, శ్రీ కొండపల్లి శేషగిరిరావు కోశాధికారి. ఎన్నికమీద మొదటివారు, నియమించబడిన రెండవవారు అయ్యారు. ప్రతి చిన్నవిషయంలోను తగాదాకు పూనుకొనే (శ్రీ) పి. టి. రెడ్డి కార్యవర్గసభ్యులుగా నెన్నికైన వారిలో నొకరు. వీరు కొంత ప్రఖ్యాతిగడించిన కళాకారులు. మొదట సంప్రదాయ పద్ధతిలో చిత్రించాడు. ఇప్పుడు అధునాతన చిత్రాలని, నైరూప్య చిత్రాలని వేస్తున్నాడు. బొమ్మ లెట్లున్నా 3, 4 వేల రూపాయల ఖరీదు చెప్పుచున్నాడు. 1969 లో 3-వ క్రొత్తటరమ్ ఆరంభించబోవుచున్న దనుకొన్న తరుణంలో, నే నేదో పనియుండి హైదరాబాదుకు వెళ్లి యకాడమి ఆఫీసుకు వెళ్లినప్పుడు, (శ్రీ) పి. టి. రెడ్డి ఆవిషయం తెలుసుకొని నాకు ఫోనుచేసి తన యింటికి ఆహ్వానించి మర్యాద, మన్ననలు జరిపి, "ఈదఫాకూడా నరోత్తమరెడ్డిగారిని అధ్యక్షునిగాఎన్నుకొందాం. మీరు సహాయపడండి. మిమ్ములను కార్యనిర్వాహకసంఘ

సభ్యులనుగా తిరిగి ఎన్నుకొంటాం" అన్నారు. "నేను పెద్దవాడనై పోవుచున్నాను. నాకు తిరిగి ఆ సభ్యత్వం వద్దు. ఏదో సంవత్సరాని కొకసారి సర్వసభ్యసంఘ సమావేశానికి వస్తాను. తరుచు రాలేను" అని చెప్పాను. "కాదు కూడ"దన్నారు. "సరే చూద్దాం" అన్నాను. "నరోత్తమరెడ్డిగారి విషయంలో వారు సరసులు, సమర్థులు. వారి కివ్వటానికి నా కభ్యంతరం"లే దని చెప్పాను. పి. టి. రెడ్డిగారి ప్రత్యేక అభ్యర్థనకు కారణ మున్నది. మొదటి నుండి శక్రటరీగా యకాడమి కార్యభారాన్ని చాలావరకు వహించుచు వుండుచుండిన శ్రీ ఎల్. ఎన్. గుప్తాగారు తన కధ్యక్షపదవి కావాలని అభిలాషపడినారట. అందువల్ల ఈ పి. టి. రెడ్డిగారి ఆరాటం. నిజానికి గుప్తాగారే ఈ యకాడమిని కొనసాగించుచున్నారు. అక్కడి కొన్ని చిత్రకళా సంస్థలతో ముఖ్యంగా, హైదరాబాదు ఆర్ట్ కళాశాలతో ఆయనకు దగ్గర సంబంధ మున్నది. పెద్ద ఉద్యోగము చేయుట వల్లను, స్థిర నివాసి అగుట వల్లను హైదరాబాదులో తగిన పలుకుబడి యున్నది. అయితే రాజకీయంగా శ్రీ నరోత్తమరెడ్డి బల వంతుడు. అది రెడ్డి రాజ్య యుగం. మంత్రులతో ఆయనకు పలుకుబడి తగినంతగా వుండేది. మంత్రులకు, తమ క్రింద యుద్యోగము చేయుచుండిన గుప్తగారి కంటె రెడ్డిగారి యందు లక్ష్యం, గౌరవం హెచ్చుగా వుండేవి. ప్రభుత్వ గ్రాంటులు త్వరగా పొందాలంటే, ఇతర అనుకూలాలు ఏర్పరచుకోవాలంటే మంత్రుల చలవచూపు లేనిదే పనులు జరుగవుకదా ! కాబట్టి ఒకవిధంగా శ్రీ రెడ్డిగారే యకాడమికి ఎక్కువ లాభకారిగా వుందురు అని తలంచి పి. టి. రెడ్డిగారి అభిప్రాయాని కనుమతించాను. కాని మధ్య 3 సంవత్సరాలు గడచిపోయాయి. అప్పటికి పి. టి. రెడ్డిగారికి వాతావరణం అనుకూలంగా మారి యుంటుంది. పైగా నరోత్తమరెడ్డిగారు ఉస్మానియా విశ్వవిద్యాలయానికి ఉపాధ్యక్షులు (వైస్ ఛాన్సలర్) అయ్యారు. తద్వారా వారి స్థాయి మరింత పెరిగింది. గుప్తాగారు ఉద్యోగ విరమణచేసి, వారికి గుండెజబ్బు వంటిది వచ్చి

నిరుత్సాహులై యున్నారు. ఆ పరిస్థితులలో నరోత్తమరెడ్డిగారితో పోటీ చేయటం అవివేకమని వారు గ్రహించియుందురు. ఈ యన్ని కారణాలవల్ల 1972 సెప్టెంబరు 24–వ తారీఖున జరిగిన సర్వసభ్య సమావేశానికి నేను హాజరయినప్పుడు (శ్రీ) పి. టి. రెడ్డి నావంక సరిగా చూడనే లేదు. అప్పుడు జరిగిన ఎన్నికలలో ఉపాధ్యక్ష పదవికి వా రభిమానించిన వ్యక్తికి పోటీగా మరొక వ్యక్తిని నేను పోటీ పెట్టాను. అదీగాక అంతకు ముందు జరిగిన చర్చలో ఒకటి రెండు విషయాలలో ఆయనతో విభేదించాను. అందువల్ల నేను కార్యనిర్వాహక సభ్యునిగా పోటీచేస్తానేమో, పూర్తిగా ఎదిరించి బోల్తాకొట్టిద్దామనే సంకల్పం ఆయన ముఖంలో నాకు ద్యోతకమైంది. కాని అప్పటికే 74 సంవత్సరాలు నిండినవాడను, ఆరోగ్యం సరిగా లేనివాడను అగుటచేత 1969 లో కంటె నాకు వద్దని ఎక్కువ దృఢంగా నిశ్చయించుకున్నాను. అందువల్ల శ్రీ నరోత్తమరెడ్డిగారు అస్వస్థతవల్ల రాని కారణాన, తాత్కాలిక అధ్యక్షుడుగా వ్యవహరించుచుండిన (శ్రీ) ఆచార్య దామెర్ల వెంకటరావుగారు (సుప్రసిద్ధ ఆంధ్ర చిత్రలేఖకుడు కీ. శే. దామెర్ల రామారావుగారి అగ్రజుడు) నా పేరు ప్రతిపాదించగా, నేను వెంటనే లేచి చేతులు జోడించి "నాకు వృద్ధాప్యం ప్రాప్తించింది. నే నీబాధ్యత వహించ లే" నని చెప్పాను. అప్పు డటు చూడగా శ్రీ పి. టి. రెడ్డిగారు కొంత నిరుత్సాహపడినట్లు తట్టింది. సమావేశం పూర్తయిన తర్వాత బైటికి వెళ్లబోవుచు (శ్రీ) రెడ్డి నావద్దకు వచ్చి "పెద్దవారు, మీ కీ వివాదాలెందుకండీ, ఏదో శాంతంగా కాలం గడపక ?" అన్నారు. నిజానికి (శ్రీ) పి. టి. రెడ్డియందు నాకు మిక్కిలి అభిమానమే. ఎంతో స్నేహపూర్వకంగా ఆయనయందు వర్తిస్తాను. ఆయనగారు చీటికి మాటికి తప్పు పట్టేవారైనా, ఏ సాకుమీదనైనా దెబ్బలాటకు సిద్ధపడేవారైనా, మీటింగులోనే 'నీ వెంతంటే నీ వెం' తని కుమ్ములాడేవారైనా నా విషయంలో ఎప్పుడూ చాలా మర్యాదగా వర్తించేవారు. నే నొకప్పుడు "ఇదేమి బొమ్మండీ, ఇలా చిత్రించారేమిటి? పైగా దీనికి 3 వేలు ఖరీదా!" అనినా సహించి వూరుకొన్నారు. అప్పుడప్పుడు వేళాకోళంగా మాట్లాడినా తప్పుబట్టి కోపగించుకొనే

వారుకాదు. ఇప్పటికిని నాయందు అట్టి అభిమానపూరిత సౌమ్యాన్నే చూపిస్తారనే నా నమ్మకం. వారి సతీమణి శ్రీమతి యశోదారెడ్డిగారియందు నాకు మిక్కిలి గౌరవభావం. ఆమె విదుషీ మణి. ఉస్మానియా యూనివర్సిటీ ఆంధ్ర బోధా విభాగంలో వారు అసిస్టెంటు ప్రొఫెసర్ అనుకొందును. ఈమధ్య "ఉత్తర హరి వంశం" పేర ఉద్గ్రంథాన్ని రచించి యున్నారు. వారింటి కొకప్పుడు వెళ్లినప్పుడు 3 పెద్ద వాల్యూములుగా బైండింగు చేయబడి యుండిన వ్రాతప్రతిని చూపించారు. ప్రభుత్వ సహాయముతో దానిని ముద్రింపించాలని రెడ్డిగారన్నారు. ఆమె చాలా కాలమునుండి ఆంధ్రప్రదేశ్ సాహిత్య యకాడమిలో సభ్యులుగా నున్నారు. సహజముగా మంచివారు. మర్యాద, మన్ననలు బాగా ఎరిగి సౌమ్యంగా మాట్లాడే స్వభావం కలవారు. ఝంఝామారుతంవంటివారు శ్రీ పి. టి. రెడ్డిగారుకాగా, మంద మలయానిలంవంటివారు శ్రీమతి యశోదారెడ్డిగారు.

ఆంధ్రప్రదేశ్ లలితకళా యకాడమి స్థాపనకు కొంచెం ముందే 9-4-1961 వ తారీఖున ప్రారంభింపబడిన విజయవాడ ఆంధ్ర యకాడమి ఆఫ్ ఆర్ట్సు, చాలా సంవత్సరాలనుండి జరుప బడుచుండిన రాజమండ్రి దామెర్ల రామారావు స్మారక ఆర్ట్సు గాలరీ, తత్సంబంధమైన చిత్రకళా పాఠశాల, హైదరాబాదులో నుండుచుండిన హైదరాబాద్ ఆర్ట్ సొసైటీ, సిద్ధిపేటలోని లలిత కళా సమితి, భీమవరం అంకాల ఆర్ట్ యకాడమి, భారత కళా పరిషత్తు హైదరాబాద్, పాలకొల్లు చిత్రకళాసంస్థవంటి ప్రాంతీయ సంస్థలు మొదట 6, 7 మాత్రమే వుండినవి. ఇప్పుడు రెట్టింపుకు పైగా పెరిగినవి. తెనాలి, విశాఖపట్నం, విజయనగరం, మచిలీ పట్టణం, వరంగల్, వెల్లటూరు మొదలైనచోట్ల క్రొత్త సంస్థలు వెలసినవి. అదివరకునుండి వర్ధిల్లుచుండిన రాజమండ్రి ఆర్ట్ గాలరీ నటుంచి, విజయవాడ ఆంధ్ర యకాడమి ఆఫ్ ఆర్ట్సు అభివృద్ధి నొందుచు ప్రాముఖ్యంలోనికి వచ్చింది. దీని తరఫున పెద్ద చిత్రాలేగాక, పిల్లల చిత్రాలు కూడా ప్రదర్శింపబడుచున్నవి. పోటీలు పెట్టబడుచున్నవి. పిల్లల విషయంలో, ఒక నిర్ణీత దినమున అప్పటికప్పుడు అక్కడే చిత్రాలు రచించు పద్ధతి ఏర్పరచ

బడింది. శ్రీ నార్ల వెంకటేశ్వరరావుగారి ప్రోత్సాహమేగాక కార్యదర్శి శ్రీ యమ్. యస్. మూర్తి శ్రద్ధ కూడా ఈ యభివృద్ధికి కారణం. ఇప్పుడా కార్యకలాపాలు అలంకార చిత్రాలకు విస్తరింపబడి వానిలో ప్రదర్శనాలు, పోటీలు జరుగుచున్నవి. అయితే, ఆరంభంలో కూడా అప్పుడున్న సంస్థలలో విజయవాడ సంస్థదే పై చేయి. అయినా, మొదట ఇవ్వదలచినది సాంవత్సరిక గ్రాంటు 1250 రూపాయలు మాత్రమే. నేను కొంత ఘర్షణపడి 1500 రూపాయలకు హెచ్చింపించినాను. దానిని తరువాత 2000 రూపాయలకు, తదుపరి 3,000 రూపాయలు, 3,500 రూపాయలకు పెంచారు. ఈమధ్య గ్రాంటును పెంచుటకు బదులు తగ్గించారు. కాని, హైదారాబాద్‌లోని ప్రాత హైదారాబాద్ ఆర్ట్ సొసైటీకిచ్చు విరాళాన్నేగాక, తర్వాత క్రొత్తగా ఏర్పడిన సంస్థలకు గ్రాంటును క్రమేపి హెచ్చించుచున్నారు. సిద్దిపేట మొదలైన సంస్థలకు హెచ్చుగానే లభిస్తున్నది. ఈ విభేదానికి కారణం ప్రాంతీయ దురభిమాన మనుకోవాలి. సంస్థ పూర్తిగా ప్రభుత్వగ్రాంటు మీదనే ఆధారపడి యున్నది. ప్రభుత్వానికి వచ్చే డబ్బు హెచ్చుభాగం ఆంధ్రప్రాంతమునుండి, అందులో సర్కారు జిల్లాలనుండి వస్తున్నది. కాని, సంస్థ కార్యకలాపాల పెత్తనం సాగించే అధ్యక్షుడు, కార్యదర్శి తెలంగాణావారు. ఆ కారణాన తెలంగాణా సంస్థలకు ఎక్కువ ముట్టుచున్నది. ఇంకొకటి, భీమవరంలో స్థాపించబడిన అంకాల ఆర్టు యకాడమి బెజవాడ ఆంధ్ర యకాడమి వలె బహుముఖాలుగా కార్యకలాపాలను సాగించుచున్నది. కాని దానికి మొదట 750 రూపాయలు మాత్రమే యిచ్చారు. నేను గట్టిగా చెప్పగా రెండవ సంవత్సరం దానిని 1,000 రూపాయలకు పెంచారు. దానిని తిరిగి 750 రూపాయలకు తగ్గించారు. అంకాల ఆర్ట్ యకాడమి కంటె తరువాత ప్రారంభించిన తెలంగాణా సంస్థలకు ఇచ్చే గ్రాంటు ఏటేటా పెరగటమేగాని తగ్గుముఖం పట్టదు. తెలివితేటలు, సమర్థత గలిగి అభివృద్ధిలోకి వస్తారనే కళా విద్యార్థులకు విద్యార్థివేతనా లిస్తారు. వీనిలో చాలాభాగం తెలంగాణావారికే పోవుచున్నవి. మరిన్ని చిత్రకళ, శిల్పం

సంబంధమైన పరిశోధనలు జోడీకరించి అనుభవాన్ని గ్రంథస్థం చేయు విషయంలో కూడ ఆంధ్రప్రాంతంవారికి ప్రోత్సాహం తక్కువ. తెనాలి కాలేజి ఆంధ్రోపన్యాసకులు, శిల్పవిజ్ఞానాన్ని బాగుగా సంపాదించినవారు (శ్రీ) కొండూరు వీరరాఘవాచార్యులు గారు ఆంధ్ర కళా క్షేత్రాలను గురించి పూర్తిగా వ్రాయదలచి మొదటి భాగం ముద్రణకు ఆంధ్రప్రదేశ్ యకాడమిని ఆర్థిక సహాయం కోరారు. దానిని పొందుటకు నేను కూడా మిక్కిలి శ్రమించినగాని, దీర్ఘకాలానికిగాని ఒక్క వెయ్యి రూపాయలు గ్రాంటివ్వటం గగనమైపోయింది. వారు రెండవ భాగాన్ని కూడా ముద్రింపించారు. దానికి కూడా కొంత సహాయం అకాడమివారు యిచ్చారో లేదో నాకు గుర్తులేదు. 3-వ భాగంకూడా తయారైనది. ముద్రించటానికి డబ్బులేదని వారు వేచియున్నారు. సభ్యులనుండేగాక వివిధకళాకారుల నుండి పెద్ద ఎత్తునే చిత్రలేఖనాలను కొంటారు. చిత్రాలను కొనటానికి మొదట 5 వేలు కేటాయించారు. అదిప్పుడు 12 వేలకు పెరిగింది. కొన్న చిత్ర పటాలలో చాలాభాగం ఆకర్షణీయంగా కూడా వుండవు. వీనికి ధరలు జాస్తిగానే యిస్తారు. ఇక్కడొకటి చెప్పాలి. వికృతంగాను, అనాకారంగాను వుండే చిత్రాలు ఆధునిక (మోడరన్) చిత్రాలట. వీనిలో కొన్నింటిని నైరూప్య చిత్రాలని, క్యూబిస్టు చిత్రాలని, ఇమ్‌ప్రెషనిస్టు, సర్‌రియలిస్టు చిత్రాలని, ఎక్స్‌ప్రెషనిస్టు, ఎక్జిస్టెషనిస్టు చిత్రాలని పేరు పెట్టి పిలుస్తారు. వీని విషయం తరువాత. ఇప్పుడు చెప్పవలదేమంటే, ఈ అవక తవక చిత్రాలకు కూడా ప్రాంతీయాభిమానంచేత ఎక్కువ డబ్బిచ్చి కొంటున్నారు. మరిన్ని చిత్రలేఖన, శిల్ప సంబంధమైన గ్రంథాలను కొంటున్నారు. ఈ చిత్రాలనుగాని, గ్రంథాలనుగాని వారిలో వారు పెత్తనంవహించి కొనటమేగాని, కార్యనిర్వాహకవర్గంతో సంప్రదించుటయే వుండదు. చిత్రాలను కొనిన తర్వాత జరిగిన సమావేశంలో చూపించటం కద్దు. పుస్తకాల పేర్లను చదవటం కద్దు. అంతటితో సరి. ఇక సిబ్బంది విషయంలో, మొదట తాత్కాలికంగా అని ఇద్దరు, ముగ్గురను నియమించారు. ఈ

తాత్కాలికం పర్మనెంటు అయిపోయింది. నేను 4, 5 సార్లైనా "ఈ తాత్కాలికమని నియమించిన వ్యక్తులు అనవసరం, ఇక మాన్పిద్దా"మంటే నా మాట వారి చెవికెక్కలేదు. కొంత కాలంనుండి హెచ్చుజీతం మీదనే 'ఆఫీసు కార్యదర్శి' అనుపేరుతో ఒకరు పూర్తికాలం పనిచేయుచున్నారు. ప్రత్యేకంగా టైపిస్టు వున్నాడు. ఇంకొక అసిస్టెంటున్నాడు. ఇద్దరు జవాన్లు వంటివారున్నారు. అయినా ఫీల్డాఫీసరను పేరుతో ఒకరు ఆదినుండి యిప్పటివరకు కొనసాగుచున్నారు. 'పార్టుటైమ్ యకౌంటెంట్' అని ఇంకొకరు వర్ధిల్లుచున్నారు. గవర్నమెంటిచ్చిన గ్రాంటులో హెచ్చుశాతం వీ రందరిక్రింద ఖర్చు అగుచున్నది.

చిత్రం అంటే బొమ్మ అని, కళ అంటే మనస్సును రంజింప చేసేది అని, బొమ్మ బొమ్మగా కనపడాలని, చిత్రంలోని ఆవు ఆవుగా వుండాలని, మనిషైతే చూచిన వెంటనే మనిషిగా కనపడాలని నా గట్టి అభిప్రాయం. ఆవును గాని, మనిషిని గాని, వంకరటింకరగా చిత్రించటం కంటె చూచుట కింపుగా నున్నట్లు చిత్రీకరించాలని. బక్కచిక్కిన ఆవునో, శల్యావస్థలోనున్న మనిషినో చిత్రించితే అందచందా లుట్టిపడక పోయినా, యథార్థ చిత్రంగనుక చిత్రించిన నైపుణ్యాన్ని, వాతావరణాన్ని బట్టి ఆకర్షించి, కరుణారసం వంటి దానిని ప్రేరేపించి హృదయాన్ని ఆర్ద్రం చేస్తుందని, కళ స్వభావం మనోభావాలను రేకెత్తించటమే నని నా నమ్మకం. కాబట్టి, యథార్థ చిత్రాలు కావాలంటే ఫొటోగ్రఫి లేదా అని తిరస్కరించటం సబబు కాదని నా వాదన. సరే, మీరు చర్మ చక్షువులతో చూచినవి మాత్రమే కావాలంటారు. మరి మనోనేత్రాలతో చూచు చిత్రాలున్నవి. అవే ఆధునిక చిత్రాలనే నైరూప్య చిత్రాలు. వీనిని విజ్ఞానంతో, పరిశీలనాత్మకదృష్టితో, ఊహాబలంతో చూచినట్లైతే వీని సౌందర్యం గ్రహించగలరు. కొంత ప్రయత్నంచేస్తే ఈ చిత్రాలు అర్థ మవుతవి. కొంత నేర్చుకుంటే వీని టెక్నిక్ మీ కందుతుంది. కొంత తరిచితే, అలవాటుపడితే, అనుభవం సంపాదిస్తే వీని సౌందర్యం బైటపడుతుంది. బహిర్నేత్ర దృష్టి

కంటె అంతర్గత జ్ఞాననేత్ర దృష్టి ఎక్కువ కదా, విగ్రహారాధన కంటె బ్రహ్మోపాసన ఉత్తమం కదా అని సమాధానం చెప్తూ తారు. చైనాభాష రాని వారికి దానిని నేర్చుకొననిదే అది అర్థ మవుతుందా ? అని ప్రశ్నిస్తారు. నా సమాధానం, "బ్రహ్మ జ్ఞానులకు నిర్గుణ బ్రహ్మోపాసన ఉచితం. ఇతరులకు సగుణ విగ్రహారాధన బ్రహ్మ, విష్ణు, మహేశ్వరుల పేరనో, రామ కృష్ణుల వంటి అవతారపురుషుల పేరనో, ఇతర దేవతల పేరనో అవసరం. వారికి పూజాపునస్కారాలు, సంకీర్తన, భక్తి మార్గాలు తప్పవు" అని. ఈసందర్భంగా ఒకటి రెండు విషయాలు చెప్తాను. నేను నా "అభిప్రాయాలు - అనుభవాలు" అను పుస్తకంలో "పండితులు - కవులు - కళాకారులు" అనే శీర్షిక క్రింద చిత్రకళను గురించి నా అభిప్రాయం వ్రాశాను. దానిని చదివిన వారొకరు నైరూప్య చిత్రాలను గురించిన నా నిరసన విషయం అడిగారు. దానికి సమాధానంగా "మీరెన్న డైనా చిదంబరం వెళ్లారా ? నటరాజస్వామివారి విగ్రహమున్న చోటు కవతలి గోడప్రక్కనున్న శూన్యప్రదేశం చూచారా ? ఆ శూన్య స్థలాన్ని చూపించిన వారిని ఇదేమిటని అడిగితే ఇదే చిదంబర రహస్యం అంటారు. ఆ ఖాళీ స్థలంలో కొంత గంధం పూసి ఒక మేకుకు ఒక చిన్నమాలను వేసి వుంచటం తప్ప మరేమీ వుండదు. కాని అందులో ఏదో మహాత్మ్య ముం దంటారు. ఆ పద్ధతివే నైరూప్య చిత్రాలన్నవి. వానిలో ఏ గొప్పతన మున్నదో భగవంతునికి తెలియాలిగాని చిత్రించినవారికి కూడా తెలియ" దని అన్నాను. ఈవిషయం ఒక మిత్రునితో ప్రస్తావనకు రాగా ఆయనొక వింత చెప్పాడు. ఒకాయన ఒక గోడ కభిముఖంగా నిల్చుండి "ఆహా ! ఎంత చక్కని పచ్చిక బయలు ! ఎంత మృదువుగా, ఏపుగా, దట్టముగా పెరిగిన పచ్చిగడ్డి ! ఓహో ! ఆవు లెంత తృప్తిగా మేస్తున్నావి ! బలే ! ఎంత అందమైన, బలిష్ఠమైన, పెద్ద పొదుగులుగల ఆ ఆవులు" అని సంతోషించుచున్నాడట. ప్రక్కనున్న మరొకాయన అటుచూచి

"ఆవు లెక్క డండీ! ఏవీ లేవే?" అన్నాడట. "మేసి ఇంటికి వెళ్లిపోయాయి" అని సమాధానం వచ్చింది. "అయితే పచ్చిక బయలేది? పచ్చిక ఏది?" అని రెండవవాడు మొదటివానిని ప్రశ్నించాడట. "ఆవులు మేసిపోయాయిక దా!" అన్నాడట. ఈ సందర్భంలో ఇం కొకటి చెబుతాను. ఒకప్పుడు చిత్రకళా విమర్శకుడని ప్రఖ్యాతి పొందిన మిత్రు డొకరు "చిత్రాన్ని ఆనందించాలంటే" అన్న వ్యాసం వ్రాస్తూ "ఆధునిక చిత్రా లనే నైరూప్య చిత్రాలను ఆనందించాలంటే కొంత ప్రయత్నం, అనుభవం వుండా" లన్నారు. దానికి సమాధానంగా వారి కో వుత్తరం వ్రాశాను. "ఒకనాడు మా వంటవానితో ఈ గుత్తి వంకాయకూర చాలా రుచిగా వున్నది, ఈ పలావు బ్రహ్మాండంగా వున్నది, ఈ వంటకాలలో ఏ యే వస్తువుల నుపయోగించావు?" అని అడిగాను. "ఏవో, మామూలుగా వాడే వస్తువులనే వాడాను. నా చేతనైనంత బాగా, శ్రద్ధగా వంటజేయటం నా వంతు, ఆ వంటకాల రుచికి సంతోషించటం మీ వంతు" అన్నాడు. కాబట్టి, చిత్రాన్ని చూచేవాడు తనకు బహిర్గతమైన చిత్రీకరణను చూసే ఆనందిస్తాడు లేక నిరసిస్తాడు గాని దానిని ఏ భావంతో, ఏ దృక్పథంతో, ఏ భావనాబలంతో చిత్రించాడో లేక సృజించాడో అతనికి అనవసరం. పై జెప్పిన నా పుస్తకంలోని నా వ్రాతను చదివినవారికి నే నెంతగా ఈ యాధునిక చిత్రా లనే నైరూప్య చిత్రాలను నిరసిస్తానో తెలుస్తుంది.

ప్రాంతీయ సంస్థలకు గ్రాంటు లిచ్చే విషయంలో నేను కొంత శ్రద్ధవహించేవాడను. నా బారిష్టరు డిగ్రీని బట్టి మొదటిలో కాన్‌స్టిట్యూషన్ కమిటీలో నన్ను వేశారు గాని ఇతర ఏ కమిటీ సభ్యుడను నేను కాలేదు. అయినా బారిష్టరు నని, ఆఫీసర్‌గా పనిచేసియున్నానని అధ్యక్షుడు, కార్యదర్శి మొదలైనవారు మనస్సులో ఎట్లున్నా కొంత గౌరవభావం కనపరచేవారు. 1, 2 సార్లు పెద్ద ప్రభుత్వోద్యోగిగా వుండుచుండిన శ్రీ గుప్తా నన్ను తిరస్కరించినట్లు మాట్లాడగా, నేను గట్టిగా మందలించి, "మీ రెవరితో మాట్లాడుచున్నారో మరచి

పోయి నట్లున్న ” దన్నాను. నేను మాట్లాడినప్పుడు ఖచ్చితంగా, సూటిగా మాట్లాడే స్వభావం కలవాడను. ఈ నా ధోరణిని గమనించిన గుప్తాగారు, నేను ఒప్పజెప్పిన పనిని ఖచ్చితంగా, సమర్థవంతముగా చేస్తానని అభిప్రాయ పడినట్లున్నారు. 3, 4 సందర్భాలలో నాకు వ్రాసి “ తెనాలి శిల్పకళా సంస్థవారు గ్రాంటు అడుగుచున్నారు, మంగళగిరి తత్త్వానందాశ్రమంలో నడుపబడు చున్న శిల్పుల మహాసంఘం వారు గ్రాంటును కోరుచున్నారు, రాజమండ్రినుండి మంత్రవాది వెంకటరత్నంగారు సహాయం అర్థించుచున్నారు, విచారించి వారి స్థితిగతులను, అర్హతలను తెలియపర్చం ” డని కోరారు. ఇంకొకటి రెండు అట్టివే నాకు నిర్ణయించారుగాని, ముఖ్యమైనది భీమవరంలోని అంకాల ఆర్టు యకాడమి విషయం. దీనిని అంకాల వెంకట సుబ్బారావుగారు రాష్ట్ర యకాడమి స్థాపించిన తర్వాతనే 1961 చివరనో లేక 1962 లోనో స్థాపించిన ట్లున్నది. అయితే శ్రీ వెంకట సుబ్బారావుగారు అప్పటికి వయస్సు మళ్లినవారు. వా రంతకు ముందు ఎన్ని సంవత్సరాలనుండియో సంప్రదాయ పద్ధతిలో చిత్రాల నెన్నిటినో చిత్రించియుండి ప్రసిద్ధినొంది యున్నారు. వారి చిత్రాలు కొన్ని తిరువనంతపురం (త్రివేండ్రం) చిత్రా లయంలో ప్రదర్శింపబడి యున్నవి. మా మొదటి కార్య నిర్వాహకసభ్యులలో వా రొకరు. మరిన్ని బెజవాడ ఆంధ్ర యకాడమికి మొదటినుండి ఉపాధ్యక్షులు. సహజంగా వారు స్థాపించిన అంకాల ఆర్టు యకాడమికి వారు అధ్యక్షులుగా నుండినారు. 1968 వచ్చునప్పటికి వారికిని, ఆ సంస్థలోని కొందరికిని అభిప్రాయభేదాలు వచ్చినవి. శ్రీ సుబ్బారావుగా రింటిలోనే నడుపబడుచుండిన యకాడమిని, అవతలివారు అక్కడి వాణీ టుటోరియల్ కాలేజిలోకి మార్చారు. సుబ్బారావుగారిని త్రోసిరాజని క్రొత్త అధ్యక్షుని, శక్రటరీని ఎన్నుకొని కార్య క్రమం జరపటం ఆరంభించారు. సుబ్బారావుగారు “ నేనే నిజమైన ప్రెసిడెంటునని, గ్రాంటును నాపేర, నాయింటి అడ్రసుకే పంపా”లని ఆంధ్రప్రదేశ్ యకాడమి వారికి తెలియబరచారు. “కాద”ని రెండవవారి ఆక్షేపణ. “ ఇచ్చే గ్రాంటును మా క్రొత్త

అడ్రసుకే పంపా"లని రెండవవారి పిటీషను. ఇట్టి స్థితిలో "మీరును, ఆమంచర్ల గోపాలరావుగారును వెళ్లి ఆ తగాదాను తీర్చం"డని శ్రీ గుప్త మాకు వ్రాశారు. వెళ్లవలెనని నిశ్చయించి "ఫలానా అప్పుడు వెళదా"మని గోపాలరావుగారికి, "వస్తున్నా"మని క్రొత్త అధ్యక్షులు ఆకుల సత్యనారాయణగారికి వ్రాశాను. వెళ్లే రోజుకు ముందు "తన కేదో అవాంతరం వచ్చిందని, టెలిగ్రాం చూచుకొని ఎక్కడికో వెళ్లుచున్నానని, వీలైతే మీ రొక్కరే వెళ్లి వ్యవహారం పూర్తిచేయం"డని శ్రీ గోపాలరావుగారు తెలిపారు. అంతకుముందు 1, 2 సార్లు వాయిదా వేసుకోవటం జరిగింది. అందువల్ల ఇక ఆలస్యం చేయకూడదని, 1968 సెప్టెంబరు 7-వ తారీఖున బయలుదేరి వెళ్లాను. నేను వెళ్లిన మధ్యాహ్నం సుబ్బారావుగారిని, వారి మిత్రులను, క్రొత్త ప్రెసిడెంటు ఆకుల సత్యనారాయణగారిని, శక్రటరి నూకల రామానుజరావుగారిని, కోశాధికారి వాణీ టుటోరియల్ కాలేజి ప్రిన్సిపాల్ శ్రీ ఉమా మహేశ్వరరావుగారిని సమావేశపరచాను. అడ్వొకేటు శ్రీ జి. వెంకటస్వామినాయుడుగారు, మరికొందరు పెద్దలు వచ్చారు. అంకాల వెంకట సుబ్బారావుగారు తన పెత్తనం కొనసాగా లనటంతోబాటు తన స్వంతధోరణి,సంప్రదాయ పద్ధతిలో చిత్రించే వారినే అనుమతించాలని, వారి చిత్రాలనే ప్రదర్శనానికి ఒప్పు కోవాలని, అట్టివానికే బహుమతులివ్వాలని దృఢాభిప్రాయంకలిగి వుండినారు. మరిన్ని, వారికి ఆర్థికస్తోమతు తక్కువ. యకాడమికి బిల్డింగు నేర్పరచుటలోగాని, తగిన సదుపాయాలను సమకూర్చుట లోగాని, అవసరంవస్తే స్వంత డబ్బు ఖర్చుపెట్టుటకుగాని అవకాశం లేనివారు. పైగా, వా రొకప్పుడు తన ఆర్థికస్థితి మిక్కిలి తక్కువని తనకు పింఛను వంటి వార్షిక మివ్వాలని రాష్ట్ర యకాడమికి వ్రాసుకొని యున్నారు. రెండవపక్షం వారు ఆర్థికంగా కొంత బలవంతులు. వారిలో ఎక్కువమంది యువకులు. ప్రెసిడెంటు ఆకుల సత్యనారాయణగారు సుబ్బారావుగారివలె వయస్సు మళ్లినవారుకాదు. శక్రటరి శ్రీ నూకల రామానుజరావు, కోశాధికారి శ్రీ ఉమా

మహేశ్వరరావు నాలుగు డబ్బులు తమది ఖర్చుపెట్టగల వారే గాక ఇతరుల నుండి విరాళాలు సేకరించే శక్తి గలవారు. మరిన్ని, వారి పలుకుబడివల్ల మునిసిపాలిటీవారు పెద్ద స్థలాన్ని ఆ సంస్థకు యిచ్చారట. దానిలో చక్కని బిల్డింగును ఏర్పాటు చేస్తామని చెప్పారు. పైగా, ప్రదేశ్ యకాడమియే గాక, ప్రాంతీయ యకాడమి సంస్థలు కూడా ఒప్పుకొనుచున్న అన్ని రకాల చిత్రాలను సంప్రదాయ, ఆధునిక వగైరా వానిని సేకరించుటకు, ప్రదర్శించుటకు సంసిద్ధముగా వుండినారు. ఈ పరిస్థితులనుబట్టి క్రొత్తవారే యిక్కడి అంకాల యకాడమిని కొనసాగించటం ఉత్తమమని తోచింది. అందువలన సుబ్బారావు గారితో "మీరు ప్రఖ్యాత కళాకారులైనా, ఈసంస్థను మీరు పెట్టినా, మీ ధోరణిని మాత్రమే చిత్రా లుండా లనటం ఒప్పుకోని విషయం. అలా కావాలంటే మీరు ప్రత్యేకంగా ఇంకొక సంస్థను స్థాపించవచ్చును. ప్రదేశ్ యకాడమికి అనుబంధంగా వుంటున్న ఈ అంకాల ఆర్టు యకాడమి అన్నిరకాల చిత్రాలను ప్రోత్సహించవలసి యున్నది. అలా కానిపక్షంలో అనుబంధాన్ని ఊడగొట్టవలసి వస్తుంది. దమ్మిడీ రాదు. మీకు వేరే సంస్థను పెట్టుకొనుటకు శక్తి లేదు. ఉన్నదానిని మీరు చెడగొట్టటం భావ్యం కాదు. కాబట్టి మీ అభ్యంతరం వదులుకొనండి. అయితే, ఈ సంస్థను స్థాపించినవారు మీరు కాబట్టి, పైగా మీ పేరున అంకాల అకాడమీ అని జరుగుచున్నది కాబట్టి మీ పేరు శాశ్వతంగా వుండటానికి మిమ్ములను ఫౌండర్ ప్రెసిడెంట్ ( స్థాపకాధ్యక్షుడు )గా ఈ యకాడమి వున్నంతకాలం మీ పేరు వుంచుతారు" అని బోధించి, చిట్టచివరకు వారిని ఒప్పించాను. అక్కడి సంస్థ అధికారులనుండి, జి. వెంకటస్వామినాయుడు గారి నుండి మన్నన, మర్యాదలనుపొంది, ఆ రాత్రి అక్కడ విశ్రమించి మర్నాడుదయం బయలుదేరి వచ్చేశాను. వెళ్లినపనిని పూర్తి జేశానని సంతోషమేగాక, నా చదువుకు పునాదివేసిన శ్రీ పోదూరి జోగయ్యగారిని చూచుట కవకాశం కలిగిందని ఆనందించాను. వారు శిష్యవాత్సల్యంతో ఆ సాయంత్రం ఇచ్చిన తేనీటివిందులో పదిమందితో కలసి పాల్గొని మిక్కిలి తృప్తుడనైనాను.

శ్రీ అంకాల వెంకట సుబ్బారావుగారికి ఆశ చావలేదు. ఇంకా ఏదో సాధించాలని, తన్ను బలవంతంగా ఒప్పించారనో, స్థాపనాధ్యక్షుడుగా తన పేరు వేయలేదనో, పొందిన గ్రాంటును దుర్వినియోగం చేస్తున్నారనో, పనులు సరిగా జరుపలేదనో ఒకటి, రెండు పిటీషన్లు పెట్టాడు. వానికి సమాధానంగా ఆయన రాజీకి ఒప్పుకున్నట్లు వ్రాసిన ఉత్తరాలు శ్రీ గుప్తాగారికి తెలియ పరచాను. అసలు భీమవరంనుండి వచ్చినవెంటనే యకాడమి వారికి శక్రటరి గుప్తాగారి పేరుతో, రిపోర్టును పంపించియే యున్నాను. అసలు విషయాన్ని గ్రహించిన గుప్తాగారు, ప్రెసిడెంటుగారు శ్రీ సుబ్బారావు అనిశ్చిత మనస్తత్వంతో, దుర్వినియోగం చేస్తున్నారు. ఏ పనీ చేయటం లేదనే నేరారోపణలను లక్ష్యపెట్టలేదు. సుబ్బారావుగారి విలాపాలు గాలిలో ఎగిరిపోయాయి.

అంకాల ఆర్టు యకాడమి వారు నన్ను ఆ యకాడమి ఉపాధ్యక్షునిగా ప్రతి దఫా ఎన్నుకొని నన్ను అభిమానించు చున్నారు. నేను కూడా వారి యం దభిమానం కలవాడనై ఆ యకాడమి లెక్కల ఆడిట్ విషయంలోను, ప్రదేశ్ అకాడమి నుండి గ్రాంటును పొందటంలోను సాయపడుచున్నాను.

తెనాలి శిల్పకళా క్షేత్రానికి మొదట్లో కొంత విరాళమిచ్చి దానిని కొంతవర కభిమానించినా, నా అభిమానానికి మిక్కిలి గురియైనది విజయవాడ "ఆంధ్ర యకాడమి ఆఫ్ ఆర్ట్సు." దీనికి రెండుసార్లు యావజ్జీవ సభ్యత్వవిరాళ మిచ్చుటయేగాక రెండు, మూడుసార్లు ఇతరపనులకని కొంచెమో, గొప్పో యిచ్చాను. పిల్లల చిత్రపటాల పోటీ సందర్భంగా బహుమతులకు డబ్బు చాలదని కోరగా కొంత సర్దుబాటు చేశాను. కాలం గడుచుచుండినా, ఈ యకాడమికి తలదాచుకొనే వసతి లేకపోయింది. కొనియుండిన చిత్రపటాలకు, చిత్రకళా సంబంధ మైన పుస్తకాలకు నిలయ ముండినది కాదు. అధ్యక్షులైన వార్ల వా రింట్లో తాత్కాలికంగా వీనిని వుంచవలసి వచ్చింది. "ఎక్కడనైనా ఒక హాలు అద్దెకు తీసుకోనండి, మొదటి మూడు

మూసాలకు నేనద్దె నిస్తా" నన్నాను. అందుమీదట, "అసిస్టెంట్ శక్రటరి వేణుగోపాల్‌గా రింట్లో మనకు తగిన హాలున్నది, వారు అద్దె కిస్తా మంటున్నారు" అని చెప్పారు. శ్రీ వేణుగోపాల్ గుడివాడ హైస్కూల్‌వంటి వానిలో డ్రాయింగు మాష్టరుగా పనిచేసియుండి, ఉద్యోగ విరమణానంతరం విజయవాడలో తమ సొంత యింటిలో చిత్రకళాబోధనశాలను ఆరంభించి కొలది విద్యార్థులకు నేర్పుచుండినారు. నేనిచ్చిన మాటప్రకారం మూడు మూసాల అద్దె నిచ్చాను. తర్వాత తిరిగి పుస్తకాలు, చిత్రాలు నార్లవారింటికి మార్చబడి వారు విజయవాడ మకాం ఎత్తివేసి హైదరాబాదులో స్థిరనివాస మేర్పరచుకొన్న తర్వాత, ఇప్పుడు కార్యదర్శి యమ్. యస్. మూర్తిగారి గృహంలో వసతి ఏర్పరచు కొన్నట్లున్నది. ఒక సాంవత్సరిక చిత్రకళాప్రదర్శనానికి శ్రీ నరోత్తమరెడ్డిగారిని ఆహ్వానించాము. ఆ ప్రదర్శనలో రెండు చిత్రపటాలను నేను కొని యకాడమికే యిచ్చివేశాను.

ఒకసారి శ్రీ నార్ల ప్రతిపాదనవల్ల ఆమంచర్ల గోపాలరావు గారితో కలిసి ఒక ప్రదర్శనానికిముందు దాని కర్హమైన వానిని ఎన్నికచేసే నిర్ణేతనుగా వ్యవహరించాను. శ్రీ గోపాలరావు ఆధునిక చిత్రాలమీద కొంత అభిమానం కలవాడు. నేను పూర్తిగా సంప్రదాయ చిత్రాలను అభిమానించేవాడను. అందు వల్ల ఒకటి, రెండు చిత్రాలలో మాకు భేదాభిప్రాయాలుకలిగి, వాని నిర్ణయాన్ని శ్రీ నార్లకు వదిలేశాము. శ్రీ నార్ల సహజంగా సంప్రదాయ పద్ధతిని అభిమానించువారు. అయితే కొంతవర కైనా ఆధునిక చిత్రాలను, నైరూప్య చిత్రాలను కూడా అంగీక రిస్తారు.

2, 3 సంవత్సరాలనుండి నేను ఈ విజయవాడ యకాడమి విషయంలో శ్రద్ధవహించటంలేదు. కాని ఒకప్పుడు యకాడమికి తోడుపడువారిలో నొక ముఖ్యుడనుగా ఎంచబడ్డాను. 1961 ఏప్రిల్‌లో యకాడమిని ఆరంభించినప్పుడు శ్రీ జి. యస్. రాజుగారు, శ్రీ అంకాల వెంకట సుబ్బారావుగారు, శ్రీ యస్. సంజీవ్ దేవ్‌గారు ఉపాధ్యక్షులుగా ఎన్నుకోబడినారు. కొలదికాలానికే జి. యస్. రాజుగారి స్థానంలో నేను ఉపాధ్యక్షుడ నైనాను. అప్పటినుండి

నా సహాయాన్ని సెక్రటరి శ్రీ యమ్. యస్. మూర్తి కోరటం సర్వసాధారణమైపోయింది. 1966 ఫిబ్రవరిలో విజయవాడలో జరిగిన పారిశ్రామిక ప్రదర్శనంలో "చిత్రకళ భాగాన్ని (స్టాల్ ఆర్ట్ సెలాన్) పెట్టుచున్నాం, మీ చిత్రపటాలను అరువి" వ్వండని కోరగా, ఇరవై మూడు చిత్రలేఖనాలను, మూడు కాంస్య విగ్రహాలను, ఒక మార్బుల్ విగ్రహాన్ని ప్రదర్శనాని కిచ్చినాను. ఆ బొమ్మలను చూచి చాలామంది సంతోషించారని మూర్తిగారే గాక, నార్లవారు కూడా అన్నారు. ఆ ఫిబ్రవరిలోనే, యకాడమి తరపున మాంటిస్సోరి స్కూలు ఆవరణలో జరిగిన పిల్లల చిత్రకళ పోటీపరీక్ష సందర్భంగా జరిగిన సభకు అధ్యక్షులుగావేర్పరచుకొన్న శ్రీ పచ్చిపులుసు సుబ్బారావుగారు సకాలంలో రానందున, వారి స్థానే నేను కొంత మాట్లాడవలసి వచ్చింది. తర్వాత సుబ్బారావు గారు వచ్చి బహుమతులు పంచిపెట్టారు. ఆ మీటింగుకు విజయవాడ ఆకాశవాణి డైరెక్టర్ గారు కూడా హాజరైనారు.

ఇప్పుడు ఆధునిక, ముఖ్యముగా నైరూప్య చిత్రకారుడుగా ప్రఖ్యాతివహించిన గుడివాడ వాస్తవ్యుడైన శ్రీ యస్. వి. రామారావును, ఆయన ఇంగ్లండుకు వెళ్ళకముందు హైదరాబాదులోని అజంతా హాలులో కలసికొనటం, ఒకరికొకరు పరిచయపడటం జరిగింది. ఆ ప్రదర్శనలో శ్రీ రామారావు చిత్రపటా లుండినవి. వారిని నే నెందులకో హర్షించలేకపోయాను. ఆ విషయం ఆయనకు చెప్పాను కూడాను. అయినా నా స్వగ్రామమగు బొమ్మలూరుకు 2 మైళ్ళలోనున్న గుడివాడ వాస్తవ్యుడగుటచేతను, మా లింగం కుటుంబాన్ని బాగుగా ఎరిగియుండినవాడగుటచేతను కాబోలు, నా కింగ్లండు నుండి 1963 క్రిస్మస్‌కు శుభాకాంక్షలు పంపాడు. ఆ అభిమానానికి నేను సంతోషించి ఆయనకు కృతజ్ఞత తెలిపాను.

1966 సెప్టెంబరులో 24–వ తారీఖున శ్రీ నార్ల వెంకటేశ్వరరావుగారు "మీతో ముఖ్యంగా మాట్లాడాలి" అని నాకు వ్రాశారు. నేను వారిని కలుసుకోగా, "మన యకాడమికి స్థిర నివాసం లేదుగదా! విజయవాడ మ్యూజియం ఆవరణ చాలా పెద్దది. అందులో కొంతభాగాన్ని కోరాము, జిల్లాబోర్డువారు

అనుమతించే సూచన లున్నాయి. పైగా ఒక ప్రఖ్యాత సినీ నటుడు శ్రీ అక్కినేని నాగేశ్వరరావు సహాయం చేస్తా నన్నాడు. మీరు కూడా చేయివేయా''లని చెప్పారు. ''సరే!''అని ఒక పెద్ద మొత్తమే సూచించాను. 1970 లో ఒకసారి వారు మాయింటికి రాగా ఆ మొత్తాన్ని హెచ్చించి చెప్పాను. 'అయితే, నా చేతిలో డబ్బు లేదుగాబట్టి, ఏదో అమ్ముడుపోతే అది సాధ్య మవుతుం''దన్నాను. అదేదీ అమ్ముడు కాలేదు. నాకు తర్వాత ఖర్చు లెక్కువైనాయి. శ్రీ నార్ల విజయవాడ విడిచి హైదరాబాదు వెళ్లిపోయారు. జిల్లాబోర్డువారి అనుమతి కాలేదు. పైగా కొన్ని అభ్యంతరాలు వచ్చాయి ఆ సినిమా నటుడు "నావల్లకాదు" అన్నాడట. అందువల్ల ఆ ప్రస్తావనే లేకుండా పోయింది.

నేను 1961 లో ఆంధ్రప్రదేశ్ లలితకళా అకాడమి సభ్యుడ నైనప్పుడు (శ్రీ) పండిత గొర్రెపాటి వెంకట సుబ్బయ్య, (శ్రీ) గూడవల్లి నరసింహారావు వంటి మిత్రులు సంతోషించి అభినందించారు. తర్వాత ఎవరో అపరిచిత కళాభిమాని వచ్చి అభినందించి వెళ్లారు. అలాగే అక్కడక్కడ అభిమానా లందటం తటస్థించింది. ఇంతకంటె కొంచెం ఎక్కు డభిమానాన్నే కీర్తిశేషులు సుప్రసిద్ధ చిత్రలేఖకులు మొక్కపాటి కృష్ణమూర్తి గారి కుమారుడు (శ్రీ)రామకృష్ణ చూపించాడు. ఆయన నుండి 1971 సెప్టెంబరులో మా సమీప గ్రామమగు సిద్ధేంద్రస్వామి వారి కూచిపూడిగ్రామం చిరునామాతో ఉత్తరం వచ్చింది. ఆయ నంతకు ముందు రెండు, మూడు సంవత్సరాలనుండి కూచిపూడిలో స్థాపించబడిన సిద్ధేంద్ర కళాక్షేత్రం అనుబంధంగా నడుపబడుచున్న స్కూలులో అధ్యాపకులుగా నుండుచుండినారట. ఆయన బి. ఎ. డిగ్రీని పొంది, యమ్. ఎ. డిగ్రీకొరకు ప్రయత్నించుచుండినా, తండ్రివలె కళాకారుడే. ''ఫలనారోజున వస్తున్నా''నని ముందుగా తెలియజేసి కూచిపూడిలో ఆయన వున్న గదికి వెళ్లాను. ఆయన తాను లిఖించిన కొన్నిచిత్రాలను చూపించారు. ఇంకను చేయితిరగలేదుగాని బాగుగానే వున్నవని తలంచాను. పిమ్మట 1972 లో ఆయనగారి నింకొకసారి

ఇక్కడ, ఒకటి రెండుసార్లు హైదరాబాద్‌లో కలసికొన్నాను. అక్కడ ఎమ్. ఎ. డిగ్రీకి చదువుచూ ఎక్కడైనా ఉద్యోగం సంపాదించాలని, తన చిత్రలేఖనాన్ని ప్రచారం చేయాలని ప్రయత్నంలో వుండినాడు. తెలంగాణావారికి ఆంధ్రులంటే అంత ప్రీతిలేదని పైన చెప్పాను. పైగా గడ్డురోజులు. కొంచెం యిబ్బంది పడుచున్నాడేమో యని అనుమానం. నేనింతవరకు తిరిగి హైదరాబాద్‌కు వెళ్లలేదు.

ఆంధ్రభాణిని ఆరంభించినవారని సామాన్యంగా మనం తలచే శ్రీ దామెర్ల రామారావుగారి అగ్రసోదరుడు శ్రీ దామెర్ల వెంకటరావుగారికి కుటుంబ రీత్యా గాకుండా సహజంగా ఆధునిక చిత్రాలని చెప్పబడే వాని యందు మిక్కిలి నిరసనభావం కలదు. వారి భావంతో నేను ఏకీభవిస్తాను. కాబట్టి నన్ను మిక్కిలి హర్షిస్తూ సంప్రదాయ పద్ధతులకు, నైరూప్య వికారాలకు వ్యత్యాసాన్ని వివరిస్తూ రెండు వుత్తరాలను వ్రాశారు. ఒక ఉత్తరంలో "రాజమండ్రి రామారావు ఆర్ట్ గాలరీలో ప్రముఖ చిత్రకారుల సమావేశం జరిగినట్లు, వచ్చినవారిలో కొందరు పాశ్చాత్యులైనట్లు, సభలో చాలామందేగాక, వచ్చిన పాశ్చాత్యులుకూడా ఆధునిక, నైరూప్య చిత్రాలను నిరసించినట్లు తెలియజేశారు. ఆ సందర్భములో ఈ నవీన పద్ధతు లనే ఈ చిరాకులకు మూలకారకుడైన పాబ్లోపికాసో ప్రస్తావన వచ్చినట్లు, అంతకు కొలదికాలం క్రిందటనే తాను లిఖించిన ఆధునిక చిత్రాలు నిజమైన ఆర్ట్ కాదని, తమాషాకు, ఇతరుల అభిప్రాయాన్ని (రియాక్షన్) తెలుసుకొనటానికి లిఖించినానని పికాసో చెప్పుకొన్నట్లు సభవారికి తెలియజెప్పటమైన"దని వ్రాశారు. నిజానికి పికాసో బహిరంగంగా పత్రికలలో ప్రకటన చేశారు. "తాను మామూలు పద్ధతిలోనే చిత్రిస్తూ, ఒకప్పుడు ఆఫ్రికా దేశాలకు వెళ్లినట్లు, అక్కడ ఆదిమవాసుల కళాపద్ధతులను చూచి క్యూబిక్ అనే పద్ధతి ఎంతవరకు ఆమోదింపబడుతుందో చూద్దామని దాని నాచరణలో పెట్టినట్లు, క్రమేపి అది వివిధరూపాలు ధరించినట్లు, అది క్రొత్తపంథా కళావికాసంగా కొందరు వెంగళాయలు స్తోత్రించటం మొదలుపెట్టగా, అది వేలంవెర్రి

వలె ఉద్ధృతమైనట్లు, ఈ తమాషా తన అమిత సంపాద నకు కారకమై తనకు గొప్పగా లాభించినట్లు చెప్పుకొన్నాడు. ఇవన్నీ నిజమైన చిత్రాలని నే ననుకోను. రూబెన్స్, టైటాన్ మొదలైన మహామహుల చిత్రాలతో పోల్చిచూస్తే ఇ వెందుకూ కొరగావు. అవి చిరస్థాయిగా నిలిచేవి. ఇవి తాత్కాలి కోద్రేకానికి లోనయ్యేవి '' అని వివరంగా చెప్పాడు. ఆయ నెంత విస్పష్టంగా చెప్పినా, ఈ యాధునిక చిత్రాల పిచ్చిపట్టుకొన్న భక్తులు "పికాసో ఆ మాటలు వేళాకోళానికన్నాడని కొందరు, అసలు అననేలే" దని కొందరు వాదించటం మొదలుపెట్టారు. ఎవరి పిచ్చి వారి కానందం కదా! మరిన్ని, ఈ పికాసో భక్తులు ఇంగ్లీషు సామెత చెప్పినట్లు, "రాజుకంటె ఎక్కువ రాజభక్తులు."

ఆంధ్రప్రదేశ్ లలితకళా యకాడమి నడుచుచున్నవిధం హైదరాబాదులోనే కొందరికి విముఖత్వమేగాక విరోధం కలిగించింది. వారిలో కొందరు 'భారతకళాపరిషత్తు' అనుపేరుతో క్రొత్త కళాసంస్థను స్థాపించారు. వారిలో ముఖ్యులు శ్రీ చలసాని ప్రసాదరావు, శ్రీ పి. ఆర్. రాజుగారి వంటి కళావేత్త లున్నారు. శ్రీ సంజీవదేవ్ గారు, శ్రీ చలసాని ప్రసాదరావు నంతకు ముందు కలసికొన్నప్పుడు, నే నాయనను ఒకటి రెండు సార్లు చూచాను. ఆయన కృష్ణాజిల్లావాడేగాక పెడసనగల్లు సమీపగ్రామం వాడని గుర్తు. నేను మొదటి రెండు టరమ్‌లు, అనగా 1969 వరకు కార్యనిర్వాహక సంఘ సభ్యుడను గాబట్టి నాకు ఆగొడవను గురించి విపులీకరిస్తూ శ్రీ ప్రసాదరావు వ్రాశాడు. వారు ప్రచురించిన 'కళ' అనే మాగజీను ఒకటి రెండు సంచికలను పంపాడు. కళావైభవాన్ని ప్రస్ఫుటపరచేటట్లు ప్రశస్తంగా రంగు ఫోటోలతో ముద్రింపించటం ప్రయాసేగాక, వ్యయం కూడా హెచ్చే అవుతుంది. అందువల్ల ఈ కళ మాగజీనును ప్రచురించ టానికి ఆర్థికసహాయం కోరితే ప్రదేశ్ లలితకళా యకాడమి ఇవ్వకపోవటం వీరిని కొంత నిరసించటం జరిగిందని నే నూహిం చాను. ఏ కారణమైతేనేమి గట్టి వాదోపవాదాలే జరిగినవి. ఆ సందర్భంలో నే నేదో సమాధానపరుస్తునట్లు వ్రాసి నా సాను భూతిని చూపటానికి కొంత డొనేషన్‌ను 1969 జనవరిలో

పంపాను. నాకేదో కొంత పలుకుబడి యకాడమి సభ్యులతో వున్నట్లు తలంచి శ్రీ ప్రసాదరావేగాక శ్రీ పి.టి. రెడ్డి, శ్రీ చిత్తావూరు నాగభూషణాచార్యులు వంటి వారు "ఎలక్షన్‌లో సహాయం చేయం" డని కోరియుండినారు. అంతకుముందు శ్రీ కొండపల్లి శేషగిరిరావుగారి వంటివారు కూడా నా సహాయం కోరినవారే.

ముందుకు సాగిపోయే ముం దొక చిన్నవిషయం చెప్పాలి. 1964 అక్టోబరు ఆరంభంలో నా పేరును విజయవాడ యకాడమి ప్రతినిధిగా ప్రదేశ్ అకాడమికి పంపబడునప్పుడు, 'లింగం వీర భద్రయ్య' అని నాపేరు పంపారు. ప్రదేశ్ అకాడమి కార్యాలయం వారు ఎవరీలింగం వీరభద్రయ్య అనుకొన్నా, నా చిరునామాను బట్టి నేనే అనుకొన్నారు. తర్వాత నేను ఆఫీసుకు వెళ్లగా కార్యదర్శి నన్నడిగాడు. నే నాశ్చర్యపడగా ఆ కాగితాన్ని పట్టుకొనివచ్చి చూపించాడు. నాకు నిజంగా చిర్రెత్తింది. దానిమీదట బెజవాడ యకాడమి కార్యదర్శికి వ్రాశాను. "నేను ఇంగ్లండులో చదువుకున్నప్పు డుండినపేరు, నేను ఉద్యోగంలో వుండినప్పు డున్న పేరు, నా వాడుక పేరు యల్. వి. బి. చౌదరి. పూర్తి పేరు వ్రాయాలంటే లింగం వీరభద్రయ్యచౌదరి అని వ్రాస్తాను. నిజానికి మా కుటుంబంలో చాలామంది వీరభద్రయ్యలున్నారు. నే నని తెలియాలంటె, యల్. వి. బి. చౌదరి అని గాని, లింగం వీరభద్రయ్యచౌదరి అని గాని అనాలి. పైగా మీకు (కార్యదర్శి శ్రీ యమ్. యస్. మూర్తికి) నేను పరిచయ మయింది యల్. వి. బి. చౌదరిగానే, మీతో ఉత్తరప్రత్యుత్తరాలు జరిపింది, వ్యవహరించింది యల్. వి. బి. చౌదరిగానే. అంతకు మించి మీకు తెలియదు. ఇప్పు డిట్లు లింగం వీరభద్రయ్య అని వ్రాయటం అనుచితమేగాక, బుద్ధి తిరుగుడు వ్యవహారం. ఈవిధంగా పేర్లను త్రుంచివేయటం, మార్చటం, వికృతాలు చేయటం వెఱ్ఱివాళ్లు చేయవలసినపని" అని గట్టిగా వ్రాశాను. తర్వాత ఆయన నన్ను కలుసుకొన్నప్పుడు "ఇది నాతప్పు కాదండీ, నేను మామూలుగానే వ్రాశాను. అధ్యక్షులు శ్రీ నార్ల వెంకటేశ్వరరావు ఈవిధంగా వ్రాయండని వారి చేతితోనే వ్రాశారు" అని చెప్పాడు. కొంతకాలానికి శ్రీ నార్ల వెంక

టేశ్వరరావును ఏలూరులో ఒకసందర్భంగా కలసికోగా, సంభాషణలో "కులాన్ని సూచించే పేర్లు నాకయిష్టం" అని అన్నారు. దానికి నేను "మీరు చాలా పొరబడుచున్నారు. నా పేరు యల్. వి. బి. చౌదరి, లేక లింగం వీరభద్రయ్యా చౌదరి. కులాన్నిబట్టి చౌదరిగా పెట్టుకోలేదు. అది నా పేరులో ఒక భాగం. నీలం సంజీవరెడ్డిగారిని మీరు సంజీవ అనగలరా?" అని గట్టిగా మాట్లాడాను. నిజానికి బెజవాడ గోపాలరెడ్డిగారిని వారింట్లోవారు, దగ్గర బంధువులు గోపాలయ్యా అంటారు. కాని, ఆయనను పై జెప్పిన అధ్యక్షుడు కూడా గోపాలయ్యా అనలేడు. ఆవిధంగానే సంజీవరెడ్డిగారిని వారి దగ్గరవారు సంజీవయ్యా అన్నా, పైవారి కట్లనుటకు గుండె చాలదు. నా చిన్నప్పుడు మా తాత వీరభద్రుడుపేర నేను వీరభద్రుడనైనా, బందరులో విద్యార్థిగా చేరినప్పుడు వీరభద్రయ్యా అను పేరుతో మెలగినా, నేను ఇంగ్లండు వెళ్లిన తక్షణమే అక్కడివారు నాపేరు సరిగా ఉచ్చరించలేరని చౌదరిగా మారాను. 1920 నుండి చౌదరిగానే వ్యవహరింపబడుచున్నాను. కమ్యూనిస్టు భావాలుగలవారికి తామేదో ఘనకార్యం చేస్తున్నట్లు పేర్లను కుంచించి చెప్పటం అలవాటేమో! 1959 లో గుంటూరులో నా భార్యకు చికిత్స చేయించుచున్నప్పుడు ఆమెకు చికిత్స చేస్తుండిన కమ్యూనిస్టు భావాలుగల డాక్టరు చల్లపల్లి సాంబశివరావుగారు నేనిచ్చిన డబ్బుకు రసీదిస్తూ లింగం వీరభద్రయ్య అని వ్రాశాడు. "ఏమండీ! నాపేరు లింగం వీరభద్రయ్యాచౌదరిగదా!" అంటే నేననేది అంతే" నన్నాడు. "అలా అయితే మిమ్ములను సాంబశివరావని ఎందుకు పిలవాలి? సాంబశివ అని పిలిస్తేచాలదా!" అని కోపపడ్డాను. ఇటువంటి కుంచిత మనస్కులు ఏది అనుచితమో, ఏది సమంజసమో తెలియని ప్రబుద్ధులు.

మూడవ టరమ్ జనరల్ కౌన్సిల్ ప్రథమ సమావేశం 1972 సెప్టెంబరు 24-వ తారీఖునుండి 5 సంవత్సరాల కాలపరిమితి వరకు వుండుటకు గవర్నమెంటువారు ఆమోదించి ఆర్డర్ పంపారు. 1973 సెప్టెంబర్‌లో జరుగవలసిన మీటింగు అక్టోబరు చివరనో,

నవంబరులోనో జరుగుతుందని సమాచారం తెలిసింది. అయితే, మూడు మాసాలు ఆలస్యంగా 1973 డిసెంబరు 23-వ తారీఖున జరుగుతుందని నోటీసు వచ్చింది. ఎందు కింత ఆలస్యంగా సమావేశాన్ని ఏర్పాటు చేశారో! బహుశః అధ్యక్షులుగారికి వ్యక్తిగతంగా అనుకూల పడ లేదుగాబోలు! కార్యాంతరాలవల్ల నే నా సమావేశానికి వెళ్లలేకపోయాను.

సాహిత్య, సంగీత - నాటక లలితకళా యకాడమీల పరిస్థితులను, వాని మానేజిమెంటు పద్ధతులను పరిశీలించుటకు ప్రభుత్వంవారిచేత మొదట శ్రీ తెన్నేటి విశ్వనాథంగారి అధ్యక్షతను, వారు మానుకొనగా శ్రీ వరాహగిరి శంకరశాస్త్రి గారి అధ్యక్షతను నియమింపబడిన విచారణ సంఘం "యకాడమీల కాలపరిమితి మూడు సంవత్సరాలకు మించరాదని, ప్రెసిడెంటు, శక్రటరి మొదలైన కార్యనిర్వాహకులు రెండు దఫాలు కంటె ఎక్కువసార్లు అధికారంలో ఉండకూడ"దని సిఫార్సులు చేసినదట. ఇక నేను లలితకళా యకాడమి సర్వసభ్య సమావేశానికి ఇంకొక సారి మాత్రమే హాజరు కాగలనేమో!

(బి) శిల్పం: శిల్ప మనగా రాతిలోను, కొయ్యలోను చెక్కిన బొమ్మలని మనము సామాన్యంగా అనుకుంటాము. మట్టితోను, లక్కతోను, సున్నం సిమెంటు మిశ్రమంతోను చేసిన బొమ్మలను శిల్పం అనం. సామాన్యంగా మధుర మీనాక్షి దేవాలయం, చిదంబరంలోని నటరాజస్వామి దేవాలయం, మైలాపూరులోని కపాలేశ్వరస్వామి దేవాలయం, ట్రిప్లికేన్‌లోని పార్థసారథి దేవాలయం వంటి దేవాలయాలమీది రాతిలో చెక్కని బొమ్మలను శిల్పాలనలేము. ఒరిస్సాలోని కోనార్క దేవాలయం, జగన్నాథ దేవాలయం, లింగరాజు దేవాలయం, మైసూరులోని బేలూర్ హళెబిడ్ దేవాలయాలు, వరంగల్లు సమీపంలోని రామప్పదేవాలయం వంటి దేవాలయాలమీది రాతి విగ్రహాలు శిల్పాలే.

ఒరిస్సా: భువనేశ్వర్‌లో 'రాజు-రాణి' అనే దేవాలయమున్నది. దాని మీది విగ్రహాలు చెక్కబడినవి గాక, ఇటుకముక్కలతోనో, సున్నం యిసుక మిశ్రమంతోనో

రూపొందించబడినవని తెలుస్తాను. భువనేశ్వర్‌లో ప్రథమ స్థానం అలంకరించిన లింగరాజు దేవాలయంమీాది బొమ్మలన్నియు చెక్కబడిన శిల్పాలే. తంజావూరులోని బృహదీశ్వరస్వామి దేవాలయం, అరుణాచలంలోని దేవాలయం, అక్కడ ఇక్కడ చూచిన దేవాలయాలమీాది విగ్రహాలలో కొన్ని రాతిలో మలచబడి, అమర్చబడినవైనా, కొన్నియైనా సున్నం, ఇసుక మిశ్రమంతో రూపొందింపబడినవని నా జ్ఞాపకం. ఈ చెక్కని బొమ్మల విషయ మటుంచి, మలచిన శిల్పాలను గురించి చెప్పతాను. నన్ను ఇండియా ఇండస్ట్రియల్ ఫైనాన్స్ కార్పొరేషన్ వారు భువనేశ్వర్ సమీాపంలోనున్న బెరాంగులోని ఒరిస్సా యిండస్ట్రీస్ లిమిటెడ్ అను సంస్థకు నామిని డైరెక్టర్‌గా 1962 లో నియమించారు. 3-వ సారి 1964 ఏప్రిల్‌లో నే నక్కడకు వెళ్లినప్పుడు తిరిగి వస్తూ కోనార్క్ సూర్యదేవాలయం, పూరి జగన్నాథ్ దేవాలయం దర్శించాను. సూర్యదేవాలయం ప్రపంచ ప్రసిద్ధి కెక్కినది. దీనిని కళింగ రా జొకరు 13-వ శతాబ్దంలో నిర్మింపించాడు. దేవాలయ అస్థిపంజర మున్నదిగాని, అధిష్ఠాన దేవత ఆకాశదివాకరునితో కలసిపోయి నట్లున్నాడు. అందువలన పూజారిగాని, పూజా పునస్కారాలుగాని లేవు. అయితే, కొంతవరకు శిథిలమైనా, సూర్యభగవానుని సప్తాశ్వాలు, రథ చక్రా లున్నవి. వివిధభంగిమలతో నాట్యమాడే స్త్రీ పురుష విగ్రహా లున్నవి. రకరకాల వాయిద్యాలను మేళవించే వాద్యగాండ్రున్నారు. వివిధాలైన భంగిమలతో లైంగిక చర్యలను జరిపే మిథునము లున్నారు. ఏనుగుల బొమ్మలు కోకొల్లలు. బలిష్ఠమై, మిక్కిలి జవసత్వాలు కలిగి ఉద్వేగంతో పై కెగయుచున్నట్లున్న గుర్రాల మిడిసిపాట్లు, రథచక్రాల గంభీర బృహత్త్వం, నటీనటకుల ఉద్రేకపూరిత చిత్రభంగిమలు, వాయిద్యగాండ్రజోరులు, మిథునముల బాహాట రతిసంరంభాలు, ఏనుగుల ఎడతెగని బారులు మిక్కిలి నైపుణ్యంగా చెక్కబడి, సజీవంగా నున్నట్లు కనపడును. ఆ దేవాలయం శిల్పాలలోని ముఖ్యాకర్షణ యువతీయువకుల రతిసంరంభం, శిల్పచాతుర్యాన్ని బాహాటం చేసే రథచక్రాలు, జవసత్త్వాలు, అంగసౌష్ఠవంగల అశ్వాలు.

ముఖ్యదేవాలయం ప్రక్కనున్న శాలల్లో రకరకాల శిల్పఖండాలను సేకరించి యుంచినారు. వానిలో ముఖ్యం లైంగికబంధనాలు. ఒకటి రెండు బంధనాలు సాధ్యమా! అని పించే టట్లుండినవి. ఒకదానిలో పురుషుడు దసమోలతో శిరసాసనం మీా దున్నట్లు, అతని మీాద కెక్కిన స్త్రీ తన జన నాంగాన్ని అతని పురుషాంగంలోకి చొప్పించినట్లు, ఆమె తొడల మీాద ఒక నగ్నపురుషుడు నిలుచుండి తన లింగాన్ని ఆ స్త్రీ నోటిలోకి గ్రుచ్చినట్లు వున్నట్లు గుర్తు. ఇది నాకు మిక్కిలి విచిత్ర మనిపించింది. ఈమధ్య 'కామశిల్పం,' 'కామరత్న' అను పేరులతో కొన్ని బొమ్మల పుస్తకాలు వచ్చినవి. వానిలో చిత్ర విచిత్ర లైంగిక పోజులు చూపబడినవి. బొమ్మలను చూచుట కంటె ప్రత్యక్షంగా శిల్పాలను చూడటమే వికారానికిగాని, ఉద్రేకానికిగాని దోహద మాతుంది. ఈ సూర్యదేవాలయం మీాది బొమ్మలు అక్కడక్కడ ఎర్రరాయి ( శాండ్ స్టోన్ ) తో నిర్మింపబడినా మొత్తంమీాద చాలావరకు విగ్రహాలు, దేవాలయ మంతా నల్లరాతితో చెక్కబడి, నిర్మింపబడినది. దేవాలయం రెం డంతస్తులది. పై అంతస్తు కొంతవరకైనా పూర్తిగా శిథిల మైనట్లున్నది. పై అంతస్తులోని సూర్యదేవుని విగ్రహం మిక్కిలి ఆకర్షణీయమైన పెద్ద విగ్రహం. దాని రంగు ఆకుపచ్చవర్ణములో వున్నది. కొంచెం నీలంకూడా కలసివున్నట్లు జ్ఞాపకం. ఆ రంగు పూతరంగుకాదు. అసలు రాయి రంగే. అటువంటి విగ్రహాలు నాలుగుమూలలా నాలుగు ఏర్పరచబడ్డట్లు గుర్తు. ఇంకను, విష్ణువు పేర ఒకటి రెండు అటువంటి విగ్రహా లున్నట్లు గుర్తువస్తున్నది.

పూరీ జగన్నాథ దేవాలయం : ఈ దేవాలయం ముఖ్యంగా అక్కడి రథాన్నిబట్టి విదేశాలవారికి గూడా తెలిసినది. నిజానికి ఈ జగన్నాథ రథం విదేశీయులు ఇండియాను గురించి వ్రాసిన గ్రంథాలలో కెక్కింది. ఈ గొప్ప రథాన్ని వేలకొలది భక్తులు ఉత్సవ సమయంలో వీథులవెంట లాగుతారని, జన సమ్మర్దంలో కొంతమంది రథంక్రింద పడి చితికిపోతారని, జగన్నాథ రథాన్ని నడపాలంటే రక్తపాతమేగాక అడ్డంవచ్చిన వారిని అణగద్రొక్కటం అని అర్థంకూడా అనే భావం వెలువ

రించబడుచున్నది. ఈమధ్య ఆంధ్రప్రదేశ్ ముఖ్యమంత్రిగా వుండిన శ్రీ పి. వి. నరసింహారావు భూగరిష్ఠ పరిమితులను నిర్ణయిస్తూ, "అడ్డంకులు చెప్పేవారిమీద, ఎదిరించే వారిమీద జగన్నాథరథం తోలుతా"నన్నాడు. జగన్నాథరథం హింసాయాత్ర నేను చూడలేదు. నే నక్కడకు వెళ్లినప్పుడు, దాని నిజాకారం ముసుగువేయబడి వుండినది.

జగన్నాథస్వామివారి దేవాలయం గొప్పది. రెండు పెద్ద గోపురాలతో, 2, 3 చిన్న గోపురాలతో ప్రకాశవంతంగా, గంభీరంగా వుంటుంది. ఆ దేవాలయంమీద కూడా చాలా బూతు బొమ్మ లున్నవి. అంగసౌష్ఠవాలతో నిర్మింపబడినవే.

నేను స్వామివారి దర్శనానికి లోపలికి వెళ్లాను. స్వామివారి సన్నిధి హాలు పెద్దది. స్వామి వా రున్నది మన దక్షిణాదిని వుండే మాదిరి గర్భగుడివంటిదికాదు. పెద్ద హాలు వెనుకభాగంలో స్వామివారి విగ్రహం నిలుపబడి, దాని ముందు కొంచెం ఖాళీతో ఒకచిన్న పిట్టగోడ వంటిది అమర్చబడి వున్నది. అక్కడ దారువుతో చేయబడిన జగన్నాథస్వామి విగ్రహ మొక్కటే కాదు, ఆ విగ్రహం ప్రక్కనే దారువులతో చేయబడిన ఇంకొక రెండు విగ్రహా లున్నవి. ఒకటి బలభద్రస్వామిది, రెండవది సుభద్రాదేవిది. మనకు సుభద్రాదేవి బలరామ, కృష్ణుల సోదరి అని తెలియును. కాని అక్కడి సంప్రదాయం, ఆమె జగన్నాథస్వామి భార్యయో, లేక యిద్దరి ఉమ్మడి భార్యయో అన్నట్లున్నది. ఈజిప్టురాజులు చెల్లెలిని భార్యగా చేసుకొన్నా, మన హిందువుల కట్టిది నిషేధం. అయితే కొన్ని రామాయణాలలో సీత రాముని చెల్లెలని చెప్పబడుచున్నది. మహాప్రముఖుడైన ఈజిప్టురాజు రెండవ రామ్‌సెస్ తన కన్నకూతురునే గాక కూతురువలన తనకు పుట్టిన మనుమరాలిని కూడా భార్యగా చేసుకొన్నాడట. ఇట్టిది మన పురాణాలలో లేదుగాని, వివాహ నిబంధనలను ప్రవేశపెట్టిన శ్వేతకేతుడు కూడా తండ్రి ఉద్దాలకునికిగాక, అతని శిష్యుడువల్ల జన్మించినాడట. అనాది సంఘంలో స్త్రీ పురుష భేద మొక్కటే వుండినది. ఆకాలంలో వావి

వరుసలు లేవు. అయితే, యిప్పటి హిందూధర్మ ఆచారరీత్యా చెల్లెలిని వివాహం మాడటం పూర్తి నిషేధం. కాని, మిక్కిలి పవిత్రదేవాలయాలలో నొకటిగా ఎంచబడుచున్న జగన్నాథ స్వామి దేవాలయ , ఇట్టి ప్రాత సంప్రదాయాన్ని కొనసాగించు చున్నదా ! అనిపించుచున్నది.

1962 మార్చిలో మొట్టమొదటిసారి నేను భువనేశ్వరం వెళ్లినప్పుడు ఒరిస్సా యిండస్ట్రీస్ వారి ఉద్యోగి ఒకరు నాకు అక్కడి దేవాలయాలు చూపించారు. ప్రఖ్యాతి నొందిన లింగరాజు దేవాలయం గాక, కొంతదూరంలో కొన్ని దేవాలయాలుండినవి. లింగరాజు దేవాలయంలో నిత్యపూజాపున స్కారాలు, బ్రహ్మోత్సవాలు జరుగుచుండును. కాని, ఈ వేరుగా నున్న దేవాలయా లన్నియు శిథిలావస్థలో నున్నవి. వానిని పురాతన కళాఖండాల సముదాయంగా మాత్రమే జాగ్రత్త పరచుచున్నారు. అందులో ముఖ్యమైనది, పూర్తిగా, శ్రద్ధగా, చూడతగినది 'రాజు – రాణి' దేవాలయం. ఈదేవాలయం మీాది బొమ్మలు మిక్కిలి రామణీయకంగా వున్నవి. కొన్ని బొమ్మలు మందహాసం చేస్తున్నట్లున్నవి. బ్రతికియున్న ట్లుండిన స్త్రీ విగ్రహాలు, ప్రేక్షకులను చూచి హాసిస్తున్నాయా! అనిపిస్తుంది. అక్కడక్కడ వెగటు నవ్వుకూడా స్ఫురిస్తుంది. ఈ విధంగా హావభావాలు వెలువరించే బొమ్మలు మిక్కిలి అరుదు. ఈ విశిష్టతను నే నింకొకచోట చూడలేదు. ఈదేవాలయం కట్టడంలో ఒక విశేష మున్నది. దీనికి సున్నం, ఇసుకతో చేసిన మిశ్రమాన్ని కించిత్తైనా ఉపయోగించలేదు. వట్టి ఇటుక రాళ్లను ఒకదానిమీాద నొకటి పేర్చి సరి లేక సమ తూకం వచ్చు నట్లు అమర్చారు. ఇప్పు డే కాసీపనివాడు ఆ సామర్థ్యాన్ని చూపలే డనుకుంటాను. నే నీదేవాలయాల నన్నిటినీ చూచు నప్పటికి ప్రొద్దెక్కింది. పైన ఎండ, కడుపులో ఆకలి మంట. అందువల్ల నాతో వచ్చిన కంపెనీ తాలూకు యువకుడు "లింగరాజు దేవాలయంలోకి వెళ్లుదామా" అంటే, "నాకు ఓపిక లే"దని దేవా లయ ప్రహరీదగ్గరనుండి దేవాలయ శిఖరాలు వగైరా చూచాను. నా కిట్టి దురదృష్టం అప్పుడప్పుడు కలగటం మామూాలే.

బేలూరు చెన్నకేశ్వర దేవాలయంగాక, శిల్పసంపదకు కోనార్క సూర్యదేవాలయం తర్వాత, తెలంగాణా వరంగల్లు జిల్లాలోని రామప్పదేవాలయాన్ని చెప్పాలి. ఈ దేవాలయం వరంగల్లుకు సుమారు 40 మైళ్ల దూరంలో "రామప్పచెరువు" అనే గొప్ప సరస్సునంటి చెరువు సమీపాన వున్నది. దీనిని కాకతీయ గణపతిదేవునికాలంలో ఒక సేనాని ఆధ్వర్యంలో కట్టబడినదట. ఈ దేవాలయం కూడా దేశవ్యాప్తంగా ఖ్యాతిచెందినది. దీనిని చాలాభాగం నల్ల (గ్రానైటు) రాతితో నిర్మించారు, ఇది కూడా చాలాభాగం శిథిలావస్థలోనే వున్నది. కాని, గుడిలో నిత్య ధూప దీప నైవేద్యాలున్నా లేకపోయినా, యాత్రికులు వచ్చినప్పుడు గర్భగుడిలో పూజారి కొంత తంతు నడుపుతాడు. కోనార్క దేవాలయంమీది వలెనే ఇక్కడ కూడా రకరకాల శిల్పా లున్నవి నృత్యాలుచేసేవాళ్లు, వివిధరకాల సంగీతపరికరాలను ఉపయోగించేవారు, ఫ్రీజుగా చెక్కబడిన చిన్నచిన్న ఏనుగుల తొండాలు, వివిధ భంగిమలతో జరిపే స్త్రీ పురుష సంగమాలు ప్రత్యేకమైనవి. చెక్కడపు నైపుణ్యం, శిల్పచాతుర్యం కోనార్క దేవాలయానికి తీసిపోతుందని చెప్పలేము. అయితే కోనార్క దేవాలయంలోని గుర్రాలు, రథచక్రాలు, సూర్యవిగ్రహాలు వంటి గొప్పవి ఇక్కడ లేవు. వాటికి బదులు రెండు విశేషా లున్నవి. ఒకటి, అష్టభుజములుగా నిర్మింపబడిన ఈ దేవాలయం ప్రతి భుజాన్ని ఒక నిండైన స్త్రీ విగ్రహం ఆవరించుకొని యున్నది. ఈ ఎనిమిది విగ్రహాలు మిక్కిలి నిపుణతతో నిర్మింపబడి ఆకర్షణీయంగా, ఆహ్లాదకరంగా వున్నవి. ఇందులో ఒక బొమ్మ నాగకన్య, అనగా నాగుబామును హారముగా ఉపయోగించుచున్న నర్తకి బొమ్మ ప్రసిద్ధికెక్కింది. దీనిని సుప్రసిద్ధంచేసిన ముఖ్యులలో నొకరు ఆధునిక కవిపుంగవుడు, భావనాచాతుర్య ధురీణుడు డాక్టరు సి. నారాయణరెడ్డిగారు. రెండవది స్వామివారి కభిముఖంగా (ఇది శివాలయం) కూర్చుండి యుండిన నంది విగ్రహం. ఇంతటి చక్కని, సజీవమైన విగ్రహాన్ని నే నెక్కడా చూచియుండలేదు, నేననేక నందులను, ఈ నంది కంటె పెద్దవానిని

చూచాను గాని, ఇట్లు బ్రతికియుండినట్లున్న నంది శిల్పాన్ని నే నితర చోట్ల చూచియుండలేదని నా నమ్మకం.

ఈ రామప్ప దేవాలయాన్ని మూడుసార్లు చూచాను. మొదటిదఫా, 1963 లో ఆంధ్రప్రదేశ్ లలితకళా యకాడమి వారు జరిపించిన యాత్రలో వెళ్లాను. యకాడమి సభ్యులలో చాలామంది, కొలదిమంది యితరులు మొత్తం 36 మంది ఒక టూరిష్టు బస్సులో ప్రయాణం చేశాము. అప్పుడే అను కొందును ఉస్మానియా విశ్వవిద్యాలయంలో తెలుగు నేర్చుకొను చున్న అమెరికన్ శ్వేతయువతి ఒకరు మాతో కూడా వచ్చారు. రెండవసారి, మిత్రబృందం అనే పేరుతో సంక్రాంతి సమయంలో సమావేశమయ్యే సాంస్కృతిక సమావేశాన్నొకదానిని 1967 లో రామప్ప చెరువు రహదారి బంగళాలో జరుపుకొన్నాం. అప్పుడు సహజంగా సమీపానవున్న రామప్ప దేవాలయానికి వెళ్లి చూచాం. ఇంకొకదఫా వెళ్లానుగాని, ఏ సందర్భంలో వెళ్లానో ఇప్పుడు జ్ఞప్తికి రావటంలేదు. మొదటిదఫా యకాడమి తరఫున వెళ్లినప్పుడు, దేవాలయ శిల్ప సౌభాగ్యాన్ని చూడ టంతోబాటు ప్రక్కనున్న నీరాను కొంత సేవించాం. మేము హానుమకొండలో భోజనంచేసి దేవాలయానికి వెళ్లినప్పటికి ఎండ చుర్రు మనిపించింది. దేవాలయ ప్రాంగణాన్నానుకొని యున్న తాటిచెట్లనుండి అప్పటికప్పుడు తీసిన తీపికల్లును (నీరాను) ఇస్తున్నారని ఎవరో చెప్పారు. పదిమంది పరుగెత్తారు. అందరితో బాటు నేను కూడా వెళ్లాను. నీరాను కుండలో నింపారుగాని త్రాగుటకు పాత్రలు లేవు. అందువల్ల ప్రక్కనున్న తాటి మొవ్వ ఆకును దొప్పలుగాచేసి దానినుండి త్రాగాం. అయితే అక్కడుండిన నీరా తక్కువ, మంది హెచ్చు. అందువల్ల తల కొక కొంచెమే వచ్చింది. రుచి ఎట్లున్నా, నిషా లేకపోయినా కల్లువంటి నీరాను త్రాగామనే ఉబలాటం కలిగింది. కల్ప వృక్షం అంటే తాటిచెట్టని, దేవతలు తాటిచెట్టునుండి వచ్చిన రసాన్నే అమృతమని సేవించే వారని అంటారుకదా! మేము

కూడా కొంత దేవత్వం పొందామని సంతోషించాం. ఇంకొకటి, శ్వేతయువతి మొదట హైదరాబాదునుండి దేవాలయానికి ప్రయాణంచేయునప్పుడు అదివరకే తెలిసియుండిన ఒక రిద్ద రామెతో కొంత చనువుగా మాట్లాడినారుగాని, తతిమ్మావార మందరం కొంత సంకోచంగానే నడచుకొన్నాం. శ్వేతస్త్రీల చొరవను ఎరిగియుండిన నేను కూడా ఆమె ఏమనుకుంటుందో, ఇతరు లేమనుకుంటారో అను సందేహంచేత ఆమెను మాట్లా డించలేదు. కాని, దేవాలయం చూచునప్పుడు ఆమె నిమ్మళ్ళమ స్వేచ్ఛావర్తన అనగా సంకోచంలేకుండా స్నేహభావంతో మెలగటంవల్ల నావంటి కొంతమందికైనా ఆమెతో చనువుతో మాట్లాడటానికి అవకాశం కలిగింది. తిరిగి హైదరాబాదు వెళ్లునప్పుడు చాలామందికి ఆమె చిరపరిచితురాలైనట్లు మాటలు చెప్పుకోవటం, ప్రశ్నలు వేసుకోవటం వంటివి జరిగాయి. ఆమె తెలుగు నేర్చుకొనుచున్నట్లు తిరుగుప్రయాణంలోగాని మాకు తెలియలేదు. నేను చొరవ తీసుకుని ఆమెను తెలుగులో మాట్లా డించి ప్రశ్నలు వేశాను. కొంతవరకు తృప్తిగానే సమాధాన మిచ్చింది. "తెలుగు ఎందుకు నేర్చుకొనుచున్నా?" వని అడుగగా, "దక్షిణ ఇండియా భాషలలో నొకదానిని నేర్చుకోవా లను కొన్నాను, తెలుగు నేర్చుకుంటే బాగుంటుందని తోచింది" అని సమాధాన మిచ్చింది. ఇట్టి సాహసం, అపేక్ష పాశ్చాత్య స్త్రీల విషయంలో ఆశ్చర్యకరంకాదు.

రామప్ప దేవాలయం చూచేవారు దారిలో వున్న హనుమ కొండ వేయిస్తంభాల మండపం, గుడి, మిక్కిలి ప్రఖ్యాతిగన్న అక్కడి నందిని చూడకుండా వుండరు. దేవాలయం సర్వ సామాన్యం. కొద్దో గొప్పో పూజ జరుగుచుంటుంది. వేయి స్తంభాల మండపం బూటకం. వేయి స్తంభాలు కాదుగదా 200 ల స్తంభాలైనా వున్నట్లులేవు. స్తంభానికి నాలుగో, ఆరో, ఎనిమిదో ఫలకా లుంటవి. ఈ ఫలకాలు ఒక్కొక్కదాన్ని ఒక్కొక్క స్తంభంగా లెక్కిస్తారట. ఈ శుద్ధ అవివేకాన్నిబట్టి లెక్కకు వేయి స్తంభాలు వచ్చాయి. నిజానికి ఈ మండపంకంటె కంచిలోని వరదరాజస్వామివారి దేవాలయ మండపం, రామేశ్వరంలోని

రామలింగేశ్వరస్వామి మండపం, మధురమీనాక్షి దేవాలయ మండపం చాలా పెద్దవి. నంది విషయంలో, అది చక్కగా, అందంగా, మిక్కిలి నైపుణ్యంతో చెక్కబడిన పెద్ద విగ్రహం. కొంత జీవకళ వున్నదిగాని, రామప్ప దేవాలయంలోని నందికి గల జీవకళంత ప్రస్ఫుటం ఈ నందిలో కనపడ లేదు. దురదృష్టవశాత్తు దుండగు లెవరో దాని చక్కని చెవులను మొదలు కంటా విరుగ గొట్టివేశారు. ఈలోపం తప్ప నంది చూడటానికి మిక్కిలి ఆకర్షణీయంగా, గొప్పగా వుంటుంది. ఈ నంది రూపాన్నే ప్రదేశ్ లలితకళా యకాడమివారు తమ చిహ్నంగా స్వీకరించారు.

1963 లో నేను దక్షిణదేశయాత్రకు బయలుదేరి మధురై, రామేశ్వరం, ధనుష్కోటి, త్రివేంద్రం మొదలైనచోట్లకు వెళ్లాను. రామేశ్వర దేవాలయంలోని విశాలమైన, చుట్టుకొనివచ్చిన దీర్ఘనడవల (కారిడార్స్) నేగాక, నడవలలో నిండియున్న శివభక్తమూర్తులనేగాక, అక్కడి అనేక స్తంభాలు కలిగిన విశాలమైన మండపాన్ని, ఆ మండప స్తంభాలమీది శిల్పమూర్తులను చూచి ఆనందించాను నేనుద్యోగంలో నున్నప్పుడు కడలూరునుండి చిదంబరం వెళ్లి విస్తృతిమైన నటరాజస్వామి వారిదేవాలయం చూచానని పైన వ్రాశాను. అందలి బొమ్మలు చాలావరకు రాతితో చెక్కబడినవి కావని తోచింది. అయితే ఆ దేవాలయములోని నడవలలో రాతితో చెక్కిన పెక్కు భక్తుల మూర్తు లున్నవి. కాని, అవన్నీ నూనెజిడ్డుతో ఒకేవిధమైనవిగా తోచినవి. అరుణాచలంలోని దేవాలయ గోపురం పెద్దది. అక్కడ కూడా రాతిలో చెక్కిన శిల్పాలు విస్తారముగానే వుండినవి. ఈ పెద్ద దేవాలయాలలోని ప్రతిమలు మామూలు దేవతా విగ్రహాల ధోరణిలో మాత్రమే వుండినవి. కోనార్క్ సూర్యదేవాలయం, వరంగల్లు రామప్పదేవాలయం, మైసూరు బేలూరు, చెన్నకేశవదేవాలయం వంటి శిల్పకళా ప్రపూర్ణతలు చెప్పినప్పుడు కొంతవరకైనను చెప్పదగినది కంచి లేక కాంచీపురం వరదరాజస్వామి దేవాలయ మండపమే ఈ మండపం ఒడ్డు, పొడుగు లందు విశాలమైనదేగాక, దానిలోని

స్తంభాలు మిక్కిలి నైపుణ్యముతో చెక్కబడిన ప్రతిమలు గలవి. నన్ను ముఖ్యంగా ఆకర్షించిన శిల్పం దుముకుచున్నట్లున్న అశ్వము, దాని కళ్లెము బిగించి అదుపులోనికి తెచ్చుచున్న సైనిక రౌతు. ఇతర బొమ్మలు కూడా వున్నవిగాని చాలా స్తంభాలమీదనున్న ఈ జవసత్త్వాలతో ఉద్రేకించు గుర్రం, దాని నదుపులోకి తెచ్చుటకు ప్రయత్నించుచున్నట్లున్న రౌద్ర రౌతు నన్నెక్కువ ఆకర్షించినవి.

తంజావూరు బృహదీశ్వరాలయం దాని బ్రహ్మాండమైన గాలిగోపురం, అక్కడి నంది, హిందూపురం దగ్గరి లేపాక్షి దేవాలయం అందలి కుడ్యముల శిల్పాలు, అక్కడి మిక్కిలి పెద్దదైన నంది, అనంతపూరుజిల్లా తాడికొండలోని శివాలయగోపురంమీద అద్భుతంగా చెక్కబడిన బొమ్మలు గుర్తుకు వస్తున్నవి. బృహదీశ్వరాలయం దక్షిణాపథంలో మిక్కిలి పేరుగన్న దేవాలయాలలో నొకటి. అంతేకాదు, దాని గాలిగోపురం అన్యదేశస్థులనుకూడా ఆకర్షించి ప్రఖ్యాతి నొందినది. ఆ గోపురం మిక్కిలి ఎత్తైనదేగాక, దాని శిఖరాగ్రాన మిక్కిలి పెద్దది, బరువుగలదైన గుండ్రని శిలను అమర్చారు. దాని నమర్చుటకు కొన్ని మైళ్లనుండి క్రమేణా ఎత్తుకు పెంచబడిన వాలు మార్గంద్వారా పైకి త్రోసుకొని పోయారట. ఆ వాలు 3, 4 మైళ్లు ఏర్పరచబడ్డదట. అక్కడి ఆ దేవాలయము నందలి నంది "తంజావూరు నంది" అని పెద్ద పేరుపడ్డది. లేపాక్షి నంది ఒక పెద్ద గుట్టరాయి నుండి మలచబడిన ఏకశిలానిర్మిత నంది. నందుల నన్నింటిని ఏకశిలతోనే నిర్మిస్తారు. చిన్నవానిని చిన్న బండలనుండి, పెద్దవానిని పెద్ద బండలనుండి మలుస్తారు. లేపాక్షినంది విశేషమేమనగా అది ఒక విడిరాయి నుండి మలచబడినదికాదు. అది చిన్న కొండవంటి ఒక పెద్ద గుట్టనుండి చెక్కబడినది. అందువలన బహుశా, ప్రపంచంలోని ఆబోతు విగ్రహాలలో ఇదే పెద్దది కావచ్చు. తాడికొండ శివాలయంలో నందిని చూచినట్లు లేదు. ఆ దేవాలయ ప్రాంగణంలో విడిగా పడియుండిన ద్వారఫలకాలను చూచాను. వానిమీది స్త్రీ విగ్రహాలు, చాలా వంపు సొంపులు

కలిగి మిక్కిలి అందముగా వుండినవి. ద్వారబంధాల ప్రస్తావన వచ్చినప్పుడు ఓరుగల్లు నామావశేష కోటలోని శిథిలాలను కాపలాకాస్తున్నట్లున్న తోరణ సింహద్వారాల స్తంభాలను, నిలుచుండినవాన్నిపై శిరోఫలకాలను చూచి విభ్రాంతుడనైనాను. ఆ ద్వారబంధాలు మిక్కిలి ఎత్తైనవి. ఫలకాలు వెడల్పైనవి, దృఢమైనవి. వానిమీద చెక్కబడిన నగిషీపని, ప్రతిమలను మలచిన తీరు గొప్ప నైపుణ్యాన్ని తెలుపుతవి. ముఖ్యంగా శిరోఫలకాల మీది పనితనం ఇన్నివందల సంవత్సరాలు గడచిన తర్వాత కూడా మిక్కిలి ఆకర్షణీయముగా వున్నది. విశాలమైన ప్రదేశములో, తుండులు తుండులుగా విరుగగొట్టబడిన స్త్రీ పురుషుల విగ్రహాల ముక్కలను ఇప్పటికిని కళాఖండాలుగా పేర్కొనవచ్చును. ఓరుగల్లు సామ్రాజ్యాన్ని అంతమొందించి, ఆ నగరాన్ని ముక్కచెక్కలు చేసిన ప్రత్యర్థులు ఎంత పాపాని కొడిగట్టినారా! అని ఖేదం కలిగింది. ఆవిధంగానే హాస్పేటవద్ద విజయనగర సామ్రాజ్య పతనానంతరం ప్రత్యర్థముష్కరులు, ఆ మహా విజయనగర పట్టణాని కొనరించిన దుష్కృతాలలో, ఛిన్నా భిన్నమైన కళాఖండా లనేకము లిప్పటికిని ఆంధ్రుల సంతాపానికి కారణ మవుచున్నవి.

1972-వ సంవత్సరం మే నెలలో నేను బెంగుళూరులో వేసవిని గడపటానికి వెళ్లినప్పుడు నా చిరకాల వాంఛను నెరవేర్చుకొనుటకు బేలూరులోని చెన్నకేశ్వరస్వామి ఆలయానికి, పరిసర హాలెబిడ్ దేవాలయానికి, శ్రావణబెలగోల శ్రీ గోమతేశ్వరస్వామి సన్నిధికి వెళ్లాను. బేలూరు చెన్నకేశ్వరస్వామి దేవాలయ శిల్పసంపద ప్రపంచ విఖ్యాతి నొందినది. దేవాలయం మహాద్వారం సౌందర్యవంతంగా చెక్కబడిన విగ్రహాలు కలది. దేవాలయంమీది విగ్రహాలు మిక్కిలి నైపుణ్యముతో మలచబడినవి. రతీదేవి, భస్మమోహిని, వీణాపాణి, చతుర్ముఖబ్రహ్మ, వామనావతార్, మురళీకృష్ణ, గరుడదేవరు, త్రిమూర్తి, శాంతాలాడాన్సర్సు వంటి ప్రతిమలు చెప్పుకోతగ్గవి. ఇక్కడ కూడా నాట్య, నృత్య భంగిమలు, వాయిద్య విశేషాలు, గజయూధాలు, అర్ధనగ్న స్త్రీమూర్తులు, అలంకార విశేషాలు,

ఆభరణాలు సొంపు లుండినవి కాని లైంగికాచరణ ప్రతిరూపాలు లేవు. ఇది వైష్ణవ దేవాలయంగాబట్టి లింగసంబంధమైన చర్యలేగాక, శివ వాహానమైన నందికూడా లేదు. తర్వాత హాలెబిడ్ హొయసాలేశ్వరస్వామి దేవస్థానానికి వెళ్లాను. ఇక్కడ బేలూర్ చెన్నకేశవస్వామి దేవాలయ శిల్పసంపద లేదు గాని, ఈ దేవాలయంకూడా చెప్పుకోతగినదే. ఇక్కడ కూడా విష్ణువు, వినాయకుడు, హారిహార, విష్ణుశక్తి, తాండవి, నందికేశ్వర, భృంగీశ్వర, ద్వారపాలకులు, తాండవగణేశ్, నాట్యగణేశ్ వంటి ప్రతిమ లున్నవి. ఇది శైవ సంప్రదాయం గల దేవాలయ మగుటచేత, ఒక ప్రక్కగా పెద్ద నందికూడా వున్నది. ఇక్కడ కూడా లైంగికచర్యలుగల విగ్రహాలు లేవు. మైసూరు వారికి ఇట్టివి గిట్టవు కాబోలు.

శ్రావణబెలగోలలోని గోమతేశ్వరఏకశిలావిగ్రహం సముద్ర మట్టానికి 3 వేల 250 పైచిల్కు అడుగుల ఎత్తునవున్న "వింధ్యగిరి" అనే దొడ్డ బెట్టమీద 58 అడుగుల ఎత్తున నిలుచుండి యున్నది. శ్రావణబెలగోల కుగ్రామం వంటిది. అంత శుభ్రమైనదిగా కనపడలేదు. సమీపాన సరస్సువంటి జలాశయం మొదలైనవి వున్నవి. గోమతేశ్వర విగ్రహం లేకపోతే అక్కడకు వెళ్లే శ్రమకు లోనవటం అనవసర మనిపిస్తుంది. అక్కడకు వెళ్లిన వారిలో చాలామంది వందలకొలది మెట్లెక్కి కొండపైకి వెళ్లి స్వామిదర్శనం చేసుకొన్నారు. వెళ్లుటకు శక్తి లేనివారు డోలీలమీద వెళ్లవచ్చును. వయస్సుమళ్లిన నేను పై కెక్కుటకు సాహసించలేదు. డోలీమీద మోసుకొని పోబడ టాని కిష్టపడలేదు. అందువల్ల నేను ఆ గ్రామంలోనున్న దేవాలయాన్ని, సత్రాన్ని, చుట్టుప్రక్కలప్రాంతాన్ని చూచి సరి పెట్టుకొన్నాను. ఈదేవాలయ సత్రం మొదలైనవానిలో కొంత శిల్పసంపద లేకపోలేదు. అక్కన్నబసతి పై అంతస్తులో నగిషీ పనితోకూడిన కొన్ని ఆడ, మగ శిల్పా లున్నవి. కట్టాలబసతిలో కొన్ని శిల్పఫ్రీజు లున్నవి. దేవాలయం గర్భగుడిలో విశేష మంతగా కనపడలేదు. దాని సింహాద్వారంవద్ద కొన్ని ప్రతిమ

లున్నట్లు గుర్తు. సత్రంలో ననుకొంటాను, చాలా చక్కగా నిర్మింపబడిన వివిధరకాలైన శిల్పా లున్నట్లు బాగుగా గుర్తు. ప్రసిద్ధి కెక్కిన ఈ శిల్పరూపాలను చూచితి ననే సంతృప్తి కలిగింది. కాని కోనార్క సూర్యదేవాలయం రామప్పదేవా లయం శిల్పాలవలె నాకు వుత్సుకతనుగాని, ఉజ్వలతనుగాని కలుగజేయలేదు. ఇక్కడితో శిల్పవిషయం పూర్తి చేస్తున్నాను.

(సి) సంగీతం, నృత్యం, నటన: నాకు చిన్నప్పటి నుండి సంగీత, నృత్య, నటనలు మిక్కిలి యిష్టం. పాటలు, హరికథలు, శ్రావ్యంగా చదివే పద్యాలతో ఆరంభమై, సంగీత కచ్చేరీలద్వారా సంగీత మం దభిరుచి పెరిగింది. నాచిన్న తనంలో సిద్ధాంతం, అంగలూరు వంటి గ్రామాలలో ఆడించిన బొమ్మలాటలలో ఒక స్త్రీ చాలా హాయిగా పాడేది. ఆ స్త్రీ మధుర కంఠధ్వని, ఎలుగెత్తి పాడే తీరు, బాణీ, సొంపు నన్ను మిక్కిలి ఆకర్షించేవి. ఈలపాటలు, ఓలపాటలు నా కంతగా నచ్చవుగాని ఊడ్పులలో, కుప్పనూర్పుడులలో కూలీలు పాడే రకరకాలైన బూతుపాటలు, వానిలోని ప్రాకృతిక (డౌన్ టు యర్తు) ధోరణులు నా కిప్పటికినీ యిష్టమే. సినిమాపాటలు, జానపదుల గేయాలు వినబుద్ధి అవుచున్నదిగాని, నాకు ఊహ బాగా వచ్చినప్పటినుండి సంప్రదాయ, శాస్త్రీయ, కర్ణాటక సంగీతమే మిక్కిలి యిష్టం, నా కెందుకనో హిందూస్థానీ సంగీతం రుచించదు. నా చిన్నవయస్సులో ఎక్కడనో శ్రీ చల్లపల్లి సుబ్బయ్యగారి మనోహర గాత్ర సంగీతాన్ని, వారి సోదరుడు సీతారామయ్యగారి హాయి నిచ్చే వాయులినవాయిద్యాన్ని విని మిక్కిలి సంతోషించాను. నేను బందరులో చదువుకొనుచున్న ప్పుడు శ్రీ హరి నాగభూషణంగారి, కోటయ్య దేవరగారి ఫిడేలు వాయిద్యం నాకు మిక్కిలి హాయినిచ్చేది. శ్రీచెళ్లపిళ్ల వెంకటశాస్త్రి గారి కవితాగానం, పద్యపఠనాధోరణి నాకు శరీరాన్ని ఉప్పొం గించేవి. 1917-18 లో నూజెళ్లలో జరిగిన ఒక వివాహ సందర్భంగా ఒక కమ్మగాయకుని (ఇంటి పేరు గుర్తు లేదుగాని. పేరు వీరయ్య అని గుర్తు) గాత్రగానం అశాస్త్రీయంగా వుండినదని

తరువాత వినినా, గంగాప్రవాహంవలె సాగిన ఆ గానమాధుర్యం నన్ను పులకితుణ్ణి చేసింది. తర్వాత కాకినాడలో జరిగిన సాంవత్సరిక దసరా సంగీత కచ్చేరీలకు 1943 - 1946 లో నేనక్కడుద్యోగిగా నుండినప్పుడు హాజరై, ధన్యోస్మి అనుకునేవాణ్ణి. మద్రాసులో వున్నప్పుడు మూడు, నాలుగు సార్లైనా శ్రీమతి యమ్. యస్. సుబ్బులక్ష్మిగారి గానసుధారసాన్ని గ్రోలాను. ఒకకచ్చేరీలో ఆమెకు దగ్గరగా కూర్చుండి ఎంతో శ్రద్ధగా ప్రతినిమిషం ఆమె గానామృతాన్ని ఆస్వాదించాను. శ్రీమతి పుట్టమ్మాల్, శ్రీమతి వసంతకోకిల వంటి వారి గానాలను విని తృప్తి చెందాను. ఈమధ్య అపర సుబ్బులక్ష్మిగా తయారైన శ్రీమతి వసంతకుమారి గారి గాత్రమాధుర్యాన్నికూడా చవిచూచాను. స్త్రీల గాయనిల సంగీతమాధుర్యాన్నేగాక శ్రీ బాలసుబ్రహ్మణ్యం, శ్రీ పార్థసారథి అయ్యంగార్, మదురైకృష్ణయ్యర్, శ్రీనివాసయ్యర్, శ్రీచెంబై భాగవతార్, ముసిరి సుబ్రహ్మణ్ణయ్యర్ వంటి సంగీతదక్షుల గాత్రగానసౌఖ్యాన్ననుభవించాను. మరిన్ని కూచిపూడివారు, యామిని కృష్ణమూర్తివంటివారు వినిపించే భామకలాపందరువులు కూడా చాలా నచ్చుతవి. కూచిపూడివారి యక్షగానబాణీ నన్ను మిక్కిలి ఆకర్షిస్తుంది.

నృత్యాం నా కెక్కు డభిమానం. జానపదుల గంతులు, కేతిగాని చిందులు, లంబాడీ శృగాలీల ఎగురులు, రామభజన పరవళ్లు నాకు ముచ్చటగానే వుంటవి. కాని, భరతనాట్యం (నృత్యం) నా కెక్కు డభిమానం. కథాకళి నాట్యనృత్యాం వంటిది. అది పూర్తి నృత్యాం లేక నృత్తం అని నాకు తోచదు. మణిపురినృత్యం మిక్కిలి సున్నితమైనది, సొగసైనది. బొంబాయి ప్రాంతంవారి కథక్ నృత్యం బాగానే వుంటుంది. కాని, హిందూస్థానీ సంగీతానికి సంబంధించినదిగాబట్టి, ఆ సంగీతానికి ఆనందించని నాకు, అన్నిటికంటె భరతనాట్యమే ఉత్తమ మనిపిస్తుంది.

భరతనాట్యమును అభినయించుచున్న వారిలో శ్రీమతి బాలసరస్వతి భరతనాట్యనిధి యని చెప్పుతారు. ఆదిలో ఎట్లున్నా, వయస్సుమళ్లిన ఆమె నృత్యం అంత సొంపు నివ్వదు.

స్వచ్ఛమైన భరతనాట్యకళానిధి శ్రీమతి కమలాలక్ష్మణ్. 1944 లో కాకినాడ సరస్వతీగానసభ సాంవత్సరిక సదస్సులో ఆమె నృత్యాన్ని మొదటిసారి చూచాను. అప్పు డామె ఇంకను బాలిక. ఆమె నర్తన 'భేష్! భేష్!' అనిపించింది. వయస్సు వచ్చునప్పటికి ఆమె మిక్కిలి నైపుణ్యంగల భరతనాట్య నర్తకిగా రూపొందింది. మానంగాగాక హావభావాలుతో ద్యోతకమయ్యే చిరునగవు, నేత్ర హస్త విన్యాసములు, పదత్వరిత సంచలనములు, పృష్ఠభాగం కదిలించేతీరు, విలాసముగా, చురుకుగా అందచందాలతో నడిచే హొయలు జాజ్వల్యమానంగా వుంటవి. వైజయంతిమాల, పద్మిని, లలిత మొదలైన వారి నృత్యాలను చూచాను. బాలసరస్వతి, కమలాలక్ష్మణ్ నృత్యం నూటికి నూరుపాళ్లు భరతనాట్యం. అంగపంగలతో, చిల్లరమల్లర ధోరణులతో నర్తించే వైజయంతిమాల, పద్మిని వగైరాల నృత్యం కొంతవరకైనా భరతనాట్య మనిపించదు. ఈమధ్య హేమమాలిని నృత్యం చూచాను. అందులోని కొన్ని పోకడలు మిక్కిలి బాగుగా వున్నవి. కాని, ఆమె కూడా వర్తమాన ప్రేక్షకుల అభిరుచులనుబట్టి భరతనాట్య పద్ధతులకు భిన్నమైన పద్ధతులను అవలంబించుచున్నట్లు తోచింది.

నర్తకి నృత్యం పూర్తి సంతోషాన్ని కలిగించాలంటే ఆమె చక్కని అవయవపొందికలుకలిగి, మిసమిసలాడు యౌవనంతో వుండాలి. అప్పుడే ఆమె హావభావాలు, అంగవిన్యాసాలు విందొనర్చుతవి. వయస్సుమళ్లిన బాలసరస్వతి నృత్యానికి ఆ కారణాన ఇప్పుడు అందచందా లుండవు. మరిన్ని, నాట్యకర్తె మిక్కిలి అందమైనదైతే మరీ సొంపు. సౌందర్యంలో వైజయంతిమాలకంటె, కొంతవరకు పద్మినికంటె కూడా కమలాలక్ష్మణ్ తగ్గుస్థాయిలోనిదే. అయినా ఆమె నాట్యకళాప్రపూర్ణత్వం ఆ లోటును లోపింపజేయదు. బాలసరస్వతిని అందకత్తె అని చెప్ప వీలులేదు గాని, ఆమె భరతనాట్యకళానిధి అగుటవలన ప్రేక్షకుల నాకర్షించుచున్నది. ఇంకొక చిన్న విషయం. చిన్నపిల్లల నృత్యం కొంత ముచ్చట కలిగించినా, రసభూయిష్ఠంగా, ఉత్సాహప్రేరితంగా వుండదు. చిన్నపిల్లలు రాధగానో, సత్య

గానో లేకపోతే 'మధురానగరికి చల్లనమ్మబోయే' గొల్లభామ గానో నర్తిస్తే చిరాకు కలుగుతుంది. ఒకప్పుడొక బాలల నృత్యానికి వెళ్లాను. ఆ జిల్లా పోలీసు సూపరింటెండెంటు దంపతులు శ్వేతజాతీయులు. ప్రతిమాలి, బామాలి ఆ శ్వేత స్త్రీని కూడా ఆ ప్రదర్శనానికి తీసుకొని వచ్చినట్లున్నారు. వారిద్దరు అక్కడున్నంతవరకు ఆమె కళ్లు మూసుకొనియే యుండినది. చిన్నపిల్లలు యుక్తవయస్సు వచ్చిన జాణలవలె నటించటం, ఆమె కెంతమాత్రం ఇష్టం కలుగజేయలేదు. నేను కళ్లు మూసుకొనకపోయినా, మర్యాదకొరకు ప్రదర్శనమయ్యేవరకుండినా, నాకును ఏవగింపుగానే వుండినది. ఏ ఆటపాటల లోనో, కోలాటాలలోనో చిన్నపిల్లలు ముద్దువస్తారుగాని, పుష్పించిన యువతుల స్థానంలో మాత్రం కాదు.

( డి ) నటన : నటనరూపం నాటకం. నాటకం అంటే బూటకం అని కూడా అంటారు. నాటక మాడుచున్నాడంటే లేనివి వున్నట్లుగా చెప్పేవాడని, అబద్ధాన్ని నిజంగా కనపరచేవాడని అర్థం. లీలామానుషవిగ్రహుడగు శ్రీకృష్ణుని జగన్నాటక సూత్రధారి అంటారు. అయితే నే నిప్పుడు చెప్పునది అటువంటి నాటకవిషయం కాదు. నాటకకళనుగురించి, మామూలుగా నాటకాలాడే విషయంగురించి. ఈనాటకాలు కూడా యథార్థాలు కానివే. అనగా ఎప్పుడో జీవించారని చెప్పబడుచున్న వారిచర్యలు, నడవడి మొదలైన వానినిగురించి ఇప్పుడూహించి, ఆ వ్యక్తులు ఇట్టి రూపాన ఉండినారని భావించి, వారివలె వర్తించటం నటనోద్దేశం. ప్రస్తుతం వర్తమాన పరిస్థితులను అభివర్ణించే, వ్యక్తపరచేవిధంగా ఏకాంకనాటికలు చాలా ప్రదర్శింపబడుచున్నవి. అనుభవంలోవున్న విషయాలుగనుక నటకులు ధరించు పాత్రలు కొంతవరకు నిజమైనా, పూర్తి నిజముకాదు. అతిశయోక్తులతో, కుయుక్తులుగల సంభాషణా చాతుర్యంతో ప్రేక్షకులను రంజించుటయే ప్రధానంగా ఈ ఏకాంకికలు ప్రదర్శింపబడుచున్నవి. కాబట్టి, మొత్తంమీద నటనఅంటే బూటకమే అనుకోవాలి. అయితే, నాట్యకళ ఉద్దేశం ప్రేక్షకులకు వినోదం, సంతోష విచారాలు కలిగించ

టంతోబాటు కొన్ని ధర్మాలు, నీతులు, జీవితంలోని ఒడుదుడుకులు అనగా కష్టసుఖాలు, జయాపజయాలు, కర్మానుభవాలు, సత్యాసత్యాలు తెలియజెప్పటం, ఉత్తమపురుషుల చర్యలతోబాటు, దుష్టమానవుల నడవడి ప్రస్ఫుటంజేయుటం, కర్మానుభవాలనుజూపటం, ప్రేక్షకులను హెచ్చరించటమే అవుతుంది. చదివిన, వినిన విషయాలకంటే, చూచిన సంగతులు హృదయానికి హత్తుకొని పోతవి కదా. అందుకే కళలలోకెల్ల నాట్యకళ ఉత్తమ మంటారు. నటకులను శ్రేష్ఠకళాకారు లంటారు.

తోలుబొమ్మ లాటనుండి కురుక్షేత్ర సంగ్రామం నాటకం వరకు, బొమ్మలాటనుండి గయోపాఖ్యానం వరకు, వీధినాటకాల నుండి చిత్రనళీయం వరకూ అన్నియు నాటకాలే, అన్నియు ప్రదర్శనాలే. తోలుబొమ్మలాటలో రంగులచర్మాలు, బొమ్మలాటలో రంగుల బొమ్మలు, యక్షగాన నాటకంనుండి సారంగధర నాటకంవరకు నటీనటులు రంగులవేషాలు వేసుకొన్నవారే. తోలుబొమ్మ లాటలో గాయకిగాత్రం చీల్చుకొని వచ్చినట్లుండగా, బొమ్మలనాడించే సూత్రధారులు కీచు, బొంగురు, రణగొణధ్వనులు చేయగా, యక్షగాననాటక వేషధారులు కేకలు, బొబ్బలు పెట్టుచూ అట్టహాసాలు చేయగా, మామూలుగా నాటక ప్రదర్శకులు కొంత నాజూకుగాను, సరసంగాను, మధురంగాను, హాయిగాను పాడగలరు, నటించగలరు.

బొమ్మలాటలను ( పప్పెట్ షో ) నే నెక్కడో ఒకటి రెండు సార్లు చూచానుగాని, తోలుబొమ్మలాటలను, యక్షగాన దరువులను నేను చిన్నప్పటినుండి చూచియేయున్నాను. మొదటి భాగంలో చెప్పినట్లు నేను 7, 8 సంవత్సరాల బాలుడనై యున్నప్పుడే మా స్వగ్రామం బొమ్మలూరు సరిహద్దుగ్రామం సిద్ధాంతంలో జరిపే దేవాలయ సాంవత్సరీక ఉత్సవాలకు తప్పకుండా వెళ్లి తెల్లవార్లు తోలుబొమ్మలాటలను, కూచిపూడి వారి యక్షగాన నాటకాలను చూచేవాడను. ఆ కాలంలో రామ నాటకాన్ని కూచిపూడి వా రెక్కువగా ఆడేవారు. ఉషా పరిణయం రెండవస్థానం ఆక్రమించేది. రామనాటకంలో ఎక్కువ ఆకర్షణీయ ఘట్టం చాకలి దంపతుల ఘర్షణ, రెండో

పక్షం అరణ్యంలో విడిచిపెట్టబడిన సీత రోదన, వాల్మీకి సందర్శనం. ఉషాపరిణయంలో వెయ్యి చేతులున్నట్లు చెప్పబడిన బాణాసురుని అట్టహాసం, శ్రీకృష్ణుని సంరంభం. సూత్రధారుడు శ్రీ చింతా వెంకట్రామయ్యగారు మిక్కిలి సమర్థుడు. యక్షగాన ప్రదర్శనాలను క్షుణ్ణంగా జీర్ణంచేసుకొన్నవారు. మిక్కిలి దక్షతతో కొలది సంవత్సరాలవరకు కార్యభారం వహించి, మిక్కిలి వృద్ధదశలో అమరత్వంపొందారు. కూచిపూడివారి సంప్రదాయంకూడా, స్త్రీ పాత్రలను పురుషులు ధరించటమే. ఇప్పుడు మామూలు నాటకాలలో స్త్రీలవేషాలను స్త్రీలే ధరిస్తున్నారుగాని ఇప్పుడుకూడా కూచిపూడివారు తమ సంప్రదాయాన్ని విడిచిపెట్టలేదు. ప్రస్తుతం స్త్రీవేషధారి వేదాంతం సత్యనారాయణశర్మగారు. ఆయనకు ఖ్యాతివచ్చింది, డబ్బు సంపాదనతోబాటు "పద్మశ్రీ" బిరుదంకూడా వచ్చింది.

గ్రామాల వీధుల్లో స్వల్పభృతికి ఆడటంవల్ల ఆదిలో కూచిపూడివారి యక్షగాన నాటకాలను వీధినాటకాలని పిలిచేవారు. మరిన్నీ, కూచిపూడివారు పగటివేషాలు వేసేవారు. ఒకరిద్దరు పెండ్లిళ్లభోగం, మేజువాణీలకు విదూషక పాత్రధారులయ్యేవారు. మొత్తంమీద కూచిపూడివారి కార్యకలాపాలు తక్కువస్థాయి కలవిగానే ఎంచబడేవి. కాలం గడచినకొద్దీ, ఈ యక్షగాన నాటకాలయందు, పగటివేషాలయం దభిలాష క్షీణించింది. ఒకప్పుడు ప్రదర్శకులు దీనస్థితిలో పడిపోయారు. 1958 వరకు, ఎవరు ఎక్కడకు నాటక మాడటానికి పిలుస్తారా! అని ఎదురుచూచేవారు. 1958 మే నెలలో జరిగిన నా రెండవ కుమార్తె వివాహానికి ఒక నాటక మాడించండని నన్ను అర్థించి, నే నొప్పుకొనగా మిక్కిలి సంతోషించారు. 1960 ఏప్రిల్‌లో నా యిప్పటి పెద్ద కుమారుని వివాహానికే వారి స్థితులు మెరుగైనవి. తర్వాత తర్వాత చాలా అంతస్తు పెరిగి అంతర్జాతీయ ఖ్యాతికూడా కలిగింది. అంతర్జాతీయ ఖ్యాతికి శ్రీ కోరాడ నరసింహారావు బృందం ప్రధాన కారణ మనుకుంటాను. కూచిపూడి ప్రదర్శకుల అంతస్తు పెరగటానికి కారణం శ్రీ బందా కనకలింగేశ్వరరావుగారి గట్టి ప్రయత్నాలే. శ్రీ గొట్టిపాటి

బ్రహ్మయ్యగారి ఆధ్వర్యాన శ్రీ కనకలింగేశ్వరరావుగారి ప్రయత్నాలవల్ల, కూచిపూడిలో వారి ఆదిగురువైన సిద్ధేంద్ర స్వామివారి పీఠం ఆవిర్భవించింది. తిరుపతి దేవస్థానం వారిపుణ్యమా అంటూ, ప్రభుత్వంవారి సహాయ ప్రోత్సాహమా అంటూ కళాక్షేత్రం, దాని అనుబంధమైన పాఠశాల భవనాలతో స్థిర స్థాయికి చేరుకొన్నది. ఇప్పు డీ యక్షగాన భాగవతులు ఎంత ప్రచారంలోకి వచ్చినా, ఎంత ప్రసిద్ధులైనా, క్రొత్త క్రొత్త నాట కాలను రూపొందిస్తున్నా, నా తెలివితక్కువ కాబోలు నా కా పూర్వపు నాటకాలే, పూర్వపు ధోరణులే, పూర్వపు నటన ప్రదర్శకులే మే లనిపిస్తుంది, ముఖ్యంగా స్త్రీ పాత్ర విషయంలో.

నా పిన్నవయస్సులో, నా మాతామహుని గ్రామం అంగ లూరులో నా మేనమామ, వ్రేలువిడిచిన మేనమామలు వగైరా ప్రదర్శించే గయోపాఖ్యానంవంటి నాటకాలను చూచాను. బందరులో చదువుకొనుచున్నప్పుడు శ్రీ డి. వి. సుబ్బారావు, శ్రీ ముంజులూరి కృష్ణారావు, శ్రీ యడవల్లి సూర్యనారాయణ, శ్రీ పారుపల్లి సుబ్బారావు, శ్రీ జగ్గరాజు మొదలగు వా రాడిన వివిధ నాటకాలను. తిరుపతి వెంకటకవుల పాండవోద్యోగం, పాండవవిజయంవంటి నాటకప్రదర్శనాలను చూచాను. గుడి వాడలో పామర్రు వాస్తవ్యులు శ్రీ కోడూరి శ్రీరాములు, శ్రీ సంజీవ రావు మొదలైనవారు పాత్రలుగా ప్రదర్శించిన సారంగధరవంటి నాటకాలను చూచాను. బెజవాడలో మైలవరం జమీందారుగారి పోషణక్రింద ఆడబడిన "సతీసావిత్రి" వంటి నాటకాలలో బందరు నరసింహులు నాయుడుగారి నటనను చూచాను. ఒకటి రెండుసార్లు స్థానంవారి స్త్రీ వేషధారణ చూచాను. ఇంకెక్క డెక్కడో, ఏవేవో చూచాను. తర్వాత మద్రాసులో శ్రీ పి. సూరి బాబు, శ్రీమతి పి. రాజేశ్వరి నటించిన కురుక్షేత్ర సంగ్రామం, శ్రీ మాధవపెద్ది వెంకట్రామయ్య, శ్రీ సూరిబాబు నటించిన బొబ్బిలియుద్ధం చూచాను.

స్త్రీపాత్రధారులలో శ్రీ సంజీవరావు చిత్రాంగి వేష ధారణలో అచ్చం అప్సరసగా, చిద్విలాస భోగంసానిగా కనపడే వాడు. హావభావవిలాసాలతో మిక్కిలి చాతుర్యంగా, నైపుణ్యంగా నటించేవాడు. శ్రీ పారుపల్లి, శ్రీ జగ్గరాజు స్త్రీ పాత్రధారణలు కూడా మిక్కిలి యింపుగా, సొంపుగా, మగవాళ్లని సందేహించటానికి వీలులేనట్లుగా వుండేవి. వారిరువురు నటనా చతురత కలవారే. తర్వాతకాలంలో శ్రీ స్థానం నరసింహా రావు సాటిలేనివారని పేరు పొందినా, ఆ రోజుల్లో శ్రీ సంజీవరావుకే ప్రథమస్థానా న్నివ్వాలి. పురుష వేషధారులలో యముడు, భీముడు వంటి భీకర, కృద్ధ, శౌర్య వేషాలు వేసే బందరు కాపురస్తుడు నరసింహులు నాయుడుగారికి ప్రథమస్థాన మిచ్చితీరాలి. ఇంచు మించుగా అంత చక్కని ఔచిత్య వేషధారణ శ్రీ మాధవపెద్ది వెంకట్రామయ్యగారు బొబ్బిలియుద్ధంలో ధరించిన రంగారావు పాత్ర. పాండవనాటకాలలో భీముని వేషం, సావిత్రి నాటకంలో యముని వేషం శ్రీ నరసింహులు నాయుడుగారి కెట్లు అచ్చుగ్రుద్ది నట్లుండేవో, శ్రీ మాధవపెద్దికి బొబ్బిలియుద్ధంలో రంగారావుపాత్ర, రంగారావే ప్రత్యక్షమైనట్లుగా వుండేది. పాత్రోచితనటన మూర్తీభవించినట్లుండేది. శ్రీ నరసింహులు నాయుడుగారిది గంభీర నటనా కౌశలం. ఠీవి, రాజదర్పం, కార్యభారం ప్రస్ఫు టించేవి శ్రీ మాధవపెద్ది నటనలో. శకుంతలాపరిణయంలో దుష్యంతుడుగా నటించిన శ్రీ యడవల్లి సూర్యనారాయణ, దమయంతీ స్వయంవరంలో స్త్రీ పాత్రగా నటించిన శ్రీ పారుపల్లి లేక శ్రీ జగ్గరాజు వేషధారణలోను, నటనలోను, ఇంచు మించుగా ప్రథమస్థానం వారే. శ్రీకృష్ణరాయబారంలో (పాండవోద్యోగం) శ్రీ ముంజులూరి కృష్ణారావుగారి శ్రీకృష్ణ పాత్ర కూడా ప్రథమస్థాయికే చేరుతుంది. రాజరాజనరేంద్రుడు మొదలైన పాత్రలను ధరించిన శ్రీ కోడూరి శ్రీరాములుగారు పురుష వేషధారులలో రెండవ స్థాయికి వస్తారు.

బందరులో విశిష్ట నటకులు ముగ్గురైనా వుండేవారు. ఒకరు శ్రీ బుర్రా రాఘవాచార్యులుగారు. ఇంకొకరు శ్రీ డి. వి. సుబ్బా

రావుగారు. శ్రీ ముంజులూరి కృష్ణారావుగారు మరొకరు. శ్రీ బుర్రా రాఘవాచారిగారు వేషంలోగాని, నటనలోగాని పెద్ద స్థాయికి చెందినవారుకాదు. కాని, వారి గాత్రం బహువిధవిలసితమైనది. ఆనందభైరవి, పూరీకళ్యాణి వారిసొమ్ము. వారెలుగెత్తి బంగారు జిలుగుకల కంచుకంఠంతో, మేఘగంభీర స్వరంతో పద్యాలు పాడుతూంటే, వర్షాకాలమందు ఉద్ధృతమైన ఏటి ప్రవాహంవలె వారి పద్యపఠనం ప్రేక్షకులను ముంచివేసేది. వారు అర్జున వేషధారిగా ఎలుగెత్తి పద్యాలు చదువుతూంటే, నాట్యశాల కప్పు ఇనుపరేకులు దడదడకొట్టుకొనుచున్నవా అనునట్లుండేది. గంటలకొలది పాడినా వారి కంచు బంగారు మిశ్రమ కంఠం, జీరువారేదికాదు. ఇప్పటివలెగాక, ఆరోజులలో రాగాన్ని బాగా సాగదీసేవారు. ఆ సాగదీయటంలో రాఘవాచార్యులుగారు సిద్ధహస్తులు. అయినా వారి గాత్రమాధుర్యం విన్నవారికి, ఇంకొకసారి వినాలనిపించేది.

శ్రీ డి. వి. సుబ్బారావుగారు నలదమయంతి నాటకంలో (చిత్రనళీయం) మొదట నలుడుగాను, తరువాత బాహుకుడుగాను పాత్రలను ధరించి యావదాంధ్రలో మిక్కిలి ప్రశస్తి నొందినారు. నలుని వేషం సామాన్యంగా వుండేదిగాని, బాహుకుని వేషం మిక్కిలి సముచితంగా, పాత్రకు తగినట్లుగా వుండేది. పాత్రధారణ కన్న, వారి పద్యపఠనాశక్తి, చాతుర్యం, మాధుర్యం మిక్కిలి గొప్పగా చెప్పుకోతగ్గవి. వారివలె పద్యం విడమర్చి సామాన్యుడికి కూడా సుబోధకమగునట్లు చదివే నటుని నే నింతవరకు చూడలేదు. శ్రీ ముంజులూరి కృష్ణారావుగారు, శ్రీ యడవల్లి సూర్యనారాయణగారు విడమర్చి సుస్పష్టంగానే చదివేవారుగాని, సుబ్బారావుగారిదే అందెవేసిన పైచేయి. విడమర్చి చదవటమే కాదు, వారి కంఠధ్వని మిక్కిలి మధురం. పాడినతీరు ఆహ్లాదకరం. వారి పఠన మెంతసేపు విన్నా విసుగనిపించేదికాదు. బాహుకుని వేషంలో వారు చదువుచున్న ఆవేదనాపూరిత పద్యాలు, ఎంత కఠిన మనస్సుకలవారినైనా కలచివేసేవి. ఒకవిధముగా ఆయనను 'నటసమ్రాట్' అనవచ్చును. శ్రీ ముంజులూరి కృష్ణారావు

గారు కూడా శ్రీకృష్ణపాత్రలో చక్కగా విడమర్చి సుబోధకమగు నట్లు తగు అభినయంతో చదివేవారు. ఈవిషయంలో వారికి తప్పక హెచ్చు రెండవస్థానం ఇవ్వవచ్చును. నిజానికి బందరు నాటకకళాపోషణలో ప్రప్రథములు శ్రీ సుబ్బారావు, శ్రీ కృష్ణా రావుగార్లే అనుకొందును. మూడవ స్థానం శ్రీ రాఘవాచారి కివ్వవచ్చునేమో అనిపిస్తున్నది.

ఇక శ్రీ పి. సూరిబాబు, శ్రీమతి పి. రాజేశ్వరిగార్ల విష యంలో—ఇప్పుడు ఎక్కువమంది స్త్రీలు సినిమారంగంలోనే గాక నాటకరంగంలో నటించుచున్నా కన్నాంబ, రాజేశ్వరి వంటి నటీమణులు ఏ కొద్దిమందో ఇదివరలో కూడా స్త్రీపాత్రలు ధరించే వారు. శ్రీమతి కన్నాంబను ఒకప్పుడొక నాటకప్రదర్శనము లో చూచాను. ఆమె నటించినది 'కనకతార' అని గుర్తు. ఆ నాటకంలో ఆమె నటించిన శోకపాత్ర మిక్కిలి యథార్థంగా (రియలిస్టిక్ గా) వుండినది. ఆమె నప్పుడప్పుడు వెండితెరమీద చూచానుగాని, ఆమె నాటకప్రదర్శనము తిరిగి చూడలేదు. శ్రీమతి రాజేశ్వరి నటనను రెండు, మూడు సార్లైనా చూచియుం టాను. ఆమె ఒకప్పుడు చిత్రాంగివేషం వేసినట్లు గుర్తు. చక్కగా నటించగలదు. కొంతవరకు పాడటం, పద్యం చదవ టంలో ఆరితేరినచేయే. కాని, ఆమెను రెండవస్థాయి నటిగా మాత్రమే ఎంచగలను. సూరిబాబు స్థానం కొంత విశిష్టత కలది. ఆయనది కంచుకంఠం. మధురకంఠం కూడా. ఎలుగెత్తి హెచ్చుస్థాయిలో మిక్కిలి హాయిగా, సొంపుగా పాడేవాడు, పద్యం చదివేవాడు. ఆయన చిన్నప్పుడు కొంటెగా హాస్యచేష్టలు చేసేవాడట. కాని ఆయనను నేను వెండితెరమీదను, నాటకశా లలోను, వ్యక్తిగతంగా చూచినప్పుడు ఆ కొంటె వేషాలేమియు కనపడలేదు. వెండితెరమీద కొంత రాణించినా, నారదుని వంటి వేషాలలో కొంత పేరు సంపాదించినా ఆయన పేరుప్రఖ్యా తులు నాటకరంగంలోనే. పాండవనాటకాలలో శ్రీకృష్ణుని పాత్రతోబాటు ఇతర వేషాలు వేసేవాడు. బొబ్బిలియుద్ధంలో రంగారావు, వెంగళరావుల మేనమామ ధర్మారావు పాత్ర వేసే

వాడు. దానిని చక్కగా నిర్వహించేవాడు. నటనాచాతుర్య మంత గొప్ప స్థాయిలోనిది కాదేమో అనుకుంటాను. కాని, పద్యపఠనం మిక్కిలి మనోహరంగా వుండేది. మరిన్ని ఆయన కొన్ని భజనగీతాలు, దైవస్తుతి శ్లోకాలు గ్రామఫోను రికార్డులలో వినియున్నాను. వానిని మరీమరీ వినబుద్ధి పుట్టుతుంది. ఆయన ఇంకను పిన్నవయస్సులోనే దాటిపోవటం శ్రీమతి పి. రాజేశ్వరికే గాక, నాటకకళకు కూడా తప్పక లోటే.

ఇంతటితో ఈ లలితకళల విషయాలు పూర్తిచేస్తున్నాను.

౨౪

# సాహిత్య, సాంస్కృతిక కలాపాలు

నాకు చిన్నప్పటినుండి భాషాభిమాన మెక్కువ. పుస్తకాలు చదవటం, ఎవరైనా పద్యాలు చదువుతూంటే వినటం చిన్న వయస్సునుండి సరదా. నా మేనమామల యూరు అంగలూరులో నా చిన్ననాడే గ్రంథాలయం స్థాపించారు. శ్రీ దుగ్గిరాల వెంకట సుబ్బయ్యవంటివారు సారథులుగా వుండేవారు. ఆ పుస్తక భాండాగారానికి వెళ్లటం, పుస్తకాలను తిరగవేయటం, తరచు చేస్తూండేవాడిని. నా చివరి పినతల్లి శ్రీమతి తులశమ్మగారి మామగారు శ్రీ దుగ్గిరాల పురుషోత్తంగారు సంస్కృతాంధ్రాలలో గొప్ప పండితుడు. ఆయన కాలంలో వ్యాకరణం చెప్పేవారు దొరకలేదట. వ్యాకరణంలో పాండిత్యం సంపాదించలేకపోయానే అని అప్పుడప్పుడు విచారిస్తూండేవారు. వారిని కలసికొని సంభాషించటం ఒక పెద్ద చదువుగా వుండేది. మరిన్నీ, వారి పెద్ద కుమారుడు నా పినతల్లి తులశమ్మగారి భర్త శ్రీ దుగ్గిరాల రాఘవచంద్రయ్యగారు సంస్కృతంలో కొంత విజ్ఞానం, తెలుగులో మంచి పాండిత్యం కలిగినవారు. ఆయన తన చిన్నవయస్సులోనే అష్టావధానం చేసేవారు. చక్కని సరళమైన కవిత్వం చెప్పేశక్తి అలవరచుకొన్నారు. వారి సాహచర్యం నా ఉత్సుకతను రేకెత్తించింది. ఆయన సాహచర్యం కంటె, అంగలూరు వాస్తవ్యుడు శ్రీ కంచర్ల బసవకోటిలింగంగారి సహవాసం నా కెక్కుడు లాభించింది. వారు పురాణాలు, కావ్యాలు, ప్రబంధాలు మొదలైన ప్రాచీన

సాహిత్యం బాగుగా చదివినవారు. ధారాళంగా కవిత్వం చెప్ప గలిగేవారు. అన్నిటిని మించి మిక్కిలి సన్నిహితంగా సాహిత్య సంబంధమైన కబుర్లు చాలా చెప్పేవారు. వారి సాహచర్యం నాకు భాషాభిమానాన్ని, సాహిత్యాభిలాషను మిక్కిలి పెంపొం దించింది. నేను హైస్కూలులో చరిత్ర, తెలుగు అభిమాన అంశాలుగా తీసుకొని, స్కూలులో చెప్పే మామూలు తెలుగు బోధనవల్ల కలిగే విజ్ఞానానికి మించి, ఇతర పుస్తకపఠనంవల్ల భాషాజ్ఞానం పెంపొందించుకొన్నాను. బందరు నోబుల్ హైస్కూ లులో స్కూల్ ఫైనల్ పరీక్షలో నెగ్గిన తర్వాత ఆ కాలేజిలోనే ఇంటర్‌మీడియేట్ కోర్సు చదివాను. ఇంటర్‌మీడియేట్‌లో నా అభిమాన అంశాలు లాజిక్ (తర్కం) తో బాటు సంస్కృతం, తెలుగు. సంస్కృత మబ్బకపోయినా, తెలుగు వృద్ధిపొందింది. అన్నిటిని మించి, ఆ కాలంలో కింకవీంద్ర ఘటాపంచాననులు, శతావధానులు, కవిచక్రవర్తులు తిరుపతి వెంకటేశ్వర కవులలో నొకరైన శ్రీ చెళ్లపిళ్ల వెంకటశాస్త్రిగారు ఆంధ్ర సాహిత్యా కాశంలో ధృవతారగా బందరులో వెలుగుచుండినారు. వారి ఉనికి, వారి శిష్యపరంపర, వారి కావ్యగోష్ఠి, వారి ఉపన్యాసాలు, వారి తర్కవితర్కాలు బందరు వాతావరణాన్ని ఉత్తేజితం చేసి నవి. భోజుని ముఖం చూచినంతనే కవిత్వం ఆవిర్భవించేదని కథ ఉన్నది. అదెంత నిజమోగాని, శ్రీ చెళ్లపిళ్ల వెంకటశాస్త్రిగారి ఉనికి మాత్రమే నావంటి యువకులను మిక్కిలి ప్రోత్సహించింది. నాకు స్కూలుచదువు తప్ప ప్రత్యేకించి గురుశిక్షణ లేదు. అయినా సహజాభిలాష వుండటంవల్ల కాబోలు ఆంధ్రభాషాభిమానమే గాక, సాహిత్యంలో కొంత పరిచయం కలిగింది. గణ, యతి ప్రాసలు నా కలవడకపోయినా 1918 లోనే, అనగా నేను కాలేజి చదువు ఆరంభించకముందే, మా యిష్టదైవం వీరభద్రస్వామి ఖడ్గ మొకటి వ్రాశాను. అది ఛందస్సు నిబంధనలకు తట్టుకోలేదు గాని, కొంత భావసమేతంగా వుంటుంది. ఈపద్యాన్ని నా మిత్రుడు శ్రీ పడాల కోటయ్యనాయుడుగారికి 4, 5 సంవత్సరాల నాడు చూపించగా దానిని సలక్షణంగా దిద్ది వ్రాశారు. నేను చెప్పున దేమనగా, ఛందస్సు నేర్చుకొనకపోయినా, ఇప్పటికిని

ఛందస్సుకు సరిపడినట్లు పద్యాలు వ్రాయలేకపోయినా, నిజానికి పద్యాలు అల్లాలని ఉత్సుకత లేకపోయినా, గద్యరచనలోనైనా కొంత ప్రావీణ్యం కలిగిందనుకొనుచున్నాను.

ఇంటర్మీడియేట్ 2-వ సంవత్సరం పరీక్షకు కూర్చున్న తర్వాత ఇంగ్లండుకు 1920 ఆగస్టులో విద్యాభ్యాసానికి వెళ్లాను. 1927 ఫిబ్రవరి మాసాంతానికిగాని తిరిగి ఇంటికి చేరుకోనలేదు. ఈ మధ్యకాలంలో అనగా ఇంగ్లండులో నే నున్నప్పుడు ఏ తెలుగు పుస్తకం చదువలేదు. అయినా, ఇంగ్లండు వెళ్లివచ్చిన కొలదికాలానికే అనగా 1928 జూన్లోనే, భావప్రాగల్భ్యం వల్ల తలలో జీర్ణించియున్న భాష వెలికి త్రోసుకొనివచ్చి అర్ధాంగి, అర్ధనారీశ్వరుడు మొదలైన వ్యాసాలకు కారకమైంది.

గృహసంబంధమైన యిబ్బందులవల్ల, ఆర్థిక యిబ్బందుల వల్ల మనఃస్థిమితంలేక తిరిగివచ్చిన తర్వాతకూడా గ్రంథపఠన ఇంచుమించుగా లేదనేచెప్పాలి. 1929 ఏప్రిల్లో నేను ఇన్కమ్టాక్స్ డిపార్టుమెంటులో ఉద్యోగినై 1953 జూన్ నెలాఖరుకు ఉద్యోగవిరమణ చేశాను. ఈ 24, 25 సంవత్సరాల కాలంలో నాకు ఉద్యోగం పనులలో మునగానాం, తేలానాం అయింది. అప్పుడప్పుడు ఏదో చదివినా అది అంత చెప్పుకో తగినదికాదు. 1953 నవంబరు మాసంలో నేను పెడనగల్లుకు స్థిరనివాసానికి వచ్చివేశానని పైన చెప్పియేయున్నాను. ఇక్కడ నా వద్దనున్న కొద్దోగొప్పో పుస్తకాలు చదువుకోవటం తప్ప ఈ యూరిలోనున్న పుస్తకభాండాగారాన్ని కూడా వుపయోగించుకోలేదు. ఈ యూరిలో తెలుగు బాగా చదువుకొన్నవారు లేరనే చెప్పాలి. ఈ యూరి హైస్కూలు తెలుగుపండితుల సాహచర్యంకూడా కలగలేదు. 1963 లో నాకు ఆంధ్రప్రదేశ్ సాహిత్యఅకాడమిలో సభ్యత్వం లభించేవరకు కవుల, పండితుల పరిచయం కలుగలేదు.

అయితే, ఈమధ్య రెండు మూడు సన్మాన సభలకు వెళ్లాను. 1959 జనవరి ఆరంభంలో పామర్రు లలితకళాసమితివారు కవిసార్వభౌమ శ్రీ శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రిగారికి, శ్రీ గొట్టి

పాటి బ్రహ్మయ్యగారికి సన్మానం ఏర్పాటు చేసినప్పుడు సన్మాన సభ నేర్పాటుజేసిన కార్యదర్శి నా పినతల్లి కుమారుడు శ్రీ కోగంటి దుర్గామల్లికార్జునరావు నుండి నా కాహ్వానంరాగా, ఆ సభలో కొంచెం మాట్లాడాను. శ్రీ కృష్ణమూర్తిశాస్త్రిగారు రాలేదుగాని, బ్రహ్మయ్యగారు వచ్చారు. శ్రీ తిపిర్నేని వెంకట సుబ్బయ్య వంటి వారు కొన్ని పద్యాలు చదివారు. ఘంటసాల వాస్తవ్యులు, బహుగ్రంథకర్తలు శ్రీ పండిత గోరేపాటి వెంకట సుబ్బయ్యగారు నాకు బందరు నోబుల్ హైస్కూలులో 3, 4 ఫారాలలో సహాధ్యాయి. వారప్పుడప్పుడు మా యింటికి రావటం, నేను వారింటికి వెళ్లటం జరుపుకొనుచున్నాం. వారి ద్వారా వారి మిత్రులు కొందరు పరిచయ మయినారు. 1962 మేలో శ్రీ గోరేపాటితో కలసి శ్రీ ఆచంట జానకిరామ్, శ్రీ సంజీవదేవ్ వచ్చి ఒక రోజు గడపి వెళ్లారు. 1961 లో నేను ఆంధ్రప్రదేశ్ లలితకళా అకాడమి సభ్యుడ నైనప్పుడు సభ్యులుగా వచ్చిన శ్రీ సంజీవదేవ్ గారదివరకే తెలిసివుండినారు. శ్రీ జానకిరామ్‌గారుకూడా అంతకు ముందే హైదరాబాదులో కొంచెం పరిచయమైనారు. ఆ సంవత్సరం నవంబరులో ననుకొందును శ్రీ వేగుంట కనకరామ బ్రహ్మంగారు, శ్రీ సామర్లకోట శ్రీరాంషాగారు శ్రీ గోరేపాటి వెంకట సుబ్బయ్యగారితో కలసివచ్చి, కొన్ని గంటలు గడపి కృష్ణాష్టమికి మొవ్వ, కూచిపూడిలలో జరుగు జయంత్యుత్సవాలకు వెళ్లారు.

1963 నవంబరులో ఆంధ్రప్రదేశ్ లలితకళా అకాడమి ప్రతినిధిగా ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమి జనరల్ కౌన్సిల్‌లో సభ్యుడనైనాను. నా సభ్యత్వం, వ్యక్తిగత సాహిత్య సంపత్తుతో, కవిత్వప్రకర్షతో సభ్యులైన పండితులకు, కవులకు, గ్రంథరచయితలకు చీమకుట్టినట్లయినా అనిపించకపోయినా, నా మట్టుకు నాకు నా అంతస్థు కొంతవరకు పెరిగినట్లే అనిపించింది. సహవాసగుణ దోషాలట్టివికదా! సాహిత్య అకాడమి అధ్యక్షులు శ్రీ బెజవాడ గోపాలరెడ్డిగారు. వారిని 1928 నుండి నే నెరిగి యున్నాను. నా యందు స్నేహభావం చూపే సుప్రసన్నులు

వారు. వారి సమక్షము నాకు కొంత ధైర్యోత్సాహాల నిచ్చింది. సాహిత్య అకాడమి కార్యదర్శి శ్రీ దేవులపల్లి రామానుజరావు గారు కొంత బెట్టు, గుంభన గలవారు మొదట ఎట్లున్నా, నేను వెళ్ళిన కొలది కాలానికి అనగా 1964 జనవరిలో, కార్యదర్శిగా రామానుజరావుగారితో బాటు ఇతరులు కూడా పోటీకి నిలుచుంటు న్నప్పుడు, ఆంధ్రవిశారద శ్రీ తాపీ ధర్మారావుగారు వ్రాసిన సిఫారసు వుత్తరా న్ననుసరించి (శ్రీ) రామానుజరావుగారికే నా ఓటిస్తానని జవాబువ్రాసి, మద్దతిచ్చాను. ఆకారణంవల్ల కాబోలు, తర్వాత రామానుజరావుగారు నాయందు అభిమానంచూపుచూ వచ్చారు. ఇతర సభ్యులు కూడా, కవిసమ్రాట్ శ్రీ విశ్వనాథ సత్యనారాయణగారు, శ్రీ దివాకర్ల వెంకటావధానిగారు, శ్రీ నోరి నరసింహశాస్త్రిగారు, శ్రీ గడియారం వెంకటశేషశాస్త్రిగారు, శ్రీ దాశరథి, శ్రీ రంగాచారి వంటి పెద్దలు నన్నామోదించినట్లే నాకు తోచింది. శ్రీ బిరుదు రామరాజుగారు కొంత ఆప్యాయత చూపేవారు. కాకినాడ వాస్తవ్యులు శ్రీ దంటు భాస్కరరావుగారు నాకు చిరపరిచితులే. నాతోబాటు సభ్యుడుగానున్న శ్రీ సంజీవ దేవ్ గారివిషయం వేరే చెప్పనక్కర లేదు. శ్రీకప్పగంతుల లక్ష్మణ శాస్త్రిగారి వంటివారు, "ఉంటే యేమిలే, మనకు వచ్చిన నష్ట మేమి"టనే భావంతో వుండినారేమో అనిపించింది. శ్రీ బోయి భీమన్నగారు వ్యతిరేకభావం చూపలేదు. శ్రీ పాలగుమ్మి పద్మరాజు గారి కెటూ పట్టలేదు. ఒకప్పుడు శ్రీ యమ్. శేషాచలపతిగారు (వీరు హైకోర్టు జడ్జి పదవిని నిర్వహించినారేమో అని నాకిప్పటికిని సందేహం.) ఒకటి రెండు సమావేశాలలో కనపడ్డారు. వారు ఆదిలో ముభావంగా వుండినా, చర్చల సందర్భంలో వారికి కొంత నాయందు సుముఖత్వం కలిగినట్లు తోచింది. అకాడమి సభ్యులు 60 కి మించిన సంఖ్యగలవారు. వారిలో చాలామందితో కొంత పరిచయ మేర్పడింది. కాని, శ్రీ గోపాలరెడ్డి, శ్రీ రామానుజ రావుగార్ల అభిమాన మటుంచి, ఏ కొలదిమంది మాత్రమే నా ఉనికిని బాగుగా గుర్తించినట్లు తోచింది. పైన చెప్పటం మర్చి పోయాను. సభ్యులలో శ్రీ పి. టి. రెడ్డిగారి సతీమణి శ్రీమతి యశోదారెడ్డిగారు, శ్రీ నాయని సుబ్బారావుగారి కుమార్తె

శ్రీమతి కృష్ణకుమారిగారు, శ్రీమతి ఊటుకూరి లక్ష్మీకాంతమ్మగారు ఉండినారు. శ్రీమతి యశోదారెడ్డిగారితో నాకు కొంత చనువు ఏర్పడింది. పైన వ్రాసినట్లు ఒకటి రెండుసార్లు వారింటికి కూడా వెళ్లియున్నానుకదా! శ్రీమతి కృష్ణకుమారితో ఒకటి రెండుసార్లు తప్ప, అంతగా మాట్లాడినట్లులేదు. శ్రీమతి ఊటుకూరి లక్ష్మీకాంతమ్మగారు పాండిత్యం, కవిత్వం చెప్పగల శక్తి, ప్రతిభ కలవారు. వారు అకాడమి ప్రముఖ సభ్యులలో నొకరు. వారి ఉనికిని ఎవరూ గుర్తించకుండా వుండలేరు. నిజానికి ఎక్కువగా వాదోపవాదాలుచేసేవారిలో వారు ముఖ్యులు. వారితో నాకు కొంత పరిచయ మేర్పడింది. ఒకసారి ఏదో అవసరం వచ్చి నప్పుడు వారిని, శ్రీమతి కృష్ణకుమారిని కూడా టాక్సీలో ఎక్కడికో చేర్చాను. 1971 లో పామర్రు భారతీ సమితివారు వారి రజతోత్సవ సందర్భంగా సన్మానించినవారిలో శ్రీమతి లక్ష్మీకాంతమ్మగా రుండినారు. అప్పుడు తిరిగి వారిని చూడటం, వారితో మాట్లాడటం తటస్థించింది. ప్రముఖ సాహిత్య సారస్వత పరిశోధకుడు, వ్యాఖ్యాత, విశిష్టగ్రంథరచయిత, సంకలనకర్త శ్రీ నిడదవోలు వెంకటరావుగారొక సభ్యులు. శ్రీ గిడుగు సీతాపతిగా రప్పుడు సభ్యులుగా లేరు. అంతకు ముం దుండినారనుకొందును.

శ్రీ వెంకటరావుగారు చాలా క్లిష్ట సమస్యలను లేవనెత్తు చుండేవారు. ఏ కారణానో కొంతమంది పండితులకు వారంటే గిట్టేదికాదు. కాని, ఆ గిట్టని పండితులకంటె శ్రీ వెంకటరావుగారు మిక్కిలి హెచ్చు సమర్థులు. వారికంటె భాషాసేవ కొన్ని రెట్లైనా ఎక్కువచేసినవారు. నా దృక్పథాన్ని బలపరచుటకు వారి సహాయం కోరేవాడను. వారు తప్పకుండా ఇచ్చేవారు. ఉదాహరణకు, శ్రీ సి. పి. బ్రౌన్ గారు తెలుగు—ఇంగ్లీషు నిఘంటువునేగాక, ఇంగ్లీషు—తెలుగు నిఘంటువును కూడా రచించి యుండినారు. మొదటిదానికంటె, రెండవదే ఎక్కువ ఉపయోగకరం. ఇంగ్లీషు కొద్దిగా తెలిసిన తెలుగు పండితులకు మొదటి నిఘంటువు ఏ స్వల్పంగానో ఉపయోగపడినా, ఇంగ్లీషు చదివిన వారికి మాతృభాషలో కలిగిన సందేహాల నివృత్తికి రెండవది మిక్కిలి అవసరం. కాబట్టి, "మీరు మొదటిదాని నింతవరకు

ప్రచురించియుండినారు సరే, ఈ రెండవదానిని త్వరగా ప్రచురించా''లని వాదించాను. దానికి అధ్యక్షులు గోపాలరెడ్డిగారు అటు ఇటు చెప్పలేదుగాని, కార్యదర్శి రామానుజరావుగారు వ్యతిరేక భావం కనపరిచారు. అప్పుడు నేను వెంకటరావుగారివంక చూడగా వారు లేచి "మద్రాసు విశ్వవిద్యాలయంవారు ఇంగ్లీషు—తమిళం నిఘంటువును ప్రచురించియున్నారు. ప్రాతప్రతులు దొరకటం లేదు. దానిని తప్పకుండా ప్రచురించవలసినదే'' అని గట్టిగా చెప్పారు. ఇక దాని పునర్ముద్రణకు కూడా అకాడమీ వా రంగీకరించక తప్పలేదు. ఈసందర్భంలో భాషా సంబంధమైన శాఖకు ముఖ్యాధికారిగా నుండిన (డైరెక్టర్ ఆఫ్ ఓరియంటల్ లాంగ్వేజస్) డాక్టరు కృష్ణారావుగారు ప్రభుత్వం వారి సహాయం కూడా అందుతుందని చెప్పారు.

నేనప్పుడప్పుడు కొన్ని కొన్ని విషయాలను లేవనెత్తేవాడను. సందేహాలను వెలిబుచ్చేవాడను. ఉదాహరణకు, "పోతనభాగవతాన్ని వేరు వేరు ముద్రాపకులు, ప్రచురణకర్తలు ముద్రించియున్నారుకదా, ఏవో కొలది స్వల్పపాఠభేదాల సవరణ కొరకని బోలెడు ఖర్చుపెట్టి తిరిగి అకాడమీవారు ప్రచురించటం కంటె, ఏ అముద్రితగ్రంథాన్నో ముద్రింపిస్తే బాగుండేది. శ్రేష్ఠమైన అముద్రితగ్రంథా లెన్నో వుండగా వానిని విస్మరించి, ఈ పిష్టపేషణ మెందు''కని అడిగాను. ఏవో మారుమూల గ్రంథాలను, ఏసభ్యుడో అభిమానించాడని ప్రచురించటానికి ప్రతిపాదన వచ్చినప్పుడు, "ఇంతకంటె మంచి పుస్తకం లేదా?'' అని వాదించేవాడను. "సుమతీ శతకాన్ని, వేమన శతకాన్ని సంస్కృతించక పోతే ఏమి పుట్టిమునిగిం?''దని ప్రశ్నించేవాడను. "అముద్రిత గ్రంథాలలో శ్రీ బిరుదు రామరాజుగారివద్ద నున్న శ్రీకృష్ణచరిత్ర ఉత్తమమైనదని విన్నాను. దాని నెందుకు ముద్రింపించగూడదు?'' అని అడిగాను. ఇట్టి వ్యాఖ్యానాలు, ప్రశ్నలు సభ్యుల దృష్టిని కొంతవర కాకర్షించినవి. చిరకాల పరిచయంతో శ్రీ గోపాల రెడ్డిగారికి నాయందు గల అభిమానాన్ని పురస్కరించుకొని,

వారితో కొంత బాహాటంగా మాట్లాడేవాడను. ఇది సభ్యులకు కొంత ఆశ్చర్యాన్ని, వింతను కలిగించి యుండవచ్చును.

వీటి కన్నిటి కేమిగాని ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమికి నా నిజమైన సహాయం (కంట్రిబ్యూషన్) ప్రాంతీయ సాహిత్యేతర సారస్వత సంఘాలకు ప్రదేశ సాహిత్య అకాడమిలో ప్రాతినిధ్యం కలిగించటం. "మన సాహిత్య అకాడమి కొందరు పండితులను, కవులను, రచయితలను ప్రోగుచేసుకొని కొన్ని మంతనాలను, వినోదాలను జరుపుకొనటానికి మాత్రమే కాదు. ఈ యకాడమి యావదాంధ్రప్రదేశానికి చెందినది. దీని ప్రభావం నాలుగు ప్రక్కలకు ప్రసారంచేసినప్పుడే దీని నిజమైన ధ్యేయం సార్థక మౌతుంది. ఇప్పుడున్న ప్రాంతీయ సంఘాల ను త్తేజపరచటం, క్రొత్త సంఘాల స్థాపనకు కారకమవటం మన ముఖ్యోద్దేశం కావాలి. ఇక్కడకు వచ్చే ఏ కొలదిమందికి మాత్రమే ఈ అకాడమి సౌలభ్యాలు, ప్రోత్సాహాలు కలగటం చాలదు. ఈ అకాడమి తమదికూడా అని ప్రతి జిల్లా, తాలూకా కేంద్రాలలో సాహిత్యపరులకు తోచాలి. ఆ భావం అమలులోకి రావాలంటే ఆ యా ప్రాంతీయ సంఘాల ప్రతినిధులను మన అకాడమి సభ్యులనుగా తీసికోవాలి" అని గట్టిగా రెండు మూడుసార్లు వాదించాను. అక్కడకు చేరిన సభ్యులలో చాలామంది వ్యక్తిగత హోదాలో వచ్చారు. వారికి భయం ప్రాంతీయ సంఘాలు తమను త్రోసిపుచ్చి ఏ ఎల్లాయి, పుల్లాయినో ఎన్నుకొంటారని. దానికి కారణం కొంత లేకపోలేదు. రాజమండ్రినుండి వచ్చిన సభ్యులొకరి అవకతవక వాదాలు, అడ్డదిడ్డ ఘర్షణలు కొంతవరకైనా ఈ వ్యక్తిగత హోదా సభ్యులకు భయాన్ని కలిగించి వుంటవి. శ్రీ గోపాలరెడ్డిగారు మొదట కొంత విసుగుదలను చూపించినా నేను మొండిపట్టుపట్టి, "ప్రాంతీయ ప్రాతినిధ్యంలేకపోతే మన అకాడమి నిరర్థకమౌతుం" దని నొక్కి చెప్పాను. వారు కొంత ఊత గుడివాడ కవిరాజ సాహిత్య విహారాన్ని నడుపుచున్న డా॥ త్రిపురనేని వెంకటేశ్వరరావుగా రిచ్చారు. గత్యంతరంలేనట్లు చివరకు అధ్యక్షుడుగారు నా ప్రతిపాదన నంగీకరించారు. సమావేశానంతరం శ్రీ గోపాలరెడ్డిగారు నాతో ఏకాంతంగా "మీరు

పట్టుబట్టటాన్ని బట్టి, డా॥ వెంకటేశ్వరరావు (కీ. శే. కవిరాజు త్రిపురనేని రామస్వామి చౌదరిగారి అన్న కుమారుడు) గారి అభిప్రాయం కూడా అట్లుండబట్టి నేను ఒప్పుకున్నాను. నాతో నొక రాజకీయప్రముఖుడు ఇట్టి అవకాశం కలిగించటంవల్ల, చిల్లరమల్లర వాళ్లు ప్రతినిధులుగా వచ్చి అకాడమి గౌరవాన్ని తక్కువచేయటం జరుగుతుంది అనినా, మీ వాదనలలో సమంజస మున్నదని తలంచాను'' అన్నారు. వారేవిధంగా భావించినా, ప్రాంతీయ సంఘాలు అమలులోకి వచ్చాయి. ఇదివర కవకాశంలేని కొందరి కైనా ప్రదేశ్ అకాడమీలలో పాల్గొనటాని కవకాశం కలిగింది.

రవీంద్రభారతి ఆవరణలో లలితకళ, సాహిత్య, సంగీత నాటక అకాడమీలకు ప్రత్యేక భవనం "కళాభవనం" నిర్మించకపూర్వం, సంగీత నాటక అకాడమి విషయం గుర్తులేదు గాని, తతిమ్మా రెండు అకాడమీల సమావేశాలు తిలక్ రోడ్డులోని ఆంధ్రసారస్వత పరిషత్తు భవనం, దాని ఆవరణలో జరిగేవి. కళాభవనం పూర్తయి దానిలో ఆఫీసు పెట్టి కార్య కలాపాలు జరుపుకొన్నా, సాహిత్య అకాడమీ సభలన్నియు ఆ సారస్వత భవన ప్రాంగణంలోనే జరిగేవి. ఏ విశిష్ట వ్యక్తినైనా, ఏ విశిష్ట సభ్యులనైనా సన్మానించటం, గౌరవించటం ఆ భవన ఆవరణలో జరిగిన సభలలోనే. 1967 ఆగస్టులో శ్రీ బెజవాడ గోపాలరెడ్డిగారి షష్ఠిపూర్తి సందర్భముగా పెద్ద సభ జరిగింది. శ్రీ గొట్టిపాటి బ్రహ్మయ్యగా రధ్యక్షత వహించి చక్కగా మాట్లాడారు. చాలామంది వక్తలు శ్రీ రెడ్డిగారి గుణగణాలను పోటీ పడి వర్ణించారు. ఒక సభలో (1966 జనవరి 29) శ్రీమతి గుడిపూడి ఇందుమతీదేవి, శ్రీమతి ముప్పాళ రంగనాయకమ్మ, శ్రీమతి భానుమతి రామకృష్ణ, శ్రీ రమేశచౌదరి, శ్రీ సి. నారాయణ రెడ్డి గార్లకు బహుమతిప్రదానం జరిగింది. ఆ సభలోనే శ్రీ గిడుగు సీతాపతి, శ్రీ తాపీ ధర్మారావు, శ్రీ ఆదిరాజు వీరభద్రరావు గార్లను సన్మానించారు. ఇంకొక సభలో శ్రీ జాషువా, శ్రీ తుమ్మల సీతారామమూర్తి మొదలైనవారిని సత్కరించారు. ఆ సందర్భములో శ్రీ విశ్వనాథ సత్యనారాయణగారు మాట్లాడుచు, "అనాదినుండి వేదాలు, శాస్త్రాలు, ఉపనిషత్తులు,

కావ్యప్రబంధాలు పఠించిన కులంలో పుట్టిన నేను కవిత్వం చెప్పటం గొప్పకాదు. శ్రీ జాషువాగారు మిక్కిలి మధురమైన కవిత్వం చెప్పటం గొప్ప" అన్నారు. ఈమాటలు సత్యనారాయణగారి కులాతిశయమును, వర్ణదురహంకారమును తెల్పునని కొందరు తలంచారుగాని, నేను హర్షించాను. అన్ని విధాల శాస్త్ర సాహిత్య సారస్వత విజ్ఞానాన్ని సంపాదించటానికి పూర్తి అవకాశం, ప్రోత్సాహంగల బ్రాహ్మణకులంలో విశ్వనాథ వారు జన్మించగా, ఎట్టి అవకాశంలేని వెనుకబడినకులంలో, అందునా బీద కుటుంబంలో జన్మించి, ఏ పండితుడునూ చదువు చెప్పుటకు నిరాకరించే కాలంలో అష్టకష్టాలకు, అవమానాలకు లోనయి మొండిధైర్యముతో, పట్టుదలతో భాషావిజ్ఞానాన్ని, కవిత్వాన్ని అభివృద్ధిపరచుకొన్న జాషువాగారే ఎక్కువ ప్రశంసనీయులు. ఇంకొక సభలో ఒక హరిజనుని నుండి (పేరు గుర్తుకు రావటంలేదు) ఆయన రచించిన కావ్యాన్ని అంకితంపొంది, శ్రీ విశ్వనాథ సత్యనారాయణగారు కృతికర్తను పంద్రెండు వందల రూపాయలతోను, నూతన వస్త్రాలతోను సత్కరించారు. నా వంటివారికి కొంత ఆశ్చర్యం కలిగింది. సత్యనారాయణగారు సదాచారా లనేవానినే, ప్రాతపద్ధతులనే దీక్షగా ఆచరించువారు. పైగా, తనంతటి గొప్పకవి లేడనే స్వోత్కర్షకలవారని వాడుక. అంటు, సొంటు జాస్తి. తనకు కావ్యకన్యక నర్పించి తనకు మామమైనవారు అంటరానికులంలోని హరిజనుడు. అందువలన నాకు కొంత ఆశ్చర్యంతోబాటు వింతకూడా కలిగింది. అందువల్ల, సభ ముగియుచుండగా చాలాకాలమునుండి ఎరిగియున్న సత్యనారాయణగారిని సమీపించి, "ఏమండీ! మీరు శుద్ధ శ్రోత్రియులు కదా, అంటరానివారి పిల్ల నెట్లు గ్రహించా"రని చిరునవ్వుతో సూటిగా అడిగాను. దానికి వారు సమాధానం చెప్పక, పనిలో నిమగ్నులై ఉన్నట్లు అటు తిరిగి ఏవో పనులు జరుపుకొన్నారు.

మామూలు సమావేశాలలోని విషయచర్చల నటుంచి, మిక్కిలి ఆహ్లాదకరమైన పైజెప్పిన వాని వంటి సభలే నా కెక్కుడుత్సాహాన్ని, ఆనందాన్ని కలిగిస్తవి. 1968 నవంబరులో నా సభ్యత్వం పరిమితి పూర్తయింది. ఇంకొకదఫా సభ్యుణ్ణి కావాలని

ఉబలాటపడినానుగాని, శ్రీ నరోత్తమరెడ్డి తానే లలితకళా అకాడమి ప్రతినిధిగా ఉంటాననటంతో నా కవకాశం లేకుండా పోయింది. నే నే ప్రాంతీయ సాహిత్య, సారస్వత సంఘంలో అప్పటి కిని, ఇప్పటికిని కూడా సభ్యుడనుకాను. కాబట్టి నేను పట్టుబట్టి ప్రాంతీయ సంఘాలకు ప్రాతినిధ్యం సంపాదించి పెట్టినా, నా కేమీ ఉపయోగపడ లేదు. మన ఆంధ్ర దేశంలోగల ఉస్మానియా, ఆంధ్ర, శ్రీవెంకటేశ్వర విశ్వవిద్యాలయాల ప్రాంతాలనుండి ఎన్నుకొనబడే ప్రతినిధుల స్థానానికి పోటీచేయుటకు నాకు శక్తి లేదు. శ్రీ పైడిపాటి సుబ్బరామశాస్త్రిగారివంటి పండితకవులకు ఓటు యిచ్చుటతోనే నా బాధ్యత తీరిపోవుచున్నది.

అకాడమి సభ్యులలో దిగ్దంతులవంటివారు శ్రీ విశ్వనాథ సత్యనారాయణ, శ్రీ తల్లావఝ్ఝల శివశంకరశాస్త్రి (ఇప్పుడు శివశంకరస్వామివారు), శ్రీ తాపీ ధర్మారావునాయుడు, శ్రీ గడియారం వెంకట శేషశాస్త్రి, శ్రీ దివాకర్ల వెంకటావధాని వంటి వా రుండినారు. ప్రముఖ సాహితీపరులు శ్రీ నిడదవోలు వెంకట రావుగారు, శ్రీ నోరి నరసింహశాస్త్రిగారు, శ్రీ బిరుదు రామరాజు గారు, శ్రీ దేవులపల్లి రామానుజరావుగారు వుండినారు. కవి పుంగవులు శ్రీ సి. నారాయణరెడ్డి, శ్రీ దాశరథి, శ్రీ బోయి భీమన్న వంటి వా రుండినారు. శ్రీమతి పి. యశోదారెడ్డి, శ్రీమతి నాయని కృష్ణకుమారి, శ్రీమతి వూటుకూరి లక్ష్మీ కాంతమ్మ వంటి సాహితీపరు లుండినారు. శ్రీ పాలగుమ్మి పద్మరాజు, శ్రీ దంటు భాస్కరరావు, శ్రీ నరోత్తమరెడ్డి, శ్రీ సంజీవదేవ్, నావంటి వా రుండినారు. మా అందరిలోను పాండిత్యం, కవిత్వం సమ్మేళనంచేసి అమృతధారగా ఉపన్యసించే శక్తిగలవారు ఉస్మానియా విశ్వవిద్యాలయ తెలుగు శాఖాధ్యక్షులు, ఆ విశ్వ విద్యాలయవక్త శ్రీ దివాకర్ల వెంకటావధానిగారు. శ్రీ విశ్వ నాథ సత్యనారాయణగా రొకప్పుడు పద్యపఠనంలో మిక్కిలి శ్రావ్యంగా, విస్పష్టంగా, ఖంగున మ్రోగే కంఠస్వరంతో పద్య గానం చేసేవారు. వృద్ధాప్యంవల్ల ఆ హొయలు, ఆ మాధుర్యం తగ్గింది. ప్రసిద్ధికెక్కిన ఆధునిక కవిపుంగవులలో గేయాలను గానంచేయటంలో శ్రీ దాశరథి కంటె, శ్రీ నారాయణరెడ్డి

గారి ధోరణిలో విస్పష్టత, హావభావాలు మెండు. వాదోప వాదాలలో శ్రీ నిడదవోలు వెంకటరావుగారిది పై చెయ్యి. నేనీ సమావేశాలలో అప్పుడప్పుడు స్థైర్యముతోనే కొంత ప్రస్ఫుటముగానే మాట్లాడేవాడను. కాని, ప్రత్యేక సభలలో వేదిక లెక్కి ఉపన్యసించ లేదు. శ్రీ గోపాలరెడ్డిగారి షష్టిపూర్తి ఉత్సవంలో వారి నభినందించుచు మాట్లాడాలని అనుకొన్నాను గాని అది తటస్థపడ లేదు.

హైదరాబాద్ సభలలో ఉపన్యసించకపోయినా అక్కడక్కడ, అప్పుడప్పుడు మాట్లాడటం తటస్థించింది. 1967 అక్టోబరు 8-వ తారీఖున పామర్రులో జరిగిన శ్రీ కోగంటి దుర్గా మల్లికార్జునరావు షష్టిపూర్తి ఉత్సవానికి అధ్యక్షతవహించి కొద్దో గొప్పో మాట్లాడాను 1969 నవంబరులో శ్రీ వెలగపూడి రామకృష్ణగారి ప్రథమ జయంతికి శ్రీ కొత్త రఘురామయ్యగారి అధ్యక్షతక్రింద విజయవాడలో జరిగిన సంతాప సభలో నిర్మొగమాటంగా, సూటిగా కొన్ని నిమిషా లుపన్యసించాను. 1970 ఆగస్టు 28-వ తారీఖున శ్రీ గొట్టిపాటి బ్రహ్మయ్యగారి అధ్యక్షతన మొవ్వలో జరిగిన క్షేత్రయ్య 307-వ జయంత్యుత్సవం సందర్భంగా ఉద్వేగంతో ప్రసంగించాను. 1970 అక్టోబరు 2-వ తారీఖున ఏలూరులో శ్రీ గొర్రెపాటి వెంకట సుబ్బయ్యగారి "మిత్రులు—నేను" అను గ్రంథా న్నావిష్కరించినప్పుడు ధారాళంగానే మాట్లాడాను. తరువాత 1971 నవంబరులో పామర్రు భారతీ సమితివారి రజతోత్సవ సందర్భంగా రజతోత్సవ సంచికను ఉదయం ఆవిష్కరించినప్పుడు, సాయంత్రం సభలలోను ఉపన్యసించాను. పిల్లల చిత్రకళ, పోటీల సందర్భంగా జరిగిన సభలలో ప్రసంగించానని పైన చెప్పియున్నాను. ఈవిధంగా నాకు బహిరంగ సభలలో ఉపన్యసించే శక్తి కొంత ఉన్నదిగాని, నేను వక్తనుగాను, పెద్ద ఉపన్యాసకుడను కూడా కాను. అయితే చెప్పదల్చుకొన్నది క్లుప్తంగా, సూటిగా, ఎవ రేమనుకుంటారో అన్న సంకోచం లేకుండా చెప్పే స్వభావంకలవాడను.

శ్రీ పండిత గోరెపాటి వెంకట సుబ్బయ్యగారి ప్రోత్సాహం వల్ల మిత్రులు ప్రతి సంక్రాంతికి ఒక్కొక్కచోట సమావేశమై తాము రచించిన పద్యాలు, గేయాలు, గద్యాలు చదవటం, సాహిత్య సాంస్కృతిక చర్చలు జరుపుకోవటం, ఆ కబుర్లు ఈ కబుర్లు చెప్పుకోనటం, అవకాశం అభిలాష వున్నప్పుడు పరిసర ప్రాంతాలలోని విశేషాలను చూడటం, భోగిపండుగనాడుదయం వచ్చి, సంక్రాంతి మధ్యాహ్న భోజనానంతరం వెళ్ళిపోవటం ఏర్పాటుచేసుకొందామని నిర్ణయించుకొని ప్రప్రథమం 1963 సంక్రాంతికి వట్లూరులో (ఏలూరు తాలూకా) శ్రీ వేగుంట కనకరామబ్రహ్మంగారింటివద్ద సమావేశమయ్యారు. 1964 సంక్రాంతికి కీ. శే. బొందలపాటి శివరామకృష్ణగారి శరత్ భవనం (విజయవాడ) లో మిత్రులు సమావేశమయ్యారు. 1965 సంవత్సరం సంక్రాంతి రాబోవుటకు ముందు వెంకట సుబ్బయ్యగారు నాతో "శ్రీ సంజీవదేవ్ వారి మిత్రులకు వ్రాసిన లేఖలను ప్రచురిస్తాను. మీకు వ్రాసిన లేఖలనుకూడా పంపండి. ఆ పుస్తకాన్ని మీ కంకిత మిస్తా" నన్నారు. అంకితం పుచ్చుకోనటానికి మొదట నే నంగీకరించలేదు. కాని, చిరకాల స్నేహితుడు గట్టిగా కోరినప్పుడు బాగుండదని 'సరే' అన్నాను. "సరే, ఈ గ్రంథాన్ని త్వరగా పూర్తిచేస్తాను. సంక్రాంతి సమయంలో మీ కంకిత మిస్తాను. మేము రెండు సంవత్సరాలనుండి సంక్రాంతి సమయంలో కొంతమంది మిత్రులం రెండుచోట్ల సమావేశమయ్యాం. ఈ 1965 సంక్రాంతికి మీ యింట్లో సమావేశం అవుదాం. అప్పు డంకిత మిచ్చేపనికూడా పూర్తిచేద్దాం" అన్నారు. దానికి నే నంగీకరించాను. 13-1-1965 ఉదయం మిత్రులు చేరుకొన్నారు. నా వదిన కుమారులు, ఈ యూరిలోనివారు కొలదిమంది, నా రెండవ కొడుకు సుధాకర్, అతని భార్య భవాని గాక బయటివారు 19 మంది హాజరైనారు. వారు శ్రీ సంజీవదేవ్, శ్రీ వేగుంట కనకరామబ్రహ్మం, శ్రీ గోరెపాటి వెంకట సుబ్బయ్య, శ్రీ కాళోజీ (నారాయణరావు), శ్రీ కాకాని నరసింహారావు, శ్రీ పువ్వాడ శేషగిరిరావు, శ్రీ పల్లా సుబ్బారావు, శ్రీ వడ్లపట్ల రామచంద్రరావు, శ్రీ కె. టి. యల్. నరసింహాచార్యులు, శ్రీ బి. వి.

నరసింహారావు, (శ్రీ) రంధి సోమరాజు, శ్రీ కొమ్మన రాధాకృష్ణా రావు, (శ్రీ) వేగంటి సుబ్బారావు, (శ్రీ) వెలమాటి శ్రీమన్నారాయణ మూర్తి, (శ్రీ) వెలమాటి పద్మనాభం, (శ్రీ)మతి బి. శకుంతలాదేవి, (శ్రీ) గూడవల్లి నరసింహారావు, (శ్రీ) కలిదిండి నారాయణరాజు, (శ్రీ) కలిదిండి సుబ్బరాజు. 13-వ తారీఖున ఉదయం సమావేశంలో శ్రీ సంజీవదేవ్ గారి లేఖల గ్రంథం శ్రీ గొర్రెపాటి వెంకటసుబ్బయ్య గారు అంకితంగా నాకు సమర్పించారు. సంకలనం చేసిన గొర్రెపాటి వారికిని, లేఖలు రచించిన సంజీవదేవ్ గారికిని నూతన వస్త్రాలను బహూకరించి దుశ్శాలువలను కప్పాను. వచ్చినవారిని చందన, పుష్ప తాంబూలాదులతో సత్కరించాను. ఆరోజు, మరునాడు మధ్యాహ్నంవరకు సాహిత్యకలాపాలు జరిగాయి. నేను యథా ప్రకారం మర్యాద, మన్ననలు చేశాను.

ఈసమావేశంలో విశేషమేమనగా, నా వియ్యంకుడు అనగా నా రెండవ కుమార్తె కమలకుమారి మామగారు శ్రీ వెలమాటి శ్రీమన్నారాయణమూర్తిగారు తాను రచించి అచ్చువేయించిన "అభినందనము-సంజీవదేవ్ లేఖలు - కృతి సమర్పణ శుభసమయమున సమర్పితము" అను చిన్న గ్రంథాన్ని నా కివ్వటమేగాక సదస్యు లందరకు పంచిపెట్టారు. ఆ చిన్న పుస్తకంలో శ్రీ సంజీవదేవ్ ను, శ్రీ వెంకట సుబ్బయ్యను, నన్ను గొప్పగా అభినందించారు. విలువగల 4, 5 డైరీలను (1965 సం.) వారి పెద్దబ్బాయి ప్రముఖ పారిశ్రామికవేత్త శ్రీ వి. జి. యస్. వి. ప్రసాద్ గారి నుండి తెచ్చి మాకు బహూకరించారు. ఉత్సాహోద్రేకాలతో, స్తుతివాక్యాలతో అనర్గళంగా ప్రసంగించారు. వారు సాహిత్యప్రియులేగాక, మిక్కిలి ఉత్సాహవంతులు. ఇటువంటి సమావేశాలలో పాల్గొని ఆనందించే వారిలో ప్రప్రథములు.

ఆనాటి విశేషాలను కొన్నింటిని అప్పుడు వ్రాసుకొన్నాను. కవిపాదుషా శ్రీ పువ్వాడ శేషగిరిరావుగారు బందరునుండి వచ్చి తాము రచించియుండిన శ్రీ వెంకటేశ్వర స్తవంలోని పద్యాలలో కొన్నిటిని ఆవేశంతో ఎలుగెత్తి మిక్కిలి శ్రావ్యంగా పాడారు.

గ్రంథకర్త ఇంటివద్ద (పెదసనగల్లు) 1965 సంక్రాంతి సాంస్కృతిక సమావేశం

ఎడమనుండి క్రింద కూర్చున్నవారు :

1. శ్రీ పల్లా సుబ్బారావు, 2. శ్రీ కాకాని నరసింహారావు, 3. శ్రీ వెలమాటి పద్మనాభం
4. శ్రీ కాళోజీ నారాయణరావు, 5. శ్రీ వడ్లపట్ల రామచంద్రయ్యచౌదరి

కుర్చీల్లో కూర్చున్నవారు :

1. శ్రీ కలిదిండి నారాయణరాజు, 2. శ్రీ సంజీవదేవ్, 3. గ్రంథకర్త, 4. శ్రీ గొర్రెపాటి వెంకట సుబ్బయ్య
5. శ్రీ వెలమాటి శ్రీమన్నారాయణమూర్తి, 6. శ్రీమతి కొండలపాటి శకుంతలాదేవి

నిల్చున్నవారు :

1. శ్రీ కొమ్మన రాధాకృష్ణమూర్తి, 2. శ్రీ రంధి సోమరాజు, 3. శ్రీ వేగుంట కనకరామబ్రహ్మం
4. శ్రీ బి. వి. నరసింహారావు, 5. శ్రీ గూడవల్లి నరసింహారావు, 6. శ్రీ దేవినేని సూర్యప్రకాశరావు
7. శ్రీ లింగం శీతారామారావు, 8. లింగం సుధాకర్

చివర నిల్చున్నవారు : 1. శ్రీ కలిదిండి సుబ్బరాజు, 2. శ్రీ వేగుంట సుబ్బారావు

కవిత్వసంపదతో బాటు. వారి భావావేశం సభ్యు లందరిని ఉద్రిక్త పరచింది. శ్రీ కాకాని నరసింహారావుగారు కవితాగానం చేశారు. శ్రీ బి. వి. నరసింహారావుగారు గీతాలు, గేయాలు పాడారు. శ్రీ పల్లా సుబ్బారావుగారు తాము రచించిన మనోరంజక పద్యాలను చదివారు. శ్రీ కాళోజీ తమ గేయాల నుద్ఘాటించారు. శ్రీ వెలమాటి పద్మనాభంగారు తమ ఉపన్యాస పన్నీరును వెదజల్లారు. శ్రీ వడ్లపాటి రామచంద్రయ్యకవిగారు జ్యోతిషంతో మేళవించి రచించిన తమ పద్యాలను చక్కగా చదివి, అర్థాలను వివరించారు. శ్రీ కొమ్మన రాధాకృష్ణారావుగారు శ్రీ సంజీవదేవ్ గారి రసరేఖలను గురించి విపులంగా వ్యాఖ్యానించారు. శ్రీ రంధి సోమరాజుగారు. శ్రీ వేగంటి సుబ్బారావుగారు, శ్రీ కె. టి. యల్. నరసింహాచార్యులు గారు, శ్రీ గూడవల్లి నరసింహారావుగారు మాట్లాడినట్లు గుర్తులేదు. వెంకట సుబ్బయ్యగారు అంకితి మిస్తూ నాల్గుముక్కలు చెప్పి గ్రంథాన్ని నాచేతి కందించారు. నేను సమాధానంగా ఈక్రింది విధంగా చెప్పినట్లున్నది :

"పిల్ల గడుసుది, చమత్కారిణి, హాస్యప్రియ, పైగా వేదాంతిని. మరియు యిద్దరు తండ్రుల బిడ్డ, ఎలా వేగగలనో, ఏ విధముగా సంబాళించు కొనవలెనో అర్థంకావటంలేదు. అయినా, ఈ పడుచు మంజులమైనది, మనోజ్ఞమైనది. కాబట్టి హృదయపూర్వకంగా స్వీకరిస్తున్నాను" అని చెప్పాను. శ్రీ సంజీవదేవ్ గారు అంతకుముందు తా నెందుకు ఆ లేఖలను ఆ విధముగా వ్రాశారో తెలియజేస్తూ, మిత్రులు వ్రాసిన స్వభావాన్నిబట్టి తా నా విధంగా వ్రాయవలసి వచ్చిందని చెప్పారు. తర్వాత జరిగిన సదస్సులో తమ పలువిధ కోణాలను కలిగిన రచనలను చదువుచు "చౌదరిగారు సూటు, బూటుతో నేగాక, హేట్ లేకుండా బైటికి వెళ్లరని, వారు టోపీ చౌదరిగా"రని చమత్కరించారు.

ఆవిధంగా సంతోష సల్లాపాలతో ఆ ఒకటిన్నర రోజు గడచి నాకు ఉత్తేజాన్ని కలిగించింది.

హృదయోల్లాసకరంగా వుండినది. మరిన్ని, వారు రచించిన ఉరుదు గాజెల్సు మృదుమధురంగా చదివారు. ఉరుదుభాష రాని వారికికూడా మిక్కిలి ఉత్సాహాన్ని కలిగించినవి. ఇంకొక రచన శ్రీ పొట్లపల్లి రామారావుగారనే వారు రచించిన "మా గ్రామం". దానిని చక్కని భాషలోనేగాక మంచి భావపూరితంగా రచించారు. తర్వాత శ్రీ ఆర్. వి. చిన్నారావుగారనేవారు చదివిన అజంతాగుహాల దర్శనం మిక్కిలి మనోజ్ఞంగా వుండినది. శ్రీ అనుముల కృష్ణమూర్తిగారు స్తోత్రించిన, గానంచేసిన వారి "సరస్వతీ సాక్షాత్కారం" శరీరాన్ని పులకింపజేసి హృదయాన్ని ఆహ్లాదపూరితం చేసింది. మామూలు పద్ధతిప్రకారం శ్రీ సంజీవ దేవ్, శ్రీమతి కృష్ణాబాయ్, శ్రీ రంధి సోమరాజు వగైరాలు తమ రచనలను చదివి వినిపించారు. శ్రీ వెలమాటి రమేశచంద్ర చౌదరిగారు మాట్లాడారు. శ్రీ వెలమాటి శ్రీమన్నారాయణ మూర్తిగారు తమ మామూలు వాగ్ధారతో ఉత్సాహపూరితంగా ఉపన్యసించారు. నేను సమావేశాన్ని సమీక్షించాను. 14-వ తారీఖున ఉదయమే కాఫీ అయినతర్వాత, సమీప రామప్ప దేవాలయ శోభను పదేపదే వీక్షించి కన్నులకు విందొనర్చుకున్నాం. ఆ రాత్రి 10 గంటలకు వరంగల్లు తిరిగి వెళ్లాం. మర్నాడుదయం (15-వ తారీఖు) టౌను హాలులో చిత్రకళా ప్రదర్శన జరిగింది. దానిని శ్రీ సంజీవదేవ్ ఆవిష్కరించారు. తర్వాత సభ జరిగింది. దానికి నన్నధ్యక్షుని జేశారు. శ్రీ పాములపర్తి సదాశివరావు అనేవారు "శాంతాయన సాహిత్య దర్శనం" అనే ఉపన్యాసం గొప్పగా చేశారు. శ్రీ వేగుంట కనక రామబ్రహ్మంగారు మాట్లాడుచూ, శ్రీ రంధి సోమరాజుగారిని ప్రశంసించారు. నేను నా ముగింపుపన్యాసంలో సదాశివరావు గారిని మెచ్చుకొని, సోమరాజుగారు శ్మశానవాది అనే అభిప్రాయం వెలిబుచ్చాను. ఆ సాయంత్రం కవిసమ్మేళనం జరిగింది. దానికి శ్రీ గొర్రెపాటి వెంకట సుబ్బయ్యగా రధ్యక్షత వహించారు. సభాప్రారంభానికి ముందే నేను బయలుదేరి రైలుస్టేషన్‌కు వెళ్లి విజయవాడ మీదుగా ఇంటికి చేరుకున్నాను.

1963 సంక్రాంతి నుండి ఈ సంవత్సరం వరకు మిత్రబృంద సంక్రాంతి సమావేశాలు జరుగుచునే వున్నవి. 1966 సంక్రాంతి సమావేశం భీమవరం తాలూకా పెదపుల్లేరు గ్రామంలో శ్రీ కలిదిండి నారాయణరాజుగారింట జరిగింది. దీని విశేషాలు, చాలా మంది రావటం, నలుగు రైదుగురు స్త్రీలు అంద చందాలను కలిగించటం, హెచ్. వి. రామగోపాల్ వంటి ప్రఖ్యాత కళాకారులిద్దరు ముగ్గురు పాల్గొనటం, కొంద రుద్యోగులు హాజరవటం వంటివి. శ్రీ రాజుగారి ఆతిథ్యం, మర్యాద మన్ననలు ఆ పెద్ద సమావేశానికి తగినట్లుగా వున్నవి. 1967 సంక్రాంతి సమావేశం వరంగల్లు తాలూకా రామప్పదేవాలయం సమీపానగల రామప్ప చెరువుగట్టుమీద జరిగింది. ఆ సమావేశానికి ఆహ్వానించిన వారు రెడ్డి, రావు, రాజు, కాళోజీ అని చెప్పుకొన్నారు. మొదటి ముగ్గురు అక్కడి ఇంజనీరింగ్ కాలేజిలో అధ్యాపకులు. రెడ్డిగారు చిత్తూరు జిల్లావారు, ఆదినారాయణ రెడ్డిగారు. రావుగారు సత్యనారాయణరావుగారు. వారు వెలమలు. రాజుగారు సత్యనారాయణరాజుగారు, వారు భీమవరం తాలూకావారు. కాళోజీగారు 'కాళోజీ' అని మామూలుగా పిలువబడే సుప్రసిద్ధ ప్రజాకవి కాళోజీ నారాయణరావుగారు, హనుమకొండవారు. మేము 13-వ తారీఖున మధ్యాహ్న భోజనం హనుమకొండలో ముగించుకొని, రామప్పచెరువుకు చేరాం. పెద్ద సరస్సువంటి ఆ గొప్పచెరువు చెట్లతోను, గుట్లతోను నిండియుండిన రమణీయ ప్రదేశం. మిక్కిలి మనోహరంగా వుండినది. అక్కడి పెద్ద రహదారి బంగళాలో ఆ రాత్రి గడిపాము. మరునాడు సాయంత్రం సమావేశం కొంతవరకు సాగింది. శ్రీ సంజీవదేవ్ తమ చిత్రాలను ప్రదర్శించి, వ్యాఖ్యానపూర్వకముగా ఉపన్యసించారు. 14-వ తారీఖు ఉదయం జరిగిన సమావేశం మిక్కిలి రక్తిని కట్టించింది. శ్రీ కాళోజీ అన్న కాళోజీ రామేశ్వరరావుగారు న్యాయవాదిగా వుండినారు. వారు మిక్కిలి సౌమ్యులు, సరసులు, సజ్జనులు. వారు ఉర్దూలో మిక్కిలి చక్కగా కవిత్వం రచించగలరు. సమావేశంలో చదివిన రచనలలో శ్రీ రామేశ్వరరావుగారి 'ఫొటోగ్రాఫర్' అనే రచన మిక్కిలి హాస్యపూరితంగా

1968 సంక్రాంతికి నిడుబ్రోలులో శ్రీ పాములపాటి బుచ్చినాయుడుగారి ఆధ్వర్యాన జరిగిన సమావేశానికి వెళ్లలేక పోయాను. 1969 సంక్రాంతికి ఘంటసాలలో శ్రీ గొర్రెపాటి వెంకట సుబ్బయ్యగారింట్లో జరిగిన సమావేశానికి హాజరైనాను. ఆ సమావేశానికి శ్రీ నార్ల వెంకటేశ్వరరావుగారుకూడ వచ్చారు. అందులోని విశేషం శ్రీ బి. వి. నరసింహారావుగారు ఎక్కువకాలం కొనసాగించినవారి గేయాల గానం. రెండవది, నా వియ్యంకుడు శ్రీ వెలమాటి శ్రీమన్నారాయణగారి అనుజుడు శ్రీ వెలమాటి సూర్యనారాయణమూర్తిగారు ఒక పటం సహాయంతో, అమెరికాలో ఒక గొప్ప కోళ్లఫారాన్ని నడిపిన రైతు గృహ నివాసానుభవాలను తమ, తమతో తీసుకువెళ్లిన వారి భార్యాగారి తర్ఫీదు అనుభవాలను, ఆ ఫారంతీరును, దాని వేర్వేరు భాగాలను ఒక పాయింటర్‌తో చూపుచూ విశదీకరించారు. మూడవ విశేషం, నా వియ్యంకుడు శ్రీమన్నారాయణమూర్తిగారు గంభీరోపన్యాసం వారి మామూలు ధోరణిలో చేయటమే గాక, కొన్ని భగవద్గీత పుస్తకాలను పంచిపెట్టారు. వారు హాజరైన సమావేశాలలో ఏదో ఒకటి బహూకరించాలని అభిలాష కలవారు. ఈ సమావేశం నుండి వరంగల్లు మిత్రులు తిరిగి వెళ్లుచున్నప్పుడు వారిని, మా యింటికి వచ్చి ఒకపూట గడిపి వెళ్లండని కోరాను. నా అభ్యర్థన నంగీకరించి పెదసనగల్లుకు 14 సాయంత్రం వచ్చి, మర్నాడు మధ్యాహ్న భోజనానంతరం వెళ్లిపోయారు. ఈ ప్రాంతాన్నింతవరకు ఎరుగని శ్రీ కాళోజీ రామేశ్వరరావుగారు, అనేకసార్లు వచ్చియుండిన వారి తమ్ముడు శ్రీ కాళోజీ, శ్రీ రామేశ్వరరావుగారివలె ఈప్రాంతాలకు క్రొత్తయైన శ్రీ అనుముల కృష్ణమూర్తి, శ్రీ వెంకటరామనర్సయ్య, శ్రీ వి. కృష్ణారావు, శ్రీ సంజీవదేవ్‌గారు, సంజీవదేవ్‌గారి భార్య శ్రీమతి సులోచనాదేవి, వారి గ్రామస్థుడు శ్రీ అల్లూరి వెంకట్రావు, నా వియ్యంకులు శ్రీ వెలమాటి శ్రీమన్నారాయణ మూర్తిగారు, శ్రీ అల్లూరి సత్యనారాయణరాజు వచ్చారు. వీరిలో ముఖ్యంగా శ్రీ కాళోజీ రామేశ్వరరావుగారు నా ఆతిథ్యానికి దానికి మించి నాభార్య ఆదరణ, మర్యాదలకు సంతుష్టులయినారు.

15-వ తారీఖు ఉదయం శ్రీ అనుముల కృష్ణమూర్తిగారు చక్కగా పద్యాలు చదివారు. వారికి సంస్కృత పాండిత్యంకూడా వున్నది గనుక, వారి కవిత్వం పదగుంభనతో, చక్కని శైలితో, మధురంగా, సులువుగా, జాలువారినట్లు సాఫీగా వుంటుంది. శ్రీ రామేశ్వరరావుగారి సౌజన్యం, మాటల చమత్కృతి, ఆప్యాయత చూపేస్వభావం, మమ్ముల నెంతో ఆకర్షించినవి. వారికి, నాకు సాహిత్య అకాడమివారు కాంప్లిమెంటరీగా ఇచ్చిన మూడు ఉర్దూగ్రంథాలను బహూకరించాను. మర్నాడుదయం వియ్యంకుడు శ్రీమన్నారాయణమూర్తిగారిని నూతన వస్త్రాలతో బహూకరించి కారులో గుడివాడవరకు పంపాను.

1970 సంక్రాంతికి తుమ్మపూడిలో శ్రీ సంజీవదేవ్ గారి ఆతిథ్యానజరిగిన సమావేశానికి, 1971 సంక్రాంతికి హనుమకొండ శ్రీకాళోజీ రామేశ్వరరావుగారింటి వద్ద జరిగిన సమావేశానికి హాజరుకాలేకపోయాను. 1972 సంక్రాంతికి ఘంటసాలపాలెం శ్రీ వేమూరి గోపాలరావు, వారి సతీమణి శ్రీమతి విమలాదేవి గార్లింటివద్ద జరిపిన సమావేశానికి హాజరై దంపతుల మర్యాద, మన్ననలకు, ముఖ్యంగా శ్రీమతి విమలాదేవిగారి ఆప్యాయత, శ్రద్ధలకు ముగ్ధుడనైనాను. శ్రీ గోపాలరావు శ్రీమతి కృష్ణాబాయి గారి సోదరుడు. ఆమె, ఆమె భర్త విశాఖపట్నంలోని ఇంజనీరింగు కాలేజిలో ప్రొఫెసరు శ్రీ వేణుగోపాలరావుగార్ల ప్రోత్సాహ ప్రోద్బలాలీ సమావేశ మిక్కడ జరుగుటకు కారకమట.

ఆ సభకు శ్రీ సంజీవదేవ్ వంటి ప్రముఖులు కొందరు రాలేదు గాని, మొత్తంమీద సభ నిండుగానుండి గోష్ఠులు బాగానే జరిగినవి. తమ పుస్తకాల ప్రచురణకు కొంతసాయం చేసింది పురస్కరించుకొని ఏలూరు వారు శ్రీ పల్లా సుబ్బారావుగారు తమ పుస్తకాల నుండి కొన్ని పద్యాలు చదువుచు, నన్ను కొంత ప్రశంసించారు. నేను మాట్లాడుచూ రెండు విషయాలలో నా అభిప్రాయం గట్టిగా వ్యక్తపరచాను. ఒకటి, "మన మిప్పుడు బంగ్లా మహమ్మదీయులను పొగడుచున్నాం. వారు మన సోదరులకంటె మిన్న అన్నట్లుగా వ్యవహరిస్తున్నాం. మంచిదేగాని, మన మంచి

తసం మితిమీరరగూడదు. భారతదేశం రెండు ముక్కలుగా ఛేదింపబడినప్పుడు, తూర్పు పాకిస్తానీ ముస్లింలు హిందువులను ఎంత హింసించినారో, గొడ్డుమాంసం బలవంతంగా వాళ్లనోళ్లలో క్రుక్కి ఏవిధంగా కులభ్రష్టత్వంచేశారో, ఎంతమందికి బలవంతంగా ఇస్లాంమత మిచ్చారో, ఎందరు హిందూస్త్రీలను అవమానంపాలు చేశారో, గుర్తుంచుకొనటంకూడా అవసర''మని హెచ్చరించాను. ఏదో ప్రస్తావనలో ఆధునికకవిత్వప్రశంస వచ్చి శ్రీశ్రీ అంత గొప్పకవి లేడని ఎవరోఅన్నారు. దానికి సమాధానంగా ''శ్రీ శ్రీ ఆదర్శకవి అని నేననుకోను. మానవతావాదం, ప్రజాభ్యుదయం కోరటం ఉత్తమగుణాలే. కాని ఆయనవాదం పచ్చి కమ్యూనిస్టు వాదం. బీదలను బాగుచేయాలనటంకంటె కొంచెమో, గొప్పో వున్నవాళ్లను నాశనంచేయాలనే అభిప్రాయం వెలిబుచ్చుతాడు. ఏవో గీతాలు వ్రాసినంతమాత్రాన ఆయన గొప్పకవి అని నేనను కోను. ఆయన 'మహాప్రస్థానం' అనే గ్రంథాన్ని కొందరు మెచ్చుకొంటారు, నా కేమాత్రం నచ్చలే''దని తెగగొట్టి చెప్పాను.

1973-వ సంవత్సరం సంక్రాంతి సమావేశం తిరిగి ఘంటసాలలో వెంకటసుబ్బయ్యగారింట్లోనే జరిగింది. ఈ సమావేశానికి శ్రీ సంజీవదేవ్, శ్రీకాళోజీ, శ్రీ చిన్నారావు, శ్రీ బి. వి. నరసింహారావు, శ్రీ గూడవల్లి నరసింహారావు, శ్రీమన్నారాయణమూర్తి వంటి పెద్దలు రాలేదు. అయితే కొన్ని క్రొత్త ముఖాలు కనపడ్డవి. అతిథిసత్కారాలలో ఏ లోటూ జరుగకపోయినా, మొత్తంమీద సమావేశం చప్పచప్పగా వుండినది. నేను రెండోనాడుదయంకి వెళ్లి సమావేశానంతరం శ్రీ వేమూరి వెంకట్రామయ్యగారు అతిథులకందరి కిచ్చిన తేనీటి విందులో పాల్గొని, సాయంత్రానికి తిరిగివచ్చేశాను. ఈసభలో నే నప్పుడే ముద్రింపించిన నా "అభిప్రాయాలు-అనుభవాలు" అను గ్రంథమునుండి కొన్ని వ్యాసాలు చదివి వినిపించాను. కొంతమంది బాగున్నవని అభినందించారు.

అంతకుముందు నేను వెళ్లి యుండిన సమావేశాలకు రాని వా రిద్దరు 1972 ఘంటసాలపాలెంలోని సమావేశానికి, 1973 లోని

ఘంటసాల సమావేశానికి హాజరైనారు. వారు, ఏలూరు న్యాయవాది శ్రీ కానుమిల్లి రామచంద్రరావుగారు, ఏలూరులోని జిల్లా కేంద్ర గ్రంథాలయం కార్యదర్శి శ్రీ వెలగా వెంకటప్పయ్యగారు. శ్రీ వెలమాటి పద్మనాభంగారు వార్ధక్యం చేత, దృష్టి సరిగా లేకపోవటంచేత ఘంటసాల సమావేశానికి హాజరుకాలేదు గాని, వారి తరఫునవోయన్నట్లు వారి కుమారుడు రమేష్‌చంద్ర చౌదరిగారు వచ్చారు. అయితే శ్రీ రమేష్‌చంద్రచౌదరి ఈ సమావేశానికే కాదు, 1967 లో జరిగిన రామప్పచెరువుగట్టు సమావేశానికి కూడా హాజరైనారు. అప్పుడు వారు, నేను కలసి హైదరాబాదులోని వా రింటినుండి బయలుదేరి వరంగల్లుకు వెళ్లాము. ఆ సమావేశంలో వారు చక్కగా మాట్లాడినారు. వారు బాగుగా ఉపన్యసించేవారిలో నొకరని వాడుక.

పైనచెప్పినట్లు నేనప్పుడప్పుడేవేవో సభలలో ఉపన్యసించటం జరుగుచున్నది. కొంత పునశ్చరణమైనా మూడు సభలలో నేను చెప్పింది కొంత విపులీకరిస్తాను. 1967 సెప్టెంబరు 10-వ తారీఖున గుంటూరులో శ్రీ బి. హనుమంతరావుగారింట్లో జరిగిన సాహితీ సదస్సు సమావేశంలో అధ్యక్షతవహించాను. సాహితీ సదస్సును సుప్రసిద్ధ వైద్యనిపుణులు డాక్టరు కె. సదాశివరావుగారు స్థాపించారు. వారు దాని కధ్యక్షులుగా, శ్రీ కొల్లా కృష్ణారావుగారు శక్రటరీగా తమ నిరంతర సహాయ సంపత్తితో దానిని నిర్వహించుచున్నారు. దాని సమావేశం ప్రతినెల ఒక ఆదివారం ఒక సభ్యుని ఇంటిలో నిర్వహిస్తారు. నే నధ్యక్షతవహించిన సమావేశంలో శ్రీ కొండవీటికవి, శ్రీ అత్తోటి రత్నకవి, శ్రీ జమ్ములమడక మాధవరామశర్మ, శ్రీ కొల్లి బసివిరెడ్డి వంటి వారు పాల్గొన్నారు. నేను నా తమ్ముని కుమారుడు డాక్టరు సూర్యనారాయణతో కలసి ఆ సభకు హాజరైనాను. మా సూర్యనారాయణను అధ్యక్షతవహించ మనగా, "పెద్దవాడు మా పెదనాన్న ఉన్నాడు" అని చెప్పాడు. అప్పటికి డా. సదాశివరావుగారే యూరోపు పనిమీద వెళ్లి తిరిగిరాలేదు. శక్రటరి శ్రీ కొల్లా కృష్ణారావుగారు నా కపరిచితులు. సరే, నే నధ్యక్షస్థానాన్ని ఆక్ర

మించాను. శ్రీ అత్తోటి రత్నకవి వంటి వారు పద్యపఠనం చేశారు. కొంద రేవేవో చెప్పారు. శ్రీ కొండవీటికవిగారు వసు చరిత్రను సమీక్షించారు. నా ముగింపు ఉపన్యాసంలో, ప్రసం గించిన విషయాలను కొంత సమీక్షించాను. తిరుపతి వెంకట కవులను గురించి కింకవీంద్రఘటాపంచానను లని నే ననగా, "ఇంత వీరికి తెలుసునా!" అని కొందరు సంభ్రమించినట్లు నాకు తోచింది. నేను ఇంగ్లండు వెళ్లి చదువుకొన్నానని, అందువల్ల ఇంగ్లీషు బాగావచ్చి ఉంటుందనే అనుకున్నారుగాని తెలుగులో నాకు పరిచయములేదని వారి అభిప్రాయం. అప్పటి కింకను నా గ్రంథ మేదియును వెలువడలేదు. ఎవరిని గురించియో కవిరా జంటే, "కవిరాజు బిరుదు పూర్తిగా అన్వయించేది సదా కవిరాజు త్రిపురనేని రామస్వామిచౌదరిగారి"కన్నాను. అది కొంత వింతను కలిగించి యుంటుంది. ఇం కొకవిశేషం, ఎందు కా ప్రస్తావన వచ్చిందో జ్ఞాపకంలేదుగాని, అనంతపూర్ జిల్లా, కదిరి పట్టణం లోని దేవాలయంలో జరిగిన ఒక దుస్సంఘటన ప్రస్తావన వచ్చింది. చాలాకాలంక్రిందట ఒక హిందూ యువతి, ఒక ముస్లిం యువ కుడు గాఢంగా ప్రేమించుకున్నారట. వా రిరువురు దేవాలయ ఉత్స వంలో కలసికొని ఆత్మీయతను కనబరచుకోవటం అక్కడి హిందు వుల గుంపుకు సహింపరానిదై ఆ యువకుని తరిమి పట్టుకొని ఆ ప్రాంగణంలోనే చంపివేశారట. అది సాయంకాలమట, తెల్ల వారేలోపునే ఆ హిందూ యువతి ఆత్మహత్య చేసుకొన్నదట. ఆ యిద్దరిని కలిపి ఏకసమాధిని కట్టారట. ఆ సమాధి నిప్పుడు పవిత్రమైనదిగా హిందూ మహమ్మదీయులు పూజించుచున్నా రట. ఈ విషాదగాథ పూర్తిగా ఆ ప్రస్తావన తెచ్చినవారికి తెలియదు. అందువలన నేను విడమర్చి చెప్పటం కొంత ఉత్సు కతను కలిగించింది.

ఉపన్యాసాలు జరుగుచున్నప్పుడు నే నక్కడక్కడ కొన్ని వ్యాఖ్యలు ( కామెంట్సు ) వదిలాను. శ్రీ కొల్లి బసివిరెడ్డి వంటి వారు సంతోషించారు. నేను తిరిగివచ్చునప్పుడు మావాడు డా. సూర్యనారాయణ, " కామెంట్సు లేకపోతే ఉపన్యాసాలు ఇంకా ప్రొద్దుపోయేవరకు కొనసాగేవి. కొండవీటి కవిగారు తన

వసుచరిత్ర వ్యాఖ్యను పూర్తిగా చదవాలని ఉబలాటపడేవారు" అన్నాడు.

పామర్రు భారతీ సమితివారు తమ రజతోత్సవాన్ని 1971 ఫిబ్రవరి 7-వ తారీఖున గుడివాడలో జరుపుకొన్నారు. ఉత్సవానికి అధ్యక్షత వహించింది సరసకవి శ్రీ కొడాలి ఆంజనేయులుగారు. రజతోత్సవసంచికను ఆవిష్కరించటానికి నన్ను కోరారు. ఆంజనేయులుగారు అధ్యక్షపదవిని, సంచికావిష్కరణను నేను సక్రమంగానే నెరవేర్చాము. ఆంజనేయులుగారు పండితులు, కవులు. వారు చక్కగా ఉపన్యసించారు. రజతోత్సవ సంచిక పూర్తికానందున కొన్ని పేజీలు మాత్రమే ఆవిష్కరణకు యివ్వ బడినవి. ఆవిష్కరణ సులువుకదా! నే నేదో నాలుగు ముక్కలు చెప్పి పని ముగించాను. సాయంత్రంకూడా సభ జరిగింది. శ్రీ కోగంటి రాజబాపయ్యగా రాహ్వాన సంఘాధ్యక్షులు, శ్రీ గొట్టిపాటి బ్రహ్మయ్యగా రధ్యక్షులు. ఆ సభలో భారతీ సమితివారు పండిత కొత్త సత్యనారాయణచౌదరిగారిని, శ్రీ ఊటుకూరి లక్ష్మీకాంతమ్మ గారిని నూతన వస్త్రములను బహూకరించి సన్మానించారు. బ్రహ్మయ్యగా రధ్యక్షపదవిని నిర్వహించటంలో, వారి శాసన మండలి అధ్యక్షతానుభవం వారిని అప్రమత్తులనుచేసి సభను అదుపులోనుంచుటకు, సభాకార్యక్రమాలను గమనించక తమలో తాము ఊసులు చెప్పుకొనేవారిని మందలించుటకు తోడ్పడింది. సన్మానించబడిన శ్రీ సత్యనారాయణచౌదరిగారు, శ్రీమతి లక్ష్మీ కాంతమ్మగారు వారి పేరుప్రతిష్ఠలకు తగువిధంగా వుపన్యసించి, సన్మానించినందులకు తమ కృతజ్ఞత తెల్పారు. డాక్టరు త్రిపురనేని వెంకటేశ్వరరావుగారు చక్కగా, ధారాళంగా, విషయపూరితంగా మాట్లాడారు. ఇక నావిషయం "రససిద్ధాః కవీశ్వరాః", "రసమయం కావ్యమ్", "రవిగాననిచో కవిగాంచునే కదా"— ఇటువంటి ఊతపదాలతో కొన్ని నిమిషాలైనా ధాటీగా, ధారాళంగా ఉపన్యసించాను.

మొవ్వలో జరిగిన ఒక క్షేత్రయ్యజయంత్యుత్సవం శ్రీ గొట్టిపాటి బ్రహ్మయ్యగారి ఆధ్వర్యాన జరిగింది. ఆ సభకు

శ్రీ కాట్రగడ్డ శ్రీనివాసరావుగారు, యమ్. పి., శ్రీమతి విన్నకోట మహాలక్ష్మిగారు, యమ్. ఏ., విజయవాడ సంగీతకళాశాలా ధ్యక్షుడు శ్రీ నూకల చినసత్యనారాయణగారు హాజరైనారు. ఆ సందర్భంలో నేను మాట్లాడుచూ క్షేత్రయ్యను గురించి ఒక విషయం చెప్పాను. " క్షేత్రయ్య కృష్ణభక్తుడని, కృష్ణునియందు గల భక్తిపారవశ్యంచేత శృంగారపదాలను రచించాడని, గానం చేశాడని చెప్పే దృక్పథంతో నే నేకీభవించను. ఆయన సౌందర్య లావణ్య స్త్రీమూర్తిని ఆరాధించాడు. ఆయనపదావళీలు దైవ భక్తిప్రేరకములుగాక, మానవజీవితానందాన్ని పెంపొందించేవి. ఆయన స్త్రీ పురుష సంబంధమైన శృంగారలాలిత్యాన్ని అందరకు అర్థంకాని ఏ శ్లోకములలోనో, పద్యములలోనో చెప్పక, గద్య ములో, అనగా మాటలలో, అందరికి అర్థమగునట్లు చెప్పాడు. ఈ శృంగారపదజాలాన్ని సామాన్యమానవుడు, అనగా ఎక్కువగా చదువుకోని మానవుడు, చివరకు బొత్తిగా చదువులేని మానవుడు కూడా అర్థంచేసుకోగలడు. సామాన్యజీవితం దుర్భరమైనది. చాలామంది కడుపునిండా తినలేని వారున్నారు. చాలామంది గ్రామీణులు ఉదయం నుండి సాయంత్రంవరకు ఏ వ్యవసాయ పనులలోనో మునిగిపోతారు. ఆవిధంగానే పాటకజనంకూడా. ఇట్టివారికి, ఈ సులభగ్రాహ్యమైన పదశృంగారం కొంత అలసటను తీరుస్తుంది. కొంత వినోదాన్ని కలిగిస్తుంది, కొంత ఉత్సుకతను పెంపొందిస్తుంది. ఈరోజులలో సినిమా లున్నవిగాని, ఆరోజులలో సినిమాలవంటివి లేవుకదా! పైగా లైంగిక సంబంధమైన విలాసాలు ప్రతిజీవి ప్రకృతిలోను జీర్ణించియుండును. లైంగికవిషయాలను విని తాత్కాలికముగానైనా ఉద్రేకంచెంది సంతుష్టిని పొందుతారు. అందువల్ల క్షేత్రయ్య చేసిన గొప్పమేలు సామాన్య ప్రజాజీవితంలో కొంత మాధుర్యం కలిగించటం " అని చెప్పాను.

ఇట్లక్కడక్కడ నిర్మొగమాటంగా చెప్పటం ఒక్క సాంస్కృతిక కలాపాలలోనేగాక, ఇతర సందర్భాలలోను జరిగింది. ఒక పశువులప్రదర్శన సందర్భంలో భట్లపెనుమర్రులో శ్రీ చల్ల

పల్లి రాజాగారి అధ్యక్షతక్రింద మాట్లాడుచు, "రైతుకు గొడ్డు ముందు, తరువాత బిడ్డ. అందువలనే గొడ్డు బిడ్డ అంటారు" అని వివిధరకాలుగా చెప్పాను. అప్పుడు హాజరులోనున్న కృష్ణా జిల్లా కలెక్టరు వంక తిరిగి వారి నుద్దేశించి, పశుగ్రాససంబంధమైన పిల్లిపెసరవంటి చేలకు నీటిసరఫరా అవసరాన్ని చెప్పాను. సభికులలో ఒకరైన 'బౌద్ధవాఙ్మయ బ్రహ్మ' అని పేరుగడించుకొన్న శ్రీ దుగ్గిరాల బలరామకృష్ణయ్యగారు నేను గొడ్డుబిడ్డ ధోరణిలో మాట్లాడినప్పుడు సంతసించారు. ఈవిధముగా అప్పుడప్పుడు మాట్లాడటం జరుగుతున్నది.

నే నప్పుడప్పుడు కొద్దో, గొప్పో గ్రంథప్రచురణకు, సాహిత్య సమావేశాలకు, సంస్థలకు ఆర్థికంగా సాయపడటం కలదు. ఇట్టి సాయంలో ఒక దుర్ఘటన చెప్పాలని వున్నది. అడ్డూమిల్లి పూర్ణచంద్రరావు గారనే వా రొకరు, తాను కృష్ణామండల సర్వస్వాన్ని వ్రాస్తున్నానని, దానికి ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమివారి ఆర్థికసహాయం కావాలని, తన మొరను అకాడమి వారు వినిపించుకోవటంలేదని ఆయన నాకు కళాభవనం హైదరాబాద్‌లోని అకాడమి ఆఫీసు ముందు వరండాలో తటస్థపడి చెప్పాడు. ఆయన నా కొకసారి విజయవాడలో పరిచయుడై యుండినందున సాహిత్య అకాడమి కార్యదర్శి శ్రీ రామానుజరావుకు సిఫారసు చేయుటమేగాక, "శ్రీ బెజవాడ గోపాలరెడ్డిగారిని నే నర్థించినట్లు చెప్పండని కోరి, వెంటనే ఆరంభించండి, సాహిత్య అకాడమివారు కూడా కొంత సహాయం చెయ్యకపోరు" అని నా చేతి డబ్బు 500 రూపాయ లిచ్చాను. ఆయనగా రా సందర్భంలో నే నేదో తన దీపం వెలిగించినట్లు జాబులు వ్రాశాడు. సర్వస్వాన్ని ప్రారంభించి, నా కభిమానమని మొదట చిత్రకళ అనే శీర్షిక ముద్రణారంభింపజేశాడు. అయితే, చిత్రకళక్రింద బందరు కలంకారీని గురించి వ్రాశాడు. "అది తప్పు, కలంకారీపని కళకాదు, ముద్రించిన పేజీలను విడిచిపెట్టం" డని చెప్పినందువల్ల కాబోలు విముఖు డగుటయేగాక, పూర్తి వ్యతిరేకభావం వహించి నాతో

ఎట్టి సంబంధంలేకుండా చేసుకొన్నాడు. ఆయన 'ఆంధ్రజ్యోతి' దినపత్రికలో ప్రాంతీయ సమాచారాలకు సబ్ ఎడిటర్ గా వుంటున్నాడు. ఆ అవకాశం చూచుకొని నే నా పత్రికకు పంపిన సమాచారాలను ఆ పత్రికలో వేయటానికి అడ్డువస్తున్నాడేమో అను భావం కలుగుచున్నది. ఒక్కొక్కప్పుడు చేసిన సాయం ఈ విధంగా అడ్డు తిరుగుతుంది

1963 లో శ్రీ కావ్యకంఠ గణపతిమునిగారి అల్లుడు శ్రీ గుంటూరి లక్ష్మీకాంతంగారితో ఉత్తరప్రత్యుత్తరాలు జరిపి శ్రీ మునిగారి 'భారతచరిత్ర పరీక్ష', 'విశ్వమీమాంస', 'నాయన' అనే పుస్తకాలను తెప్పించుకొన్నాను. తర్వాత ఆంధ్రప్రభ సచిత్రవారపత్రికలో "వృషాకపి" అనుపేర ఒక ఉత్తరం ప్రచురింపబడింది. దానిలో, వృషాకపి అనగా కర్ణుడు అని, అతడు కుంతికి శ్రీకృష్ణునివలన జన్మించాడని, రాధయే కుంతి అని చెప్పబడింది. "దానిని వ్రాసినవారి పేరు తెలియపరచం" డని 'ఆంధ్రప్రభ' సంపాదకుడు, మిత్రుడు శ్రీ నీలంరాజు వెంకట శేషయ్యగారికి వ్రాశాను, శ్రీ వెంకట శేషయ్యగారు "కావ్య కంఠ గణపతి మునిగారిపుత్రుడు శ్రీ మహాదేవశాస్త్రిగారు, వారు ఖడ్గపూరులో వుంటున్నా"రని వారి చిరునామా ఇవ్వగా మహాదేవ శాస్త్రిగారికి వ్రాశాను. వారు సముచిత సమాధానం వ్రాశారు. ఖడ్గపూరుకు వెళ్లి వారిని దర్శించా లనుకొన్నాను గాని ఆ వుద్దేశాన్ని అమలులో పెట్టకముందే వారు మరణించినట్లు పేపరులో చూచాను.

నే నెప్పుడో శ్రీ పెండ్యాల వెంకట సుబ్రహ్మణ్యశాస్త్రి గారి 'మహాభారతచరిత్ర' కొని చదివియున్నాను. ఒక నా డుదయం మద్రాసులో శ్రీ ఆరుద్రగారిని కలుసుకొనగా వెంకట సుబ్రహ్మణ్యశాస్త్రిగారి ప్రస్తావన వచ్చింది. ఆరుద్రగారు, "వెంకట సుబ్రహ్మణ్యశాస్త్రిగారు 'రాజసూయ'మనే పుస్తకంకూడా వ్రాశారు. అదిప్పు డెక్కడ దొరుకుతుందో చెప్పలేను. పిఠాపురంలో వారి కొడుకులున్నారు, వారికి వ్రాసి చూడం"డన్నారు. వ్రాశాను గాని, దానికి సమాధానం రాలేదు. రాజసూయం విషయంలో ఆరుద్రగారు చెప్పిన విశేషం ఒక టున్నది. రాజ

సూయు మనగా యజ్ఞఫలానికి, పరిపాలించు రాజు నొకని ఆహు తివ్వాలట. అందువలన, దూషించినాడను నెపంతో శ్రీకృష్ణుడు శిశుపాలుని వధించాడని చెప్పారు. శ్రీ ఆరుద్రగారే, "మంత్రి ప్రగడ వెంకటరత్నం అనేవారు శ్రీరాము డెవరో కాదు, ఈజిప్టును పరిపాలించిన ఫారో రాజులలో అతిముఖ్యుడైన రెండవ రామ్‌సెస్ యే అని వ్రాశారు. దానిలో కొంత సత్యమున్న దేమో" అన్నారు. ఈవిషయ మొకప్పుడు శ్రీ నార్లకు చెప్పి 'ఆ పుస్తకం మీావద్ద వున్నదా" అని అడిగాను. "ఉన్నదిగాని, అది పుక్కిటి పురాణం. మీారు చదవట మనవసరం" అన్నారు. శ్రీ నార్లకు గ్రంథ లుబ్ధత్వం హెచ్చు. ఎవరి వద్దనైనా మంచిగ్రంథ ముంటే దానిని అడిగి తీసుకుంటారు. అక్కడ కక్కడే చదువుతానన్నా తన పుస్తకా న్నివ్వరేమో అని తోచింది.

నే ననేక రకాల పుస్తకాలు కొంటాను. లైఫ్, టైమ్, అమెరికన్, సాటర్‌డే రివ్యూ, కాలియర్సు వంటి అమెరికన్ మాగజీనులను తెప్పిస్తూయుండినాను మొన్న మొన్నటి వరకు. ఈమధ్యనే లైఫ్, టైమ్ మాగజీనులను తెప్పించటం మాని వేశాను. నిజానికి కాలియర్సును ఆపివేశారు. ఈమధనే లైఫ కూడా అంతమొందింది. తిరిగి పునరుద్ధరించారని విన్నాను. ఇప్పుడు కారవాన్, ఇంప్రింటు, రీడర్సు డైజెస్టు, ఇలస్ట్రేటెడ్ వీక్లీ ఆఫ్ ఇండియా, ఫెమినా, భవాన్సజర్నల్, తెలుగువిద్యార్థి, ఆంధ్రప్రదేశ్ వంటి వానిని తెప్పించుకొనుచున్నాను. ఇంగ్లీషు రోజువారి హిందూపత్రిక నే నింగ్లండునుండి వచ్చినప్పటినుండి తెప్పించుకొని చదువుచున్నాను. తెలుగు దినపత్రికలలో ఇది వరలో 'ఆంధ్రపత్రిక', 'ప్రభ'లను, ఇప్పుడు 'ఆంధ్రజ్యోతి'ని తెప్పించుకొనుచున్నాను. మాసపత్రిక భారతి, వారపత్రికలు నెల్లూరు జమీన్ రైతు. వాహిని, పంచాయతీరాజ్యం వగైరా వస్తవి. త్రైమాసిక ఇంగ్లీషు జర్నల్ త్రివేణి వస్తుంది. వార్షిక

సంచికలను ముఖ్యంగా ఆంధ్రపత్రిక యుగాదిసంచికను కొనటం నా కభీష్టము.

ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమిలో సభ్యునిగా నున్నప్పుడు కాంప్లిమెంటరీగా ఇచ్చిన పుస్తకా లెన్నో వున్నవి. తరువాత అకాడమివారు ప్రచురించిన పుస్తకాలను కొంటూనే యున్నాను. తెలుగువిజ్ఞానసర్వస్వం సంపుటాలు, భారతీయ విద్యాసంస్థవారు ప్రచురించిన కొన్ని పుస్తకాలను, భారతీయ విద్యాభవనం ప్రచురించిన కృష్ణావతార్ వంటి పుస్తకాలను, లైఫ్, టైమ్ ఆధ్వర్యంక్రింద ప్రచురించబడు పుస్తకాలను, వరల్డ్ బుక్ సీరీస్, చిత్రకళ, శిల్ప సంబంధమైన పుస్తకాలను చాలా కొనియున్నాను. ఇంగ్లీషు నవలలు మొదలైనవి జాస్తిగానే యున్నవి. పురాణాలు, ప్రబంధాలు, కథలు, కథానికలు, ఇతర తెలుగురచనలు కొన్ని వున్నవి. సామర్లకోటనుండి వెలువడే శ్రీరాంపా, శ్రీమతి శిరీషగారి అభిసారిక మాగజీనులను, తత్సంబంధమైన పుస్తకాలను కొనుచునేయున్నాను. ఈవిధంగా చాలాపుస్తకాలను సేకరించాను. వాని ప్రస్తుత సంఖ్య 2200 లకు మించి యుంటుంద. ఇంకను అక్కడిక్కడకువ్రాసి, వి. పి. ల ద్వారా తెప్పించుకొనటం, నేను మద్రాసుకు, హైదరాబాదుకు వెళ్లినప్పుడు కొనటం జరుగుచున్నది.

౯

# సంచారం

నా సంచారాలు తీర్థయాత్రలుకావు. అయితే తిరుమల పైకి కొన్నిసార్లు వెళ్లింది శ్రీవెంకటేశ్వరస్వామి దర్శనార్థమే. చిదంబరం వెళ్లింది, అక్కడికక్కడకు రెండు మూడుసార్లు వెళ్లింది దైవదర్శనం కోసమే. కాని, ఇతరచోట్లకు దేవదర్శనార్థం కొరకని ప్రయాణించలేదు. నే నెక్కడకో వెళ్లుచున్నప్పుడు దారిలో తిరుత్తణికొండపైని శ్రీసుబ్రహ్మణ్యేశ్వరస్వామిని భక్తితో దర్శించానుగాని, ప్రత్యేకించి ఆ స్వామి సన్నిధికని వెళ్లలేదు. ఆ విధముగానే అరుణాచలం, తంజావూరు, మదురై, సింహాచలం, మంగళగిరి దేవాలయాల దర్శనం ప్రత్యేకప్రయాణాలవల్లగాక, నా యితరప్రయాణాలు, లేక సంచారాలలోనే. మదురై, రామేశ్వరం వెళ్లిందికూడా మీనాక్షిఅమ్మవారి, రామనాథ స్వామివారి దర్శనానికిగాక, ఆదేవాలయాల శిల్పసంపదను చూచుటకే, ఆ ప్రదేశాలను తెలుసుకొనుటకే. నాముఖ్యోద్దేశం హాయిని గొలిపే వాతావరణంలో విశ్రాంతిని తీసుకొని ఆరోగ్యాన్ని అభివృద్ధిపరచుకొనటం, ఆ యా ప్రదేశాల వింతలను చూడటం, అక్కడి చిత్రకళాశాలలను, శిల్పస్థానాలను చూడటం మాత్రమే. నేను 1972 మే నెలలో బేలూరు, హాలెబిడ్, శ్రావణబెలగోలలకు దీర్ఘప్రయాణంచేసింది అక్కడి శిల్ప సంపదను, విశేషాలను చూచి, తెలిసికొని ఆనందించుటకే.

చిదంబరం వెళ్ళింది నటరాజస్వామివారి దర్శనమునకని అయినా, ఆ విస్తృత దేవాలయాన్ని, దాని నిర్మాణ సౌభాగ్యాన్ని, అందలి ప్రతిమలను చూచుటకుకూడా. అరుణాచల దేవాలయాన్ని చూచుటకు వెళ్లినా, కోనార్క్, పూరి దేవాలయాలకు దూర ప్రయాణంచేసి వెళ్లినా, దేవతాదర్శనం కొరకు కాదు. భువనేశ్వర్ లోని లింగరాజు పెద్దదేవాలయం పూజాపునస్కారాలుచేసే ఆవరణలోకి కూడా వెళ్ళలేదు. దాని ప్రక్కనున్న, శిథిలావస్థలో నున్న దేవాలయాలను చూచాను. మైసూర్ లోని చాముండేశ్వరి దేవాలయం కొండమీదకు ఎక్కానుగాని, దేవాలయంలోనికి వెళ్లలేదు. పరిసరప్రాంతాల రామణీయకతను చూచి సంతుష్టి పొందాను. మదరాసు, మైలాపూరులోని కపాలేశ్వర దేవాలయానికి కొన్నిసార్లైనా వెళ్లాను. అక్కడ శివరాత్రినాడు పూజాపునస్కారాలు జరిపాను. అయితే, నేను యాత్ర జేసి అక్కడకు వెళ్ళలేదు. మద్రాసులో కాపుర ముండినందున స్థానిక కపాలేశ్వరుని దర్శించటం జరిగింది. ఆవిధంగానే ఒకటో, రెండో సార్లు మద్రాసు తిరువళిక్కేణిలోని శ్రీ పార్థసారథిస్వామి దేవాలయానికి వెళ్లానుగాని, అక్కడ పూజాపునస్కారాలొనరించినట్లు లేదు. కాని మద్రాసు, మైలాపూర్ లోని శ్రీ సాయిబాబామందిరానికి అప్పుడప్పుడు వెళ్లుచుంటాను. ఆ సంస్థానానికి విరాళాలిచ్చి యున్నాను. ఏదో కొద్దో, గొప్పో సమర్పించు కుంటూనే వున్నాను. నిజానికి ఆ సంస్థాన శాశ్వతసభ్యుణ్ణి కూడా. శ్రీ షిరిడీ సాయిబాబా భక్తులలో నొకడను. వారి స్వరూపపటం నా పడకగదిలోని డ్రెస్సింగ్ బల్లమీద వుంటుంది. వారి ఉథిని ఉదయం, సాయంత్రం తప్పక ధరిస్తాను. మరిన్ని, 1963 లో ఔరంగాబాదునుండి బస్సులో షిరిడీకి ప్రయాణంచేసి స్వామివారి దర్శనంచేసుకొన్నాను. అయితే నేను ఔరంగాబాదుకు వెళ్లింది ముఖ్యంగా అజంతాగుహాలను చూడటానికి. అప్పుడు స్వామివారి దర్శనంకోసం షిరిడీకి ప్రయాణంచేశాను. అయినా, బస్సులో శ్రమించి ప్రయాణంచేయుటం పూర్తిగా

శ్రీ సాయిబాబావారి దర్శనంకొరకే. ఈసందర్భంలో నా యాత్ర తీర్థయాత్రయే, దైవదర్శనార్థమే. మొత్తంమీద చాలావరకు, నా సంచారం పైన చెప్పినట్లు విశ్రాంతి వినోదం కొరకు, వింతలు విశేషాలు చూచుటకొరకు, చిత్ర, శిల్పకళా సౌందర్యనైపుణ్యాలను చూచి ఆనందించుటకొరకు.

విశ్రాంతికొరకు వెళ్లిన చోట్లు : కుర్తాళం, కొడైకెనాల్, బెంగుళూరు, పాండుచెరి, కూనూరు. కుర్తాళానికి మొదట 1963 లోను, రెండవసారి 1966 లోను, మూడవదఫా 1970 లోను వెళ్లాను. మొదటిదఫా జూలై చివరను వెళ్లి ఆగస్టు మధ్యవరకు, రెండవదఫా ఆగస్టు మొదటివారం మధ్యవెళ్లి ఆ నెల నాల్గో వారంవరకు; మూడవదఫా జూలై మూడవ వారారంభంలో వెళ్లి ఆగస్టు రెండోవారం చివరవరకు అక్కడుండినాను. కుర్తాళం విశేషం జలపాతం. కొండపై నుండి నీరు క్రిందకు దొర్లటం, ఆ జలపాతంలో యాత్రీకులు స్నానంచేయటం జరుగుతుంది. సీజను జూలై మధ్యనుండి సెప్టెంబరు మొదటి వారంవరకు. వర్షాకాలం గనుక జలం సమృద్ధిగానే వుంటుంది. పాతంకూడా ఉద్ధృతంగానే వుంటుంది. అక్కడ ఐదు జలపాతా లున్నవి. ఒకటి అందులో అన్నిటికంటె పెద్దది. పైనుండి రెండు, మూడు పాయలుగా నీరు పడుతుంది. ఆ పడేచోట కొండ ఎత్తుకూడా పెద్దదే. అక్కడి క్రిందపడే నీరు ఆరోగ్యానికి ఇతర జలపాతా లన్నిటికంటె మంచి దంటారు. ఆ నీరు చాలా దూరమునుండి ఔషధ మూలికలుగల భాగాలనుండి ప్రవహించునట. అది కుర్తాళం జనపదానికి ఆనుకొని యుంటుంది. నేను మకాంచేసిన దళవాయిహౌస్‌కు మిక్కిలి సమీపం. రెండవది, 'ఫైవ్‌ఫాల్స్' అనే 5 పాయల జలపాతం. అది గ్రామానికి 2½ మైళ్లదూరంలో వుంటుంది. ప్రొద్దుననే లేచి నడచివెళ్లేవారికి, స్నానానంతరం తిరిగి వచ్చే వారికి స్నానంతో కలిగిన ఆరోగ్యంతోబాటు, ఈ నడకవల్ల కలిగే ఆరోగ్య లాభంకూడా కలుగుతుంది. ఒకవిధంగా ఇక్కడి స్నానమే ఎక్కువ అనుకూలంగా, ఉత్సాహకరంగా వుంటుంది. కారణం, పెద్దపాతంలో జనరద్దీ మిక్కిలి హెచ్చు. స్త్రీలకని

ప్రత్యేకించిన పాయగాక, మిగిలిన రెంటిలో ఒకపాయ మిక్కిలి చిన్నది. అందువల్ల త్రొక్కిసలాట మిక్కిలి జాస్తి. గ్రామస్థులే గాక, చుట్టుప్రక్కల గ్రామాలవారు కూడా ఇందులోనే జొరబడతారు. దానికి కారణం లేకపోలేదు. గ్రామానికి ఆనుకొని వుండటం, గ్రామ మధ్యనుండి వెళ్లే రోడ్డుప్రక్కనుండి జలపాతం వరకు రకరకాల దుకాణా లుండటం, పైగా దారిలో దేవాలయ ముండటం, అదిన్నీగాక రోడ్డు కవతల రెండవప్రక్క వసతి గృహాలు, మరికొన్ని తినుబండారాల దుకాణా లుండటం కారణాలై వుంటవి. పంచముఖపాతం దూరంగా నుండటమేగాక, అక్కడ దుకాణాలు లేవనియే చెప్పాలి. దేవాలయంకూడా లేనట్లే, ఏదో చిన్నగుడితప్ప. మూడవది, 'స్మాల్ ఫాల్స్' అనే చిన్న జలపాతం. మిక్కిలి చిన్నది. ఏ కొలదిమంది స్నానానికో అనుకూలమైనది. జలపాతంకూడా మధ్యరకం ఎత్తునుండి. ఈ పాతంలోకూడా 4, 5 సార్లు స్నానంచేశాను. నాల్గవది, 'టైగర్ ఫాల్స్' (పెద్దపులి జలపాతం) అనేది. ఈప్రాంతాన ఒకప్పుడొక పెద్దపులి తిరుగుచుండేదట. ఇక్కడ చాలా తక్కువ ఎత్తైన ప్రదేశంనుండి నీరు క్రిందికి ప్రవహిస్తుంది. నిజానికిది సహజమయిన జలపాతంకాదని నేను అభిప్రాయపడ్డాను. పై ఎత్తుప్రదేశాన్నుండి వచ్చే నీరును ఇక్కడి క్రింది అంతస్థుకు మళ్ళించి ఏర్పరచబడ్డ పాతం లాగున్నది. దీనిని ఏర్పరచినవారు మదురై మీనాక్షీ నూలుమిల్లుల ముఖ్యభాగమందు శ్రీ కె. త్యాగరాజ మొదలియార్‌గారట. వారి విశాలమైన బంగళాల ఆవరణ సరిహద్దునే ఈ జలపాత ముండునది. తన నివాసభవనంనుండి భవన ఆవరణ సరిహద్దుద్వారం ద్వారా మొదలియార్‌గారు ప్రాతఃకాలాననే స్నానంచేసి వెళతారట. ఈప్రాంతం నీరు ఒక పెద్దగుంటవంటి దానిలోకి పడుతుంది. అందువల్ల కొంతమందిమాత్రమే స్నానం చేయగలరు. ఈ స్నానం పెద్ద తృప్తిని కలిగించదు. ఐదవ దానిని 'ప్రాతకుర్తాళం' జలపాతం అంటారు. ఇది యీ వూరికి చాలా దూరంగానే వుంటుంది. ఎవరో కారులో వెళ్లేవారుతప్ప ఇతరులు వెళ్లరు. మరిన్ని, ఎత్తైన కొండలనుండి నీరుపడినా, పాతం పెద్దదిగా వుండదు. అయితే, విస్తృతమైన కొండ ముఖా

న్నంతటనుండి సన్నసన్న ధారలుగా క్రిందికి నీరుపారుతుంది. కొన్ని ధారలు విసురుగలవే. స్నానం అసంతృప్తిగా వుండదు. ఏ విధమైన త్రోక్కిసలాటలు లేక స్వేచ్ఛగా, ఏకాంతంగా అన్నట్లు స్నానం చేయవచ్చును. అక్కడికి రెండుసార్లు మాత్రమే కారులో వెళ్లాను.

మొదటి పెద్దజలపాతంలో గుంపులు గుంపులుగా వచ్చిన వారిలో చాలామంది మహమ్మదీయులు. హిందూజనసామాన్యాని కంటె, మహమ్మదీయులు ఆరోగ్యవిషయంలో ఎక్కువ శ్రద్ధవహిస్తారని తోచింది. హిందువుల కిటువంటి స్నానాలలో దైవభక్తి కూడా మిళితమై వుంటుంది. పుణ్యతీర్థాలసేవ మన హిందువుల కత్యంతప్రియం. ఈ కుర్తాళంజలపాతాలుకూడా వారికి పుణ్యతీర్థాలే. దారిలో కనబడిన చిల్లరమల్లర దేవుళ్లకు మ్రొక్కుచు, అక్కడక్కడి దేవాలయాలలో పూజాపునస్కారాలు చేస్తూ కృతార్థుల మైనామని హిందువులు సంతోషపడగా, ఆరోగ్యం పెంపొందించుకొనుచున్నాం అని ముస్లింలు సంబర పడతారు.

స్నానానికి ముందు తలనిండా, వంటినిండా జోరుగా నువ్వులనూనె పూసుకోవాలి. ఇది బహుశా చన్నీళ్లస్నానంవల్ల కలుగుతుం దనుకొనే జలుబు నివారణకొరకేమో. తలకు, వంటికి దట్టముగా పట్టించుకొన్న నువ్వులనూనె జలపాతస్నానంలో పూర్తిగా కడుక్కొని పోవాలి. అప్పుడుగాని స్నానఫలితం దక్క దంటారు. అయితే నూనె పూర్తిగాపోదు. అక్కడ కుర్తాళం తువాళ్లని రకరకాలవి అమ్ముతారు. ఈ తువాళ్లు పలుచగా మందమైన గట్టినూలుతో నేయబడినవి. వీని ప్రత్యేకత మిగిలిన చమురును తుడిచివేయుటమేగాక, త్వరలో ఏమాత్రపుగాలికైనా ఆరిపోతవి. వాసిని నే నక్కడి ఉపయోగానికేగాక, కొన్ని ఇంటికి తెచ్చుకొని ఉపయోగించుకొనుచున్నాను.

నేను పెద్దజలపాతం సమీపం, దారిలోని దేవాలయంలోకి ఒకటి రెండుసార్లు వెళ్లి, చుట్టూ తిరిగి చూచానుగాని, సహజ ప్రవృత్తిలో స్వామివారి విగ్రహానికి చేతులు జోడించానుగాని

ఏ పూజా జరిపించలేదు. దారిలోనున్న దుకాణాలనుండి వేయించిన జీడిపప్పువంటి తినుబండారాలు కొనుక్కొన్నాను. మరిన్ని, ఆ ఋతువులో మంగుస్తాన్ పేరుగల పండ్లు విరివిగా అమ్మబడుతవి. వానిని పైకొండలనుండి తెస్తారట. అవి గట్టి పైతొక్కతో నుండి లోపల గుజ్జుతో కూడిన తొనలుగల కమలాపండులోని మాదిరి గుండ్రని ముద్ద వుంటుంది. అది సువాసన గలిగి మిక్కిలి రుచిగా ఉంటుంది. అయితే ధర చాలా హెచ్చు. ధనవంతులు తప్ప ఆ పండ్లను తరచు కొనలేరు. అవి ఆరోగ్యానికి చాలా మంచివట. ఈపండ్లే గాక, మిక్కిలి సువాసనగల చంపక పువ్వులు దొరుకుతవి. అవి చక్కని, పచ్చని రంగుతో హృదయాహ్లాదకరమైన సుగంధాన్ని వెదజల్లుతవి. వీనిని నేను తరచు కొనుచుండేవాడను. రెండు మూడుచోట్ల మంచి మురుకులు చేస్తారని వాడుక. వానిని కూడా 2, 3 సార్లైనా కొన్నాను. షోరనూరు చాకులను, కత్తులను, పెనుకత్తులువంటి పెద్దవానిని అమ్మే దుకాణాలు నాలుగైదుండినవి. వానినుండి వంటయింటి కుపయోగించే కత్తులనేగాక, చెట్లకొమ్మలను నరికే పెనుకత్తుల వంటి పెద్దవానిని తెచ్చాను.

నా నివాసం దళవాయిహౌస్ అనే భవనంలో అని పైన చెప్పాను. ఆ యింటియజమాని తాత సైన్యంలో కొన్ని అశ్వాలకు దళాధిపతిగా వుండినారట. నేను వెళ్లినకాలంలో రామలింగం అనేవారు దానిని నిర్వహించేవారు. వారి తండ్రిగారి కిద్దరు భార్యలట. మొదటిభార్య సంతానానికి, రెండవ భార్య సంతానం రామలింగం సోదరులకు, ఆ స్త్రివిషయంలో తగాదావచ్చి వ్యవహారం కోర్టు కెక్కిందట. ఈ దళవాయి హౌస్ కూడా కోర్టువారు నియమించిన రిసీవర్ ఆధిపత్యంక్రింద వుండినదట. ప్రతి జలపాతం సీజనుకు దీని ఉపయోగానికి వేలం పెడతారట. హెచ్చుమొత్తాన్నియిచ్చి రామలింగంగారి సోదరులో, లేక ప్రత్యేకించి రామలింగంగారో దీనిని పాడి నిర్వహిస్తూండినారు. వీరు మొదలియార్ కులస్థులు. శ్రీ రామలింగంతో 1963 లో కంటె 1966, 1970 సంవత్సరములలో

కొంత సన్నిహితత్వం ఏర్పడింది. అక్కడ వట్టి నివాసమే కాదు, ఉపాహారం, భోజనం అమర్చేవారు. ప్రాతఃకాలాననే కాఫీని గాని, పాలనుగాని కావలసినవారి కిచ్చేవారు. ప్రొద్దున స్నానమై తిరిగివచ్చిన తర్వాత 8 గంటలనుండి ఇడ్లీ, ఉప్మా, పొంగల్ వంటి వానిని దండిగా వడ్డించేవారు. పదార్థాలకు పరిమితి లేదు. కావలసినవారు కావలసినంత తినవచ్చును. తాజా కొబ్బరి కాయలతో చేసిన పచ్చడియేగాక, కారంపొడిని యిచ్చేవారు. మొదటిదఫా 1963 లో ఇచ్చిన కొబ్బరిపచ్చడిరుచివంటి రుచిని నే నింతవరకు నా స్వగృహంలోకూడా పొందలేదు. 1966, 1970 సంవత్సరములలో కొంత మార్పువచ్చినట్లు కనపడింది. కారంపొడిలో నువ్వులనూనెను వేసేవారు. అది మిక్కిలి పరిశుద్ధమైన నూనె. మంచి నువ్వులతో స్వయంగా గానుగాడించు నట్లున్నది. ఆ కారంపొడికి, ఆ నూనెకు అతికినట్లు సరిపోయేది. మధ్యాహ్నభోజనంకూడా మిక్కిలి సమృద్ధిగా, సంతృప్తికరంగా వుండేది వరి అన్నం, సన్నబియ్యంతో. ఉప్పుడుబియ్యంఅన్నం కావలసినవారి కిచ్చేవారు. ఒకవేళ చపాతీలు కావాలన్నవారికి చపాతీలుకూడా యిచ్చేవారు. ఒకటి రెండు యిగురు కూరలు, కూటు, సాంబారు, రసం, చేతిపచ్చడి, అప్పడాలు వగైరా యిచ్చేవారు. పెరుగు, ఏదో ఆవకాయపచ్చడి వుండేవి మధ్యాహ్నం ఫలహారం స్వల్పంగా వుండేది. ఒక తీపి, ఒక కారం. రాత్రి భోజనంలో కొందరు వరి అన్నం, కొందరు చపాతీలు లేక పూరీలు, కొందరు దోసెలు తినేవారు. అన్నంతినేవారితోబాటు ఇతరులకు కూడా కూరలు వగైరా యివ్వబడేవి. దోసెలు అచ్చమైన వరి పిండితో పెద్దవిగా చేయబడేవి. మసాలాకారంతోగాని, పచ్చడితో గాని తినటానికి యోగ్యంగా వుండేవి. కొన్ని దోసెలు, పూరీలు లేక చపాతీలు తిన్నవారుకూడా అన్నం తినవచ్చును. పెరుగు, మజ్జిగ వంటివి కూడా వాడవచ్చును. పండుకొనబోయేముందు రాత్రి తొమ్మిదిగంటలు దాటిన తర్వాత ఒక గ్లాసు పాలిచ్చేవారు. ఈవిధంగా ఆహారం సమృద్ధిగా లభించేది.

వసతివిషయంలో సింగిల్ (ఏకపడక) గదిలో తప్ప కుండా రెండు మంచా లుండేవి. ఇద్దరు అతిథు లుండేవారు.

2 పడకల గదులలో ముగ్గురు తక్కువగాకుండా వుండేవారు, ఒత్తిడికలిగినప్పుడు నాలుగు మంచాలు కూడా అమర్చబడేవి. గదు లంత సుఖప్రదమైనవికావుగాని, అక్కడి భోజనం, సమీప పెద్ద జలపాతం, ఇంచుమించుగా ఊరుమధ్య, పెద్ద రస్తా మీద రకరకాల దుకాణాల సమీపాన వుండటంవలన దళవాయి హౌస్ ప్రాముఖ్యం పొందింది. 1963 లో కంటె, 1966 లోను, తరువాత 1970 లో వెళ్లినప్పుడు కొన్ని క్రొత్త భోజనవసతి గృహాలు, దళవాయిహౌస్‌వున్న పెద్దరోడ్డుమీదనే ఆరంభింప బడినవిగాని, బిల్డింగ్ ప్రాతదైనా మిక్కిలి దృఢంగా, గొప్పగా కనపడే దళవాయిహౌస్ తర్వాతనే తతిమ్మావి అనుకోవాలి. దళవాయిహౌస్ వున్న పెద్దరోడ్డు ప్రాంతంలో, లోపలగా కొన్ని హోటళ్లు, కొన్ని వసతిగృహా లున్నవిగాని, వానిలో నా వంటి వా రుండలేరు. అవి వీధి రోడ్ల మీదవున్నా, అక్కడి పరిసరాలు అనుకూలంగా తోచలేదు. ఒకదానిమీద ఒకటున్నట్లు క్రిక్కిరిసివున్న వసతులు. దుర్గంధంకూడా టటుంచి ఒకటి రెండు హోటళ్లలో మాంసాదు లిస్తారట. మాంసాహారప్రియుడనైనా, ఆ ప్రక్కకు తొంగిచూడ లేదు.

అక్కడ 1963 పూర్వంనుండి ప్రభుత్వంవారు నిర్మించిన అతిథిగృహ మున్నది. అది విశాలమైనప్రాంగణంకలిగి, రక రకాల పూలగుల్మాలతో, చెట్లతో నిండియున్నది. అయినా, మూడు గదులు మాత్రమే వున్నవి. పైగా ప్రభుత్వోద్యోగులు ఆ మూడు గదులను ఆక్రమించుకొంటారు. బయటివారి కవ కాశం సామాన్యంగా వుండదు. పైగా, అక్కడ మూడు రోజుల కంటె ఎక్కువకాల ముండకూడదట.

గవర్నమెంటు అతిథిగృహానికి సమీపంలో ఒక పెద్ద మైదాన మున్నది. దానిలో చాలాభాగం మిక్కిలి తక్కువ ఎత్తు గల చిన్నకొండవంటిది. ఆ కొండ చప్టామీద సాయంకాలం జనులు విహారార్థం వెళ్లి కూర్చుండో, నిలుచుండో కబుర్లు చెప్పు కుంటారు. దాని ముందుభాగంలో చిన్న ఉద్యానవనం, చిన్నపిల్ల లాడుకొనుచోటు వున్నవి. ఈ ఉద్యానవనం, ఆ కొండగుట్ట ఇంచు మించు ఏకంగానే వుంటవి. శనగలు, బటానీలు, వేరుశనగ

పప్పు మొదలైనవి అమ్ముకొనేవారు, అటువంటి యితరవస్తువుల నమ్ముకొనేవారు ఒకచోట కూర్చుండో, లేక అటూ ఇటూ తిరుగుచునో, తమ సరుకులను అమ్ముకొంటూరు. అతిథిగృహానికి, ఈ ఉద్యానకొండగుట్టకు మధ్య రహదారిరోడ్డున్నది. ఈ రోడ్డుకు రెండవప్రక్క చిన్న జింకలు, దుప్పులు, కుందేళ్లు, పావురాలు మొదలైన చిన్న జంతు, పక్షి ప్రదర్శనశాలున్నది. ఇది అంతగా చెప్పుకోవలసినదికాదు. అక్కడొక క్లబ్బుకూడా వున్నది. 1970 లో శ్రీ రామలింగం చెప్పటంవల్ల క్లబ్బు కార్యదర్శి వచ్చి, "మర్నాడు ఏదో సమావేశం జరుపబోవుచున్నాం, అందులో మీఇంగ్లండు అనుభవాలను గురించి చెప్పా"లన్నారు. నా కప్పు డెదురుదెబ్బతగిలి కుడిబొటనవ్రేలిగోరు లేచి వున్నది. సమీపాన వున్న ఒంకాశికి వెళ్లి శంబుగన్ రామన్ అనే డాక్టరు గారికి చూపగా ఆయన గోరును పూర్తిగా తీసివేసి కట్టుకట్టాడు ఆ ఉదయమే. అది చూపి "నేను రాలే"నని చెప్పాను. అక్కడొక చిన్న సినిమాహాలున్నది. దాని నొకసారి బైటనుండి చూచాను.

పరిసరప్రాంతాలు షికారువెళ్లుటకు అనువైనవి. మధ్యాహ్నం టిఫిన్ అయినతర్వాత అప్పుడప్పుడు షికారుకు వెళ్లుచుండేవాడను.

1966 లో నే నక్కడకు వెళ్లినప్పుడు బలహీనముగానుండి నందున బి1, బి12 ఇంజెక్షన్లు, దళవాయిహౌస్ మీదుగా అనతిదూరంలో పంచముఖప్రాంతానికి పోయే దారిలో నున్న మునిసిపల్ డాక్టరుచేత ఇంజెక్షన్ చేయించుకొన్నాను. నేను తీసికొనివెళ్లిన ఇంజెక్షన్లు అయిపోగా, 2, 3 తెమ్మని అతని కాంపౌండర్‌కు డబ్బిచ్చాను. తెచ్చినవానిలో ఒక ఇంజెక్షన్ పగిలిపోయిందో లేక తేనేలేదో చాలా నీరసమైన ద్రవమిచ్చాడు. ఇంజెక్షన్ ద్రవం చిక్కనైన గులాబీరంగు కలది. నా కిచ్చింది పల్చని ఎర్రజీరకలది మాత్రమే. "ఇట్లున్నదే" మని అడిగితే, "మంచిమందే" నని దబాయించాడు. పోనీలే, అని వూరకు కొన్నాను.

విశ్రాంతికనో, ఆటపాటలకనో ప్రత్యేకింపబడిన రెండు గదులలో డబ్బుతో జోరుగా చీట్లపేకాట కొందరు ఆడుచుండే వారు. ఆట పణం మిక్కిలి హెచ్చుగా వుండేది. పాయింటుకు రూపాయనుండి 5 రూపాయలవరకు వుండేది. ప్రత్యేకించి ఈ ఆట కొరకే వచ్చినారేమో అన్నట్లుగా, కొందరెప్పుడూ ఆడుచుండే వారు. ఫలానవారు కొన్ని వేలు గెల్చుకున్నారని, ఇంకొకరు వేలు పోగొట్టుకొన్నారని వింటూండేవాడను. ఆ సమీపానకే నేను పోలేదు. బెజవాడనుండి ముగ్గురు, నలుగురు బృందం 1966 లో వచ్చియుండినారు. ఆ గుంపులో నొకరు నా బంధువు. ఆయనకూడా చీట్లాటలో నిమగ్నులైనందున, నాతో మాట్లాడుట కైనా ఆయన కవకాశం చిక్కలేదు. నాకు దగ్గరగా పరిచితు లైన మద్రాసు పెద్దమని షొకరు ఎప్పుడు స్నానంచేసేవారో కాని, వారికికూడా చీట్లాటపిచ్చే యెక్కువ. చీట్లుఆడుకొనేవారి కే మజాకలిగిందోగాని, ఎట్టి వినోదాలు ఆ భవనంలో జరుగలేదు, నేను చూచి సంతోషించలేదు.

1963 లో తిరుచునాపల్లి నుండి వచ్చిన వా రొకరు, సేలం నుండి వచ్చిన వా రిద్దరు ఎక్కువ పరిచయమైనారు. తిరుచునా పల్లినుండి వచ్చినవారు అరవ బ్రాహ్మణులు, ప్రసిద్ధ న్యాయవాది, శ్రీ సీతామహాలక్ష్మి స్త్రీలకళాశాలను స్థాపించి, స్త్రీల విద్యావ్యాప్తికి గొప్పగా తోడ్పడినారని ప్రసిద్ధికెక్కినవారు, దివాన్ బహదర్ బిరుదాన్ని బ్రిటిష్ ప్రభుత్వంచే బహూకరింప బడినవారు శ్రీ యన్. రామస్వామిఅయ్యర్ గారు. వారు సరస సంభాషణా చతురులు. అతి సామాన్యమైన వస్త్రధారణతో, అప్పుడప్పుడు చొక్కా లేకుండా గూడకట్టుతోనుండి సామాన్య బ్రాహ్మణునివలె వుండేవారు. సౌహార్ద్రం, స్నేహభావం కనపరచేవారు. వాదపటుత్వాన్నిబట్టి, మాటల ధోరణిని బట్టి బాగాచదువుకొన్నవారని, ప్రతిభగలవారని తోచినా, కొన్నిరోజులకుగాని ఆయన న్యాయవాదని నాకు తెలియలేదు. నే నక్కడకు వెళ్లుటకు ముందు రెండు, మూడు వారాలనుండి యున్నారు. నేను ఆ ప్రదేశాన్ని విడిచిపెట్టేముందు కొన్ని రోజులకు పూర్వం వెళ్లిపోయారు. వారు వెళ్లేముందుగాని

వారి సీతామహాలక్ష్మి స్త్రీలకళాశాలను గురించి, వారి దివాన్ బహాదర్ బిరుదాన్ని గురించి తెలియలేదు. ఆయనను సాగనంపుటకు ఆ సాయంత్రం తెంకాశి రైలు స్టేషనుకు నలుగురైదుగురు వస్తామని ఆయనతో చెప్పారు. నేను వెళ్లవలెనని అనుకోలేదు. కాని, శ్రీ అయ్యారుగారు "మీరుకూడా రండి" అన్నారు. వారిది ఆవిధంగా కూడగట్టుకొనే ధోరణి. వారు సూటు, బూటు, తలపాగా, వెండిపొన్నుకర్రతో మిక్కిలి ఠీవిగా తన నిజస్వరూపాన్ని వెలువరించుచున్నారో అన్నట్లు బయలుదేరారు. స్టేషనులో రైలు వచ్చేవరకు ఏవేవో కబుర్లు చెప్పుకొన్నాం. రైలు రావటంతోనే 'వెళ్లివస్తా' నని చెప్పి, చప్పున తన మొదటితరగతి కంపార్టుమెంటులో ఎక్కారు, ఇంకను రైలు బయలుదేరటానికి కొన్ని నిముషా లుండగనే. తిరిగి వారు ముఖం బైట పెట్టలేదు. నేను కొన్ని నిమిషాలాగి, కుర్తాళంకు వెళ్లిపోయాను. సేలంవా రిద్దరిలో ఒకరు అర్ధనారి అనేవారు, అరవ కోమటి. ఆయన తన సొంతకారులో వచ్చాడు. అతని యువకడ్రైవరు ఆ ప్రాంతానికి చెందిన కమ్మకుర్రవాడు. ఆయన డిగ్రీవరకు చదువుకోలేదుగాని, ఇంగ్లీషులో ధారాళంగా మాట్లాడేవారు. సేలంలో చాలామంది తెలుగువా ళ్లున్నారు. అందువల్ల ఆయనకు కొంత తెలుగుకూడా వచ్చును. ఆయన బస్సులువంటి ఆస్తులతో భాగ్యవంతుడు. ఆయన భార్య బి. ఎ. డిగ్రీని పొందిన విద్యావతిఅట. ఏదో సందర్భంలో ఆమె వ్రాసిన ఉత్తరంలోని కొన్ని భాగాలను చదివి వినిపించాడు. భార్య విద్యావతి అయినందుకు, తనతో అన్యోన్యముగా వుండుచుండినందులకు ఆయనకు గర్వకారణమైనది. ఆయన మంచివాడు. సహనం, సౌజన్యం, స్నేహశీలత కలవాడు. డబ్బుకూడా కొంత ఖర్చుపెట్టే స్వభావం కలవాడు. ఆయన తన కారులో పంచముఖ జలపాతం, ప్రాతకుర్తాళం జలపాతం వంటి వానికేగాక, కొలది మైళ్లలోనున్న దేవాలయానికి వెళ్లుచూ, నన్నుకూడా తీసుకొని వెళ్లాడు. ఎప్పుడైనా తిరిగి కలసికొందా మనుకొంటానుగాని, ఇంతవరకు పడలేదు. రెండవ సేలంవారు కూడా వైశ్యులే.

వారు తెలుగువారు. ఆర్యవైశ్యులమని చెప్పుకొనే తెలుగు కోమట్లలోని వారు. ఆయనగారి పేరు రాధాకృష్ణశెట్టి. ఆయన పెద్దమనిషి తరహాతో చాలా మర్యాదగా, అనునయంగా వర్తించే వాడు. సాధారణంగా ఇటువంటిచోట్లలోనో, ప్రయాణాల లోనో తటస్థపడినవారు, ఎవరో కొలదిమంది పెడసరబుద్ధులు కలవారుతప్ప స్నేహంగానే ప్రవర్తిస్తారు. కొన్నిరోజులు కలసి వుండటంచేత ఈ పరిచయం కొంత వర్థిల్లుతుంది. కాని ప్రేల్లాది స్నేహంగా మారదు.

1966-వ సంవత్సరములో నా గదిలో భాగస్వామి విల్లుపురం న్యాయవాది శ్రీ యస్. వీరరాఘవన్ గారు. వారు సరసులు, స్నేహశీలురు. వారు బ్రాహ్మణులైనా, సదాచారాలను పాటించేవారైనా శుభ్రతవిషయంలో అంత జాగ్రత్త పాటించే వారుకాదు. తాంబూలచరణం చేస్తూ తమలపాకుల ఈనెలు, తొడిమలు గదిలోనే పడవేసేవారు. కాగితంముక్కలు వంటివి వారిపైపున పడవేయగా గాలికి చెల్లాచెదురై నాప్రక్కకుకూడా వచ్చేవి. అసలే గది చిన్నది, యిరుకైనది. అరటితొక్కలు కూడా అక్కడనే పడవేశారని గుర్తు. ప్రతిఉదయం గదిని శుభ్రంగా ఊడ్పించుకోవాలనే పట్టుదల తక్కువ. ఒకటి రెండుసార్లు తాను అగ్రజాతివాడననే అహంభావం వెలికిత్రోసుకొని వచ్చిందేమోనని నాకు తట్టింది. అయితే, నే నాయనకంటె విద్యాధికుడను, న్యాయవాదిగా హెచ్చుస్థాయిలోనివాడను. పైగా గవర్నమెంటు ఉన్నతోద్యోగం చేసియుండినాను. అందువల్ల అరుదుగా పొడసూపిన ఆ జాత్యహంకారం మాటలలోగాని, చేతలలోగాని వ్యక్తపడలేదు. ఈ చిన్నదోషాలకేమిగాని ఆయన, నేనును మిక్కిలి సఖ్యంగా వుండినాము. వారు వెళ్లి పోయిన తర్వాత వారికి నేనుత్తరం వ్రాయటం, వారు జవాబివ్వటం జరిగింది. మరొకదఫా అటు ప్రక్కకు వచ్చినప్పుడు విల్లుపురంలో దిగి తన అతిథిగా వుండమని కోరారు. వారి కుమారు డొకడు తండ్రిపేరు కలవాడే మద్రాసులో న్యాయవాదిగా వుంటున్నాడని, నా సీనియర్ శ్రీ యస్. దొరైస్వామిఅయ్యర్ గారికి శిష్యుడు శ్రీ త్యాగరాజన్ వద్ద జూనియర్ గా ఫలానాచోట వుంటున్నాడని

తెలియపర్చాడు. మద్రాసులో ఆ యువకుని వెళ్లి చూద్దా మనుకొన్నానుగాని, కుదరలేదు.

శ్రీ వీరరాఘవన్ వెళ్లిపోయిన తర్వాత నాగదికి శ్రీ నటరాజన్ అనేవారు వచ్చారు. ఆయన దక్షిణాది రెడ్డి. శాకాహారి. కొంత ముభావంతో వర్తించినా, తగుమాత్రం స్నేహభావంతోనే వుండేవారు. ఆయన తిరుచునాపల్లిజిల్లా తొరయూర్ జమిందారీ కుటుంబంలోనివాడు. మధ్యరకం చదువు కలవాడు. ఆయన, నేను కలసి ఊరిబైటకు షికారుకు వెళ్లుచుండేవాళ్లం. మేము విడిపోయిన తర్వాత ఆయనకు ఉత్తరం వ్రాశాను గాని జవాబురాలేదు. స్నేహాన్ని పొడిగించుకొనే స్వభావం కలవాడుకా దనుకోవాలి.

1970 లో వెళ్లినప్పుడు చిదంబరానికిచెందిన ఒ. టి. మహాదేవన్ అనే మొదలియారు నే నున్నగదిలో సహచరుడు. ఆయ నేదో విశిష్టతగలశాఖకుచెందిన మొదలియారట. పూర్తి శాకాహారట. పిళ్ళై అని ఆ శాఖవారు పిలుచుకొంటారట. హైస్కూలు టీచరుగా ఒక చిన్న ఉద్యోగం చేస్తూండినాడట. ఆయనకు చీట్లపేకాట పిచ్చి జాస్తి. మే మున్న దళవాయిహౌస్ లోనేగాక, అక్కడొకటి రెండు క్లబ్బులలో ఆడుచుండేవాడు. తా నెంత గెల్చిందీ, ఓడిందీ చెప్పుచుండేవాడు. ఓడినప్పుడు "ఎందు కీ దండుగ" అంటే "నాకు మొత్తంమీద చీట్లపేకాట లాభిస్తుంది. గతసంవత్సరం కొన్నివేలు సంపాదించాను" అని చెప్పాడు. కొంతస్నేహం కనపరచినా కపటి అని, తన సౌఖ్యం చూచుకొనేవాడేగాని ప్రక్కనున్నవారి ఇబ్బందులను గమనించేవాడుకా దని తోచింది. మాటలసందర్భంలో ఆంధ్ర విశ్వవిద్యాలయం ఉపాధ్యక్షులుగా వుండుచున్న బుల్లెయ్యగారి భార్య తన పినతండ్రి కూతురో, అటువంటి దగ్గరబంధువో అని చెప్పాడు. తాను బుల్లెయ్యగారి ఆహ్వానంమీద తన దగ్గరబంధువును చూడటానికి వాల్తే రొకసారి వెళ్ళానని, మరొకసారి వెళ్లుతానని, తిరిగి వచ్చేటప్పుడు మీ యింటికి వస్తా

నని చెప్పాడు. "సంతోషం, అలాగేనండి. మీకు మనస్ఫూర్తిగా ఆతిథ్యమిస్తా"నన్నాను. కాని, నేను ఇంటికి తిరిగి వచ్చిన తర్వాత వ్రాసిన ఉత్తరానికి జవాబే రాలేదు.

ఈ 1966 మకాంలో ఒక దక్షిణాది కమ్మకులస్థుణ్ణి (నాగపట్నం) కలుసుకొన్నాను. ఆయన తనభార్యతోబాటు ఒక చిన్నకూతురును వెంటబెట్టుకొనివచ్చాడు. దళవాయి వసతి గృహాన్ని నడుపుచుండిన శ్రీ రామలింగంగారికి చిరకాల స్నేహితుడట. ఆ స్నేహంమూలంగా కొంత విర్రవీగేవాడు. కొన్ని డంబాలు చెప్పుకొనేవాడు. కలుసుకొన్న ఆదిలో "మీపేరేమి?" టని అడగగా, "నన్ను గ్రేట్ (గొప్ప) పార్థసారథి" అంటూ రన్నాడు. ఆయనసలుపేరు శ్రీనివాసులు. మిత్రు లెందుకో పార్థసారథి అంటారట. తాను గొప్పవాడనని చెప్పుకొనటానికి కారణం ఆయనకు రామలింగంగారితోగల స్నేహం, కొంత స్వేచ్ఛ చనువులతో వర్తించటం. రామలింగంగారప్పుడప్పుడు స్వగ్రామం వెళ్లి 3, 4 రోజు లుండి వచ్చేవారు. ఒకదఫా రామలింగంగారు తన కారును ఈ శ్రీనివాసులుగారి స్వాధీనంలోవుంచి వెళ్లినారట. శ్రీనివాసులుగా రా కారు నప్పుడప్పుడు వాడుకొనుచుండేవారు. ఒక సాయంత్రం తన భార్యా, బిడ్డతో ఆ కారులో పంచముఖ జలపాతానికి వెళ్ళుచు, నన్నుకూడా రమ్మన్నారు. పిల్చారుకదా అని 'వస్తా' నన్నాను. నేను సిద్ధపడటంలో కొంచెం ఆలస్యమైంది. దాని కాయన, "నే నుపకారబుద్ధితో కారులో ఎక్కించి తీసుకొని వెడతానంటే ఇంత ఆలస్యంచేశాడేం" అనే చిరాకుభావం కనపరచాడు. అప్పటికి నే నెవరినో ఆయనకు పూర్తిగా తెలియ లేదు. అంతకు క్రిందటి సాయంత్రమే తా నేదో న్యాయశాస్త్ర పారీణుడైనట్లు, విజ్ఞానగని అయినట్లు, రాజకీయ దురంధరులైన గొప్పగొప్పవారితో పలుకుబడి కలిగియున్నట్లు తర్కించాడు. అభిప్రాయాలను వెలిబుచ్చాడు. తరువాతగాని నా ఇంగ్లండు 6½ సంవత్సరాల ఉనికి, ఆక్స్‌ఫర్డ్ విద్యాభ్యాసం, బారిష్టరు పట్టాను పొందటం ఆయనకు తెలియలేదు. నేను ఇన్‌కంటాక్స్ అసిస్టెంటు కమిషనర్‌గా పనిచేసి పింఛనుపుచ్చుకున్నానని

తెలిసిందేమోగాని, ఉద్యోగవిరమణ చేసిన ఆఫీసరు కాల్చి వేసిన తూటావంటివాడుకదా! ఒకప్పుడొక ప్రముఖ కోయంబత్తూరు కమ్మనాయుడు "ఉద్యోగవిరమణ జేసిన ఇన్ కమ్ టాక్స వారిని అసలే నమ్మ"నని అన్నాడుగాని, సర్వసామాన్యంగా "ఉద్యోగానంతరమందు చూడవలదా ఆ అయ్యసౌభాగ్యముల్" అన్న భావమే ప్రజలలో ప్రబలి వుంటుంది. నేను ఇంగ్లండులో కొన్నిసంవత్సరాలపాటుండినానని, బారిష్టరుపట్టాను పొందినానని తెలిసినవెంటనే. శ్రీనివాసులునాయుడుగారి వర్తనలో మార్పు వచ్చింది. ఇంగ్లండుకు వెళ్లి చదువుకున్నవా రందరు శుద్ధ పోకిరీలని అభిప్రాయపడినట్లున్నది. ఆయన కూతురు చిన్నపిల్ల. చక్కని కాత్యాయని అను పేరుగల ముద్దుబిడ్డ, ఆ బిడ్డయందు మురిపెం చూపించేవాడను. శ్రీనివాసులునాయుడు బాగా వయస్సుమళ్లినవాడు కాదు. ఆయన భార్య కొంత పెద్దవయస్సు కలదేగాని, పిన్నవయస్కురాలువలె సన్నగా, నాజూకుగా, అందంగా వుండేది పెద్ద స్ఫురద్రూపికాదుగాని, లేతపచ్చని శరీర రంగుతో, కోమలముఖంతో, బారెడు జుట్టుతో, లేటగల కన్నులతో వుండేది. మాట్లాడినప్పుడు మర్యాదగా, సంకోచం లేకుండా ఉత్తమ స్త్రీవలె జవాబు లిచ్చేది. కాని, ఎప్పుడు నా ఇంగ్లండు చదువువల్ల నేను పోకిరీనై వుంటానని శ్రీనివాసులు నాయుడు తలంచాడో, అప్పటినుండి ఆయన జాగ్రత్తగా మాట్లాడటమేగాక, భార్యకూడా ముఖం తప్పించటం మొదలుపెట్టింది. మరి ఎప్పుడూ తనతో రమ్మని ఆయనగారు కోరలేదు. కొంత కాలానికి నేను మద్రాసులో రోడ్డువెంట వెళ్లుచుండగా నన్ను చూచాడో, చూడలేదోగాని శ్రీ శ్రీనివాసులునాయుడు నా కెదురుగా వచ్చుచు, కొంతదూరంనుండే రోడ్డు దిగి వీధి కడ్డంపడ్డాడు. నేను వారిని గుర్తుపట్టి, పిలిచి దగ్గరకు రాగా, "ఎప్పుడు వచ్చారు, మీ భార్యాబిడ్డలు బాగున్నారా, ఎక్కడుంటున్నారు?" అని ప్రశ్నించాను. ఎక్కడో వుంటున్నామని చెప్పి, "ఇరుగో, నా భార్యాబిడ్డలు, ఎదురుగానున్న సినిమా చూడటానికి హాలు ప్రాంగణంలోనికి వెళ్లారు, నేను వెంటనే వెళ్లి టిక్కెట్లు

కొనా''లని చెప్పి త్వరగా వెళ్లిపోయాడు. నే నప్పటికి 70 ఏళ్లు నిండబోవుచున్నవాడను. ఎఱ్ఱగుడ్డనుచూచిన ఆబోతువలె, నా పాశ్చాత్యవిద్య ఆయనను భీతావహుణ్ణిచేయటం, నా కిప్పటికిని ఆశ్చర్యం కలిగిస్తున్నది.

1963లో నేను కుర్తాళం వెళ్లినప్పుడు, ఒకరోజు సాయంత్రం ఒకప్రక్కగా కొంతదూరం షికారు వెళ్లుచుండగా ఒక మఠం వంటిది కనిపించింది. ''ఇదేమి''టని అడిగి, అది సిద్ధేశ్వరిమఠమని తెలుసుకొని, లోపలకు వెళ్లాను. అక్కడ ఆ మఠాధిపతిని కలసికొనగా, వారు తెలుగువారేగాక, దివితాలూకా, చల్లపల్లి ఎస్టేటులోని 'చిట్టూరు' అనే గ్రామకరణంగారి పుత్రుడట. వారి తండ్రిగారు పెట్టిన పేరు రామకృష్ణారావు. వారు కొంతకాలం బందరులో న్యాయవాదిగా వుండినారు. మాకు బందరులో నోబుల్ కళాశాలలో కాలేజి క్లాసులకు తెలుగు చెప్పిన నియోగి బ్రాహ్మణులు శ్రీ కానుకొల్లు త్రివిక్రమరామారావుగారు సన్యసించి, ఆ కుర్తాళం సిద్ధేశ్వరి మఠానికి విమలానందభారతి స్వామి అనుపేరుతో అధిపతియైనారు. ఆ సిద్ధేశ్వరిమఠాన్ని అంతకు కొన్ని సంవత్సరాలకు ముందు గుంటూరు జిల్లాకు చెందిన నియోగి బ్రాహ్మణుడొకరు, మౌనస్వామి అని మామూలుగా వ్యవహరింపబడిన మౌనానంద సరస్వతి స్వామివారు స్థాపించారు. శ్రీ విమలానంద భారతిస్వామి తర్వాత సన్యసించిన రామకృష్ణారావుగారు శ్రీ త్రివిక్రమ రామానంద భారతిస్వామి అను పేరుతో ఆ పీఠాధిపతి అయినారు. ఈవిధముగా తెలుగు సంప్రదాయ మిప్పటికిని కొనసాగుచున్నది. పీఠాధిదేవత శ్రీ రాజరాజేశ్వరీదేవి. మఠాధిపతిగారు నన్నెంతో ఆదరించి, ఆ మఠావరణలోని గోశాలలను, అతిథిగృహాలు మొదలైనవానిని చూపించారు. ఆ మఠానికి మూడు నాలుగు సార్లైనా వెళ్లాను. ఒకసందర్భంలో చక్కని తెలుగుపద్యాలు చదివి, వినిపించారు. ''మీ రెంత చక్కగా, శ్రావ్యంగా పాడుతారు!'' అని నే ననగా వారు నవ్వి, నా పద్యపఠనం ఒకప్పుడు వినిన శ్రీ భోగరాజు పట్టాభి సీతా

రామయ్యగారు, నీవు వకీలుగా రాణించకపోయినా, నాటకాలు వేసి మెప్పించి, సంపాదించగల" వన్నారని ఉల్లసించారు.

శ్రీ రాజరాజేశ్వరీదేవికి నిత్యం ఉదయం, సాయంత్రం పూజలు శ్రద్ధగా, చక్కగా ఒనరించుటయేగాక, అప్పుడప్పుడు గోపూజకూడా చేసేవారు. వారు సాత్త్వికసంపన్నులే గాక, సరసులుకూడ. సన్యాసజీవనావలంబనకులెగాక, లౌకికులు కూడాను. మాట మధురం. మర్యాద, మన్ననలు ప్రస్ఫుటం. మఠం ప్రధానభవనం పరవాలేదుగాని, ఆ మఠ ప్రాంగణంలోని చెట్లు, చేమలు, గృహాలు బీదరికాన్ని వెలిబరుస్తూ, తత్క్షణ సహాయాన్నికోరేవిగా వున్నవి. ముఖ్యభాగంలోని ముందు పెద్ద హాలులో కొన్ని పెద్దపెద్ద లక్కబొమ్మ లున్నవి. ఆ లక్కబొమ్మలు కాంతిహీనముగావుండి ఆ హాలును ప్రాతకొంప అనిపించినవి. లౌకికకుటుంబంలో పుట్టి, లౌకిక న్యాయవాదవృత్తిని కొన్ని సంవత్సరాలు నిర్వహించినవారుకనుక సన్యసించి పీఠాధిపతులైనను ఆ పూర్వవాసన పూర్తిగా పోగొట్టుకోనలేదు. అయితే ఆ లౌకికంలో పారమార్థిక మున్నది. వారిధ్యేయం మఠానికున్న ఆస్తిని, అనగా 50 ఎకరాల భూమిని కట్టడాలను, అభివృద్ధిపరచుట, మఠానికి వచ్చే భక్తులకు నివాసయోగ్యమైన వసతులను కలిపించుట, మఠాన్ని అభిమానించేవారి సంఖ్యను పెంచుట, మొత్తంమీద మఠాన్ని ఆధునికరూపంతో, అన్ని వసతులతో, భాగ్యవంతమైనదిగా, ప్రజాభిమానం పొందినదిగా చేయదలచుట.

1966 లో నేను కుర్తాళం వెళ్ళినప్పు డామఠాన్ని దర్శించినట్లులేదు. కాని 1970 లో అక్కడకు వెళ్ళి, స్వామిజీని దర్శించి మాట్లాడినాను. వా రప్పుడు క్రొత్తగా కట్టుచున్న ఒక విశాల భవననిర్మాణకార్యంలో నిమగ్నులై వుండినారు. తిరుపతి దేవస్థానంవారు 2 లక్షల రూపాయ లాభవనం కొరకిచ్చి, కట్టుడు యజమాన్యాన్ని స్వామివారి కప్పజెప్పారట. స్వామివారు కట్టుచున్న ఆ భవనం నాలుగుప్రక్కలను స్వయముగా చూపించారు. రాళ్లు, రప్పలు, సిమెంటు, యిసుకతో నిండిన త్రోవలగుండా

తాపీపనివాళ్లు పనిచేస్తున్న పరంజాల క్రిందనుండి కూడా యిబ్బంది, శ్రమ అనుకోకుండా తీసుకొని వెళ్లి చూపించారు. ఈబిల్డింగు కాక, దీని కొక ప్రక్కగా అదివరకుండిన ప్రాతబిల్డింగును మరమ్మత్తుచేసి, విస్తృతపరచి, అక్కడకు కుటుంబసహితంగా వెళ్లినవారు వంటచేసుకొని కొన్ని వారాలైనా గడపటాని కను కూలంగా వంట, స్నాన గదులతో చిన్న చిన్న బ్లాకులు కట్టించి నారు "మీ రింకొకదఫా వచ్చినప్పుడు మీ భార్యతో రండి, ఈ బ్లాకులలో నొకదానిలో నుండవచ్చు"నని చెప్పారు. మరిన్ని, నా ఆరవ పెద్దతండ్రి కుమారుడు వీరభద్రయ్యగారినికూడా భార్యతో వచ్చి వుండమని ఆహ్వానించి యున్నామని చెప్పారు

1963 లో ఈజిల్లా గుడ్లవల్లేరు ప్రముఖవ్యాపారి శ్రీ అడ్సుమిల్లి సుబ్బారావుగారు అక్కడి ఒక వసతిగృహంలో కొన్ని వారాలపాటు భార్యతో నుండినారు. స్వామివారు కృష్ణా జిల్లావారేగనుక, అప్పు డప్పుడు బెజవాడకు, బందరుకు వచ్చి పోతూంటారు. వారి భార్య మా పెదసనగల్లు గ్రామకరణం శ్రీ యద్దనపూడి మూర్తిరాజుగారి కుమార్తెయే. ఈ సంబంధ బాంధవ్యాలనుబట్టి వారిని ఈజిల్లాలో చాలామంది తెలిసినవా రున్నారు. అందువల్ల శ్రీ సుబ్బారావుగారువంటి కొంతమంది కుర్తాళం వెళ్ళినప్పుడు సమయాని కితర వసతి దొరకకనో, శ్రీ రాజ రాజేశ్వరీదేవికి పూజ లొనర్చవచ్చుననో, స్వామివారి సాన్ని ధ్యానికనో ఆ మఠానికి వెళ్లుచుండుట కలదు. మఠం ఊరుబైట వున్నట్లున్నా, అంత దూరంగాలేదు. పూర్తిగా వయస్సుమళ్లిన వారికితప్ప, అనతిదూరంలోనున్న జలపాతాలకు చేరుకొనుట కంత యిబ్బంది వుండదు. శ్రీ స్వామివారిని 1970 కు ముందు బెజవాడలో ఒక వివాహంలో చూచాను. వారు, వారి మేనల్లుడు డాక్టరు దయానందరావుగారితో మాట్లాడుచుండగా వెళ్లి, నా పూజ్యభావాన్ని వ్యక్త పరిచాను.

కుర్తాళం, టెంకాశీకి 2½ మైళ్లదూరంలో నున్నది. దానికి రైలు మార్గంలేదు. టెంకాశి స్టేషనులో దిగి బస్సులోనో, టాక్సీలోనో అక్కడకు చేరుకోవాలి. దక్షిణకాశి అన్న పేరు

బడ్డ దీ టెంకాశి. సరియైనపేరు తెన్‌కాశి. తెన్ అనగా దక్షిణం అని అరవంలో అర్థం. ఇది మద్రాసు - తిరువేంద్రం రైలుమార్గంలో. తిరువేంద్రానికి 70 మైళ్లదూరంలో వున్నది. టెంకాశి తిరునెల్వేలి జిల్లాలో వుంది. దీని కనతిదూరంలోనే దక్షిణంగా కేరళరాష్ట్ర సరిహద్దు వస్తుంది. టెంకాశికి అప్పు డప్పుడు వెళ్లేవాడను. 1963, 1966 సంవత్సరాలలో కుర్తాళం నుండి టెంకాశికి వెళ్లినప్పుడు అక్కడున్న కాశీవిశ్వేశ్వ రాలయాన్ని చూడటానికి వెళ్లాను. 1966 లో వెళ్లిన రోజు కార్తికేయస్వామివారిరోజు. ఆ రోజు కృత్తికదీపాన్ని చూచాను. ఆ దేవాలయం కొంత ప్రాచీనమైనది, పెద్దది కూడాను. స్వామివారి విగ్రహం 5 వందల సంవత్సరాలకు ముందు ప్రతిష్ఠింపబడినదట. దేవాలయ గోపురం గొప్పది. పిడుగుపాటువలన కొంత శిధిలమై వున్నది. దానిలో నన్నాక ర్షించినవి, ముఖద్వారాని కిరుప్రక్కల అమర్చబడిన (బ్రాకెట్) స్త్రీ విగ్రహాలు. అవి మిక్కిలి చక్కని పనితనంతో అర్ధనగ్నంగా, మనోహరంగా నున్నవి. ఇతర దేవతావిగ్రహాలు ముందు హాలు నిండా వున్నవి. అవికూడా చాలా బాగున్నవి. అక్కడున్న నంది సజీవంగా వున్నట్లున్నది.

టెంకాశిలో నాకాలి కుడిబొటనవ్రేలి గోరు లేచిన సందర్భంగా డాక్టరు శంబుగన్ రామన్ అనే వారినుండి చికిత్స పొందానని పైన చెప్పాను. ఆయన యువకుడు, మర్యా దస్తుడు, మంచివాడు. ఆయన చెప్పిన సలహా ఒకటి జ్ఞాపక మున్నది. మధుమేహవ్యాధికి తీసుకొనే రాస్టినాన్ అనే మందు బిళ్లలు రోజుకు ఒకపూటే తీసుకోవాలట. డోస్ ఎక్కువగా వుండాలంటే ఒక పెద్దబిళ్లనో, రెండు చిన్నబిళ్లలనో తీసుకోవలెనట గాని, 2 పూటలు తీసుకోవద్దని వారి సలహా. ఫీజు సామాన్యం గానే పుచ్చుకొన్నాడు. పైది 1970 లో నేను 3-వసారి కుర్తాళం వెళ్లినప్పటి సంగతి. అక్కడ, కృష్ణా అండ్ కంపెనీ అని మందుల షాపున్నది. ఆ షాపుకు 1963, 1966లో వెళ్లి నప్పుడుకూడా వెళ్లినాను. వారి భాగస్థులలో ముఖ్యు లొకరు

శంకరన్ అనేవారు 1966లో నాకు కొంత స్నేహభావం కనపరిచారు. 1970 నాటికి వారు చనిపోయారు. ఆ షాపు యజమాని శంకర్ నారాయణగారట. బొటన వ్రేలుగోరును తీయించి కట్టు కట్టించుకొన్న తర్వాత రెండు, మూడు పూటలు స్నానం చేయలేదుగాని, తరువాత మామూలుగానే స్నానంచేసి వెంటనే కట్టు మార్చేవాడను.

1966 లో ఒక సాయంత్రం టెంకాశినుండి కుర్తాళం తిరిగి వెళ్లుటకు బస్సులో ఎక్కబోవు సమయంలో ఎవరో గుమిగూడి త్రోసుకొని వచ్చినట్లుగా తోచింది. దానిని పట్టించుకొనకుండా టిక్కెట్టు కొరకు పర్సు తీయబోగా పర్సు కనబడలేదు. అదృష్ట వశాత్తు జేబులో విడి డబ్బు లున్నవి. అందువల్ల కుర్తాళం చేరుకొనుటకు నే నే యిబ్బంది పడలేదు. ఒకవేళ పర్సును కృష్ణా అండ్ కంపెనీ షాపులో విడిచిపెట్టానేమో అని మర్నా డుదయం వెళ్లగా, "ఇక్కడ విడిచిపెట్టలేదు, బస్సులో మీ జేబు కొట్టేశా" రన్నారు. ఆ పర్సులో వున్నది 15 రూపాయలు మాత్రమే. సాయిబాబాగారి చిన్న ఫొటో, ఉధి చిన్నపొట్లం మాత్ర ముండినవి. అందువల్ల నేను శ్రమపడవలసివస్తుందని పోలీసుకు రిపోర్టు చేయలేదు. కాని మర్నా డుదయం ఒక వకీలును తీసుకొని ఆ మందులషాపువారిలో నొకరు మా హోటల్ కు వచ్చారు. వారి భయం మొత్తం పోయిందేమో అని, నేను పోలీసువారికి రిపోర్టు చేసి వారి మందులషాపులో విడిచిపెట్టానని చెప్పానేమో అని. నేను వారితో "పోలీసుకు రిపోర్టు యివ్వలేదు. నేను మీమీద అనుమానపడలేదు. పోయింది చాలా స్వల్పమొత్తం, మీ రేమీ ఆందోళనపడవల"దని నమ్మకం చెప్పాను. నన్నేవో ప్రశ్నలు వేయాలని వచ్చిన ఆ వకీలుగారు మెత్తబడి జారుకొన్నారు. నా జేబులోని పర్సు పోవట మిదే మొదటిసారి, చివరిసారి అవుతుందని ఆశిస్తున్నాను.

కుర్తాళంవిషయం ముగించేముందు మూడు నాలుగు సంగతులు చెప్పుతాను. శ్రీ కె. త్యాగరాజ మొదలియార్

భవనావరణలో రెండు మూడు భవనా లున్నవి. ముఖ్యభవనం మిక్కిలి పెద్దది. బాగా కట్టబడింది. దాని కన్నిప్రక్కల బాల్కనీలు, వరండా లున్నవి. పై కప్పు పెంకుతో, చీనాశైలి కోణాలతో మిక్కిలి సుందరంగా నిర్మించబడ్డది. ఆ మహాభవనంలో హిందూ, పాశ్చాత్య పద్ధతి వసతులన్నీ వున్నాయి. రకరకాల అలంకార వస్తుసముదాయ ముండినది. ఈభవనాన్ని శ్రీ మొదలియార్ సౌందర్యవతి, తన ఉపపత్ని కేరళ యువతికోసం కట్టించినాడట. చివర కామెను వివాహమాడాడు. భవనావరణ గొప్పదని వివిధపుష్పలతాగుల్మాలు, వృక్షాలు, స్త్రీమూర్తులు (అర్ధనగ్న) ఉన్నవని పైన చెప్పాను. అక్కడి మానేజరు, తెలుగు తెలంగాణా బ్రాహ్మణుడు, రామయ్య అనే పేరు కలవాడు. నా గది సహవాసి శ్రీ నటరాజన్ మూలంగా మా కాతోట, భవనాలు వెంటనుండి చూపించారు.

మద్రాసు, శారదా స్టూడియోల మానేజరు శ్రీ టి. వి. వైద్యనాథయ్యర్ అనే వారి నక్కడ (1966) లో కలసికొన్నాను. ఒకనాడు మధ్యాహ్నం శ్రీ నటరాజన్, శ్రీ వైద్యనాథన్, ఆయన కుమారుడు, నేను కొలదిమైళ్ల దూరంలోవున్న ఏలంజి అనే చోటుకు, అక్కడి మురుగన్ దేవాలయానికి వెళ్లాం. ఆ దేవాలయం చిన్నది. దాని ఆవరణ చిన్నది. శిల్పసంపద లేనట్లే. అయినా, అది ప్రాచీనదేవాలయమట. పైగా, అరవలకు మురుగన్ ( కుమారస్వామి ) ఇష్టదైవంకదా.

ఒక సాయంత్రం కుర్తాళం—టెంకాశి రోడ్డు ప్రక్కనున్న పెద్దచెరువుగట్టుమీదికి షికారుకు వెళ్లాను. ఏవో కట్టడాల కోసమట, పెద్ద పెద్ద సిమెంటు బండలను ( స్లాబులను ) తయారు చేయటం చూచాను. "మీప్రక్కనే కొండ లుండగా ఈ శ్రమెందు"కనగా, పనివాడొకడు "కొండరాళ్లకంటె ఇవి చౌక" అన్నాడు. సిమెంటు ధరలు ఆకాశాన్నంటుకొన్న ఈరోజులలో ఆ విధంగా చెప్పేవాడు కాడు.

కుర్తాళంలో వారిని, వీరిని, దక్షిణాది తెలుగువారిని కలసికొన్నాను. వారిలో నగర్‌కోయిల్‌కు చెందిన శాకాహారి

శ్రీ రామస్వామిరెడ్డిగా రున్నారు. ఆయన నాకంటె పెద్దవయస్సు వాడైనా మిక్కిలి దృఢగాత్రుడు. మిక్కిలి చలాకిగా వుండేవాడు. అపభ్రంశ తెలుగు మాట్లాడేవాడు. అపభ్రంశ తెలుగుకు కల్ల కుర్చీకి చెందిన కమ్మ నాయుడు పోలియుగారి జ్ఞాతట అప్పాస్వామనేవారిది పైచెయ్యి. ఆయినె ల్వేలిజిల్లాలో నివసించుచున్న కమ్మవారికి కించుమించుగా తెలుగురాదు.

ఇంకొక విశేషం - కొంతమంది రోజుకు 5, 6 సార్లైనా జలపాతంలో స్నానంచేసేవారు. వాళ్లెప్పుడూ నూనెతో మడ్డివైన స్నానవస్త్రాలతోనే వుండేవారు. వీళ్ల కింత ఓపిక ఎట్లున్నదా అనిపించేది. అయితే. వాళ్లు ఏ రెండు, మూడు రోజుల స్నానానికో వచ్చినవాళ్లు. కరువంటా తీర్చుకొని వెళ్లిపోయేవారు.

కుర్తాళంవిషయం ముగించేముందు, ఇంకొకవిషయం చెప్పాలి. అక్కడ దళవాయిహౌసులో కలసిన ముఖ్యు లొకరున్నారు. వారు మద్రాసు ఫ్లవర్ బజారులో వెంకటేశ ఎంపోరియం అను జవళిదుకాణం యజమానులు శ్రీ కె. వెంకటేశం గారు. వారు మిక్కిలి సరసులు, స్నేహశీలురు. వారిని 1963 లో చూచినట్లు గుర్తులేదు. 1966 లో ఒకసారి పలకరించి మాట్లాడాను. అప్పుడు వారు ఒంటరిగా వచ్చినట్లున్నారు. 1970 లో వారు భార్యతోవచ్చి చాలారోజులుండి వెళ్లిపోయారు. నాకంటె కొన్ని వారాలు ముందు అక్కడకువచ్చి, నాకంటె కొన్ని రోజులు ముందుగా మద్రాసు వెళ్లిపోయారు వారి స్వగృహం వాషర్ మన్ పేటలోని శ్రీ చల్లపల్లి రాజాగారి పెద్ద భవనానికి ఎదురుగానున్న భవనమట. రాజావారిని, వారి తమ్ముడు శ్రీ రామకృష్ణప్రసాద్ గారిని, వారి బంధువులను స్వయంగా ఎరిగి కొంత మైత్రిని జరుపుచుండినారట. నేను ఫలానావాడనని తెలియటంతోనే, వారికి నాయందు హెచ్చు అభిమానం కలిగినట్లున్నది. మా దళవాయిహౌస్‌లో శాకాహారమేగాని, మాంసాదు లుండవు. అయితే, వెంకటేశంగారి వంటి ఒకరిద్దరు మాత్రం, వారి గదిలో స్టౌమీద మాంసాదులను వండుకొనుటకు అనుమతి, అవకాశంకలిగి వుండినారు. శ్రీ వెంకటేశం అప్పుడప్పుడు మాంసం, చేపలు, రొయ్యలు, కోడి

గ్రుడ్లు, కూరలు నాకు పంపించేవారు. ఒకనాడుదయం మాంసం పంపిస్తా నన్నట్లు వారు సూచించారుగాని, నే నంత పట్టించుకో లేదు. వారు (ప్రొప్రైటరు రామలింగంగారికి సన్నిహితులేగాక, భోజనం వడ్డించేవా రందరికి సుపరిచితులు. సౌమ్యుడు, ధనవంతు డగు వెంకటేశంగారి చల్లని చూపుకు, ప్రాపుకు ఆ వంట వడ్డన బ్రాహ్మణ యువకులు దోసిలొగ్గుచుండేవారు. అందువలన వడ్డించే యువకులలో ముఖ్యునకు, "చౌదరిగారికి అన్నం వగైరా వారి గదికి తీసుకొని వెళ్లం"డని చెప్పియుండినా రట. ఆ భోజన పదార్థాలు వచ్చునంతలోనే ఒక పాత్రలో 1, 2 రకాల మాంసం వచ్చింది. ఈపద్ధతిని వారానికి రెండుసార్లైనా వారు వెళ్లేవరకు శ్రీ వెంకటేశంగారు కొనసాగించారు. వారి భార్య సుగుణ, సౌజన్యవతి, భర్తయం దనురాగంగల గృహిణి, శుచి, శుభ్రంతో, చక్కని అలంకరణతో, రంగు తక్కువైనా సరియైన లావుతో, పొడుగుగా, అందంగా వుంటారు. వెంకటేశంగారి కప్పటికి 60 ఏండ్ల వయస్సు వుంటుంది. ఆమెగారికి 55 అయినా వుండవచ్చును. అయినా, అందంగా వుండేవారు ఆమె మృదుభాషిణి, చక్కని మర్యాద, మన్ననలు ఎరిగి. వారు. వారి వంటకాలు మాంసమేగాక చేపలు, రొయ్యలు, కోడిగ్రుడ్లు, మిక్కిలి రుచికరముగా వుండేవి వానిని తృప్తికరంగా భోజనం చేసి. ఆమెగారికి స్వయంగా ఒకటి, రెండుసార్లు నా కృతజ్ఞత తెల్పాను. వెంకటేశంగారు చిన్న వయస్సులో క్రికెట్ వంటి ఆటలలో కొంత సామర్థ్యం సంపాదించి, సహజమైన వారి దృఢశరీరాన్ని మరింత పటిష్ఠం చేసుకొన్నారు. వారు ఎత్తుగా, లావుగా, దృఢంగా వుంటారు. తెలుపు రంగుగల దేహచ్ఛాయతో, మంచి ముఖవర్చస్సు కలిగి, సౌజన్య మూర్తులుగా వుంటారు. వారు వెళ్లినప్పుడు సౌహార్ద్రముతో వీడ్కోలిచ్చాను. మద్రాసులో వారి స్వగృహమందు కలుసు కొంటానని చెప్పానుగాని, ఎప్పటికప్పుడు వాయిదాలువేస్తూ, చివరికి వారి నింతవరకు దర్శించలేదు. నేను వారిని కలుసు కొన్నది 1970 జూలై, ఆగస్టులలో. ఇంటికి తిరిగి వచ్చునప్పటికి నా ప్రథమగ్రంథం "తాంబూలం - నైవేద్యం" ముద్రణ

పూర్తియై, తయారై నా చేతి కందినది. దాని కాపీ నొక దానిని వారికి పంపాను. వారినుండి యీ సంవత్సరం కూడా నూతనవర్ష శుభాకాంక్షలందినవి. ఈదఫా మద్రాసుకు వెళ్ళినప్పు డైనా వారిని దర్శించాలి.

నేను 1963 లో కుర్తాళం వెళ్లినప్పుడు అక్కడ రెండు వారాలు మాత్రమే వుండినట్లున్నది. ఆగస్టు 15 న మధ్యాహ్నం 1 గంటకు త్రివేంద్రం ఎక్స్‌ప్రెస్‌లో బయలుదేరి, సాయంత్రం 4 గంటలకు త్రివేంద్రం చేరుకొన్నాను. 24 గంటల ఉనికికి 5 రూపాయల చొప్పున రైలుస్టేషన్‌లో రిటైరింగ్ రూములో చేరాను. టెంకాశినుండి ప్రయాణంచేస్తూండిన రైలులో అప్పుడు కేరళ గవర్నర్‌గా నుండిన శ్రీ వరాహగిరి వెంకటగిరిగారు మద్రాసునుండి ప్రయాణిస్తూండినారు. నా పెట్టెలో కేరళరాష్ట్ర తపాల - తంతి డైరెక్టరు మహాదేవన్‌గా రుండినారు. అక్కడక్కడ స్టేషన్‌లలో కొంత హడావిడిని చూచి, సంగతి సందర్భ మేమని తెలుసుకోగా, గవర్నర్ గిరిగారు ప్రయాణిస్తున్నారని తెలిసింది. మాటలసందర్భంలో గిరిగారి నెరిగియుంటి నన్నాను. ఇం కొక స్టేషన్‌లో గవర్నర్‌గారితో ప్రయాణించుచున్న వారి మిలిటరి శక్రటరిని శ్రీ మహాదేవన్ నాకు పరిచయపరచారు. పైగా, నేను గవర్నరుగారిని సందర్శించ నభిలషించుచున్నానని చెప్పారు. రెడ్డిగారు వెళ్లి గవర్నరుగారితో చెప్పినట్లున్నది. తిరిగివచ్చి "16-వ తేదీన 9½ గంటలకు ఫోన్ చేసి రాజభవనానికి రావచ్చు" నని శ్రీ రెడ్డి వచ్చి నాకు చెప్పారు. వారు నే నెరిగిన శ్రీ బత్తిన రామకృష్ణారెడ్డిగారి అల్లుడట. అందువల్ల అభిమానించాడు. కాని ఏవో మూడు, నాలుగు రోజులు వినోదయాత్ర కని వెళ్లినవానికి గవర్నరుగారితో మాట్లాడవలసిం దేముంటుందని, వారిని దర్శించ నే లేదు.

త్రివేంద్రం చిన్నపట్టణం. కొన్ని బజారులు చూస్తూంటే యిది పెద్ద (గ్లోరిఫైడ్) గ్రామమా అనిపించింది. ముఖ్య రాజవీధి కూడా అందచందాలు కలదికాదు. ఆధునిక పెద్దభవనాలు లేవు సరికదా, అక్కడక్కడ కొన్ని పెద్ద భవనాలున్నా, వాని

మధ్య మధ్య చిన్న చిన్న ఇళ్లుండినవి. దానివలన హెచ్చు తగ్గులుగా కుటుపడేనట్లు చూపరులకు యిది కేరళరాష్ట్ర రాజధానియేనా అనిపించింది. రాజభవనం ఆ చిన్నపట్టణానికి వెలుపలగా వున్న ట్లనిపించింది. ఆ మహారాజ ప్రాసాదం ప్రాంగణం లోనికి వెళ్లి అచ్చటి పూలమొక్కలను చూడా లనుకొన్నాను గాని, కాపలాకాస్తున్న భటులు పోనివ్వలేదు. ఎవరి పర్మిషనో పొంది, లోపలకి వచ్చి కొన్ని ప్రాసాద భాగాలనుకూడా చూడ వచ్చున్నారు. నాకు వ్యవధిలేదు, శక్తిలేదు. అందువలన ఆ ప్రయత్నం మానుకొన్నాను.

ఒకనా డుదయం కాలినడకను సూటు, బూటు, హాట్‌తో బయలుదేరి షికారుకు వెళ్లినట్లుగా పట్టణ వీధులలో తిరుగుచు శ్రీ పద్మనాభస్వామిదేవాలయం సమీపించాను. ఇది ప్రసిద్ధిగన్న దేవాలయంగనుక చూడాలని లోపలికి వెళ్లబోగా ద్వారంలో కాపలావున్న నౌకరు "మీ రీవేషంతో వెళ్లడానికి వీలులేదు. మీరు లాగు, కోటు, చొక్కా తీసివేసి, పంచెకట్టుకొని అర్ధ నగ్నంగా వస్తేనేగాని, ఈద్వారందాటి వెళ్లటానికి వీలులే" దని చెప్పాడు. నేను తిరిగి వెళ్లిపోయాను. అక్క డున్న వని చెప్పబడు చున్న చిత్ర శిల్పసంపదను చూడాలను కొన్నానుగాని పడలేదు. బైటనుండి చూస్తే ఆ దేవాలయం మరీ అంత గొప్పగా కనపడ లేదు. ఒకటే ఒక గోపురం. అది అంత ఎత్తైనదికాదుకూడా. అయితే ఆ గర్భగుడిపైన శిఖరం అందంగా వుంటుంది.

దేవాలయంనుండి తిరిగి వచ్చిన తర్వాత, జంతుప్రదర్శన శాలకు వెళ్లాను. కొన్ని పెద్దపులులు, సింహా లున్నవి. ఒకపెద్ద నల్లని హిమాలయ ఎలుగుబంటు వున్నదికాని, న న్నెక్కువగా ఆకర్షించినది 'గిబ్బన్' అనే అస్సాం కోతి. అది ఎల్లప్పుడూ అక్కడనుండి యిక్కడకు, ఇక్కడనుండి అక్కడకు కటకటాల మీాద వ్రేలాడుచూ తిరుగుతుంది. మనుష్యులు అరచినట్లు ధ్వని చేస్తుంది. ఇట్టి కోతిని చూడటం ఇదే మొదటిసారి, చివరిసారి కూడానూ.

ఒక ఉదయం త్రివేంద్రంలోని చిత్రాలయం చూచాను. దాని నానుకొనియున్న మ్యూజియంను చూచాను. చిత్రాలయంలో చాలా విభాగాలున్నవి. రవివర్మ, వారి తమ్ముడు రాజరాజవర్మ, వారి కుమారుడు రామవర్మ రచించిన చిత్రపటా లున్నవి. రవివర్మ రచించిన వసుకుంటాను, ఒక దమయంతీ హంస బొమ్మలోని, కాలిలో ముల్లు గ్రుచ్చుకొన్నట్లు నటించుచున్న శకుంతల బొమ్మలోని దమయంతి, శకుంతలలు పెండ్లికాని కన్యలవలె కనపడలేదు. రతిసౌఖ్యాన్ని కొన్ని సంవత్సరాలు అనుభవించిన యువతులవలె కనిపించారు. రాజరాజవర్మ బొమ్మలు బాగా వున్నవి. ఆయన చిత్రాలలో నన్నెక్కువగా ఆకర్షించినది పల్లెపడుచు చిత్రం. రామవర్మ చిత్రించిన తండ్రి రవివర్మ తైలవర్ణ చిత్రం బాగా వున్నది. చిత్రపటాల సెక్షన్‌లో నాకు మిక్కిలి ఉత్సుకతను కలిగించింది తెలుగు చిత్రలేఖకుల బొమ్మ లుండటం. శ్రీ చామకూరు సత్యనారాయణ, శ్రీ అంకాల వెంకట సుబ్బారావు, శ్రీ అడివి బాపిరాజు, శ్రీ అ. పైడిరాజు, శ్రీ కౌతా రామమోహన శాస్త్రిగార్ల చిత్రపటాలున్నవి. చామకూరివారి (శ్రీ) సి. పి. రామస్వామిఅయ్యర్‌గారి బొమ్మ, సుబ్బారావుగారి నాగకన్యబొమ్మ నాకు బాగా నచ్చినవి. రామమోహనశాస్త్రిగారు నా కిచ్చిన "అలంకరించుకొనుచుండిన స్త్రీ" బొమ్మవంటిది చిన్నసైజులో వున్నది. చిత్రశాలను ప్రారంభించినప్పుడు డా. కజిన్సగారు చామకూరివారినో, అంకాలవారినో సహాయంతీసుకొని వెళ్లినారను కొంటాను. భారతీయచిత్రకళావిభాగంలో అజంతాచిత్రాల ప్రతిరూపాలుకూడా వున్నవి. ఇవిగాక చైనీస్, జపానీస్, టిబెటన్, బాలి కళాకారులచే చిత్రింపబడిన బొమ్మలు, సుప్రసిద్ధ రష్యన్ చిత్రకారులు (శ్రీ) నికోలస్ రోరిక్, వారి కుమారుడు శ్వేతస్లావ్ రోరిక్ బొమ్మలు చాలా వున్నవి. తండ్రి నికోలస్‌గారి బొమ్మలు చాలావరకు హిమాలయ దృశ్యాలు. కొడుకు శ్వేతస్లావ్ బొమ్మలలోకూడ హిమాలయదృశ్యాలున్న చిత్రా లున్నవి. మరిన్ని, ప్రకృతిరామణీయకతను చూపే బొమ్మ లున్నవి. వారి బొమ్మలలో, ప్రతిమలను చిత్రించిన బొమ్మలు కూడా ఉన్నవి. శ్వేతస్లావ్ రోరిక్ లిఖించిన "స్టారమ్ ఎట్ డైక్" అనేబొమ్మలో

ఒక స్త్రీ తుపానులో పోవుచున్నట్లున్నది. చాలా బాగావున్నది. నికొలస్ రోరిక్ గారి ఒక బొమ్మలో, కొండమీదనున్న భవనం లోని కిటికీకి చేరునట్లు, కొండక్రింది కందకంనుండి విలుకాడొకడు బాణాన్ని సంధించుచున్నట్లున్నది. ఈచిత్రం చాలా ఆకర్షణీయంగా వున్నది. ఈ రెండు చిత్రాలు పెద్దపెద్ద పానెల్సు. ఈ తండ్రి కొడుకుల చిత్రాలు మిక్కిలి ప్రాముఖ్యముగా, ఒక ప్రత్యేక సెక్షనులో ఏర్పరచబడ్డవి.

ఒక మధ్యాహ్నం బయలుదేరిన ఎక్స్‌ప్రెస్ బస్సులో కొన్ని మైళ్లలోవున్న కన్యాకుమారికి వెళ్లాను. వెళ్లటంతోనే ఆకర్షించేది మహాత్మాగాంధి స్మారక మండపం. దానిని ఉత్తర హిందూస్థానం పద్ధతిని నిర్మించారు. మహాత్ముని చితాభస్మాన్ని నిమజ్జనంచేసిన త్రిసముద్ర సంగమంవద్ద ఈ స్మారకాన్ని చాలా రమణీయంగా నిర్మించారు. ఇక్కడి సముద్రతీరం అంత విశాలంగా కనపడలేదుగాని, దానిని వృద్ధిచేయుట కవకాశమున్నది. గాంధిగారి స్మారకమండపానికంటె ముఖ్యమైనది అక్కడి ప్రాచీన కన్యాకుమారి దేవాలయం. ఈదేవాలయం పెద్దది. యాత్రికుల నెక్కుడుగా ఆకర్షించేది. ఈదేవాలయానికి సంబంధించినవి కొన్ని చిన్నచిన్న బంగాళాలున్నవి. వానిని యాత్రికుల కద్దెకిస్తారు. మొదటి తరగతి గదికి రోజుకు 6 రూపాయల చొప్పున పుచ్చుకుంటారు. ఒక టూరిస్టు బంగళా కూడా ఉన్నది. అనువైన కేఫ్‌హోటలు వంటి హోటళ్లు కూడా ఉన్నవి. మేము వెళ్లినది వర్షాకాలం. ఇక్కడ వేసవిలో మిక్కిలి సుఖప్రదంగా వుంటుంది. విశ్రాంతికి మిక్కిలి అనువైనచోటు. ఇక్కడ వేసవిలో త్రిసముద్రసంగమ మందు కొన్ని ప్రత్యేకసాయంత్రాలలో సూర్యాస్తమయం మిక్కిలి మనోహరంగా ఉంటుందట. మేం వెళ్లింది దక్షిణాయనం గనుక సూర్యాస్తమయం మామూలుగానే వుండినది.

ఇంకొక ఉదయం త్రివేంద్రంపట్టణానికి 8 మైళ్లలో నుండిన సుప్రసిద్ధ కోవలన్ బీచ్‌కి బస్సులో వెళ్లాను. మొదటి రెండు బస్సులు తప్పినందున, ఆలస్యంగా 10½ గంటల కక్కడకు

చేరాను. అప్పటి కింకను (ఆగస్టు, 1963 సంవత్సరం) ఈ బీచ్‌ని అభివృద్ధిపరచ లేదు. అందువలన కాబోలు నా కది అంత గొప్పగా కనపడలేదు. అది అర్ధచంద్రాకారంగా, మిక్కిలి పొడవుగా వున్నది. ఉత్తరభాగాన, తీరాన్నానుకొని భూభాగం క్రమేపీ క్రిందనుండి కొంచెం ఎత్తుకు లేచినట్లున్నది. ఆ ప్రదేశమంతా పైనుండి తీరంవరకు కొబ్బరితోటలమయం. ఈతోటల పచ్చదనంవలన, అవి అంతస్థులుగా ఒకదానిపైన మరొకటి అమర్చినట్లుండుటవలన, ఆ ప్రాంతమంతా మిక్కిలి రమణీయంగా తోచింది. వర్షాకాల మైనందునకాబోలు, దాని బీచ్ మూడు నాలుగు గజాల వైశాల్యం మాత్రమే కలిగియుండింది. మే నెలలో సముద్రపునీరు ఫర్లాంగుదూరంవరకు లోనికి పోవునట. అది అరేబియా సముద్రం చివరిభాగం. దక్షిణభాగంలోని నీరు కొంత మేరవరకు ఆకుపచ్చగాను, ఇంక కొంతవరకు నల్లగాను కనపడింది. అక్కడున్న ఒక యాత్రికుడు "సూర్యరశ్మివల్ల అట్లు కనపడుచున్నదిగాని, మొత్తం అంతా ఒకటే రంగు" అన్నాడు. అయితే, నాతో వుండిన అక్కడి కుర్రవా డొకడు ఏదో నది వచ్చి పడుతుందని, ఆ నదీప్రవాహంవలన ఈ రంగు భేదం కలిగిం దన్నాడు. ఇద్దరు కుర్రవాళ్లు నావెంటపడి అక్కడి తిరువాన్కూరు మహారాజాగారి భవనం, అక్కడి చిన్నకొండమీదనుండిన భవనాలు, టూరిస్టు బంగళా వగైరాలు చూపించారు. మహారాజాగారి భవనంకూడా చిన్నదే. ఎప్పుడో మహారాజాగారు వచ్చినప్పుడు, స్నానాని కుపయోగించుకొంటారట. టూరిస్టు బంగళా కూడా చిన్నదే. దీనిలో పడక, స్నానగదు లున్నవట. భోజనంకూడా పెడతారట. కాని, నేను తిరుగు బస్సులో బయలుదేరి, మధ్యాహ్న భోజనంవేళకు రైల్వేస్టేషన్‌లోని నాగదికి చేరుకోవలసియున్నది గనుక, ఆ బంగళాకు వెళ్లలేదు.

పడక పైనగదిలో. భోజనం, ఉపాహారం క్రిందనున్న రైల్వేరెస్టారెంట్‌లో. మాంసాహారంకూడా యిస్తారు. చేపలు ప్రత్యేకత. వంటకాలు బాగావున్నవి. ధరలు సరసం.

అక్కడితో నా త్రివేండ్రం సంచారం పూర్తిచేసుకొని ఆ రాత్రి 8-40 గంటల త్రివేండ్రం-మద్రాసు రైల్లో మదురైకు

బయలుదేరాను. రైలు ఒకగంట ఆలస్యంగా, మర్నాడు ఉదయం 10½ గంటలకు మదురై స్టేషనుకు చేరుకున్నది. స్టేషన్ పెద్దది. ప్రయాణీకుల రద్దీ హెచ్చుగానే వుండేది. నేనీదఫా స్టేషన్ విశ్రాంతిగదిలో గాక సమీపాన వున్న కాలేజిహౌస్ అను హోటలులో మకాం పెట్టాను. ఈ హోటలు 97 గదులున్న పెద్ద కట్టడమే. చాలావరకు ఇద్దరు ముగ్గురుండే పెద్దగదులు. చిన్నగదులు కూడా వుండినవి. నేనుండిన 24-వ నంబరు చిన్న గది మేడపైన. దానికి అనుబంధంగా స్నానగదికూడా వున్నది. గది కద్దె రోజుకు 4 రూపాయలు మాత్రమే. మేడక్రింద పెద్ద భోజనశాల వున్నది. భోజనం పూర్తి శాకాహారం. పెరుగుతో కూడిన రెండు పూటలు భోజనం 4 రూపాయలు మాత్రమే. భోజనం బాగుంటుంది. ఇక్కడ టిఫిన్ చౌక. పెద్దదోసె 20 పైసలు. పెద్దగ్లాసుపాలు 20 పైసలు, ఇడ్లీలు రెండిడ్లీల నొకటిగా చేసినంత పెద్దవిగావుంటవి. ఇడ్లీ ఒక్కటికి 10 పైసలు మాత్రమే. హైదరాబాద్ టాజమహాల్‌లోని దోసె, ఇడ్లీ, పాలు రేట్ల కంటె యివి చాలా చౌక.

వెళ్లిన సాయంత్రం పెందలకడనే మీనాక్షిసుందరేశ్వర దేవాలయానికి వెళ్లాను. ఇది నిజంగా గొప్పదేవాలయం. దీనికి నాలుగుదిక్కులా నాలుగు పెద్ద గోపురాలున్నవి. అన్నిటి కంటె పెద్ద గోపురం దక్షిణ గోపురం. దాని ఎత్తు 160 అడుగుల పైచిలుకట. దానిమీది ప్రతిమలు 1,500 లకు మించియుండును. దాని తరువాత కొంత ఎత్తు తక్కువైనా తూర్పు గోపురం 150 అడుగులు పైచిల్కు ఎత్తు కలది. దానిమీంది విగ్రహాలు 1,100 పైచిల్కు అట. పడమటి గోపురం కొంతఎత్తు తక్కువ. ఇంచు మించు అంత ఎత్తుగలది ఉత్తర గోపురం. ఈ ఉత్తర గోపురం మీద ప్రతిమలు తక్కువ సంఖ్యలో వున్నవి. ఈ గోపురాలు నాలిగింటికి, ఒక్కొక్కదానికి 9 అంతస్థు లున్నవి. బొమ్మలు చక్కగా, నైపుణ్యంగా చెక్కినట్టివి. నిర్మించినట్టివి. అంతకు ముందు కొలదికాలంక్రిందనే వేసిన క్రొత్తరంగులతో ఈ గోపురాలు, దేవాలయం మిక్కిలి ఆకర్షణీయంగా వున్నవి. ఈ

పెద్దగోపురాలుగాక, అక్కడక్కడ చిన్నగోపురాలుకూడా వున్నవి. దేవాలయంనిండా పెద్ద, చిన్న విగ్రహాలెన్నో వున్నవి. ఒకచోట మీనాక్షిదేవిని మహేశ్వరుడు సుందరేశ్వరునకు భార్యగా నిచ్చి, మహావిష్ణువు కన్యాదానంచేస్తున్నట్లున్న 3 విగ్రహాలు కలిపి చూపించే 3 రాతివిగ్రహాల ఫలకం నిజంగా మిక్కిలి బాగుగావున్నది. విష్ణువిగ్రహం ఠీవితోను, మీనాక్షి విగ్రహం కొంచెం సిగ్గుతోకూడిన చిరునవ్వుతోను, ఈశ్వరుని విగ్రహం స్తబ్ధంగా, జరుగవలసినది జరుగుచున్నదను ధీమాతో కూడినదిగా కనపడినది. ఈ 3 విగ్రహాలు నిలుచుండినట్లే చెక్కబడినవి. ఏవేవో, ఎన్నెన్నో విగ్రహాలున్నవి. వానిలో ఎక్కువభాగం రెండు విధాలుగా చిత్రించిన పద్మాలు, ఈశ్వరుని చిద్విలాసాలను సూచించే బొమ్మలు, షణ్ముఖుడు, వినాయకుడు మొదలైన బొమ్మలు వున్నవి.

మరునాడు సాయంత్రం కోవెలకు వెళ్లి పూజచేశాను. అమ్మవారి విగ్రహం చిన్నదిగాని, అందమైనదనే చెప్పాలి. మిల మిలలాడే ఆమె వజ్రపు ముక్కుపుడక, ఆమె ఆకారమును సరిగా చూడనీయలేదు. దీపపుకాంతి తక్కువగానున్నది. పూజారికి దైవభక్తి వున్నదో లేదో చెప్పలేనుగాని, డబ్బు ఆశ మాత్రం గట్టిగా వుండినది. అందువలననే అర్చకునకు నరకం తప్పదంటారు. స్వామివారిది లింగాకారమే. మామూలు లింగం కంటె ఎక్కువ తేజస్సుతో వున్నట్లు తట్టలేదు. అయితే స్థలమాహాత్మ్యాన్ని బట్టి, అమ్మవారి చలవను బట్టి, భక్తజనుల విశ్వాసాన్ని బట్టి ఆ జంగమ లింగాకార దేవుడు కూడా జ్వాజ్వల్యమానంగా తోచవచ్చును.

మదురైలో మీనాక్షిఅమ్మవారి దేవాలయం తరువాత చూడవలసిన విశేషం తిరుమలనాయక్ పాలెస్. ఇది గొప్ప కట్టడం. దీని స్తంభాలు బ్రహ్మాండమైనవి. మంచి శిల్పకళా సంపత్తి కలవి. ఈభవనం విస్తృతమైనదేగాక, మిక్కిలి ఎత్తైనది కూడా. దీనినిండా అందమైన శిల్పబొమ్మ లున్నవి. దానిలో న్యాయస్థానాలనుపెట్టి, అక్కడక్కడ దాని ఏశా

కారాన్ని చాలావరకు అడ్డకట్టలతో వేర్వేరు భాగాలుగా విడగొట్టి దాని గొప్పతనాన్ని, అందచందాలను నాశనంచేశారు. ఈ మహాప్రసాదాన్ని ఆర్ట్ గాలరీగాను, వస్తుప్రదర్శనశాల (మ్యూజియమ్) గాను, ఉపయోగించిన మిక్కిలి సమంజసంగా వుంటుంది. ఈఅభిప్రాయం నాకు 1963 లోనే కలిగింది. ఇప్పుడు తమిళనాడుప్రభుత్వం ఆ ఆలోచనకు వచ్చినట్లున్నారు.

మూడవనాడుదయం 3 మైళ్లలో నున్న తరణికులం అను పేరుగల దేవాలయానికి వెళ్ళాను. ఈదేవాలయం ఒక పెద్ద సరస్సునంటి కొలనులో చాలా అందంగా కట్టబడింది. నీరు ఆకుపచ్చగా కనపడినదిగాని, శుభ్రమైనదే అనుకొన్నాను. ఈ తరణికులం ఒక చిన్నఊరు. దీనిచుట్టూతా తమలపాకు తోటలు,కొబ్బరితోపులు వగైరా వృక్షజాలం వున్నది. ఇక్కడ మదురై మీనాక్షి నూలుమిల్లుల ముఖ్యభాగస్థుడు, కుర్తాళంలో టైగర్ ఫాల్స్ నిర్మాత శ్రీ కె. త్యాగరాజమొదలియార్ గారు మూడు కాలేజీలు, ఒక హైస్కూలు ధర్మముగా కట్టించారు. ఒక విద్యార్థి సహాయంతో ఆర్ట్సు కాలేజిని చూచాను. దాని కొక క్రొత్త బిల్డింగును కట్టించుచున్నారు. ఆర్ట్సు కాలేజిగాక తతిమ్మా రెండు, టీచర్సు ట్రెయినింగ్ కాలేజి, ఇంజనీరింగ్ కాలేజి.

తరణికులం నుండి బయలుదేరి వైఘైనదిని దాటి, గోరీపాలెం ఆవరణ నతిక్రమించి మదురైలోని గాంధిమెమోరియల్ హాల్ కు చేరుకొన్నాను. ఈ గాంధిమెమోరియల్ హాల్ అదివరకు రాణి మంగమ్మదేవి తాలూకు భవనమట. బ్రిటిషువారు వారికార్యకలాపాల కుపయోగించేవారట. జాన్ స్టన్ హౌస్ అని పేరు పొందినదట. ఈభవనానికి సెంట్రల్ డోమును నిర్మించి, కొన్ని పార్శ్వ (వింగ్స్) భాగాలను కలిపి, మిక్కిలి అభివృద్ధి పరచి పెద్దభవనంగా తయారుచేశారు. చూచుట కెంతో ఆనందంగాను, చుట్టూ ప్రహరీగోడ కట్టబడిన విశాలమైన ఆవరణ, అనేక పూలమొక్కలు, చెట్లతో నిండి మిక్కిలి ప్రశాంతమైన వాతావరణంతో వున్నది. ఇరుప్రక్కల రెండు ఎత్తైన, దృఢమైన

చక్కని యినుపచువ్వల తలుపుల ద్వారా ఉన్నవి. ఇక్క డొక కుటీరంలో గాంధిమహాత్ము డీ ప్రాంతానికి వచ్చినప్పుడు కొన్నిరోజు లుండినారట. దీనిని 'సేవాగృహం' అంటారు. ఈ గొప్ప భవంతిలో గాంధీజీ జీవితయాత్రల ఘట్టాలు, వారి వివిధ సన్నివేశాలు, రాజకీయ పరిణామాలు, నిరాహారదీక్షలు, సమావేశాలు చూపించే వస్తువులు, ఫోటోగ్రాఫీలు వున్నవి. వారి ఉద్యోగాల సంబంధమైనవి కూడా వున్నవి. ఒకవిశేషం, దక్షిణాఫ్రికా శ్వేతజాతీయు డొకరు కొయ్యతో చేసిన ఒకచేయి, ఒక కాలుగల గాంధీజీబొమ్మ గొప్పగా ప్రేక్షకులను ఆకర్షించు చున్నది. ఈవిశాలమైన ప్రదేశాన్ని, బాగులు తీరిన చెట్లను, గుల్మాలను నేను చూడకపోయినట్లైతే ఈప్రాంతానికి వచ్చిన పురుషార్థంలో 20 శాతం అయినా పోగొట్టుకొనేవాడను.

ఒకనా డుదయం అక్కడి టి. వి. యస్. అండ్ కంపెనీకి వెళ్లాను. అది హెడ్డాఫీసట. అది రైలుస్టేషనుకు మిక్కిలి సమీపంగా, దారిలో వుండిన కాన చప్పున లోపలికి వెళ్లగలిగాను. "ఫియట్ కారు ఖరీ దిప్పు డెంత ?" అనగా "13 వేల 4 వంద లన్నారు. ఇప్పుడు బుక్ చేస్తే 6 సంవత్సరాలకుగానిరా" దన్నారు. అంతవరకు నేను బ్రతికివుంటానా అని అనుకొన్నాను. ఇది 1963-వ సంవత్సరంలో, 10 సంవత్సరాల క్రితం. ఈశ్వరేచ్ఛ. ఇంకను కొన్నిసంవత్సరాలు నేను జీవించవచ్చును.

మరొక ఉదయం, మదురైకు 13 మైళ్లదూరంలోవున్న అలగిరి కోయిల్ కు బస్సులో వెళ్లాను. అలగిరి అనే ఈచిన్నకొండ నానుకొని ఒక దేవాలయ మున్నది. అక్కడకు వెళ్లే సన్నని మార్గం రమణీయంగావున్నది. దానికి రెండుమైళ్ల దూరంలో కొండగుట్ట లున్నచోట తీర్థమని వ్యవహరింపబడే చిన్న జలపాత మున్నదట. నే నెక్కిన బస్సు ఆలస్యంగా బైలుదేరటంవల్లను, అది సరియైన స్థితిలో లేక మిక్కిలి నెమ్మదిగా నడవటంచేతను, తిరిగి వెళ్లే బస్సు బయలుదేరే వ్యవధి తక్కువవటం చేతను, అప్పటికే 11 గంటలవటంచేతను ఆదరాబాదరా గుడిచుట్టూ తిరిగి, లోపలికి

వెళ్లి స్వామివారి దర్శనం చేసుకొని, తిరిగివచ్చి బస్సెక్కి కూర్చున్నాను. గుడి రమ్యమైన ప్రదేశంలో నున్నది. సమీపంలో తీర్థ ముండుట విశేషం. గుడి పెద్దదే. సమీపాన కొండకూడా వున్నది. వెళ్లి చూచి, ఇటువంటిదని తెలుసుకొనటమే సంతృప్తి. ఆ సాయంత్రం తిరిగి మీనాక్షి దేవాలయానికి వెళ్లాను. ఎన్ని సార్లుచూచినా, ఆ గోపురాల శిల్పసంపద విసుగు కలగనీయదు. దేవాలయంప్రక్క (ఆవరణలోనే) సరస్సుకూడా వున్నది. రంగులువేయుటకు అదివరకు మూసియుండిన, ప్రసిద్ధిపొందిన ఆ దేవాలయ వేయిస్తంభాలమండపాన్ని ఆ సాయంత్రం అదృష్ట వశాత్తు దాని కడ్డముగ కట్టబడియుండిన కొన్ని కర్రలను బైటకు ఏ కారణంవలననో తీసియుండినందున, నేనా మండపంలోకి చొరబడి నాలుగుప్రక్కలా చూచాను. మొదటి స్తంభాలమీద పెద్ద విగ్రహాలున్నవి. కొన్నిటిమీద చిన్నవి వున్నవి. కొన్నిటి మీద ఇంచుమించు లేవనే చెప్పాలి. అయితే పూర్తివెలుగు లేకపోవటంవలన కొన్ని స్తంభాలమీది శిల్పాలు నాకు బాగుగా కనిపించకపోవచ్చును. ఆ విగ్రహాల శిల్పం గొప్పదని చెప్పటానికి సందేహించ నవసరంలేదు.

మదురై పట్టణాన్ని విస్తరించి వైఘైనది అవతలి ఒడ్డున క్రొత్త పట్టణం కట్టారు. ప్రాత క్రొత్త పట్టణాలను విడదీసిన వైఘైనదికి విశాలమైన చక్కని వంతెనను కట్టారు. ప్రాత పట్టణంలో మీనాక్షి కోవెల, తిరుమలనాయక్ పాలెస్ తప్ప, ఇతర పెద్దభవనాలు లేవనే తోచింది. క్రొత్తభాగంలో రాజాజి పార్కువంటి పార్కులు సర్క్యూట్ హౌస్, టూరిస్ట్ హోమ్, మెడికల్ కాలేజి, అమెరికన్ కాలేజి, జనరల్ హాస్పిటల్, సెంట్రల్ టెలిగ్రాఫ్ ఆఫీసు, ఇండస్ట్రియల్ ట్రెయినింగ్ సెంటర్, అందమైన పెద్దభవనాలు గాంధీమెమోరియల్ అండ్ మ్యూజియమ్‌తోబాటు ఉన్నవి.

మదురై తమిళుల అతి ప్రాచీనమైన విజ్ఞాన, సాంస్కృతిక కేంద్రం. కన్నియప్పన్, దేవకి విషాదసంఘటనలవంటి

వానికి స్థానం. శైవసిద్ధాంతానికి, ప్రాచీన విజ్ఞాన, సాంస్కృతిక సంగం సమావేశాలకు మూలస్థానం. ఆ ప్రాంతం తమిళులు పిళ్లైలుగా వ్యవహరింపబడుచు, ఉత్తమ వెల్లాళ మొదలియార్‌ల మనుచున్నారు. కాదనటానికి నా కెట్టి అర్హత లేదు. కాని, అక్కడి విశేష మొకటి నాకు వింతను కలిగించింది. బహుళ ప్రజాదరణపొంది, తమిళజాతీయుల గొప్పసాత్త్వులుగా ఎంచ బడుచున్న వ్యక్తులు మంగమ్మదేవి, కట్టబొమ్మన్, తిరుమల నాయక్ తెలుగువారే. తిరుమలనాయక్ విగ్రహం ఆయన దేవేరులతో కోయిల్ మధ్యప్రాంగణాలలో నెలకొల్పబడి యున్నది. కట్టబొమ్మన్ వీరవిగ్రహం ఝుళిపించే పెద్దకత్తి, బిగించి పట్టుకొన్న డాలుతో ఒక పార్కులో నెలకొల్పబడి కేంద్రబస్సులస్టేషనును ఆనుకొనియున్నది. రైల్వేస్టేషన్ కెదురుగావున్న బ్రహ్మాండమైన సత్రం మంగమ్మరాణి పేరుతో వున్నది. మంగమ్మ సత్రాన్నే టౌన్‌హాలుగా కూడా ఉపయోగించు కొనటంకలదు. వేరే టౌన్‌హాలు ఈ పెద్దపట్టణంలో లేదని గుర్తు.

22-8-1963-వ తారీఖున మధ్యాహ్నం 1-45కు బయలుదేరి మండపంమీదుగా రామేశ్వరం వెళ్లి, అక్కడకు రాత్రి 8 గంటలకు చేరి, రైల్వేస్టేషన్ విశ్రాంతిభవనంలో దిగాను. ఈ విశ్రాంతి భవనం రైలుస్టేషన్ పైభాగంలోగాని, అనుకొనిగాని యుండక కొంచెం దూరంలో వున్నది. 5 మంది వుండటానికి మాత్రమే సరిపడు 3 సింగిల్‌రూమ్స్, ఒక డబుల్‌రూము వున్నవి. త్రివేంద్రంలోవలెనే ఇక్కడకూడా రోజుకు 5 రూపాయలు అద్దె. ఉదయం టిఫిన్ తర్వాత స్టేషన్‌కు మైలుదూరంలోవున్న రామ నాథస్వామికోయిల్‌కు వెళ్లాను. దేవాలయ తూర్పు గోపురం ఇసుకరాతితో కట్టబడి అందముగా వున్నది. అయితే, దానిమీది ప్రతిమలు రంగుపోయినందున కాబోలు, అందంగా కనపడలేదు. దాని పడమర గోపురం అందవిహీనమైన రంగుతో, చూచుటకు వికారంగా వుండినది. ఈదేవాలయానికి ఈ రెండే ద్వార గోపురాలు. దేవాలయం పెద్దదేగాని, చిదంబరం నటరాజస్వామి

దేవాలయం, మదురై మీనాక్షీ దేవాలయం, అరుణాచల దేవాలయాల కంటె చిన్నది. కాని, దాని నడవలు పేరుపొందినట్లు గొప్పవే. అందులో ఒకటి మిక్కిలి పొడుగుగాను, విశాలంగాను, మిక్కిలి సొగసుగాను వున్నది. నే నక్కడకు వెళ్ళిన ఆగష్టు 23-వ తేది, వినాయకచవితిరోజు. అందువల్ల రామనాథస్వామికి, పార్వతిఅమ్మవారికి పూజలు జరిపిన తర్వాత, దేవాలయప్రాంగణంలోనుండిన ప్రత్యేక గణపతిగుడిలో అగ్నిహోత్ర సహితంగా, వేదోక్తప్రకారం జరిగిన పూజకు హాజరైనాను. ఆ పూజ శ్రద్ధాభక్తులతో, ఆవేశపూరితంగా గొప్పగా జరిగినది. ఆ పూజను చూచు భాగ్యం కలిగిందని సంతోషిస్తూ పూజాద్రవ్యాలను, దక్షిణను ఇచ్చి తృప్తిపొందాను. పూజానంతరం గణపతిని బంగారుమలామ్‌తో అమర్చబడిన మూషికవాహనంమీద ఊరేగించారు. ఇక్కడ గణపతికి ఎలుక వాహనంతోబాటు, సింహవాహనంకూడా వున్నదట.

మధ్యాహ్నం రామఝరూక అనే గంధమాదన పర్వతానికి 1¼ మైళ్లదూరం నడచివెళ్ళాను. పర్వతమని పేరేగాని అది ఒక చిన్నగుట్ట. రావణ వధానంతరం శ్రీరాముడు సీతాసమేతంగా లంకనుండి తిరిగివెళ్లుచూ, యిక్కడ విశ్రమించాడని పూజారి చెప్పినాడు. గుట్టమీదవున్న చిన్నదేవాలయంలో రాతిలోచెక్కిన రెండు పాదా లున్నవి. అవి శ్రీరాముని పాదచిహ్నాలట. "శ్రీరాముడు పుష్పకవిమానం మీద వెళ్లాడుకదా! ధనుష్కోటికి రామేశ్వరం మిక్కిలి దగ్గరగా నుండగా, ఇక్కడ విమానం దిగి విశ్రమించవలసిన అవసర మేమి కలిగింది?"దని పూజారిని ప్రశ్నించాను. ఆయన ఈ ఉదంతం స్కాంద పురాణంలో వున్నదనిమాత్రం చెప్పగలిగాడు. అక్కడకు వచ్చిన వా రొకరు, "శ్రీరాముడు సీతను వెదకుచూ, సముద్రానికి చేర్చుకొనే ముందు ఇక్కడ విశ్రమించి యుండవచ్చు"నని అన్నాడు. ఇది సమంజసమనే నాకు తోచింది. ఒకవేళ రాము డక్కడ ఆగినట్లైతే, రామఝరూకకు వెళ్లే త్రోవ క్రమేణా ఎత్తైన ప్రదేశానికి

ఎక్కుచున్న ట్లనిపించింది. ఆ పీఠభూమికంటె, గంధమాదనమనే గుట్ట కొంచెం ఎత్తులోమాత్రమే వున్నది. అక్కడకు నడచి వెళ్లటం ఉల్లాసకరంగానే వుండినది. త్రోవలో 2, 3 చోట్ల చిన్నఆకులతో పైన కప్పిన చిన్నయిండ్లు, గుడిసెలు, 1, 2 చిన్నకట్టడాలు, ఒక చిన్నదేవాలయం వున్నవి.

రామేశ్వరం ఒక పెద్ద గ్రామం వంటిది, పట్టణం అని చెప్పవలసివస్తే, గుడివాడతాలూకా పామర్రువంటి చిన్నపట్టణం అని చెప్పాలి. శుభ్రమైనది కాదు, అందమైనది కాదు. రెండు, మూడు సుమారైన కట్టడాలుతప్ప చెప్పుకోతగ్గ బిల్డిగ్స్‌లేవు. విశ్రాంతికొరకు దేవాలయంవారి ఇల్లొకటున్నదన్నారు గాని, నా కది కనపడనేలేదు. రైల్వేస్టేషన్‌కు అనుబంధముగా ప్రత్యేక బిల్డింగులో వున్న భోజనశాలగాక, మీనాక్షీభవనం అనుపేరుతో వూరిలో దేవాలయానికి సమీపంగా చిన్న హోటలున్నది. రైల్వేభోజనశాలకంటె ఇది మరీ అధ్వాన్నమనుకున్నాను. రైల్వేభోజనహోటల్‌లో ఉపాహారం మిక్కిలి అధ్వాన్నం. పెరుగు, మజ్జిగలేని భోజనం. రాత్రి యిచ్చిన పూరీలు బిగుసుకుపోయి అరుచిగా వుండినవి. పాలు సగం నీళ్లే. అయితే ఒకటి చెప్పాలి. ఊరిలోని మీనాక్షీహోటల్ అశుభ్రంగా వున్నా, అక్కడ తీసుకొన్న దోసె, చపాతి ఆ రైల్వేభోజనశాలలో యిచ్చేవానికంటె మెరుగే. మరిన్ని ఊళ్లోను, దేవాలయానికిరుప్రక్కలా, సముద్రతీరాన ఎండుచేపల ఘాటైనకంపు. పైగా దేవాలయాన్ని ఇంచుమించు ఆనుకొనియున్న సముద్రతీరమంతా ఒక బైలుదొడ్డిగా తయారైయుండినది. యాత్రికులు స్నానం చేసే రేవుకు అనతిదూరంలోని ప్రదేశమంతా, స్నానఘట్టానికి ముందున్న సీతామహాలక్ష్మి గుడినానుకొని అంతా పాయిఖానా. స్నానంచేసేప్రదేశం మిక్కిలి మురికిగాను, అసహ్యంగా నుండినది. నా కక్కడ స్నానంచేయ బుద్ధిపుట్టలేదు. దేవాలయములో స్నానంచేయుటకు 5, 6 మంచినీళ్ల తీర్థాలున్నవటగాని, నావంటివాళ్లు స్నానంచేయుటకు అనుకూలమైనవిగావు అనుకొన్నాను. నాకంటి కగపడింది, దేవాలయ కట్టడాల అంతర్భాగంలో ఒకచోట చిన్న నూయివంటిదానినుండి ఒక చిన్న

బకెట్‌తో తోడుకొని నూతిచుట్టూవున్న రాళ్ల మిట్టపల్లాల మధ్య ఒక యాత్రికుడు స్నానంచేయటం.

మర్నా డుదయం 6 గంటల రైలులో 7 మైళ్లదూరంలో ఉన్న పంబన్‌కు వెళ్లి, అక్కడి నుండి ధనుష్కోటికి వెళ్లే రైలెక్కి 8½ గంటలకల్లా ధనుష్కోటి చేరుకొన్నాను. నాపెట్టెలో ధనుష్కోటిలో నుండుచుండిన డా. పంచనాథన్ ప్రయాణించాడు. రైలుస్టేషన్‌వద్దనున్నవా రింట్లో నాసంచిని పెట్టి, కట్టుపంచెతో ఒక అంగవస్త్రాన్ని, ఒక తుండుగుడ్డను తీసుకొని సుమారు 1½ మైళ్లదూరంలోవున్న సముద్రతీరానికి నడచివెళ్ళాను. సముద్ర మిక్కడ లోతులేకుండా పరిశుభ్రంగా ఉన్నది. నీరు మిక్కిలి తేటగా, స్వచ్ఛంగా వున్నది. స్నానం మిక్కిలి సుఖప్రదంగాను, హాయినికొల్పేదిగాను, సంతోషకరంగాను ఉండినది. ఇక్కడనే సేతుబంధనమట. బంధనం జాడ నాకు కనపడలేదు. దూరాన నీళ్లలో అణగివున్నదేమో. స్నానంచేసేచోట పురోహితు లున్నారు. ఒక తెలుగు పురోహితుడు వచ్చి అడుగగా "డబ్బు తీసుకొని రాలేదు, దక్షిణలేనిదే మంత్రం, తీర్థం ఉండదుకదా" అన్నాను. వెళ్లిపోయాడు. స్నానానంతరం డాక్టరు ఇంటికి చేరి, అక్కడ మంచినీటిస్నానం చేసి, బట్టలువేసుకొని, రైల్వే రెస్టారెంటులో భోజనంచేసి రామేశ్వరం ముఖంపట్టాను. డాక్టరు పంచనాథన్ మద్రాసువాడట. ఆయన కొన్ని సంవత్సరాలు మద్రాసు కార్పొరేషన్‌లో పనిచేశాడట. తనకు షెనాయ్‌నగర్‌లో సి సైపు స్వంతగృహము ఉన్నదని, క్రింది భాగాన్ని నెలకు వందరూపాయలకు అద్దె కిచ్చానని చెప్పాడు. ధనుష్కోటిలో వంటరిగా వుంటూండినాడు. షెనాయ్‌నగర్ ఇంటి పై భాగంలో తన భార్య, పిల్లలు కాపురమట. "ఈ నెలాఖరుకు కూతురు పెళ్లిచేయాలి, 10 వేలు ఖర్చు అవుతుంది, మీ రొక వెయ్యి రూపాయలు అప్పివ్వం" డన్నాడు. "మా పెద్దబ్బాయి రాధాకృష్ణతో ఆలోచించి చెప్తాతా" నన్నాను.

ధనుష్కోటి ఒక చిన్నపల్లె. అక్కడ రైల్వే కాలని, స్టేషన్‌కు ప్రక్కగా పల్లెకారుల గుడిసెలు తప్ప మరేమీ లేవు. తిరుగు రైలెక్కి రామేశ్వరానికి మధ్యాహ్నం 2 గంటలకు చేరి.

తిరిగి తలారా స్నానంచేసి, కొంత విశ్రమించి షుమారు ఆరు గంటలకు బయలుదేరి కోవెల సమీపం బజారుకు వెళ్లి, శంఖంవంటి వానిని కొని, మీనాక్షీ హోటల్ లో చపాతి, దోసె తిని, గదికి చేరి, సామాను సర్దుకొని నిద్ర కుపక్రమించాను. ఆ మర్నా డుదయం 6 గంటలకే మదురైకు వెళ్లే రైలు వెళ్లుతుందికాబట్టి. దానిని తప్పకుండా అందుకోవాలని అప్పుడప్పుడు లేచి చూడటంవల్ల నిద్ర సరిగా పట్టలేదు. కాలకృత్యాలు తీర్చుకొని 5½ గంటలకు సామానుతో స్టేషన్ కు చేరుకొని, ఆ రైలెక్కి మధ్యాహ్నం ఒంటిగంటకు మదురై స్టేషన్ కుచేరి, స్టేషన్ భోజనశాలలో భోజనం చేసి, ప్రయాణీకుల గదిలో కాలక్షేపంచేసి సాయంత్రం 6½ గంటలకు బయలుదేరే త్రివేంద్రం - మద్రాసు ఎక్స్ ప్రెస్ ఎక్కాను. మర్నా డుదయం అనగా ఆగస్టు 26-వ తేది ఉదయం ఎగ్మూర్ స్టేషనులో దిగాను. పెద్ద కుమారుడు రాధాకృష్ణవచ్చి షెనాయ్ నగర్ లోని మా యింటికి తీసుకొనివెళ్లాడు. ఇంతటితో నా 1963-వ సంవత్సరం దక్షిణదేశయాత్ర ముగిసింది.

నేను 1966 లో కుర్తాళంయాత్ర ముగించుకొని 22 ఆగస్టు మధ్యాహ్నం ఆ ప్రదేశాన్ని విడిచిపెట్టినప్పుడు, ఆ మధ్యాహ్నం త్రివేంద్రంమెయిల్ లో బయలుదేరి, ఆ మర్నాడు అనగా 23-వ తారీఖు ఉదయం సుమారు 8 గంటలకు ఎగ్మూర్ స్టేషన్ కు చేరుకొన్నాను. నా అల్లుడు శ్రీ వి. ఎ. ప్రసాద్ నన్ను స్టేషన్ లో కలసికొని, కాస్మోపాలిటన్ క్లబ్బు మొఫిసల్ క్వార్టర్సుకు తీసుకొని వెళ్లాడు. షెనాయ్ నగర్ లోని మా 155-వ నంబరుగల ఇల్లు "రంగవిలాస్" మరమ్మతులో వుండినది. ఆ యింటికి సమీపంలో నా కుమార్తె, అల్లుడు నివసించుచున్న ఇంటిలో కాలకృత్యాలుతీర్చుకొనటానికి నా కనువైన యూరపియన్ పద్ధతి కమోడ్ లేదు. పైగా, కాస్మోపాలిటన్ లో కొన్నినాళ్లుంటే ఎలా వుంటుందో అను అభిప్రాయంకూడా వుండింది. అందువల్ల ఆ క్లబ్బులో బయటనుండి వచ్చేవా రుండుటకు ఏర్పరచబడ్డ గదులలో నొకదానిలో (గది నెంబరు 16) చేరాను. ఈగది ప్రాతకాలం

దైనా విశాలమైనది. కమోడ్, దోమతెర మొదలైన అవసరమైన (ఫిట్టింగ్స్) పరికరాలతో సమకూర్చబడినది. వేరే క్రొత్తగా కట్టబడిన కొన్నిగదులు చూచుటకి గదికంటె సౌఖ్యప్రదమైనవిగా కనపడినా, ఈగది నా కనుకూలంగా కనపడింది. క్లబ్బువారిచ్చిన టిఫిన్, భోజనం కూడా అనుకూలంగానే వుండినవి. అక్కడ 5-9-1966 ఉదయంవరకున్నాను. ఆ ఉదయం కాస్మోపాలిటన్ క్లబ్బును విడిచిపెట్టి, రాధాకృష్ణకారులో మా మైనాయ్‌నగర్ యింటికి వెళ్లాం. ఉపాహారంతర్వాత మద్రాసుకు వచ్చియుండి, తంబుచెట్టివీధిలోని హరివిలాస్ హోటల్‌లో మకాంపెట్టిన శ్రీ కానుమిల్లి పట్టాభిరామయ్యగారిని కలుసుకొని, ఆయనను మా యింటికి, పిమ్మట పాప (కుమార్తె కమలకుమారి) ఇంటికి తీసుకొనివెళ్లి, అక్కడ మిక్కిలి తృప్తికరమైన విందారగించాం. ఆ రాత్రి 9 గంటల తర్వాత బయలుదేరే బెంగుళూరు మెయిల్‌లో బెంగుళూరుకు బయలుదేరి వెళ్లాను.

బెంగుళూరు: 1966 సెప్టెంబర్ 6-వ తారీఖు ఉదయం బెంగుళూరుచేరి, సంపంగిచెరువు సమీపంలోవున్న మద్రాసు ఉడ్‌లాండ్స్ హోటల్ 10-వ నంబరు గదిలో చేరాను. రోజుకు అద్దె (14 రూపాయలు) హెచ్చైనా అది విశాలమైన, సుఖప్రదమైన గది. యూరపియన్‌పద్ధతి కమోడ్, టెలిఫోన్, దోమతెర, డ్రస్సింగ్ టేబుల్, తోలుతో కప్పబడిన కుర్చీలు, రత్నకంబళులు, వ్రాసుకొనే బల్ల, బట్టలబీరువా మొదలైనవి కలిగి, ఆ గది మిక్కిలి ఆకర్షణీయంగా, సౌభాగ్యవంతంగా వుండినది.

సంపంగి రామయ్య అనే వారెప్పుడో ఆ చెరువును త్రవ్వించారట. దాని గట్టుక్రింద సంపంగిరామయ్యనగర్ అనే అతి చిన్నపట్టణం వెలిసింది. ఇళ్లను 4, 5 గజాల క్రిందిభాగంలో కట్టారు. ఆ కట్టిన భూభాగం ఇళ్లు కట్టినమేరకు సమతలమే. ఈ చెరువు ప్రదేశమే ఎత్తు. మద్రాసు ఉడ్‌లాండ్స్‌హోటలు చెరువుతో సమాన ఉపరితలం మీదనే వున్నది. ఈ హోటలున

కనతిదూరంలో విశాలమైన, ప్రఖ్యాతి వహించిన కబ్బన్ పార్కున్నది. ఇంకొకప్రక్కగా బెంగుళూరు క్లబ్బు మొదలైన కొన్ని ముఖ్యభవనా లుండిన రిచ్ మండ్ రోడ్డు. మలుపు తిరిగితే సెంట్ మార్క్సు రోడ్డు, దాని ననుసరించి మలుపు తిరిగి కొంత దూరంపోగా ఇప్పుడు మహాత్మాగాంధి రోడ్ అని పిలువబడే ప్రఖ్యాత సౌత్ పేరేడ్ రోడ్డు మొదలైనవి వస్తవి. కబ్బన్ పార్కు మిక్కిలి విశాలమై, పచ్చికబయళ్లతో, వృక్షసంతతుల వరుసలతో, రమ్యోద్యాన వనాలతో నిండియున్న దేశాక, అందులో మిక్కిలి ముఖ్యమైన విధానసభ, హైకోర్టు, కేంద్ర లైబ్రరీ మొదలైన భవనా లున్నవి. పిల్ల లాడుకొను ప్రాంతం, పెద్దలు టెన్నిస్ వంటి ఆటలాడుకొను ప్రదేశం వున్నవి. షికారు తిరుగుటకు చక్కని మార్గాలున్నవి, మోటారు వాహనాలు తిరుగుటకు చప్టాచేసిన రోడ్లున్నవి. మరిన్ని, మంచి ఫలహారాల నిచ్చే కాంటీన్ వున్నది. నే నుదయం వెళ్లినా, వెళ్లకపోయినా సాయంత్రం 4 గంటలకు బయలుదేరి, కబ్బన్ పార్కుకు వెళ్లి విహరిస్తూండేవాడను. ఉదయంపూట బైటికి వెళ్లినప్పుడు సౌత్ పేరేడ్ ప్రాంతాలకు వెళ్లుచూండేవాడను. సౌత్ పేరేడ్ ప్రాంతం మిక్కిలి ఆకర్షణీయంగా వుంటుంది. ఆ వీథికి ఒక ప్రక్కన విశాలమైన పచ్చికబయ లున్నది. రెండో ప్రక్క మైసూర్ ప్రభుత్వం చేతిపనుల ఎంపోరియం, పెద్దపుస్తకాల విక్రయశాలలు, మోటారు సంబంధమైన షాపులు మొదలైనవి వున్నవి. దానినుండి లోపలకుపోయే బ్రిగేడియర్ రోడ్డు వంటివి కొన్ని ముఖ్యమైన వీధు లున్నవి. ఈ వీధులలో రకరకాల వస్తువుల నమ్మే షాపు లున్నవి. అక్కడనుండి కొంతదూరం పోగా సుప్రసిద్ధ రసెల్ మార్కెట్టు, కమర్షియల్ స్ట్రీటు వంటివి వస్తవి. నాకు బెంగుళూరు క్రొత్తకాదు. నేను 1936లో అనంతపూర్ జిల్లా ఇన్‌కమ్‌టాక్సు ఆఫీసర్‌గా అనంతపూర్‌లో నివసించుచుండినప్పుడు, హిందూపూర్ క్యాంపుకు వెళ్లుచుండే వాడను. హిందూపూర్‌కు 7 మైళ్లదూరంలోవున్న గోరీబిదనూర్ మైసూర్ రాష్ట్ర సరిహద్దు. హిందూపూర్ నుండి బెంగుళూరుకు దూరం 67 మైళ్లు మాత్రమే. అందువలన హిందూపూర్

క్యాంపునుండి నేను 1936 సెప్టెంబర్ లో మొదటిసారి బెంగుళూరుకు వెళ్లాను. అప్పుడా నగరం పుష్పించిన చెట్లతో, పరిశుభ్రమైన వీథులతో, పచ్చికబయళ్లతో, హాయినిగొల్పే వాతావరణంతో నన్ను మిక్కిలి ఆకర్షించింది. నేను అనంతపురంలో వుండిన 3 సంవత్సరాల పైచిలుకు కాలంలో కొన్నిసార్లైనా బెంగుళూరుకు వెళ్లియుంటాను. మరిన్ని, 1950-51 లో మైసూరు రాష్ట్రం ఇన్ కమ్ టాక్స్ అప్పీలు కేసులను విచారించవలసివచ్చినప్పుడు 3, 4 దఫాలైనా ఉద్యోగరీత్యా అక్కడకు వెళ్లియుంటాను. ఉద్యోగ విరమణానంతరంకూడా, 1966 కు పూర్వం రెండుసార్లైనా వెళ్లి వుంటాను. మరిన్ని, 1959 లో జరిగిన అఖిల భారత పశు ప్రదర్శనానికి డెలిగేట్ గా వెళ్లియుండినాను. అందువల్ల నా కొక విధంగా బెంగుళూరుసిటీ ఏరియా, కంటోన్మెంట్ ఏరియా తెలిసియే యుండినవి.

నేను అనంతపూరునుండి బెంగుళూరుకు వెళ్లుచుండిన రోజులలో రసెల్ మార్కెట్టు, కమర్షియల్ స్ట్రీటు మిక్కిలి ఉన్నత దశలో నుండినవి. మన దేశంలో బ్రిటిష్ వారు పరిపాలన సాగించుచున్నరోజులవి గనుక, చిరకాలమునుండి నివసించుచుండిన వివిధ అంతస్థులుగల ఆంగ్లో-ఇండియన్లేగాక, తమ కార్యకలాపాలనుండి విరమించుకొని బెంగుళూరులో స్థిరపడిన యూరోపియన్లు, వచ్చిపోతూండే యూరోపియన్లు ఎక్కువగానే వుండేవారు. ఆంగ్లో-ఇండియన్లకు, యూరోపియన్లకు అనువైన గృహోపకరణాలు, వస్త్రాలు, ఇతర జీవితావసరాలు, జీవిత సౌఖ్య, భోగ పరాయణత కనువైన వస్తువులు ముఖ్యముగా ఈ మార్కెట్టు, ఈ వీధిలో దండిగా దొరికేవి, చౌకగానూ దొరికేవి. నేను రసెల్ మార్కెట్టులో భోజనంచేయునప్పు డుపయోగించే మేలైన పింగాణీ ప్లేట్సు, కత్తులు, ఫోర్క్సు మొదలైనవేగాక, కట్ గ్లాస్ అనే రకం మంచినీళ్ల గ్లాసులు, ఇతర రకమైన గ్లాసులు కొని యుంటిని. కమ్మర్షియల్ వీధిలో ఏవేవో కొనియుంటానుగాని, మాసినబట్టలు వుంచటానికి, బూట్సు, చెప్పులు మొదలైనవాని

నుంచటానికి రెండు గట్టి కాన్వాస్‌తో చేయబడి, పై అంచులు, తాళంవేసే కొక్కాలు, ఇత్తడితో అమర్చబడిన సంచులను ప్రత్యేకించి పేర్కొనాలి. 1966 లో వెళ్లినప్పుడు వాని వ్యాపారం చాలా క్షీణించియుండినది. తిరిగి 1972 మే లో వెళ్లినప్పుడు వాని రూపమే మారిపోయినట్లున్నది. అపూర్వ వైభవం, సౌభాగ్యం తుడిచిపెట్టుకొని పోవటమేగాక, బీదతన మావరించి నట్లున్నవి.

బెంగుళూరులో నాకు బాగా తెలిసియుండిన వారు ముగ్గురు, నల్గు రుండినారు. ఒకరు, ఆడిటరు శ్రీ పర్వతనేని సాంబయ్యగారు. ఆయన మద్రాసులో ప్రఖ్యాతివహించిన ఆడిటర్స్ బ్రహ్మయ్య అండ్ కంపెనీవారి బెంగుళూరు బ్రాంచి ముఖ్య భాగస్థులు. 1966 కు ముందే, వారి కుమారుడు శ్రీ వీర భద్రరావుకు నా పెదతండ్రి కుమారుడు లింగం వెంకట కృష్ణయ్య పెద్ద కొడుకు సుబ్బారావు కుమార్తె నిచ్చి వివాహంచేసియుండి నారు. రెండవవారు, నా కదివరకే తెలిసియుండిన శ్రీ కె. యమ్. పట్టాభిగారు. వీరు ఇన్‌కమ్‌టాక్స్ ఆఫీసరుగా పనిచేసి ఉద్యోగ విరమణచేసి యుండినారు. మూడవవారు, నేను మద్రాసులో శి-వ ఇన్‌కమ్‌టాక్స్ సర్కిల్‌కు ఆఫీసరుగా పనిజేస్తున్నప్పుడు నా ఇన్‌స్పెక్టరుగా కొంతకాలం పనిచేసిన యస్. (రోజ్) కృష్ణ మూర్తిగారు. వారు బెంగుళూరు శాఖలో ఇన్‌కమ్‌టాక్స్ ఆఫీసరు ఉద్యోగంచేసి, పింఛను పుచ్చుకొనుచు, బెంగుళూరు రాజాజీ నగర్‌లో సొంత యిల్లు కట్టుకొని ఉంటున్నారు. నాలుగవ వారు, పి. అబ్దుల్ ఖాదర్ అనేవారు. వారు మొదట కొద్దిస్థాయిలో జీవిత మారంభించి, కొన్ని బస్సులను నడపి, రెండవ ప్రపంచ యుద్ధంలో విస్తృతంగా మిలిటరీ కంట్రాక్టులను చేసి ధనవంతు లైనారు. వారి నదివరకు మద్రాసులోను, ఇతరచోట్లను కలసి కొన్నాను. మరిన్ని, 1950-51 లో బెంగుళూరుకు ఉద్యోగరీత్యా వెళ్లినప్పుడు కలసికొనుట తటస్థించింది. ఒక అయ్యంగారితో కలసి, వారు బెంగుళూరులోని నరసింగరాజు వీధిలో రిలయబుల్ మోటారుస్టోర్స్ అనుపేరుతో ఒకదాని ప్రక్క మరొక టుండే

రెండు పెద్దకొట్లను నడిపేవారు. కాని 1966-వ సంవత్సరానికి ఆ కొట్లలోని తన భాగాన్ని కొంతవరకు కోల్పోయినట్లున్నది. వ్యాధిగ్రస్థులై యింటివద్దనే కాలం గడుపు చుండినారు. ప్రాత స్నేహాభిమానాన్ని బట్టి, బసవన్నగుడి సబర్బులో మహమ్మదీయ కాలనీలోని వా రింటికి వెళ్లి చూచివచ్చాను. తరువాత 1972 లో నేను తిరిగి బెంగుళూరుకు వెళ్లినప్పుడు వారు 2, 3 సంవత్సరములక్రితమే మరణించినట్లు తెలిసింది. వారి ఏకైక కుమారుడు ఇక్‌బల్ అనే నామధేయుడు, బెంగుళూరు విడిచి మద్రాసులో కాపురం పెట్టాడట. ఆ యువకుని తల్లి తన కూతురుతో ఆ యింటిలోనే వుండుచుండినదట. నా మనసు పట్ట లేక నేను నరసింగరాజు రోడ్డుకు వెళ్లాను. హాలుల వంటి విశాలమైన ఆ రెండు గదులలో సమృద్ధిగా నిండియుండిన మోటారు సామానులు లేవు. అబ్దుల్ ఖాదర్‌గారు పోషించి వృద్ధిలోకి తెచ్చిన చిన్నభాగస్వామి అయ్యంగారు విడిచిపెట్టి వెళ్లిపోయి వేరే పెద్దవ్యాపారం పెట్టుకొన్నాడట. ఆ ప్రాతకొట్ల సమీపంలో ఒక చిన్నకొట్టులో మిక్కిలి కొద్దిసామానుతో ఒక యువకు డుండినాడు. నేను ఫలానా అని చెప్పి, "మీ రెవ ?"రని అడుగగా, "అబ్దుల్ ఖాదర్‌గారి అల్లుడ"నని చెప్పాడు. "ఆ పెద్దవ్యాపారమే మైన"దని అడుగగా సంగతి సందర్భాలు చెప్పి "ఈకొద్ది సామానుతో ఆ పేరుతో వ్యాపారం నడిపిస్తున్నాను. ఇందులోని సామానులో చాలాభాగం ప్రాతరకంవి. చప్పున అమ్ముడుపోవు" అని చెప్పాడు. దిగులుపడిన మనస్సుతో వచ్చివేశాను. కీర్తిశేషులైన అబ్దుల్ ఖాదర్‌గారు సహజంగా ధీరచిత్తం కలవారు. వ్యాపారి మన స్తత్త్వం కలవాడైనా, స్నేహశీలుడు. సమర్థతతోబాటు చాకచక్యం, ఇంగితజ్ఞత కలవాడు, సంపాదనచేయు నిపుణతతోబాటు దానధర్మాలుచేయు స్వభావం గలవాడు. అవసరంకలిగినప్పుడు హెచ్చుగా ఖర్చుపెట్టటానికి సందేహించేవాడుకాదు. ఆయన చిత్తూరు జిల్లా మదనపల్లికి సమీపగ్రామానికి చెందినవాడు. తురకం, అరవం, కన్నడం, ఇంగ్లీషు మాట్లాడకలిగినా, చక్కగా

తెలుగు మాట్లాడే మహమ్మదీయుడు. చనిపోవునప్పటికి ఆయన వయస్సు 60, 65 కు మించి వుండదు. ఆయన మృతి నాకు కొంత బాధను కలిగించింది.

శ్రీ పర్వతనేని సాంబయ్యను కలసికోనటం, వారి ఆఫీసుకు, ఇంటికి వెళ్లటం, నాతమ్ముని మనుమరాలిని చూడటం మామూలుగా జరిగిపోయాయి.

శ్రీ కె. యమ్. పట్టాభిగారు సజ్జనుడు, స్నేహశీలుడేగాక, మర్యాద మన్ననల నెరిగిన పెద్దమనిషేగాక మిక్కిలి అభిమానం చూపించే వ్యక్తి. నావద్ద ఉద్యోగరీత్యా పనిచేసిఉండక పోయినా, నన్నదివరకు కలసికొన్నది ఏ 3, 4 సార్లో అయినా, నేను తన ఇన్‌కమ్‌టాక్స్ డిపార్టుమెంట్‌లో పెద్దస్థాయి ఉద్యోగం చేసినవాడ నని, ఇప్పటికిని మిక్కిలి అభిమానించుచున్నాడు. నేను 1966 లో అక్కడకు వెళ్లియుండిన రెండవ రోజున వచ్చి హోటలులో నన్ను కలుసుకొన్నాడు. అంతకుముందే తన ఏకైకపుత్రుని వివాహం చేశాడట. ఆసందర్భముగా వెంటనే వచ్చి కలసికొనలేక పోయినానని చెప్పాడు. పెళ్లి సంబంధమైన తినుబండారాలను తీపివేగాక, మురుకులవంటి కారం పదార్థాలను కూడా తెచ్చియిచ్చాడు. నేను వారింటికి వెళ్లి సౌశీల్యవతి, సౌజన్యవతి, మిక్కిలి మర్యాద మన్నన లెరిగిన వారి సతీమణిని దర్శించాను. జర్మనీలో జర్మన్ భాషను నేర్చుకొని, బెంగుళూరు లోని ఒక కళాశాలలో జర్మన్ భాషను బోధించుచున్న ప్రభాకర్ అనే వారి కుమారుడు, విద్యావతియైన ప్రమీల అనే వారి కోడలు నా బసకువచ్చి, నా పరిచయం చేసుకొని వెళ్లారు. తర్వాత నేను వారింటికి వెళ్లి సంతృప్తికరమైన భోజనంచేశాను.

యస్. (రోజ్) కృష్ణమూర్తిగారు వచ్చి, కలసికొని ఒకనా డుదయం రాజాజీ నగర్‌లోని వారింటికి తీసుకొని వెళ్లారు. కృష్ణమూర్తి తెల్లగా, అందంగా వుంటాడు. ఆయన తెలగాణ్య శాఖ బ్రాహ్మణుడు. తెలుగువాడని వేరే చెప్పనక్కరలేదు. ఆయన భార్య సామాన్య రూపవతి. అందువల్లకాబోలు ఆయన

నలుగు రైదుగురు సంతానానికి మధ్యరకం రంగు, అందం వచ్చాయి. అయితే వారి కడగొట్టు బిడ్డ కృష్ణవేణి అను పేరుగల అమ్మాయి 1966 లో 11, 12 ఏండ్ల చిన్నపిల్ల. చాలా చలాకీగా, అందంగా, ముచ్చటగా ఉండేది.

1966 లో ఇద్దరు క్రొత్తవారితో పరిచయమయింది. ఒకరు, బసవన్నగుడి సమీపాన రామమందిర్ రోడ్డులో నివసించు చుండిన డాక్టరు జి. థామస్‌గారు. వారి విషయం నాకు చెప్పిన వారు, వారికి వుత్తరం వ్రాసి వారికి నన్నెరిగించినవారు శ్రీ సంజీవ దేవ్‌గారు. డాక్టర్ థామస్‌గారు వైద్యవృత్తి నవలంబించి కొనసాగించుచుండినా వారు ఫోటోగ్రఫీలో ఆరితేరిన చెయ్యి. వారికి ఫోటోగ్రఫీలో అంతర్జాతీయప్రఖ్యాతి వున్నది. వారు ప్రకృతిరామణీయకాలను ఫోటోలలోకి అనువదించటంలో సిద్ధహస్తులు. మిక్కిలి మర్యాదతో నన్నాహ్వానించారు. వారి భార్యాగారు కూడా డాక్టరే. ఆమె సౌజన్యం, సౌహార్ద్రం కలిగిన స్త్రీరత్నం. ఎంతో ఆదరంతో, మర్యాదతో ఆహ్వానించి ఆదరించారు. డా. థామస్‌గారికంటె వయస్సులో ఆమెగారు కొంచెం పెద్దదేమో అనిపించింది. ఎందుకంటే ఆమె నిజంగా అందమైనస్త్రీ. అయితే నేను చూచినప్పుడు వయస్సుమళ్లినస్త్రీ అందంగా ఆమె అందం నాకు తోచింది. అప్పటికి కాలాతీత మైనందున నేను అక్కడ ఎక్కువసేపుండుటకు వీలులేకపోయింది. మరునాడు మధ్యాహ్నమో, తరువాతనో ఒక మధ్యాహ్నం 'టీ కి రం'డని భార్యాభర్తలిద్దరూ ఆహ్వానించారు. బిస్కెట్లు, కేకులు మొదలైన వానితో మర్యాదచేశారు. డా. థామస్ గారు వారి లాండ్‌స్కేప్ ఫోటోగ్రాఫులను చాలా చూపించారు. వానిలో కొన్ని మహాద్భుతంగా ఉండినవి.

1966 లో నేను ఇంకొక ప్రముఖుని కలసికొన్నాను. వారు ప్రఖ్యాతివహించిన శ్రీ జి. వెంకటాచలంగారు. వారు సెయింట్ జాన్ రోడ్డులోని థియోసాఫికల్ సొసైటీ విశాలప్రాంగణంలో వేరుచేయబడిన 6-వ నెంబరు ఇంటిలో వుండుచుండినారు. ఈ ప్రాంతం కంటోన్మెంటు ఏరియా లోనిది. శ్రీ వెంకటాచలంగారు

పేరువహించిన లలితకళా పరిశీలకుడు, విమర్శకుడేగాక ప్రసిద్ధి వహించిన విజ్ఞాని, గ్రంథకర్త. ఒక చిత్రకళలోనే గాక, సంగీత నాటకకళల విజ్ఞానంలో కూడా ఘని. కేంద్ర లలితకళా అకాడమీలో సభ్యులు కూడా. హైదరాబాదులోని సాలార్ జంగ్ మ్యూజియంలోని వివిధ కళాఖండాలను పరిశీలించి, ఎక్కడెక్కడ ఏవేవి వుండాలో నిర్ణయించిన దిట్ట. ఆయన చాలా చిత్రపటాలను సేకరించాడు. వారి స్నేహితుడు, ఇంగ్లీషు వాడు ఫ్రెడ్ హార్వే అనువారి పేరుతో తన నివాసానికి సమీపంలో ఒక హాలును నిర్మింపించి, రకరకాల చిత్రపటాలనందులో సమర్పించి దానిని ప్రజోపయోగంకొరకు ట్రస్టుగా రూపొందించారు. వారి గ్రంథాలలో కొన్నిటిని అదివరకే చదివియున్నాను. అందులో ఒకటి, 'పేజెస్ ఫ్రం స్క్రాప్ బుక్' (చిత్తుబుక్కునుండి పేజీలు) నన్ను మిక్కిలి ఆకర్షించియుండినది. దానిలోని కొన్ని వ్యాసాలలో కొందరి విషయమై నిర్మొగమాటంగా, ఘాటుగా వ్రాశారు. వారి భాష మాధుర్యం, వడి, సూటి, నిస్సంకోచం కలిగియుండినది. వారు తన పిన్న వయస్సునందే థియోసఫీ సొసైటీ సభ్యులై అనిబిసెంట్, అరండేల్, జినరాజదాసవంటి పెద్దలను ఎరిగియుండినారు. ఆ సొసైటీ పద్ధతులను ఆచరణలను కొంతవరకు వెలిబుచ్చుచూ, కొన్ని విశేషాలను, ఆ పుస్తకంలో తెలిపారు. రామాయణ, భారత యుద్ధాలు మనలో కొందరు నమ్ముచున్నట్లు వేలకొలది సంవత్సరాలక్రితం జరిగినవని థియాసఫీ సిద్ధాంతంగా వక్కాణించారు. ఆ పుస్తకంలోని విషయాల అభిరుచినిబట్టి ఆయన పుస్తకాలను మరి కొన్నిటిని కొనాలని ప్రయత్నించాను. అదివరకు వారి పుస్తకాలను ప్రచురించిన ప్రచురణకర్తలకు వ్రాయగా సమాధానం రాలేదు. అందువల్ల వెంకటాచలంగారికే వారి బెంగుళూరు అడ్రస్‌కు వ్రాశాను. తిరిగి విజ్ఞప్తికి తెచ్చినా, జవాబురాలేదు. అందువల్ల వారి నెట్లైనా కలుసుకోవాలని ప్రయత్నించి, వా రింటికి 11-వ తారీఖున వెళ్లాను.

వారు (శ్రీ వెంకటాచలం) నా రాకను సమ్మతించి, నే నెవరినో తెలుసుకొని, నాకు తెలిసిన కొందరిని తమకు స్వయంగా తెలిసియు

న్నట్లు చెప్పారు. శ్రీ ఆచార్యరంగాను, శ్రీమతి భారతిదేవి రంగాను, డాక్టరు చిట్టూరి సత్యనారాయణను బాగా తెలిసినట్లు చెప్పారు. శ్రీమతి భారతిదేవి శ్రీ రంగాగారి భార్య కాకమునుపే ఆమె విద్యార్థినిగా నున్నప్పుడు తెలిసియుండినట్లు చెప్పారు. వారినే గాక శ్రీ సంజీవదేవ్ గారిని, శ్రీ వెలగపూడి రామకృష్ణగారిని ఎరుగుదురట. మా ఆంధ్రప్రదేశ్ లలితకళా అకాడమి కార్యదర్శి శ్రీ యల్. యన్. గుప్తాగారితో వారికి సన్నిహితత్వముండినదట. గుప్తాగారి అతిథిగా వుండినారట. పై జెప్పినట్లు సాలార్ జంగ్ మ్యూజియం కళాఖండాల సమర్చటంలో వారు ముఖ్యపాత్ర వహించారుకదా, ఆసందర్భంలో గుప్తాగారితో పరిచయం స్నేహంగా మారింది. ఈవిధంగా నే నెరిగిన ఇతర వ్యక్తులు కూడా వారికి తెలిసియుండిరి. వారి సోదరు లొకరు విజయవాడలో ఉద్యోగం నెరపియుండినారట. వా రప్పుడప్పుడు తమ అన్నగారివద్దకు వెళ్లుచూండేవారట. ఆవిధంగా శ్రీ వెంకటాచలంగారికి తెలుగు ప్రజలు ఎరుకయే.

వారు "మర్నాడు సాయంత్రం మీ బసకు వచ్చి, మీతో టీ తీసుకొంటా"నన్నారు. మాటప్రకారం మర్నాడు సాయంత్రము శ్రీ యస్. బి. (భవాని) శంకర్ అనేవారితో కలసి శంకర్ గారి కారులో వచ్చారు. వెంకటాచలంగారు వెల్లాల మొదలియార్. ఆయన అరవవాడైనా, తెలుగువానివలెనే వుండేవారు. పైగా ఆయనకు జాతి, మత, కులాల పట్టింపులేదు. అంతర్జాతీయమైన థియాసఫీ ప్రభావం వల్లగాని, సహజంగాగాని అంతర్జాతీయ దృక్పథంకలవారు. శ్రీ శంకర్ కన్నడంవానివలె కనపడేవారుగాని తెలుగువాడు. ఉపాహారం తీసుకొని, కొంతసేపు ఆమాట, ఈమాట మాట్లాడుకొన్న తర్వాత వెళ్లిపోతూ, "రేపు ఉదయం 8 గంటలకు మీ వద్దకు వస్తాను. మిమ్ములను ఒక ప్రసిద్ధమైన ఉపాహారాలశాలకు తీసుకు వెడతా" నన్నారు. అనిన ప్రకారం 13-వ తారీఖు ఉదయం ఆయన, శ్రీ భవాని శంకర్ కలసి వచ్చారు. వచ్చి నన్ను లాల్ బాగ్ గార్డెన్సువద్దనున్న యమ్. టి. ఉపాహారశాలకు తీసుకొని

వెళ్లారు. దోసె, ఇడ్లి తీసుకొన్నాం. చాలా బాగుండినవి. వంటశాల, చేసే పనిముట్లు చాలా పరిశుభ్రంగా ఉంచుతారు. ఉపాహారాలను చేతితో ముట్టుకోకుండా తయారుచేస్తారని నాకు తెలియజెప్పటానికి పాకశాల వద్దరా వానిని చూపించారు. తర్వాత మేము శంకర్ గారి కారులో డబుల్ రోడ్డుకు ఒక ప్రక్కగానున్న శాంతినగర్ లోని శ్రీ హెచ్.యల్. జగన్నాథ్ గారింటికి వెళ్లాము. ఆయన మైసూర్ ప్రభుత్వ భవనాల నిర్మాణ ముఖ్య సలహాదారు. ఆయ నక్కడప్పుడు లేడుగాని ఆయన భార్యను, కుమార్తెను కలుసుకొన్నాము. కుమార్తె శ్రీమతి సుధారాణి మద్రాసు ఒక ఇంజనీరింగు కంపెనీలో పనిచేస్తున్న రఘుపతి అనేవారిని వివాహమాడినారట. సుధారాణి తల్లి దండ్రులు మైసూరు మాధ్వులు, ఆమె భర్త అరవ అయ్యంగారు. శ్రీ రఘుపతి, ఒకప్పుడు మద్రాసు ప్రభుత్వ కార్యనిర్వాహకవర్గ సభ్యులలో నొకరుగా నుండిన సుప్రసిద్ధ శ్రీ కె. శ్రీనివాస అయ్యంగారి మనుమడట. శ్రీమతి సుధారాణి చాలా చక్కని 21 సంవత్స రాల వయస్సుగల యువతి. ఆమె స్ఫురద్రూపం, సౌందర్యం, లావణ్యం, చిద్విలాసంతోబాటు మిక్కిలి బాగుగా చదువు కొనిన కళాప్రియత్వంగల యువతి. ఆమె అమెరికాలోకూడా చదువుకొని వున్నదట. ఆమె పాడగలదు, నృత్యం చేయగలదు. మద్రాసు యూనివర్సిటీనుండి ఫిలాసఫిలో బి. ఎ. డిగ్రీని తీసు కొన్నదట. కూచిపూడి శ్రీ వెంపటి సత్యనారాయణనుండి నృత్యం నేర్చుకున్నదట. ఇవన్నియు చాలవన్నట్లు సంస్కృతం నేర్చుకొనుచున్నదట. అక్కడినుండి సుధారాణిని తీసుకొని బయలుదేరాము. ఇండియా గవర్నమెంట్ సోషల్ వెల్ ఫేర్ సెక్షన్ రీజనల్ డిజైన్స్ సెంటర్ కు వెళ్లాము. శ్రీ శంకర్ అక్కడ పనిచేస్తారట. ఆ సెంటర్ లో దారువు, ఏనుగుదంతం, ఇత్తడి, కంచు, మృత్తిక (టెర్రాకోటా) లో రకరకాల బొమ్మలు, ఇతర చేతిపనులు చేస్తారు. నే నక్కడ మృత్తికతో చేసిన మూడు చిన్న గాంధీ, బుద్ధ, దాసీ బొమ్మలను కొన్నాను.

వానికి నేను డబ్బివ్వబోగా, వెంకటాచలంగారు నన్నాపి వారే వానికి తమ డబ్బిచ్చి నాకు బహూకరించారు. ఆ ఉదయం టిఫిన్ ఖర్చుకూడా వారిదే. తర్వాత మేము మైసూరు ప్రభుత్వ చేతి పనుల ఎంపోరియంకు వెళ్లాం. శ్రీమతి సుధారాణి డిజైన్స్ సెంటరులో టెర్రాకోటా ఏనుగులు మొదలైన వానిని కొన్నారు గాని, ఈ చేతిపనుల ఎంపోరియంలో తాత్కాలికంగా ఆమె కేవీ నచ్చలేదు.

వెంకటాచలంగారు 15-వ తారీఖున సుప్రసిద్ధ కళాకారుడు శ్రీ కె. కె. హెబ్బర్‌తో, శ్రీ శంకర్ కారులో నా హోటలుకు వచ్చారు. శ్రీ హెబ్బర్ కొంకణి మాధ్వబ్రాహ్మణుడు. మైసూర్ రాష్ట్రంలో జన్మించినా, హెబ్బర్ గారు చాలా సంవత్స రాలనుండి బొంబాయిలో వుండుచున్నాడట. ఉపాహారం తీసు కొన్నతర్వాత మేము శ్రీ శివరామ్ దేవరావ్ ఉభయకర్ గారింటికి వెళ్లాము. వారు తమ పేరుతోనున్న ఒక ఇంజనీరింగు వర్క్సు లిమిటెడ్ కంపెనీని మానేజింగ్ డైరెక్టర్‌గా నిర్వహిస్తున్నారట. ఆయనభార్య శ్రీమతి లలిత. ఆమె మిక్కిలి స్ఫురద్రూపి. ఇంచు మించుగా తెల్లగా వుంటుంది. లావుతోపాటు ఎత్తుగలిగిన భారీ విగ్రహం వారిది. ఆమె ఉత్తరహిందూస్థాన్ పద్ధతి సంగీతంలో నిధియట. డబ్బు పుచ్చుకోకుండా హాబీగా, గానకచేరీలు చేస్తారట. 1966 ఏప్రిల్‌లో హైదరాబాదులో కచేరీ జరిపారట. కొంతకాలం క్రిందట విజయవాడలోకూడా కచేరీ జరిపానని చెప్పారు. వారు స్ఫురద్రూపియేగాక అందగత్తెకూడా. వారు సారస్వత బ్రాహ్మణులు. భర్తకూడా మంచి శరీర వర్ణముతో అందమైన భారీవిగ్రహం కలవారు. భార్యాభర్త లిద్దరు మిక్కిలి మర్యాదస్థులు. ఎంతో స్నేహభావంతో మ మ్మాదరించి, ఉపాహారాల నిచ్చి సత్కరించారు. సారస్వత బ్రాహ్మణులు ఏదో తెల్లజాతినుండి ఉద్భవించినారేమో అని ఒక అభిప్రాయముండినది. నేను శ్రీమతి లలిత శరీరవర్ణాన్ని చూచి ఆ ప్రస్తావన తేగా,

వెంకటాచలంగారు నే ననుకొన్నట్లు గ్రీకులు, ఇతర యూరపియన్ శ్వేతజాతులుగాక, వీరు స్కితియన్లనుండి వచ్చియుండవచ్చు నన్నారు. వారి అభిప్రాయప్రకారం, స్ఫురద్రూపంగల ఇండియనులు యూరపియన్ జాతులనుండి గాక, స్కితియన్ జాతినుండి వచ్చినారని. నేను వారి సమాధానాన్ని అంగీకరించలేదు. శ్రీమతి లలితగారింటివద్దనుండి ఇండియా ప్రభుత్వం చేతిపనుల అభివృద్ధి సెంటర్‌కు వెళ్లాం. అదివరకు వెళ్లింది డిజైన్సు సెంటరు. ఇది డెవలప్‌మెంట్ సెంటరు. ఆ సెంటరు డైరెక్టరు శ్రీ సేన్‌గుప్తగారు. ఆ సెంటరులో జరిపే అభివృద్ధికర పనులను చూస్తుండగా తెలిసికొనగోరినవారు మాతో వుండిన హెబ్బర్‌గారు. వారు చిత్రకళాకారులు కాబట్టి రంగులు, వాని మిశ్రమ విధానాలనుగురించి చాలా అడిగి తెలుసుకొన్నారు. శ్రీ వెంకటాచలంగారు కేంద్ర చేతిపనుల (హాండి క్రాఫ్ట్సు) బోర్డులో మెంబరు. మైసూర్ స్టేటు ప్రాంతీయ సెంటర్‌ను అజమాయిషీ చేసే అధికారం కలవారు. అందువలన ఈ రెండు సెంటరులలో వారిని బట్టి మాకు ఆదరణ కలిగింది.

మర్నాడుదయం కూడా వెంకటాచలంగారు, శంకర్‌గారు, శంకర్‌గారి కారులో నా గదికి వచ్చారు. టిఫిన్ తీసుకొన్న తర్వాత ఈ దఫా ఇండియా ప్రభుత్వం నేతవస్త్రాల విధానాలను (డిజైన్సు) రూపొందించే కేంద్రానికి వెళ్లాం. అక్కడనుండి వెంకటాచలంగారు తన నివాసం 6-వ నెంబరు సెయింట్ జాన్ రోడ్డు, థియొసాఫికల్ సొసైటి ఆవరణలోనికి తీసికొని వెళ్లారు. వీరి నివాసం థియొసాఫికల్ సొసైటి ఆవరణలోనే అని, వీరి నివాస భాగం ప్రత్యేకించబడి యున్నదని పైన చెప్పాను. ఈ సొసైటి ఆవరణలో కట్టించబడిన ఒక పెద్ద హాలులో వెంకటాచలంగారు సంపాదించిన కళాఖండాలను అమర్చియున్నారని పైన వ్రాశాను. ఈచిత్రాలయాన్ని థియోసాఫికల్ సొసైటీవారు కట్టించినట్లున్నారు. కాని, అందులోని బొమ్మ లన్నియు వెంకటాచలంగా రిచ్చినవే. అందువలన ఆ చిత్రాలయం వెంకటాచలంగారి స్నేహితుడు ఫ్రెడ్ హార్వే పేరుతో 'ఫ్రెడ్ హార్వే గాలరీ'గా వర్ధిల్లుచున్నది. ఈ గాలరీలో 91 చిత్రపటా లున్నవి. వీనిని ఆధునిక పద్ధతులలో

రచించిన చిత్రా లన్నారుగాని, నా కట్లు తోచలేదు. ఎక్కువ భాగం ప్రతిమల బొమ్మలు అత్యున్నతంగా వున్నవి. వానిలో ఏదో స్వల్ప సంఖ్యకు మాత్రం తప్ప, తతిమ్మా వానికి ప్రస్తుతం ఉపయోగించే యాబ్‌స్ట్రాక్టు "క్యూబిస్టు", "ఎక్స్‌ప్రెషనిస్టు", "సర్‌రియలిస్టు", "ఎక్స్‌టెన్షనలిస్టు" అనే జార్గన్ వర్తించదు.

తర్వాత వెంకటాచలంగారు నివసిస్తున్న భాగానికి వెళ్లాం. ఇది మొదటి ముఖ్యభవనంలో భాగమట. 40 సంవత్సరాల పైచిలుకునుండి వెంకటాచలంగారీభాగాన్ని అద్దెకు తీసుకొని ఉపయోగించుకొనుచున్నారట. వారి నివాసభాగంలోనున్న కొన్ని బొమ్మలను, పురాతన కళాఖండాలను చూపారు. మరిన్ని, అనేక ఆల్బమ్‌లలో నిండిన రకరకాల ఫొటోగ్రాఫ్‌లను చూపారు. వా రెవ రెవరితో కలసిమెలసి వున్నది, వ్యవహరించింది, ఏయే సమావేశాలలో పాల్గొన్నది మొదలైన వెన్నో అందులో వున్నవి. ఆ ఆల్బమ్‌లలో నున్న కొన్ని ఫోటోలు శిథిలావస్థలో మన్నట్లు తోచింది. వా రింటినుండి మేము బ్రిగేడ్ స్ట్రీటులోని క్వాలిటీ రెస్టారాంట్‌కు మధ్యాహ్నభోజనానికి వెళ్లి, సుష్ఠుగా భోజనంచేశాం. నేను సెప్టెంబర్ 6-వ తారీఖు ఉదయం మద్రాసు వుడ్‌లాండ్స్ హోటలులో దిగింది. 18-వ తారీఖుకు 12 రోజులు అయింది. ఆ మధ్యాహ్నం మద్రాసుకు బయలుదేరాలని పెట్టె, బేడ సర్దుకొని ఉదయం 7 గంటల తరువాత హోటలు విడిచి వెంకటాచలంగా రింటికి వెళ్లాను. వా రిచ్చిన హార్లిక్స్ పాలు మొదలైనవి తీసుకొని 9 గంటలకల్లా పై జెప్పియుండిన (యమ్. టి) మావ్‌లా కఫేకు వెళ్లాం. వెంకటాచలంగారు దోసె, ఇడ్లీ ఇప్పించారు. పిమ్మట వారు, శంకర్‌గారు, నేను శ్రీ వి. ఆర్. రావ్ అనే వా రింటికి వెళ్లాం. వారు ప్రతిమ (పోర్ట్రైట్) చిత్ర కారులు. ఇంగ్లండులో కొన్ని సంవత్సరా లుండి తర్వాత బొంబాయిలో వున్నారట. ఇప్పుడు బెంగుళూరులో స్థిరపడి

పోయారు. మహాత్మాగాంధి, పండిట్ నెహ్రూ, నిజలింగప్ప, దేశ్ ముఖ్ వంటి ప్రముఖుల ప్రతిమలను పెద్ద సైజులో చిత్రించారు. వారు నీటిరంగులనే వాడతారు. ప్రసిద్ధ ప్రతిమా చిత్రకారుడని (శ్రీ) వెంకటాచలంగా రన్నారు. వారి కుమార్తె అక్క డుండినది. ఆమెకు 21, 22 సంవత్సరా లుండవచ్చును. తెల్లని శరీరవర్ణం కలిగి కామవిలాసవతిగా కనపడింది. ఆచోటు నుండి బయలుదేరి (శ్రీ) డి. (దేవరకొండ) గురుమూర్తిగా రింటికి వెళ్లాం. ఆయ నొకప్పుడు మదనపల్లి థియొసాఫికల్ కాలేజిలో ఇంగ్లీషు అధ్యాపకులుగా పనిచేసి పేరుప్రతిష్ఠలు పొంది యున్నారు. వారినేగాక, వారి భార్యగారిని కూడా నే నదివరలో చూచియుండినాను. ఆరోజులలో గురుమూర్తిగారితో నాకు కొంత చను వుండినది. గురుమూర్తిగారుగాక, వారి భార్యగారు కూడా సాంఘికసంస్కరణ, సాంస్కృతిక విషయాలలో పాల్గొనుచు కొంత ప్రతిష్ఠను సంపాదించినారు. ఆమె విద్యావతియేగాక, మిక్కిలి ఉల్లాసోత్సాహములుగల (వివేషస్) స్వభావంగలవారు. అంతకుముందే ఆమెగారు చనిపోయారట. వృద్ధత్వం, అనారోగ్యంతోబాటు భార్యా వియోగంవల్ల స్ఫురద్రూపంతో, మిక్కిలి అందంగా, చురుకుగా వుండే డాక్టరు గురుమూర్తిగారు మిక్కిలి బలహీనులుగా, అస్థిమిత్వంకల వారుగా కనపడ్డారు. 75 ఏండ్లు వచ్చియుండిన వెంకటాచలంగారికంటె ముసలివారుగా తోచారు. వా రింటినుండి బయలుదేరి సౌత్ పెరేడ్ లోని మూడుముఖాలు (త్రీ ఫేసెస్) అనే భోజనశాలకు వెళ్లి తృప్తిగా భోజనంచేసి, కంటోన్మెంటు రైల్వేస్టేషన్ కు వెళ్లాం. మధ్యాహ్నం 2-30 గంటలకు బయలుదేరిన బృందావన్ ఎక్స్ప్రెస్ లో మద్రాసుకు బయలుదేరాను. రైలు కదిలేవరకు వెంకటాచలంగారు, భవానిశంకర్ గారు ప్లాట్ ఫారం మీద వుండి నన్ను సాగనంపారు.

యస్. భవానిశంకర్ గారు యాదవకులస్థుడట. తెలుగు వాడేగాని తెలు గంతగా వచ్చినట్లు తోచలేదు. చాలా మంచి వాడు. పరిచయం కొద్దిమాత్రమే అయినా, కొంత ఆప్యాయత చూపించాడు. ఋజువర్తనం కలవాడు, నిజాయితీపరు డని

తోచింది. ఏదో సంభాషణలో వెంకటాచలంగారు శ్రీ శంకర్ అంత తెలివిగలవాడు, చురుకైనవాడు కా దనినా, నే నాయనను దద్దమ్మని అనుకోలేదు. ప్రపంచజ్ఞానం తెలిసిన వ్యక్తిగానే వ్యవహరించాడు. తనపై అధికారిగా వుండుచుండిన శ్రీ వెంకటాచలంగారి కోర్కెలను నెరవేరుస్తూ, వారి కవసరమైనప్పుడల్లా తన కారులో వారిని త్రిప్పుతూ లౌకికంగా మెలగేవాడు. ఒక రోజున నేను కమర్షియల్ స్ట్రీటులో ఒక ఇత్తడి బొమ్మను కొన్నాను, అది దుముకుచున్నట్లున్న అంగసౌష్ఠవాలు గల కన్నె పడుచు విగ్రహం. దాని చలనస్వభావం నాకు నచ్చి స్వల్ప ఖరీదుకు దాన్ని కొన్నాను. ఆరోజుననే హెబ్బర్ గారు, వెంకటాచలంగారు కూడా శ్రీ శంకర్ కారులో వున్నారు. కమర్షియల్ స్ట్రీట్ లో వా రొకచోటుకు వెళ్లగా, నేను యింకొకచోట ఈ విగ్రహాన్ని కొన్నాను. కారులో వున్న శ్రీ శంకర్ కు చూపించి వెంకటాచలంగారికి చూపిస్తానన్నాను. "వద్దు. ఇటువంటివి వారి కేమీ నచ్చవు, పైగా నిరసిస్తారు" అని సలహా చెప్పాడు. ఇంతలో వారు వచ్చారు. నా చేతిలో బొమ్మను చూచి వెంకటాచలంగారు "ఛీ! దీని నెందుకు కొన్నా?" రన్నారు. నామట్టుకు నాకు అది చాలా సొగసైన విగ్రహం అని యిప్పటికిని తోస్తున్నది. దానిని నేను వ్రాసుకొనే బల్లకు సమీపంలో ఉంచాను. ఒకప్పుడు నిపుణులనే వారికి కూడా కొన్ని చాదస్తా లుంటవి. వెంకటాచలంగారు వాని కతీతులు కా రనుకున్నాను.

శ్రీ శంకర్ గారు శిల్పనైపుణ్యం కలవారే. వా రింటికి నేను ఒంటరిగా వెళ్లగా వారు తయారుచేయుచున్న లాల్ బహదూర్ శాస్త్రిగారి కాంస్య విగ్రహాన్ని చూపించారు. అ దప్పటి కించుమించు పూర్తయింది. శాస్త్రిగారి రూపం చక్కగా ఆ విగ్రహంలో ప్రతిబింబించింది. "చూచినవెంటనే లాల్ బహదూర్ శాస్త్రిగారి విగ్రహమని ఎంత చవటైనా పోల్చుకోగలడు. ఇది చక్కగా వున్నది. దీనిని వెంకటాచలంగారికి చూపించారా" అన్నాను. "లేదు. చూపించ దలచలేదు. ఆయన ఏవో వంకలు పెడతా" రన్నారు. శంకర్ గారి భయమేగాని, శ్రీ వెంకటాచలం దానిని

ఆమోదించివుండేవారు. మొత్తంమీద భవానిశంకర్‌గారు సజ్జనులేగాక, శిల్పకళా నైపుణ్యంగలవారు కూడా.

నేను కొనియుండిన కాంస్య విగ్రహాన్ని నిరసించిన శ్రీ వెంకటాచలంగారి స్వంతఅభిప్రాయం (ఫాడ్) ఇంకొక విషయంలో జ్ఞప్తికి వస్తున్నది. ఒక సాయంత్రం వారితో కబ్బన్ పార్కుకు వెళ్లి బ్రహ్మాండమైన విధానసభ భవనాన్ని చూచాం. అది ప్రజాసమూహాన్ని గొప్పగా ఆకర్షించే కట్టడం. అయితే వెంకటాచలంగారు అది వికృతంగాను, అశాస్త్రీయంగాను కట్టబడిందన్నారు. ఈ బిల్డింగుకు సరితూకం (బాలెన్స్) లేదనో, ఒకప్రక్క హెచ్చు అనో, ఇంకా ఏదో అని ఆ గంభీరసౌందర్యాన్ని నిరసించారు. ఈ చిన్నివాని కేమిగాని, వారు చిత్రకళాభిజ్ఞులని ఒప్పుకోక తప్పదు. మరిన్ని, స్నేహంచేసుకోవటం, స్నేహం చేసుకొన్నవారి కండదండగా వుండటం వారి విశిష్టత. మిత్రుల విషయంలో వారు చూపే శ్రద్ధ, ఆసక్తి, సేవానిరతి కొందరు అల్పబుద్ధులు అపార్థంచేసుకొని ఆయన డాంబికుడని (వైన్ ఫెలో), పటాటోపం (షో) కలవాడని ఎంచుతారేమో అని, నాకు వారు 18-వ తారీఖున రైలుస్టేషనులో వీడ్కోలిచ్చినప్పుడు నా ఫస్ట్‌క్లాస్ కంపార్టుమెంట్‌లో వున్న ఒకరిద్దరి భావంవల్ల నే ననుకొన్నాను. వారి సౌజన్యం, సౌహార్ద్రం, ఔదార్యం తెలియనట్టి మూర్ఖులట్టివారు.

ఒకనాడు ఉదయం కంటోన్మెంట్ ఏరియాలోని మాధవ నగర్‌లో 27-వ నంబరుగల యింటిలో నివసిస్తున్న శ్రీ యన్. శ్రీరామరెడ్డిగారిని వెళ్లి చూచాను. వారప్పుడు రాజ్యసభ సభ్యులుగా నుండినారు. మొట్టమొదట వారిని నేను అనంతపురంజిల్లా ఇన్‌కమ్‌టాక్స్ ఆఫీసర్‌గా వుండినప్పుడు 1936-37 లో మడకశిర క్యాంపులో చూచానని ఈ "స్వవిషయం" రెండవ భాగంలో వ్రాశాను. ఈ మూడవభాగంలోనే 3-వ శీర్షిక క్రింద నేను 1959 ఫిబ్రవరిలో బెంగుళూరులో జరిగిన అఖిల భారత పశు ప్రదర్శనానికి వెళ్లినప్పుడు వారిని కలసికొన్నానని పైన చెప్పాను.

1959 లో వారు పడుచువారుగా మిక్కిలి ఉత్సాహముతో కనపడినారు. ఈ 7 సంవత్సరాల వ్యవధిలోనే ముసలితనం వచ్చిన వారివలె వుండినారు. వయస్సు 58 సంవత్సరాలు మాత్రమేనట గాని, వారి ఆరోగ్యం చెడియుంటుం దనుకొన్నాను. ప్రాత ఎరుకనుబట్టి చాలా ఆదరణతో, స్నేహపూర్వకంగా ఉపాహారాలవీ యిచ్చి మర్యాద చేశారు. వారంతకు ముందే ఢిల్లీనుండి వచ్చారట. వారిని సందర్శించటానికి, సలహా సహాయాలను పొందటానికి బంధుమిత్రులు, యితరులు వచ్చారు. వారి బంధువులను, స్నేహితులను ఎరుకపరచుచు, "మేము అసలు రెడ్లంకాము, యాదవుల"మని చెప్పారు. అప్పటివరకు పేరు రెడ్డిగాక పుట్టు రెడ్డే అనుకొన్నాను. "మీ రొకసారివచ్చి మా యింట భోజనంచేసి వెళ్లండి. తర్వాత నేను ఫోనుచేస్తా" నన్నారు కాని, పని తొందరలో కాబోలు ఫోనుచేయలేదు. తిరిగి వారి దర్శనం కాలేదు.

బెంగుళూరుకు తిరిగి 1972 లో విశ్రాంతికొరకు వెళ్లాను. ఏప్రిల్ 24-వ తారీఖున హౌరా-మద్రాసు మెయిల్‌లో ప్రయాణించి 25-వ ఉదయం మద్రాసు సెంట్రల్ స్టేషన్‌కు చేరుకొని, బృందావన్ ఎక్స్‌ప్రెస్‌లో ప్రయాణంచేసి మధ్యాహ్నం ఒంటిగంటకు ముందు కంటోన్మెంట్ స్టేషన్‌కు చేరాను. ముందుగా వ్రాసినందున నా ప్రాతమిత్రుడు శ్రీ కె. (కామిశెట్టి) యమ్. పట్టాభి ఒక కారు తీసికొని తన మేనల్లునితో వచ్చాడు. ఆ మేనల్లుడు నా సామానును కారులోకి చేర్చటానికి తోడ్పడ్డాడు. ఆ కారు సరాసరి సౌత్ పెరేడ్‌రోడ్డు (మహాత్మా గాంధి రోడ్డు) లో క్రొత్తగా కట్టిన బృందావన్ అనే పెద్ద హోటలుకు మమ్ములను తీసికొని వెళ్లింది. "ఈ క్రొత్త హోటలులో బాగుంటుందని, సౌత్ పెరేడ్ మిక్కిలి ప్రాముఖ్యం కలిగిన ప్రాంతమని, ఇక్కడకు కబ్బన్ పార్కు కూడా దగ్గరేనని, ఈ హోటలులో గదిని మాట్లాడినా"నని శ్రీ పట్టాభి చెప్పాడు. తీరా మా కిచ్చిన గది మొదటి అంతస్థులో ఒక మారుమూల నున్నది. దాని కెదురుగా ఖాళీ చప్పర మున్నది. తీవ్రమైన సూర్యరశ్మి గదిలోనికి కొట్టు

నట్లున్నది. గది చిన్నదియేగాక దానిలోని కుర్చీలు, టేబులులు వగైరాలు అనుకూలమైనవి కావు. అందువల్ల శ్రీ పట్టాభిని పంపించి, నేను 1966 లో వుండిన మద్రాసు వుడ్ లాండ్స్ హోటలులో ఒక గదిని సమకూర్చించుకొన్నాను. ఈ దఫా హోటల్ ప్రధాన బిల్డింగులో గాక దాని విశాలమైన ఆవరణలో కాటేజస్‌గా కట్టబడిన 2 వరుసలలో ఎక్కువ వసతులుగల ఒక వరుసలోని 66-వ నంబరు గది నా కిచ్చారు. దీని నొక గదికంటె, రెండు గదులని చెప్పాలి. వెనుక గదిలో పడక వగైరా, ముందు గదిలో భోజనం వగైరా. రెండవగది నానుకొని యున్న స్నాన గదిలో నాకు కావలసిన యూరపియన్ స్టైల్ కమోడున్నది. ఈ పొడుగాటి బ్లాకుకు 4 అడుగులు తక్కువ కాని ముందు వరండా వున్నది. దానిలో అప్పుడప్పుడు ఈ ప్రక్కనుండి ఆ ప్రక్కకు, ఆ ప్రక్కనుండి ఈ ప్రక్కకు షికారు చేస్తూండేవాడను. ఈ 66 నంబరు గదికి అద్దె 15 రూపాయలు. ఉపాహారం, పానీయాలు, భోజనం వగైరాలకు తిన్నట్లుగా ఛార్జి. 1970 లో ఉపాహారాల ధర చాలా పెరిగి యుండింది. రెండు చిన్న యిడ్లీలకు 80 పైసలు, సాదాదోసెకు 70 పైసలు, మసాలాదోసెకు 85 పైసలు, 3 చిన్న పూరీలకు 50 పైసలు, మిక్శ్చర్‌కు 60 పైసలు, ఒక చిన్న గ్లాసు పాలకు 50 పైసలు. విచిత్ర మేమంటే మజ్జిగకూడా 50 పైసలే. బెంగుళూరులో పాలు పుష్కలం. అయినా ఒక చిన్నగ్లాసు పాలకు 50 పైస లెందుకు ఛార్జిచేశారో నా కర్థంకాలేదు. పాలు అంత మంచివి కావుకూడా. అన్నిటికంటె విచిత్రం 2 యిడ్లీలకు 80 పైసలు పుచ్చుకోవటం. అనగా ఒకదానికి 40 పైసలు. "బైట యిడ్లీ ఒకటికి 15 పైసలు పుచ్చుకొనుచుంటే మీరెందుకు 40 పైసలు ఛార్జి చేస్తున్నా"రని నే నక్కడ నుండి వెళ్లేరోజున డబ్బిస్తూ అక్కడివారి నడిగాను. వారు చెప్పిన కారణం, "అద్దెకున్న వా రందరికీ సరిపోవునట్లు ఇడ్లీలను తయారుచేస్తాం. ఇడ్లీ కావాలంటే అప్పటి కప్పుడు తయారుచేయ లేం కదా. అందరికని తయారుచేసిన యిడ్లీలు కొందరు తీసుకొనక

వృథా అవుతవి. అందువల్ల ఆ నష్టాన్నికూడా కలుపుకొని ఎక్కువఛార్జి చేస్తాం''అని కుంటి సమాధాన మిచ్చారు.

ఇక్కడ (బెంగుళూరులో) 1972 ఏప్రిల్ 25 నుండి మే 31 ఆఖరువరకు వుండి, జూన్ 1-వ తారీఖున బృందావన్ ఎక్స్‌ప్రెస్‌లో మద్రాసుకు వెళ్లిపోయాను. ఈ 5 వారాల కాలంలో చాలా రోజులు ఎండ రోజులే. సాయంత్రం 4½ వరకు ఎండ కొంత తీవ్రంగానే వుండేది. వర్షాలు అరుదుగా పడ్డాయి. ఒకప్పు డిది బెంగుళూరేనా అనిపించేది. మరొకప్పుడు బెంగుళూరు కాబట్టే హెచ్చు ఎండలు, వడగాడ్పులు లేవు. బెజవాడ ప్రాంతంలోను, దాని సమీపం పెదసనగల్లులోను ఎండలు చాలా హెచ్చువున్నవని, తీవ్రమైన వడగాడ్పులు వేస్తున్నవని వుత్తరాలు వస్తున్నవని తృప్తిపడ్డాను. సామాన్యంగా బెజవాడ ప్రాంతంలో, రోహిణికార్తె మే నెల 24-వ తారీఖున ప్రారంభిస్తుంది. రోహిణి ఎండలకు రోళ్లు బ్రద్దలవుత వంటారు. మద్రాసులోకూడా ఎండలు జాస్తిగా వున్నవని రాధాకృష్ణ వ్రాస్తున్నాడు అని కొంతకుకొంత సరిపెట్టుకోవలసి వచ్చింది. రోజులు ఎండవగుట చేత ఏ 3, 4 సార్లో తప్ప ఉదయం బైటికి వెళ్లలేదు. ఉదయం టిఫిన్ తర్వాత ఏదో చదువుకోవటం, వ్రాసుకోవటం. 11, 11½ గంటలమధ్య భోజనమున కుపక్రమించి 12 లోపుగా పూర్తిచేసి, ఒక గంటసేపు అవి, ఇవి చదువుకొని నిద్రించటం, లేక నిద్రకు ప్రయత్నించటం. 4 గంటలకు లేచి టిఫిన్ తీసికోవటం, 4½, 5 గంటలలోపు బయలుదేరి కబ్బన్ పార్కుకో, మరొక ప్రక్కకో షికారుకు వెళ్లటం—ఈవిధంగా కాలం గడిపాను. ఇతరచోట్లకు అప్పుడప్పుడు వెళ్లినా, నా వాహ్యాళి అంతా కబ్బన్ పార్కు ప్రాంతంలోనే. రాత్రి భోజనం చేసేవాడను కాదు. ఏ పూరీయో, చపాతీయో తీసికొనేవాడను. మజ్జిగ త్రాగేవాడను.

1936 నుండి 1939 వరకు, నేను అనంతపూరు లేక హిందూపూరు నుండి వెళ్లుచుండిన బెంగుళూరు చాలా సుఖ ప్రదంగా, హాయిగా, కన్నులపండుగగా వుండేది. 1950-51 లో

నే నుద్యోగరీత్యా బెంగుళూరులో మకాంచేసినప్పుడు వాతావర ణంలో మార్పు కనిపించింది. ఆ చల్లదనం, హాయి తగ్గింది. 1966 లో మరీ కొంత తగ్గింది. 1972 లో ఇది బెంగుళూరేనా అని మాటిమాటికి అనుకోవలసివచ్చింది. దీనికి కారణం కొంత ప్రకృతివైచిత్ర్యమే అయివుంటుంది. మరికొంత కారణం పరిసరప్రాంత వృక్షాలను నరికివేయటంవలన, ఆ స్థలంలో ఇళ్లను కట్టటంవలన, జనసంఖ్య పెరగటంవలన అయివుంటుందని అక్కడి వారు చెప్పగా విన్నాను.

1970 నాటికి శ్రీ అబ్దుల్ ఖాదర్ గారు, శ్రీ వెంకటాచలంగారు కాలగర్భంలో కలసిపోయారు. కొంచెం శ్రమించి శ్రీ భవాని శంకర్ గారిని ఒకనాడు కలసికో గలిగాను. 1966 లో నేను వెళ్లి యుండిన యింటిని మార్చి ఒక మారుమూలలో నివసిస్తూండినారు. నే నొక సాయంత్రం వెతుక్కుంటూ వెళ్లి ఆ క్రొత్తయింటిని కనుక్కొని విచారించగా వా రింటివద్దలేరు. ప్రక్కనున్నవారితో మాట్లాడి నా విజిటింగ్ కార్డును వారి కిచ్చి శంకర్ గారి కివ్వమని చెప్పి వచ్చివేశాను. ఆ మర్నా డుదయమో, తరువాత ఉదయమో వారు వచ్చి నన్ను కలసికొన్నారు. వారి అడ్రస్ మొదట తెలియ నందున వారు పనిచేసే డిజైన్సు సెంటర్ కు వెళ్లి అక్కడి అధి కారితో "శంకర్ గారి కొరకు వచ్చాను. నేను వచ్చి వెళ్లానని వారికి చెప్పం"డని చెప్పివచ్చాను. వారు చెప్పియుందురు, నా విజిటింగ్ కార్డు హెచ్చరించి యుండును. నేను వారిని కలసికొనుటకు ప్రయత్నించింది చివరి రోజులలో. వారు వచ్చి తిరిగి కలసికొంటా మన్నారుగాని, వ్యవధి లేనందువల్ల కాబోలు రాలేదు. సహజంగా మంచివాడైనా, ఆయనగారు స్నేహభావంతోనుండినా కార్య భారం మరింత పైబడుటవల్ల కాబోలు కొంత చిక్కియున్నాడు. పనులలో నిమగ్నుడై యున్నట్లు కనపడినాడు. నేను 1966 లో చూచిన లాల్ బహదూర్ శాస్త్రిగారి కాంశ్య విగ్రహాన్ని కోరి చేయించుకొన్నవారి కిచ్చివేశాడట. తరువాత 1, 2 టిని కంచు మిశ్రమ విగ్రహాలను, రాతి విగ్రహాలను చేసినట్లు ఆయన చెప్పారు.

అప్పటికి ఆడిటర్ శ్రీ పర్వతనేని సాంబయ్యగారుకూడా చని పోయారు. వారి కుమారుడు శ్రీ వీరభద్రరావును రెండు, మూడు సార్లు కలసికొనుటయేగాక వారింటికి వెళ్లి ఆయన భార్య శోభారాణిని చూచి వచ్చాను.

నా ప్రాతమిత్రుడు శ్రీ యస్. కృష్ణమూర్తి నన్ను 2, 3 సార్లు కలిసికొని ఒకనాటి సాయంత్రం వారింటికి తీసుకొనివెళ్లాడు. ఆ రాత్రి ఆయన ముగ్గురు కుమారులలో పెద్దవాని శోభనం. నేను వెళ్లునప్పటికి ఆయన వియ్యంకుడు మొదలైన బంధువు లున్నారు. వారందరితో బాటు ఉపాహారాలు తీసుకొని, కొంత కాలం గడిపి వచ్చివేశాను. భోజనానికుండమన్నారుగాని, "రాత్రి భోజనం చేయను, ఉపాహారం తీసుకొన్నానుగదా" అని చెప్పాను. వారి కడగొట్టు కుమార్తె కృష్ణవేణిని చూచాను. ఈ నాలుగేళ్ల లోనే ఆ పిల్ల కాలవ్యవధికంటె ఎక్కువగా పెరిగినట్లున్నది. ఆ అందం, ఆచలాకి కొంత తగ్గిన ట్లనిపించింది. పైగా పెద్ద కళ్లజోడు. అందువల్ల "నువ్వు చాలా మారిపోయావే, పూర్వ అందం తగ్గి పోయిందే" అనవలసివచ్చింది.

తిరిగి శ్రీ యన్. శ్రీరామరెడ్డిగారిని కలసికొనలేదు. వారప్పుడక్కడ లేరని తెలిసింది. ఇంతటితో నా పూర్వ పరిచయుల ప్రస్తావన పూర్తి అయినట్లే.

నేను క్రొత్తగా అక్కడ కలుసుకొన్నది ఈద్పుగంటి సురేంద్రనాథ్ అనిపేరుగల మధ్య వయస్కుని. సురేంద్రనాథ్ మరెవరోకాదు. చాల సంవత్సరాలు విజయవాడ జిల్లా కేంద్ర సహకార బ్యాంకుకు అధ్యక్షులుగా వుండినవారు, 1958 లో స్థాపించిన కృష్ణాజిల్లా పశుపోషకుల సంఘ కోశాధికారి, పాల పథకాన్ని, పాలఫాక్టరీని విజయవాడలో ఆరంభించుటకు తోడ్పడిన వారు, ప్రస్తుతం విజయవాడకు 7, 8 మైళ్ల సమీపాన గంగూరువద్ద వి. జె. స్పిన్నింగ్ మిల్స్ అనే నూలు మిల్లును కట్టి సామర్థ్యంతో నడుపుచున్నవారు శ్రీ ఈద్పుగంటి బాలవీరరాఘవయ్యగారి జ్యేష్ఠపుత్రుడు. శ్రీ బాలవీరరాఘవయ్యగారిని, ఈమధ్యనే కీర్తిశేషురాలైన వారి భార్య కమలమ్మగారిని, నేను చాలా సంవ

త్సరాలనుండి ఎరిగియున్నాను. సురేంద్రనాథ్‌ను మామూలుగా పిలిచే బెనర్జీ పేరుతో అతనిని చిన్నప్పటినుండి ఎరిగియున్నాను. అందువల్ల శ్రీ సురేంద్రనాథ్‌ను కలసికోవటం క్రొత్తకాదు, విశేషం కాదు. ఆయనతో బాటు నేను కూడా వి. జె. స్పిన్నింగ్ మిల్స్ డైరెక్టర్‌ను. ఒక మీటింగ్‌లో "మీరు బెంగుళూరు వచ్చినప్పుడు ఇంటికివచ్చి వెళ్లం"డని ఆహ్వానించాడు. తర్వాత నేను బెంగుళూరు వెళ్లింది 1972 లోనే. వారింటికి ఫోన్ చేయగా, నా హోటలులో నన్ను కలసికొని మరొకరోజున వారింటికి భోజనానికి తీసుకొని వెళ్లాడు. ఆయన భార్య, నా భార్య మేనమామ చెరుకూరి వెంకటరత్నంగారి కుమార్తె శ్రీమతి సరస్వతమ్మగారి పెద్దకుమారుడు కాకర్ల వెంకటేశ్వరరావు భార్య సోదరి. వివాహాల సమయాల్లో ఆమె నదివరకే ఎరిగియున్నాను. అందువలన నా కక్కడ చనువుగానే వుండినది. ఈ చనువును వారి రెండవ కుమార్తె నిరుపమ హెచ్చించింది. వారికి ముగ్గురు కుమార్తెలు, ఒక కుమారుడు. ఆ ముగ్గురు కుమార్తెలలో నిరుపమ మిక్కిలి చురుకుకలది, అందమైనది. ఆకర్షణ, మనోహరత్వం (ఛారమ్) కలది. సున్నితమైన హావభావాలు, మంజులమైన చేష్టలు కలది. నేను వెళ్లి మొనసాల (డ్రాయింగు రూము) లో కూర్చొనటంతోడనే, గ్రామఫోనులో సంగీత రికార్డులను పెట్టుట కారంభించి మిక్కిలి సున్నితంగా, మందహాసంతో, "మీ కే పాటలు నచ్చుతవి, వేనిని పెట్టమంటా"రని అడిగి నన్ను ముగ్ధుణ్ణి చేసింది. పళ్లరస పానీయం చేతి కందించి, నాకు దృష్టి తక్కువని గ్రహించి అందుబాటులోనుండి ఉపచరించింది. ఆ పిల్ల నా హృదయాన్ని నిజంగా దోచుకొన్నది. నే నప్పటికి 74 సంవత్సరాలు నిండవచ్చుచున్న ముదుసలిని. పడుచువాడనైతే భార్యగా చేసుకొందామని ఉబలాటపడేవాడను. ఆమె, ఆమె అక్క సౌభాగ్యవతి నళిని, బి. ఎ., బి. యస్‌సి. లవంటి డిగ్రీలను పొందియున్నారు. 3-వ పిల్ల ఇంకా చిన్నది. ఇంటర్‌మీడియెట్ చదువుచున్నది. వారు పులావుతోసహా యిచ్చిన విందుభోజనాన్ని తృప్తిగా ఆరగించి వారి కారులో హోటల్‌కు చేరు

కొన్నాను. తరువాత కొలదికాలానికే కలిసికి, నిరుపమకు వివాహా మైనది. ఇది ముగిసేము దాక చిన్న విషయం చెప్తాతాను, "అమ్మాయీ! నీ పేరేమి" టని అడుగగా, "నిరుప" అన్నది. "నిరుప అని వుండదు. నిరుపమ సాధ్యమైన పదం దాని అర్థం సాటిలేనిదని. నిరుప అనదలచుకుంటే నిరూప అనాలి. దాని అర్థం రూపంలేనిదని. నీవు రూపం లేనిదానివి కాదుగదా" అని నవ్వాను. బహుశా ఇప్పుడు నిరుపమ అనే వాడుచున్నారేమో.

మొదటిదఫా అక్కడ (బెంగుళూరులో) కలుసుకొన్న వారు శ్రీ పి. వెంకట్రావు అనే ఆడిటర్. ఆయన శ్రీ పర్వతనేని సాంబయ్య నిర్వహించుచుండిన పి. బ్రహ్మయ్య అండ్ కంపెని ఆడిటర్స్ బెంగుళూరు బ్రాంచి భాగస్థులు. సాంబయ్యగారు మరణించిన తర్వాత, వీరభద్రరావుతో బాటు ఈయనకూడా ముఖ్యభాగస్థుడైనాడు. శ్రీ పి. వెంకట్రావు (వైశ్యులు) ఒక నాడుదయం వచ్చి, 4, 5 రోజులలో తన కుమార్తె వివాహమని మీరు ఆ పెండ్లికి రావాలని ఆహ్వానించారు. సంతోషంతో అంగీకరించాను. పెళ్లిసాయంత్రం వారి తాలూకువారొకరు కారుతీసుకొని వచ్చి నన్ను వివాహమందిరానికి తీసుకొని వెళ్లారు, శ్రీ వెంకట్రావేగాక, శ్రీ వీరభద్రరావు కూడా నన్నాహ్వానించి లోపలకు తీసుకొని వెళ్లారు. శ్రీ వీరభద్రరావుభార్య శోభారాణి, ఆమె ముద్దువచ్చే చిన్నకూతురు, ఆ బిడ్డ బుడ్డి తమ్ముడు కూడా తల్లితో వచ్చారు. నేను వారింటికి వెళ్లినప్పుడు, వారింటిలో నుంటూ బెంగుళూరులో చదువుకొనుచున్న శోభారాణి తమ్ముడు కనపడలేదు. వాని తండ్రి శ్రీ లింగం వెంకట సుబ్బారావు నా కత్యంత ప్రియమైనవాడు. కుర్రవాని నెప్పుడో వాని చిన్నతనంలో చూచాను. అందువల్ల వానిని చూడాలని చాలా కుతూహల పడ్డాను. వాడు చాలా సిగ్గరి. 18 సంవత్సరాలు వయస్సుదాటినా, ఇతరులను కలసికొనుటకు బిడియపడే స్వభావం కలవాడు. అందు వలన కొంత బలవంతంగానే వాని అక్క నేను కూర్చుండినచోటుకు తీసుకొని వచ్చింది. శ్రీ వెంకట్రావు తన వియ్యంకుని, ఇతర

బంధువులను, స్నేహితులను పరిచయపర్చాడు. వివాహం పూర్తయిన తర్వాత వా రేర్పాటుచేసిన కారులో హోటలుకు చేరుకున్నాను.

శ్రీ కె. (కోకా) రామచంద్రరావు అనేవారు కొన్ని సంవత్సరాలు ఇన్ కమ్‌టాక్స్ ఆఫీసరు ఉద్యోగం చేసి, 1966 నాటికే ఉద్యోగవిరమణజేసి బెంగుళూరులో స్థిరపడిపోయారు. మైసూరు రాష్ట్రం కోలారు జిల్లాలో చాలామంది తెలుగువా రున్నారు. ఆ తెలుగువారిలో కొన్ని ఆదివెలమ కుటుంబా లున్నవి. ఆ కుటుంబాలలో నొకదానికి చెందినవారు శ్రీ కోకా రామచంద్రరావు నాయుడు. వీరు, మన సుప్రీంకోర్టు ప్రధాన న్యాయాధిపతిగా పేరు ప్రతిష్ఠలు పొందిన శ్రీ కోకా సుబ్బారావుగారికి బంధువులట. 1966 లో వారి జన్మస్థానమైన కోలారు జిల్లా గ్రామానికి వెళ్లి యుండినారు. అందువలన అప్పుడు వారిని శ్రీ పట్టాభి ప్రయత్నించినా కలుసుకోలేకపోయాను. ఈదఫా 1972 లో వారిని కలిసికొని, వారి కారులో 2, 3 సార్లు అక్కడక్కడకు వెళ్లాం. ఒక సాయంత్రం లాల్ బాగ్ గార్డెన్స్‌కు వెళ్లి అక్కడి ఉపాహారశాలలో ఉపాహారాలు తీసుకొన్నాం. శ్రీ రామచంద్రరావు నాయుణ్ణి బాగుగా తెలిసియుండిన ఆ రెస్టారాంట్ యజమాని నాయుడు టిఫినుకేగాక శ్రీ పట్టాభి, నా టిఫిన్లకు కూడా డబ్బు తీసుకో నన్నాడు. ఇంకొక సాయంత్రం శ్రీ పట్టాభితో కలసి శ్రీ రామచంద్రరావు కారులో పట్టుచీరెల టోకువ్యాపారస్థుని అంగడికి వెళ్లి ఒక మంచి పట్టుచీరెను, జాకెట్టును కొన్నాను. ఒకరోజున రామచంద్రరావునాయుడు నన్ను భోజనానికి పిలిచి మాంసం, చేప, రొయ్య, కోడిగ్రుడ్డులతో భోజన మిచ్చాడు. శ్రీ కె. యమ్. పట్టాభి ఆర్యవైశ్యుడు గనుక పూర్తి శాకాహారి. అందువలన కొంతసేపైన తర్వాత ఆయ నక్కడకురాగా, కొన్ని ఉపాహారాలు, కాఫీ మొదలైన వాని నిచ్చి సత్కరించాడు.

శ్రీ కె. రామ్ అనేవారు మద్రాసులో ఇన్ కమ్‌టాక్స్ ఆఫీసర్ పనిచేసి, బెంగుళూరులో కొంతకాలం అసిస్టెంట్ కమిషనర్‌గా పనిచేసి రిటైరై యుండినారు. 1966 లో శ్రీ యస్. కృష్ణమూర్తి

ఒకసారి వా రింటికి తీసుకొని వెళ్లగా మా ప్రాతపరిచయాన్ని పునరుద్ధరించుకొన్నాం. ఆయన చాలా మంచివాడు, స్నేహశీలుడు, ఉదారస్వభావం కలవాడు. ఆయన కొంతకాలం బర్మాలో నుండి నాడు. అక్కడున్నప్పుడు బర్మా యువతిని వివాహమాడాడు. 1966 లో ఆమెను కలసికొన్నాను. సరసురాలుగా, సాత్త్వికస్వభావంకలవారుగా కనపడినారు. 1972 నాటికి ఆమె చనిపోయి వుండినది.

నేను వచ్చిన సంగతి శ్రీ పట్టాభి చెప్పగా ఆయన, శ్రీ కె. సి. మహాదేవన్ ఒక సాయంత్రం నన్ను చూడటానికి వచ్చారు. శ్రీ మహాదేవన్ అప్పటికింకను ఉద్యోగంలో వుండి బెంగుళూరులో ఇన్కమ్టాక్స్ అసిస్టెంట్ కమిషనర్గా వుండినారు. ఆయన, మద్రాసులో నేను అప్పీల్సు అసిస్టెంట్ కమిషనర్గా పనిచేయుచుండినకాలంలో, మద్రాసు 2-వ ఇన్కమ్ టాక్స్ సర్కిల్ ఆఫీసరుగా వుండినారు. ఆయన తెలివితేటలు గల సమర్థుడు. విషయగ్రహణశక్తి సంపన్నుడే గాక ఆర్డర్లను చక్కగా వ్రాయగల దక్షతగలవాడు. సుప్రసిద్ధ గాయని శ్రీమతి యమ్. యస్. సుబ్బులక్ష్మి ఆదాయంపన్ను విధింపు ఆర్డరును కట్టుదిట్టముగా వ్రాశానని, దానికి తిరుగులేదని అనుకొన్నాడట. అప్పీలులో నేను దానిని తారుమారుచేశాను. నన్నొకరోజున కలసికొన్నప్పుడు ఆయన నాతో "నేను మన డిపార్ట్మెంట్ సలహాదారుడు రామారావు సాయిబ్ గారితో సంప్రదించి మరీ ఆ ఆర్డరును వ్రాశాను. మీ అప్పెలేట్ ఆర్డరును నా ఆర్డరు కంటె చాలా ఘనంగా వ్రాశారు" అన్నాడు. తరువాత నా ఆర్డరే హైకోర్టువారి ఆమోదం పొందింది.

నేనక్కడ ఏవేవో చూచాను. అక్కడా సంవత్సరం జరిగిన ఇంటర్నేషనల్ (డేవిస్ కప్ పోటీలనుకుంటాను) టెన్నిస్ ఆటలను లోపలికి వెళ్లి చూడలేదు గాని, బైటనుండి జనసందోహాలను చూచాను. లోపలి చప్పట్లు విన్నాను. ఇంకొకప్పుడు లేపాక్షి ప్రింట్స్ అనే పేరుతో సికింద్రాబాద్లో నాజూకైన అద్దకపు చీరెలను తయారుచేసేవారు, బెంగుళూరు సెయింట్

మార్కెట్ రోడ్డులో తాత్కాలికంగా విక్రయశాల నేర్పరచారు. ఆ విక్రయశాలకు వెళ్లి ఒక చీరెను కొన్నాను. ఆసందర్భంలో నాకు చీరెలు చూపించినవారు (స్త్రీ) సన్నంతో ఆదరించి "హైదరాబాదువచ్చినప్పుడు మా ప్రింటింగ్ శాలకువచ్చిచూడండ" దని చెప్పారు. పై విధముగా 1972 సంవత్సరము మే 31 వరకు బెంగుళూరులో వేసవికాలపు ఉద్ధృతాన్ని ఉపశమింపచుకొనటానికి గడపి, జూన్ 1-వ తారీఖున మిత్రుడు (శ్రీ) పట్టాభి సాగనంపగా బృందావన్ ఎక్స్‌ప్రెస్ రైలెక్కి మద్రాసుకు బయలుదేరి వెళ్లి పోయాను. ఈ క్యాంపులోనే బేలూరు, హాలెబిడ్, శ్రావణ బెలగోల వెళ్లివచ్చాను. ఈవిషయం 4-వ శీర్షిక క్రింద వ్రాసి యున్నాను.

కొడైకెనాల్ : నేను పెడసనగల్లునుండి 1969 ఏప్రిల్ 21-వ తారీఖు రాత్రి రైలులో ప్రయాణించి 22 న ఉదయం మద్రాసుకు చేరుకొని అక్కడినుండి 27-వ తారీఖు రాత్రి మద్రాసు—త్రివేంద్రం మెయిల్‌లో కొడైకెనాల్‌కు బయలు దేరాను. మరునాడు 28-వ తారీఖు ఉదయం 8 గంటలకు కొడైకెనాల్‌రోడ్డు స్టేషన్‌కు చేరుకున్నాను. కొడైకెనాల్‌కు వెళ్ళే బస్సు 9 గంటలకు బయలుదేరి, కొండమీాది కొడైకెనాల్ టౌనుకు 12 గంటలకు చేరుకొన్నది. అదివరకు వ్రాసి టౌన్‌కు 2 మైళ్లదూరంలో వున్న 'హాలిడే హోమ్' అనే వసతిగృహంలో గదిని రిజర్వుచేసుకొని వుండినాను. ఆ హోటల్ తాలూకు బస్సు నన్ను, ఇంకా కొంతమందిని హాలిడేహోమ్ హోటలుకుచేర్చింది. మేము ఊరి మధ్యనున్న వారి ఔట్ ఏజన్సీనుండి హోటల్‌కు బయలుదేరినప్పుడు, యాత్రికులను ఆహ్వానించేవారి మనిషి పేక్ అనే మహమ్మదీయుడే గాక, ఆ హోటల్ ప్రొప్రయిటర్ పొన్నుస్వామినాడార్ గారు కూడా వుండినారు. నా కిచ్చినది ఒకరు మాత్రమే వుండే గది. నిజానికి ఒక మూారుమాాలవుండే ఆ బ్లాకంతా సింగిల్ గదులదే. గది కొంత యిరుకుగా కనపడినా, సర్దుకొనుట కంత యిబ్బందిపడవలసినదిగా లేదు, అయితే

దానిలో నా కలవాటైన యూరపియన్ కమోడ్ లేదు. నాకు కమోడ్ అవసర మనగా, విడి కమోడ్ ఫ్రేమ్ ఒకటి తెచ్చి యిచ్చాడు. దానిని ప్లషాట్ మీద పెట్టి ఉపయోగించుకొన్నాను. స్నానగదిలో ముఖమార్జనం వద్ద రాకు సరిపడిన బల్ల నమర్చి దాని మీద పెద్ద పింగాణి పళ్లాన్ని అమర్చటం, పడకగదిలోవున్న బల్ల మీద తగిన గుడ్డ కప్పటం మొదలైన సర్దుబాట్లు కొన్ని చేశారు. దానితో ఆ చిన్నగది కొంత నివాసయోగ్యంగా కనపడింది.

ఆ బ్లాకులో యితర గదు లుండినవి. అందులో ఒకరిద్దరు పరిచయమైనారు. వారిలో నొకరు రంగస్వామి రెడ్డియార్ అనే వారు కొంత సన్నిహితులైనారు. ఆయన దక్షిణాదివారు. మద్రాసులో న్యాయవాదిగా వుంటున్నాడటగాని, ఆ వృత్తియందు ఆసక్తికలవాడుగా కనపడలేదు. ఆయనకు మద్రాసులో కొన్ని యిండ్లున్నవట. నెలకు మూడువేల రూపాయలకుపైగా అద్దె వస్తుందట. ఆయన కుమారుడు ధర్మరాజుకూడా వచ్చాడు. తండ్రి కొడుకు లిద్దరు, ఆ బ్లాకులోని రెండు ప్రక్క ప్రక్క గదులలో వుండినారు. ఆ యువకుడు లెక్కలలో డిగ్రీ తీసుకొన్నాడట. అమెరికా వెడతాడని తండ్రి చెప్పాడు.

ఉదయం స్నానానికి చాలినన్ని వేడినీళ్లు తెచ్చి యిచ్చేవారు. టిఫిన్, భోజనం సెంట్రల్ హాలులో. మా బ్లాకునుండి ఆ సెంట్రల్ హాలుకు 100, 150 గజాల దూరం వుంటుంది. అక్కడకు వెళ్లే త్రోవ యిరుకుగాను, హెచ్చుతగ్గులుగాను, విడివడిన రాళ్ళతోను, గడ్డితోను చిందరవందరగా వుంటుంది. అసలు బైటికి వెళ్లాలంటే ఒక సందులో నుండి పెద్దరాస్తాకు వెళ్లినట్లే. ఉదయం వెళ్లటం యిబ్బంది లేదు. మధ్యాహ్నం మధ్యరకం ఇబ్బంది. రాత్రి భోజనానంతరం తిరిగి వెళ్లేటప్పుడు మిక్కిలి శ్రమ అనిపించేది. గడ్డి వుండటంవల్ల చలిచలిగా కాళ్లకు తగిలేది. పైగా అక్కడక్కడ రెండు దీపపు స్తంభాలున్నా అవి దూరదూరంగా వుండటంవల్ల, మిక్కిలి గుడ్డివిగా వుండటంవల్ల టార్చిలైట్ సహాయం లేనిదే నడవటానికి నావంటివానికి వీలుండేది కాదు.

ఉదయం టిఫిన్, మధ్యాహ్నం భోజనం సమృద్ధిగానే వుండేవి. ఇడ్లీ, దోసె వగైరా తిన్న వారికి తిన్నంతగా యిచ్చేవారు, కాఫీకి బదులు నేను పాలు తీసుకొనేవాడను. మధ్యాహ్న భోజనం మామూలు అరవ భోజనం చేతిపచ్చడి, యిగురుకూర, ఏదో పులుసు, సాంబారు, చారు, అప్పడం, మజ్జిగ. కాని మధ్యాహ్నం టిఫిన్ నామమాత్రం. చిన్నిచిన్ని పళ్లాలలో 5, 6 పలుకులు కారంవస్తువు, స్వల్పమైన పరిమాణంగల తీపివస్తువు, స్వల్పంగా కాఫీ యిచ్చేవారు. నేను రెండు దఫాలుగా వుండిన నెల రోజులలో ఏ రెండు, మూడుసార్లు ఆ టిఫిన్ తీసుకున్నానో. రాత్రి భోజనం పూరీయో, చపాతీయో తీసుకొనేవాడను. ఇచ్చే కూరలు వగైరాలు మొదటి రోజులలో బాగానే వుండినవి. 'మంది ఎక్కువైతే మజ్జిగ పలుచనౌతా'యన్నట్లు, యాత్రికులు వచ్చిన కొలది ఆ భోజనం దిగజారిపోయింది. ప్రతిరాత్రి తప్పకుండా బంగాళాదుంపల నీళ్లవంటి కూరుండేది అక్కడక్కడ ముక్కలతో. మొట్టమొదట బంగాళాదుంపవేపుడు చిప్సు యిచ్చేవారు. వానిని పూర్తిగా మానివేశారు. ఒకటి రెండుసార్లు నే నడుగగా అరటి కాయ చిప్సు రెండు మూడుసార్లు ఇచ్చి యుంటారు. నా కా రాత్రి భోజనం చాలా అయిష్టాన్ని కలిగించింది. కొన్నిరోజులు గడచిన తర్వాత "మాంసాహారాదు లిచ్చే భోజనశాల ప్రక్కగావున్నది, కావలసిన వారు మధ్యాహ్న భోజన మక్కడ తీసుకోవచ్చు" నన్నారు. మధ్యాహ్నం భోజనాని కక్కడకు వెళ్లేవాడను. అక్కడ మాంసం, చేప, కోడిగ్రుడ్లు ఇచ్చేవారుగాని, మిక్కిలి పరిమితిగా యిచ్చేవారు. వంటకాలు మరీ అంత బాగుండేవికావు. "ప్రత్యేకంగా ఆర్డర్ యిస్తే బాగా చేసిపెడతాం" అనివంటవాళ్లన్నారు. ఆవిధంగా కొంతమంది ధనికులకు, అప్పుడప్పుడు వచ్చే తెల్ల వారికి, సరఫరా చేసేవారట. అట్టి ఘరానా మనుష్యులకు మా భోజనశాల ముందు భాగంలో చిన్న భోజనశాల, దాని నానుకొని మంచి సోఫాలు, కుర్చీలు గల గదొకటి ఏర్పరచబడి యున్నది. ఎక్కువ హెచ్చు సొమ్మును ఈ ప్రత్యేకంగా ఏర్పాటుచేసిన మాంసాదులకు తీసుకొంటారని నే నా జోలికి పోలేదు,

ఆ వసతిగృహానికి ప్రయాణీకులను, వంటసామగ్రిని చేర వేయుటయేగాక, అక్కడకు వచ్చినవారికి చుట్టుప్రక్కల వింతలను, విశేషాలను చూపించుటకు వాన్ వంటి చిన్న బస్సునొకదాని నుపయోగించేవారు. ఉదయం టిఫిన్ అయిన తర్వాత, ప్రతిరోజు తప్పకుండా మధ్యాహ్నం టిఫిన్ తర్వాతకూడా ఈ చిన్న బస్సు బయలుదేరేది. దాని డ్రైవర్ నాడార్ కులస్థుడు. ప్రస్తుత యజమానుల తండ్రి శ్రీ జయరామ్‌నాడార్ పనిలో తన చిన్న వయస్సులోనే ప్రవేశించి, వారు చనిపోయినతర్వాత ఆయన కుమారుల సర్వీసులో ఉంటున్నాడట. తా నా కుటుంబం సర్వీసులో 40 ఏళ్ల పైనుండి వుండుచుండినట్లు చెప్పాడు. తండ్రి శ్రీ జయరామ్‌నాడార్ చిన్న కంట్రాక్టరుగా పనిజేస్తూ కట్టెలు, తినుబండారాలు మొదలైన సామగ్రిని అప్పుడక్కడుండుచుండిన యూరపియన్లకు సరఫరా చేస్తూండేవాడట. యుద్ధకాలంలో కొంతమంది సైనికులు డేరాలు వేసుకొని ఆ డేరాలలో వుండే వారట. ఆ ప్రదేశ మప్పటికి అడవి మాదిరిగా వుండేదట. ఎవరినుండో తండ్రి నాడార్ దానిని కొని తన ముగ్గురు నల్గురు కొడుకులకు సంక్రమింపజేశాడు. కొడుకులు సంవత్సరాని కొకరి వంతున ఈ వసతిగృహాన్ని వేసవికాలం 2 మాసాలు మాత్రమే నడుపుతారట. తర్వాత దానిని మూసివేసి తాము నివసించే ప్రదేశాలనుండి తమతమ వ్యాపారాలను చేసుకొంటారట. అందువల్లను నేను నాగదినుండి బయటకువెళ్లే త్రోవయేగాక, ఇతర త్రోవలుకూడా మరమ్మతుచేయవలసి వుండినవే. భోజనశాల, తత్సంబంధమైన వంటశాలలు, భోజనశాలకు సమీపానవుండే కొన్ని పెద్ద గదులవరుస సుమారుగా వుండినవి. అక్కడినుండి బయటికివెళ్లే పెద్ద రోడ్డుకూడా ఫరవాలే దనిపించిందిగాని, అది కూడా బాగుచేయవలసి యుండినది.

ఉనికికి, భోజనానికి నాగదికి రోజుకు 20 రూపాయలు ఛార్జి, ఒక రుండే గదులు 6, 7 మాత్రమే మా బ్లాకులో మాత్రమే ఉండినవి. తతిమ్మా గదు లన్నీ ఇద్దరు ముగ్గు రుండేవట. నా వినికిడి ప్రతి సీజనుకు 40, 50 వేలు లాభ ముండేదట. ఆ

లాభాన్ని మూటగట్టుకొని పోయేవారు. తిరిగి ఆ ప్రాంతం ముఖం చూడటం మరు సంవత్సరం వేసవిలోనే. వేసవి సీజను ఆరంభించుటకు కొన్నిరోజులకు ముందు ఏవో కొన్ని సర్దుబాట్లు చేసేవారట. అప్పటి కప్పుడు వంటవాళ్లను, నౌకర్లను తాత్కాలి కంగా నియమించేవారట. అంతటితో ఆ వసతిగృహం వచ్చే వారి నాహ్వానించుటకు సిద్ధమయ్యేది.

డ్రైవరు సంగతి చెప్పటం పైన మొదలుపెట్టాను. అతడు చాలా సంవత్సరాలు ఆ కుటుంబంలోనుండి, తండ్రి జయరాజ్ నాడార్ క్రిందఅంతస్థునుండి పెరుగుచున్న కాలంలో కష్టసుఖా లలో పాల్గొన్నాడు. ప్రస్తుత యజమానులు చిన్నపిల్లలుగా వుండినప్పుడు ఎత్తుకొని ఆడించినవాడు కాబట్టి, తానే ఈ హోటల్ కు యజమాని నన్నట్లు వ్యవహరించేవాడు. వినిపించు కొని, వినిపించుకొననట్లు ధీమాగా ప్రవర్తించేవాడు. అయితే, అమర్యాదగా వర్తించేవాడుకాదు. మరిన్ని, ఎక్కడ ఆగిపోతుందో, ఎక్కడ విడిభాగాలుగా విడిపోతవో అనే విధంగావుండిన ఆ మిక్కిలి ప్రాతబస్సును మిక్కిలి నైపుణ్యంతో లాలించి స్వాధీనపరుచు చున్నట్లుగా నడిపేవాడు.

మమ్ములను ఆ బస్సు వేరువేరుచోట్లకు తీసుకొని వెళ్లేది. అక్కడకు చేరిన 3-వ నా డుదయం (1969 సంవత్సరం మే 1) సేక్రెడ్ ఆర్ట్ కాలేజికి, తర్వాత సిల్వర్ కాస్కేడ్ కు వెళ్లాం. కాలేజి జెస్యూయిట్స్ మిషన్ వారిది. ఈ కాలేజిలో, ఆ శాఖ పద్ధతిప్రకారం మతగురువులకు చదువుచెపుతారట. జాతి (నల్ల తెల్ల) భేదం లేదు. బొంబాయిలో ఈ జెస్యూయిట్ మిషన్ తాలూకు మతప్రచారకశాఖ లున్నదట. ఈ బొంబాయి కాలేజిలో కాథలిక్కు మార్గంలోవున్న డొమినికన్సవంటి ఇతర శాఖలవారికికూడా తర్ఫీ దిస్తారట. ఇక్కడి కాలేజి ఎప్పుడో ప్రాతపద్ధతిప్రకారం కట్టబడినది. దీని తోట వివిధరకాల పూల పొదలతో, చెట్లతో పేరుపొందినది. మృతులను ఖననంచేసే సెమిటరిలో చాలారకాల పూలమొక్క లున్నవి. ఈ కాలేజికి అనుబంధంగా ఒక మ్యూజియమ్కూడా వున్నది. ఈ మ్యూజి

యమ్‌లో పలనికొండలు (కొడైకెనాల్ కొండలు కూడా ఈ పలనికొండలలో భాగమేనట) లో వుండే మృగ, పక్షి, సర్ప జాతుల చచ్చిన మచ్చులు లేక నమూనాలున్నాయి. 13 అడుగుల పొడవుగల కింగ్‌కోబ్రా (సర్పరాజం) చర్మమున్నది. ఆ ప్రదేశాన్ని చూచి ఆనందించినతర్వాత, అనతిదూరంలోవున్న సిల్వర్ కాస్కేడ్ (వెండిధారవలెనుండు చిన్న సెలయేరు) కు వెళ్ళాం. ఈ సెలయేరు కొడైకు చేరే త్రోవలోనే వున్నది. బస్సు రోడ్డు అంచుమీద ఆగింది. కొంతమంది బస్సు దిగి, లోపలికి దిగి కాళ్లు తడుపుకొని వచ్చారు. రోజూ ఒక రూటుకు బస్సు వెళ్తూండేది. ఉదయం చూచిన ప్రయాణీకులు మధ్యాహ్నం వెళ్లేవారుకాదు. క్రొత్తవారు సాయంత్రం వెళ్లేవారు. బస్సు చిన్నదికాబట్టి ఏ 25 మందినో తీసుకొని వెళ్లేది. అందువల్ల జట్లుగా ప్రదేశాలను చూడటానికి వెళ్లేవారు.

మరునాడుదయం కొడైకెనాల్‌కు మంచినీటిని సప్లైచేసే రిజర్వాయర్‌కు వెళ్లాం. ఆ రిజర్వాయర్‌లోని పూలమొక్కలు, ముఖ్యంగా ఢాలియాస్ పువ్వులు చాలా పుష్టికరంగా, పెద్దవిగా వున్నవి. అక్కడినుండి అబ్జర్వేటరీకి వెళ్లి చూచాం. దగ్గర దగ్గరగా అమర్చబడిన మెట్లనుండి నిటారుగా పైకి వెళ్లవలసి వచ్చింది. కొంత ధైర్యంచేసి వెళ్లాను. అబ్జర్వేటరీ 6 అంగుళాల ప్రమాణం దర్శని మాత్రమే కలది. ఉద్యోగస్థు లొకరు దాని నటు, యిటు త్రిప్పుచు, చుట్టుప్రక్కల ప్రదేశాలను చూపుచు విశేషాలను విశదీకరించారు.

మే 8-వ తారీఖు ఉదయం ఫెయిరి ఫాల్స్ అనే చోటికి వెళ్ళాం. అక్కడ నిజంగా జలపాతంలేదు. క్రిందటి రాత్రి కురిసిన వర్షం నీరు నూలుపోగులవలె పారుచుండినది. క్రింది బేసిన్‌లో కొంచెం నీరు నిలిచియున్నది. తరువాత ఇంకొక చోటికి వెళ్ళాం. అది కూడా జలపాతమట. చెప్పుకోదగిన నీటిప్రవాహంలేదు. కొండ చరియలలోనుండి ప్రవహించే నీరువలె కొంచెం ఎత్తునుండి నీరు

క్రిందకు జారుచుండినది. పిమ్మట ఊళ్లోకి వెళ్ళాం. అక్కడి కొడైకెనాల్ కో ఆపరేటివ్ స్టోర్సులో కొన్ని ఉన్నివస్తువులు కొన్నాను. నేను వస్తువులను కొనిన సెక్షన్ మానేజర్‌కు చల్లపల్లిరాజాగారు, రామనాథబాబుగారు మొదలైనవారు తనకు తెలుసునని, రాజాగారి కుటుంబం అప్పు డక్కడున్నదని, రాజాగారుకూడా వస్తారని చెప్పాడు. 4-వ తారీఖు ఉదయం బెరిజం సరస్సుకు వెళ్ళాం. ఈబస్సు కెపాసిటి పైన చెప్పినట్లు 20, 25 మందే గాని, ప్రసిద్ధి కెక్కిన బెరిజం సరస్సును చూడాలని 40 మందిని మించి ఎక్కారు. కొంతమంది టాప్‌మీద ఎక్కి కూర్చున్నారు. సరస్సుకు వెళ్లే దారి, పరిసరప్రాంతాలు కొన్నిచోట్ల మిక్కిలి అందంగా వున్నవి. అయితే బస్సునిండా మనుష్యులు క్రిక్కిరిసి పోయారుకాబట్టి కొంతవరకే చూడగలిగాను. ఒకచోట మాత్రం బస్సు 5 నిమిషాలాగగా దిగి చూచాం. ఆ ప్రాంతం చెట్లతో నిండిన కొండలతోను నలుప్రక్కల క్రమ్ముకొని మూసి నట్లున్నలోయ, అందులోనుండి పైకి లేచుచున్న మంచుపొగ దృశ్యం మిక్కిలి మనోహరంగా వుండినది. ఈ దృశ్యం తప్పితే ఆ సరస్సు అంత గొప్పగా చెప్పుకొనవలసింది కాదు. మనోరంజకాన్ని కలిగించలేదు. పోతే, అది చాలాదూరం కొన్నిచోట్ల వెడల్పుగాను, కొన్నిచోట్ల యిరుకుగాను, మాతో ప్రయాణిస్తున్నదా! అన్నట్లుండినది. దూరం 12 మైళ్లు. రాను పోను, ఆ క్రిక్కిరిసిన బస్సులో 24 మైళ్లప్రయాణం మిక్కిలి శ్రమ అనిపించింది. మామూలుగా సీట్లలో కూర్చుండియుండిన వారికే శ్రమగా యుండగా మధ్య మధ్య చిన్న చిన్న బల్లల నమర్చి వాని మీద కూర్చుండి ప్రయాణించిన వారి కెంత కష్టం కలిగిందో. ఒకనా డుదయం 5 మైళ్లదూరంలోవున్న "కురింజి అండవార్" (సుబ్రహ్మణ్యేశ్వరస్వామి) దేవాలయానికి హోటలు బస్సు మమ్ములను తీసుకొనివెళ్లింది. అది కొంత దూరంలో కొడైకెనాల్ సుప్రసిద్ధ సరస్సుకు అవతలప్రక్కగా నున్నది. దారిపొడుగూతా మంచి మంచి బంగళాలున్నవి.

పరిసరప్రాంతాలు రమణీయంగా వున్నవి. దేవాలయం అంత పెద్దదికాదు. స్వామి విగ్రహంగాని, ఇతర విగ్రహాలుగాని అంత గొప్పవికావు. అయితే, దేవాలయప్రాంగణంనుండి చూస్తే ప్రకృతి అంతయు, రంగురంగుల పూలతో నిండిన పచ్చని దుశ్శాలువను కప్పుకొన్నట్లున్నది రాను పోను ప్రయాణం ఆహ్లాదకరంగానే వుండింది. దేవాలయం నుండి తిరిగివచ్చునప్పుడు కూడా సరస్సుమీదుగానే వచ్చినాం. త్రోవ అడవియే. సరస్సు చేరునప్పటికి గం. 10-40 నిమిషాలు మాత్రమే అయింది. సరస్సు బోట్ హౌస్ వద్ద నేను దిగాను. అక్కడ శ్రీ రంగస్వామిరెడ్డియార్ గారుండినారు. వారితో బాటు మదురైలో జిల్లా జడ్జిగా చేసి రిటైరైన రంగస్వామినాయుడుగారుండినారు. వారు, నేను కలసి రెడ్డియార్ గారి కారులో అప్పుడు జరుగుచున్న పశువుల ప్రదర్శనానికి హైస్కూల్ గ్రౌండ్సుకు వెళ్లాం. పశువులు సామాన్యం. సంఖ్య కూడా చాలా తక్కువ. మొత్తంమీద 3, 4 సింధీలు, 2 హోల్‌స్టైన్ ఫ్రీజర్స్ మాత్రం మంచి ఆవు లుండినవి. సామాన్యమైన నాటురకం గేదెలు నాలుగైదుండినవి. 4, 5 స్టాల్స్ మాత్ర ముండినవి. ఈ పశువుల ప్రదర్శన ప్రదేశం, ఒక పెద్ద ఎండిపోయిన చెరువులో వుండిన ట్లుండినది. అది విశాలమైన స్థలమేగాని, చుట్టుప్రక్కల ఎత్తైన భూభాగం, దానిమీద రోడ్లు ఈ ప్రదర్శన స్థలాన్ని గుంటలో వుండినట్లు తోపింపజేసింది. అది హైస్కూలుకు చెందినదైనా దానిలో విద్యార్థులు ఆడుకొనుటకు నిర్ణీతస్థలాలు, వసతులున్నా మొత్తంమీద అదిగిన్నె (బవెల్) వంటిదే. అక్కడకు చేరుటకు నేను జాగ్రత్తగా నా చేతికర్ర సహాయంతో దిగవలసివచ్చింది. 2, 3 చోట్ల క్రిందకు వెళ్లే మెట్లుండటమేగాక, కంకరరోడ్డు అంచునుండి ఏటవాలుగానున్న దాని కట్టకు మెట్లమాదిరి అంతరాలున్నవి. కొడైకెనాల్ వంటి శీతలప్రదేశంలో విదేశీ సంబంధమైన ఆవులు ఎక్కువగా వుంటవని, మేలు రకమైనవి వుంటవని తలచిన నాకు, నిరుత్సాహామే కలిగింది.

నేను 4, 5 సార్లైనా సమీపంలోవున్న "పిల్లర్ రాక్స్" అనే చోటుకి వెళ్లాను. ఇది హోటల్‌కు అనతిదూరంలోనే వున్నందున, మొదటిదఫా క్రొత్తగాబట్టి బస్సులో వెళ్లినా తర్వాత షికారుగా వెళ్లి తిరిగి వచ్చేవాడను. ఈ పిల్లర్ రాక్స్ విశేషమేమనగా ఒక కొండసానువుపైనుండి రెండు ప్రక్కలా తీర్చినట్లు, దాని ముఖం రాతిస్తంభాలుగా తయారై వుండినది. కొంత భ్రమిస్తే, ఎవరో చెక్కటానికి ప్రయత్నించి, స్వల్పంగా మాత్రమే చెక్కిన ముఖంలాగ కనపడుతుంది. వర్షం వచ్చినప్పుడు ఆప్రక్కన, యీప్రక్కన నీరు క్రిందకు జారి, రెండు ప్రక్కలా గీటు పడినట్లుండిన వీ శిలాఫలకాలు. నా కా రాక్ పిల్లర్స్‌లో విశేషమేమీ కనపడలేదుగాని, దానికి కొంత ఎడంగా, యివతలిప్రక్కగా వుండిన గుట్టమీద ఒక కొద్దిపాటి మూసిన మండపం (పెవిలియన్) కట్టారు. ఈ మండపం ఆవరణనుండి ఎదురుగా కనపడే కొండగుట్టలను, ఈ పిల్లర్ రాక్స్ కొండకు ఆ ప్రక్క, యీప్రక్కనున్న లోయలలోని ప్రకృతిరామణీయకాన్ని చూచి ఆనందించవచ్చును.

ఒకనా డుదయం న్యాయమూర్తి శ్రీ ఆవుల సాంబశివరావు గారు, ఆయన కుమార్తె సౌభాగ్యవతి మంజులత, ఆయన కుమారుడు చిరంజీవి శ్రీనాథ్, నేను కలసి అక్కడకు నడిచివెళ్లాం. మండపం చుట్టు వరండాలో విశ్రమించుచుండగా, ఒక శ్వేత జాతీయుడు అమెరికన్ మిషనరిఅట, మేము తెలుగులో మాట్లాడుకొనుచుండగా మమ్ములను తెలుగులో సంబోధించాడు. వా రంతకుముందు రాజమండ్రి పేపర్ మిల్స్ సమీపాన వుంటూండే వారట. ఆ పేపర్ మిల్స్‌నుండి వచ్చు దుర్వాసన, వాని మిషన్ల ధ్వనివల్ల అక్కడినుంచి మారి వరంగల్‌కు పోవటానికి నిశ్చయించుకొన్నాడట.

మద్రాసు రెజిస్టర్డు ఆఫీసులో మే 9-వ తారీఖున చల్లపల్లి సుగర్స్‌కంపెని వారి ముఖ్యమైన బోర్డుమీటింగు జరుగుతుందని, దానికి తప్పకుండా హాజరుకమ్మని సమాచారం వచ్చింది. పైగా, మర్నాడు 10-వ తారీఖు రాత్రి నా పెదతండ్రి కుమారుడు శ్రీ లింగం

వెంకట కృష్ణయ్యగారి కూతురు బిడ్డ, ఒరిస్సా రాష్ట్ర ప్రభుత్వంలో మంత్రిగా నుండుచుండిన శ్రీ నూతక్కి రామశేషయ్యగారి పెద్ద కుమారుడు దేవీప్రసాద్ కూతురు పెండ్లి తిరుచానూర్‌లో జరుగుతుందని కబురువచ్చింది. ఈ రెండూ కలసివస్తవని, నేను మే 7-వ తారీఖున మధ్యాహ్నం బయలుదేరి కొ్డైకెనాల్ రోడ్డు స్టేషన్‌కు రాత్రి 7 గంటలకు చేరుకొని, తిరునల్వేలి ఎక్స్‌ప్రెస్‌లో మద్రాసుకు బయలుదేరాను. నే నప్పటి కుండిన 9 రోజులకు 180 రూపాయలు చెల్లించాను. మొదట డిపాజిట్ చేసిన 250 రూపాయలు అట్టిపెట్టాను. నే నుండిన గది అనుకూలంగా లేదు. "నేను 16-వ తారీఖుకు మళ్లీవస్తాను, నా కింకొక గది యివ్వా"లని చెప్పాను. "ఒకరే వుండే గదులు మీ బ్లాకులో తప్ప యితరత్రా లేవు, అన్నీ యిద్దరు ముగ్గు రుండే గదులే" అన్నారు "ఇద్దరుండే గదైనాసరే అంటే, రోజుకు 32 రూపాయలకు గ దొక టున్నది. అది మీరు వచ్చేనాటికి ఖాళీఅవుతుంది, మీరు కావాలంటే ఆ గది నిస్తాం" అన్నారు. "సరే" అని ఆగదిని ఖాయం చేసి, నేను తీసుకువెళ్లిన సామానులో కొంత అక్కడి ఆఫీసులో నిల్వవుంచి, మద్రాసుకు బయలుదేరాను మద్రాసులో మే 9-వ తారీఖు ఉదయం బోర్డు మీటింగుకు హాజరైనాను మర్నాడు మధ్యాహ్నం శ్రీ చల్లపల్లి రాజావారి అనుజుడు శ్రీరామకృష్ణ ప్రసాద్‌గారి కారులో వారి కుమారుడు శ్రీ హర్షవర్ధనప్రసాద్‌తో కలసి తిరుచానూరుకు పైజెప్పిన పెండ్లికి బయలుదేరాం. పెండ్లి కుమారుడు శ్రీ వెలగపూడి రామకృష్ణయ్యగారి తోడిఅల్లుడు శ్రీ అనుమోలు వీరరాఘవరావుగారి పుత్రుడు సీజర్ అనే యువకుడు. శ్రీ రాఘవరావుకు ఒక కూతురు, ఒక కొడుకు, కూతురుకు మాజీమంత్రి శ్రీ బలుసు ప్రభాకరపట్టాభిరామారావుగారి కుమారుడు శ్రీరామమోహనరావు కిచ్చి పెండ్లిచేశారు. ఆ బాంధవ్యాన్నిబట్టి శ్రీరామకృష్ణప్రసాద్‌గారు ఆ పెళ్లికి హాజరయ్యారు. దారిలో రేణుగుంటవద్ద శ్రీ పి. (పంచాజ్ఞుల) సూర్యనారాయణగారి నూలు మిల్లు గెస్ట్‌హౌస్‌లో కొంతసేపు

విశ్రమించాం. గెస్టుహౌస్‌లో సూర్యనారాయణగారి తరఫున వారి ఆఫీస రొకరు టిఫిను, పానీయాలు మొదలైన విచ్చి చక్కని మర్యాదచేశారు. సాయంత్రం తిరుచానూరు చేరుకొని, రాత్రి వివాహం జరిగిన తర్వాత, అక్కడినుండి బయలుదేరి రాత్రి 12 గంటలకు తిరుమలపైకి చేరి మాకు సిద్ధముచేసియుంచబడిన ఒక కాటేజ్‌లో విశ్రమించాం. ఇప్పుడు వ్రాయుచున్నది నా కొడై కెనాల్ విశ్రాంతి వినోదయాత్ర సంబంధంకాబట్టి ఇతర విషయాలు వ్రాయటం అనవసరం.

నేను హాలిడే హోమ్ వారికి తిరిగి వస్తానని చెప్పి యుండినట్లు రెండవసారి కూడా శ్రీ సి. నాగేంద్రప్రసాద్ ద్వారా ట్రేడ్ వింగ్స్‌వారు ఏర్పరచిన వసతితో, 15 మే రాత్రి రైలులో ప్రయాణంచేసి, మర్నా డుదయం కొడై కెనాల్‌రోడ్డు స్టేషన్‌కు చేరుకొని, సుమారు ఒంటిగంటకు కొడై కెనాల్ చేరుకొన్నాను. ఆ రైలులో నా పినతాత శ్రీ లింగం వెంకటరత్నంగారి 5-వ కుమారుడు వీరభద్రయ్యగారి ఏకైకసంతానం కుమార్తె శ్రీమతి జయప్రదాదేవి భర్త, 1967 లో హైకోర్టు జడ్జిగా నియమించబడిన న్యాయమూర్తి శ్రీ ఆవుల సాంబశివరావుగారు, వారి రెండవ కుమార్తె సౌభాగ్యవతి మంజులత, ఆయన మూడవ కుమారుడు చిరంజీవి శ్రీనాథ్ ప్రయాణంచేశారు. వారుకూడా హాలిడే హోమ్‌లో వసతి ఏర్పరచుకొని యుండినారు. ఈదఫా వసతిగృహంవారి బస్సు అక్కడకు రాలేదు. అందువల్ల మే మొక టాక్సీలో హాలిడే హోమ్‌కు చేరుకొన్నాం. శ్రీ సాంబశివరావుగారు తన యిద్దరి పిల్లలతో ఒక డీలక్స్ రూములో ప్రవేశించారు. అది అంతగా అనుకూలంగా లేనందువలన, రెండవ ప్రక్కన భోజనశాలకు దగ్గరగా బయటకువెళ్లే ప్రధాన రోడ్డు మీాద ఎత్తుగా కట్టబడియున్న 2, 3 గదుల వరుసలో ఒక పెద్ద గదిలోకి మారారు. అది అన్ని వసతులుగల పెద్ద హాలువంటి గది. స్నానగది వగైరాతో అనుకూలంగా వుండినది. నా కీ దఫా యిచ్చిన డబల్‌రూము భోజనశాలకు దగ్గరేగాని, ఎదురుగానే వున్నదిగాని అ దొక చిన్న రోడ్డుమీాద కొంచెందూరంలో

వున్నది. దీనికి డబుల్ రూమ్ అని పేరుపెట్టినా ఒక్కటే మంచం. చలిప్రదేశంకాబట్టి నూతనదంపతులు ఒకరి నొకరు కౌగలించు కొని నిద్రించుటకు ఆ సింగిల్ బెడ్ ఉపయోగపడుతుందిగాని, యిద్దరు మగవాళ్లు పడుకొనుటకు అనువైనదికాదు. పైగా, ఆ మంచం బిగువు తక్కువ. దానిపైని పరుపు బాగుండలేదు. మరిన్ని, గది నేలమీద పరచిన కొబ్బరితాడుచాప చాలా ప్రాతది, మురికిది. నా కవసరమైన యూరపియన్ పద్ధతి కమోడున్నది గాని, ముఖంకడుగుకొనుట కవసరమైన బేసిన్ లేదు. విడి బేసిన్‌ను తెప్పించాను సామాన్యమైన టేబుల్ వున్నది. ఒకటో రెండో కుర్చీ లున్నవి. స్నానాని కని ఒక స్టూలు నిచ్చారు. క్రిందటి దఫా వుండిన సింగిల్ రూముకంటె మెరుగుగాని, అప్పుడిచ్చిన 20 రూపాయలకంటె 12 రూపాయలు జాస్తి యివ్వటం హెచ్చనిపించింది. సరే! గ్రుడ్డిలో మెల్ల అని వచ్చినందుకు ఏదో విధంగా సరిపెట్టుకోవాలని సమాధానపరచుకొన్నాను.

మొదటి దఫాయే శ్రీ రంగస్వామిరెడ్డిగారితో కలసి కొడైకెనాల్ సరస్సుకు వెళ్లాను. ఈసరస్సు మిక్కిలి పెద్దది. చుట్టుకొలత 3 మైళ్లకు తక్కువుండదు. ఈ 3 మైళ్లు షికారుగా తిరిగిరావటాని కనుకూలమైన రోడ్డున్నది. సరిహద్దున పూల మొక్కలు, పండ్లతోటలు గల పెద్ద పెద్ద బంగళా లున్నవి. సరస్సుకు సంబంధించిన పెద్ద బోట్‌హౌస్ (పడవల యిల్లు) వున్నది. ఉపాహారాలకు చిన్న రెస్టారాంట్ (విక్రయశాల) వున్నది. నీరు పుష్కలంగా, స్వచ్ఛంగా ఉంటుంది. గంట కింతని అద్దె కిచ్చే షికారు పడవలు చాలా వున్నవి. అన్నివేళలలోను సరస్సుమీద ఈ పడవలలో వినోదిస్తారు. ముఖ్యంగా సాయంత్రం ఒక్కొక్కప్పుడు పడవ దొరకటం కష్టం. పడవలలో వినోదానికి కాచుకొనియున్నవారు, షికారుకు వచ్చినవారు అక్కడమర్చబడియున్న బెంచీలలో, కుర్చీలలో కూర్చుని పడవలలో విహారించే పడుచులను, పడుచువాళ్లను, వారి విలాస చేష్టలను చూచి ఆనందిస్తారు. వయస్సుమళ్లినవారు, ముతక, ముసలి పడవలలో షికారుచేయాలని ఉబలాటపడి అవకతవకలయ్యే వారి పాట్లు

చూచి వినోదిస్తారు. మధ్యాహ్నం 4½ గంట లయ్యేటప్పటికి ఆ ప్రదేశమంతా జనసమూహంతో క్రిక్కిరిసి వుంటుంది. సాయంత్రం 6½ గంటలకు చాలామంది వెళ్లిపోతారు. ఆసమీపంలోనే ఒక ప్రక్కగా టెన్నిసు మొదలైన ఆటల నాడుకొనుట కవకాశ మున్నది.

నేను మొదటి దశలోను, రెండవసారి వెళ్లినప్పుడు ఎక్కువగా సరస్సుచుట్టూ నడచి కొంత వ్యాయామాన్ని, కొంత వినోదాన్ని పొందేవాడను. ఒకనాడు సాయంత్రం, "మీ రొక నాడుకూడా పడవమీద షికారుకు వెళ్లలేదేమి ? నేను స్వయంగా పడవనడిపి సరస్సుచుట్టూ చూపుతాను" అని రంగస్వామి రెడ్డియార్ గారు పడవ నొకటి ఏర్పరచారు. అది ఒత్తిడిసమయమైనా, పడవ లభించే అవకాశం మిక్కిలి తక్కువైనా, శ్రీ రెడ్డియార్ చిరపరిచితుడును, కొంత పలుకుబడిగలవాడు నగుటనుబట్టి ఒక పడవ సమకూరింది. ఒడ్డునుండి కొంత లోతుగా నీ రుండినది. పడవ చిన్నదికాబట్టి, దానిలోనికి వెళ్లటానికి కొంత దిగవలసి వచ్చింది. దానికే నేను జంకాను. నా కప్పటికి 71 సంవత్సరాలు నిండబోతున్నవి. పైగా కొంతకాలంనుండి దృష్టిమాంద్యం కలిగింది. అందువల్ల ఆ భయం. అయినా శ్రీ రెడ్డిగారి సహాయంతో మెల్లగా ఆ పడవలోకి దిగాను. శ్రీ రెడ్డిగారు ఇంచుమించు ఒక గంటసేపు నన్ను నాల్గుమూలలా త్రిప్పారు. అప్పుడున్న ఒత్తిడిలో అరగంటలోపుగానే తిరిగి రావలసింది. నే నది గుర్తు చేయగా, "ఫరవాలేదులే" అని ఎక్కువసేపు పడవలో త్రిప్పారు. తరువాత, తిరిగి పడవ షికారుకు వెళ్లలేదు.

నేను రెండవసారి మే 16-వ తారీఖున చేరుకొన్న మర్నాడుదయం శ్రీ సాంబశివరావుగారు, వారి పిల్లలు, నేను కలసి "పిల్లర్ రాక్స్" చూచిన తర్వాత, ఆ మధ్యాహ్నం 4 గంటలకు బయలుదేరిన హోటల్ బస్సులో, సరస్సుకు మే మందరం వెళ్లాం. ప్రప్రధమంగా ఆ సంవత్సరం 17-వ తారీఖునుండి 31-వ తారీఖువరకు కొడైకెనాల్ బోట్లుత్సవం చేయాలని నిశ్చ

యించారు. ఆరోజున "బోట్ క్లబ్ డే" అను పేరుతో క్లబ్బు ఆవరణలో ఉత్సవా న్నారంభించారు. ఆటామిక్ ఎనర్జి స్పెషలిస్ట్‌గా పేరుపొందిన ప్రొఫెసర్ సేత్న అనేవారు ముఖ్య అతిథిగావచ్చి ప్రారంభోత్సవం చేశారు. ఆయన భార్యగారు కూడా వచ్చియుండినారు. మదురై జిల్లా కలెక్టర్ బెల్లియప్పగారు ఆ సమావేశాని కధ్యక్షత వహించారు. హాలిడే హోమ్ ప్రొప్రైటర్ శ్రీ పి. ( పెరియనాయకమ్ ) పొన్నుస్వామినాడార్ గారు స్వాగతం చెప్పారు. ఈయన బోట్ క్లబ్బు ఉపాధ్యక్షులట. పోలీస్ డిప్యూటీ ఇన్‌స్పెక్టర్ జనరల్ శ్రీ నారాయణస్వామిగారు, మరి కొందరు యితరులు మాట్లాడారు. ఆ సమావేశంలో శ్రీ వి. యస్. కె. దొరస్వామినాడార్ గారిని చూచాను. నేను 1929 లో ఇన్‌కమ్‌టాక్స్ డిపార్ట్‌మెంట్‌లో చేరినప్పుడు వారు మొదటి సర్కిల్‌లో ఇన్‌స్పెక్టరుగా వుండినారు. సమర్థుడు, కష్టపడేవారు. లెక్కలలో మిక్కిలి దిట్ట యని పేరుపొందినారు. వారు క్రమేణ ఉద్యోగ నిచ్చెన మెట్లెక్కి చివరిమెట్టు ఇన్‌కమ్‌టాక్స్ కమిషనర్ పదవికి చేరుకొన్నారు. ఆ పదవిలో కొంతకాలం బాధ్యతలు నిర్వహించి, రిటైరై యుండినారు. ఆయన మామగా రిల్లు కొడై కెనాల్‌లో వున్నదట. "అందులో వుంటున్నాను, ఇంకొక మాసం వుంటా"నన్నారు.

శ్రీ సాంబశివరావుగారికి కొడైకెనాల్ కొట్టినపిండి. వారదివర కిక్కడకు 8 సార్లు వచ్చియుండినారట. ఈ 8 సార్లలో కొడైకెనాల్ పరిసరాల నన్నిటిని క్షుణ్ణంగా తెలిసికొన్నారట. కష్టమైన త్రోవల నన్నింటిని నడచి చూచారట. విశాఖ పట్టణంలో నేగాక, ఇక్కడకూడా "డాల్ఫిన్ నోస్" అనే కొండ శిలవున్నది. "అక్కడకు వెళ్దాం" అని యిరుకు త్రోవలగుండా, తుప్పలమధ్యగా కొంతదూరం వెళ్లినతర్వాత, త్రోవ బాగా చెడిపోయి చిన్న పెద్ద రాళ్ళతో ఎగుడు దిగుడుగా నిండియుండిన త్రోవ వెంట తీసుకొనివెళ్లారు. నాకు నడవటం చాలా కష్టమైంది

గాని, దారిలో కబుర్లుచెప్పుకుంటూ వెళ్లాం గనుక ఆ మాటల ముచ్చట్లలో కష్టాన్ని భరించగలిగాను.

శ్రీ సాంబశివరావుగారు తాను 1967 ఏప్రిల్‌లో హైకోర్టు జడ్జి అయిన దానికి 5, 6 సంవత్సరాలకు ముందే జడ్జి కావలసిందట. అప్పుడు చీఫ్‌జస్టిస్‌గావుండిన వారెవరినో దృష్టిలోపెట్టుకొని వీరి అవకాశానికి అడ్డువచ్చారట. ఇతర జడ్జీలు ఒకప్పుడు సుప్రీంకోర్టు ముఖ్యన్యాయాధిపతి హైదరాబాదుకు వచ్చినప్పుడు వీరి పేరు సిఫారసుచేసినా, స్టేట్ ముఖ్యన్యాయాధిపతికి వ్యతిరేకంగా వీరి నప్పుడు నియమించటాని కవకాశంలేకపోయిందట. అదృష్టంచాలకపోతే చేతికర్ర పామైకరచినట్లు అనుకూలంగా వుండవలసినవారే, వ్యతిరేకమౌతారు.

శ్రీ సాంబశివరావుగారి అబ్బాయి శ్రీనాథ్‌తో నేను, "నీవు తయారౌతున్న యువకుడవు, బోట్‌హౌస్‌కు వెళ్లి పడవ నడపటం నేర్చుకో" అని చెప్పగా, తండ్రి సమ్మతించినందున, అప్పటికి వారికి కూడా పరిచయమైయుండిన శ్రీ రంగస్వామిరెడ్డిగారితో శ్రీనాథ్‌ని పంపివేశాం. ఒకనాడుదయం శ్రీ సాంబశివరావుగారు, సౌభాగ్యవతి మంజులత, నేను కలసి ఫెయిరిఫాల్స్‌మీదుగా కొంతదూరం నడచి వెళ్లి, అక్కడ కొంతసేపు విశ్రమించి, పిచ్చాపాటి మాట్లాడుకొని వచ్చాం. 4 గంటల బస్సులో బయలుదేరి సరస్సుకు వెళ్లేముందు బ్రయంట్‌పార్కు అనే పూలతోటను చూచాం. అక్కడి విశేషం, అనేకమైన రకరకాల గులాబీపూలమొక్కలున్నవి. మరిన్ని, మంచి డాలియాస్ పూలతోట్లున్నవి. ఇతర రంగురంగుల పుష్పాలున్నవి. సరస్సుకువెళ్లి దానిచూట్టూ షికారుచేసి ఆనాడు (19 మే) ఇంటికి చేరుకొన్నాం. 21 మే ఉదయం మేము ఉపాహారానికి భోజనశాలకు వెళ్తుండగా నాపైపునున్న సమీపగదినుండి శ్రీ కూకటి కోదండరామరెడ్డిగారనే వారు భార్యతో బైటికివచ్చారు ఆయనగారు నెల్లూరు నివాసి. తరువాత తెలిసింది, వారి భార్య నాకు గూడూరులో సుపరిచితులైన శ్రీ పెళ్లకూరి దశరథరామరెడ్డిగారి భార్య సావిత్రమ్మ సోదరిఅట. శ్రీకోదండరామరెడ్డిగారిభార్య కొంత అనారోగ్యంగా వుండినందున

చురుకుగా నడవలేకుండినారు. అందువలన మేము బైటికి వెళ్లినప్పుడు ఆమె, మంజులత కలిసి, మా వెనుక నెమ్మదిగా నడచి వచ్చేవారు. సాంబశివరావుగారు తనతోటి జడ్జి శ్రీ రామచంద్రరావు అనేవారిని, వారి భార్యను భోజనానికి పిలిచి ఆ సందడిలో ఉండిపోయినందున శ్రీ కోదండరామరెడ్డి, నేను 22-వ సాయంత్రం అంతర్జాతీయ వినోద సంతకు (ఇంటర్‌నేషనల్ ఫన్‌ఫెయిర్) వెళ్లాం. అక్కడ తినుబండారాలు, గేమ్స్ (ఆటలు) తప్ప చిత్రవిచిత్ర వస్తువుల నమ్మేశాలలు లేనేలేవు. ఒకచోట స్త్రీలకు పనికివచ్చే కొలది బట్టలున్నవి కొన్ని పుస్తకాలింకొకచోటున్నవి. నేను, స్వీడన్ దేశస్థులు సాగించిన ఫలహారశాలలో మాంసపు వుండలు, అమెరికావారు పెట్టినశాలలో మాంసం, ఉల్లిపాయలు, దోసముక్కలు వగైరాతో చేసిన శాండ్‌విచెస్‌ను కొని తిన్నాను. కొన్ని కోదండరామరెడ్డిగారి కిచ్చాను.

23-వ తారీఖు ఉదయం సాంబశివరావుగారి కుటుంబం, శ్రీ కోదండరామరెడ్డిగారు, వారిభార్య, అప్పటికివచ్చి యుండిన వారిద్దరు కుమార్తెలు, గాల్ఫ్‌క్లబ్బు వద్దనున్న సూయిసైడ్ పాయింట్ (ఆత్మహత్య చేసుకొనేచోటు), హిల్‌టాప్‌వ్యూ (కొండ శిఖరంనుండి దృశ్యం), శ్రీమతి స్కడ్డర్‌తోట చూచి తిరిగివచ్చాం. గాల్ఫ్‌క్లబ్బు మధ్యరకందిగాని, గాల్ఫ్‌ఆట ఆడుకునే పచ్చికబయళ్లు విశాలంగాను, విస్తృతంగాను వుండినవి. క్లబ్బు ఆవరణలోవున్న సూయిసైడ్ పాయింట్, మైసూరులో శెరింగపటం అనే శ్రీరంగపట్నాన్ని స్వాధీనంచేసుకొన్న టిప్పుసుల్తాన్ కొండ ఎత్తుభాగంనుండి అగాధమైన లోయలోకి శత్రువులనో, దుష్టులనో పడదోసేవాడని చెప్పబడే అగాధమైన లోయవంటి దాని నొకప్పుడు చూచాను. అటువంటిదికూడా ఇది దొకమూల నున్నది. పైనుండి యీ అగాధానికి త్రోయబడినవారు క్రింది బండలమీద తునాతునకలైపోతారు. అయితే, దీనిని ఆత్మహత్య చేసుకొనే ప్రదేశమనటానికి కారణం, ఇక్కడనుండి ఒకప్పు డెవరో క్రిందకిదూకి ఆత్మహత్య చేసుకొన్నాడట. హిల్‌టాప్‌వ్యూ అనేది శ్రీమతి స్కడ్డర్ అనే పేరుగల శ్వేతస్త్రీ నివసించుచుండిన బంగళాతోట సమీపానగల కొండశిఖర దృశ్యం. ఇది కొంత

ఉత్సుకతనే కలిగిస్తుంది. శ్రీమతి స్కడ్డర్ ఉత్తర ఆర్కాట్ జిల్లా రాయవేలూరులోని క్రిస్టియన్ మిషన్ హాస్పిటల్‌ను స్థాపించి, కొన్ని సంవత్సరాలు దానిని సమర్థవంతంగా నడిపి, ఇక్కడ విశ్రాంతి తీసుకొనుచుండిన మహితాత్మురాలు. బంగళా మామూలు పద్ధతిలో కొన్ని హాల్సు, గదులు, వరండాలు కలిగిన పెద్దభవనమే. కాని, దానిలో ప్రత్యేక విశేష మేమీవున్నట్లు నాకు తోచ లేదు. తోటమాత్రం చాలా పూలమొక్కలు, గుల్మాదులతో అక్కడక్కడ చెట్లతో నిండియున్నది. పైగా, ఆ తోట ఒకభాగం ఏటవాలుగా, అంతరాలుగావుండి హృదయరంజనం కలిగించింది. వీనిని చూచుకొని తిరిగి వచ్చాం.

మధ్యాహ్నం బస్సులో తిరిగి అంతర్జాతీయ వేడుకల సంత వంటి ప్రదర్శనానికి వెళ్లాను. అమెరికన్ స్టాల్ లో మాంసపురొట్టె బిళ్లలు, గుజరాతీ యిడ్లీలు తిన్నాను. శ్రీ రాజా అన్నామలై చెట్టియార్ గారి అల్లుడు శ్రీ వెంకటాచల చెట్టియార్ గారిని ఆ సాయంత్రం "ఏమేమి వినోదాలు జరుగుతవ" నడుగగా, "యిక్కడ యీ సాయంత్రం చెప్పుకోవలసిన వేమీ లేవు. అనతిదూరంలో వున్న జయరాజ్ హాలులో శ్రీమతి పద్మా సుబ్రహ్మణ్యంగారి నృత్యం వుంటుం"దని చెప్పాడు. శ్రీ రంగస్వామిరెడ్డిగారు కనపడి, "నృత్యమునకు వెళదాం" రమ్మనగా జయరాజ్ హాలుకు వెళ్లాం. నర్తకి శ్రీమతి పద్మా సుబ్రహ్మణ్యం ఆకర్షణీయం గల వ్యక్తిత్వం గలవారు. పద, హస్త విన్యాసాలు చురుకుగాను, తేలికగాను, విలాససహితముగాను వుండినవి. ఆమె హావభావాలు కూడా బాగా వుండినవి. అయితే, ప్రొద్దుపోతున్నదని మధ్య విరామ కాలంవరకే వుండి, టాక్సీలో హోటలునకు వెళ్లాను.

మర్నాడుదయం (24-వ తారీఖు) శ్రీ సాంబశివరావు, శ్రీనాథ్, మంజులత, నేను షికారుకు బయలుదేరాం. సాంబశివ రావుగారు బేర్ షోలాపాక్సుకు వెళ్లాలన్నారు. "సరే" అని కొంత దూరం వెళ్లాక మంజులత చెప్పు తెగినందున తిరిగి వచ్చాం. 25-వ తారీఖు ఉదయం సాంబశివరావుగారు, వారి పిల్లలు, కోదండ

రామరెడ్డిగారు కలసి అక్కడక్కడకు వెళ్లగా, నేను పిల్లర్ రాక్సుకు వెళ్లాను. అక్కడ చాలామంది క్రిస్టియన్ సన్యాసినులు (నన్స్) జట్టుగా కనిపించారు. ప్రశ్నించగా "వినోదయాత్రగా తిరుచునాపల్లినుండి టూరిస్టు బస్సులో వచ్చామని, ఆ రోజు తమకు సెలవని" చెప్పారు. వారు వనభోజనానికి (పిక్‌నిక్‌కు) వచ్చి నట్లు బిస్కట్లు, కేకులు దండిగా తెచ్చుకొని కడుపు నిండా తిన్నారు. జెస్యూయిట్స్ మని చెప్పారు. సాయంత్రం బస్సులో బోట్‌క్లబ్బుకు వెళ్లి అక్కడినుండి హైస్కూల్ గ్రౌండ్సులో జరిపిన ఫాషన్ పెరేడ్ చూడటానికి వెళ్లాను. ఈ ఫాషన్ పెరేడ్‌లో ఇండియన్ స్త్రీ ఒకామైనా పాల్గొనలేదు. ఐదుగురు యూరపియన్ స్త్రీలు మాత్రం పాల్గొన్నారు. పెరేడ్ మాత్రం చాలా బాగున్నది. ప్రాతకాలపు, మధ్యకాలపు, ఆధునిక దుస్తుల తీరు చూపించారు. దీనిని ఫాషన్ పెరేడ్ అనటం సరియైన వర్ణన కాదని తోచింది.

రాత్రి భోజనంవద్ద మదురైకు చెందిన క్రిస్టియన్ దంపతులను, వారి పిల్లలను చూచాను. వా రసలు రెడ్లు అట. కాథలిక్కుమతం పుచ్చుకొన్నారట. భర్తకు వ్యవసాయం వృత్తి అట. నల్లగా, సామాన్యంగా వున్నాడు. భార్య మంచి ఎరుపు, అందగత్తె. ఈ వ్యత్యాసం గమనించటంతోనే నాకు బాధ కలిగినట్లైంది. భార్యాభర్తలు ఇంచుమించు సమాన అందంగా వుంటే నాకు సంతోషంగా వుంటుంది. భార్యా భర్తల లో ఒకరు అందంగా వుండి, రెండవవారు సామాన్యంగానో, అంద వికారంగానో వుంటే నాకు ఒకవిధమైన బాధ కలుగుతుంది. అయితే, దంపతు లిద్దరూ నల్లగా, అందవిహీనంగా వుంటే పుట్టిన పిల్లలు మరీ వికారంగా వుంటారు. ఒకరైనా అందంగా వుంటే, పుట్టిన పిల్లలలో ఒకరైనా అందంగా వుండుటకు అవకాశమున్నది. ఈవిధంగా ప్రజల మొత్తంమీద అందం స్థాయి కొంతవరకైనా పెరుగుతుంది. ఈ ఆలోచన కొంత ఉపశమనాన్ని కలిగించినా, చూచినవెంటనే నాకు మిక్కిలి చిరాకు కలుగుతుంది, అందమైన

స్త్రీకి అనాకారి భర్త దొరకటం విధిచిద్విలాసమే మోగాని, ఆమె కెంత బాధాకరంగా వుంటుందో అని బాధతో కూడిన జాలి ఆమె యందు కలుగుతుంది.

27-వ తారీఖు ఉదయం శ్రీ సాంబశివరావు, ఆయన ఇద్దరు బిడ్డలు, శ్రీ కోదండరామరెడ్డి, నేను కలసి చాలాదూరం షికారు వెళ్లాం. కొంతదూరం తూను ముఖంగా వెళ్లగా, కోకర్నవాక్ అనే మార్గం వస్తుంది. ఆ కోకర్నవాక్‌ను చుట్టి తిరిగి వచ్చాం. 5 మైళ్లైనా వెళ్లివచ్చి యుంటామని శ్రీ సాంబశివరావు అంచనా. ఆ సాయంత్రం శ్రీ దేసికర్ (శేవాక్ కులస్థులట) కనపడ్డారు. వారిని అంతకుముందు పశువుల ప్రదర్శనలో చూచాను. ఆయన మిక్కిలి ధనవంతుడు, తెలివి తేటలు కలవాడు, వ్యవసాయంలో నిపుణుడు అని తెలిసింది. మరిన్ని, స్త్రీలోలత్వం కూడిన భోగి అట. ఆయన పరిశుభ్రమైన విలువగల వస్త్రాలను ధరించి, మంచి శరీరవర్ణముతో అందంగా వుంటాడు. మనిషి మధ్యరకం లావుతో కొంత పొట్టిగానే కనపడతాడుగాని, కొంత వ్యక్తిత్వం కలవాడు.

ఈరోజు మే 28-వ తారీఖు. ఈరోజు 30, 31-వ తారీఖులలో క్రొత్తగా కొడైకెనాల్‌లో ఆరంభించిన వేసవి వినోదాలలో అలంకరించిన పడవల ఉత్సవం యీ ఉదయం జరిగింది. ఈ ఉత్సవంలో 13 పడవలు, చిన్న బార్జిస్ వంటివి పాల్గొన్నవి. పారిశ్రామిక, వ్యాపారిక, వ్యావసాయిక పడవలు, గవర్నమెంటు అడవుల, మత్స్యపరిశ్రమ డిపార్ట్‌మెంట్ల పడవలు, మదురై దేవస్థానం, ఫాక్ట్స అనే రసాయన ఎరువులు వగైరా ఉత్పత్తిచేసే ఫాక్టరీ, కొడైకెనాల్ పట్టణం, సీతాలక్ష్మి అనే బట్టల దుకాణం, తిరుచునాపల్లి పోలీసు పడవలు పాల్గొన్నవి. పోలీసు వాయిద్యదళం (బ్యాండు) వాయిద్యాన్ని సాగించింది. ఈ 13 పడవలలో కొన్ని చాలా బాగున్నవి. వానిలో ఎరువులు, రసాయనాలు ఉత్పత్తి చేసే ఫాక్ట్స కంపెని వారిది అత్యుత్తమ మనిపించింది. ఆ ఉదయం ప్రశాంతమైన సూర్యరశ్మితో వాతావరణం మిక్కిలి హాయిని గొల్పేదిగా వున్నది. ఈ చిన్న

కొడైకెనాల్‌కు యీఉత్సవం మిక్కిలి మంచి దనిపించింది. సాయంత్రం వర్షంవల్ల బైటికి వెళ్ళలేదు. వర్షం వెలిసిన తర్వాత మంజులత నాగదికి వచ్చింది. ఆమెకు సారస్వతమంటే మిక్కిలి యిష్టం. కొన్ని మంచి యింగ్లీషు పుస్తకాలు, నావెల్సు చదివి యున్నది. తెలుగులో సారస్వత ఎమ్. ఎ. కు చదువుచున్నదట.

29-వ తారీఖు ఉదయం టిఫిన్ తర్వాత మామూలు అయిదుగురం నడకకు బయలుదేరి పిల్లర్ రాక్స్‌కు వెళ్ళే త్రోవ వెంబడి కొంతదూరం వెళ్లిన తర్వాత శ్రీ సాంబశివరావు ఎడమ ప్రక్కకు తిరిగి, చెట్లమధ్యకు తీసుకొని వెళ్లాడు. ఆ ప్రాంత మంతా చాలా స్ట్రాబెర్రీ పొదలతో నిండియున్నది. అయితే, ఈ స్ట్రాబెర్రీ పొదలు మామూలుగా ఉపయోగించే పెద్ద పండ్ల నిచ్చే పొదలు గాక, అడవి పొదలవలె వున్నవి. పండ్లు చిన్న వేపకాయ లంత మాత్రమే వున్నవి. అక్క డక్కడ కనపడిన కొన్ని పండ్లను కోసుకుని తిన్నాం. వానిలో చాలాభాగం పుల్లగా వున్నవి. సాయంత్రం ఆలస్యంగా బోట్ హౌస్‌కు వెళ్లాను. అక్కడకు వచ్చియుండిన శ్రీనాథ్, నేను కలసి షికారుగా పైభాగంలో వున్న హోటల్ షైన్‌కు వెళ్లి, తిరిగివచ్చి 6½ గంటలకు హోటల్ బస్సులో ఎక్కి కూర్చున్నాం. సుమారు 7½ గంటలకుగాని బస్సు డ్రైవర్ సోమునాడార్ బస్సును బయలుదేరదీయలేదు. ఈ డ్రైవర్‌ను గురించి పైన చెప్పియేయున్నాను. ఇత డొకప్పుడు నిరంకుశంగా, తన ప్రాముఖ్యం తెలియపర్చాలన్నట్లుగా నడచుకుంటాడు.

30-వ తేదీ ఉదయం తిరిగి పడవల పోటీలు. చిన్న వయస్కులనుండి పెద్దవాళ్లవరకు ఆడ, మగ జాబీలు, వారి వారి వయస్సునుబట్టి తరగతులవారీగా పందాలలో పాల్గొన్నారు. ఈపోటీలలో యుక్తవయస్సువచ్చిన ఆడపిల్లలేగాక, ఒక పడవను పోటీగా నడపిన ఒక అమ్మాయి ఇంకా యుక్తవయస్సురాని ఏ 12, 13 ఏళ్ల పిల్లో అనిపించింది. మిక్కిలి ఉత్సాహంతో యావచ్ఛక్తి నుపయోగించి పడవను పరుగెత్తించింది. చిన్న వయస్సుగల పిల్లల పోటీలో ఆమె ప్రథమస్థానం గెలిచింది.

31 ఉదయం కూడా జరిగిన పడవల పోటీని చూడటానికి బోట్ క్లబ్బుకు వెళ్లాను. నిన్నటికంటె ఈరోజు పందాలు మరీ ఉత్సాహకరంగా వున్నవి. పోటీలు పూర్తిగా చూడాలంటే ఈ బోట్ హౌస్ ఒక భాగానికి పైనున్న అంతస్థులో, కాంటీన్ (ఉపాహారశాల) పెట్టిన చోటుకు వెళ్లాలి. అక్కడకు వెళ్లటానికి మనిషికి రూపాయ చొప్పున పుచ్చుకొన్నారు. ఆసమయాని కక్కడ మదురై కలెక్టరుగారు శ్రీ బల్లియప్ప, మద్రాసు మంత్రి ఒకరు, ఒక కేరళ మంత్రి వచ్చియున్నారు. నేను కలెక్టర్ బల్లియప్పగారిని, "కొన్ని సంవత్సరాలక్రితం జిల్లా అడవుల ఆఫీసర్ గా పనిచేసి, నేను బరంపురంలో ఇన్ కంటాక్స్ ఆఫీసర్ గా నుండి నప్పుడు తెలిసియుండిన శ్రీ కె. జి. బలియప్పగారు మీ బంధువులా?" అని అడిగాను. "బంధువు కాదు. ఆయన చాలా కాలం క్రిందట కదా ఉద్యోగం చేసింది?" అని అన్నారు. ఆ సాయంత్రం షికారులో శ్రీ సాంబశివరావు తన వకీలు వృత్తిలోని కొన్ని అనుభవాలు చెప్పారు. చీఫ్ జస్టిస్ లీచ్, జస్టిస్ బాయడ్ గార్లు తనను దయతో చూచిన విషయాలు చెప్పారు.

మర్నాడు జూన్ 1969 సంవత్సరం 1-వ తారీఖు మధ్యాహ్నం మద్రాసుకు బయలుదేరే ప్రయత్నంలో పెట్టె, బేడ సర్దుకొని 10 గంటలకు హోటలు ఆఫీసులో కూర్చొని, అదివరకే ఆఫీసులోనివారు "ఫోను చేశాం, వస్తుం"దని చెప్పిన టాక్సీకొరకు ఎదురుచూచుచుండినాను. అది రాకపోగా 2, 3 సార్లు ఫోను చేయించగా, "వస్తానన్న టాక్సీవాడు ఎక్కడికో పోయాడట, మరొక టాక్సీ దొరకలేదు" అన్నారు. నేను టౌనులోని బస్సు స్టాండుకు వెళ్లి 11-40 బస్సులో బయలుదేరాలని ఆదుర్దాతో వుండినాను. టౌట్ ఏజన్సీకి ఫోనుచేయగా "ఉదయం గం. 11-40 ని.లకు బయలుదేరే బస్సులోగాక, మధ్యాహ్నం గం. 1-30 ని.లకు బయలుదేరే బస్సులోకూడా ఖాళీలే"దని జవాబు వచ్చింది. మద్రాసుకు వెళ్లే రైలు సాయంత్రం 5-30 గంటలకు కొడైకెనాల్ రోడ్డు స్టేషను నుండి బయలుదేరుతుంది. 1-30 బస్సులో బయలుదేరినా,

దాని నందుకోవటాని కవకాశమున్నదిగాని, దారిలో బస్సు యిబ్బందిపెడితే ఆ రైలు తప్పిపోతుంది. దానికి టిక్కెట్టుకొని బర్త్ రిజర్వుచేయించుకొని వున్నాను. అందువల్ల ఎట్లైనా గం. 11-30 ని. ల బస్సులో బయలుదేరాలని హోటల్ ఆఫీసులోని వాళ్లను గట్టిగా మందలించగా, అక్కడ మావలె వచ్చిన కృష్ణన్ అనే వారిని ఆఫీసులోని వారొకరు కోరగా ఆయన దయదలచి నన్ను సకాలంలో బస్ స్టాండ్‌కు చేర్చాడు. ఈ కృష్ణన్‌గారు బొంబాయిలో ఫిలిప్స్ కంపెనీలో పనిచేస్తూండినారట. ఆయన మంచివాడు కాబట్టి సరిపోయింది. నేను బస్ స్టాండ్‌కు చేరుకొనగా, నేను మధ్యలో మే 7-వ తారీఖున మద్రాసుకు వెళ్లినప్పుడు పరిచయమైన డేవిడ్ అనే వారు కనపడ్డారు. ఆయన రైల్వే ఉద్యోగి. కొడైకెనాల్ ఔట్ ఏజన్సీనుండి నడిపే బస్సులు, రైల్వే అధికారానికి లోబడి నడుస్తవి. అందువల్ల ఆయన సహాయ మర్థించగా, డేవిడ్‌గారు గం. 11-30 నిమిషముల బస్సులోనే తాను స్వయంగా వచ్చి నాకు సీటు ఏర్పాటుచేశారు. మామూలుగా ప్రయాణంచేసి, కొడైకెనాల్‌రోడ్డు రైల్వేస్టేషన్‌కు చేరుకొని, అక్కడి భోజనశాలలో ఉపాహారం తీసుకొని, సావకాశంగానే రైలెక్కి, మర్నాడుదయం 6 గంటలకు మద్రాస్ ఎగ్మూర్ స్టేషన్‌కు చేరుకొన్నాను. ఇక్కడితో నా కొడైకెనాల్ యాత్ర సమాప్తమైంది. తిరిగి వెళ్లలేదు. వెళ్లుతానని కూడా అనుకోవటం లేదు.

హోటల్ యజమాని శ్రీ పొన్నుస్వామినాడార్ మర్యాదస్థుడు, సరసుడు. అయితే, పక్కా వ్యాపారమనస్తత్వంగల వాడు. మొదటి రోజులలో అనుకూలంగావున్న భోజనం, క్రమేణా క్షీణించింది. మధ్యాహ్నం మాంసాహారాదుల భోజనం కూడా పరిమాణంలోను, గుణంలోను తగ్గింది. సంవత్సరానికి ఏ రెండు మాసాలో ఆ ప్రాతబిల్డింగుల నుపయోగించుకొని వసతి గృహాన్ని నడపటం, కొన్నివేలు సంపాదించి మూటగట్టుకొని వెళ్లటం, తిరిగి ఆ ప్రక్కకు తొంగిచూడక పోవటమే పరిపాటి. అట్టి మనస్తత్వం కలవారికి అతిథుల సుఖసౌఖ్యాలు రెండో పక్షం. ఆయన వంటవాళ్లనేగాక నీళ్లు, ఉపాహారాలు వగైరా సప్లైచేసే

యువకులను, ఆఫీసులో పని చేసేవారిని తాత్కాలికంగా ఏర్పరచుకుంటాడట. ఆదిలో నేను సింగిల్ రూములో వున్నప్పుడు నాకు వేడినీళ్లువగైరా సరఫరా చేసే యువకుడు విద్యార్థి అట. వేసవిలో నాలుగు డబ్బులు సంపాదించుకొని చదువు సాగించుకొనుచున్నాడట. ఆవిధముగా నేమరొకరిద్దరుకూడా. ఆఫీసులోనున్న వారొకరు (శ్రీ) మురగేశన్ వకీలు పరీక్ష పాసై యున్నాడట. ఈ నాడార్ కుటుంబంనుండి కొంత సాయం పొందియున్నాడట. "వేసవిలో కోర్టులు కట్టివేస్తారుకదా. నెలరోజులపాటు మాకు సహాయంగావుంటే నీకు లాభిస్తుం"దని చెప్పి ఒప్పించటం వల్ల ఇక్కడకు వచ్చాడట. ఈ హోటల్ మూయటంతోనే ఆయన వకీలు ప్రాక్టీసుకు వెళ్లిపోతానని చెప్పాడు.

ఈవసతి ప్రొప్రైటర్సు క్రిస్టియన్ మతం పుచ్చుకొన్న నాడారుట. "మీరుంటున్నది డబుల్ రూమ్ అయినా భోజనం చేసింది మీరొక్కరేకదా, ప్రొప్రైటరును రాహితి అడగం"డని ఒకరు సలహా యిచ్చారు. "వారికి తోచాలిగాని, నే నర్థించేవాడను కా"నని జవాబు చెప్పాను.

నేను మే 7-వ తారీఖు రాత్రి రైలులో మద్రాసుకు వెళ్లటానికి టిక్కెట్టు ముందుగానే కొని, ఆ రైల్వే ఔట్ ఏజన్సీని నడిపేవారిచేత పడుకునే బర్తు క్రిందదిగా ఏర్పాటు చేసుకొన్నాను. ఆవిధముగా ఆయన నమోదుచేసుకొని, మదురై స్టేషన్‌కు తెల్పుతా నన్నాడు. తీరా నేను రైలుస్టేషన్‌కు వెళ్లినప్పుడు నాకొక రెండు బర్తుల కంపార్ట్‌మెంట్ చూపించారు. క్రింద బర్తులో రాధాకృష్ణన్ అను పేరుగల మళయాళీ యువకుడు సింగర్ కుట్టుపని యంత్రాలను అమ్మే కంపెనీ ప్రతినిధి వశపరచుకొని యున్నాడు. ఇది డి. కంపార్ట్‌మెంట్. నాకు క్రింద బర్తు రిజర్వు చేసింది బి. కంపార్ట్‌మెంట్. అక్కడకు వెళ్లి చూడగా అరవ దంపతు లిద్దరు పిల్లలతోసహా ఆ నాలుగుబర్తుల కంపార్టుమెంట్ లోని క్రింది రెండు బర్తులను ఆక్రమించుకొని యున్నారు. వారు, "మేము మొదటనే ఈ కంపార్ట్‌మెంట్‌లో రెండు క్రింది బర్తులను రిజర్వు చేయించుకొని యున్నా"మని ఘర్షణకు దిగారు. నేను డి. కంపార్ట్‌మెంట్‌కు తిరిగివెళ్లి (శ్రీ) రాధాకృష్ణన్‌ను కోరగా, నేను

వయస్సుమళ్లినవాడనుకాబట్టి, "సరే, నేను పై బర్తుకు వెళ్లుతా" వని చెప్పాడు. కొడైకెనాల్ నుండి రైలు దిండిగల్ కు చేరుకుంది. అక్కడ రామసుబ్బు అనే టిన్నెవల్లి కమ్మ యువకుడు మిలిటరీలో పనిచేస్తున్నవాడు వచ్చి, రాధాకృష్ణన్ పడుకొన్న సీటు తనకు రిజర్వు చేయబడిందని చెప్పి ఆ బర్తును తీసుకొన్నాడు. ఇంతలో ట్రెయిన్ కండక్టర్ వచ్చి "మీకు బి. కంపార్ట్మెంట్ లో పై బర్తు రిజర్వు అయి వుండింది, మీ రక్కడకు వెళ్లం" డని తొందరపెట్టాడు. నేను "ససేమిరా వెళ్ల" ననగా శ్రీ రాధాకృష్ణన్ వెళ్లవలసి వచ్చింది. ఇక్కడ తప్పకుండా కుంభకోణం జరిగింది. బి. కంపార్ట్మెంట్ లోని క్రింది రెండు బర్తులను ఆక్రమించుకొన్నవారు రైల్వే ఉద్యోగులో, లేక ట్రెయిన్ కండక్టర్ కు బాగా తెలిసినవారో, లేక అతని చేతిని తడిపినవారో అయి వుండాలి. అందువల్ల మదురై స్టేషన్ లో బి. కంపార్ట్మెంట్ లోని రెండు క్రింది బర్తులను ఆ భార్యా భర్తల కిచ్చారు. దీనిలో కొంత మాదచ్చోది కొడైకెనాల్ రోడ్డు స్టేషన్ మాస్టరుకు కూడా వుండి వుంటుంది. నేను రైలుస్టేషన్ కు చేరుకొనగానే ఆయనను కలుసుకొన్నాను. "రైలు రానివ్వండి, మిమ్ములను మీ కంపార్ట్మెంట్ లో ఎక్కిస్తా" నన్నాడు. నేను మద్రాసు చేరుకొన్న వెంటనే తిరుచునాపల్లి ట్రాఫిక్ సూపరింటెండెంటుకు వ్రాశాను. వారి సమాధాన మేమనగా, "కొడైకెనాల్ ఔటు ఏజన్సీలోని ఉద్యోగి 7-వ తారీఖు రాత్రి ఫలానా బండిలో అని తెలియపర్చాడు గాని, క్రింది బర్తు అని తెలుపలేదు. అందువల్ల ఖాళీలేక మీకు ఆ బర్తిచ్చా" రని తెలిపాడు. తిరిగి నేను 16-వ తారీఖున కొడైకెనాల్ కు చేరుకొన్నప్పుడు ఔటు ఏజన్సీ ఉద్యోగి నడిగాను. "లేదండి, నేను క్రింది బర్తని ఖాయంగా వ్రాశాను. నిజానికి కొడైకెనాల్ నుండి వెళ్లేవారికి కొన్ని బర్తుల కోటావున్నది. మీది మొదటిపేరుకదా" అని చెప్పాడు ఈ యిబ్బందికి కొంత ఉపశమనమో అన్నట్లు నేను జూన్ 1-వ తారీఖున మద్రాస్ తిరిగి వెళ్లుటకు కొడైకెనాల్ రోడ్డు స్టేషన్ కుచేరగానే స్టేషన్ మాస్టర్ మొగం తప్పించినా, వాళ్ల తరఫున ఒక ఉద్యోగి వచ్చి దగ్గరుండి నన్ను భద్రంగా రైలెక్కించి క్రింది బర్తును చూపించాడు. రైలు

కదిలే ముందు మరల ఒకసారి వచ్చి నేను సుఖాసీనుడనై వుండటం చూచి, మీా "కనుకూలంగా వున్నదా? సుఖంగా వెళ్లిరం" డని చెప్పాడు.

రైల్వే ఉద్యోగస్థుల అవినీతి అంతులేకుండా పెరిగిపోవు చున్నది. ఎక్కడ అవకాశమున్నదా, నాలుగు డబ్బులు పుంజు కొందా మనే ఆదుర్దాతప్ప ప్రయాణికుల అనుకూలం, సౌఖ్యం వారికి పట్టదు. నాలుగు డబ్బులు దొరుకుత వనుకుంటే, సీట్లను తారుమారుచేసి, అదివరకు రిజర్వుచేయించుకొన్నవారిని మోసంచేసి, అప్పుడే వచ్చిన క్రొత్తవారికి బర్తులు చూపటం, "ఏదో యిస్తాం, మేము ( కారిడార్ ) నడవలో కూర్చుంటాం, 3-వ క్లాసులో క్రిక్కిరిసిన ప్రయాణికు లున్నారు, ఇక్కడ కొంత స్వేచ్ఛగావుంటుం" దని చెప్పి చేతిలో డబ్బులు పెట్టిన వారిని మొదటి తరగతి కోచీలో ఎక్కించు కోవటం వంటి దుశ్చేష్టలు చేస్తారు. ఇందులో టికెటు కలెక్టర్కు, ట్రెయిన్ కండక్టర్కు లాలూచీ వుంటుంది. ఈవిధంగా అనుచితమైన, అక్రమమైన పనులు వృద్ధిపొందుచున్నవేమో అనిపించుచున్నది.

కొడైకెనాల్లో నేను కలసికొన్న వారిలో ముఖ్యులు నా బంధువు, న్యాయమూర్తి ఆవుల సాంబశివరావుగారు. పై జెప్పినట్లు వారు నా పినతాత కుమారుడు లింగం వీరభద్రయ్యగారి కుమార్తె శ్రీమతి జయప్రదాదేవిని వివాహమాడియుండినారు. వారు చాలా సంవత్సరాలు మద్రాసులోను, తాత్కాలికంగా ఆంధ్ర హైకోర్టు గుంటూరులో పెట్టినప్పుడు గుంటూరులోను, తర్వాత హైదరాబాదులోను న్యాయవాదిగా పేరుప్రతిష్ఠలు పొంది, 1967 లో ఆంధ్రప్రదేశ్ హైకోర్టు న్యాయమూర్తిగా నియమింప బడినారు. వారు సంస్కారప్రియులు. చాలా సాంఘిక వ్యవస్థలలో పాల్గొనుచు, అంధులవంటి దురదృష్టులకు సాయపడే వారు. ఆయనకు హేతువాదమునందు నమ్మక మెక్కువ. శ్రీ యమ్. యన్. రాయ్ వంటి హేతువాద ప్రముఖుల ప్రభావానికి లోబడిన వారు. మరిన్నీ, సాహిత్యప్రియులు. వారి ఇంగ్లీషు, తెలుగువ్రాతలను చదువలేదుగాని వారు చక్కగా, విస్పష్టంగా మాట్లాడిన దొకటి, రెండుసార్లు విని సంతోషించాను. న్యాయవాదిగా ఆయన వాదన

వినలేదుగాని, న్యాయశాస్త్రంలో ఘటికుడనే పేరు సంపాదించారు. ఆయనదగ్గర 4, 5 గురు జూనియర్లుండేవారు. సంపాదన కొంత గొప్పగానే వుండేది. నా భార్య కుటుంబంమీద, ఆమె సోదరుని భార్య తెచ్చిన కేసులో హైకోర్టులో మా వాదనను అమలు జరిపి జయం పొందారు. న్యాయమూర్తి కాగల సమర్థత, అనుభవం కలవారనుటలో సందేహం లేదు. వారి విషయం ముగించే ముందు ఒక చిన్న అనుభవం చెప్పాలి. 1969 లో కొడైకెనాల్ లో కలుసుకొన్నప్పటికి, ఆయన న్యాయమూర్తి పదవిని స్వీకరించిన కాలం 2 సంవత్సరాలైనా నిండలేదు. అందువల్ల కాబోలు, తలవని తలంపుగా కొంత స్వాతిశయం వారిలో ప్రవేశించిందేమో అని నే ననుకోవలసి వచ్చింది. వారు న్యాయవాదిగా నుండగా, నేను హైదరాబాద్‌కు వెళ్లినప్పుడల్లా వారింటికి వెళ్లుచు, వారి మర్యాద, మన్ననలు పొందేవాడను. బంధురీత్యానేగాక, వ్యక్తిగతంగాకూడా నాపట్ల స్నేహభావంతో, సౌమ్యంగా వ్యవహరించేవారు. కాని, కొడైకెనాల్ సంభాషణలలో ఒకటి, రెండు సార్లు వారి నుండి కొన్ని కటువు మాటలు వెలువడినవి. తన దృక్పథం తెల్పటంలో న్యాయమూర్తిగా గాక, ఒక పక్షాన వాదించుచున్న న్యాయవాదివలె వ్యవహరించారు. అప్పటికింకను తన న్యాయమూర్తి పదవిని పూర్తిగా జీర్ణించుకొనియుండని కారణంవల్ల కాబోలు, జీవితంలో పైస్థాయికి చేరుకొన్నవారి మామూలు స్వోత్కర్షవల్లకాబోలు, తన హోదాకు తగనట్లుగా పాక్షిక అభిప్రాయాలు వెలిబుచ్చారని నాకు తట్టింది. నా చెల్లెలు శ్రీమతి జయప్రదాదేవి నాయందు మిక్కిలి కుటుంబాభిమానంతోనే వుంటుంది. ఆమెను బట్టి ఆమె బిడ్డలు నన్ను తమ మేనమామగా ఎంచుకొని మర్యాద, మన్ననల నందిస్తారు. కొడైకెనాల్‌లో మంజులత, శ్రీనాథ్ ఆవిధముగనే వర్తించారు.

రెండవవారు శ్రీ రంగస్వామిరెడ్డిగారు. వీరి విషయం కొంత పైన చెప్పియున్నాను. వీరు న్యాయవాదిగా మద్రాస్‌లో బల్ల కట్టియున్నారు. అంతవరకు దక్షిణాదిలో వకీలు వృత్తి నవలంబించి, బాగుగా సంపాదించి యుండినారట. మద్రాసు వకీలుతనం

లాంఛన మేమో అనిపించింది. అదివరకే భాగ్యవంతులై యుండ వచ్చును. దక్షిణాదిని సంపాదించిన డబ్బుతో ఒక మఠ సంబంధమైన పెద్ద ఆస్తిని చౌకగా కొన్నారట. దానిలోని ఇళ్లను బాగు చేయించి అద్దె కిచ్చారట. నెలకు 8 వేల రూపాయలు అద్దె వస్తుందని చెప్పారు. డబ్బు నేవిధంగా సంపాదించాలా అని ఎప్పుడూ అన్వేషించే మనస్తత్వం కలవారుగా కనపడ్డారు. ఆయన కొంత డాంబికుడైనా, స్నేహ స్వభావం కలవాడు. పరిచయం చేసుకొనటంలో, దానిని మైత్రిగా మార్చుకొనటంలో, నిలుపు కోవటంలో అభిలాష, చొరవ, ప్రజ్ఞ కలవారు. నేను 7-వ తారీఖు వరకు ఒకరు మాత్రమే వుండే గదుల వరుసలో వుండినప్పుడు, ప్రక్కగదిలో నున్న వీరు తరుచు నా గదికి వస్తూ బాతాఖానీ వేసేవారు. ఎక్కడైనా కలసికోవటం తటస్థపడితే, చప్పున వచ్చి మాట్లాడేవారు. ఆయన స్నేహితులు శ్రీ రాజగోపాల నాయుడు వంటి వారిని పరిచయపరచేవారు. కొన్నిరోజుల తర్వాత, వారి కారును వారి కుమారుడు అక్కడకు తీసుకొని రాగా, ఆ కారులో ఎక్కండని కోరేవారు. పశుప్రదర్శనం భరతనాట్యం వంటి చోట్లకు వారి కారులో తీసుకొని వెళ్లారు. సరస్సులో పడవప్రయాణం చేయటానికి నేను సందేహించుచుండగా నన్ను ప్రోత్సహించి, నన్ను పడవలోకి దింపి, తానే స్వయముగా పడవను నడిపి నాకు వినోదాన్ని కలిగించారని పైన చెప్పియున్నాను. ఆయన స్నేహం సుఖావహంగా నే వుండినది. రాజకీయాలలో, జస్టిస్ పార్టీ రాజకీయాలకు చెందిన వారు. వారికి బ్రాహ్మణ మిత్రు లున్నారుగాని, రాజకీయాల ప్రసక్తి వచ్చినప్పుడు బ్రాహ్మణులకు పూర్తి వ్యతిరేకంగా మాట్లాడేవారు. ఒకరాత్రి భోజన సమయంలో నేను కూర్చున్న టేబుల్ వద్ద రెడ్డిగారేగాక, ఆయన బ్రాహ్మణ మిత్రు లిద్దరు, ముగ్గు రుండినారు. మాటల ప్రస్తావనలో ప్రెసిడెంట్ పదవికి శ్రీ గిరిగారు పోటీకి నిలబడిన ప్రస్తావన వచ్చింది. రెడ్డిగారు, "శ్రీ గిరిగారు బ్రాహ్మణుడు. ఆయ నెంతమాత్రం ప్రెసిడెంట్ కాకూడ"దన్నారు. నే నందుకొని, "శ్రీ గిరిగారు బ్రాహ్మణ

కులంలో పుట్టినా, ఆయనకు వర్ణభేదం లేదు. ఆయన కన్ని కులాలు సమానమే. ఆయన కార్మికనాయకుడు. కార్మికులలో చాలా ఎక్కువమంది బ్రాహ్మణేతరులే కదా! పైగా ఆయన సజ్జనుడు, న్యాయాన్యాయ విచక్షణ కలవాడు. అధర్మం ఎప్పుడూ చేయడు. మరిన్ని, బాగుగా చదువుకొని, హెచ్చుగా శ్రమించి గొప్ప అనుభవాన్ని పొందిన ప్రముఖుడు. అట్టివారు ప్రెసిడెంట్ అవటం మన భాగ్యం'' అని చెప్పాను. అట్టి పూజ్యభావమే శ్రీ గిరిగారి యందు నా కుండినది. ఇప్పుడు వారు ఇండియా ప్రభుత్వం, అందులో ముఖ్యంగా ప్రధాని శ్రీమతి ఇందిరా గాంధి రబ్బరు స్టాంపుగా తయారవటం, భారతీయుల దురదృష్టం.

శ్రీ రాజగోపాలనాయుడుగారు బలిజ కులస్థుడు. మదురై నివాసి. జిల్లా జడ్జిగా చాలా సంవత్సరాలు ఉద్యోగ నిర్వహణ చేశారు. హైకోర్టు జడ్జి కాలేదుగాని, ఇంచుమించుగా అంత స్థాయికి చేరుకొన్నవారు. 1969 నాటికి 72 సంవత్సరాలు మించిన వయస్సు కలిగియుండినారు. జిల్లా జడ్జిగా రిటైరైన తర్వాత న్యాయవాదవృత్తిని తిరిగి స్వీకరించి 1969 లో కూడా కొనసాగించుచుండినారట. వారు మిక్కిలి మర్యాదస్థులు, సరసులు. స్నేహభావాన్ని ప్రస్ఫుటం చేస్తూండేవారు. ఉత్సాహంతో వింతలు, వినోదాలు చూస్తూండేవారు. నాయందు ఆదరణతో వర్తించుచు ''మదురైకు నా అతిథిగా రం''డని కోరారు. నాకువలె దృష్టిమాంద్యంగాని, తూలిగాని వారి దరికి చేరలేదు. 60 ఏళ్ల వారివలె జీవితాన్ననుభవించుటకు సిద్ధమై వుండినారు.

నెల్లూరువాసి శ్రీ కూకటి కోదండరామరెడ్డిగారు సన్నగా, నాజూకుగా, మంచిరంగుతో వుంటారు. మర్యాదస్థుడు. మాట, మంచి కలవారు. సంభాషణలలో కించిత్తైనా వివాదపూర్వకంగా మాట్లాడేవారు కాదు. మిక్కిలి ధనవంతులైనా, నిరాడంబరులు. ఆ చలిప్రదేశంలోకూడా మామూలుగా వేసవిలో వేసుకునే తెల్లని లాల్చీవంటి చొక్కాతో, దానికి సరిపడ్డ ధోవతి, పై కండువాలతో వుండేవారు. ''అవి ఖద్దరు బట్టలు కావు, మిల్లు బట్టలే. వెచ్చనిచ్చే బట్టలను తెచ్చుకోకపోయారా'' అంటే, ''ప్రయాణ

తొందరలో 1, 2 పెట్టెలు విడిచి వచ్చాం. వానికొరకు వ్రాశాం. ఇంకా రాలేదు'' అనేవారు. నే నున్నంతవర కవి రానేలేదు. నా మొదటి ఉనికిలోగాక, రెండవసారి నేను వెళ్లినప్పుడు వెళ్లిన 1, 2 రోజులకు తటస్థపడ్డారు. పైన వ్రాసినట్లు ముందు నేనే పలక రించి శ్రీ సాంబశివరావుగారికి పరిచయంచేశాను. నాతో మా మూలు మర్యాదలు జరిపినా, హైకోర్టు జడ్జిగా ఉన్నత స్థాయిలో వుండిన సాంబశివరావుగారియందే వారి కెక్కువ అభిలాష కలిగిందని అనుకొన్నాను. కృష్ణాజిల్లా కమ్మవారికి తక్కువగాని నెల్లూరు రెడ్లకు అధికారులంటే ఎక్కువ అభిమానం అని వినికిడి. అయితే, తూర్పు గోదావరి, పశ్చిమ గోదావరి జిల్లాలలో కొన్ని భాగాలలోని కమ్మవారిలో కూడా యీ బలహీనత వున్నదని 1, 2 సార్లు అనుకొన్నాను. ఈ రెడ్లు, కమ్మలు కార్యార్థపరులు.

నేను మొదటిదఫా కొడైకెనాల్ రోడ్డు స్టేషను నుండి 1960 ఏప్రిల్ 28-వ తారీఖున కొడైకెనాల్‌కు ప్రయాణంచేసిన బస్సులో నేను కూర్చున్న సీటులో ఇద్దరు యువకదంపతులు ప్రయాణించారు. వారి ప్రణయకలాపాలను చూచి నూతన్న దంపతు లని ఊహించాను. వా రిద్దరు చాలావరకు ఇంగ్లీషులో మాట్లాడుకొన్నా, అప్పుడప్పుడు తెలుగులో మాట్లాడుకొనటం వల్ల తెలుగువారని తెలుసుకొన్నాను. వారి ఇష్టాగోష్ఠిని భంగపరచటం యిష్టంలేక పరిచయమైనవాడు చూస్తూండగా, స్వేచ్ఛగా ఒకరి నొకరు ఒరుసుకొని కూర్చుని, చిరునవ్వులతో, మధురసంభాషణలతో వారి కేళీవిలాసాలను కొనసాగించుటకు సందేహిస్తారేమో అని, అందులో తెలుగువారైతే మరి కొంత యిబ్బంది పడతారేమో అని బస్సు కొడైకెనాల్‌కు చేరుకునే వరకు నేను వారిని పలకరించలేదు. దిగిన తర్వాత పలకరించి, నే నెవరినో వారికి తెలియజేసి, వా రెవరో నేను తెలుసుకొన్నాను. వారు నే నూహించినట్లు, అంతకుముందే వివాహమాడారట. వైశ్యులు. ఆ యువకుని పేరు సుధాకర్. ఆయన మద్రాస్ రౌండు తాణా వద్ద ప్రాక్టీసుపెట్టుకొనియున్న మాంబలం కాపురస్థుడు ఇ. యన్. టి. డాక్టరు శ్రీనివాసన్‌గారి పుత్రుడట. సుప్రసిద్ధ ఆడిటర్స్ ఫ్రేజర్ అండ్ రాస్ కంపెనీలో పనిచేస్తు

న్నాడట. ఆయన భార్య కళావతి బళ్లారి అమ్మాయి అట. కొంతవరకు యింగ్లీషు చదువుకొన్నది. ఇద్దరూ నలుపు వర్ణంవారు. అందమైనవారని చెప్పటానికి వీలులేదుకాని, శ్రీ సుధాకర్ చురుకు తెలివితేటలు కలవాడుగాను, కళావతి చలాకీ, వయ్యారం కలదిగాను తోచారు. వారు బస్సులోను, త్రోవలోను అప్పుడప్పుడు కనపడుచుండేవారు. ఒకరినొకరు పలుకరించుకొనేవారం. మే మెప్పుడూ కలసి ఎక్కడికీ పోలేదు. నిజాని కా నూతన దంపతులకు బయటివారి తోడు చాలా అననుకూలంగా వుండేది. వా రెవరితోను కలియక, తా మిద్దరే కెమెరాతో అప్పుడప్పుడు టాక్సీలో దూరప్రదేశాలకు వెళ్లుచుండేవారు "మీ గది కొకసారి రావా"లని చెప్పి ఒకరోజు మధ్యాహ్నం వెళ్లాను. ఆ గదినే నేను రెండవదఫా ఆక్రమించుకొన్న డబల్ రూమ్. ఆ గదిలో ఒక్క మంచమే వుండినదని పైన చెప్పాను. నూత్నదంపతులకు ఏకశయ్య మిక్కిలి అనుకూలం, సుఖావహం కదా. పది నిమిషాలు కూర్చుని ఆమాట, యీమాట చెప్పి వచ్చేశాను. అంతకు ముం దొకనాడు నేను మొదటిదఫా వుండిన గదికి వచ్చి 10 నిమిషాలుండి వెళ్లిపోయారు. నేను రెండవదఫా వెళ్లునప్పటికి వారు వెళ్లిపోయి వుండుటచేతనే వా రుండిన గది నాకు రెండవదఫా దొరికింది. "మద్రాసులో మీ యింటికి వచ్చి నేను కలుసుకొంటా"నని చెప్పానుగాని, వెళ్లనే లేదు.

కొంత బాగా పరిచయమైన పైవారు గాక, అటువంటి వినోదయాత్రాస్థలంలో గుంపు లుండిన వసతిగృహంలో, కొందరు స్వల్పముగా పరిచయ మవటం సహజమే. వారిలో, నేను 1928 లో బారిస్టర్ అడ్వొకేటుగా మద్రాస్ హైకోర్టులో పరిచయపరచబడినప్పుడు, జస్టిస్ దేవదాసుగారి కోర్టులో వారికి పరిచయం బారిస్టర్ సిడ్నీ స్మిత్ గారిచే చేయబడ్డాను. ఆ జస్టిస్ దేవదాసుగారి కుమారుడు డాక్టరు డేవిడ్ గారు నా కిక్కడ తటస్థించారు. వారు సర్జన్ జనరల్ గా ఉద్యోగ విరమణచేసి యుండినారట. వారు మిక్కిలి సరసులు, అభిమానం చూపే

స్వభావం కలవారు. వారు నేను కలుసుకొన్నప్పు డల్లా ఎంతో అభిమానంతో పలుకరించి ఆవిషయం, యీవిషయం మాట్లాడేవారు. వారి భారీ విగ్రహం, సుస్వభావం ఇతరులకు వారియందు గౌరవం కలిగించునట్టివి. ఒకనాడు, ఒకాయన వచ్చి నాకు నమస్కరించి పలకరించాడు. "నేను మీవద్ద స్టెనో గ్రాఫర్ గా పనిచేశాను, నరసింగరావును" అన్నాడు. వెంటనే గుర్తుకువచ్చి సంతసించాను. ఆయన యింటిపేరు పుల్లాంభొట్లవారు. అప్పుడు టిన్నెవల్లిలో ఇన్ కమ్‌టాక్సు ఆఫీసరుగా పనిచేస్తుండి నాడట. భార్యతో కొన్నిరోజులు గడపటానికి కొడైకెనాల్ కు వచ్చి హాలిడే హోమ్‌లో మకాం పెట్టాను. చిన్న గుమాస్తాలుగా చేరినవారు, టైపిస్టులుగా చేరినవారు బెంగాలీలవలెగాక, మన దక్షిణప్రాంతంలో ఆఫీసర్లేకాదు, శక్తిసామర్థ్యాలుండి అదృష్టం కలసివస్తే కమిషనర్ పదవికూడా చేరుకొనటానికి ఎట్టి అడ్డంకులు వుండవు. తాత్కాలికంగా కలసికొన్న శ్రీ వెంకటాచలం చెట్టియార్, శ్రీ దేశిగర్, శ్రీ పందుల వెంకటరెడ్డి మొదలైనవారు గాక, నేనంతవరకు ఎరిగి యుండిన శ్రీ చల్లపల్లిరాజాగారి మూడవ కుమారుడు శ్రీ పద్మనాభప్రసాద్ గారు, వారిపెద్దకుమార్తె శ్రీమతి రాజ్యలక్ష్మిగారు, ఆమెగారి భర్త, శ్రీరాజాగారి తమ్ముడు శ్రీరామ కృష్ణప్రసాద్ గారి కుమారుడు శ్రీ హర్షవర్థనప్రసాద్ మొదలైన వారు తటస్థపడ్డారు.

ఇక, రైలుప్రయాణంలో నేను మొదటిదఫా ఏప్రిల్ 27-వ తారీఖున కొడైకెనాల్ కు వెళ్లుచున్నప్పుడు రైలులో నా కంపార్టుమెంటులో కురుమదిరన్ (మళిగన్ ?) అనే కాంగ్రెసు నాయకులు మద్రాసు నుండి దిండిగల్ కు ప్రయాణించుచుండినారు. వా రప్పుడు అపోజిషన్ కాంగ్రెసు నాయకుడుగా మద్రాసు అసెంబ్లీలో వుంటున్నారట. ఒకసారి పార్లమెంటు మెంబరుగా వుండినారుగాని, అసెంబ్లీ మెంబరుగా నాలుగుసార్లు ఎన్నికైనారట. వారు స్ఫురద్రూపి, అందమైన వ్యక్తిత్వం కలవారు. చాలా మర్యాదస్తులు, సహృదయులు, మాటకారికూడా. వా రెంతో కలసిమెలసియుండి నేను కొడైకెనాల్ రోడ్డు స్టేషన్ లో దిగినప్పుడు మర్యాద, మన్ననలతో వీడ్కోలిచ్చారు. నేను

కొడైకెనాల్‌కు రెండుసార్లు వెళ్లి, తిరిగి మద్రాసుకు వెళ్లినప్పుడు, నా కంపార్టుమెంటులో యితర ప్రయాణికులు కలిశారు. మాట్లాడుకొన్నాం. ఎవరికి వారం వారి వారి చోట్ల దిగిపోయాం. అంతటితో సరి. రైలుప్రయాణంలో కలసినవారు ఏటి ప్రవాహంలో కలసిన రెండు పుల్లల వంటివారే కదా!

పాండిచెరి (పుదుచ్చేరి) :— నేను 1973 మార్చి ఆఖరున మద్రాసుకు వెళ్లి ఏప్రిల్ 6-వ తారీఖున ఎస్‌ప్లనేడ్ నుండి 6½ గంటలకు బయలుదేరే ఎక్స్‌ప్రెస్ బస్సులో ఎక్కి మదురాంతకం, దిండివనం మీదుగా పుదుచ్చేరికి గం. 10-45 నిమిషాలకు చేరుకొన్నాను. నా ముందు సీటులో పాండిచెరిలో మెడిసిన్ చదువుచున్న తెలుగు యువతి ఒకరు కూర్చుండినారు. ఆమె నాయుడు పిల్లన్నది. "బలిజ నాయుడా, కమ్మ నాయుడా?" అన్నాను. చెప్పలేకపోయింది. బలిజ నాయుడుల యువతి అని అనుకున్నాను. పేరు ఉష అట. ఎదిగిన పిల్ల అయినా, వైద్యం చదువుకొనుచున్నా తనది ఏ కులమో చెప్పలేకపోవటం ఈ కాలంవారికి సమంజసమేమో. నా ప్రక్క సీటులో కోయంబత్తూరు కమ్మాయన వచ్చి కూర్చున్నాడు. ఆయన పేరు అమల్‌రాజ్ అట. తాను ఫుడ్ కార్పొరేషన్‌లో అసిస్టెంట్ డైరక్టర్‌గా పనిచేస్తున్నానని, పుదుచ్చేరికి తనిఖీకి వెళ్తున్నానని, సాయంత్రం తిరిగి మద్రాసు వెళ్లిపోతానని చెప్పాడు. నేను పాండిచెరిలో దిగినప్పుడు సైకిల్‌రిక్షాను మాట్లాడి, హోటల్ కాంటినెంటల్‌కు వెళ్లే త్రోవ చెప్పాడు. అక్కడకు వెళ్లగా "ఇది చిన్న హోటలు, 6 గదులు మాత్రమే ఉన్నవి, ఇప్పుడు 3 పడకలు గల పెద్దగది దొరకుతున్నది. రోజుకు అద్దె 30 రూపాయ"లన్నారు. నేను 30 రూపాయ లివ్వటానికి సిద్ధపడ్డానుగాని, వాళ్లు నన్ను తీసుకొనుట కుత్సాహం చూపక, "ఈ ప్రక్కనే క్వాలితే అను పేరుగల అన్ని సౌఖ్యాలు గల మంచి హోటలున్నది వెళ్లం" డని నే నక్కడకు చేరుకున్న సైకిల్‌రిక్షాలోనే పంపించారు. ఈ క్వాలితే హోటలులో క్రింద కొన్ని గదు లున్నవి. మేడమీద కొన్ని గదు లున్నవి. క్రిందగది అద్దె 12 రూపాయలేనని చెప్పి అందులో ప్రవేశపెట్టారు. తీరాచూస్తే అది చాలా నాసిరకంగా

కనపడింది. నేల అశుభ్రంగా వున్నది. నేలమీద ఏ తివాసిలేదు. కుర్చీలు, బల్లలు ప్రాతకంపు కొడుతున్నవి. అన్నిటికంటె స్నానగది మిక్కిలి యిరుకు, అనుకూలమైనది కాదు. అందువల్ల అది అక్కరలేదని లోపలికి వెళ్లి, "నా కాగది పనికిరాదు. నా కింకొక గది ఇవ్వం"డన్నాను. అక్కడ కూర్చున్న ఆమె (ఆ హోటల్ యజమానురాలని తర్వాత తెలిసింది) "మేడమీదకు వెళ్లండి. అద్దె రోజుకు 20 రూపాయ" లన్నది. భోజనం వగైరా వేరే చార్జి. ఒప్పుకొని ఆ గదిలో చేరాను. ఆ గది ఒక విశాలమైన హాలు. దానిని రెండుగా కొయ్యకూర్పుతో విభజించారు. ముందుభాగంలో త్రాగుడుకు అనుకూలమైన బల్లలు, ఒక భోజనం బల్ల, ఒక మంచం ఉండినవి. వెనుకభాగం పెద్దది. దానిలో 2 మంచాలు, తలదువ్వుకొనుట మొదలైన వానికి అద్ద ముండిన ఒక చిన్న బల్ల, ఒక చిన్న స్నానగది వుండినవి. ఈ స్నానగదికూడా పెద్ద అనుకూలమైనదికాదుగాని, క్రింది గది లోని దానికంటె చాలా మెరుగు. ఈ గదిలోకూడా కూర్చుని స్నానం చేయటానికి వీలులేదు. అక్కడ పైనుండి నీళ్లను చిమ్మే స్ప్రే ఉన్నది. నిల్చుండి స్నానంచేయటానికి అనువైనదే. రెండో మంచం వుండటం కూడా నా కనుకూలంగానే వుండింది. దానిమీద బట్టలు మొదలైనవానిని పెట్టుకునే వాడిని. గదికి గాని, స్నాన గదికిగాని కాళ్లు తుడుచుకునే జీబులు లేవు. నేల మీద తివాసి లేదు. తలుపులకుగాని, కిటికీలకుగాని తెరలు (కర్టెన్స్) లేవు. అందువల్ల ఇదికూడా పెద్ద సౌకర్యం గల, సౌఖ్యవంతమైన గది అని చెప్పటానికి వీలులేదు. అయితే, ఇది మూల గది. ముందు విశాలమైన బారు వరండా ఉన్నది. పైగా గది ముందునుండి సముద్రం కనిపిస్తుంది. సముద్రపు గాలి వస్తుంది. మరీ ముఖ్యం, ఈ హోటలు ఒక పార్కు నానుకొని యున్నది. దీనిని డిగాల్ పార్కు (ఫ్రాన్స్ దేశం ప్రెసిడెంట్) అంటారు. ఇంటిని, ఈ పార్కును విడదీసినది, చప్టాచేసిన రహదారి మాత్రమే. రోడ్డుమీదకు వంగిన చెట్లకొమ్మలు నా గది ముందు వరండానుండి బారుచేయి గలవాడు అందుకో వచ్చునేమో అన్నట్లుండినవి. ఈ పార్కు చాలా ముఖ్యమైనది,

పాండిచెరిలో ప్రధానమైనది. దీని కవతల ప్రక్క గవర్నరుగారి రాజప్రాసాదములు, ఒక ప్రక్క విధాన సభల భవనం, ఒక ప్రక్క పెద్ద హాస్పిటలు, ఇంకొక ప్రక్కక పెద్ద బ్యాంకు వగైరా వున్నవి. ఇది పాండిచెరికి గుండెకాయ వంటిదిగా వుంటుంది. ఇక్కడనుండి 4 బారలలో సముద్రం బీచి, విహారస్థలం (ప్రామినేడ్)కు వెళ్లవచ్చును. అనతిదూరంలోనే కేంద్ర పోస్టాఫీస్ వున్నది. కొద్ది దూరంలోనే అరవిందుని ఆశ్రమ కేంద్రమున్నది. నే నక్కడుండిన వారం రోజులు కొంత సౌఖ్యంగానే గడచి పోయినవి.

ముఖ్యంగా సాయంత్రం $4\frac{1}{2}$ గంటలకు బయలుదేరి బీచ్‌కి వెళ్లి, అక్కడి ప్రామినేడ్ చప్టాబాటమీద విహారానికి తిరుగుచుండే వాడను. ఈ విహారబాట చాలా నిడుపైనది. ఒక చివర, సరుకుల గిడ్డంగులు, వాని నానుకొని కొంతదూరంలో సముద్రంలో నుండిన ఓడలకు జేరవేయుటానికి సరుకులను పడవలలో ఎక్కించుట కనుకూలమైన వారధి వంతెన (పియర్). రెండవప్రక్క అరవింద ఆశ్రమ వాసుల ఆటస్థలాలు, మధ్య ఎత్తైన మండపం, దానిమీద నిలబెట్టిన చెక్కిన ఏకరాతి స్తంభాల మండపం, పైన యింకొక చిన్న మండపంలో గాంధీజీ విగ్రహం, విగ్రహంపైన చిన్న గోపురం. ఈ విహారబాట విలాస వ్యాయామానికి మిక్కిలి అనుకూలమైనది. మరిన్ని, ప్రామినేడ్ పొడుగూతానే గాక, ప్రామినేడ్ నానుకొనియున్న రోడ్డు కవతల ప్రక్క విశాల మైన చప్టావేసిన రోడ్డు మార్జిన్ మీద అమర్చబడిన సిమెంటు బెంచీలమీద కూర్చుని కబుర్లు చెప్పుకొనుట కనువుగా వుంటుంది. ఇతర సముద్ర తీరాలవలెనె, ఇక్కడ కూడా బుట్టలలోను, తట్టల లోను పెట్టుకొనివచ్చి రకరకాల తినుబండారాలను అమ్మేవారు తమ బేరాలను సాగిస్తారు. ఈ ప్రామినేడ్ నానుకొని వున్న విశాలమైన రహదారి కవతలప్రక్క కొన్ని ప్రభుత్వ భవనాలు, మంత్రుల భవనాలు, కొన్ని నివాస గృహాలు, హోటల్ కాంటి నెంటల్ వంటివి వున్నవి. సాయంత్రం $5\frac{1}{2}$ గంటలవరకు ప్రామినేడ్

మీాద నేను వెళ్లిన మార్చిలో ఎండగానే వున్నది. ఆసమయంలో రోడ్డు రెండవప్రక్క చప్టా మార్జిన్ మీాదకు నీడ వస్తుంది. ప్రొమినేడ్ మీాద జనసందోహం జాస్తి. అందువల్ల కొంత వయస్సు మళ్లినవారు, బాతాఖానీ బాగా చెప్పుకోదలచినవారు ఈ మార్జిన్ మీాద ఏర్పాటుచేసిన బెంచీలకు చేరుకొంటారు.

నేను గిడ్డంగుల నుండి అరవిందాశ్రమం ఆటల స్థలం వరకు షికారుచేస్తూ, మధ్య మధ్య కొంతసేపు గాంధీ మండపం మీాద (క్రిందిభాగం) నిలుచుండి సేదతీర్చుకొంటూ వచ్చేవారిని, పోయేవారిని చూస్తూ, సాయంత్రం అంతా గడిపేవాడను. పట్నం చిన్నది. చెప్పుకోతగ్గ పరిశ్రమలుగాని, వ్యాపారాలుగాని లేవు. కాబట్టి మోటారుకారులు, ఇతర వాహనాలు చాలా తక్కువ. అందువల్ల వచ్చినవా రందరు కాలినడకనే వచ్చేవారు. ఏవో కొలది మోటారుకారు లా రోడ్డువెంట వెళ్లేవికాని, క్వచిత్తుగా మాత్రమే ఒకటి రెండు కారులలోనుండి కొందరు దిగి సముద్ర వాయువు నాఘ్రాణించేవారు.

నేను కొన్ని సంవత్సరాలక్రితం కడలూరులో క్యాంపు చేస్తూ పాండిచెరికి వెళ్లి ఆశ్రమం చూచి, అరవిందయోగిని, మాతాజీని దర్శించియున్నానని నా రెండవ భాగంలో చెప్పాను. అప్పుడు చూచిన పియర్ ఇప్పటివలె ప్రహరీగోడతో బంధీకృతం గాక, స్వేచ్ఛగా ఎవరైనా దానిమీాదకు వెళ్లటానికి అనువుగా వుండేది. అప్పు డొకటి రెండు సార్లు దానిమీాదకు వెళ్లి సముద్ర జలంలో వున్నట్లు సంతోషించాను. ఇప్పుడు వెళ్లాలని బుద్ధిపుట్టి అటు చూడగా, గోడ అడ్డం వచ్చి మానివేశాను. రెండవప్రక్క అరవిందాశ్రమం ఆటల స్థలమని చెప్పాను కదా. ఆ స్థలం ఒకటి, రెండు ద్వారబంధాలు కలిగి, సిమెంట్ రాళ్ళతో కూర్చబడిన ప్రహరీతో మూాయబడి వున్నది. లోపలకు వెళ్లవచ్చునో, కూడదో అను సందేహంవల్ల కొంత, బద్ధకించి కొంత ఆ కాంపౌండు లోపలకు వెళ్లలేదుగాని, విహార బాటనుండి ఆ కాంపౌండు చివరవరకు నడచి కాంపౌండు, సిమెంటురాళ్ళ మధ్య

ఏర్పడిన సందులగుండా స్త్రీ పురుషులు ఆటల నాడుకోనటం, వ్యాయామాలు చేయుటం చూచేవాడను. సాయంత్రం తిరిగి వస్తూ నా హోటల్ సమీపంలోని డిగాల్ ఉద్యానవనం (పార్కు) లో కొంత విశ్రమించేవాడను. ఆ పార్కులో అక్కడక్కడ కొన్ని అందమైన శిల్పాలు అమర్చబడి వున్నవి. ఆ పార్కు చుట్టూతిరిగి బ్యాంకు, హాస్పిటల్, విధాన సభ, రాజభవనం కొన్నిసార్లైనా చూచాను. రాజభవనం బైటి గేటుకు దూరంగా వుండటంవల్ల దాని నంత బాగుగా చూడలేక పోయినా, అదేమంత పెద్దదిగా నాకు కనపడలేదు. ఆవిధంగానే విధాన సభ కూడా తోచింది. అయితే, పుదుచ్చేరి (పాండిచెరి) భూభాగం చిన్నది కదా!

ఒక ఉదయం అరవిందాశ్రమానికి వెళ్లి శ్రీ అరవింద యోగిగారి సమాధిని దర్శించి తల వంచి, చేతులు జోడించి నమస్కరించాను. నేను ముఖద్వారంగుండా ఆశ్రమం ప్రవేశించి నంతనే అక్కడి వారొకరు నన్ను పలుకరించారు. "నేను ఆశ్రమం చూడటానికి, అరవిందయోగి సమాధిని దర్శించటానికి వచ్చా"నని చెప్పగా, "ఇది కేంద్రస్థానం మాత్రమే. ఇక్కడ సమాధిగాక లైబ్రరీ, కొందరు దగ్గర భక్తులు సమాధిచుట్టూ నివసించు గృహాలు మాత్రమే వున్నవి. అవతల ప్రక్కగా తోట, కొన్ని చెట్లు, గృహా లున్నవి. అరవిందాశ్రమం ఆధ్వర్యాన కొన్ని స్థావరాలు, సంస్థ లున్నవి. ఈ స్థావరాలు అక్కడక్క దున్నవి. ఆ యా స్థావరాలలో కొందరు కొందరు నివసిస్తారు. ఆశ్రమం ఆధ్వర్యంక్రింద నిత్యం రెండు పూటలా 2,500 పైచిలుకు అతిథులుగా వుంటారు. వా రందరికి ఆ యా చోట్ల భోజన వసతులు ఏర్పాటుచేసి యున్నారు" అని విపులంగా చెప్పి, నన్ను యోగిగారి సమాధికి తీసుకుని వెళ్లారు. సమాధినుండి తిరిగివస్తూ లైబ్రరీలోకి వెళ్లాను. ఆ లైబ్రరీ పూర్తిగా అరవిందుని రచనల సమాహారం మాత్రమే. యోగిగారి పుస్తకాల నక్కడమ్ముతారు. విక్రేతనుండి శ్రీ వారి జీవితచరిత్రను రెండు పెద్ద వాల్యూములుగా శ్రీ కె. ఆర్. శ్రీనివాసయ్యంగారు వ్రాసిన వానిని కొన్నాను.

తిరిగి ఆ ఆశ్రమానికి వెళ్లలేదు. వారిలో నెవరితోను పరిచయం చేసుకోలేదు. కాని నా సముద్రతీర షికారులో ఒక ఆశ్రమవాసి గిరిధరలాల్ అనే వారు తాను ఇంగ్లీషులో వ్రాసిన "సైలెన్స్ స్పీక్స్" అనే ఒక చిన్న గ్రంథాన్ని నాకు చూపించారు. వారి భారీ విగ్రహానికి సరిపడు లాల్చీ చొక్కాలోని పెద్దజేబులలో కొన్నింటిని పెట్టుకొని బీచ్‌లో కనబడినవారికి నచ్చచెప్పి అమ్ముకొనుచుండినారు. దాని వెల 2 రూపాయలు. పుస్తకం చిన్నదేయైనా, దాని ఇంగ్లీషు భాష స్వచ్ఛమైనది. భావాలున్నతమైనవి. అయితే, నా కొకటి తోచింది. తన పుస్తకాలను తాను స్వయంగా తిరిగి అర్థించి అమ్ముకోవలసిన గతిపట్టే స్థితిలో, పుస్తకాలను డబ్బు ఖర్చుపెట్టి అచ్చువేయించకపోవడం మంచి దని. నా కా పుస్తకాన్నమ్ముచూ ఆయన, "మీరు మద్రాసుకు తిరిగివెళ్లినప్పుడు మీ మిత్రులకు చెప్పండి. వారు కావాలంటే పుస్తకాలు పోస్టులో పంపుతా"నన్నాడు. పుస్తకంలోని సుభాషితాల ప్రచారానికి కాదు, పుస్తకాలు అమ్ముడుకావాలని ఆయన ఆతురత. ఆయన అరవిందాశ్రమంలో కొంత స్థాయి కలవారే.

నేను దిగిన క్వాలితే హోటల్ యజమాని శ్రీమతి కొండప్ప అట. ఆమె తెలుగుది. ఆమె భర్త తెలుగువాడు. ఆమె భర్త ఫ్రెంచి భాషాప్రవీణుడట. ఫ్రెంచి భాష నేర్పే కాలేజిలో లెక్చరర్, ప్రిన్సిపాల్‌గా పనిచేసి విరమించుకొని యున్నాడట. వారి పూర్వీకులు బలిజకులస్థులట. క్రిస్టియన్ మతాన్ని కాథలిక్ పద్ధతిలో స్వీకరించి యుండినారట. ఈమె, నాకాలంలో ఇన్‌కంటాక్స్ అసిస్టెంట్ కమిషనర్‌గా పనిచేసి, కొలదికాలం కమిషనర్ పదవిని కూడా నిర్వహించిన శ్రీ జె. యస్. రాజుగారి మేనకోడలట. నేను తన మేనమామ సహోద్యోగినని, వారితో స్నేహ ముండినదని తెలిసికొని, సంతోషాన్ని వ్యక్తపరిచింది. కాని, అభిమానం చూపించటానికి బదులు, కొంత ఉదారంగా ఉండటానికి మారు, తన మేనమామ సహోద్యోగిగా నుండినందుకు శిక్షయో అన్నట్లు నాసిరకం భోజన మివ్వటమేగాక, డబ్బు విషయంలో చాలా లోభిగా నడచింది. "ఉదయం కాఫీగాని, టీగాని తీసుకో"నని చెప్పగా నీళ్లవంటి పాలు యిచ్చేది. మాంసం

బాగుండేది కాదు. నల్లచందువా చేపను పల్లెటూళ్లలో వేయించినట్లు తయారుచేయించేది. రొట్టె పలుకలతో కలిసిన పైపూత నిచ్చి ఆ చేపముక్కలకు రుచి కలిపించేదికాదు. చందువా చేప మంచి దనే చెప్పవచ్చునుగాని, దానిలో రెండు రకా లున్నవి. తెల్ల చందువా బాగుంటుంది, నల్ల చందువా ఏ మాత్రం బాగుండదు. "ఇది సముద్ర తీరం కదా! ఒక నాడైనా రొయ్యలు వడ్డించరేం?" అని అడిగితే, ఒక నాడు బుడ్డి బుడ్డి రొయ్యలు జావగా వండిన కూర యిచ్చారు. "ఇదేమి?" టనగా "ఇక్కడ పెద్దరొయ్యలెంత ప్రయత్నించినా దొరక"వని చెప్పారు. ఇది కొంతవరకైనా నిజమై వుంటుందని నే నొక సాయంత్రం పార్కులో కలసికొన్న ఫిషరీస్ డిపార్టుమెంట్‌లోని యిద్దరు గుమాస్తాల వల్ల తెలిసింది. దొరికిన మంచి రొయ్యల నన్నింటిని కేరళకు ఎగుమతిచేస్తారట. కేరళలోని వర్తకులు వానిని సంస్కరించి యితర దేశాల కెగుమతి చేస్తారట. అక్కడ భోజనంలో తృప్తి నిచ్చింది ఉదయ భోజనం. "పంచదార వేసుకోను కాబట్టి శాకరీన్ (తీపికలిగించేది) బిళ్లలు లేక ద్రవమేనా యివ్వం"డని చెప్పాను. "ఇదుగో, అదుగో" అంటూ కాలంగడిపారు. అందువల్ల ఆ నీళ్లపాలే తీపి కలపకుండా త్రాగవలసి వచ్చింది. అయితే అక్కడి విశేషం, మంచి రుచిగల నానురొట్టె. అంత మంచి రొట్టెను నేను తిని చాలా సంవత్సరాలైంది. నేను ఇండియాలో, ఇతరచోట్ల అట్టి రొట్టెను తిన్నానో లేదో యిప్పుడు గుర్తులేదు. పుదుచ్చేరి రొట్టె మద్రాసు రొట్టెకంటె చాలా బాగున్నది. దానికి తోడు మంచి వెన్న పుష్కలంగా యిచ్చేవారు. రెండు పెద్ద కోడిగ్రుడ్లను బుల్స్ ఐస్‌గా వేయించి యిచ్చేవారు. నాలుగు రొట్టె ముక్కలు, ఈ రెండు కోడిగ్రుడ్లు నాకు చాలేవి, తృప్తి నిచ్చేవి. నిజానికి మధ్యాహ్నం, రాత్రి భోజనాలలో కూడా ఈ రొట్టె, వెన్నను జాస్తిగానే వాడేవాడను. ఇవి కొంత లోటును పూర్తిచేసినవి. ఇంకొక విశేషం, నా భోజన మంతా నా మేడ పైన గదిలోనే వడ్డించబడేవి. నేను మాటిమాటికి క్రిందకి, పైకి వెళ్లవలసిన అవసరం వుండేదికాదు.

నే నక్కడనుండి వచ్చివేసే ఉదయం, నేను పెందలకడనే బయలుదేరవలసి యున్నందున, నాకు భోజనం వడ్డించేవాడు అప్పటికి వచ్చే పద్ధతి లేనందున ఉదయ భోజనం, క్రింద భోజనం గదిలో పెట్టారు. నాకా గది అసహ్యంగా కనపడింది. నిజానికి ఆ హోటలును అభిమానించేవారు చాలవరకు త్రాగుబోతు లేనట. పాండిచెరిలో నివసించే ఫ్రెంచి జాతీయులు, శ్వేతజాతీయులే గాక, ఇండియన్లు కూడా త్రాగుడుకు వచ్చేవారట. అందువలన భోజన మమర్చుటలో కంటె, త్రాగు డందివ్వటంలో ఈ క్వాలితె హోటలు ముందడుగు వేసిందట. నేను సాయంత్రం బైటకు వెళ్లి తిరిగివచ్చునప్పటికే అనగా 7 గంటల లోపే, కొంతమంది త్రాగుతూ కూర్చుని వుండేవారు. తరువాత జోరు సాగేదని తెలిసింది. నా కనుమానం త్రాగేవాళ్లు భార్యలు కాని స్త్రీలను తీసుకొనివచ్చి ఆనందించే వా రనుకుంటాను. కామకలాపాలు కూడా జరుపుకొని పోయేవారని తోచింది. నిజానికి శ్రీ గిరిధర లాల్ సూచించాడు కూడా. ఆయనతో "నా కెట్టి త్రాగుడు అలవాటు లే"దన్నాను. హోటల్ నానుకొనియున్న పెద్ద బిల్డింగుకు తరుచు వెళ్లుచుంటాడట. అందువల్ల ఈ హోటల్ సంగతి తనకు తెలుసు నన్నాడు. చివరకు 'సాఫ్ట్ డ్రింక్స్' అనే గోల్డుస్పాట్ కోకోకోలా వంటివి కూడా నే నక్కడ పుచ్చుకొనలేదు. అందువల్ల వివరాలు నా స్వానుభవంలోనివి కావు, అయితే, నా విశుద్ధవర్తనం ఆ హోటలు యజమానురాలికి కొంత నిరుత్సాహం కలిగించి వుంటుంది.

నేను వెళ్లిన మరునాడు సాయంత్రం శ్రీమతి కొండప్ప (ఆమె పేరు కాంతమ్మ అట, తెలుగు బాగుగా మాట్లాడుతుంది), "చౌదరిగారూ! గది అద్దె మాట్లాడుకొనియున్నాం కదా! భోజనం యిచ్చే వస్తువులనుబట్టి ఛార్జి చేస్తాం. అది యిచ్చే పదార్థాలను బట్టి హెచ్చు తగ్గులుగా ఉంటుంది. ఈ లెక్కలు వ్రాయటంకంటె, మీకు మంచి ఆహార మిస్తాం. మీరు మొత్తం మీ గదికి, భోజనానికి కలిపి రోజుకు 50 రూపాయ లివ్వండి" అని చెప్పింది. ఆమె నా సహోద్యోగి శ్రీ జె. యస్. రాజుగారి మేన

కోడలు, తెలుగామె. తెలుగులో అనునయంగా చెపుతున్నదని తాత్కాలిక సుహృద్భావంతో, ‘సరే’ అన్నాను. కాని, మర్నా డుదయం ఆలోచించుకోగా 50 రూపాయలు హెచ్చనిపించింది. ఈ హోటలులో కంటె మంచి భోజన మిచ్చే హోటల్ కాంటినెంటల్‌లో ఉదయ భోజనానికి 5 రూపాయలు, మధ్యాహ్న భోజనానికి 7½ రూపాయలు, రాత్రి భోజనానికి 7½ రూపాయలు పుచ్చుకుంటారు. నేను 2 రోజుల తర్వాత అటు వెళ్లుచు, అక్కడి హోటల్స్‌లో ప్రసిద్ధిగన్న హోటల్ యూరప్‌లో విచారించగా “మంచి స్నాన గదితో కూడి, అన్ని వసతులుగల గదికి భోజనంతో సహా 45 రూపాయలు పుచ్చుకుంటాం” అని అక్కడి నౌకర్లు చెప్పారు. ఆ హోటలును ఒక ఫ్రెంచి జాతీయుడు చాలా సంవత్సరాలనుండి నడుపుచున్నాడు. అది పేరెన్నిక గన్నది.

నా కెన్నడును ఇంగ్లండ్‌లోకూడ బెడ్ కాఫీ (పడక నుండి లేచిన వెంటనే తీసుకునేది) గాని, టీ గాని అలవాటు లేదు. పైగా, యిప్పుడు కొంత కాలంనుండి మధ్యాహ్నం ఉపాహారాలు తీసుకొనటం లేదు. కాఫీ, టీలు అసలే మానేశానుకదా. అందువల్ల మధ్యాహ్నం ఏమీ లేకుండా భోజనానికి మాత్రం 30 రూపాయలు యివ్వవలసిన అవసరం లేదు. గది అద్దె 20 రూపాయలు. కాబట్టి భోజనంతో కలిపి రోజుకు 40 రూపాయలు మించకూడదనుకొని శ్రీమతి కాంతమ్మ కొండప్పకు తెలియపరచాను. నే నక్కడినుండి వెళ్లే ముందు సాయంత్రం పిలిచి “మీరు మా మేనమామ సహోద్యోగి కాబట్టి, పోనీలే 5 రూపాయలు తగ్గిస్తాను. 45 రూపాయలు యివ్వం”డని చెప్పింది. నేను కాంటినెంటల్ హోటల్ ఛార్జీలు చెప్పి, “40 రూపాయలకంటె ఎక్కువ యివ్వమనటం ధర్మంకా”దన్నాను. “మీ కిచ్చిన గది చాలా మంచిది. నిజానికి దానికి 35 రూపాయలు ఛార్జి చేయవలసింది. మీరు మా మేనమామ స్నేహితులుకాబట్టి 20 రూపాయలు చెప్పా” నన్నది. నే నా గది అవకతవక లోపాలు వర్ణించి, “ఆ యిరవై రూపాయలే హెచ్చు” అన్నాను. పైగా ఆమెకు, నే నక్కడకు చేరినప్పుడు నే నెవరినో తెలియదు. మర్నా డుదయం నేను వెళ్లేటప్పుడు

శ్రీమతి కాంతమ్మ దూరంగా కనపడిందిగాని, నేను ప్రత్యేకించి ఆమె కొరకు వేచియుండలేదు. నే నక్కడ 6 రోజులుండినాను. ఆఫీసు గుమాస్తాను 'ఎంత?' అని అడుగుచు 250 రూపాయలు అతని ముందు పెట్టాను. "మీరు 20 రూపాయలు అడ్వాన్సు యిచ్చారు కదా!" అని చెప్పి 20 రూపాయలు వాపసు చేశాడు. 40 రూపాయలు చొప్పున 240 రూపాయలలో అడ్వాన్సు 20 రూపాయలు పోను 220 రూపాయలు మాత్రమే యివ్వవలసి వుండినది. నే నిచ్చిన 250 రూపాయలలో ఆ గుమాస్తా 20 రూపాయలు వాపసు యిచ్చినందున హోటలుకు 230 రూపాయలు యిచ్చినట్లయింది. నేను రాత్రి మాటలను బట్టి శ్రీమతి కాంతమ్మ కొండప్ప 20 రుపాయలు తగ్గించిందేమో, నే ననుకొన్నదానికంటె 10 రూపాయలు ఎక్కువైతే మాత్ర మేమి అని రిక్షా ఎక్కి వెళ్లిపోయాను. నాకు భోజన పదార్థాలమర్చుచుండిన అతనికి ఆ క్రిందటి రాత్రే 10 రూపాయలు బక్షీస్ ఇచ్చియున్నాను. అక్కడి జమాను ఒకడు, వంట వా డొకడు నేను వెళ్లేముందు అడుగగా తలా కొంత యిచ్చి వెళ్లిపోయాను. ఆ ఉదయం బస్సు ఆలస్యంగా వచ్చింది. టిక్కెట్టు ఆఫీసులో అడుగగా, "బస్సు 400 మైళ్లదూరంలో వున్న నగర్‌కోయిల్ నుండి రావాలి, ఒకప్పుడు చాలా ఆలస్యంగా వస్తుం"దన్నాడు. బస్సుకోసం వేచియుండగా, నాదగ్గర డబ్బు తీసుకొన్న హోటల్ గుమాస్తా ఆదరా బాదరాగా సైకిల్ మీద వచ్చి తీరా బస్సులో కూర్చుండిన నాతో, "అమ్మగారు కోప్పడు తున్నారు, నేను పొరపాటున 20 రూపాయలు వాపసు చేశాను. ఆ 20 రూపాయలు యివ్వం"డని తీసుకొనిపోయాడు. 8½ గంటలకు బయలుదేరవలసిన బస్సు 9½ గంటలు దాటిన తర్వాత బయలు దేరింది. ఆ రోజు ఎండ తీవ్రంగా కాచింది. ఆ ఎండలో 'చచ్చి చెడి చాయంగల విన్నపా' లన్నట్లు, ఒంటిగంట దాటిన తర్వాత మద్రాసు ఇంటికి చేరుకొన్నాను.

నేను 1953 లో ఉద్యోగ విరమణకు పూర్వం పాండిచెరికి వెళ్లినప్పు డున్న వీధులలో కొన్నిమార్పులు వచ్చాయి కాబోలు, నే నే బజారును గుర్తుపట్టలేదు. అయితే అప్పుడు చూచిన ఆంగ్లో ఫ్రెంచి టెక్స్‌టైల్స్ షాపు 1973 లో కూడా వుండినదికాని,

అ దిప్పుడు టోకువ్యాపారం చేసే సంస్థగా మారింది. అప్పుడు దాని భాగాలుగా నుండి పట్టుబట్టలు వగైరా ఫ్రెంచి సరుకులను చిల్లరగా అమ్మే సెక్షను లిప్పుడు లేవు. పూర్వం పాండిచెరి ఫ్రెంచి భూభాగంగా వుండినది కాబట్టి ఫ్రెంచి బట్టలేగాక వివిధవస్తువులు, అత్తరులు మొదలైనవి దిగుబడిచేసుకొని, వర్తకులు విరివిగా వ్యాపారం సాగించేవారు. ఇప్పుడా దిగుమతులు నిలిచిపోయినవి. కాబట్టి నే నక్కడకు వెళ్లిన మర్నాడు నెహ్రూపేరుతో పిలువబడుచున్న పెద్దబజారు వీధికి వెళ్లి నలుప్రక్కల చూడగా, ఒక్క ఆంగ్లో ఫ్రెంచి టెక్స్ టైల్స్ అనే పేరు మాత్రమే జ్ఞప్తికి వచ్చింది. ఆ బజారులో వుండినది ఆనెస్టు బుక్ హౌస్‌కు వెళ్లి 3 ఇంగ్లీషు పుస్తకాలు కొన్నాను. ఇంకొక చోట ప్లాస్టిక్ చేతిసంచిని కొన్నాను.

నాలుగవనాడు సాయంత్రం బజారువెంట వెళ్లుచుండగా టూరిస్ట్ హోమ్ (ప్రయాణికుల బస) కు వెళ్లే త్రోవ సూచించే బల్ల (సైన్ బోర్డు) కనపడింది. కొంతదూరం వెళ్లగా ఒక భవనం సింహద్వారంలో ఇన్ కమ్‌టాక్స్ ఆఫీసు అని బోర్డు తగిలించి వుంది. ఎవరో తెలుసుకుందాం అని లోపలకు వెళ్లాను. అక్కడి ఆఫీసరు సుబ్రహ్మణ్యాం అనే పేరుగలవారు. అరవవారేమో అనుకొన్నాను. తీరా లోపలకు వెళ్లి నే నెవరినో చెప్పగా, సుబ్రహ్మణ్యాంగారు, "నేను మిమ్ములనదివరకుచూచి యుండలేదు గాని పేరు వినియున్నాను. నేను శ్రీ మాదిరెడ్డి కృష్ణమూర్తి నాయుడుగారి కొడుకు" నన్నాడు. శ్రీ కృష్ణమూర్తినాయుడు నాకు బాగా తెలిసియున్నవారే నని, చాలా సంవత్సరాలక్రితం నేను బరంపురంలో ఆఫీసరుగా వుండి పర్లాకిమిడికి మకాం వెళ్లినప్పు డక్కడ వారు పోలీస్ డిప్యూటీ సూపరింటెండెంట్‌గా వుండినారని నా రెండో భాగంలో చెప్పియున్నాను, సుబ్రహ్మణ్యాంగారు వారి తండ్రికి, నాకు స్నేహ మున్నదని ఎరిగి యున్నారు కాబట్టి నన్నెంతో ఆదరించి వారి ఇన్‌స్పెక్టర్, హెడ్ క్లార్కు మొదలైనవారిని నాకు పరిచయపరచి, ఆఫీసు ఆవరణ వగైరా

చూపించారు. అధికారం (జ్యూరిస్ డిక్షన్) లో 3000 కేసు లున్నవని, 35 లక్షల రూపాయలు ఆదాయంపన్ను వస్తుందని విని ఆశ్చర్యపడ్డాను. వారి సిబ్బంది తక్కువ. ఇన్స్పెక్టర్ ఒక్కడే వున్నాడు. హెడ్ క్లార్కు కుర్రవాడుగా కనపడ్డాడు. తతిమ్మా సిబ్బందికూడా తక్కువే. "3 వేల కేసులను మీ రెట్లు సంబాళించుకొంటా" రనగా, "వీనిలో చాలా కేసులు చిన్నవి. ఇప్పటి పద్ధతిప్రకారం 15 వేలు తక్కువ ఆదాయం కేసులను విచారణలేకుండానే పూర్తిచేస్తాంకదా" అన్నాడు. "అయితే, 35 లక్షల రూపాయల డిమాండ్ ఎట్లు సంభవిస్తుం?" దని అడుగగా, "ఆంగ్లో ఫ్రెంచి టెక్స్టైల్స్ వంటి కొన్ని పెద్ద సంస్థ లున్న"వన్నాడు. ఏదైనా, ఆ చిన్న ప్రదేశానికి 35 లక్షల డిమాండ్ పెద్దదే. అయితే ఆ భూభాగంలో, ఇంకొక ఇన్ కంటాక్స్ ఆఫీసరు లేడు. నేను 1929 సంవత్సరంలో ఇన్ కమ్టాక్స్ డిపార్ట్మెంట్ లో చేరినప్పుడు అవిభక్త మద్రాసు రాష్ట్రం ఆదాయం 2 కోట్లు మాత్రమే. ఇప్పు డది 10, 15 రెట్లయినా పెరిగియున్నది. ఆవిధంగానే పై డిమాండు కూడా ద్రవ్యోల్బణంవల్ల పెరిగివుంటుంది.

నేను పాండిచెరిని విడిచిపెట్టే 2, 3 రోజులకు ముందు మేడ పైన ఒక గదిలో సౌత్ ఆఫ్రికాలోని డర్బన్ నుండి వచ్చిన భారతీయ యువకునితో మాట్లాడాను. అతడు మద్రాసులో వైద్య విద్యను నేర్చుకొనుచున్నాడట. అతని పూర్వులు తెలుగు నాయుళ్లై యుంటా రని అన్నాడు. కాని అతని కింగ్లీషు తప్ప ఏ భాష రాదు. ఇంగ్లీషు కూడా తమాషాగా మాట్లాడేవాడు. ఒక్కొక్కప్పుడు 2, 3 సార్లడిగి అతను చెప్పిం దేదో తెలుసుకో వలసి వచ్చేది. డర్బన్ లో భారతీయులు ఒక సంఘంగా వుండి, వారిలో వారు వ్యవహరించుకుంటూ శ్వేతజాతివారితో అంతగా సంబంధాలు పెట్టుకొనక పోవటంవల్ల కొంత సుఖజీవనమే గడుపు చున్నా రన్నాడు. పెద్దవారికి ఇండియానుండి దిగుమతి చేయబడిన వర్ణవ్యవస్థ లెట్లుండినా, తనవంటి యువకులకు వర్ణవ్యవస్థ

ప్రసక్తేలేదని, అందరూ ఏకజాతి భారతీయులుగా వ్యవహరించు కుంటామని, ఇష్టమైనవారు నిరభ్యంతరంగా వివాహ మాడుతారని మొదలైన సంగతులు చెప్పాడు. ఇంకా కొన్నిరోజు లక్కడుంటా నన్నాడు. మద్రాసులో కలసికొందాం అనుకున్నాంగాని అట్టిదేదీ జరుగలేదు.

పాండిచెరిలో వినోద విశ్రాంతికాలం (సీజన్) వేసవి కాదట. అక్టోబరు నుండి జనవరి వర కట. మద్రాసులోవలె యిక్కడ విశాలమైన బీచి లేదు. అసలు లేదనే చెప్పాలి. స్నానాని కనువైనదికాదు. ప్రామినేడ్ పిట్టగోడ దాటి నీళ్లలోకి యించుమించుగా ఎవరూ వెళ్లరు.

ఇంతటితో నా పుదుచ్చేరి (పాండిచెరి) యాత్రను గురించిన ప్రస్తావన ముగిసింది.

కూనూరు: నేను 1973 మే 5-వ తారీఖు రాత్రి సర్కార్ ఎక్స్‌ప్రెస్‌లో విజయవాడనుండి బయలుదేరి, సకాలానికి 6-వ తారీఖు ఉదయం మద్రాసు చేరుకొన్నాను. సెంట్రల్ స్టేషన్‌కు నా పెద్దకుమారుడు రాధాకృష్ణ తన కారుతో రాగా, మా షెనాయ్‌నగర్ ఇంటికి వెళ్లాం. అదివరకే కూనూరుకు వెళ్లే నీలగిరి ఎక్స్‌ప్రెస్‌లో ట్రేడ్ వింగ్స్ వారు నాకు మొదటి తరగతి బర్తు ఖాయపరచియున్నారు. ఆ రాత్రి (మే 6, 1973) దానిలో బయలుదేరి మెట్టుపాలియం మర్నా డుదయం చేరి, అక్కడనుండి కొండకు వెళ్లే చిన్న రైలెక్కి, ఒక అరగంట ఆలస్యంగా, ఇంచుమించు 12 గంటలకు కూనూరు స్టేషన్‌కు చేరుకొన్నాను. మా కొండరైలు కంపార్ట్‌మెంట్‌లో ఊటీకి వెళ్లుచుండిన శ్రీ కూచిమంచి రామచంద్రరావు తగిలాడు. ఆయ నొక ఆడిటరు. నా ముందు కొన్ని ఇన్‌కమ్‌టాక్స్ కేసులలోను, అప్పీల్స్‌లోను హాజరై నన్ను బాగా ఎరిగియున్నవాడు. మా కంపార్ట్‌మెంట్‌లో విశేషమే మనగా, ఒక శ్వేతయువతి, హిప్పివేషంలో వున్న ఒక ఇండియన్ మిత్రునితో కలసి ప్రయాణం చేసింది. ఆమె డేనిష్ జాతికి చెందిందట. వినోదయాత్రలో ఊటీకి వెళ్లుచున్నది.

ఇం కొక విశేషం, వీరరాఘవన్ అనేవారి 9 ఏండ్ల కొడుకు. ఈ శ్రీ వీరరాఘవన్ బెంజ్ కంపెనీలో పనిచేస్తున్నాడట. ఆయన 9 ఏండ్ల కొడుకు అప్పటికే వయొలిన్ బాగా వాయించే శక్తిని సంపాదించాడట. పిల్లవానితో "నీ కభిమాన వయొలిన్ వాయిద్యాన్ని మిక్కిలి బాగుగా నేర్చుకుంటే, నీ మామూలు విద్యా విషయ మెట్లున్నా, పేరు ప్రఖ్యాతులు సంపాదిస్తా'వని ప్రోత్సాహకరంగా మాట్లాడాను.

మే నెల 7-వ తారీఖు మధ్యాహ్నం 12 గంటలకు కూనూరు స్టేషన్‌లో దిగి టాక్సీలో నా కుమార్తె సౌభాగ్యవతి వెలమాటి కమల కుమారి ఏర్పాటుచేసిన వై. డబ్ల్యు. సి. ఎ. కు చేరుకున్నాను. ఆ సంస్థను నడుపుచున్న ఇంగ్లీషు వనిత శ్రీమతి బార్బరా. జె. ఆండర్‌సన్ నన్నాహ్వానించి, నా గదిని చూపారు. ఆమె వయస్సుమళ్లినదైనా కురచగా, తెల్లనైన శరీరంతో, చురుకుగా వర్తించే స్త్రీ. చూడటంతోనే చాల మంచిదిగా, మర్యాదస్తురాలుగా కనపడింది. నా కిచ్చిన గది విశాలమైనది కాకపోయినా, నాకు సరిపోయింది. నా కత్యంతావసరమైన యూరపియన్ స్టైల్ కమోడ్ పడకగది నానుకొన్న స్నానగదిలో వున్నది. పెద్దదైన వాష్ బేసిన్ కూడా వున్నది. పైగా డైనింగు హాలు నానుకొని యున్న దా గది. నా భోజనం బల్ల నా గది దర్వాజా ప్రక్కనే. ఇది నాకు మిక్కిలి సౌకర్యం కలిగించింది. నేను బయటకు వెళ్లినప్పుడు తప్ప భోజన సమయంలోను, ఇతరులతో కలసి ఉన్నప్పుడు కూడా నా మామూలు గూడకట్టు పంచె, షర్టుతోనే ఉండేవాడను.

ఈ బిల్డింగు చాలా సంవత్సరాలనాడు కట్టబడినదికాని, మిక్కిలి దృఢంగా కట్టబడినది. దీని మధ్య హాలు పొడుగాటిది, విశాలమైనది. మొదటిప్రక్క అతిథులు, వచ్చినవారు కూర్చుండి మాట్లాడుకొనుటకు, రెండవప్రక్క భోజనానికి ఏర్పాటు చేయబడింది. ఈ హాలు మొదటిప్రక్క ఒక పెద్ద గది, రెండవప్రక్క రెండు చిన్న గదు లుండినవి, ఆ

రెండు చిన్న గదులలో పెద్దది నా గది. ఈ హాలుకు ముందు (ప్రవేశించు) విశాలమైన వరండా వున్నది. ఈ వరండాలో పెద్ద గ దొడ్డి యున్నది. ఈ వరండా చివరి ద్వారం నుండి మేడ పైకి వెళ్లే మెట్లున్నవి. మేడపైన కొన్ని పెద్ద గదులు, చిన్న గదులు కలిపి యింకా 8 గదు లున్నవి. హాలుకు వెనుక వంటిల్లు వగైరా వున్నవి. చుట్టుప్రక్కల కొంత ఆవరణున్నది. దానిలోను, ముందు వరండా క్రిందిభాగంలోను పూలమొక్కల తోట్లు అమర్చబడినవి. కూనూరును రెండు భాగాలుగా పిలుస్తారు. అప్పర్ (ఎగువ) కూనూరు, లోయర్ (దిగువ) కూనూరు అని. అప్పర్ కూనూరులో ఒక మూలగా ఈ బిల్డింగు ఆ ఎత్తైన ప్రదేశానికి కొంత తగ్గుమెట్టు (లెవెల్) లో వున్నది. దీని నుండి ముందుండిన రోడ్డుకు కొంచెం కొంచెంగా ఎక్కినట్లు ఎక్కాలి. దీని (ఈ బిల్డింగు) ముందు భాగం ఎత్తైన అప్పర్ కూనూరు పెద్దరోడ్లలో నొకటైన రోడ్డుకలదైనా, దీని వెనుక భాగం, లోయర్ (దిగువ) కూనూరుకు చేరుకొను పర్యంతం లోయగా చెట్లతోను, పొదలతోను కూడి వుంటుంది. ఈ లోయ ఏటవాలుగా క్రమేణా క్రిందకు దిగిపోతూ వుంటుందిగాని లోతైనదికాదు. కాబట్టి ఈ వసతి గృహం కొండగుట్ట చివరనున్నట్లుంటుంది. ఇక్కడనుండి రోడ్డెక్కి ముందుకు సాగిపోగా బెడ్ ఫర్డు స్క్వేర్ అని వస్తుంది. ఇది ఒక కూడలి. కుడి ప్రక్కగా బెడ్ ఫర్డ్ సినిమా, కొన్ని షాపులు వున్నవి. ఎడమవైపునకూడా కొన్ని మంచి షాపు లున్నవి. ఈ ఎడమప్రక్క షాపుల మీదుగా వెళ్లితే, ఎత్తైన భాగంలో నుండిన రోడ్డు రిట్జ్ హోటలుకు, ఇంకొకరోడ్డు ననుసరిస్తే దిగువ కూనూరుకు తీసుకువెడుతవి. కుడిప్రక్క బెడ్ ఫర్డ్ సినిమా మలుపు తిరిగి కొంతదూరం పోతే, లోయర్ కూనూరుకు పోయే మార్గా లున్నవి. ఏప్రక్కకూ తిరగక సూటిగా వెళ్లితే ఆ రోడ్డు కిరుప్రక్కలా కొన్ని షాపులు, కొన్ని దుకాణా లుంటవి. ఆరోడ్డు సరాసరి సిమ్స్ పార్కు అనే ప్రఖ్యాత ఉద్యానవనానికి తీసుకు వెళ్లుతుంది. అక్కడకూడా ఒక రోడ్డు ఎత్తైన ప్రదేశంగుండా పోగా, ఒకరోడ్డు క్రిందికి పోతుంది. ఒకటి కోటగిరికి ఎక్కుతూ పోగా, ఒకటి క్రిందకు దిగుతున్నట్లున్న రోడ్డు వెల్లింగ్టన్ కు

చేరుస్తుంది. మొత్తంమీద కూనూరు మిక్కిలి హెచ్చు తగ్గులు, ఎత్తైన, లోతైన భూభాగాలమీద ఏర్పడిన పట్టణం. ఇది సముద్ర మట్టానికి 6,000 అడుగులు మాత్రమే ఎత్తులోఉండినా 7,000 అడుగులు ఎత్తుగల ఊటీకంటె హెచ్చు ఎగుడు దిగుడులు, మిట్ట పల్లాలు కలది. ఎగువ కూనూరు ప్రధాన త్రోవల నుండి ఏ ప్రక్కకు తిరిగితే లోతైన ప్రదేశానికి పోతామో, ఎక్కడ ఎత్తు పల్లాలు వస్తవో చెప్పటం క్రొత్తవారికి చాలాకష్టం. మరిన్ని, వయస్సు మళ్ళిన నావంటి వారికి షికారు కూడా కష్టమే.

దిగువ కూనూరు ఎగువ కూనూరు కంటె వర్తక వ్యాపార రీత్యా ఎక్కువ ప్రాధాన్యం కలది. ఇక్కడకూడా ఎగుడు దిగుడు లున్నవిగాని, కొంతవరకైనా ఈభాగం సమస్థలమే. దీని ఆరంభంలోనే బస్సుల స్టేష నున్నది. అనతిదూరంలో రైల్వే స్టేష నున్నది. మిక్కిలి ప్రాధాన్యంగల మార్కెట్టున్నది. ఈ మార్కెట్టులో పండ్లఫలాలేగాక, భోజన పదార్థాలేగాక, అన్ని రకములైన వస్తువులు అమ్ముతారు. ఈ మూడు చాలా ముఖ్య మని చెప్పాలి. బట్టల దుకాణాలు, పాదరక్షల దుకాణాలు, పచారు దినుసుల దుకాణాలు, ఫ్యాన్సీగుడ్సు దుకాణాలు, మందుల షాపులు, ఒకటో, అరో పుస్తకాల షాపు లున్నవి. నే నిక్కడొక జత పాదరక్షలనేగాక, మందులను కొన్నాను. నా కళ్ల జోడు చట్రం విరిగిపోగా, ఒక కళ్లజోడు షాపులో క్రొత్తచట్రం వేయించుకొన్నాను. మార్కెట్టుకు వెళ్లి ముఖ్యంగా, కూనూరు నుండి మద్రాసుకు తిరిగి వెళ్లేటప్పుడు ప్లమ్స్, పేర్స్, పీచెస్ మొదలైన పండ్లు జాస్తిగానే కొన్నాను. ఇక్కడ బస్సెక్కి రెండుసార్లు ఊటీకి వెళ్లాను. ఒకసారి కోటగిరికి వెళ్లాను. రైల్వే స్టేషన్‌కు ఒకటి, రెండు సార్లు తిరిగి మద్రాసుకు తిరిగివెళ్లే టిక్కెట్టును కొన్నాను. ఊసుపోకపోతే, లోయర్ కూనూరుకు వెళ్లి అటు ఇటు తిరగటం కొంత సరదాను కలిగిస్తుంది. అయితే దిగటం తేలిక గాని, ఎక్కటం కొండ కెక్కిన ట్లుండి చాలా ప్రయాస అనిపిస్తుంది.

ఎగువ కూనూరు బెడ్ ఫర్డ్ స్క్వేర్ ఎడమ ప్రక్కన వున్న మందుల షాపులో మందులు, బట్టల షాపులో లుంగీ వగైరా, కుడిప్రక్క బెడ్ ఫర్డ్ సినిమా కించుమించు ఆనుకొని యున్న ఒక సింధీ షాపులో ఉన్ని మఫ్లరు, ఒక ఉన్ని కార్డిగన్ మొదలైనవి కొన్నాను. ప్రక్కనున్న ఒక మళయాళి బంకులో కారంపూస, బూందీ వగైరా కలిపిన మిక్చరు, మురుకులు కొన్నాను. రేకులు కప్పిన బంక్ లో ఒక మళయాళీ అప్పటి కప్పుడు పకోడా, మురుకులు వగైరాలు స్టౌల మీద వండుచుండే వాడు మురుకులు చిన్నవిగావు. పెద్ద చక్కెడాల వంటివి, శనగ పిండితో లావు కాడలుగా చేసినవి. అవి చాలా రుచిగా వుండినవి. మొదట ఒక రూపాయు యిచ్చి ఒకదానిని కొన్నప్పుడు కొంత వరకే తిని, మిగతాది వసతిగృహంలో పనిచేసే పనిమనిషి కిచ్చాను. రెండవసారి సుతారంగా మద్రాసు పట్టుకొని వచ్చాను. దానిని కొంతకాలంవరకు పొట్లంనుండి తీయనందున దాని రుచి తగ్గింది. కొంత తిని రాధాకృష్ణ యింటిలో పనిచేస్తున్న యిద్దరు ఆడపిల్లల కిచ్చాను.

బెడ్ ఫర్డ్ సినిమా కనతిదూరంలో క్రిందకు పోయే రోడ్డున్నది. అది ఎక్కడికి పోతుందో అని దానిని వెంబడించగా కూనూరు పెద్ద పోస్టాఫీసుకు తీసుకొని వెళ్లింది. అక్కడ పోస్టల్ కవరు లవి కొన్నాను. దానినుండి క్రిందికి పోయే త్రోవ లున్నవి. ఒక త్రోవ దిగువ కూనూరుకు తీసుకుని పోతుంది. ఈ పోస్టాఫీస్ కు పోయే రోడ్డు మొదట ఒక పెద్ద క్రిస్టియన్ సంస్థవున్నది. దానిలో వారాని కొకసారి (ఆదివారం) మత పాఠాలు చెప్తారట. దాని బిల్డింగ్ లో ఒక పెద్ద పుస్తక విక్రయశాల లున్నది. ఆ విక్రయ శాలలో మత సంబంధమైనవి, ముఖ్యంగా క్రిష్టియన్ సంబంధమైనవి అమ్ముతారు. నేను బందరు నోబుల్ హైస్కూల్, కాలేజిలో చదివినప్పుడు బైబిల్ చదివి యుండినాను. ఇంగ్లండులో 2, 3 సార్లైనా తల్లివంటి శ్రీమతి హెలెన్ వుడ్ బ్రిడ్జ్ వెంట చర్చికి వెళ్లాను. నావద్ద భగవద్గీత, ఖురాన్ పుస్తకాలుండినవిగాని, బైబిలు పుస్తకంలేదు. ఆ విక్రయశాలనుండి బైబిలు పుస్తకాన్ని కొన్నాను.

వై. డబ్ల్యు. సి. ఎ. వసతిగృహము నుండి సూటిగా, బెడ్‌ఫర్డ్ స్క్వేరుకు వెళ్లినప్పుడు ఎదురుగా పైకెక్కుటకు మెట్లుండును. ఎడమ ప్రక్కనుండి ఏటవాలుగానున్న రోడ్డు కూడా పై భాగానికి తీసుకుని వెళ్తుందిగాని, సామాన్యంగా మెట్లెక్కే పైకి వెళ్లుతాము. మెట్ల కెదురుగా రోడ్డు కవతలప్రక్క పుస్తకాల షాపున్నది. ఆ షాపు నుండి కొన్ని ఇంగ్లీషు పుస్తకాలను కొన్నాను. పోస్టాఫీసుకు దిగివెళ్లే రోడ్డును దాటి, మలుపు తిరిగి, పైకెక్కే రోడ్డుగుండా వెళ్లితే ఒక క్లబ్బు, ఒక రవాణా లారీల బస్సు ఏజన్సీ, హామ్‌స్టన్ హోటల్, కొంతదూరం సాగిపోగా స్పెన్సర్ కంపెనీ షాపు తగులుతవి. ఆ పెద్ద రోడ్డు ననుసరించిపోగా మా నివాస గృహం చేరే అడ్డరోడ్డు తగులుతుంది.

సిమ్స్ పార్కును 70, 80 సంవత్సరాలనాడు "సిమ్" అనే యూరపియన్ ప్రారంభించాడట. ఇది మిక్కిలి విస్తీర్ణమైన స్థలములో ఏర్పాటు చేయబడింది. నాకు ఊటీలోని బొటానికల్ పార్కు కంటె ఇది మెరుగనిపించింది. దీని కొక విశేషం. ఇది కొండచరియనుండి క్రిందకు కట్టినట్లుగా అంచె లంచెలుగా వున్నది. దాని సరిహద్దు పెద్ద రోడ్డువరకు ఎత్తైన ప్రదేశం. అక్కడినుండి పార్కు ముఖద్వారం కొన్ని దిగుడు మెట్లతో వున్నది. ఆ మెట్లను దిగి క్రిందకు వెళ్లాలి. అక్కడ కొంత సమతలం, దాని తర్వాత క్రిందకు దిగే మెట్లు, తిరిగి కొంత సమతలం. సమతలము నుండి యింకా క్రిందికి దిగే మెట్లు, ఈవిధంగా 6, 7 అంచెలతో క్రిందికి దిగిపోవాలి. చివరి భాగంలో సమతలం విశాలమైనదే వున్నది. తిరిగి మెట్లెక్కుట కష్టమని నే నా చివరి సమతల ప్రదేశానికి వెళ్లలేదు. కాని కొంచెం దూరము నుండి చూస్తే, అక్కడ ఎక్కువ రకరకాల పూలమొక్క లున్నట్లు తట్టింది. అక్కడకు దిగి వెళ్లినవారు అక్కడ మిక్కిలి రమణీయంగా వుందని చెప్పారు. ఈ అంతస్థుల సమతలాల్లో రకరకాల పూలచెట్లు, పాదలు ఇతర దేశాలవారు తెచ్చి నాటినవో, లేక యితర దేశాలనుండి మనవారు తెచ్చి నాటినవో పాదలు, చెట్లుండినవి. ఈ పార్కు కప్పుడప్పుడు షికారు వెళ్లుచుండేవాడను. దాని

కెదురుగా రోడ్డు కవతలిప్రక్కన ప్రసిద్ధిచెందిన పాస్టర్ ఇన్స్టిట్యూ టున్నది. అది రెండు మూడు భవంతులు కలిపి కట్టిన కట్టడం. దాని ఆవరణ కూడా పెద్దదే. రకరకాల పూల వృక్షాలు జాస్తి. ప్రత్యేకించి ఒక పెద్ద వృక్షం చక్కని పూలతో నిండి కనపడింది. భవంతుల లోపలకు వెళ్లలేదుగాని, దాని ఆవరణ చుట్టూ తిరిగి వినోదించాను.

పార్కు కనతిదూరంలో ఎడమప్రక్క రోడ్డుమీద కూనూరు క్లబ్బున్నది. దానిలో నివాసానికి కొన్ని గదు లున్నవి. భోజన మిస్తారు. నేను మద్రాసు జంఖానా క్లబ్బు మెంబరును. ఆ క్లబ్బుకు, కూనూరు క్లబ్బుకు పరస్పర మర్యాద లున్నవి. మద్రాసు క్లబ్బు సభ్యులు, కూనూరు క్లబ్బు సౌకర్యాల నుపయోగించుకొనుటకు, ఆవిధముగనే కూనూరు క్లబ్బు సభ్యులు, మద్రాసు క్లబ్బు సౌకర్యాల ననుభవించుటకు పరస్పరావగాహన మున్నది. అందువల్ల నేను జంఖానా క్లబ్బునుండి సిఫార్సును పొంది కూనూరు క్లబ్బుకు వ్రాసియుండినాను. "మా క్లబ్బులో గదులు నాలుగు మాత్రమే వున్నవి, వానిని పూర్తిగా యిదివరకే మాట ఇచ్చాం, అవకాశంలే"దని వ్రాశారు. అయితే వుండటానికి వీల్లేదుగాని, అక్కడకు వెళ్లి ఆట పాటలలో పాల్గొనవచ్చును. నేను ఒకసారి కూనూరు క్లబ్బుకు వెళ్లి, అక్కడి శక్రటరిని కలసికొన్నాను. ఆయన, "మీరు తాత్కాలిక సభ్యులుగా వుండవచ్చును. ఇక్కడ టెన్నిస్, టేబుల్ టెన్నిస్, బిలియర్డ్స్, గాల్ఫ, చీట్లపేకాట మొదలైన వానిలో పాల్గొనవచ్చును. ఇక్క డేవైనా వినోదాలు ఏర్పాటుచేస్తే వానిలో పాల్గొనవచ్చును" అని చెప్పాడు. రెండవసారి మా వసతిగృహం అతిథి శ్రీ ఆల్ఫ్రెడ్ లాజరస్ గారితో కలసివెళ్లి యింకొకసారి చూచి వచ్చాను. అక్కడ నివసించుచున్న క్లబ్బు మెంబర్లు ఒక రిద్దరు కనపడగా వారితో ఉల్లాసకరమైన సంభాషణలు జరిపాం. క్లబ్బు ఆవరణ చిన్నది, సామాన్యమైనది.

ఒక సాయంత్రం పెందలకడనే బయలుదేరి సిమ్స్ పార్కు మీదుగా 2, 3 మైళ్ల దూరంలో వున్న వెల్లింగ్‌టన్ క్లబ్బుకు వెళ్లాను. ఆ పరిసరాలు విశాలమైన పచ్చికబయళ్ల మయం. క్లబ్బు ఆవరణ విస్తీర్ణమైనది. పచ్చికబయళ్లలో క్లబ్బు సంబంధమైన గాల్ఫ్ కోర్టు లున్నవి. క్లబ్బు కొంచెం ఎత్తైన స్థలములో కట్టబడినది. భవనం మిక్కిలి పెద్దది. మధ్యభవనం నాను కొని, యింకా కొంచెం ఎత్తైన భూభాగంమీద చిన్న భవన మొక టున్నది. పెద్దభవనంలో ఆటలకు, వినోదాలకే గాక, యూరపియన్ పద్ధతిని నృత్యానికి, వాయిద్యాలతోకూడిన సంగీతానికి అనుకూలమైన పెద్ద హాలున్నది. బిలియర్డ్సు, పింగ్ పాంగ్ టేబు ల్సున్నవని వేరే చెప్పనక్కరలేదు. చీట్లపేకాట ఆడుతారని ప్రత్యేకించి చెప్పట మనవసరం. పుస్తక భాండాగారం చిన్నదికాదు. రకరకాల యింగ్లీషు మాగజైనులు వస్తవి. మెంబర్లు, అతిథులు వుండటానికి ప్రత్యేకంగా గదుల వరుస లున్నవి. 10, 12 గదు లున్నట్లు చెప్పారు. మోటారుకార్లు మొదలైనవానిని పెట్టుకొనటానికి గరాజ్ లున్నవి. మొత్తం మీాద వుండవలసినచోటేగాక, అధమం వెళ్లి చూడవలసిన ప్రదేశమది. "రేపెల్లుండిలో ఒకగది ఖాళీ అవుతుంది. మీరు వచ్చి వుండవచ్చు"నని అక్కడి పెద్దనౌకరు చెప్పాడు. అయితే ఛార్జి చాలా హెచ్చు. ప్రదేశం దూరంలో వున్నది. నాకు వాహనం లేదు. అందువల్ల ఒకసారి వెళ్లి చూచి సంతోషించటంకంటె మరేమీ చేయలేకపోయాను.

ఒకనా డుదయం కోటగిరికి వెళ్లి మధ్యాహ్న భోజనానికి తిరిగి వచ్చాను. అది చిన్నప్రదేశం. అక్కడి విశేష మల్లా ఒక పెద్దపార్కు. దానిని 'నెహ్రూ పార్కు' అని పిలుస్తారు. ఆ పార్కు చుట్టూ తిరిగి ఒక గంట గడిపి, తిరుగుముఖ మైనాను. పార్కులో నాకు పెద్దవిశేష మేమీా కనపడలేదు. మామూలు పూలగుల్మాలు, వృక్షాలు. అయితే, ఒకప్రక్క ఒక పెద్ద గుంపు యూకలిప్టస్ చెట్లు క్రిక్కిరిసియుండి, ఆప్రాంతాన్ని శోభాయమానం జేసినవి.

కూనూరు నుండి కోటగిరికి వెళ్లే మార్గ మిరుప్రక్కల టీ పొదలు ఇంచుమించు రోడ్డు అంచువరకుండినవి.

1948 లో నేను నెల్లూరులో ఇన్‌కమ్‌టాక్స్ ఆఫీసరు ఉద్యోగం చేస్తున్నప్పుడు, కొన్నివారాలు సెలవుపెట్టి, ఆకాలంలో కొంతభాగం ఊటీలో గడిపాను. ఆవిషయం ఈ పుస్తకం రెండవ భాగంలో కొంత విపులంగానే వ్రాసియున్నాను. తర్వాత తిరిగి అక్కడకు వెళ్లలేదు. మా వసతిలో వుండుచున్న మాదప్ప అనే కూర్గు యువకునివల్ల గుర్రపు పందాలు జరుగుచున్నవని విని, ఆ జరిగే రోజు ఊటీకి వెళ్లి చూడాలని దిగువ కూనూరుకు వెళ్లాను. అయితే, ఎంతోమంది ప్రయాణీకులు పందాలు చూడ టానికి, బయలుదేరినందున నాకు బస్సులో స్థానం దొరకలేదు. ఊటీలోని గుర్రపు పందాలు ఏ 12 గంటలకో ఆరంభింపబడి, మధ్యాహ్నం 2 గంటలకే ముగుస్తవట. నాకు ఒంటిగంట వరకు బస్సు దొరకనందున యిక లాభం లేదని హోటల్‌కు తిరిగి వెళ్లాను. ఇంకొక రోజున పువ్వుల ప్రదర్శనం (ఫ్లవర్ షో) అని తెలిసి ఉదయం టిఫినైన తర్వాత 8 గంటలకే బయలుదేరి 10 గంటలకే ఊటీకి చేరుకొన్నాను. బొటానికల్ గార్డెన్సులో ఈ పువ్వుల ప్రదర్శనం. నాకు తెలిసినంతవరకు ఊటీలో చెప్పుకోతగ్గ పార్కు ఈ బొటానికల్ గార్డెన్సు మాత్రమే. అక్కడక్కడ ఏవో చిన్నచిన్న ఉద్యానవనా లుండవచ్చును గాని, అవి లెక్కలోనికి రావు. ఈ బొటానికల్ గార్డెన్సును 1948 సంవత్సరంలో నేను బాగానే ఎరిగియుంటినిగాని, 1973 సంవత్సరంలో నా కది క్రొత్తనిపించింది. 1948 సంవత్సరం కంటె తక్కువ వృక్షగుల్మాదులు, పుష్పలతాదు లుండి రామ ణీయకం క్షీణించిన ట్లుండినది. అయితే, పార్కుగుండా చప్టాలతో ఎక్కువ బాటలు వేశారని, దానికి చేరే త్రోవల నభివృద్ధి పరచారని, ఆ ప్రాంతంలో కొన్ని క్రొత్త భవనాలు వెలిసినవని తట్టింది. ఈ గార్డెన్స్ ముఖద్వారం నుండి భూభాగం ఏట

వాలుగా క్రిందికి వుంటుంది. తర్వాత విస్తీర్ణమైన సమతల భాగ మున్నది. రెండవప్రక్క మిక్కిలి ఎత్తుగా ఒక పెద్ద చెరువు గట్టు మాదిరి అంచు ఏర్పడింది. ఆ అంచుపైన రోడ్డున్నది. నేను 1948 సంవత్సరంలో వెళ్లినప్పుడు ఆ ఎత్తైన అంచు ఏట వాలుగా క్రింది నుండి పైకి లేచినట్లుండి, దాని నిండా పెద్దపెద్ద వృక్షా లుండినవి. ఒక ప్రక్కగా పైకి వెళ్లుటకు మెట్లుండినవి. నా కిప్పుడా మెట్లుగాని, చెట్లుగాని కనపడ లేదు.

పువ్వుల ప్రదర్శనాన్ని చూచుటకు ప్రేక్షకులు ఎక్కువగానే వచ్చారు. ప్రదర్శనానికి వివిధ రకాల పుష్పాల నమర్చిన స్టాల్సే (కొట్టాలు) గాక పేర్స్, ప్లమ్సు, బేరీపండ్లు మొదలైన పండ్ల స్టాల్సును, రకరకాల కూరగాయల స్టాల్సును కూడా పెట్టారు. మరిన్ని, అక్క డక్కడ పండ్లు, బిస్కత్తులు మొదలైన వాని నమ్మే దుకాణాలు, చల్లని సాదా పానీయాలను, కాపీ. టీ సప్లయిచేసే బడ్డీ లుండినవి. ప్రదర్శ నానంతరం స్టాల్సు లోని పూలను, కూరగాయలను అమ్ముతారటగాని అప్పటి కప్పుడు తినటానికి, త్రాగటానికి ఈ బడ్డీ లుపయోగపడినవి. తండోప తండాలుగా వచ్చిన యీ ప్రజ, ప్రదర్శనాన్ని చూడటంతో బాటు తినుబండారాలను ఎగబడి కొన్నారు. అటూ, ఇటూ తిరిగినంత సేపు తిరిగి చూచి, అక్క డక్కడ కుటుంబాలుగాను, గుంపు గుంపులుగాను కూర్చొని తిన్నారు. కూనూరులో పార్స్‌నిప్స్ అనే కూరదుంప విషయం అడగగా, ఆ ప్రాంతంలో దొరక వన్నారు. ఈ ప్రదర్శనలో వుంటవేమో నని అడిగితే, "యీ ప్రాంతాన అవె ట్లుంటవో తెలియ" దని చాలామంది చెప్పారు. ఒకాయన కాబోలును "అవి యీప్రాంతంలో పెంచ" రని చెప్పాడు. అయితే టర్‌నిప్స్ అనే కూరదుంపను కూనూరు, ఊటీల ప్రాంతంలో పెంచుతారు. కొనటానికి దొరుకుతుంది. 2 గంటలు పైచిల్కు నేనా ప్రదర్శనంలో తిరిగి, అక్క డక్కడ అడిగి పైకెక్కుచున్న రోడ్డు గుండా 2, 3 మైళ్లు నడిచి, ఆ ప్రాంతంలోని చైనీస్ రెస్టారాంట్‌కు చేరాను.

పెద్దబజారులో ఒక చైనీస్ రెస్టారాం టున్నదిగాని పీఠభూమిమీద మైదానంవంటి ప్రకృతిరామణీయకంగల చోట నుండిన ఈ చైనీస్ రెస్టారాంట్ కే పేరు, దీని భవనం 2 భాగాలుగా కట్టబడిన పెద్ద భవనం. నేను వెళ్లినప్పటికి కొన్ని కార్లు అక్కడ వేచియున్నవి. ఒకప్రక్కకు లోపలకు పోగా ఆ విశాలమైన హాలులో, భోజనం బల్లలన్నీ ఆక్రమించుకొని యున్నవి. రెండోప్రక్కకు తీసుకొని వెళ్లారు. అక్కడకూడా భోజనంచేసేవారు హెచ్చుగానే వున్నారుగాని, అదివరకే భోజనంచేసి వెళ్లిపోయినవారు ఖాళీచేయటంవల్ల కాబోలు 1, 2 బల్లలు ఆక్రమించుకొని యుండలేదు. ఒక బల్ల వద్ద నేను కూర్చొని "రొయ్యలతో వేయించిన అన్నం, క్రీముతో కూడిన స్ట్రాబెర్రీ ఫ్రూట్ సాలడ్ యివ్వ"మని అడిగాను. కొన్ని నిమిషా లాలస్యమైన తర్వాత గ్రుడ్ల పొరటు కలిపి వేయించిన అన్నం ఒక నిండుప్లేటు తీసుకువచ్చి యిచ్చాడు. "నేను రొయ్యలు కలిపింది కోరగా, కోడిగ్రుడ్లు పొరటు కలిపింది పట్టుకొచ్చావే"మని అడిగితే సర్వరు, "రొయ్యలు దొరకటం"లేదన్నాడు. "ఈ అన్నంతో తినటానికి చైనీస్ రెస్టారాంట్‌లో ప్రత్యేకంగా ఇచ్చే పులుసు, (సాస్) బాంబెడక్ అనే ఎండుచేప వేయించింది తె"మ్మని చెప్పగా, "బాంబెడక్ దొరక"దని సాస్ తెచ్చి యిచ్చాడు. నే నింగ్లండు విడిచిపెట్టిన తర్వాత బాంబెడక్ అనే చేప మద్రాసులోగాని, చివరకు బొంబాయిలోగాని ఎవరికీ తెలిసినట్లు లేదు. నేను బెజవాడలోనుండగా మా ఆఫీసు బిల్డింగు యజమాని ద్వారా బొంబాయిలో తెలుసుకొని కొంత తెమ్మని చెప్పాను. ఆయన ఆ చే పెట్టిదో తెలియలే దన్నాడు.

వేపు డన్నం మధ్యరకంగా వుండినదిగాని, 2½ రూపాయలు ఛార్జి చేసిన స్ట్రాబెర్రీ క్రీమును, మిక్కిలి కొద్దిగా క్రీముకు బదులు పాలను కలిపి, చిన్న గిన్నెలో ఇచ్చాడు. పైగా పండ్లు చిన్నవిగా, పుల్లగా నుండినవి డబ్బు ఖర్చుకు తగినంత తృప్తిగా భోజనం లేదు.

భోజనానంతరం తిరిగి వెళ్లేట కటు, ఇటు చూస్తే ఇంచు మించు ప్రక్కనే నీలగిరి బుక్ షాప్ అనే పేరుతో ఒక పుస్తక విక్రయశా లున్నది. నేను కొనదలచిన పుస్తకాల కొరకు అడుగగా అవి లేవన్నారు. అదృష్టవశాత్తు శ్రీ కె. పి. యస్. మీనన్ గారు వ్రాసుకొన్న స్వకీయ జీవిత చరిత్ర (ఆటోబయాగ్రఫీ) దొరికింది. అక్కడున్న అమ్మే పిల్ల, దాని ఖరీదు 13 రూపాయ లన్నది. పుస్తకం వెనుక ప్రక్క దాని ఖరీదు 7-50 రూపాయలు వేసి వున్నది. "7-50 రూపాయలు అయితే 13 రూపాయలు చెప్పినా వేమి!" టని అడుగుచుండగా, ఆషాపుకు చెందిన యువకుడు వచ్చి పుస్తకాన్ని చూచి, "ఇది 7-50 రూపాయలు మాత్రమే" అని యిచ్చాడు.

పుష్ప ప్రదర్శనంలో అటు, యిటు తిరగటంవల్ల, 2, 3 మైళ్లు నడచి చైనీస్ రెస్టారాంట్ కు వెళ్లటంవల్ల బడలిక అనిపించి, ఊరిలోకి వెళ్లకుండానే బస్ స్టాండుకు చేరి, కూనూరుకు చేరు కొన్నాను. ఇంకొకసారి ఊటీకి వెళ్లాను. ఈదఫా కూడా ఉదయమే బయలుదేరి వెళ్లాను. ఇప్పు డసలు సరాసరి పెద్దబజారుకు వెళ్లాను. ఇప్పుడు కట్టబడియున్న పెద్ద భవనాలలో నొకటి సూపర్ బజారు. దీనికి 'కరుణానిధి' అని మద్రాసు ముఖ్య మంత్రి పేరు పెట్టారు. మానవుని వానిటి, (స్వోత్కర్ష) అహం భావం ఎంతవరకు పోగలదో, సూపర్ బజారుకు శ్రీ కరుణానిధి పేరు పెట్టటం తెలుపుతుంది. మంత్రులు వస్తూ వుంటారు, పోతూ వుంటారు. తాత్కాలికమైన పదవిని ఆసరాగా తమ కాంస్య విగ్రహాన్ని, లేక శిల్ప విగ్రహాన్ని పెట్టించుకొనటం, ప్రజోపయో గానికి కట్టబడిన సంస్థలకు తమ పేరు పెట్టుకొనటం మనదేశ దౌర్భాగ్యం. ఈ సూపర్ బజారు భవనాని కానుకుని జర్మనీ వారి సహాయంతో నడుపబడుచున్న ఒక వ్యవసాయ పరిశోధన కార్యాలయ మున్నది. పరిశోధనశాలలో క్రొత్తరకాల బంగాళదుంపలు, గోధుమలు వగైరా వ్యవసాయోత్పత్తులను అభివృద్ధిపరచే పరిశోధనలను చేస్తారట, పరిశోధనల ప్రణాళికలు,

సమాచారం, ఉత్పత్తి సరుకుల మచ్చులు ఇక్కడి ఆఫీసులో చూపుతారు. కొన్ని సరుకులను అమ్ముతారు కూడా.

బజారుల వెంట తిరిగి ఆషాపుకు, ఈషాపుకు వెళ్లి చూచాను. ఆ షాపుల్లో మిక్కిలి పెద్దది, అన్ని వస్తువులతో సమృద్ధిగా వుండినది, బహు జనాకర్షణీయమైనదిగా రూపొందిన చల్లారామ్‌గారి విక్రయశాల వున్నది. 1948 లో ఆ పేరు గల షాపు అక్కడ లేదని, కేవల్ రామ్ గయ చంద్ గారు నడిపే వైట్ హౌస్ అనే విక్రయశాల కొంత పరువుప్రతిష్ఠలతో వుండేదని నాకు గుర్తు. ఇప్పుడా కేవల్ రామ్‌గారి వైట్ హౌస్‌స్థానే చల్లారామ్‌గారి షాపు వచ్చినట్లున్నది. ఈ బజారులోనే స్పెన్సర్ కంపెనీ వుండేదని, దానిలో వివిధ రకాల పాశ్చాత్య వస్తువులే గాక, దేశీయ వస్తువులుకూడా వుండేవని జ్ఞాపక ముండినది. దానికొరకు చూడగా ఆ పెద్దబజారులో కనపడలేదు. ఎవరినో అడుగగా, "అదిక్కడ కాదు, ఈ బజారుకు ఎదురుగా ఎత్తైన రోడ్డు మీద కొంతదూరం వెళ్లితే వస్తుం"దని చెప్పారు. కాళ్లీడ్చు కొంటూ అక్కడకు బయలుదేరాను. పోగా పోగా, కొంత దూరాన ఒక మలుపు రోడ్డు వచ్చింది. ఈ మలుపు రోడ్డుకు చేరే ముందు, మా వసతిగృహంలో కొన్నిరోజు లుండిన భార్యాభర్త లిద్దరు అటు వెళ్తూ కనపడి, ఆ మలుపు రోడ్డుగుండా నన్ను స్పెన్సర్ భవనానికి చేర్చారు. లోపలకు వెళ్లి చూడగా, దిగాలు మనుచుండినది. ఆ పూర్వవైభవంలో ౫-వ వంతు కూడా లేదు. సరుకులు చాలా తక్కువ, మిక్కిలి సామాన్యం. ఇప్పుడు ముఖ్యంగా తినుబండారాలవంటి వానిని అమ్ముచున్నారేమో అనిపించింది. మనకు స్వాతంత్ర్యం వచ్చిన తర్వాత చాలామంది శ్వేతజాతీయులు మన దేశం విడిచిపెట్టి వెళ్లిపోయారు. యూరపియన్లను అనుకరించే భారతీయుల సంఖ్య మిక్కిలి క్షీణించింది, అందువల్ల ఆ షాపు తన పూర్వపు వైభవాన్ని కోలుపోయింది. యూరపియనుల భోజన పద్ధతిలో నుపయోగించే బేకన్, హాము వంటి పంది సంబంధమైన వాని నమ్ముతారుగాని, ఇట్టివి కూనూరు

స్పెన్సర్ కంపెనీలోకూడ దొరుకుతవి. అక్కడినుండి పెద్దబజారుకు తిరిగి వెళ్ళి, సూపర్ బజారుకు దగ్గరనున్న ఒక భవనం మేడలో నడుపుచున్న రిట్జ్ అనే రెస్టారాంట్ కు వెళ్లాను. భోజనాల సమర్చేవానిలో రిట్జ్ సంస్థ పేరుగలది. పేరునుబట్టి ఇక్కడ భోజనం చాలా బాగుగా వుంటుందని భ్రమపడి, మధ్యాహ్న భోజనానికి అక్కడికి వెళ్లాను. భోజనంచేసేవారిలో చాలామంది అన్నం, చపాతీలు, మాంసాదుల కూరలతో తింటున్నారుగాని, నాకు యూరపియన్ పద్ధతి భోజనం ఎక్కువ యిష్టం. అరుదుగా గాని ఆ భోజనం భుజించటాని కవకాశం కలగదు. అందువల్ల నేను మాంసం కట్ లెట్సు, వేయించిన చేప కోరుకొన్నాను. పైగా నూడుల్సు అనే సేమియావంటి పదార్థాన్ని క్రొత్త అనుభవం కొరకు తెప్పించుకొన్నాను. నూడుల్సులో కలిపి తినుటకు మామూలు టొమాటో కచ్చప్ సాస్ ను యిచ్చాడు. దానిని సగంకంటె తక్కువగానే తినగలిగాను. మాంసం బిళ్లలు చాలా మధ్యరకం. చేప రెండు ముక్కలే యిచ్చాడు. అందులో ఒకటి షెల్ ఫిష్ సంబంధమైనది. అది బాగుండినదిగాని, రెండవ ముక్క మధ్యరకం. అన్నిటికంటె ఆ రెండు ముక్కలు నాకు చాలలేదు. "ఇంత తక్కు విచ్చావేమని, ఇంకా కొంత పట్టుకురా" అని సర్వర్ ను అడిగితే, "యింతకంటె ఎక్కువ ఇవ్వం" అన్నాడు. ఈ చేపముక్కల ఖరీదు కూడా మిక్కిలి హెచ్చే. అందువల్ల సరి పెట్టుకుని వచ్చేశాను. పెద్దబజారులోని ఒక పుస్తక విక్రయ శాలలో 2, 3 పుస్తకాలు కొన్నాను. చల్లారామ్ షాపులో మిక్చరు, కారంబూంది, మురుకులవంటి వానిని నాలుగుపొట్లాలు కొన్నాను. ఈ పొట్లాలను, పుస్తకాలను పట్టుకొని కొద్దిదూరంలో వున్న బస్ స్టాండుకు నడచివెళ్లి, తిరుగు బస్సెక్కి కూనూరు చేరు కొన్నాను. అంతటితో నేను తిరిగి ఊటీని చూడాలనే దిలాస పూర్తయింది.

కూనూరు లోని స్పెన్సర్ కంపెనీని పైన పేర్కొన్నాను. ఆ షాపులోనికి 3 సార్లైనా వెళ్లియుంటాను. ఆ షాపు కూడా

చాలా తక్కువ సరుకుతోనే. సామాన్య వస్తువులతోనే నిండి యున్నది. మొదటిదఫా అక్కడుండిన ఇంగ్లీషు పుస్తకాలలో వరి 1, 2 కొన్నాను. నా వసతిగృహంలోని ఉదయ భోజనం కోడిగ్రుడ్లతోబాటు వేయించిన బేకన్ యిచ్చారు. వేయించిన కోడిగ్రుడ్లతో బేకన్ తింటేనే ఎక్కువ రుచిగా వుంటుంది. నిజానికి తిన్నట్లుంటుంది. శ్రీమతి ఆండర్సన్‌ను అడుగగా "దాని ఖరీదు హెచ్చు, మీకు పెడితే అందరికీ పెట్టాలి. ఆపని చేయలే" మన్నది. అందువల్ల నేను ఒక చిన్న పొట్లం కొని వసతి గృహంలో యిచ్చి దానిని "ప్రతిఉదయం గ్రుడ్లతోబాటు యివ్వం"డని చెప్పాను. 3-వ సారి అనుకుంటాను, వెళ్లినప్పుడు పైన చిక్కని ఆకుపచ్చరంగుతో గుండ్రంగా వుండిన కొన్ని పండ్లను చూచాను. "ఇవి ఏమి పండ్ల"ని అడుగగా "బ్రెడ్ ఫ్రూట్" అన్నాడు. ఈ బ్రెడ్ ఫ్రూట్స్ పసిఫిక్ సముద్ర దీవులలో విస్తారంగా పెరుగుత వని, అక్కడి జనులు వానిని భోజనపదార్థంగా ఉపయోగిస్తారని అక్కడక్కడ చదివాను గాని, చూచియుండ లేదు. అందువల్ల వింతపడి, ఒక పండును కొన్నాను. తీరా మా వసతిగృహానికి తీసుకొనివెళ్లి దాని దట్టమైన పై టెంకను పగులగొట్టించి చూడగా దానిలో ముద్దవంటి గుజ్జు, పెద్ద టెంక వుండినవి. దానిని తినగా చప్పగా వుండినది. అయితే, దానిని పంచదారతోనో, లేక ఉప్పుతోనో తింటే బాగుంటుందట. పండినకొలది పైచర్మం లోపలిభాగం గుజ్జుగా తయారౌతుందట. ఎక్కువ గుజ్జు లభిస్తుందట.

ఊటీలో పుష్ప ప్రదర్శనమైన తర్వాత కూనూరు సిమ్స్ పార్కులో ఫల ప్రదర్శనం జరుగుతుంది. ఈ ఫల ప్రదర్శనానికి నేను, వసతిగృహంలో వున్న శ్రీ లాజరస్ కలసి వెళ్లాం. ప్రదర్శనం ముఖద్వారం మెట్లక్రింది మొదటి సమస్థల భాగం మీదనే. పండ్లు మామూలుగా అక్కడ దొరికేవే. పేర్స్, పీచస్, ప్లమ్స్, బేరీ పండ్లు మొదలైనవి. పండ్ల ప్రదర్శన మని పేరేగాని,

పండ్లకంటె కూరగాయలు, దుంపలే ఎక్కువగా వుండినవి. ఇరుకు స్థలంకాబట్టి పొడుగూతా చిన్నచిన్న స్టాల్స్‌ను మాత్రమే పెట్ట గలిగారు. మొదటి సమస్థలంపై అంచున కొంచె మెత్తుగానున్న భాగంలో, బైటి రోడ్డు కానుకొనియున్న కంచె లోపలి భాగా న్నానుకొని కూడా స్టాల్స్ ఏర్పరచబడ్డవి. ఈ స్టాల్స్ క్రింది భాగంలో నడచుటకు త్రోవ, త్రోవ కవతల ప్రక్క మరికొన్ని స్టాల్స్, ఈ స్టాల్స్‌కు దిగువభాగం రెండో అంతస్థుగావుండినచోట చిన్నచిన్న దుకాణాలు, దాని కిరుప్రక్కలా కొన్ని గుడారాలు, మొదలైన వేర్పడి, ఈ ప్రదర్శనం కొంత విస్తృతమైనదిగా కనపడ్డది. ప్రేక్షకుల సంఖ్య చాలా హెచ్చుగుటచేత, మెట్లనుండి క్రిందకి దిగడం, ఇరుకు త్రోవల ద్వారా ఆ స్టాలు, ఈ స్టాలు చూడటం మిక్కిలి శ్రమ కలిగించింది. నిజానికి బైటిరోడ్డునుండి మెట్లు క్రిందకు దిగగలమా, దిగిన తర్వాత ముందుకుగాని, వెనుకకు గాని సాగిపోగలమా, ఈ త్రోపుడులలో క్రింద పడిపోమా, కాలో చెయ్యో విరగదా, బయటపడగలమా అనిపించింది నాకు.

ఈ గందరగోళంలో మెట్లకు సమీపంలో రెండు బల్లల నమర్చి పండ్ల నమ్ముచున్న దుకాణం దగ్గర మా వసతిగృహం కుర్ర వాడొకడు కనపడగా, వాని సాయంవల్ల కొన్ని పండ్లు కొన్నాను. పేర్స్ కూనూరులోగాని, ఊటీలోగాని రుచిగలవే దొరికినవి. వేళావిశేషాన్నిబట్టి ప్లమ్సుకూడా ఫరవాలేదుకాని, కొడైకెనాల్‌లో దొరికే ప్లమ్సు వంటి రుచిగల పెద్దరకం ఈ ప్రాంతంలో దొరకనేలేదు. పీచస్ మిక్కిలి నాసి. కూనూరు పెద్దమార్కెట్టులో కూడా పెద్దసైజు నిమ్మకాయలకంటె పెద్దవి కనపడలేదు. ఇంచుమించు అన్నీ పుల్లటివే. కొడై కెనాల్‌లో కూడ పీచస్ నాసిగానే వుండేవి. నిజానికి నేను ఇంగ్లండులోను, పారిస్ నగరంలోను కొని తినిన పీచస్ పెద్దసైజు యాపిల్ పండ్లవలె మిక్కిలి మృదువుగా, రస పూరితంగా, మధురంగా వుండేవి. పండు చూడటానికి కూడా అందంగా వుండేది. దాని పైతోలు నునుపుగా, ఒకవిధమైన కాంతితో ముఖమల్‌వలె నుండేది. నిజానికి మిసమిసలాడే చక్కని యువతిని పీచ్ అంటారు. కాని, కూనూరు పీచ్ అంటే ఉడికి

పోయిన, కాంతిహీనమైన చిన్న సైజు గుంట (ఆడపిల్ల) అవుతుంది. ఈ కొన్న పండ్లతో బైటికి వెళ్లటానికి మెట్లమీద ఒక అడుగు ముందుకువేస్తే రెండడుగులు క్రిందికి దిగజారటం, మధ్య త్రోపుడులతో దిగజారిపోవటం, వెనుకనుండి ఎవ్వరో త్రోయగా ముందువారిమీద బరువానించటం, వాళ్లే మోచేతితోనో వెనుకకు నెట్టటం ఈవిధంగా చావు దప్పి కన్ను లొట్టపోయినట్లు బయటపడి నెమ్మదిగా వసతిగృహానికి చేరుకొన్నాను. శ్రీ లాజరస్, నేను మెట్లు దిగిన పిమ్మట ఏదోవిధంగా సందు జేసుకొని ఆ లైను త్రోవదాకా వెళ్లి తిరుగుముఖంపెట్టి కొంత దూరం వచ్చిన తర్వాత, ఆ గుంపులో శ్రీ లాజరస్ తప్పిపోయారు. తర్వాత ఆయన కనపడలేదు. ఆయనకూడా ఇంటికి చేరుకొన్న తర్వాత, "ఏమైపోయారు?"రని అడిగితే, "నేను రెండో ప్రక్క ఒక బెంచీమీద కూర్చున్నాను. మీరు వస్తారేమో అనుకున్నాను" అన్నాడు. ఏ ప్రక్కనైనా గజం దాటి చూడలేని స్థితిలో ఆయన ఏదో ఒక ప్రక్క దూరంగా కూర్చుంటే నా కెట్లా తెలుస్తుంది? శ్రీ లాజరస్ మంచివాడు, స్నేహభావం కలవాడేగాని, ఆ గందరగోళంలో దృష్టిమాంద్యంగల నన్ను ఒంటరిగా విడిచిపెట్టవలసింది కాదని తోచింది.

వాహ్యాళి విషయంలో చాలవరకు పైన చెప్పియున్నాను. నాలుగు ప్రక్కలకువెళ్లితే ఆ ప్రాంతమంతా చూచినట్లుంటుంది, నడక సాగుతుందనే భావంతో ఎక్కడే రోడ్డు, ఏత్రోవ కనపడినా దానిని కొంతదూరమైనా అనుసరించేవాడను. అయితే, పైజెప్పినట్లు మధ్య ఎత్తైన భాగం తప్ప ఎటుప్రక్కకు తిరిగినా దిగువ కూనూరుకు వెళ్లే త్రోవో, లేక ఏ అగాధాలకైనా పోయే త్రోవో వుండేవి. నేను వెళ్లిన మొదటి రోజున స్పెన్సర్ షాపుకు వెళ్లే రోడ్డుకు ముందు రోడ్డు ననుసరించగా అది క్రిందకు దిగిపోయే కచ్చారోడ్డు అయిపోయింది. బెడ్ ఫర్డ్ స్క్వేర్ నుండి సన్ డే చర్చి స్కూలు మీదుగా హామ్ప్టన్ హోటలుకు ముందు, కోటగిరి - కూనూరు బస్ రోడ్డు గుండా తరుచు వెళ్లేవాడిని. ఆ

రోడ్డు కూడా దిగువ కూనూరుకు పోయే ఏటవాలురోడ్డు అయినా, మరంత ఏటవాలు కలది కాదు. తిరిగి రావటం ఎక్కువ శ్రమను కలిగించేది కాదు. బెడ్ ఫర్డ్ స్క్వేరు నుండి సిమ్స్ పార్కుకు పోయే పెద్దరోడ్డు కూడా క్రమేణా పైకి లేచిన రోడ్డేగాని, ఎక్కువ శ్రమను కలుగ జేయదు. అందువల్ల మా వసతిగృహాన్నుండి బయలుదేరి ముక్కుకు సూటిగా బెడ్ ఫర్డ్ స్క్వేర్ మెట్లకెదురుగా నున్న పెద్దరోడ్డు ననుసరించి సిమ్స్‌పార్కు వరకూ వెళ్లటం, తిరిగి వచ్చేటప్పుడు బెడ్ ఫర్డ్ సినిమా వైపుకు తిరిగి, సన్ డే చర్చి స్కూలు మలుపు తిరిగి హామ్ప్టన్ హోటల్ మీదుగా స్పెన్సర్ దుకాణాన్ని దాటి, వై. డబ్ల్యు. సి. ఎ. కి దిగే క్రింది రోడ్డు వద్దకు చేరి, నివసించే చోటుకు వెళ్లటం తగినంత వ్యాయామం కలిగించే నడక. చాలాసార్లు ఆవిధముగనే షికారు సాగించాను.

ఇక, నా వసతిగృహం భోజన విషయాలు. వసతిగృహంలో నాకు పరిచయమైన వారిని గురించి చెప్తాను. ఇక్కడి వై. డబ్ల్యు. సి. ఎ. ను వయోమింగ్ వై. డబ్ల్యు. సి. ఎ. అంటారు. వయోమింగ్ అనేది అమెరికా సంయుక్త రాష్ట్రాలలోని ఒక స్టేటో లేక ఒక ప్రాంతమో అట. ఆ రాష్ట్రీయుల లేక ఆ ప్రాంతీయుల సహాయంవల్ల, కూనూరులోని ఈ వై. డబ్ల్యు. సి. ఎ. భవనం కట్టబడిందట. ఈ భవనం ఆవరణను బాగుచేయించింది, ఈ భవనం నుండి బయటకు వెళ్లటానికి రోడ్డును రాతి బండలతో, కంకరరాళ్ళతో వేయించింది వయోమింగ్ వారే నట కాని కొన్ని సంవత్సరాలనుండి వారి సహాయం ఈ సంస్థకు అందు చుండుటలేదు. బిల్డింగుకు కావలసిన మరమ్మతులు నిలిచిపోయినవి. క్రొత్త అనుకూలాలను సమకూర్చుకొనుటకు ఆసరే లేకపోయింది. ఇవి అంతగా గమనించవలసినవికాదుగాని, బయటకు వెళ్లే త్రోవ మిక్కిలి చికాకుగా వుండినది. అడుగున వేసిన బండలు కదలక పోయినా పైన వేసిన కంకర, రబ్బీసు చెల్లాచెదురైనది. దారి పొడుగూతా కంకర ముక్కలు పైకిలేచి ఎత్తు పల్లాలు, చిన్న చిన్న గోతులు సంభవించినవి. బాగా ఎండకాచి ఆ త్రోవ పొడిగా వున్నప్పుడో కప్రక్కగానైనా కంకరముక్కలను ఎదుర్కో కుండా గుంటలను ప్రక్కకు తప్పుకొని వెళ్లవచ్చునుగాని, వర్షం

పడినప్పుడు త్రోవంతయు చీదరగా వుండి, పోను రాను మిక్కిలి కష్టమనిపించింది. త్రోవ పొడుగు చిన్నది కాదు. 150 గజాలైనా వుంటుంది. మరిన్ని, వర్షాలు సకాలంలో పడకపోతే, ఊటీలోనే గాక, కూనూరులో కూడ నీళ్ల కరువు. ఈ బంగళా సరిహద్దు చిన్న కొండవంటి ఎత్తైన ప్రదేశంలో వుంచబడిన రెండు టాంకుల ద్వారా ఈ భవనం క్రిందిభాగానికి, పైభాగానికి నీరు పంపుల ద్వారా సప్లయి అవుతుంది. తగినంత వర్షం లేకపోతే మునిసిపాలిటీవారు నీటిని బందు చేస్తారు అందువల్ల మాకు అప్పుడప్పుడు నీళ్ల కరువేర్పడింది. స్నానానికేగాక, దంతధావనానికి కూడా తగినంత నీరు అందలేదు. నేను కొన్ని సంవత్సరాలనుండి అనగా 1963 లో కుర్తాళం వెళ్లి జలపాతం క్రింద చన్నీళ్లస్నానం చేసినప్పటినుండి, శీతాకాలంలో కూడా చన్నీళ్లస్నానం చేస్తాను. అయితే, కొండల శీతల ప్రదేశమగు కూనూరులో చన్నీళ్లస్నానం వ్యాధికి కారణ మవుతుంది. అందువల్ల వేడినీళ్లతోనే ప్రతిఉదయం స్నానం చేసేవాడను. ఒక ఉదయం వేడినీళ్లకోసం అక్కడి నౌకరును కేకవేయగా 'లే' వన్నాడు. 'ఎందు ?'కని అనగా 'టాంకులలో నీళ్లు లేవు, అమ్మగారు ( అనగా మిసెస్ ఆండర్సన్ ) ఈపూట స్నానానికి నీళ్లులేవని చెప్పమన్నా'' రన్నాడు. నేను వానిని గట్టిగా కోప్పడి ''నేను తప్పక స్నానం చెయ్యాలి. ఉదయ భోజనమైనా మాను కొంటానుగాని, స్నానం మానుకోను. అమ్మగారితో చెప్పవలసిం''దని గట్టిగా కేకలువేసినట్లుగా అరచి చెప్పాను. ప్రక్కనున్న ఆమె విన్నది కాబోలు, వారు నిలవబెట్టుకొనియుండిన నీళ్లనుండి కొలది నిమిషాలకే నా కొక బకెట్ గోరువెచ్చని నీళ్లిచ్చారు. మామూలుగా యిచ్చేది కూడా ఒక బకెట్ నీరే. అయితే ఒకొక్కప్పుడు ఆ నీరు మిక్కిలి వేడిగాను, అప్పుడప్పుడు అంత వేడిగా లేకపోయినా తగినంత వేడిగాను వుండేవి. దానిలో చన్నీళ్లు కలుపుకొని, ఆ బకెట్ వేడినీళ్లను ఒక బకెటున్నర చేసుకొని, జాగ్రత్తగా వాడుకొని పని పూర్తి చేసుకునేవాడను. ఇంటివద్ద పెద్ద గంగాళం చన్నీళ్లేగాక, ప్రతి

శనివారం తలంటుస్నానంలో అథమం ఆరు బకెట్లైనా నీళ్లుపయోగించటం నా కలవాటు. శీతలప్రదేశంకాబట్టి అన్ని బకెట్ల నీరు అవసరంలేకపోయినా, క్లుప్తంగా వాడుకోనకపోతే స్నానం చేసినట్లే వుండేదికాదు. కొంతమంది అతిథులు 3, 4 రోజులు కూడా స్నానం చేయటానికి అవకాశంలేక వుండినారట. కాని, నేను మాత్రం ఏనాడూ ఉదయస్నానం చేయకుండా వుండలేదు. మరీ యిబ్బంది పడుచున్నారని ఒక ఉదయం, "పోనీలే, ఈవేళ స్నానం మానుకొంటా" నన్నానుకాని, శ్రీమతి ఆండర్సన్ "ఎందుకులే, ఏదోవిధంగా మేము మీకు వేడి నీళ్లందిస్తాం" అన్నారు. ఆ సుముఖత్వాన్ని చూపించటానికి కొంత కారణం వుండి వుంటుంది. మద్రాసు వై. డబ్ల్యు. సి. ఎ. లో కొంత ప్రాముఖ్యం గడించిన నా కుమార్తె కమలకుమారి ద్వారా నే నక్కడికి వెళ్లటం, నేను ప్రాతఃకాలాన బెడ్ టీగాని, సాయంత్రం టీ, టిఫిన్ గాని తీసుకోకపోవటం, పైగా వృద్ధుడ నవటం, చప్పున చిరాకుపడి కోపం తెచ్చుకునే ఈయనతో తగాదా ఎందుకు అనుకోవటం కారణాలై యుండవచ్చును.

ఉదయ భోజనం 8 గంటలకు, మధ్యాహ్న భోజనం ఒంటి గంటకు, సాయంత్ర భోజనం 7½ గంటలకు ప్రారంభం. ఉదయ భోజనంలో పారెడ్జ్ అను పేరుతో ఓట్సుతో చేసిన పాయసంవంటిది గాక, గోధుమరవ్వతో చేసిన జావవంటి దిచ్చేవారు. 2, 3 రోజులైనతర్వాత శ్రీమతి ఆండర్సన్‌తో "నాకీ జావ గిట్టదు. మీరు కారన్ ఫ్లేక్సు తెప్పించా"లని చెప్పాను. మరునాటినుండి నాకు మాత్రం కారన్ ఫ్లేక్సు యిచ్చేవారు. నానురొట్టెలో ఉపయోగించటానికి తీపి జామ్ కాక పులుపు, తీపిగా వుండే ఆరంజ్ మార్మలేడ్ కావా లన్నాను. మార్మలేడ్ కూడా ఉపయోగించుచుండినారుగాని, మొదటిలో నావరకు రాలేదు. తర్వాత ప్రతినిత్యం నానురొట్టె, వెన్నతోబాటు మార్మలేడ్ నా భోజనం టేబుల్ మీద పెట్టేవారు. పాలు మధ్యరకంగా వుండేవి. పంచదారకు బదులు నేను తీసుకొని వెళ్లియుండిన శాకరీన్ చుక్కలు వాడేవాడను. కాఫీ, టీకి బదులు

ఒక కప్పు పాలు యిచ్చేవారు. రెండు వేయించిన కోడిగ్రుడ్లు యిచ్చేవారు. వేయించిన బేకన్‌తో తింటే అవి ఎక్కువ రుచిగా వుంటవని వారు ఖరీదుగల బేకన్ యివ్వలేమంటే, నేను స్పెన్సర్ కంపెనీనుండి తెచ్చానని చెప్పాను. నేను తెచ్చింది అయిపోగా, శ్రీమతి ఆండర్‌సన్ నా ఖర్చుమీద కొంత చౌకగా ఆమె తెప్పించింది. భోజ నారంభంలో ఏదో పండు నిచ్చేవారు. అప్పు డప్పుడు అరటిపండు, ప్లమ్స్ వంటి విచ్చినా చాలావరకు బొప్పాయి పండు చెక్క నిచ్చేవారు. బొప్పాయి రుచిఅయినదే గాక, జీర్ణానికి సహాయకారి. మధ్యాహ్న భోజనానికి మాంసం, దానికి సరిపడు 1, 2 కాయకూరలు ఒక కోర్సుగాను, అన్నం, మాంసం లేక చేప సంబంధమో, లేక పప్పు సంబంధమో ఒక పులుసు కూర, ఒక పుడ్డింగ్ వుండేవి. మామూలుగా రొట్టె, వెన్న వుండేవి. పుడ్డింగ్‌లో పంచదార కలుస్తుందికాబట్టి వద్దని కొన్నాళ్లు పెరుగుగాని, మజ్జిగగాని తీసుకొనేవాడను.

సాయంత్రమిచ్చే టీ, బిస్కత్తులు లేక కేకులు తీసుకొనే వాడనుకానని పైన చెప్పాను. రాత్రి భోజనంలో మొదట సూప్ నిచ్చేవారు. మాంసం లేక చేప, అన్నం, పులుసు, పుడ్డింగు మధ్యాహ్న భోజనంవలెనే వుండేవి. భోజన ప్రమాణం సరిపోయేదిగాని, ఉదయ భోజనమే నాకు తృప్తి నిచ్చేది. పైగా గొడ్డు మాంసం యిస్తారు. ఒకటి, రెండు సార్లు తింటే ముదురైన మాంసంవలె తమాషాగా వుండింది. అనుమాన పడి వడ్డించే వానిని అడుగగా 'గొడ్డు మాంసం' అన్నాడు. గొడ్డు మాంసం నేను యిష్టంగానే ఇంగ్లండులో తిన్నానుగాని, ఆ మాంసం రుచి, వాసన బాగుగా వుండేవి. మనదేశంలో ముఖ్యంగా నా వసతిగృహం వంటి చిన్నచోట్ల యిచ్చే గొడ్డు మాంసం నాసి రకం. ఇతరు లందరు ఏ అభ్యంతరం లేక మామూలుగా తినేవారుగాని, నా కయిష్టం కలిగింది. అందువల్ల నేను వడ్డించే వాళ్లతోనేగాక, మిసెస్ ఆండర్‌సన్‌తో కూడా "గొడ్డు మాంసం తినకూడదనికాదుగాని, నా వయస్సులో నా తగ్గిన జీర్ణశక్తికి గొడ్డుమాంసం పనికిరాదు.

దానికి బదులు ఏదైనా యిప్పించం''డని చెప్పాను. అక్కడితో దానిని నా కివ్వటం మానివేశారు. దానికి బదులు ఏ మాంసం ముక్కో, చేప ముక్కో యిచ్చేవారు. వంట సర్వసామాన్యంగా వుండేది. ఏవిధంగా వండిన కూర కైనా డ్రెస్సింగ్ అనగా మసాలా లేక పై పూత అవసరం. మన వంటకాలకు పోపులు, (తిరగమోతలు) మసాలా లెట్లో పాశ్చాత్యదేశ వంటకాలకు పై పూతలు, సాస్ అనేవి అట్లా ముఖ్యం. వేపుడు చేప యిస్తే పై జెప్పిన పుదుచ్చేరి హోటల్‌లోవలెనే ఏ పై పూత, సాస్ లేకుండా యిచ్చేవారు. నేను వంటవానితో, "ఈవిధంగానేనా వంట చేయవలసింది! ఈ మాంసం డ్రెస్సింగ్ ఈవిధంగానేనా వుండవలసింది? ఈ చేపకు ఏ పై పూత లేకుండా, ఏ సాస్ లేకుండా యివ్వటమేనా?" అని అడిగాను. అందుల కతను "అయ్యా! నాకు వంట బాగా వచ్చును. నేను పెద్ద పెద్ద యిండ్లలో చేశాను. అన్ని వంటకాలను శ్రేష్ఠంగా చేయగలను. అయితే, దానికి తగిన సామాగ్రిని నా కందజేయాలి. అమ్మగారు చాలా లోభిస్తారు. సరియైన వస్తువులను నా కివ్వరు. ఏదోవిధంగా సర్దు మంటారు. న న్నేమి చెయ్యమంటా?" రన్నాడు. శ్రీమతి ఆండర్‌సన్ ఇంగ్లీషు వనితయేగాని, భోజన సమయంలో ప్రతిబల్లకువెళ్లి భోజనంచేస్తున్నవారిని, "మీరు తృప్తిగా భోజనం చేస్తున్నారా ?" అని అడిగేదికాని, సిసలైన లోభివలె, మిక్కిలి పొదుపుగా పనినెరవేర్చుకొనే మనస్తత్వం కలది. ఎంత ఆదరణతో, అనునయంతో అతిథులను సంతృప్తి పరచాలన్నట్లుగా వర్తించినా, డబ్బుదగ్గర గట్టిది. దీని కొక ఉదాహరణ చెప్తాను. నేను బయలుదేరే రోజున నా కక్కడివ్వవలసింది ఉదయ భోజనం మాత్రమే. అయితే రైలు మధ్యాహ్నం 4½ గంటలకు గాని కూనూరు స్టేషన్ నుండి బయలుదేరదు. గనుక ఏ మూడుగంటలకో యిక్కడనుండి బయలుదేరుటకు ఏర్పాటు చేసుకొన్నాను. "మధ్యాహ్న భోజన మివ్వండి, దానికి వేరే ఛార్జి చేయవచ్చు"నని చెప్పాను. వంటవాడు నా మెహర్బాని కొరకు

మంచి వంటకాలు చేయా లనుకొన్నాడు. నేను మామూలు ఒంటి గంటకు గాక రాత్రి రైలులో భోజనం లేకుండా వుండ టానికి కొంచెం ఆలస్యంగా భోజనం చేస్తానని చెప్పాను. మరిన్ని, నేను బయలుదేరిన 5-6-1973 నాటికి ఇతర అతిథు లందరూ వెళ్లి పోయారు. మిగిలింది నేను, ఒక టీ కంపెనిలో ఉద్యోగంచేస్తూ, ఇంచుమించుగా స్థిరస్థాయిగా అన్నట్లు నివసిస్తూండిన కూర్గు యువకుడు శ్రీ మాదప్ప మాత్రమే. నిజానికి కూనూరు సీజను మే 27-వ తారీఖున సిమ్స్ పార్కులో జరిగిన పండ్ల ప్రదర్శనతో ముగిసిందట. మాదప్ప సకాలంలో భోజనానికి రాడు. కాబట్టి ఆ భోజన హాలులో భోజనంచేసేవాడిని నే నొక్కడనే. ఉదయం 10, 11 గంటల మధ్య నేను గదినుండి బైటికిరాగా నా గది కొక ప్రక్క నుండిన శ్రీమతి ఆండర్సన్ గదినుండి వంటవాడు గొణుక్కుంటూ బైటికివచ్చి "ప్రాతఃకాల బెడ్ టీ తీసుకోదు, మధ్యాహ్న టీ, టిఫిన్ తీసుకోదు" అంటూ నన్ను చూడకుండానే తన వంటగదిలోకి వెళ్లిపోయాడు. దీని అర్థం నా కిచ్చిన మధ్యాహ్న భోజనాన్నిబట్టి తెలిసింది. అది మామూలు మధ్యాహ్న భోజనంకంటె చాలా నీరసంగా వున్నది. ఏదో మిగిలిం దిచ్చి సరిపుచ్చారుకాని, దానికి పుచ్చుకొన్నది 6 రూపాయలు. నాకు వసతికి, భోజనానికి ఛార్జి చేసింది రోజుకు 25 రూపాయలు. నౌకర్ల కని దీనికి 5 శాతం కలిపినా, ధరలు పెరిగియున్నందున ఈ రేటు హెచ్చని చెప్పటానికి వీలు ఏమాత్రం లేదు. కాని, శ్రీమతి ఆండర్సన్ నాలుగు డబ్బులు కూడ బెట్టా లనుకొనే పద్ధతివల్ల ఆ మధ్యాహ్న భోజనం నీరసమే అయింది.

శ్రీమతి బార్బరా ఆండర్సన్ వయస్సుమళ్లిన స్త్రీ. ఆమెకు 65 సంవత్సరాల వయస్సు తక్కువ కాకుండా, 70 సంవత్స రాల వయస్సు వర కుండవచ్చును. కాని కాయ శరీరం కలది. కష్టపడే స్వభావం కలది. వ్యాయామానికి ప్రతిసాయంత్రం తన చిన్నకుక్కను తీసుకొని బైటికి వెళ్తుంది. ఈ కుక్క విశేషం,

రాత్రి భోజన సమయమందు మా భోజన బల్లల మధ్య తారస లాడటం, భోజనానికి ముందు ఏ బొమికెనో తెచ్చి రత్నకంబళి మీదనే దానిని కొరుక్కుంటూ చెలగాట లాడటం నా కసహ్యమనిపించేది. అప్పుడప్పుడు కొంత మాంసంతో వుండిన పెద్ద బొమికెలను తెచ్చి ఆ భోజన హాలులోనే దాని ముందు పడవేసే వారు, అది మరింత రోతనిపించింది. అనుభవంగల ఆవృద్ధ ఇంగ్లీషు స్త్రీ ఎందుకీ అనాచారాని కొప్పుకొనుచున్నదా అను సందేహం కలిగేది. సరే, ఆమె షికారులో ఇద్దరు, ముగ్గురు (యూరపియన్, ఆంగ్లో-ఇండియన్) వయస్సుమళ్లిన స్త్రీలతో షికారు సాగించేది. నా షికారులో ఆమె, ఆమెతో కలసి వున్న స్త్రీ లెదురుపడినప్పుడు, వారికి నన్ను ఎరుకపరచేది. నేను ఒంటరిగా ఎదురైనప్పుడు పలకరించి నేను ధరించి యుండిన టోపీ నెత్తి నమస్కరించిన భావం కనపరచేవాడను. శ్రీమతి ఆండర్సన్ మంచిదే. ఆదరణ, కొంత ఆప్యాయత చూపేదే. భోజన సమయంలో బల్ల బల్లకు తిరిగి "భోజనం బాగున్నదా!" అని అడిగేది. ఆ పూట యింక కొంచెం బాగున్నట్లయితే ప్రత్యేకించి నా బల్లవద్దకు వచ్చి, "మీకు తృప్తిగా వున్నదా!" అని అడిగేది. సరసంగా, కొంచెం చమత్కారంగా మాట్లాడేది. ఈవిధముగా అనుకూలమైనదేగాని, పైన చెప్పినట్లు డబ్బు పీనాసితనం నాకు కొంత అసంతృప్తిని కలిగించిందని చెప్పాలి. అయినా, ఆమె యందు నాకు గౌరవభావం, ఆప్యాయత వుండినవి. అందువల్ల వచ్చేటప్పుడు ఆమె కుడిహస్తాన్ని, బుగ్గను ముద్దుపెట్టుకొని వచ్చాను.

అక్కడ ఆ వసతిగృహంలో కలసికొన్నవారిలో నలుగు రైదుగురు ఎక్కువ పరిచయమైనారు. నే నక్కడకు చేరుకొన్న మే 7-వ తారీఖు మధ్యాహ్నం బైటకు వెళ్లుచు నన్ను పలకరించినవారు దేవదాసన్ అనేవారు. ఆయనది భారీ విగ్రహం. లావుగా, చలాకీగా వుంటారు. కృష్ణవర్ణం వారైనా అవయవ పొందిక లేగాక, మంచి ముఖకవళికలు కలవాడు. ఆయనగారు యమ్. ఎ. డిగ్రీని పొంది ప్రభుత్వ విమానదళ శాఖలో పనిజేసి రిటైరైనారట. యుద్ధంచేసే విభాగంలోగాక, వైమానికులను

తర్ఫీదు చేసే విభాగంలో వుండేవాడట. వయస్సు 72 సంవత్సరము లని చెప్పాడు. కాని 62 ఏండ్ల వానివలె ఉత్సాహంతో కనపడే వాడు. ఆయన భార్య మద్రాసు ట్రిప్లికేన్ లోని ఘోషా ఆస్పత్రికి శ్రీమతి డాక్టర్ లాజరస్ తర్వాత సూపరింటెండెంట్ గా కొన్ని సంవత్సరాలు సమర్థతతో కార్యభారం నిర్వహించిన డాక్టర్ మదురమ్ గారు. నేను ఇంగ్లండు నుండి వచ్చిన క్రొత్తలో ఒక బంధువురాలు వైద్యసందర్భంగా చీకటిపడిన తర్వాత ఆమెను చూడవలసి వచ్చింది. ఆస్పత్రిలో లేనందున ఆమె నివసించే గృహానికి వెళ్లాను. ఆమె చక్కగా అలంకరించుకొని ఎక్కడకో వెళ్లటానికి సిద్ధమైనట్లున్నది. నన్ను చూచి చిరాకుపడి, "రాత్రి పూట మీ రిక్కడకు రావచ్చునా? నా విశ్రాంతికి భంగం కలిగించవచ్చునా?" అని కోప్పడింది. నే నేదో క్షమాపణ చెప్పి, వచ్చివేశాను. ఆమె అప్పుడు మంచి వయస్సులో ఎత్తుగా, లావుగా, ఎర్రగా, అందంగా వుండినది. సామాన్యంగా యువతి వయస్సు అనుకునే వయస్సు దాటినదైనా ఏ పురుషుడైనా ఆశించ దగిన యౌవనదశలోనే వున్నది. అప్పటి కామె కన్యయే. నేను 1973 మే లో కలసికొన్నప్పుడు, దేవదాసన్ గారిని తన ఉద్యోగ విరమణానంతరం వివాహం చేసుకొన్నట్లు చెప్పినది. ఆమె ఫలానా అని తెలియకపోతే, గుర్తుపట్టటాని కవకాశమే వుండేది కాదు. ఆమెకు చాలా ముసలి రూపు వచ్చింది. ఇప్పటికిని స్థూల శరీరయేగాని, ఆ నిటారుతనం పోయింది. తల నెరిసింది. ముఖం ముడతలు పడింది. ఆమె ముందు భర్త దేవదాసన్ గారు చిన్నవాడుగా కనపడతాడు. దేవదాసన్ గారి వయస్సు 72. ఆయన కంటె ఆమె 1, 2 ఏండ్లు పెద్దదేమో అనుకొనవలసివచ్చింది. కాని, మాటల గడుసుతనం, కొంత దురుసుతనం మిగిలియే వున్నవి.

నా గది, భోజనశాల నానుకొని యున్నదని పైన చెప్పానుకదా. ఒక ఉదయం, నా గదినుండి భోజనంబల్ల దగ్గరకు వచ్చినప్పుడు గది తలుపును పూర్తిగా మూయకుండా వచ్చి కూర్చున్నాను. అంతలో వచ్చిన డాక్టర్ మదురమ్ ఘూడవ వరుసలో నుండిన

తన బల్లనుండి నావంక చూచి "తలుపు వేయండి, చలిగాలి వస్తున్నది" అన్నది. నాగది విశేష మేమి టంటే, నా పడకగదికి వెలుపలప్రక్క ఒక పెద్ద కిటికీ వున్నది. ఆ కిటికీ నుండి బైటికి వెళ్లే రోడ్డు, ఆ పరిసరప్రాంతాలు కనపడుతవి. ఏ అడ్డంకు లేని ఆ బట్ట బయలునుండి చల్లగాలి రావటానికి అవకాశ ముండినది. కాని, మూడో వరుస బల్లవరకు గాలి తగులుతుందా అని అనుమానం. అయినా చివాట్లుపెట్టిన ట్లుండిన డాక్టర్ మదురమ్‌గారి మాటను విని చప్పున లేచి, తలుపు మూసి వచ్చాను. ఇం కొకసారి దీపం తీసివేయకుండా బైటికి వచ్చాను. తలుపు మూసివున్నా, తలుపు సందులనుండి దాని కాంతి ఆమెకు కనపడిందికాబోలు, "మిస్టర్ చౌదరి! దీపం తీసివేయం" డని చెప్పింది. మామూలుగా దీపం తీసివేస్తానుగాని, ఆ రాత్రి మరచిపోయి వుండవచ్చును. అప్పుడు కూడా భోజనం టేబుల్ నుండి చప్పున లేచి దీపం తీసివేశాను. అయితే క్రమేపి కొంత సుహృద్భావంతో, కొంత స్నేహపూర్వకంగా మాట్లాడేది. ఆమె మామూలు వైద్య డిగ్రీలనేగాక, ఇంగ్లండు వెళ్లి యఫ్. ఆర్. సి. యస్. డిగ్రీని పొందినది. మరియును 5, 6 సార్లు ఇంగ్లండుకు వెళ్లి కొన్ని వారాలు గడిపి వచ్చిందట. యూరప్‌లో జరిగిన మెడికల్ కాన్ఫరెన్సులకు ప్రభుత్వ ప్రతినిధిగా హాజరయ్యేదట. ఆమె వయస్సునేగాక, వైద్య సామర్థ్యాన్ని, వైద్య విజ్ఞానాన్ని గౌరవించి ఆమెను కలసి కొన్నప్పుడు నమస్కరిస్తూ మర్యాద చూపేవాడిని. శ్రీ దేవదాసన్ మిక్కిలి మాటకారి. స్నేహభావంతో మెలగేవాడు. మంచితనం కూడా వున్నవాడు. చప్పున పలకరించి కలసిగట్టుగా వుండే స్వభావం కలవాడు. తన ఆరోగ్యం కాపాడుకోవాలని ఉదయం, సాయంత్రం రెండు పూటలు షికారుకు వెళ్తుండేవాడు. డాక్టర్ మదురమ్ ఆయన రెండవ భార్య అనుకుంటాను. మొదటి భార్యకు కొంత సంతాన మున్న ట్లున్నది. కాని, డాక్టర్ మదురమ్ వలన ఆయనకు సంతానప్రాప్తి కలగలేదు. వా రంతకు ముందు ఒక నెలరోజుల నుండి ఆ వసతిగృహంలో నుండినారు. మొత్తం 2 మాసా లున్నట్లు చెప్పారు. నాకంటె కొన్నిరోజులు ముందు

గానే మద్రాస్ వెళ్లిపోయారు. నేను మద్రాస్ తిరిగి వెళ్లినప్పుడు వారిని వచ్చి చూడవలసిందని మర్యాదగా వీడ్కోలు చెప్పారు.

శ్రీ, శ్రీమతి బాసు అనే వారు నేను వెళ్లిన 2, 3 రోజులకు ఆ వసతిగృహానికి వచ్చారు. కుమార్ యస్. బాసుగారు బెంగాలీ. ఆయ నప్పుడు దక్షిణ భారత ప్రాంతానికి, స్టూవర్ట్స్ లాయ్డ్స్ ఆఫ్ ఇండియా లిమిటెడ్ కంపెనీ మానేజరుగా వుండు చుండినారట. వారి భార్య ఇంగ్లీషు వనిత. శ్రీ బాసు ఇంగ్లండులో చదువుకొనుచుండినపుడు ఆమెను కలసికొన్నారట. వారికి రాజా అను పేరుగల 9, 10 ఏండ్ల కుమారుడున్నాడు. వారు ముగ్గురు కలసి ఒక పెద్ద గదిలో వుండేవారు. శ్రీ బాసు మధ్య రకం లావుతో, పొడుగుగా 6 అడుగులకు మించి వుండేవారు. శ్రీమతి బాసును మొదట చూచినప్పుడు పూర్తి శ్వేతజాతి స్త్రీ కాదేమో అనుకున్నాను. కారణం, ఆమె శరీరవర్ణం అంత తెల్లగా వుండకపోవటమే. కళ్లు గోధుమ వర్ణం కలవి. అయితే శ్వేతజాతి స్త్రీలలో కూడా బ్రూనెట్స్ అనే రంగుతక్కువ రంగుగల స్త్రీలు కూడా వుంటారు. ఈమె బ్రూనెట్స్‌లో ఇంకా తక్కువ రంగుగల బ్రూనెట్. ఆమె ఇంగ్లీషు వనితయని దంపతులిద్దరేగాక, అక్కడున్న యితరులు కూడా చెప్పారు. ఆమెను ఇంగ్లండులో కలసికొని వివాహమాడింది ఖాయం. వారి కుమారుడు రాజా మరీ తక్కువ శరీరవర్ణం కలవాడు. సామాన్యంగా ఆంగ్లో—ఇండియన్ పిల్లవా డనుకుంటాము.

నిజానికి ఆ అబ్బాయి ఆంగ్లో-ఇండియన్ కదా! అయితే, ఆంగ్లో-ఇండియన్స్‌లో అచ్చమైన తెల్లవారిలాగా వుండే వా రున్నారు. శ్రీ బాసు లేత పసుపురంగు శరీరచ్ఛాయ కలవాడేగాని పెద్ద ఎరుపు వర్ణం కలవాడని చెప్పటానికి వీలులేదు. తల్లిదండ్రులిద్దరూ రంగు తక్కువ వా రగుటచేత పిల్లవాడుకూడా మంచి ఎరుపు రంగుగల ఇండియన్ పిల్లవాడులాగా వుంటాడు. ఈ అబ్బాయి బొద్దుగా, గుండ్రని ముఖంతో బాగానే వుంటాడు. బుద్ధిమంతుడే కావచ్చును. అయితే, తల్లిదండ్రుల మితిమీరిన గారాబంచేత కాబోలు, ఈ చిన్నతనంలోనే తన కిష్టం వచ్చినట్లు

నడుచుకోవటం, తల్లిదండ్రులకు చీటికి, మాటికి ఎదురు చెప్పటం, పోట్లాడటానికి సిద్ధపడటం, బిగ్గరగా, సవాలుగా జవాబు చెప్పటం నేర్చుకొన్నాడు. తల్లిదండ్రులయందు కించిత్తైనా భయభక్తులు లేకుండా పోయినవి. పెరిగిన తర్వాత వారి యందు ఆప్యాయత కూడా కలిగియుండ డేమో అనిపించింది. ఒక నా డెందుకో తండ్రి గట్టిగా మందలించాడట. వెంటనే అక్కడి ప్రాంగణం దాటి, అడ్డత్రోవన చెట్ల మధ్యగుండా ఎక్కడికో వెళ్లిపోయాడు. తల్లి దండ్రులు చెరొక ప్రక్క, హోటలు నౌకర్లు యింకొక ప్రక్క వెదకగా 1, 2 గంటలు గడచిన తర్వాత, హోటలు సర్వరు దిగువ కూనూరులో బస్ స్టాండు దగ్గర రాజాను చూచాడు. ఇంతలో అక్కడకు చేరిన తండ్రి బ్రతిమాలి, బామాలి వెంట బెట్టుకుని తీసుకువచ్చాడు. తల్లి అంత శ్రమగాని, శ్రద్ధగాని తీసుకొన్నట్లు నాకు తోచ లేదుగాని, తండ్రి మాత్రం అతనిని ఏవిధంగా అనునయించాలా, సంతోషపెట్టాలా అనే నిరంత రాలోచనతో శతవిధాలా ప్రయత్నించేవాడు. చీటికి, మాటికి "ఇది నీ కిష్టమేనా, ఇది నీకు సంతోషాన్ని కలిగిస్తున్నదా, తృప్తిని కలిగిస్తున్నదా?" అని అడుగుతూండేవాడు. నాకు మిక్కిలి చిరాకు వేస్తూండేది. ఒకనాడు మధ్యాహ్న భోజన సమయంలో ఈపద్ధతిని చూచి మనసు పట్టలేక, "మీరు రాజాను సంతోష పెట్టాలని ప్రయత్నిస్తున్నారా?" అన్నాను. శ్రీ బాసు, "నేను వానిని సంతోషపెట్టటంకాదు, వాడు నన్ను సంతోషపెట్టాలి" అని బెట్టు సరిగా అన్నాడు. బిడ్డలను ప్రేమతో చూడవలసిందే. వాళ్ల సంతోషానికీ, సంతృప్తికి, సుఖజీవనానికి తోడ్పడవలసిందేకాని వాళ్లింకను మంచి చెడులను తెలుసుకోవలేని దశలో వున్నప్పుడు వాళ్ల మకురుతనాన్ని, మంకుతనాన్ని, చిలిపిచేష్టలను ప్రోత్స హించునట్లుగా అలుసు ఇవ్వకూడదు. క్రమశిక్షణ తల్లి దండ్రుల, బిడ్డలమధ్యకూడ అవసరం. వారి కొడుకు రాజా 9, 10 ఏళ్ల వయస్సుగల చాలా పిన్నవాడు. మన హిందూ శాస్త్రాలలో 16 ఏళ్లు నిండిన కొడుకును తండ్రి తన తమ్మునివలె చూడా లన్నారు. అయితే, ఆకాలంలోకూడా అన్నయందు తమ్ముడు అవిధేయత చూపేవాడుకాదు. ఉదాహరణకు రామ లక్ష్మణులు.

రాజా బాసు మిక్కిలి తెలివితేటలు గలవాడు. తన వయస్సుకు మించిన బహుముఖ విజ్ఞానాన్ని పొందాడు. ఇంగ్లీషు పత్రికలను ధారాళంగా చదవటం ఆ తల్లి దండ్రులు కనిన బిడ్డకు అసాధారణం కాకపోవచ్చునుగాని, కఠిన శైలిలో వ్రాయబడిన ఉద్గ్రంధాలను, సాంకేతిక సంబంధమైన గ్రంథాలను కూడా చదివేవాడు. లోకవిజ్ఞానం (జనరల్ నాలెడ్జి) మిక్కిలి ఎక్కువగా కలిగియున్నాడు. ఆ బాలుడు తల్లిదండ్రులతో ఎట్లు వర్తించినా, ఇతరులయెడ మర్యాదగానే నడచుకొనేవాడు. నావంటి వానితో మెల్లగా, సుముఖంగా మాట్లాడేవాడు. అక్క డున్న చిన్న పిల్లలతో ఆడుకొనేటప్పుడు కలసికట్టుగా వుండేవాడు. ఒకనాడు "ఎక్కడ చదువుకొనుచున్నా?"వని నే నడిగాను. "డాన్ బాస్కో కాన్వెంటు స్కూలులో చదువుచున్నా"ననగా, "నా కుమార్తె కొడుకు లిద్దరూ సతీష్, హరీష్ అనేవారు అక్కడ చదువు చున్నారు, నీవు వాళ్లను ఎరుగుదువా?" అని అడుగగా, "నేను బాగా ఎరుగుదును. హరీష్ (ప్రసాద్) నాక్లాస్ మేటే"నన్నాడు. మద్రాస్ తిరిగి వెళ్లినతర్వాత నా మనుమ లిద్దరితో, "మీ తాతగారిని కూనూరులో కలసికొన్నాము. వారు, మేము ఒక చోటనే బస" అని చెప్పినాడట.

శ్రీకుమార్ బాసు మాటకారి. సంభాషణా చతురుడు. అక్క డున్న అందరితోనూ, భాయి భాయి అన్నట్లు స్నేహంగా వుండేవాడు. నాతో స్నేహమేగాక, కొంత చనువుతోకూడా వుండేవాడు. దాని కొక కారణం కూడా లేకపోలేదు. నే నంతకు ముందే ప్రచురింపించిన నా ఇంగ్లండు విద్యాభ్యాసానుభవాలను, అభిప్రాయాలను తెల్పే "రిఫ్లెక్షన్స్ ఆన్ ది వెస్ట్" అనే చిన్న ఇంగ్లీషు గ్రంథం ప్రతి నొకదానిని వారి కిచ్చాను. అది చదివి, 'బాగున్న'దని సంతోషాన్ని వ్యక్తపరచాడు. మేము కలసి మెలసి తిరుగకపోయినా, ఆ వసతి గృహంలోని డ్రాయింగ్-కమ్-డిన్నర్ హాలులో కలసికొన్నప్పుడు ప్రక్కప్రక్కన కూర్చుని మాట్లాడుకోవటం, కొంత ఎక్కువ పరిచయాన్నే కలిగించింది. వారు నా కంటె 5, 6 రోజులు ముందుగా వెళ్లిపోయారు. వారు

వెళ్లే ముందు, వారి కిచ్చిన పుస్తకంలో "43 ఏండ్ల వయస్సుగల ఉల్లాసవంతుడైన (లైవ్‌లీ) యువకునకు సమ్మానంతో (కాంప్లిమెంటరి) యిస్తున్నా"నని వ్రాశాను. '43 ఏండ్లుగల ఉల్లాసపూరితమైన యువకు'డని ఆయనను అభివర్ణించినందుకు ఆయన, వారి సతీమణి మిక్కిలి సంతోషించారు.

శ్రీమతి బాసు చాల యోగ్యురాలు. నెమ్మది, శాంత స్వభావం కలది. తొట్రుపాటు, తొందరపాటు లేనిది. మాట, మంచి గలది. మర్యాదస్థురాలు. అందరితోనూ చనువుగా, యిష్టంగా మాట్లాడేది. ఆ దంపతులు వెళ్లునప్పుడు నాకు వారి మద్రాసు చిరునామా యిచ్చి, "మీరు మద్రాసు చేరుకొనిన వెంటనే మాకు ఫోన్ చెయ్యండి, మా యింటికి వచ్చి వెళ్లండి. సమయానికి మీకు కారు దొరకకపోతే, మాకు డ్రైవరున్నాడు, మా కారు పంపిస్తాం" అన్నారు. నేను మద్రాసుకు జూన్ 6-వ తారీఖున తిరిగి వెళ్లిన 2, 3 రోజులకు వారికి ఫోనుచేయగా, శ్రీమతి బాసు సోదరి ఇంగ్లండు నుండి వస్తూ, తాను ప్రయాణించిన ఏరోప్లేన్‌లోనో, దిగిన చోటనో తన సామాను కొంత పోగొట్టుకుందని, దాని కొరకు ప్రయత్నిస్తున్నానని, తను తిరిగి ఫోన్ చేస్తానని శ్రీ బాసు చెప్పాడు. వారు రెండోనాడో, మూడోనాడో ఫోన్ చేయగా, నా కప్పటికి జ్వరంతగిలి, సుస్తీగా వుండినాను. విషయం తెలిపి, తర్వాత కలసికొంటానని చెప్పానుగాని ఆ దఫా వెళ్లలేకపోయాను. ఇంకొకసారి వెళ్లినప్పుడు వారిని వెళ్లి చూడాలి.

నేను వెళ్లేటప్పటికి పై జెప్పిన దేవదాసన్ దంపతులేగాక, డాక్టర్ శ్రీమతి ఫ్లారెన్స్ మదురనాయగమ్ వుండినారు. ఆమె మద్రాసులో గవర్నమెంటు డాక్టరుగా వుంటుండి రిటైరైనారట. మాంబళం అనే త్యాగరాయనగర్‌లో వుండేవారట. మద్రాసు మైలాపూరు సమీపం విజయరాఘవాచారి రోడ్డులో వుండుచుండిన శ్రీ వెనిగళ్ల పిచ్చయ్యచౌదరిగారి కుటుంబం తనకు బాగా తెలుసునని, వారి కుమార్తె లిద్దరకు కాన్పులు చేయించానని ఆమె చెప్పారు. మరుసటిరోజు సాయంత్రం నేను బయటకు

పి. కారుకు వెళ్లి తిరిగివచ్చి ముందు వరండాలో వారి గది సమీపాన ఒక ఫేమ్ కుర్చీ కనపడగా దానిలో విశ్రాంతికొరకు కూర్చుని యుండినాను. ఇంతలో తన కారులో బైటనుండి వచ్చి, తన గది లోకి వెళ్లుచూ నన్ను చూచి గది నుండి ఇంకొక కుర్చీ తెచ్చుకొని, అందులో కూర్చుని స్నేహపూర్వకంగా మాట్లాడింది. ఆమె మంచి డాక్టరే గాక, మంచిగా స్నేహం చేసే స్వభావంకలదిగా వెంటనే తోస్తుంది. 55 ఏళ్లు మించిన వయస్సుకలదైనా 40, 45 ఏళ్ల మధ్యవయస్కురాలిగానే కనపడింది. మిక్కిలి నలుపైనా, అవయవ పొందికలు కలిగి సరియైన పొడుగు, లావులతో కొంత కుదుమట్టంగా, వయ్యారంగా వుంటుంది. ముఖకవళికలు మంచివే. మందహాసంతో మాట్లాడుతుంది. ఆమె వెంట ఆమె కూతురు బిడ్డలు అనిత, రమణి అనే 8, 10 సంవత్సరాల మధ్య వయస్సుగల పిల్ల లిద్దరు వచ్చారు. డాక్టరు, పిల్లలు మళయాళి క్రిస్టియన్స్. ఆ పిల్లలు తమ స్నేహితురాలు రాణి అనే 11, 12 సంవత్సరాల వయస్సుగల మొదలియార్ పిల్లను తీసుకొని వచ్చారు. ముగ్గురు పిల్లలు ఎరుపు రంగుతో అందమైనవాళ్లే. ఈ ముగ్గురిలో రమణి ఎక్కువ అందంగా వుంటుంది. అనిత ఎక్కువ చురుకైనది, మాటకారి. రాణి ముక్తసరిగా మాట్లాడే పిల్ల. అనిత, రమణి ఆ వయస్సుకు తగిన లావు, పొడుగుతో సరిపడ్డట్లుగా వుంటారు. రాణి పొడుగుగా, కొంత పీలగా వుంటుంది. అప్పుడప్పుడు అనితను, రమణిని పలుకరించేవాడను గాని, రాణి కొంత ముభావంగానే వుండేది. ఆ పిల్లలు వరండా ముందు ఆవరణలో ఆడుకునేవారు. నేను ముచ్చటపడేవాడను. ఆ పిల్లలు ముగ్గురూ ఇంగ్లీషు బాగా మాట్లాడేవారు. అనిత కొంచెం చమత్కారంగా జవాబిచ్చేది. వాళ్ల ముత్తవతల్లి మిక్కిలి నలుపైనా, ఆమె యిద్దరు మనుమరాండ్రు మంచి ఎరుపు రంగు కలవారే. ఆ పిల్లల తండ్రి కూడా డాక్టరే నట. బహుశః ఆయన మంచి శరీరవర్ణం కలవాడేమో.

డాక్టర్ మదురనాయగమ్‌కు చీట్లపేకాట అంటే మిక్కిలి ఇష్టం. సన్‌డే చర్చి స్కూలుకు అనతిదూరంలో వై. యం.

ఓ. ఎ. క్లబ్బున్నది. తన కారులో నిత్యం ఏ 5, 5½ కో బయలు దేరి వెళ్లి పేకా టాడి, రాత్రి భోజనం 8 గంటల లోపుగా తిరిగి వచ్చేది. మేము మాట్లాడుకొనుచుండగా శ్రీ దేవదాసన్ వచ్చి, "నేను క్లబ్బుమీదుగానే వచ్చాను, మీకోరకు పేకా టాడేవారు కాచుకొని వున్నా" రనగా వెంటనే లేచి, కా రెక్కి వెళ్లింది. ఒక నాడామెతో "మీరు క్రిస్టియన్లుకదా, మీ మనుమరాండ్రకు హిందూ పేర్లు పెట్టా రే ?" మని అడిగాను. "మా కా పట్టింపు లేదు. యిప్పటి తరం వాళ్లకు మన ఇండియన్ పేర్లే పెడతాం" అన్నది. నేను వెళ్లిన వారం రోజులకు అందరి నుండి స్నేహ పూర్వకంగా వీడ్కోలు పుచ్చుకుని తన కారులో వెళ్లిపోయింది.

శ్రీ ఆల్ఫ్రెడ్ లాజరస్ నేను అక్కడకు 7-వ తారీఖున చేరుకొనినప్పటినుండి యున్నారటగాని, ఆయన మేడపైన గదిలో వుండటం, ఆయన భోజనం బల్ల ఒకమూల వుండటంవల్ల 9-వ తారీఖు ఉదయం వరకు ఆయనతో పరిచయం కలగలేదు. ఆయన కప్పుడు 3 నెలలు తక్కువగా నా వయస్సు (75 సంవత్సరాలు). ఇతరులు నా కంత వయ స్సుండ దని అనుకొన్నారట. శ్రీ లాజరస్ విషయంలో కూడ నే నట్లే అనుకొన్నాను. తాను పంజాబీ జాతీయుడ నని, ఇప్పుడు పశ్చిమ పాకిస్థాన్‌లో కలసిపోయిన ముల్తాన్ పట్టణ వాసి నని చెప్పాడు. బెంగాలీ వనితను వివాహ మాడాడట. ఆయన భార్య తన 70-వ ఏట నా భార్యవలెనే, నిదురలో చనిపోయిందిట. ఆయన మొదట కొంతకాలం మిలిటరీలో పనిచేసి, తర్వాత జిల్లా సీనియర్ జడ్జిగా రిటైరైనారట. ముల్తాన్‌లో వుంటే హైకోర్టు పదవి నిస్తా నన్నారటగాని, పాకిస్థానీ ప్రజలకు, ఆ ప్రభుత్వ విధానాలకు భయపడి అక్కడినుండి వచ్చి వేశాడట. ఒక సాయంత్రం ఆయన గదికి వెళ్లగా, ఆయన భార్య ఫోటో చూపించాడు. ఆమె మిక్కిలి చక్కని దని తోచింది. తన నెంతో ప్రేమతో చూచేదని, సహాయ సంపత్తులను పూర్తిగా అందించేదని, తనకు చేదోడువాదోడుగా వుండి, తన బట్టలవంటి

విషయాలలోకూడ శ్రద్ధవహించేదని, తన కనారోగ్యం కలిగి నప్పు డుపచారాలు చేస్తూ అనునయించేదని, ఆమె చనిపోవటం తన కుడిచేయి తెగగొట్టినట్లైనదని, ఎప్పుడూ తన స్మృతిపథంలో వుంటున్నదని మిక్కిలి విచారంతో చెప్పాడు. అంత అదృష్టం నాకు లేకపోయినందుకు, నా మనస్సులో కొంత కలుక్కుమన్నది.

శ్రీ లాజరస్, నేను కూనూరులో కొన్ని ప్రాంతాలకు, ముఖ్యముగా సిమ్స్‌పార్కు, దిగువ కూనూరుకు, అక్కడి మార్కెట్టు వగైరాలకు వెళ్లాం. సిమ్స్‌పార్కులో జరిగిన పళ్ల, కూరగాయల ప్రదర్శనానికి కూడా కలసి వెళ్లినట్లు చెప్పాను. ఆయనకు నా "రిఫ్లెక్షన్స్ ఆన్ ది వెస్ట్" పుస్తకం ప్రతి నిచ్చాను. దానిని పూర్తిగా చదివి, మెచ్చుకుంటూ, "బ్రిటిష్ ప్రభుత్వకాలంలో నైతే మీకే రావుసాహెబ్ బిరుదో వచ్చే" దని నవ్వుతూ అన్నాడు. ఆయన కొక కూతురు, ముగ్గురు కొడుకు లట. వారిలో యిద్దరు మిలిటరీ సర్వీసులో లెఫ్టినెంట్ కల్నల్స్‌గా వున్నారు. వారిలో ఒకరు బెంగుళూరులో వున్నారట. మూడో అతను అందరికంటె చిన్నవాడు, బొంబాయిలో ఒక పెద్ద వ్యాపార కంపెనీలో ఉద్యోగిగా వున్నాడట. నేను అక్కడి నుండి బయలు దేరుటకు ముందొక రోజు దయం బస్సులోఎక్కి ఊటీకి వెళ్లాడు. అక్కడినుండి బస్సులో మైసూరుకు, మైసూరు నుండి బస్సులో బెంగుళూరుకు వెళ్లిపోయాడు. ఆయన బెంగుళూరులోనే వుండి పోతా నన్నాడు. ఇంకొకదఫా నేను బెంగుళూరుకు వెళ్లినప్పు డాయనను కలసికోవాలని వున్నది.

నేను వెళ్లిన కొన్నిరోజులకు మిస్ ఫిలిప్ అనే మళయాళి స్త్రీ మా బసకు వచ్చింది. ఆమె కోయంబత్తూరులో ఒక స్కూలులో పిల్లలకు చదువుచెప్పుచు, అక్కడి వై. డబ్ల్యు సి. ఎ. లో వుండుచున్నదట. "కోయంబత్తూరులో ఎండలు జాస్తిగా వున్నవని, పైగా నీటి ఎద్దడి హెచ్చని, ఆ బాధలనుండి తప్పించు కొని విశ్రాంతి కొరకు ఈ చల్లని ప్రదేశానికి వచ్చా"నని

చెప్పింది. ఆమె చామనచాయ రంగుతో, బక్క పలుచగా, పొడుగుగా వుంటుంది. అందమైన దని చెప్పటకు వీలులేదుగాని, కొంత ఆకర్షణగల స్త్రీయే. ఆమె తన వయస్సు 45 సంవత్సరాలని చెప్పినట్లు గుర్తు. అది నిజమైన వయస్సేనని నాకుతోచింది. వివాహ మాడటానికి, పిల్లలను కనడానికి ఆమె కింకను వయస్సున్నది. కాని ఆమె కా అభిప్రాయం లేకపోవచ్చు. ఆమెకు తన కేరళ గ్రామములో కొలది ఎకరాల కొబ్బరి తోట లున్నట్లు, వానినుండి ఆదాయం వస్తున్నట్లు, అజమాయిషీ చేసే వారెవ్వరూ లేకపోవటం వల్ల కౌలుదార్లు మోసం చేస్తున్నారని చెప్పింది. ఆమెతో కలసి బయటకు వెళ్లలేదుగాని, ఇంటిలో మాట్లాడుకొనుచుండేవారం. ఈ పుస్తకం మొదటి భాగం ముద్రణ అప్పటికి పూర్తికాలేదు. దానిలో వేయవలసిన ఫొటోల కాపీలు నా సమ్మతి కొరకు పంపబడినవి. వానిని ఆమెకు చూపించాను. చూచి, సంతోషించింది. నా దగ్గరున్న "రిఫ్లెక్షన్స్ ఆన్ ది వెస్ట్" మూడవ కాపీలో ఆమె పేరు వ్రాసి నా అభినందనలతో ఆమె కిచ్చాను. ఆమె మిక్కిలి సంతోషించింది. ఒకప్పుడు డాక్టర్ మదురమ్ ప్రస్తావన వచ్చినప్పుడు, ఆమె రిటైరైనతర్వాత వివాహ మాడిం దని చెప్పుచు, "నావంటి వయస్సు వచ్చినవారికికూడా ఆ అవకాశం వున్న"దని నవ్వింది. దానినిబట్టి ఆమెకు పురుషవాంఛ లేకపోలేదేమో అనుకొన్నాను. అయితే, 75 ఏళ్లువచ్చిన నావంటి వృద్ధునిముందర ఏ సరస సల్లాప వాక్యాలైనా నిర్భయంగా పల్కవచ్చునుగదా! ఆమె మావలె డబ్బిచ్చే అతిథియైనా, ఆమె స్వభావాన్నిబట్టి కాఫీలు, మరిన్ని, తాను కోయంబత్తూరులో స్థిరనివాస మున్నట్లు నివసిస్తుండిన వై. డబ్ల్యు. సి. ఎ. ప్రభావంవల్లకాఫీలు, భోజనాలు అతిథులకు అమర్పించటంలో తోడుగా అన్నట్లు, కొంత శ్రద్ధ చూపేది. ఆమె అక్కడి నుండి కోయంబత్తూరుకు తిరిగి వెళ్లేటప్పుడు స్నేహపూర్వకంగా వీడ్కోలిచ్చాను.

పైన మాదప్ప అనే కూర్గ యువకుని ప్రస్తావన వచ్చింది. అతడు అక్కడి ఒక పెద్ద టీ కంపెనీలో పనిచేస్తున్నాడని, మే మున్న వసతిభవనం వై. డబ్ల్యు. సి. ఎ. లో స్థిరనివాస

ఏర్పరచుకొని యున్నాడని పైన చెప్పాను. ఆ 22, 23 ఏళ్ల వయస్సుగల యువకుడు సరిపడిన లావుతో ఎత్తుగా, ఎరుపు రంగుతో అందంగా వుంటాడు. మిక్కిలి చురుకైనవాడు. మితభాషి. ఒకవిధంగా ముభావ స్వభావం కలవాడు. తన మోటారు సైకిల్ మీద వెళ్లుచు, వస్తూండేవాడు. మధ్యాహ్న, రాత్రి భోజనాలకు చాలాసార్లు సకాలంలో వచ్చేవాడుకాదు. అతడు మిక్కిలి ఆలస్యంగా వస్తే, అతని కొరకు భోజనపదార్థాలు అట్టిపెట్టేవారు. నాకు 'హిందూ' పత్రిక కావాలని శ్రీమతి ఆండర్సన్‌కు చెప్పియున్నాను. ఈ యువకుని కామె చెప్పింది. అతడు మధ్యాహ్న భోజనానికి ఊను నుండి వచ్చేటప్పుడు బెడ్ ఫర్డ్ స్క్వేర్‌లోని దుకాణం నుండి దానిని నిత్యం తెచ్చేవాడు. ఆ విధంగాకూడా అతనితో కొంత పరిచయం కలిగింది. కాని, అతడు నాకే కాదు, ఇతరులతో కూడ స్నేహం చూపే పద్ధతి కలవాడు కాదని తోచింది. తన పనేమో తన సర్దాలేమో, అంతే. అయితే మిస్ ఫిలిప్‌తో కొంత స్నేహంగా, చనువుతో మాట్లాడేవాడు. బహుశః స్త్రీలంటే ఎక్కువ యిష్టమేమో, లేక మర్యాద సూచకమేమో, ఒక సాయంత్రం నేను షికారుకు వెళ్లి తిరిగి వచ్చుచుండగా బెడ్ ఫర్డ్ స్క్వేరువద్ద ఒక షాపు ముందు ఒక 18, 20 ఏళ్ల వయస్సుగల పిల్లతో మాట్లాడుచుండినాడు. నేను రోడ్డుమీద వాళ్లిద్దరకు మిక్కిలి దగ్గరగా వెళ్లుచున్నా, నావంక చూడలేదు, పలుకరించలేదు. ఆ యువక యువతి హృదయోల్లాసాన్ని గమనించనట్లు సాగిపోయాను. ఈవిషయం మిస్ ఫిలిప్‌కు చెప్పి, "ఊదప్ప చాలా అందమైనవాడు, ఆ పిల్ల చూస్తే మిక్కిలి నల్లగా, పొట్టిగా కనిపించింది. పైగా క్రిస్టియన్ పిల్ల అనుకుంటాను. వారిద్దరికీ సరస మెట్లా కలిగిం"దన్నాను. "అ దేమీలేదు, అతని కంపెనీ మానేజరు కూతురామె" అన్నది. మానేజరును కాకా పట్టటానికి ఈపిల్లతో స్నేహ మారంభించా డన్నమాట. ఇట్టి పోకడలను మనం చూస్తూనే వుంటాము. త్రివేణి ప్రెస్ వారు ఈ పుస్తకం మొదటి భాగానికి వేయవలసిన కవరు కాగితాన్ని నా ఆమోదం కొరకు పంపించారు. నా వద్ద ఆ ప్రెస్ వారదివరలో ముద్రించిన నా మూడో తెలుగు పుస్తకం "అభిప్రాయాలు—

అనుభవాలు " కాపీ వున్నది. ఈ రెంటిని శ్రీ మాదప్పకు చూపి, "ఈ రెండు అట్టలలో ఏది బాగుంది?"దని అడుగగా, వెంటనే "గులాబిరంగు (పింక్) గల ఈపుస్తకం మొదటి భాగం అట్ట నమూనా బాగుం"దన్నాడు. నిజానికి ఈ అట్టకాగితమే ఎక్కువ బాగుం దని పుస్తకం తయారైన తర్వాత తోచింది. మాదప్ప చురుకైనవాడు, తెలివైనవాడేగాక, కొంత కళాభిజ్ఞత కలవాడని నే ననుకొన్నాను. "వయస్సువచ్చినవాడవు, అందమైనవాడవు, పెళ్లి చేసుకోరాదా?" అనగా, నవ్వి "ఇప్పుడేమి తొందర?" అన్నాడు. శ్రీ కె. జి. బలియప్పగారి విషయం అడుగగా ఆయన చనిపోయాడని, ఆయన ఇద్దరు, ముగ్గురు కుమార్తెలలో ఒకామె కొంతకాలం లండన్‌లోని మన హై కమీషనర్ కార్యాలయంలో పనిచేసిం దని, ఇప్పుడు ఢిల్లీలో కాబోలు వుందని చెప్పాడు.

నేను కొంతవరకు చెప్పకలిగింది పైవారిని గురించే. అయితే, ఇంకిద్దరు, ముగ్గురుతో పరిచయం కలగకపోలేదు. ఒక ముస్లిం దంపతులు, ఒక బెంగాలీ దంపతులు, ఒక సిరియన్ క్రిస్టియన్ దంపతులు వచ్చి కొన్నిరోజులుండి వెళ్లిపోయారు. వీరు నూత్న వివాహితులు. మొదటి రెండు జతలు అందమైన యువతీ యువకులు. అంతకుముందే వివాహమాడి హనీమూన్‌కు వచ్చినట్లున్నారు. మూడవవారు కొంత వయస్సువచ్చినవారు. ఈ మూడు జంటలు గాక, ఇంకొక జత భార్యాభర్తలు పిన్న వయస్సువారు వచ్చి వెళ్లారు. వారే పైజెప్పిన 3-వ జంట అని భ్రమపడుచున్నానేమో చెప్పలేను. అయితే ఒకటి నిశ్చయం. ఈ జంటలలో బెంగాలీ అమ్మాయి చాలా అందమైనది. పోతే, చివర చెప్పిన అమ్మాయి నేత్రాలు చాలా పెద్దవిగాను, ఆకర్షణీయంగాను కనపడినవి. వీరుగాక సైలాస్ అనే పేరుగల దంపతులు వచ్చి 2, 3 రోజులు మాత్రమే వుండి వెళ్లిపోయారు. భర్త సైలాస్, అసలు మంగళూరువారట. కలకత్తాలో సర్జికల్ ఇన్‌స్ట్రుమెంట్సులో (శస్త్రచికిత్స కుపయోగించేవి) వ్యాపారం చేస్తూ, కలకత్తాలో స్థిరపడిపోయారట. ఇంకొకరు, ఎక్కువ పరిచయమైనవారు మద్రాసు నుంగంబాకం హైరోడ్డు ప్రక్క-

తిరుమూర్తినగరంలో నివాసంగల నాగనాథన్ అనేవారు. ఆయనది సినిమా వ్యాపారం అట. అనగా సినిమాలో నటించటం కాదు, తీసిన సినిమా ఫిలింలను కొనటం, అమ్మటం వంటి వ్యాపారం. ఆయన అయ్యర్ బ్రాహ్మణుడు. భార్య, ముగ్గురు నల్గురు పిల్లలతో వచ్చి కొన్నిరోజు లుండినాడు. ఉదయ భోజనం మాత్రం తీసుకొని, పూర్తి శాకాహారి కాబట్టి మధ్యాహ్న, రాత్రి భోజనాలు బయట చేసేవాడు. చనువుగా, స్నేహపూర్వకంగా మాట్లాడేవాడు. తిరుమూర్తినగర్‌లో నివసించుచుండిన నా మాజీ స్టెనోగ్రాఫరు వి. కృష్ణమూర్తిని బాగా ఎరిగియున్నానని చెప్పాడు. ఆయన మిక్కిలి నలుపురంగు కలవాడుగాని, ఆయన భార్య ఎర్రగా, అందంగా వుంటుంది. పిల్లలు సుమారు. వీరు గాక మైసూరియన్ ప్రొఫెసర్ తాను వివాహ మాడిన బొంబాయి ప్రాంతం స్త్రీతో వచ్చి, కొన్ని రోజులుండి వెళ్లినాడు. ఇద్దరూ కొంత వయస్సుమళ్లినవారు. భార్యకూడా బాగా చదువుకున్న ట్లున్నది. "నేను బ్రాహ్మణుడను కాను, మామూలు మైసూరు కన్నడిగ" నని మాటల సందర్భంలో చెప్పాడు. ఈ భార్యాభర్తలే నేను రెండవసారి ఊటీకి వెళ్లినప్పుడు త్రోవలో కనపడి, చూపిస్తా మని నన్ను స్పెన్సర్ కంపెనీ షాపుకు చేర్చినవారు. వీరు గాక, యింకొక స్త్రీ జ్ఞాపకం వస్తున్నది. ఆమె బొంబాయి ప్రాంతానికి చెందింది. యమ్. ఎ. వంటి పెద్ద డిగ్రీలను పొందిందట. బొంబాయిలోనే ఏదో కాలేజిలో ప్రొఫెసర్‌గా పనిచేస్తున్నదట. ఆమె, నేను కలసికొన్నప్పుడు చాలా నిగాగా చూచేది, అలక్ష్య భావంతో అన్నట్లు, సంభాషణలలో దిగగా, తాను గొప్పదాన నన్నట్లుగా, నీవంటివాని చేతిలో పడేదానను కానన్నట్లుగా ఆమె ధోరణి వుండినది. ఆమె ముదురు వయస్సుగల స్త్రీ. నేను ముసలి వాడనుకదా! ఎందు కంత నిక్కుగా వుండేదో, తేరిపార చూచేదో, నా కర్థం కాలేదు.

నేను నీలగిరి పంక్తులలో అక్కడక్కడ మిక్కిలి మనోహరమైన ప్రకృతిరామణీయకాలను చూచాను. ముచ్చటగొల్పే

నీలవర్ణ గుబురు టాకులతో విలసిల్లు లేత యూకలిప్టస్ చెట్లను చూచాను. కోటగిరికి వెళ్లే దారి రోడ్డు ప్రక్కంచుల మీదకూడా పెరుగుచున్న టీ పొదలను చూచాను. లోయలలో పెరుగుచున్న బంగాళదుంప మొక్కలను గమనించాను. దారి పొడుగూతా అక్కడక్కడ ఏర్పడిన చిన్న చిన్న యిళ్ల గుంపులను చూచాను. ఎత్తైన కొండలను, లోతైన లోయలను చూచాను. కూనూరునుండి ఊటీకి వెళ్లుచున్న రోడ్డు నానుకుని వున్న లోయల లోనికి బస్సు పడిపోతుందేమో అని భయపడ్డాను. ఆ లోయల గంభీరతకు, వానిలోని చెట్లగుంపుల మనోహరత్వానికి ఆనందించాను. అయితే వింతలు విశేషాలకంటె, ప్రకృతిరామణీయకాలకంటె నాకు అందమైన స్త్రీ దర్శనమే హృదయాన్ని ప్పొంగిస్తుంది.

సౌందర్యవంతులు ఏ కొలదిమందో అక్క డక్కడ తగిలారుగాని, నే నాశించినంతగా కనపడలేదు. కాని, ఒకనాడు సాయంత్రం నేను కూనూరు బెడ్ ఫర్డ్ స్క్వేరులో నుండగా 5, 6 గురు పిన్న వయస్సుగల శ్వేతజాతీయులు కనపడ్డారు. వారు విదేశముల నుండి వచ్చిన వినోద యాత్రికులు. బహుశా, అమెరికావారై యుందురు. వా రందరూ పశ్యానికి వస్తున్న లేక అప్పుడే వచ్చిన ఆడపిల్లలు. వాళ్ల వేషధారణ హిప్పీల వేషధారణవలె వుండినది. జుట్టు దువ్వీ, దువ్వనట్లు వ్రేలాడుచున్నది. శరీరానికి బిగువైన బనియన్లతో, పిరుదులకు 6 అంగుళాలు మాత్రం క్రిందకు దిగిన మట్టలాగులతో అర్ధనగ్నంగా వున్నట్లున్నారు. దృఢంగా, ఆరోగ్యవంతంగా వున్న ఆ పిల్లల తొడలు బలిసినవిగా గుండ్రంగా వుండి, ఆకర్షణీయంగా యువకుల నుద్దేశపరచేటట్లుగా వుండినవి. వాళ్ల లేత యావనసౌందర్యానికి తోడు చక్కని పాలవంటి శరీర వర్ణంతోపాటు వారి అవయవ పుష్టి,జఘనసౌందర్యం,ఆ అయిదారు జతల అవయవాల సమన్వయం మిక్కిలి మనోరంజక దృశ్యాన్ని సంతరించినవి. ఎంత చక్కని పూవునైనా వంటరిగా చూచి నప్పుడు కలిగిన ఆనందం కంటె, అదే స్థితిలోని, అదే రంగుగల పూలను ఒకచోట గుంపుగా ఏర్పరచినప్పుడు సంభవించే దృశ్యం ఎక్కుడు మనోహరత్వాన్నిస్తుంది. అలాగే వయస్సు వచ్చే యీ పిల్లలలో నొ కామెను వంటరిగా చూచినా, లేక

వీరిని చిన్నపిల్లలతోగాని, పెద్దవారితోగాని, చివరకు యువతులతోగాని చూచినట్లయితే యింత ఆకర్షణ కలిగేది కాదనుకుంటాను. దోర పండిన జామపండు, పూర్తిగా పండిన జామపండు కంటె రుచి ఎక్కువంటారు. ఆవిధముగనే పక్వానికి వస్తున్న ఈ పడుచు పిల్లలను ఒకేచోట గుంపుగా చూచి, ఆనంద పరవశుడనైనాను. నా 75 ఏళ్ల వయస్సును బట్టి ఈ ఆనందం, నా సహజ సౌందర్యోపాసన ప్రవృత్తివలన మాత్రమే అనుకోవాలి.

ఈ "సంచారం" శీర్షిక క్రింద చెప్పిన విషయాలు చాలా భాగం విశ్రాంతి కొరకు జరిపిన యాత్రలే. ప్రత్యేకించి వినోద యాత్ర కని బయలుదేర లేదు. అయితే 1963 లో త్రివేంద్రం, కన్యాకుమారి, మదురై, రామేశ్వరం, ధనుష్కోటికి వెళ్లింది వినోదయాత్ర సంబంధమైనదే అనాలి. అయితే, అప్పుడు కూడా విశ్రాంతి కొరకు, ఆరోగ్యం కొరకు కుర్తాళం వెళ్లి తిరిగివస్తూ, ఆ ప్రదేశాలకు వెళ్లాను. 1972 లో బేలూరు, హాలెబిడ్, శ్రావణ బెలగోలకు వెళ్లింది. నేను బెంగుళూరులో విశ్రాంతి కొరకు వుండినది 5 వారాల పైచిల్కు కాలంలో ఒకరోజు మాత్రమే. కాని వినోదాని కని ఒకరోజు, తీర్థయాత్ర కని ఒకరోజు 1963-వ సంవత్సరములో అజంతా గుహాలకు, శ్రీ సాయిబాబా దర్శనానికి షిరిడీకి వెళ్లాను. అప్పుడప్పుడు తిరుమల దేవుడు శ్రీ వెంకటేశ్వర స్వామి దర్శనార్థం ప్రత్యేకంగా మద్రాసు నుండి వెళ్లాను. ఈమధ్య 1973 సంవత్సరము నవంబరు 10-వ తారీఖున తిరుపతికి సమీపం నరసింగాపురం త్రోవలో శ్రీ కల్యాణ వెంకటేశ్వరస్వామి దర్శనం చేసుకొన్నాను. ఆ విషయా లిప్పుడు చెప్పుచున్నాను.

అజంతా గుహాలు: ఔరంగాబాదు నుండి ఉదయం 6, 6½ గంటలకే బస్సులో బయలుదేరి 60 మైళ్ల పైచిల్కున్న అజంతా గుహాలు చేరుకొన్నాను. గుహాలలోని ఫ్రెస్కో చిత్రాలను, శిల్పాలను తనివితీరా చూచాను. ఆ గుహాలు మొత్తం 25 కు మించివున్నట్లున్నవి. అందులో 16, 17 గుహాలలోని చిత్రాలు, శిల్పాలు ఎక్కువగా నచ్చినవి. ఆ రంగుల బొమ్మల చిత్రీకరణ

నై పుణ్యాన్ని, సౌందర్యాన్ని, ఆ శిల్పాల చెక్కడపు ప్రవీణతను, అవయవపొందికలను, బుద్ధదేవుని శాంతియుత కరుణారసపూరిత విగ్రహాలను 'జగమెరిగిన బ్రాహ్మణునకు జంధ్య మెందుకు?' కన్నట్లు, నే నిప్పుడు వర్ణించి చెప్పటం అనవసరం. గుహాల నానుకొని అనతిదూరంలో ఎత్తైన ప్రదేశాన వుండిన భోజనశాలలో ఆకలి తీర్చుకొని సాయంత్రానికి ఔరంగాబాదు నే నుండిన మధ్యరకం వసతిగృహానికి చేరుకొన్నాను. మర్నా డుదయం ఇంకను పెందల కడనే బయలుదేరి 90 మైళ్లు పై చిల్కు దూరంలో వున్న షిరిడీకి బస్సులో చేరుకొన్నాను. బస్సువద్ద బెజవాడ వాస్తవ్యులు శ్రీ ఈడ్పుగంటి బాలవీరరాఘువయ్యగారి ఆధ్వర్యాన అప్పు డుండిన విజయవాడ కేంద్ర అర్బన్ బ్యాంకులో పనిచేయుచుండినవారు, వెంకట్రామయ్య అనే బ్రాహ్మణ జన్ముడు, నన్ను తెలుగువానినిగా గుర్తించి, పలకరించి నే నెవరినో తెలుసుకొన్నాడు. మే మిద్దరం కలసి షిరిడీకి చేరుకొన్నాం. ఆయన మిక్కిలి శ్రద్ధగల షిరిడీ సాయిబాబా భక్తుడు. ఇంచుమించుగా ప్రతి సంవత్సరం షిరిడీకి శ్రీ సాయిబాబా నిర్యాణం రోజుకు వెళతాడట. నేనువెళ్లింది కూడా ఆసమయానికే. షిరిడీ చేరిన తర్వాత నాకు చేదోడు వాదోడుగానుండి, నా కక్కడి విశేషాలను చూపించాడు. ఆ విశేషాల నిక్కడ ఏకరువు పెట్టటం అనవసరం. శ్రీ బాబా సమాధి గల కేంద్రభవనానికి వెళ్లి, చలువరాతితో చేసిన వారి మూర్తిని, ఆ మండపంమీదనే నున్న వారిసమాధిని దర్శించి "ధన్యోస్మి" అనుకొన్నాను. అక్కడ చాలామంది భక్తులు గుమి గూడారు. పూజాపునస్కారాలు జరుగుచుండగా మధ్య మధ్య భక్తులు భజనరూపకమైన సంకీర్తనం చేశారు. సమాధి, వారి విగ్రహం కలసియుండిన మండపం వంటి ఎత్తైన ప్రదేశం చుట్టూ ఎడతెగకుండా భక్తులు తిరిగారు. మనస్సులో ధ్యానించు కుంటూ పైకి వినపడీ, వినపడనట్లు ఆ పవిత్ర నామధేయాన్ని స్మరించుచూ భక్తులు ప్రదర్శనంచేశారు. నేను 2, 3 సార్లు బిగ్గరగా వారికి జేజే లర్పించాను. ఆవిధంగా బిగ్గరగా జేజేలు కొట్టటం అలవాటు లేదుకాబోలు, అక్క డున్న అర్చకులవంటి

వారు ఆశ్చర్యపడినట్లు నాకు తోచింది. ఒకాయన 'సాగిపొం'డని ఆయన భాషలో చెప్పినట్లున్నది. అది గ్రహించి, అంతటితో నా జేజేలు ఆపివేశాను. నావద్ద నుండిన శ్రీవారి పింగాణీ బొమ్మ, నా పడకగదిలో నేను తల దువ్వుకొనేచోట ఎల్లప్పుడు వుండు చున్న వారి రూపపటం, మైలాపూరులో శ్రీవారి ఆరాధన కుప యోగించు పెద్ద పటం, అక్కడ వివిధ పటాలలో నున్న వారి రూపం వారికి మిక్కిలి వృద్ధాప్యం రాకముం దుండిన రూప చిత్రణములు కావచ్చును. వారు 80 ఏళ్లు పైచిల్కు జీవించారు. నేను షిరిడీలో చూచిన వారి చంద్రకాంత శిలాప్రతిమ ముఖం ముడతలతో కూడియుండి, మిక్కిలి వృద్ధత్వాన్ని సూచించు చున్నది. వారు చనిపోవునప్పుడు ఆ రూపంలో నుండినారుకాబోలు.

నేను గంజాం జిల్లా బరంపూరులో ఉద్యోగం చేస్తున్నప్పు డుండిన శ్రీ పాకల గోపాలరావుగారు ఆ గుడిలో కనపడ్డారు. ఆయన రావుబహాదర్ శ్రీ పాకల శ్రీకృష్ణపాత్రుడుగారి సోదరుని కుమారుడు. రవాణా బస్సుల ఇన్‌స్పెక్టరుగా ఉద్యోగం నిర్వహించుచుండేవారు. ఏదో దుస్సంఘటన వల్ల ఆ ఉద్యోగం నుండి బర్తరఫ్ అయినారు. కష్టాలలోగాని భగవంతుడు జ్ఞప్తికి రాడనే సూత్రం దృఢం. ఈ దుర్ఘటన వారికి జరిగి ఇంచు మించు 40 సంవత్సరా లయింది. భగవంతుని కృప నన్వేషించుచు శ్రీ షిరిడీ సాయిబాబా భక్తు డైనాడు. ప్రతి సంవత్సరం విజయ దశమికి అక్కడికి వెడతాడట. ఈసంవత్సరం విజయ దశమికి కొన్ని రోజులుముందు నాకు బెజవాడ స్టేషన్‌లో కనపడి, "నేను షిరిడీకి వెళ్లుచున్నా"నని చెప్పాడు. ఆయన కుమార్తెలు, కుమారులు వృద్ధిలోను, పెద్ద హోదాలలో నున్నవారు. శ్రీ సాయి బాబా దయాదాక్షిణ్యాలవల్ల ఆయన జీవితం సుఖంగా, ప్రశాంతంగా, దైవభక్తిపూరితంగా గడచుచున్నది. కష్టాలు వచ్చినప్పుడుగాని భగవంతుడు గుర్తుకురాడనే సామెత, నాకునూ వర్తిస్తుంది. 1946 లో, నేను నెల్లూరుకు ఇన్‌కమ్‌టాక్సు ఆఫీసరుగా వెళ్లే సమయంలో నాపేరు అసిస్టెంట్ కమిషనర్ అయ్యే లిస్టులో వుండలేదు. నేను నెల్లూరు వెళ్లిన కొలదిరోజులకు అక్కడి డాక్టరు రాజగోపాలాచారిగారితో పరిచయ మయింది.

నెల్లూరులో శ్రీ సాయిబాబా భక్త సమాజ మున్నది. డాక్టర్ రాజగోపాలాచారిగారు ముఖ్య భక్తులలో నొకరు. వారి ద్వారా నేను శ్రీ సాయిబాబా భక్తుడనైనాను. ఆదిలో (శ్రీ)వారి పూజను నిత్యం చేస్తూండేవాడను. వారి దయవల్లనే అనుకొందును, నా సహోద్యోగులు ప్రమోషను పొందిన మూడేండ్లకైనా, నాకు ప్రమోషను లభించింది. ఈవిషయం కొంత ఈపుస్తకం రెండవ భాగంలో చెప్పియేయున్నాను.

నాతో ప్రయాణించిన బెజవాడ బ్రాహ్మణుడు నన్ను భోజనశాలకు కూడా తీసుకొని వెళ్లాడు. అది అధ్వాన్న భోజనం. ఛార్జి ఎక్కువగానే చేశారుగాని, తినీ తిన నట్లు తినవలసి వచ్చింది. ఆయనగారు, "రేపు ఈరోజు కంటె ముఖ్యమైన దినం. నేను యిక్కడే వుండిపోతాను, మీరు కూడా వుండం" డన్నాడుకాని, షిరిఢీ కుగ్రామం. విశ్రమించుటకు, నిద్రించుటకు నాకనువైన వసతి దొరికేటట్లు కనిపించ లేదు. మధ్యాహ్న భోజనం సగం ఆకలిని మాత్రమే తీర్చింది. ఇక వుండలేనని తిరిగి 2½ గంటల బస్సులో ఆదరా బాదరాగా బయులుదేరి, సాయంత్రానికి ఔరంగాబాద్ చేరుకొన్నాను.

ఇంకొక దేవతాదర్శన విషయం—1973-వ సంవత్సరం, నవంబరు 10-వ తారీఖున (శ్రీ) కల్యాణ వెంకటేశ్వరస్వామి దర్శనం చేసుకొన్నానని పైన చెప్పాను. చిత్తూరు శ్రీ పావుదేశు వెంకటకృష్ణయ్యనాయుడు చివరి కుమారుడు రామకృష్ణ వివాహానికి తిరుపతికి 8-వ తారీఖు ఉదయం చేరుకొని, వా రేర్పరచిన దేవస్థానం అతిథిగృహంలో దిగి, మరునా డుదయం తిరుచానూ రనే అలివేలు మంగాపురంలో వివాహం చూచుకొని, అక్కడ కలసికొన్న (శ్రీ) ఆర్. నాదమునిరెడ్డిగారితో కలసి తిరుమలపైకి వెళ్లి, శ్రీ రెడ్డిగారి సాయంతో (శ్రీ) వెంకటేశ్వరస్వామి దర్శనం మిక్కిలి అనుకూలంగా, పూర్తిగా చేసుకొన్న మర్నా డుదయం, వారి స్వగ్రామ మగు నరసింగాపురమునకు వెళ్లాను. వారి మేనమామ నావద్ద ఇన్‌కమ్‌టాక్స్ డిపార్టుమెంటులో పనిచేసి, ఉద్యోగ విరమణ



అభయహస్త శ్రీ షిర్డీ సాయిబాబా

చేసియుండిన ఆ గ్రామస్థుడు శ్రీ యమ్. మునికృష్ణారెడ్డిగారి అతిథిగా వెళ్లాను. శ్రీ మునికృష్ణారెడ్డి, వారి భార్య శ్రీమతి వెంకటసుబ్బమ్మ మర్యాద, మన్ననలను పొంది, వారిచ్చిన మృష్టాన్నాన్ని తృప్తిగా భుజించాను. ఆ సందర్భంలో శ్రీ నాదముని రెడ్డిగారింటికి వెళ్లి, వారి ఆదరణను చవిజూచి, వారి భార్యామణిని సందర్శించాను. సాయంత్రం నేను తిరుపతి రైల్వేస్టేషనుకు చేరి ఆ రాత్రి తిరుమల ఎక్స్‌ప్రెస్‌లో ఇంటికి బయలుదేరవలసియున్నది. శ్రీ నాదమునిరెడ్డి "నా కారులో దింపుతా"నని చెప్పి నన్నెక్కించుకొని, సమీపాన వున్న దేవాలయానికి తీసికొని వెళ్లారు. నేను నరసింగాపురంకు టాక్సీలో వెళ్లుచూ, ఆ దేవాలయాన్ని బైట నుండి చూచి యిది పెద్దదేవాలయంవలె నున్నదే అనుకొన్నాను. అది శ్రీ కల్యాణ వెంకటేశ్వరస్వామివారి దట. ఆ ప్రాంతాన్ని శ్రీనివాసమంగాపురం అంటారట. స్వామివారి దేవాలయం ప్రాచీనమైనదే. కొన్ని వందల సంవత్సరాలనాడు స్వామివారిని ప్రతిష్ఠించారట. ఏ కారణంవల్లనో, ఆ ప్రదేశమంతా అడవివలె పెరిగిపోయి, దేవాలయం మరుగుపడిపోయింది. కొన్ని సంవత్సరాలక్రితం ఒక విధవ బ్రాహ్మణి అందులో ప్రవేశించిందట. తర్వాత ఒక స్వాములవారు చేరారట. వారి ప్రయత్నంవల్ల ఆ దేవాలయం వెలికి వచ్చింది. పిమ్మట శ్రీ నాదమునిరెడ్డిగారు పూనుకొని, శిథిలమైన ఆవరణను, ముఖద్వారం, విమానగోపురం మొదలైనవానిని బాగుచేయించి, వృద్ధిపరచి మిక్కిలి అందంగా తయారుచేయించారు. ఆవరణ పెద్దది. దానిలో ఒక ప్రక్కగా మండపం, ఇంకొక ప్రక్క ఇంకొక కట్టడం వున్నవి. అన్నిటికంటె స్వామి విగ్రహం మిక్కిలి పెద్దది. తిరుమలస్వామివారి విగ్రహానికంటె 60 శాతం అయినా పెద్దది. ఇక్కడి స్వామివారి పేరు శ్రీ కల్యాణ వెంకటేశ్వరస్వామివారు. శ్రీవారి దర్శనంచేసుకొని తీర్థప్రసాదాలను స్వీకరించి మిక్కిలి సంతోషించాను.

నన్ను శ్రీ నాదమునిరెడ్డిగారు 6, 7 మైళ్ల దూరంలో వున్న తిరుపతి రైల్వేస్టేషనులో దింపి వీడ్కోలు నిచ్చారు.

ఇంతటితో ఈ సంచార విషయం ముగిస్తున్నాను.

౭

# గ్రంథ రచన

నేను మన దేశంలో చదువుకొనుచున్నప్పుడుగాని, విదేశ విద్యాభ్యాస సమయంలోగాని, స్వదేశానికి తిరిగివచ్చి ఉద్యోగం నిర్వహించుచున్నప్పుడుగాని, గ్రంథకర్త నౌతానని అనుకొనలేదు. అప్పటి పరిస్థితుల ప్రభావంవల్ల తాత్కాలిక భావోద్రేకంచేత, 1928 జూన్ లో కొన్ని తెలుగు వ్యాసాలు వ్రాశాను. ఆ వ్యాస రచనావేశంలో నా ఇంగ్లీషు అనుభవాలను తెల్పుచు, కొన్ని ఇంగ్లీషు వ్యాసాలను వ్రాశాను. తెలుగు వ్యాసాలలో రెంటిని "సమదర్శిని" సంచిక ప్రచురించగా, మూడు వ్యాసాలను "భారతి" మాసపత్రిక ప్రచురించింది. ఇంగ్లీషు వ్యాసాలలో నాల్గింటిని ఇంగ్లీషు జర్నల్ "త్రివేణి" ప్రచురించింది. అంతటితో నా రచనా వ్యాసంగం నిలిచిపోయింది.

నేను 1953 జూన్ మాసాంతమున ఉద్యోగ విరమణ చేసినప్పుడుకూడా, ఏ పుస్తకాలనూ ప్రచురిస్తానని అనుకోలేదు. సుమారు 3 సంవత్సరాల తర్వాత 1956 లో నాజీవిత సంఘటనలను కొన్నిటిని వ్రాయాలని మొదలు పెట్టానుగాని, అప్పుడప్పుడు కొంత వ్రాసి 1967 డిసెంబరు మధ్యలో నిలిపివేశాను. 1913–14, 1914–15 సంవత్సరాలలో బందరు నోబుల్ హైస్కూలులో 3, 4 ఫారాలు చదువుకుని, నా డివిజన్ లో సహాధ్యాయిగావుండిన

మిత్రుడు, శ్రీ గొర్రెపాటి వెంకట సుబ్బయ్యగారు నేను 1928 లో వ్రాసిన తెలుగు వ్యాసాలను 1970 సంవత్సరం ఆరంభంలో చూడటం తటస్థించింది. వారు, వీనికి పుస్తకరూప మిద్దా మని ప్రోత్సహించగా, వారి ద్వారా పైజెప్పిన 5 వ్యాసాలనేగాక, అప్పు డప్పుడు వ్రాసిన కొన్ని వ్యాసాలను కలుపుకొని మొత్తం 18 వ్యాసాలను "తాంబూలం—నైవేద్యం" అను పేరుతో వెంకట సుబ్బయ్యగారి మనుమడు చిరంజీవి ఖాందలపాటి శివాజీరావు ద్వారా బెజవాడలోని శ్రీ కృష్ణా ప్రింటింగ్ వర్క్సు వారిచేత 1970 జూన్‌లో ముద్రింపించాను. మొదటి పుస్తకానికి శ్రీ గొర్రెపాటి వెంకట సుబ్బయ్యగారే పరిచయం వ్రాశారు. ఈ పుస్తకాన్ని ఆంధ్రజ్యోతి దినపత్రికలో శ్రీ ఆచంట జానకిరామ్‌గారు సమీక్షించారు. వారు తమ సమీక్షను సహృదయపూర్వకంగా, కొంత మెచ్చుకోలుతో వ్రాశారు. వారి చివరి వాక్యం "ఈ వ్యాసాలను చదువుతూంటే, శ్రీ లింగం వీరభద్రయ్య చౌదరిగారిని గురించి మన కెంతో ఆత్మీయత కలుగుతుంది" అని వ్రాశారు. ఇద్దరు, ముగ్గురు యితర పెద్దల అభిప్రాయాలు తెల్పటం కూడా అనుచితం కా దనుకుంటాను. శ్రీ సంజీవదేవ్ గారు వ్రాస్తూ "మీ రచన సమీక్షాత్మకం, సృజనాత్మకం అనవలసి వుంటుంది. మీ రచనలో ఉల్లాసం, ఉత్సాహం, హాస్యం, విషాదం అన్నీ ప్రత్యక్షం. కొన్నిఘట్టాలు ప్రత్యేకించి అభిరుచికరంగా వున్నాయి" అని వ్రాశారు. ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమి కార్యదర్శి శ్రీ దేవులపల్లి రామానుజరావుగారు ఇంగ్లీషులో వ్రాస్తూ, నే నీ పుస్తకం "తాంబూలం—నైవేద్యం" తోబాటు పంపిన నా రెండవ పుస్తకం "మారిన కాలం" ను కలుపుకొని వారి అభిప్రాయాన్ని ఈవిధంగా తెల్పారు. "మీ విదేశీ అనుభవాలను ప్రతిబింబిస్తూ మీ పుస్తకాలు మిక్కిలి అభిరుచికరంగా వున్నవి. మీ శైలి పఠనగెత్తుచూ పాఠకుల మనస్సును, హృదయాన్ని రంజింపచేస్తున్నది" అన్నారు. ఏలూరు నుండి శ్రీ వేగుంట కనక రామబ్రహ్మంగారు వ్రాస్తూ "వస్తువేదైనప్పటికి బాగా చెప్పగల చేవ వున్న రచయితచేతిలో పడ్డప్పుడు ఆ రచన పాఠకుణ్ణి చదివించే

ఉత్సుకతను కలుగజేస్తుందనటంలో ఏమాత్రం సందేహం లేదు. మీ పుస్తకం నా కటువంటి అనుభూతినే కలిగిస్తున్నది" అని తెల్పారు. శ్రీ రామానుజరావుగారికి వలెనే, శ్రీ డాక్టర్ సి. నారాయణరెడ్డిగారికి కూడా "తాంబూలం - నైవేద్యం" తో బాటు "మారిన కాలం" కూడా పంపాను. వారీవిధంగా తెల్పారు. "తాంబూలం - నైవేద్యం గ్రంథంలో మీ బహుముఖ వస్తుపరిశీలనా ప్రతిభ గోచరిస్తున్నది. సరళ గ్రాంధికంలో మీ రచన ముద్దులు మూటకడుతూ జాలువారింది" అన్నారు. ఈ పుస్తకాన్ని మృతిచెందిన నా పెద్ద కుమారుడు పూర్ణచంద్రరావు స్మృతి కంకిత మిచ్చాను.

నా రెండవ పుస్తకం "మారిన కాలం" కూడా మొదటి పుస్తకం ప్రచురించిన ఆరు వారాలకే 1970 ఆగస్టులో వెలువడింది. దానికి శ్రీ గొట్టిపాటి బ్రహ్మయ్యగారు పరిచయం వ్రాశారు. పండ్రెండు వ్యాసాలతో కూడిన దీనిని ఆంధ్రజ్యోతి దినపత్రికలో శ్రీ సంజీవదేవ్ గారు 'పారదర్శి' అను కలం పేరుతో సమీక్షించారు. వారి దీర్ఘ సమీక్షలో, వారి అభిప్రాయాన్ని తెలిపే ఒక చిన్న పేరాలో మొదటి పంక్తులను యిక్కడ వ్రాస్తాను. "అతి సామాన్య వివరాలను కూడా విశదంగా వివరించటం చౌదరిగారి రచనలోని విశిష్టత. శైలి కూడా అందు కుపయుక్తమైన రీతిలోనే యున్నది" అన్నారు. డాక్టర్ శ్రీ సి. నారాయణరెడ్డిగారు యీ పుస్తకాన్ని గురించి "మీ పల్లెజీవన పరిజ్ఞానం మారిన కాలం' లో ప్రతిఫలించింది. ఈ రెండు సంపుటాలు మిమ్మల్ని ఉత్తమశ్రేణికి చెందిన వ్యాసకర్తగా నిలబెడతాయి" అని వ్రాశారు. శ్రీ వేగుంట కనకరామబ్రహ్మంగారు "మీ 'మారిన కాలంలో' చాలా వ్యాసాలు మన పల్లె జీవితాన్ని, ముఖ్యంగా రైతు జీవితాన్ని ఎంతో చక్కగా కళ్లకు కడుతున్నట్లు వ్రాశారు. ఆ వ్యాసాలు చదువుతూంటే ఒక మంచి డాక్యుమెంటరీ సినిమా చూచినట్లున్నదంటే అతిశయోక్తి కాదు. అచ్చమైన తెలుగుభాషలో చక్కటి

స్కెచ్చిలు అవన్నీ" అని తెల్పారు. శ్రీ సంజీవదేవ్ గారి గ్రామం తుమ్మపూడినుండి శ్రీ అల్లూరి వెంకట్రావ్ అనే యువకుడు వ్రాస్తూ "ఈ పుస్తకం, మీ మొదటి పుస్తకం 'తాంబూలం - నైవేద్యం' కంటె చాలా గొప్పది, పచ్చి నిజాల పుట్ట. ఎంత చేదుగావున్నాసరే, మీరు చెప్పిన యీ నిజాల్ని ఒప్పుకోకపోతే వాడొక వెధవ, అబద్ధపు బ్రతుకు బ్రతుకుతున్నాడన్నమాట" అని తన అభిప్రాయాన్ని తీవ్రంగా వెలిబుచ్చారు. ఈ పుస్తకాన్ని గురించి "భారతి" మాసపత్రికలో సమీక్ష పడింది. అది ఈవిధంగా వున్నది. "మనుష్యుని జీవితంలో అనేక విషయములు విజ్ఞానదాయకములుగా వుండే విధముగా ఈ గ్రంథము రచింపబడినది. రచన సాఫీగా, చక్కని తెలుగులో అందరికీ అర్థమయ్యే విధముగా వున్నది. గంభీరమైన విషయాలు కూడా, అతి సులువుగా వివరించబడినవి." ఈ సమీక్షను శ్రీ వి యస్. అవధానిగారు చేశారు. ఈమధ్య ఈ పుస్తకాన్ని చదివిన కళాప్రపూర్ణ శ్రీ తుమ్మల సీతారామమూర్తిగారికిది చాలా నచ్చింది. "మీ వాక్యరచన యొక ప్రవాహము వంటిది. కృత్రిమత్వము లేనిది మీ భాష. స్వచ్ఛమైన పల్లెటూరి జీవనము మీ ధ్యేయము. సామాన్యము కానిది మీ సాహితీ శక్తి" వగైరా వాక్యాలతో శ్లాఘించారు. దీనిని కీర్తిశేషులైన నాతండ్రి శ్రీ వెంకటరత్నంగారికి వారి జ్ఞాపకార్థం వెలువరించాను. ఈ రెండు పుస్తకాలను నే నెందుకు వ్రాశానో నా తొలిపలుకులలో తెల్పాను.

"అభిప్రాయాలు—అనుభవాలు" అని తెలుగులోను, "రిఫ్లెక్షన్స్ ఆన్ ది వెస్ట్" అని ఇంగ్లీషులోను, ఏకకాలమందే 1972 డిసెంబరులో ప్రచురింపించాను. ఈ రెండు పుస్తకాలను ముద్రించినవారు, ప్రచురించినవారు, మచిలీపట్టణం. త్రివేణి ప్రెస్, త్రివేణి పబ్లిషర్సు వారు. తెలుగు పుస్తకాన్ని నా ప్రేలువిడిచిన మేనమామ కీర్తిశేషులు త్రిపురనేని రామస్వామిచౌదరి కవిరాజు గారికి, నా ఇంగ్లీషు పుస్తకాన్ని 50 ఏండ్ల పైచిలుకునుండి నాకు

మిక్కిలి సన్నిహిత స్నేహితులుగా నుంటున్న ఆచార్య యన్. జి. రంగాగారికి అంకిత మిచ్చాను. నా అలవాటు ప్రకారం నా తొలి పలుకులలో ఈ రెండు పుస్తకాలను వ్రాయుటకు గల భావప్రేరణ, వీని రచనా విధానం తెల్పాను. తెలుగు పుస్తకం "అభిప్రాయాలు-అనుభవాల" కు, 'అవలోకన' అను పేరుతో శ్రీ సంజీవ దేవ్ గారు విపులమైన పీఠికను వ్రాశారు. ఇంగ్లీషుపుస్తకానికి శ్రీ కె.వి. గోపాల స్వామిగారు అనేక విశేషాలతో కూడిన ఉపోద్ఘాతం వ్రాశారు.

తెలుగు పుస్తకాన్ని 5 ప్రకరణాలుగా వ్రాశాను. మొదటి ప్రకరణంలో "ఆస్తికుడు— నాస్తికుడు", "హేతు వాదం", "ఏది వ్యభిచారం" వంటి 7 వ్యాసాలను వ్రాశాను. రెండవ ప్రకరణంలో "రంకు—బొంకు", "పండితులు-కవులు-కళాకారులు,", "పరాన్నభుక్కులు" వ్రాసిన ఆరులో వున్నవి. మూడవ ప్రకరణంలో వ్రాసిన 5 వ్యాసాలలో "దాయాది-బంధువు", "సరసం-విరసం" వంటివి వున్నవి. నాలుగవ ప్రకరణంలో రెండు వ్యాసాలలో మొదటిది "నా తలిదండ్రులు" అనునది, రెండవది పరలోకప్రాప్తిజెందిన నా భార్యను గురించి "అధ్యాయం ముగిసింది" అని వ్రాసింది. ఐదవ ప్రకరణం ఇంచుమించుగా పల్లెటూరి జీవితాన్ని గురించి. "పల్లెటూరు పసందు", "పల్లెటూరు పద్ధతులు", "ఇదేనా సంక్రాంతి పర్వదినం" అనునవి. "ఇది సాంఘిక న్యాయమా?" అని భూ పరిమితులను గురించి వ్రాసినది. చివరిది, ఎనిమిదవది "మెరపు తలపులు" అని నాకప్పు డప్పుడు వచ్చిన తలపులను, తోచిన భావాలను వ్యక్తీకరించినది. "రిఫ్లెక్షన్స్ ఆన్ ది వెస్ట్" లో పాశ్చాత్యుల జీవనదృక్పథం, వారి స్వతంత్ర ప్రవృత్తి, గృహజీవితం, సాంఘిక పద్ధతులు మొదలైనవానిని గురించి వ్రాసిన ఆరు వ్యాసా లున్నవి. అందులోని 7-వ వ్యాసం ఆక్స్ఫర్డ్ విద్యార్థి జీవితాన్ని గురించి వ్రాసినది.

"అభిప్రాయాలు — అనుభవాలు" ను అవలోకించిన సంజీవ దేవ్ గారు చెప్పిన వాక్యాలను వ్రాస్తాను. "కొన్ని రచనలు ఆలోచనలను రేకెత్తించేవిగా వుంటే, కొన్ని అనుభూతులను

సృష్టించేవిగా వుంటాయి. వీరభద్రయ్య చౌదరిగారి "అభిప్రాయాలు—అనుభవాలు" అనే గ్రంథంలో ఈ రెండూ కూడా గోచరిస్తాయి. ఈ గ్రంథంలోని రచనలనుపట్టి తోలిస్తే చౌదరిగారు ఒకవిధంగా ప్రతిభగల రచయితయే అని తెలుస్తుంది. చౌదరిగారి రచనలు యిందులోనివి చదివితే, వారి జీవితాన్నుంచి యివి దూరంగా వుండలేదని తేలుతుంది. ఈ పుస్తకంలో ఎన్నెన్నో అతి సామాన్య విషయాల్ని ఆలోచనతో, హాస్యంతో, అలంకారాలతో మేళవించి, చౌదరి గారు వాటిని రసవంతముగా అభివ్యక్త పరచారు. చౌదరి గారిలో రెండు విధాలైన సభ్యతలు, సంస్కృతులు సహజీవనం చేస్తూంటాయి. పాశ్చాత్య సభ్యతా సంస్కృతులు మాత్రమేగాక, ప్రాచ్యసభ్యతా సంస్కృతులు, నగరసభ్యతా సంస్కృతులు మాత్రమేగాక, గ్రామ్య సభ్యతా సంస్కృతులు వారిలో సమైక్యత చెందినాయి" అని యీవిధంగా యింకా చాలా వ్రాశారు. వారి అవలోకనకు నేను సంతోషించి, అది యీ గ్రంథానికి పరిమళం ప్రసాదించిందని వారికి నా మనఃపూర్వక కృతజ్ఞతలు నా తొలి పలుకులో తెల్పాను. ఇక ఇతరుల అభిప్రాయాలు కొన్ని చెప్తాను.

ఆంధ్ర హైకోర్టు న్యాయమూర్తి శ్రీ ఆవుల సాంబశివరావు గారు ఇంగ్లీషులో వ్రాసిన వుత్తరంలోని కొన్ని వాక్యాలను తెలుగులోనికి అనువదించి, యిక్కడ వ్రాస్తున్నాను. "మీరు నిశ్చితాభిప్రాయాలు కలవారు. వానిని ఎట్టి సందిగ్ధత లేకుండా వ్రాస్తారు. విస్పష్టంగా ముక్కుకు సూటిగా మీ అభిప్రాయాలను తెల్పటం మీ రచనాపద్ధతి. భూమాత గర్భమునుండి సరాసరి ఉద్భవించిన అమాయక, నిష్కళంక గ్రామీణుని ధోరణి మీరు వ్రాసిన ప్రతిపంక్తిలోను కనపడుచున్నది. అయితే మీ గ్రామీణత నాగరికత, విజ్ఞానంతో కూడిన వ్యక్తిత్వం కలది ఈ మిశ్రమ గుణమే మీ వ్యక్తిత్వానికి మూలస్తంభం. ఏకకాలమందు సౌహార్ద్రం, ధీరత్వం మీ వ్యాసా లన్నిటిలోను ప్రతిబింబిస్తున్నవి" అని వ్రాశారు. డాక్టర్ సి. నారాయణ

రెడ్డిగారు "మొదలుపెడితే చివరవరకు చదివించే గుణం మీ మీపుస్తకంలోవుంది. మొదటి ప్రకరణ మంతా హేతువాదం ఖడ్గధారలా మెరిసింది. రంకు, బొంకుల చర్చ చాలా బలంగా సాగింది. పల్లెటూరి అనుభవా లెంతో ముచ్చటగా వున్నాయి. చెప్పదలచుకొన్నది సూటిగా చెప్పటం మీ రచనలోని గణ నీయ గుణం" అని వ్రాశారు. శ్రీ ఆచంట జానకిరామ్‌గారు ఇంగ్లీషులో వ్రాస్తూ, "మీ తెలుగు పుస్తకాన్ని చాలా బాగా వ్రాశారు. సామాన్యంగా ఇతరులు జీవితంలో గమనించని చాలావిషయాలను గురించి విస్తారంగా తెలిపారు" అనివ్రాశారు, శ్రీసి నరసింహాంగారు ఇంగ్లీషులోవ్రాస్తూ, "మీ 'అభిప్రాయాలు-అనుభవాలు' పుస్తకం మీ నిశ్చితాభిప్రాయాలు తేటతెల్లమగు శైలిలో, ధారాళమైన భాషలో వ్రాయబడియున్నవి" అని తెల్పారు. మద్రాసునుండి డాక్టర్ చిట్టూరి సత్యనారాయణగారు, "మీ 'అభిప్రాయాలు- అనుభవాలు' ఎంతో చక్కగా చిత్రించి నారు. జీవమున్న శైలి, హృదయములోనికి తీసుకుపోయే భావ ములు. సామాన్యమైన పల్లెటూరి బ్రతుకులోనే వేదాంతములు కనుగొన గలిగినారు. పుస్తకం మొదటి నుంచి, చివర వరకు చదివేవరకూ విడువబుద్ధి కాలేదు" అని వ్రాశారు. శ్రీ పండిత గొర్రెపాటి వెంకట సుబ్బయ్యగారు వ్రాస్తూ, "మీ 'అభిప్రా యాలను—అనుభవాలను' దాపరికంలేకుండా నిర్భయంగా చెప్పి నందుకు అభినందిస్తున్నాను. ఈమాదిరిగా చెప్పినవారు అరుదు. మీ అభిప్రాయాలు, అనుభవాలు గనుకనే అవి అంత బాగున్నాయి. మీ రచనా శిల్పం దీనికి దోహద మిచ్చింది" అని వ్రాశారు. ఏలూరునుండి శ్రీ వేగుంట కనకరామబ్రహ్మంగారు వ్రాస్తూ, "మీ సృజనాత్మక, సమీక్షాత్మక ప్రతిభ మీవ్రాతలలో కొట్టవచ్చినట్లు కనిపిస్తోంది. మీ రచన వేరు, జీవితం వేరు కాదు అనిపిస్తోంది. వాటిని చదువుతూ వుంటే, ఆ రెంటి సమన్వయమే మీ రచనలుగా

రూపొందినవి. లోకాన్ని అన్నికోణాలలో ఆలోకనం చేసి, చేసిన ఈ రచనలు చదవటం మొదలుపెడితే పూర్తిఅయ్యేవరకు విడిచిపెట్టనీయలేదు. రచయిత సామర్థ్యానికి అంతకంటె గీటురాయి ఏముంది?'' అని వ్రాశారు. తెనుగులెంక, కళాప్రపూర్ణ శ్రీ తుమ్మల సీతారామమూర్తిగారీ పుస్తకాన్ని చదివి, పుస్తకంలోని రచనను గురించి ఈవిధంగా వ్రాశారు. ''ఇదియును మీ లోకజ్ఞతను, కథాకథన కౌశలమును చాటుచున్నది. ఇందెన్నో సజీవ విషయములు కలవు'' అని సెలవిచ్చినారు. గుడివాడలో కృష్ణాజిల్లా పామర్రు భారతీ సమితివారు ఈ తెలుగు పుస్తకాన్ని శ్రీ కోగంటి దుర్గామల్లికార్జునరావుగారి ప్రోత్సాహ సహాయాలతో ఆవిష్కరించు సందర్భములో కవిరత్న కోడూరి శ్రీరాములుగారు చదివిన ప్రశంసా పద్యములలో నొకదానిని మచ్చుకు ఇక్కడుదహరిస్తాను :

చం. చదివితి మీదు పొత్తమును సాంతముగాఁ బరికింప నంతటన్
బదనగు భావముల్ గలవు పండిత సత్తము లౌ నన్ మహా
ముదమునుగూర్చినావు పరిపూత చరిత్రుఁడవీవు నామదిన్
బదనునొవర్చె మీ రచన, భావ సుమంబు లివే గ్రహింపుమా!

ఈ ''అభిప్రాయాలు—అనుభవాలు'' ను గురించి శ్రీ ప్రణవాచార్య, కవిమిత్ర డాక్టర్ మహేశ్వరం సుందరరామయ్యగారు పంపిన మూడు పద్యాల నిం దుదహరించుచున్నాను:

ఉ. శ్రీయుత వీరభద్రయ రచించెను పొత్తము సత్కవీంద్ర వి
ద్యాయుత శాస్త్రసంచిత మహాద్భుతవాక్యరహస్యమార్గ సం
ధాయక సూక్ష్మ మర్మములు తప్పక వీధిసబెట్టె నట్టి వి
ద్యాయుతు డాత డట్టి కవిధన్యుడు మాన్యుడె యాంధ్ర సీమలో.

గీ. మూఢభావమ్ము లేనాడొ బూజుబట్టె
నవ్యభావమ్ము లీ నాడు నాటుకొనగ
వెనుక భావమ్ము లంతట వెదుకుచుండు
స్వార్థపర మూఢవిశ్వాససహితువల్ల.

గీ. అట్టివారికి నీ దారి యరసి నంత
కుత్తు కందున శ్లేష్మమ్ము హత్తినట్లు

లుక్కారియు, బిక్కారియు నొదు రుర్వియందు
సత్య మన్నను రోగిష్ఠ సరణి యట్లు
మూల్గుచుందురు ముస లెద్దు ముక్కనట్లు.

ఈ పుస్తకాన్ని గురించి శ్రీ నూతులపాటి రాఘవరావు, యమ్ ఎ. గారు వ్రాసిన దీర్ఘ వ్యాఖ్యలో కొన్ని వాక్యాలను వ్రాయుచున్నాను.

"మీ 'అభిప్రాయాలు—అనుభవాలు' అన్న రచన హరివిల్లువలె రమ్యంగా వున్నది. అందులో మొదటి తొమ్మిది ఖండికలు, మీ హేతువాదదృష్టికి, ఆచారవ్యవహారాలపై నిర్మమత్వంతోగూడిన విచక్షణా వైఖరికి నిదర్శనాలు" అని వ్రాశారు. ఇంకొకచోట "ఐదవ ప్రకరణ మంతా మీకు కాచి వడగట్టిన పల్లెటూరి వాతావరణం. కాల ప్రభావంతో కొట్టుకు వచ్చిన అవిద్య, అమాయకత్వం, అవివేకం, అల్పత్వం కొన్ని స్వయంకృతాలయిన అనర్థాలు ఎలా పల్లెటూళ్లలో పేరుకు పోతున్నవో మీరు చక్కగా చిత్రించారు" అని తెల్పారు.

శ్రీ వి. యస్. అవధానిగారు ఆంధ్రపత్రికలో ఈ గ్రంథాన్ని సమీక్షించారు. "ఈ రచయిత శైలిలోనేకాక, అభిప్రాయాలలోకూడ పాండిత్య మున్నది. ఎన్నని వర సీ ఆణిముత్యాల సంపుటినుంచి! మన తరం రచయితలలో ఎంత మంది యింత క్లుప్తంగా, సరళంగా, సరసంగా, ఇన్ని సంశయాలను చర్చించగలరు? చౌదరిగారి తరము రచయితలకే తగును అంతటి ఘనత" అని శ్లాఘించారు.

"రిఫ్లెక్షన్స్ ఆన్ ది వెస్ట్" కు వారు వ్రాసిన తమ సుదీర్ఘ ఇన్ట్రడక్షన్‌లో శ్రీ కె. వి. గోపాలస్వామిగారు "మన దేశములో 1919–వ సంవత్సరంలో సంభవించిన రౌలట్ యాక్టు, జలియన్ వాలాబాగ్ సంహారం, పంజాబ్ మార్షల్ లా, మహాత్మాగాంధి అవతరణ మొదలైన వానిని ఎత్తుకొని, అంతకుముందు జరిగిన చారిత్రక విషయాలను పేర్కొని, 1920–వ సంవత్సరము ఆగస్టు 1–వ తారీఖున జరిగిన హర్తాళ్, గాంధీగారి ఆధ్వర్యాన కేంద్ర ఖిలాఫత్ కమిటి సంరంభ మారంభాన్ని తడివి, మొదటి ప్రపంచ

యుద్ధం, రెండవ ప్రపంచయుద్ధం వలన కలిగిన అంతర్జాతీయ పరిణామాలను వివరిస్తూ, ఆక్స్‌ఫర్డ్ కేంబ్రిడ్జిలలోని విద్యాపద్ధతులను పేర్కొన్నారు. వారి కాలంలో (1920 దశాబ్దం) ఆక్స్‌ఫర్డ్‌లో చదువుకొన్న ఆంధ్ర విద్యార్థులను గురించి వివరాలు తెల్పారు. వారిలో శ్రీ డి. సదాశివరెడ్డి (డి. యస్. రెడ్డి), శ్రీ యన్. జి. రంగా, శ్రీ వి. యస్. కృష్ణ, శ్రీ టి. మురారి, వారు, నేనే గాక, ఐ. సి. యస్. ప్రొబేషనర్స్ శ్రీ వి. రామకృష్ణ, శ్రీ టి. భాస్కరరావు, శ్రీ ఒ. పుల్లారెడ్డిగార్లున్నారు. మరిన్ని, తమను గురించి వారేవిధంగా చెప్పుకున్నా, తనను రాధాకృష్ణ అనిగాక, రాధాకృష్ణన్ అనే అనాలి అని పట్టుబట్టినా, నిజానికి తెలుగు వారైన శ్రీ సర్వేపల్లి రాధాకృష్ణగారిని గూర్చి కూడా వివరాలు వ్రాశారు. శ్రీ గోపాలస్వామిగారి చివరి వాక్యంలో, "ఈ వ్యాసాలు చారిత్రకవిలువ కలవికావని ఎవరూ అనలేరు" అని ఉద్ఘాటించారు. వారి విషయపూరిత పీఠికకు నా కృతజ్ఞతను నా తొలిపలుకులో తెలిపాను.

ఈ ఇంగ్లీషు పుస్తకాన్ని గురించి యితర పెద్దల అభిప్రాయాలు కొద్దిగా తెలుపుతాను. పైచెప్పిన శ్రీ ఆవుల సాంబశివరావుగారు, "మీ వ్యాసాలు పాశ్చాత్య ప్రజల జీవిత విధానాలను నాకు సుబోధకం చేసినవి. వారిదివరకే విధంగా జీవించినదీ, ఇప్పుడా జీవితవిధానం ఏవిధంగా మారినదీ మీ పుస్తకం చారిత్రక, సాంఘిక విద్యార్థులకు, పండితులకు తెలియజేస్తుంది" అని వ్రాశారు. శ్రీ సంజీవదేవ్‌గారు, "మీ తెలుగు రచనలలోకంటె, మీ ఇంగ్లీషు రచనలలోనే ఎక్కువ ప్రగాఢత వున్నది. మీ ఇంగ్లీషు శైలి, అభివ్యక్తి విధానం, పదజాలం నాకెంతో ఆహ్లాదాన్ని చేకూర్చినాయి" అని వ్రాశారు. శ్రీ ఆచంట జానకిరామ్‌గారు ఇంగ్లీషులో వ్రాస్తూ "మీ శైలి మిక్కిలి సరళంగాను, తేటతెల్లంగా నున్నది. గతాన్ని మిక్కిలి సమర్థవంతంగా మీరు పునరుజ్జీవం చేయగలరు" అని తెల్పారు. ఈ గ్రంథాన్నికూడా పామర్రు భారతీ సమితివారు

శ్రీ కోగంటి దుర్గామల్లికార్జునరావుగారి ప్రోత్సాహప్రోద్బలాలతో గుడివాడలో ఆవిష్కరించారు. కవిరత్న శ్రీ కోడూరి శ్రీరాములు గారు ఆసందర్భములో చదివిన పద్యాలలో రెంటిని ఉదహరిస్తున్నాను :

ఉ. పొంకము మీరచనపొంగి ప్రజన్ మురిపించు, పాఠకుల్
చంకలు కొట్టుకుందురు, ప్రసన్నత మెచ్చెద రెంద రెందరో,
శంకలు పెట్టనేల? సరసంబుగా వ్రాసినవాడ వీవహో;
బింకము చూపుచున్ రచన పెంపువహించితి వీరభద్రయా!

మ. కలరూపంబు గ్రహించి వ్రాసితివి, సాకల్యంబు పాశ్చాత్య సీ
మలకున్ బోయి మృదూక్తి నైపుణిని సీమన్ గల్గు చిత్రంబులన్
దలపన్ జేసితి వహ్వారే సుమహితానందంబుఁజిందించి, స
త్ఫలితం బెంతయు గూర్చినావు, బుధ సంభావ్యా ప్రశంసించెదన్.

పత్రికలలో దీనిని ప్రప్రథమంగా సమీక్షించింది, మద్రాస్ లోని "ది మెయిల్" అనే ఇంగ్లీషు దినపత్రిక. ఆ సమీక్షలో కొన్ని వాక్యాలు యివి: "మన శతాబ్దం ముప్ఫైలో వారు వ్రాసిన ఆక్స్‌ఫర్డ్‌లోని జీవితం ఉల్లాసకరంగా వున్నది. ఆ కాలంలో విషయగ్రహణశక్తిగల భారతీయుడు పాశ్చాత్యుల మధ్య నివసించుచు, స్వయముగ గ్రహించిన విషయాలివి. 50 సంవత్సరాలక్రితం అమలులో వుండిన యూరపియన్ సాంఘిక చిత్ర మిది." తర్వాత ఆంధ్రపత్రిక దినపత్రికలో శ్రీ వి. యస్. అవధానిగారు సమీక్షించారు. "కొన్ని అంశాలను గురించి, లేదా కొన్ని దేశాలను గురించి ప్రచారంలోనున్న కొన్నిరకాల అభిప్రాయాలను సరిదిద్దాలనే ఆవేదనను, రచన వలనుగా వెలువరిస్తారు సహృదయులు. అటువంటి సహృదయులలో శ్రీ లింగం వీరభద్రయ్యచౌదరి గారొకరు, పాశ్చాత్య నాగరికత అంటే పడనివాళ్లు చదివి, చర్చించి గ్రహించవలసిన విషయాలున్నాయి ఈ సంపుటిలో. పాశ్చాత్య

జీవితవిధానంలో మంచిని పరిచయంచేసే ప్రయత్నం జరిగింది ఈ వ్యాసాలలో " అని వ్రాశారు. ఆంధ్రప్రభ వారపత్రికలో ఈ ఇంగ్లీషు పుస్తకాన్ని వ్యాఖ్యానించినవారు క్రిందివిధంగా వ్రాశారు :

"శ్రీ చౌదరిగారు చాలా సూక్ష్మమైన పరిశీలనాశక్తి గలవారు. అదీగాక, భారతదేశంలో పుట్టి పెరిగిన ఆయనకు పశ్చిమదేశాల దృశ్యాలు, తీరులు, జీవనవిధానాలు, విలువలు, క్రొత్తగా కనిపించి వుంటాయి. ముఖ్యంగా భారతదేశంలో ఈనాటికీ ప్రచారంలోవున్న కొన్ని అభిప్రాయాలను ఆనాడే ఆయన ఖండించారు. ప్రాక్పశ్చిమ ప్రపంచాలు ఎంతగా మారి పోయినా, మారిపోతున్నా మానవతకు సంబంధించిన ఇటువంటి ప్రాథమిక విలువల చర్చ ఈనాడు కూడా అవసరం. ఈ అవసరాన్ని ఈ వ్యాసావళి కొంతవరకు పునరుద్ఘాటిస్తుంది. ఈ పుస్తకప్రసక్తి ముగియకముందు ఈమధ్య వచ్చిన 'భవన్స్ జర్నల్'లో ఈవ్యాసా లలోని విషయ సంగ్రహణ చాలాచక్కగా సమకూర్చబడింది. దానిని చదివిన కొందరు, అంతటి చక్కని సంగ్రహణను ఆ ప్రఖ్యాత జర్నల్‌లో ప్రచురించటం, చౌదరిగారికి కొంత ప్రతిష్ఠను కలిగించిం" దని చెప్పారు.

"స్వవిషయం"- ఈ పేరుతో నా జీవితచరిత్ర వ్రాయాలని తలంపు కలిగి 1956-వ సంవత్సరం జనవరి 13-వ తారీఖున ఆరంభించాను. నా ఉపోద్ఘాతం, "ఎందుకు వ్రాసినట్లు ?" అను దానిలో చెప్పినట్లు మధ్య మధ్య ఆపి 1970-71 లో ఏదోవిధంగా పూర్తిచేశాను. తర్వాత అతుకులు, బొతుకులుగా వ్రాసిన దానిని సమన్వయంచేసి, 1972 నాటికి సాఫీవ్రాయటం పూర్తి చేయించాను. దీని ముద్రణ మచిలీపట్నం, త్రివేణి ప్రెస్ వారు 1973 మే నెలలో పూర్తిచేసి, 'త్రివేణి పబ్లిషర్స్' అనుపేరుతో ప్రచురించారు. ఇది ప్రథమ భాగం మాత్రమే. ఇందులో నా జనన మాది స్వదేశ, విదేశాల విద్యను పూర్తిచేసి, 1929-వ సంవత్సరములో నేను ఇన్‌కమ్‌టాక్స్ డిపార్టుమెంటు ఉద్యోగంలో

చేరినంత వరకు వ్రాశాను. రెండవ భాగం నా ఉద్యోగారంభం నుండి, నేను 1953 జూలై మొదటి తారీఖున ఉద్యోగ విరమణ చేసినంత వర కున్నది. ఈ రెంటిని బందరు, త్రివేణి పబ్లిషర్స్‌వారే ముద్రించి ప్రచురించారు. ఇది మూడవ భాగం. దీనిని కూడా వారే ముద్రించి, ప్రచురిస్తున్నారు.

మొదటి భాగం 1973-వ సంవత్సరం మే నెలలోను, రెండవ భాగం 1974-వ సంవత్సరం జనవరిలోను వెలువడినవి. ఈ మూడవ భాగం 1-7-1953 నుండి ఈరోజు వరకు జరిగిన నా జీవిత విషయాలను తెలుపును. మొదటి నాలుగు పుస్తకాలకు పెద్దలచేత పరిచయాలు, పీఠికలు వ్రాయించాను. ఈ నా జీవితచరిత్రకు పరిచయంకాని, పీఠికగాని, ఉపోద్ఘాతంగాని అనవసరమని తలంచాను. పైన చెప్పినట్లు "ఎందుకు వ్రాసినట్లు?" అని మొదటి భాగంలో వ్రాసింది రెండు, మూడు భాగాలకు కూడా వర్తిస్తుంది. భాగాలుగావున్నా పుస్తక మొకటేకదా! మొదటి రెండు భాగాలను గురించి పెద్దలు తెలియబరచిన అభిప్రాయాలను క్లుప్తంగా యిందులో పొందుపరుచుచున్నాను.

మొదటి భాగాన్ని గురించి డాక్టర్ సి. నారాయణరెడ్డిగారు,

"రెండు రోజులు వరుసగా చదివాను. అది మీ విషయమే కాదు. ఆరోజుల్లో మీతోబాటు జీవించిన, మీతోబాటు సంఘజీవులుగా బాధ్యతలు నిర్వహించిన ఎందరెందరో సంస్కారుల, విద్యావంతుల స్వవిషయం. నన్ను ప్రథమంగా ఆకర్షించింది మీ సత్య ప్రకటన బుద్ధి. మామూలుగా ఇతరులైతే చెప్పటానికి వెనుదీసే వ్యక్తిగత దౌర్బల్యాలను, కుటుంబ కలహాలను ఎంతో సూటిగా, నీళ్లు నమలకుండా చెప్పారు. ఆత్మచరిత్ర రచయిత కుండవలసిన ముఖ్య లక్షణ మిది. అది మీ పుస్తక మంతట ప్రసరించి వుంది. ఆనాటి పల్లెజీవనానికి ఇది అద్దం పట్టింది. ఆంధ్ర గ్రామాల సాంఘిక చరిత్రకు ఈ పుస్తకం అత్యంత దోహదకారి. మీ శైలి సహజ రమ్యమైంది. నుడికారం మీ రచనకు ప్రాణం" అని వ్రాశారు.

శ్రీ బిరుదురాజు రామరాజుగారు హనుమకొండనుండి వ్రాసిన దీర్ఘమైన జాబులో చెప్పిన ముఖ్య విషయ మిది : "మీ పుస్తకం మీ సమకాలికుల చరిత్రకు ఎత్తిన పతాకం."

ఆచార్య శ్రీ యన్. జి. రంగాగారు వ్రాస్తూ, "ఈ పుస్తకం సాంఘికంగా ఆలోచనలను రేకెత్తించేదిగాను, మిక్కిలి అభిరుచికరంగాను వున్నది. చదవటానికి మిక్కిలి సౌలభ్యం కలది" అన్నారు.

మద్రాసు నుండి డాక్టర్ చిట్టూరి సత్యనారాయణగారు వ్రాస్తూ, "ఈ 'స్వవిషయం' ఒక అసామాన్యుడు రచించిన అసామాన్యుని జీవితము. ఇందు కడచిన డెబ్బయి సంవత్సరాల ఆంధ్రప్రదేశపు గ్రామీణ చరిత్ర మాత్రమే కాకుండా, ఆనాటి విదేశవిద్య, దేశీయులు విదేశాలలో ఎట్లా నడచుకొన్నారో అట్టి నడవడిక, అద్దములో చూపినట్లు చూపినారు. ఈపుస్తకము చదువుట మొదలుపెడితే చివరకు వచ్చేవరకు విడువ బుద్ధి వేయదు. ఆనాటి సాంఘిక పరిస్థితులు ఈ పుస్తకంలో తెలిసికొన్నట్లు, నే నెచ్చటను తెలిసికొనలేదు" అని సెల విచ్చారు.

శ్రీ కె. వి. గోపాలస్వామిగారు, "మీ జీవితచరిత్రను ఏకాఏకిని పూర్తిగా చదివాను. చాలా ఉత్తమ రచన" అని అభివర్ణించారు.

శ్రీ సి. నరసింహంగారు హైదరాబాదు నుండి వ్రాస్తూ, "మీ పుస్తకాన్ని మొదటిపేజీ నుండి, చివరిపేజీ వరకు చదివాను. భాష సరళంగా, స్వేచ్ఛా ప్రవాహంవలె వుండినది. ఇది గత అర్ధశతాబ్దమునుండి మనవారి భావాలు, నమ్మకాలు, అభిమానాలు, విలువలు, సాంఘికాచారాలు, అలవాట్లు తెలుపుతుంది" అని విస్తరించి వ్రాశారు.

విజయవాడ నుండి శ్రీ హెచ్. ఆర్. కామోజీరావుగారు వ్రాస్తూ, "75 సంవత్సరాలకు పూర్వపు కమ్మవారి కుటుంబ, సాంఘిక, వ్యవహార సంప్రదాయములు చక్కగా తెలియపరచినారు" అని తెలియపరిచారు.

ఆబాల్యమిత్రుడు శ్రీ పండిత గొర్రెపాటి వెంకట సుబ్బయ్య గారు ఘంటసాల నుండి వ్రాస్తూ, "ఈపుస్తక మంతా మీ సిన్సియారిటీని తెలుపుచున్నది. మీ గొప్పతన మెక్కడ పోతుందో అని మీరు ఏ చాటు మాటు కార్యాలను వివరించక విడిచింది లేదు. నేను చదివినంత వరకు ఈధోరణిలో వ్రాసిన గ్రంథం యిది ఒకటియే ననుకుంటాను. ఈమాదిరిగా వ్రాయటానికి ఎంతో నిజాయితీ, గుండె నిబ్బరం అవసరం. మీ రెంతో స్నేహ శీలురని, విషయ పరిజ్ఞానులని, సహృదయులని ఈ రచన ద్వారా విదితమైనది" అని విదీర్ఘంగానే వ్రాశారు.

రైతు పెద్ద, అన్నగారు అని నావంటి చాలామందితో సంబోధింపబడేవారు, గౌరవింపబడేవారు శ్రీ గొట్టిపాటి బ్రహ్మయ్యగారు, "మీ స్వవిషయం పూర్తిగా చదివి, ఆనందించాను. అరమర లేని, చాటుమాటు లేని రచన మీది. ఇంతవరకు ఎవ్వరూ యిట్లు వ్రాయలేదేమో. విషయసమగ్రత కలదు. భాష బాగున్నది. చివర కంటా ఉత్సాహంగా చదివించింది. మీ జ్ఞాపక శక్తిని ప్రశంసిస్తున్నాను" మొదలైన ప్రశంసావాక్యాలు వ్రాశారు.

ఏలూరు నుండి శ్రీ వెలగా వెంకటప్పయ్యగారు వ్రాస్తూ, "చెప్పదలచుకొన్నది సూటిగా చెప్పడం, ఇతరు లేమనుకుంటారో అనే పిరికితనం మీలో ఏమాత్రం లేకపోవటం మీ నిర్భీతిని తెలుపుతున్నది. అన్నిటికంటె పుస్తకం ప్రతిపుటలో మీ పర్సనాలిటి, దర్పం కనిపిస్తున్నాయి" అనే అభిప్రాయం వెలిబుచ్చారు.

అడ్వొకేట్ శ్రీ కె. రామచంద్రరావుగారు ఏలూరు నుండి ఇంగ్లీషులో వ్రాస్తూ, "మీరు ఏ కృత్రిమ (ఇన్‌హిబిషన్స్) భయాలకు లోనుగాక స్వేచ్ఛగా, స్వాభావికంగా విషయాన్ని మాత్రమే దృష్టిలో వుంచుకుని ఈ పుస్తకాన్ని వ్రాశారు. సామాన్యంగా జీవితచరిత్రలు తమ గొప్పతనాన్ని తెలుపుకొనుటకు

వ్రాస్తారు. మీ రట్లుగాక విషయాలకే ప్రాముఖ్య మిచ్చారు. వ్యక్తి తా నెట్లుండుట మంచిదో అనిగాక. తా నెట్లున్నాడో తెలియ పరచటం నిజమైన జీవితచరిత్రను వ్రాయటం" అని వక్కాణించారు.

న్యాయమూర్తి శ్రీ ఆవుల సాంబశివరావుగారు వారి హైదరాబాదులోని స్వగృహం 'సాహితి' నుండి ఇంగ్లీషులో వ్రాయుచు, "వివాహ పూర్వకంగా నేను కూడా మీ కుటుంబ సభ్యుడనైన కుటుంబాన్ని గురించి మీరు కొట్టవచ్చినట్లుగా (గ్రాఫిక్) చిత్రించారు. ఆ రోజులలోని సంఘం, దాని పరిస్థితులు, వాతావరణం, ఆచారవ్యవహారాలు, రాజకీయ, సాంఘిక ప్రచారాలు, ఆ కాలంలోని విశిష్టవ్యక్తులను గురించి ఆహ్లాదకరమైన శైలిలో సరళంగా వ్రాశారు"అని సెలవిచ్చారు.

ఏలూరులోని కేంద్ర భూమితనఖా బ్యాంకుకు సారథ్యం వహించి దక్షతతో నడుపుచున్న శ్రీ వేగుంట కనకరామ బ్రహ్మంగారు పట్లూరు నుండి పెద్ద ఉత్తరం వ్రాస్తూ, "సూక్ష్మాతి సూక్ష్మ విషయాలను కూడ వదలక మీ స్వవిషయం వ్రాయుట అమోఘమైన మీ జ్ఞాపకశక్తికి నిదర్శనం. పుస్తకం చదవటం మొదలిడితే చిట్టచివరివరకూ విడవకుండా ఎంతో ఆసక్తితో చదివించే గొప్ప శక్తి మీ కలంలో ఉందనటంలో అసత్యం ఏమీ లేదు. మీరు అతి చిన్న విషయాన్ని కూడా దాచకుండా, అంతా నిజాయితీతో మీ ఆత్మకథను వ్రాయటం చాలా మెచ్చ దగింది. వ్యక్తిలో ఎంతో ఆత్మవిశ్వాసం, మహనీయత, విశ్వ జనీనత వుంటేనేగాని ఆవిధంగా వ్రాయలేడు" అని శ్లాఘించారు.

గోదా గ్రంథమాలను స్థాపించి, కొన్ని సంవత్సరాలనుండి వివిధ గ్రంథాలను ప్రచురిస్తూ అపార సారస్వతసేవ చేయుచున్న విద్యావిశారద శ్రీమాన్ కె. టి. యల్. నరసింహాచార్యులుగారు తమ ఏలూరు మకాం నుండి వ్రాయుచు, "ఇది చేతపట్టగనే ఒక నవలయని తోచినది. శబ్దచిత్రణలు, రూపచిత్రణలు యిందు కొల్లలు. లలితకళాభిజ్ఞత మీలో ఎంతకలదో అంతకు మించినది మీ రచనా ప్రావీణ్యం. మీరు వర్ణచిత్రములను గీయగలరని నేను

అనుకొనను. కాని, చిక్కని శైలితో, చక్కని సువర్ణచిత్రములు వేయగలరు మీరు. చిన్న మాటలలో మీరు మనుష్యుల స్వరూప ములనేగాక స్వభావములనుకూడా చిత్రింపగల దక్షులు. మీ భాష వాడి, మీ భావములు వేడి. మీ శైలి లేడివలె నొకచోట గంతులు వేయును. ఒకచోట గంభీరముగా నడచును. మీరు నవరసములు యిందు గుప్పించి వదలినారు" అని పలువిధ అంశా లను తడివి ప్రశంసాపూర్వకంగా వ్రాశారు.

సమీక్షాదక్షుడు, శ్రీ సంజీవదేవ్ గారు వారి స్వగ్రామం తుమ్మపూడినుండి ప్రశంసాపూర్వక దీర్ఘలేఖను వ్రాశారు. వారు వ్రాసినదానిలో కొన్ని వాక్యాలు తెలియపరచుచున్నాను.

"మీ రచన 'స్వవిషయం' చదివిన తర్వాత మిమ్ములను ప్రశంసించకుండా వుండలేను. తెలుగులో వున్నవి కొద్ది స్వీయ చరిత్రలు. వాటిలో మంచివి మరీ కొద్దిమాత్రమే వున్నాయి. ఆ కొద్దివాటిలో మీ దొకటి. మీ స్వీయచరిత్రలోని విశిష్టత ఏమంటే అందులోని అన్ని ప్రకరణములు కూడా సమానంగా బాగున్నాయి. కొందరు వాటిల్లో కొన్నిదశలు మాత్రమే బాగుంటాయి. కాని, మీదానిలో అన్నిదశలు కూడా పాఠకునికి ఆకర్షణీయంగా వున్నాయి. స్వీయచరిత్రలు ప్రధా నంగా రెండు విధాలు: 1. ఘటనా ప్రాధాన్యంకలది 2. ఆలోచనా ప్రాధాన్యంకలది. మరి మీ స్వీయచరిత్రలో ఘటనా ప్రాధాన్యత, ఆలోచనా ప్రాధాన్యత రెండూ వున్నాయని చెప్పటం అతిశయోక్తికాని, ముఖస్తుతికాని కాదు. యథార్థం పలుకటమే అవుతుంది అందుకు మీకు హార్దిక ధన్యవా దాలు — అభినందనలు" అని వ్రాశారు.

గుడివాడ నుండి శ్రీ నూతులపాటి రాఘవరావు, యమ్. ఎ. గారు వ్రాయుచు, "స్వవిషయం"లో పాఠకుడు తన విషయం చూచుకొని ఆత్మీయతానుభూతిని పొందగలడు. ఈ శతాబ్ద ప్రారంభంలో మనప్రాంతంలో రైతుకుటుంబాల అర్థబలం, అంగబలం, రాజసం, మాటకారితనం, ఆతిథ్యం, సమిష్టికుటుంబవ్యవస్థ, స్త్రీల ఆప్యాయత, సహనం, గుట్టు-బెట్టు,

పట్టుదల, ఆచారప్రియత్వం, అమాయకత్వం ఎన్నెన్నో శరపరంపరగ పరిపూర్ణరూపంలో చిత్రించారు మీరు. మన రైతు కుటుంబస్థితుల్ని యింత పుష్టిగ తీర్చిన స్వీయచరిత్రను నేను చదువలేదు” అని తమ అభిప్రాయాన్ని తెలియబర్చారు.

అభినవ తిక్కన, కళాప్రపూర్ణ శ్రీ తుమ్మల సీతారామమూర్తిగారు, “నేను మీ ‘స్వవిషయము’ ప్రథమ భాగమునగల ప్రత్యక్షరమును చదివితిని. ఈ భాగమునందు మన పల్లెల గుణదోషములు, కమ్మవారి నడవడి సొగసులు, సత్యమును చెప్పుటకు జంకని మీ గుణవత్తనము, పాశ్చాత్య సభ్యత యందలి రహస్యములు హెచ్చుగా నుండుటచే నే నీ పరనమున కాసపడితిని. ఆధునిక రచనలలో నన్ను సమగ్రముగా చదివించిన రచన, మీ యీ గ్రంథ మొక్కటియె” అని వ్రాశారు.

కొంతమంది అభిమానులు, మిత్రులు ప్రశంసాపద్యాలు పంపారు. వాని నన్నిటిని యిక్కడ ఏకరువుపెట్టలేను. పంపిన వారిలో నా పినతల్లి కుమారుడు, ఆత్మీయుడు శ్రీ కోగంటి దుర్గామల్లికార్జునరావు ఒకరు. వారు చాలా కంద పద్యాలు, గేయాలు పంపారు. వానిలో ఒకటి, రెం డుదహరిస్తాను :

కం. చదివితి మీ స్వవిషయమును
చదువంగాఁ గల్గె నాకు సంతస మెంతో
చదువఁగ మొదలిడి యున్నన్
చదువక విడువంగ లేఁడు చదువరి యెవఁడేన్.

కం. సత్యము దాపని వాఁడవు
సత్యము దాచెడి ప్రముఖులు జగతి ననేకుల్
సత్యము దాపక యుండిన
సత్యాంత శుభంబు గల్గు నవనీస్థలిలో.

కం. కవి నేకా దని యందువు
కవిగాని యతండు వ్రాయగలడా యిట్టుల్ ?
కవి గా నని వాకొన్నను
కవివే యని చెప్పగలనుఁ గడు ధైర్యమునన్.

కం. పద్యము వ్రాసినఁ గవి యని
పద్యములను వ్రాయువారు పలికిరి తొలుతన్
పద్యము వ్రాయకపోయిన
గద్యమె వ్రాసిననుఁ నేడు కవియే యయ్యెన్.

అని ఈవిధముగా 'తారహారము' అను పేరుతో కొన్ని పద్యాలను వ్రాసి పంపాడు. ఇవిగాక యింకా చాలా పద్యాలు పంపాడుగాని, వాని నిక్కడ పేర్కొనట మనవసరం.

పాముఱ్ఱు భారతీ సమితివారి ఆస్థానకవి, కవిరత్న శ్రీ కోడూరి శ్రీరాములుగారు ఈ 'స్వవిషయము'ను గురించి కూడా పద్యపూర్వకమైన శ్లాఘాపత్రం పంపించారు. అందులో కొన్ని యీ క్రిందివి:

కం. వ్యవహారపు మాటలతో
గవిత్వ మొనరించినావు క్రమముగ గద్యం
బవురా! స్వవిషయ మందున
అవకాశము లేదసత్య మనుటకు మిత్రా.

కం. పరదేశ హూణ యువతుల
సరస విలాసంబు లన్ని చక్కగ తెలియన్
వరుసగ చెప్పితి వనఘా!
సరసుండవు గొనుము నాదు శతవందనముల్.

ఉ. భారతభూమియందు, నలువైపులనుండియు పండితాళి యిం
పారగ నిన్ను మెచ్చెదరు, హాయినిఁ గూర్చు మృదూక్తులెల్ల, వె
ల్వారగ గద్యరూపమున వర్ధిలఁ జేసి రటంచుఁ, గంటి, మీ
నేరుపు మీదు లేఖిని వినీతచరిత్ర! జయంబు నందుమా!

మ. స్థిరసంకల్పుడు, నున్నతాశయుడు, భక్తిజ్ఞాన పూర్ణుండు, భా
సుర విజ్ఞానధనుం డటంచు ఘనతన్ శోభిల్లి సంఘాన నం
దరకు న్మేలొనరించు సాధుమతివై, ధన్యాత్మవై మించు శ్రీ
కర భాగ్యోదయ! వీరభద్రదయ! నమస్కారంబు గైకోగదే!

కవిరత్న శ్రీ మల్లంపల్లి రామలింగేశ్వరశర్మగారు పంపిన పద్యాలలో మచ్చుకు నాలుగు పేర్కొంటున్నాను.

ఉ. భావము రంజిలంగ నొకపాటి చరిత్ర రచింప మేలగున్,
నీవలె నొక్కరుం గలరె నిత్యనవీనవచోధురంధరుల్ ?
పావనమైన మీ చరిత పథ్యము, భావికలార్థ సేవ్యమై,
తావక భావనాపటిమ ధన్యము లింగము వీరభద్రయా !

చం. గురువుల మన్ననంబడసి, కూరిమి మిత్రుల ప్రాపుఁగాంచి, ధీ
పరిణతి నుల్లసిల్లి, శుభవర్తన మొప్పగ నుల్లసిల్లి, సం
సరణ ఫలంబులం బడసి, సజ్జన సంగతిఁ గాంచి వాఙ్మయా
భిరతిమెయి రచించితు నిజవృత్తము, లింగము వీరభద్రయా!

ఉ. కష్టపరంపరల్ బహుముఖంబుగఁ గ్రమ్మగ నోర్చి ధీరతా
విష్ట మనస్కతన్, నయ వివేక పటిష్ఠతఁ బొల్చితీవు నీ
యిష్టజనంబు పొంగగ నభీప్సిత జీవితవృత్త మొప్పగాఁ
బుష్టియుఁ దుష్టియు న్వెలయఁ బూర్ణతఁ గాంచుము వీరభద్రయా!

శా. ఆ పాశ్చాత్య విధానము న్దెలిసి, నవ్యారంభమై, హూణ వి
ద్యా పారీణత శోభిలన్, స్వవిషయ వ్యాసంగ పారీణతన్
మీ పాండిత్యము, మీకలానుభవమున్, మేలౌ వచ
స్సారమున్
దీపింపన్ వెలయించితీవు నిజసందేశంబుఁ మోదంబునన్.

మధురకవి శ్రీ వారణాసి లక్ష్మీనారాయణగారు వ్రాసి పంపిన పద్యాలలో మచ్చుకొకదాని నిక్కడ చేరుస్తున్నాను.

గీ. "స్వవిషయం" బను గ్రంథంబు, సంకలనము
సేయునెడ వీరభద్రుండు స్వీయచరిత
మెంతయో రమ్యముగురీతి, యెల్లరకును
విడువకుండంగ చదువంగ, వేడ్కగలుగు
చందమున సరళంబగు శైలి గూఢ
విషయములగూడ వదలక విశదపరచి
చదువరుల మానసంబులు సంచలింప
వ్రాసి విఖ్యాతి వడసెను వాని రామ
చంద్రు డాయు రారోగ్యము లొసంగి, సర్వ
కాలముల రక్షణము సేయుఁగాత జగతి.

గత సంవత్సరం (1973) నవంబరు 6 వ తారీఖున ఇంగ్లీషు దినపత్రిక ఇండియన్ ఎక్స్‌ప్రెస్‌లో శ్రీ చుండి జగన్నాథంగారు వ్రాయుచు, "ఇది (స్వవిషయం) మంచి యాదాస్తు పుస్తకం. (నోట్ బుక్) గ్రంథకర్త తన యౌవనంనుండి ఇంచు మించు యిప్పటివరకు, ఈ శతాబ్దంలో ఏడు దశాబ్దాల తన జీవిత యాత్రను పాఠకులకు తెలియజెప్పారు. ఈ కాలంలో సారస్వత, విద్యాసంబంధ, సాంఘిక, రాజకీయాభివృద్ధికి తోడ్పడిన ప్రముఖ వ్యక్తులు తెరమీద నడయాడారు. అప్పటి ఇండియాలో వెల్లు బికిన దివ్యమైన పునరుద్ధరణ (రినైసాన్స్) కార్య కలాపాల నీ గవాక్షమునుండి చూడనగును. అనిబిసెంటునుండి, రామ కోటేశ్వరరావువరకూ దారిలో ప్రత్యక్షమౌతారు. సాంఘిక సంస్కరణకు పునాదులు వేసినవారు ప్రత్యేకించి పేర్కొన బడినారు" అని వ్యాఖ్యానించారు.

ఆంధ్రపత్రిక దినపత్రికలో 16-2-1974 వ తారీఖున ఈ ప్రథమభాగాన్ని శ్రీ నాగళ్ల గురుప్రసాదరావుగారు సమీక్షిస్తూ వ్రాసిన వాక్యాలలో కొన్నిటిని యిక్కడ తెలియబరుస్తాను. "దీనిలో ఆయన కేవలం స్వీయచరిత్రనే వ్రాయలేదు. నిజ జీవితంలో తారసిల్లిన బంధువులనుగూర్చి, వ్యక్తులనుగూర్చి, దేశ రాజకీయాలనుగూర్చి, జాతీయ నాయకులనుగూర్చి, ఎక్కువ మోతాదులో వ్రాశారు. పంధొమ్మిదవ శతాబ్దం చివరి దశాబ్దంనుండి ఇరవయ్యో శతాబ్దం మొదటి పాదందాకా, తెలుగు దేశంలో మోతుబరి రైతు కుటుంబాలు ఎట్లా వుండేవో, ఆ కుటుంబాల పిల్లలు విద్యార్జన చేయాలంటే ఎంత కష్టపడే వారో, ఆ కాలంలో భారతదేశంలో వస్తున్న సాంఘిక, రాజకీయ పరిణామాలు ఎట్లాంటివో తెలుసుకోవాలనేవారు తప్పకుండా వీరభద్రయ్య చౌదరిగారి జీవితచరిత్ర చదవాలి. స్వీయచరిత్ర వ్రాసేవారికి చిత్తశుద్ధి, ఆర్జవమూ వుండాలి. వారు రాగ ద్వేషాలకు అతీతులై వుండాలి. వ్యక్తులనుగూర్చి, సన్ని వేశాలనుగూర్చి వ్రాసేటప్పుడు మొగమాటం పనికిరాదు. ఇతరుల నేకాక, తన గుణదోషాలను చాటే నైతిక సాహసం వుండాలి.

ఈ లక్షణాలన్నీ వీరభద్రయ్య చౌదరిగారిలో పుష్కలంగా ఉన్నయ్. ఆకార శీల స్వభావాల్ని చిత్రించారు. వారంత కళ్లకుకట్టేటట్లు వర్ణించే నేర్పు చౌదరిగారిలో చాలా ఎక్కువ. ఈ రూపంగా చూస్తే, ఈ గ్రంథానికి ఎంతో చారిత్రిక ప్రాధాన్యంవుంది. ఆంధ్రదేశ చరిత్ర వ్రాసేవారు, ఇతర పరిశోధనలు చేసేవారు, తప్పక ఈ పుస్తకాన్ని పఠించాలి" అన్నారు. ఈ విధముగా ఈ "స్వవిషయం" మొదటి భాగం నాకు మెప్పులను సంపాదించి పెట్టింది.

శ్రీ కోగంటి దుర్గామల్లికార్జునరావు, మిత్రులు శ్రీ కోడూరి శ్రీరాములువంటివారు భారతీసమితి తరఫున మీకు గుడివాడలో సన్మానం చేస్తాం, బిరుదునిస్తాం, ఒక తేదీని నిర్ణయించండని నన్ను కోరారు. నాకు సన్మాన మెందుకు, బిరుదంటే నా కిష్టంలేదు అని చెప్పాను. కాదుకూడదని నాతమ్ముడు శ్రీ మల్లికార్జునరావు పట్టుబట్టాడు. శ్రీరాములుగారివంటివారి అభ్యర్థనకూడా వత్తిడి చేసింది. అందువల్ల తప్పనిసరికి ఏదో తారీఖు మీరే నిర్ణయించండనగా 1973 సెప్టెంబరు 17-వ తారీఖున గుడివాడ మెడికల్ అసోసియేషన్ హాలులో సన్మానం, బిరుదుప్రదానం వుంటుందన్నారు. ఏమి బిరుదు అని అడిగాను. మావాడు "కవిపోషక" అన్నాడు. ఒకనాడు కవిపోషక బిరుదు మీకు, మర్నాడు శ్రీ శివశంకరస్వామి (శ్రీ తల్లావఝ్ఝల శివశంకర శాస్త్రి) గారికి కవిరాజశేఖర బిరుదు ప్రదానం చేస్తాం అని చెప్పాడు. శ్రీ శివశంకరస్వామివారికి ఏ బిరుదిచ్చినా మహా పండితకవులు వారికి సరిపోతుంది. నావంటి సామాన్య రచయితకు ఏ బిరుదైనా అనవసరం. అయినా, నే నే కవిని పోషిస్తున్నానని నాకు కవిపోషకుడని బిరుదిస్తారు అని అడిగాను. తికమకపడగా, పోనీ నేను వ్యాసాలు బాగా వ్రాస్తానని వారు, వీరు అంటున్నారు కదా, తత్సంబంధముగా ఏదైనా బిరుదిస్తే సవ్యంగా వుంటుంది

అన్నాను. సరే, అని శ్రీ మల్లికార్జునరావు వెళ్ళిపోయి, తన మిత్రులతో ఆలోచించి వ్యాసరచనాసంబంధమైన నాలుగు వాక్యాలు సూచించాడు. 'వ్యాసరచనాధురీణ,' 'వ్యాసరచనా ధురంధర,' 'వ్యాసరచనాదక్ష,' 'వ్యాసరచనాప్రవీణ' అని. ధురీణ, ధురంధరవంటివి నా స్థాయికి హెచ్చని నాకు తోచి, ప్రవీణ అంటే సరిపోతుందని జవా బిచ్చాను.

పై జెప్పినట్లు 17-వ తేదీ సెప్టెంబరు (1973) న మెడికల్ అసోసియేషన్ హాలులో జరిగిన సభకు గుడివాడ నాగేశ్వరరావు కాలేజి ప్రిన్సిపాల్ శ్రీ యెర్నేని వెంకటేశ్వరరావుగారు అధ్యక్షత వహించారు. వారు గ్రంథాన్ని గురించి, నన్ను గురించి ప్రశంసా వాక్యాలు మాట్లాడి ఆ పుస్తకాన్ని ఆవిష్కరించారు. భారతీ సమితి తరఫున నన్ను శ్రీ కోగంటి దుర్గామల్లికార్జునరావు, కోడూరి శ్రీరాములుగార్లు ఆహ్వానించారు. శ్రీ వేదం రామప్రభువు, యమ్. ఎ. యల్. టి., ప్రముఖ న్యాయవాది శ్రీ త్రిపురనేని శివప్రసాదరావు, శ్రీ గడ్డమణుగు సీతారామాంజనేయులువంటి పెద్దలు వచ్చారు. శ్రీ వారణాసి లక్ష్మీనారాయణ, శ్రీ విద్వాన్ సుంకర శివరామయ్య, డా. మహేశ్వర సుందరరామయ్య, కవి రత్న శ్రీ మల్లంపల్లి రామలింగేశ్వరశర్మ, మధురకవి శ్రీ కాకాని నరసింహారావు, శ్రీమతి పిండికంటి అన్నపూర్ణమ్మ, డా. అట్లూరి వీరరాఘవయ్యగారు, శ్రీమతి ఇవటూరి మాణిక్యాంబ, కవిరత్న శ్రీ కోడూరి శ్రీరాములుగారు ప్రశంసా వాక్యాలు మాట్లాడారు.

నాయందు అభిమానంగల కాకాని నరసింహారావుగారు శ్రోత్రానందంగా ఆ పద్యాలు ఈ పద్యాలు చదివారు. వచ్చిన ప్రేక్షకులు కొలదిమందైనా ఆ సన్మానసభ జయప్రదంగానే జరిగిం దనుకొన్నాను. నాకు నూత్నవస్త్రాలు బహూకరించి "వ్యాస రచనాప్రవీణ" అనే బిరుదును ప్రసాదించారు. నేను నా కృత జ్ఞతాపూర్వక ఉపన్యాసంలో, చాలామంది అపోహ పడినట్లు నాజ్ఞాపకశక్తి గొప్పది కాదని, నే నేరహస్యాలను వెల్లడించ లేదని గట్టిగా చెప్పాను. నేను ఏ దినచర్యను వ్రాసుకోకపోయినా, దాని



గుడివాడలో 17-9-1973 తారీఖున గ్రంథకర్తకు జరిగిన సన్మాన సందర్భంగా

కూర్చున్నవారు - ఎడమనుండి : 1. శ్రీమతి పిండికంటి అన్నపూర్ణమ్మ, 2. శ్రీ వేదము రామప్రభువు, 3. శ్రీ యెర్నేని వెంకటేశ్వరరావు
4. గ్రంథకర్త, 5. శ్రీ కోగంటి దుర్గామల్లికార్జునరావు

నిల్చున్నవారు - ఎడమనుండి : 1. శ్రీ మల్లంపల్లి రామలింగేశ్వరశర్మ, 2. శ్రీ వారణాసి లక్ష్మీనారాయణ, 3. శ్రీ పోసాన శేషగిరిరావు
4. శ్రీ కోడూరి శ్రీరాములు, 5. శ్రీ సుంకర శివరామయ్య

సహాయాన్ని పొందకపోయినా, అక్కడా ముక్క, యిక్కడా ముక్క, అక్కడొక యద్దెను, ఇక్కడొక యద్దెను వ్రాసుకొని యున్నవానినిబట్టి కొంతవరకైనా జ్ఞప్తికి తెచ్చుకొన్నాను. చిన్నతనంలో జరిగిన సంఘటనలు మెదడుమీద ముద్రవేస్తవంటారు. ఆ విధంగా నా కౌమార, యౌవన దశలలో జరిగినవి గుర్తుండినవి. పైగా నాకుకొన్ని విషయాలలో ఆసక్తి ఎక్కువ. అవి మనస్సుకు హత్తుకుని పోయినవి. మరిన్ని, నేను మననం చేసుకునే స్వభావం కలవాడను. నెమరు వేసుకుంటూంటాను. అందువల్ల యీ చిన్ననాటి సంగతులన్నీ వ్రాయగలిగాను. అంతేగాని, నా జ్ఞాపకశక్తి సర్వ సామాన్యం. అందులో, పేర్లు నేను చప్పున మర్చిపోతూంటాను. అని ఒక ఉదాహరణ చెప్తాను. నేనింగ్లండులో చదువుకొను చున్నప్పుడు ఆ కాలేజిసహాధ్యాయి, తర్వాత మన ఆంధ్ర ప్రభుత్వం చీఫ్ సెక్రటరీగా పనిచేసిన ఉన్నితన్ అనే ఐ. సి. యస్. ఆఫీసరుగారి పేరొకసారి మా కాలేజిలో అడిగాను. 2, 3 రోజులకు వారు తిరిగి కనపడగా మరల అడిగాను. అప్పటికీ మరచిపోయి, 3, 4 రోజుల కింకొకసారి అడిగాను. నేను చెప్పను పొమ్మన్నారు. అని చెప్తాను. ఇక ఏవో చెప్పకూడని రహస్యాలను ఈ పుస్తకంలో బయలు పరచానని అభిప్రాయపడటం పొరపాటౌతుంది. నేనే దొంగతనాలు చేయలేదు. ఏ త్రాగుడుకు అలవాటు పడలేదు, జూదగాడినికాలేదు, ఎవరినీ హింసించలేదు, చంపలేదు, పరపత్నిని ఆశించలేదు. దొంగతనాలు, హత్యలు చేసియుండి, త్రాగుబోతుదనం, జూదగొండితనం అలవర్చుకొనియుండి వానిని ధైర్యంగా బయటపెట్టితే, ఎంత ధైర్యవంతుడు, సాహసవంతుడు, ప్రభుత్వ శిక్షకుకూడా భయపడకుండా తన నేరాలను ఒప్పుకున్నాడని మీరు మనస్సులో కలిగిన అసహ్యాన్ని అణచుకొని, అభినందించవచ్చును. కాని, నేనట్టివేమియును చేసియుండ లేదుకదా. నేను చెప్పినదల్లా బాల్య, కౌమారదశలలోని చిలిపితనాలు, వయసులోని కొంటెపనులేకదా. మానవునికేగాక సకల జంతు

జాలానికి స్వభావసిద్ధమైన మైధునం తప్పుగా ఎంచవలసినదికాదు. ప్రకృతి సహజమైన మైధునవాంఛ పైకి పెల్లుబికి రావటం, యువతీ యువకుల కందరికినీ సహజమే. ముఖ్యంగా ఈ రోజుల్లో, నేను చిన్నప్పుడుచేసి, యిప్పుడు వ్రాసిన ఈ చిన్న చిన్న విషయాలు, ప్రాముఖ్య మివ్వవలసినవి కావు. వానిని చెప్పి నంతమాత్రాన నే నేదో ఘనకార్యం చేశానని మీ రనుకోన గూడదు. నేను సామాన్య వ్యక్తినేగాని, గొప్పవాడను మాత్రం కాదని గట్టిగా చెప్పాను. నాకు సన్మానం జరిపి, బిరుదు ప్రదానంచేసి, నన్ను గౌరవించిన పామర్రు భారతీ సమితివారికి కృతజ్ఞతాపూర్వక వందనములు తెల్పాను.

ఇక రెండవ భాగాన్ని గురించి ఇతరుల అభిప్రాయాలు, ప్రశంసావాక్యాలు వ్రాస్తున్నాను. శ్రీ సంజీవ దేవ్ గారు "మీ 'స్వవిషయం' మొదటిభాగం ఒక ప్రత్యేకతకలది, రెండవ భాగం వేరే ప్రత్యేకతకలది. ఇది ప్రధానంగా వ్యక్తులకూ, స్థలాలకు చెందిన గ్రంథం. విశ్వవిఖ్యాత దార్శనికుడు, స్వర్గీయ జార్జి శాంతాయన తన స్వీయచరిత్ర రెండవ భాగానికి "వ్యక్తులు-ప్రదేశాలు" అని పేరుపెట్టినారు. మీ రెండవ భాగానికి అటు వంటి పేరు పెట్టకపోయినాకూడ, విషయం మాత్రం అదే. ఆయన గ్రంథాన్ని మీరు చూడనప్పటికీ, మీ ద్వితీయ భాగానికి, ఆయన ద్వితీయ భాగానికీ విషయ వివరణలో సమన్వయం ఏర్పడటం, చాలా విచిత్రమైన విషయం... మానవుల వింత స్వభావాలను ఎన్నో చిత్రించారు మీ గ్రంథంలో. సాహితీ ప్రతిభ ఏ మాత్రం తక్కువగావున్న రచయిత ఆ విధంగా రచిస్తే, అది చాలా విసుగుకలిగించేదిగా వుండేది. కాని, మీ కలం ద్వారా చిత్రించినందువల్ల అందులో ఏ మాత్రమూ విసుగు జనించకపోగా, పైగా అభిరుచికరంగాకూడా వున్నది. ఇదంతా మీ రచనా విధానంలోవున్నది" అని వ్రాశారు. శ్రీ పండిత గొర్రెపాటి వెంకట సుబ్బయ్యగారు "చిత్తశుద్ధితో వ్రాసిన ప్రతి గ్రంథం గొప్పగానే వుంటుంది. మీ గ్రంథంకూడా ఆధోరణిలోనే

నడిచింది. అందుచేత యిదికూడా గొప్పదే. సంస్కృతిని విడనాడ లేదు. మీ పేరన ఇది ఒక సంస్కృతి చరిత్ర. మీరు 'స్వవిషయం' అనుపేరుతో ఎందరెందరి గురించోగాక, ఎన్నో పట్నాలను గురించి, ప్రదేశాలను గురించి పరామర్శించి యున్నారు. ఇందులో మీ లోటు పాటులను గురించి చెప్పుకున్నారు. మీ ఆత్మ గౌరవాన్ని విడలేదు" అని తెల్పారు. న్యాయమూర్తి శ్రీ ఆవుల సాంబశివరావుగారు యింగ్లీషులో వ్రాస్తూ — "మీరు వ్రాసిన ప్రతి వాక్యంలోను, మీ ప్రత్యేక వ్యక్తిత్వ ముద్ర వున్నది. మీ ఉద్యోగ మంతటిలో మీ హుందాతనాన్ని, ఆత్మాభి మానాన్ని నిలబెట్టు కొన్నందులకు నేను మిక్కిలి సంతో షిస్తున్నాను. మీరు ఆక్స్‌ఫర్డ్ విద్యను, పాశ్చాత్య సంస్కారాన్ని పొందినా, మీరు సహజంగా గ్రామీణులు. ఇది నాకు ప్రత్యే కించి ఆహ్లాదాన్ని కల్గిస్తుంది. అందువల్ల మీరు వ్రాసిన ప్రతి వాక్యాన్ని చదివి, సంతోషించాను." అని తమ అభిప్రాయాన్ని తెల్పారు.

శ్రీ సి. నరసింహంగా రింగ్లీషులో వ్రాసిన ఉత్తరంలోని కొన్ని వాక్యాలివి. "రెండవ భాగం మీ ఉద్యోగాను భవాలను, విజ్ఞాన పౌరుడుగా మీ వర్తనను తెల్పుచున్నది. మీ రేవిధంగా జీవితయాత్రను తుఫానువంటి వాతావరణంలో జయప్రదంగా కొనసాగించారో చెప్పుచున్నది. మీ రుద్యోగం చేసిన వివిధ కార్యాలయాలలో మీ వద్ద పనిచేసిన వారందరి పేర్లను, వారి ప్రవర్తనలను, మీరెట్లు జ్ఞప్తియం దుంచుకొన్నారో నా కాశ్చర్యాన్ని కల్గిస్తున్నది. మీ అభిప్రాయాలు న్యాయ ముగా, సమర్థనీయముగా వున్నవి" అని వ్రాశారు. ఏలూరు నుండి యడ్వొకేటు శ్రీ కాసుమిల్లి రామచంద్రరావుగా రింగ్లీషులో వ్రాసి ఈ విధంగా అభిప్రాయపడ్డారు. "నిజం చెప్పాలంటె మీ పుస్తకం చదివి, నేను మిక్కిలి సంతోషంతో ఆశ్చర్య పడ్డాను. మీ ఉద్యోగ సంబంధమైన మామూలు వివరాలు కల్గి మిక్కిలి అనాసక్తంగా, విసుగు కల్గించేదిగా వుంటుందని

తలచాను కాని, చాలా ఉత్సుకతను, ఆహ్లాదాన్ని దాని పఠన కల్గించింది. వివిధ వ్యక్తులను చిత్రించిన మనోహరమైన నవలవలె వున్నది." మద్రాసునుండి డా. చిట్టూరి సత్యనారాయణగారు వ్రాస్తూ, "ఇన్ని చిత్ర విచిత్ర సంఘటనలు యింత స్పష్టంగా వ్రాయగలిగిన మీ కలము చరిత్రాత్మకమైనది. చాలా జాతీయమైన తెలుగులో, యింత జిగి కలుగునట్లు వ్రాయుట అద్భుతమైన విషయము" అని తెల్పారు. ఘంటసాలనుండి విదుషీమణి శ్రీమతి గొర్రెపాటి మహాలక్ష్మమ్మగారు వ్రాస్తూ "స్వవిషయ' మను పేరుతో ఎందరి జీవితాలనో విపులీకరించారు. సామాన్య మానవులందరినీ మీ రచనా ప్రభావముచేత ధీరులుగా, వీరులుగా సృష్టించితిరి. ఏ చిన్న విషయముకూడా దాయకుండా నిష్పక్షపాతముగా రచించితిరి" అని శ్లాఘించారు.

ఆచార్య రంగాగారు వ్రాస్తూ "మీ రెండవభాగాన్ని చదివి, సంతోషించాను. మీరు మీ ఉద్యోగ కాలంలో మీరు వెళ్లియుండిన ప్రదేశాలలో మీకు తటస్థించిన అనేక సజ్జనులను, ఉత్తమ స్త్రీలను, చక్కని బిడ్డలను, క్లబ్బులు, ఉద్యోగస్థులు, వారి స్వభావాలు, చేష్టలు మొదలైనవానిని గురించి తెలియజేశారు. సానుభూతితో వ్రాశారు" అని యింగ్లీషులో తెలియజేశారు. వరంగల్లు సమీపగ్రామం తాటికాయలనుండి శ్రీ పొట్లపల్లి రామారావుగారు సుదీర్ఘ లేఖ వ్రాశారు. అందులోని కొన్ని వాక్యాలిట్లున్నవి. "మీకు తెలియకుండానే, మమ్మల్ని మీ వీపున వేసుకొని త్రిప్పినారు. పోనీయండి, యిదికూడా కొంత లాభమే జరిగింది, యిల్లుకదలని నాబోటివారికి ఉత్తపుణ్యానికి విదేశయాత్ర, స్వదేశయాత్ర రెండు లభించాయి, ధన్యవాదాలు. ఆత్మకథలో కొంత అహం వుంటుంది. అహంతోబాటు మనిషి దగ్గర సరకుండాలి. అట్లాంటిది వుంటే ఆత్మకథ చదువదగ్గదిగా తోస్తుంది. అహం కప్పబడుతుంది. స్పష్టంగా, సహజంగా సాగింది మీ రచన. మునుపు మీ పేరు తెలుసు, ఇప్పుడు మీ ఆత్మ తెలుసు."

గోదా గ్రంథమాల వ్యవస్థాపకులు, ప్రకాశకులు, విద్యా విశారద, సాహిత్యరత్న శ్రీమాన్ కె. టి. యల్. నరసింహా చార్యులుగారు సంక్షిప్త సర్వే అను పేరుతో మిక్కిలి దీర్ఘముగా వ్రాసిన లేఖలోని కొన్ని పంక్తులను మాత్రమే ఉదహరించగలను. "మీరు మీ ఉద్యోగజీవితమున పడిన కష్టసుఖములు యిందు వివరించుటలో పూర్తిగా కృతార్థులైనారు. ఇరవై సంవత్సరము లకు పూర్వము జరిగిన విషయములు తు. చ. తప్పకుండా ఆ రసరీతిలో వ్రాయుట, మీ బోటి ఏ ఒక్కరికో మాత్రమే సాధ్య మైన పని. పైగా, వయస్సుమళ్లిన మీ కిట్టి రచనకు పూనుకొనుట కెంత శ్రమించవలసివచ్చినను ఓర్చుకొని, దీనికి సూర్యాయాన భాగ్యము కలిగించుట ప్రశంసనీయము" అని తెలిపారు.

శ్రీ బెజవాడ గోపాలరెడ్డిగారు ఇంగ్లీషులో వ్రాయుచు, "మీ స్వవిషయం రెండో భాగం, ముఖ్యంగా నెల్లూరును గురించి వ్రాసింది, చదివాను. వివరాలు ఎక్కువగావున్నా, ఆసక్తి దాయకంగా వున్నది. శైలి సులభం, సార్థకం (ఎఫెక్టివ్)" అని తెలిపారు.

శ్రీ గొట్టిపాటి బ్రహ్మయ్యగారు, వారి ఉత్తరంలో, "మొదటి నుండి చివరివరకు సత్వదృష్టితో మీ రచన సాగింది. మీరు ఉద్యోగానికంటె, ఆత్మగౌరవానికి విలువ నిచ్చారు. ఇది జన్మ సంస్కారం. వంశపారంపర్యంగా వచ్చిన సుగుణం" అని వ్రాశారు.

శ్రీ వెలమాటి రమేశచంద్ర చౌదరి ఈ క్రిందివిధంగా తమ అభిప్రాయాన్ని తెలిపారు. "రెండవ భాగ మంతయు, మీ ఉద్యోగజీవితం పూర్తి దినచర్యగా నొప్పుచున్నది. 50 సంవత్సరముల తర్వాత చదువువారికి ఎంత ముచ్చటగా యుండునో! ఆ స్థలములు, వ్యక్తులు, సంఘము, ఆచారములు అన్నియు ప్రస్ఫుటముగా వర్ణింపబడినవి. వీ టన్నిటి మధ్య మీరు మసలుకొన్న విధానం చక్కగా విస్తరించి వ్రాశారు."

శ్రీ యార్లగడ్డ రామకృష్ణప్రసాద్ గారు వ్రాస్తూ, "మీ రెండో భాగం నా బొంబాయి రైలుప్రయాణంలో చదివాను. ప్రయాణం ఒక ప్రేమకలాపం (హనీమూన్) గా మారింది. నా సహచరిణిని అనగా మీ పొత్తమును పూర్తిగా చదివి, ఆస్వాదించినగాని రాత్రి నిద్దురరాలేదు. జీవితములోని సంఘటనల సేకరణ, వ్యక్తుల చిత్రీకరణ, వ్యాసశైలి ఒక దానిని ఒకటి మించిపోయినవి వీటిలో ఎన్నిటిని నేను ఇచట ఉదహరించ గలను! ఎక్కడకు వెళ్లినా, మీరు పై ఆఫీసర్లముందు చూపించిన స్వాతంత్రత, సిర్భీతి శ్లాఘనీయము" అని సెలవిచ్చారు.

డాక్టరు సి. నారాయణరెడ్డిగారు ప్రశంసిస్తూ ఈ క్రింది విధంగా తెలిపారు. "మీ దృష్టిలో అది స్వవిషయమైనా, పాఠకుని దృష్ట్యా, ఆ రోజుల్లో మీరు కలుసుకున్న వ్యక్తుల, దర్శించిన ప్రాంతాల, పండించుకొన్న అనుభవాల సజీవచరిత్ర. ఎక్కడి గంజాము, ఎక్కడి అనంతపురం, ఎక్కడి హైదరాబాదు, ఎక్కడి మద్రాసు! ఉద్యోగరీత్యా మీరు తిరిగిన ప్రాంతాలు, జరిగిన విశేషాలు ఎంతో ఆసక్తికరంగా ఉన్నవి. విషయం రుచికరం. అందులో మీ కథనశైలి మరింత కుతూహలకరం. ఎందరెందరో వ్యక్తుల ప్రాథమిక రేఖలను దర్శించుకో గలిగాను. ఎన్నెన్నో మౌలిక, స్థానిక విశేషాలను తెలుసుకోగలిగాను. చాలా సంతోషం. మీ అనుభవాలను, జ్ఞాపకాలను అక్షరాకృతిలో "భద్ర" పరచడం, మీ పేరులోనే ఆ గుణ ముంది కదా!"

శ్రీ వి. యస్. అవధానిగారు ఆంధ్ర దినపత్రికలో సమీక్షిస్తూ, "మనుష్యుల జీవిత చరిత్రయే ఒక జాతి జీవితచరిత్ర. మనుష్యుల జీవితాలలో అనేక సంఘటనలు, అనేక కారణాలవల్ల వెలుగులోకి రాకుండా మరుగుపడతాయ్. అట్టి విశేషాలను వెలుగులోకి వస్తునిష్టంగా తీసుకువచ్చే దీ నవల" అంటూ ఓక చారిత్రక శాస్త్రవేత్త. 371 పుట లున్న యీ గ్రంథానికి చక్కగా వర్తిస్తుంది పైన ఉదహరించిన నిర్వచనం. కారణం, తన జీవితాన్ని, తనే సింహావలోకనం చేసుకోవడం. మరొక విశేషం, కావ్యలక్షణా లున్నాయ్ ఈ రచనలో. కేవలం సొంత గొడవను, సొంత వ్యవహారాలను చెబుతూ, కొంత భూగోళ

శాస్త్రం, మరికొంత చరిత్ర చెప్పారు ఈ రచయిత. వాక్యాలలో సాహిత్య పటిమ స్ఫురింపజేశారు. అట్లా అని, ఇనుప గుగ్గిళ్లవంటి పదాలను, దీర్ఘ సమాసాలను ప్రయోగించలేదు. పాశ్చాత్య నాగరికత, సంస్కారాలను ఆకళింపుజేసుకున్న తెలుగు మేధావి ఉపయోగించదగు సులభశైలిని ఉపయోగించారు శ్రీ చౌదరి. వీరి రచన కేవలం కథనంమాత్రమే కాక, వ్యంగ్యోక్తులు, ధ్వని, చమత్కృతి ఉన్నాయ్ '' అని వ్రాశారు.

శ్రీ చుండి జగన్నాథంగారు ఇంగ్లీషు ఇండియన్ ఎక్స్‌ప్రెస్‌లో వ్రాయుచు, ''తన ఇన్‌కమ్‌టాక్స్ డిపార్ట్‌మెంటు ఉద్యోగనిర్వహణలో అనేక రకాల మనుష్యులను ఉద్యోగరీత్యా కలసికొన్నారు. తన ఉన్నత పాశ్చాత్యవిద్య, బారిష్టర్ పట్టాను పొందటం తన కెట్టి ఆటంకాన్ని కలిగించలేకపోయినవట. సూతపురాణం ఖ్యాతి కవిరాజు మొదలు రైల్వే యూనియన్ ఖ్యాతి శ్రీ వి. వి. గిరి వరకు ఈ పుస్తకంలో కనపడతారు. మొదటి భాగంవలె, ఈ భాగం కూడా గత శతాబ్దం, ఈ శతాబ్దంలో కొన్ని దశాబ్దాలు అవిభక్త మద్రాసు రాష్ట్రం సాంఘిక జీవనాన్ని తెలుపుతుంది. చెప్పిన రీతి అభిరుచికరంగా వున్నది. ఉద్యోగులు, ఈతరం యువకులు ఈ పుస్తకపఠనం వల్ల లాభం పొందగలరు'' అని అభిప్రాయం వెలిబుచ్చారు.

దీనిని, పామర్రు భారతీ సమితివారు గుడివాడలో శ్రీ వేదము రామప్రభువుగారి అధ్యక్షతన ఆవిష్కరించారు. అధ్యులు, శ్రీ మల్లంపల్లి రామలింగేశ్వరశర్మ, శ్రీ కోడూరి శ్రీరాములు, శ్రీ బూసాని చిన వీరయ్య, డాక్టర్ కాళ్లకూరి సీతారామయ్య, శ్రీమతి పిండికంటి అన్నపూర్ణమ్మ, శ్రీ బొడ్డపాటి లక్ష్మీ సుబ్బారావు, శ్రీ అరవిందానంద హరిజన్ అవధూత, శ్రీ కోగంటి దుర్గామల్లికార్జునరావు ప్రశంసావాక్యాలు పలికారు.

ఆ సందర్భంలో శ్రీ మల్లంపల్లి రామలింగేశ్వరశర్మగారు చదివిన పద్యాలలో రెండు పద్యాల నిక్కడ తెలుపుచున్నాను:

ఉ. తావక భావనా మృదు పద ప్రభుతావిభవంబు సూడ మో
దావహ మెన్న, మీ స్వవిషయంబుఁ గనుంగొనుభాగ్య
మబ్బె నో

పావనశీల ! యిప్పగిది వాస్తవతా పరిశీలనక్రమం
భావహీలన్, నిజంబు, మనయాంధ్రము పెంపువహింపకుండునే!

కం. సదమలమతి ! మాది కిం పగు
ప్రదేశముల సాధుజనుల రమ్యాచరిత్రల్
మృదు మధుర వచస్సరణిన్
విదితం బొనరించి తీవు వెలయుమ సతమున్.

శ్రీ కోగంటి దుర్గామల్లికార్జునరావు అంతకుముందు కొన్ని ప్రశంసా పద్యాలు పంపారు. వానిలోనుండి :

సీ. పట్టణంబులఁగూర్చి, పల్లియలను గూర్చి
తెల్పినాడవుకదా తేటగాఁగ
ఉపకారులనుఁ గూర్చి, యపకారులను గూర్చి
తెల్పినాడవుకదా తేటగాఁగ
బంధుజనులఁ గూర్చి, పైవారలను గూర్చి
తెల్పినాడవుకదా తేటగాఁగ
పండుకప్పను గూర్చి, పత్తివేటను గూర్చి,
తెల్పినాడవుకదా తేటగాఁగ

తే. ప్రేమతోడను రండంచు బిల్వఁజేసి
స్వగృహమున నన్నమిడినట్టి వారిఁ గూర్చి
తెల్పినాడవుకద నీవు తేటగాఁగ
అంజలింతును వీరభద్రాగ్రజాత !

కం. చదువుచునుండిన యప్పుడు
ఇది నవలా యనెడి భావ మించుకయైనన్
ఒదవక పోవదు చదువరి
కిది ముమ్మాటికి యథార్థ మిద్ధచరిత్రా !

ఇక మిగిలింది ఈ మూడవ భాగం. దీనిని త్వరలో ప్రచురింపజేయటమే నా యిప్పటి ధ్యేయం. దీని ముద్రణ పూర్తియై పాఠకుల చేతి కందిన తర్వాతనే, నే నింకా ఏదైనా వ్రాయటానికి, ముద్రింపించటానికి పూనుకొనేది. అంతయు దైవాభీష్టం. మానవుని చేతిలో ఏమున్నది !

# ౧

## బంధువులు - మిత్రులు

ఎ. బంధువులు : బంధువులని సామాన్యార్థమున ఉపయోగించుచున్నాను. తల్లిదండ్రుల బిడ్డలు, జ్ఞాతులైన తండ్రి అన్నదమ్ముల కుటుంబాలవారు, తల్లితరఫువా రందరు, నా బిడ్డలు ఈ శీర్షిక క్రింద వస్తారు.

మా తండ్రికి మూడు వివాహాలు. వారి మొదటి భార్య గుడివాడ తాలూకా పెయ్యేరు గ్రామస్థులు దుక్కిపాటి జగన్నాథంగారి పెద్దకుమార్తె శేషమ్మగారు. ఆమె ఒక ఆడపిల్లను కని పురిట్లోనే మరణించింది. ఆ బిడ్డపేరు అన్నపూర్ణమ్మ. ఆమెకు 7, 8 సంవత్సరాల వయస్సు వచ్చీ రాక మునుపే, మా తల్లి పున్నమ్మగారి సోదరుడు గుడివాడ తాలూకా అంగలూరు గ్రామ వాస్తవ్యుడు త్రిపురనేని రామశాస్త్రులుగారి కిచ్చి మా తండ్రి వివాహంచేశాడు. శేషమ్మగారి మొదటి చెల్లెలు చంద్రమ్మగారిని గుడివాడ తాలూకా డోకిపర్రు గ్రామస్థుడు పోలవరపు జగపతిరాయుడుగారి కిచ్చారు. ఆ దంపతులకు కలిగిన అయిదుగురు కుమారులలో పెద్దకొడుకు శాయోజీరావుకు, నా మేనమామ త్రిపురనేని రామశాస్త్రులు, మా మారుటక్క అన్నపూర్ణమ్మగార్ల పెద్దకూతురు శేషమ్మ భార్య అయినది. అయిదవ కొడుకు వెంకటేశ్వరరావుకు నా స్వంత చెల్లెలు నిమ్మగడ్డ

ద్రౌపదమ్మ పెద్దకూతురు పున్నమ్మ నిచ్చి వివాహం చేశారు. మారుటి తల్లి శేషమ్మగారి రెండవ చెల్లెలు వెంకట శేషమ్మగారి భర్త గుడివాడ తాలూకా దాకరం గ్రామానికి చెందిన వల్లూరు పల్లి రామనాథంగారు. వారు మిక్కిలి బంధుప్రియులు. మా యింట్లో జరిగిన అన్ని శుభాశుభ కార్యాలకు తప్పకుండా వచ్చే వారు. మా తండ్రిగారు గతించిన తర్వాతకూడా వస్తూ పోతూ వుండేవారు. పెడసనగల్లుకు కూడా వచ్చేవారు.

మా తల్లి పున్నమ్మగారు మా తండ్రిగారి రెండవ భార్య. మా తండ్రికి మా తల్లివలన నేను, నా తమ్ముడు సత్యనారాయణ, శేషారత్నం, ద్రౌపదమ్మ నిలిచాము. నిజానికి మా తల్లికి వెంటవెంటనే కాన్పులు వచ్చి తొమ్మండుగురు కొడుకులు కలిగి నారటగాని, 6 గురు పురిటిలోనే చనిపోయారు. 9-వ వాడు, మా తల్లి 1911 సంవత్సరం డిశంబరునెలలో చనిపోయిన తర్వాత 3, 4 నెలలు పెరిగి మరణించాడు. మా అక్క శేషారత్నమ్మ గుడివాడ తాలూకా అంగలూరుగ్రామ కాపురస్థుడు దుగ్గిరాల రామ శాస్త్రులుగారి భార్య అయింది. ఆమె సంతానవిహీనంగా, 20 సంవత్సరాలు నిండకముందే 1915 లోనో, 1916 లోనో చని పోయింది. మా చెల్లెలు ద్రౌపదమ్మ మా తల్లి చనిపోవునాటికి 5 ఏండ్లు నిండీ నిండని బాలిక. మా తల్లి రెండవచెల్లెలు కోగంటి వెంకట నరసమ్మగారు అంగలూరులోని తన యింటికి తీసుకు వెళ్లింది. ఆ బిడ్డ అక్కడ పెరిగింది. 1920 లో మా స్వగ్రామం గుడివాడ తాలూకా బొమ్మలూరుకు సమీపగ్రామం సిద్ధాంతం నివాసి నిమ్మగడ్డ దుర్గానాగేశ్వరుడుగారి కిచ్చి వివాహం చేశాము. ఆ దంపతులకు మొదట వరుసగా 4 గురు కూతుళ్లు, తరువాత వరుసగా 4 గురు కుమాళ్లు పుట్టారు. కూతుళ్లు పున్నమ్మ, పిచ్చమ్మ, వెంకట నరసమ్మ, భాస్కరమ్మ అను పేర్లు కలవారు. కొడుకుల పేర్లు దేవీప్రసాద్, పూర్ణచంద్రరావు, శివరామ కృష్ణయ్య, రామచంద్రరావు. పెద్దకూతురు పున్నమ్మను పైన జెప్పినట్లు నా పెద మారుటితల్లి శేషమ్మ చెల్లెలు చంద్రమ్మగారి కడగొట్టు కొడుకు పోలవరపు వెంకటేశ్వరరావుకు భార్యగా చేసి

నారు. వాళ్లకు ఒక కొడుకు, ఒక కూతురు. కూతురు పెద్దది. ఆ పిల్లను పున్నమ్మ తన తమ్ముడు నిమ్మగడ్డ పూర్ణచంద్రరావు కిచ్చి వివాహం చేసింది. పూర్ణచంద్రరావుకు ఒక కొడుకు, ఇద్దరు కూతుళ్లు, చిన్నపిల్లలు. నా రెండవ మేనకోడలు (సోదరి ద్రౌపదమ్మ కూతురు) పిచ్చమ్మను తెనాలి తాలూకా కొల్లూరు వాస్తవ్యుడు గుమ్మడి రాజారావు కిచ్చి వివాహం చేశారు. వారి కిద్దరు కొడుకులు, యిద్దరు కూతుళ్లు. పెద్దకూతురు ఉమారాణి వైద్యవిద్యను కొలదికాలంక్రిందట పూర్తిచేసింది. ఆమె నీ మధ్యనే మా తల్లి మూడో చెల్లెలు అట్లూరి శేషమ్మగారి కూతురు ప్రభావతి కొడుకు కిచ్చి వివాహంచేశారు. ఆ యువకుడు కూడా మెడిసన్ చదువు పూర్తిచేశాడు. వాళ్ల పెద్దకొడుకు నారాయణరావు యమ్. ఎస్‌సి. డిగ్రీని గడించి హైదరాబాద్ వెళ్లి కాలేజిలో కెమిస్ట్రీ లెక్చరర్‌గా వున్నాడు. అతనికి కూడా వివాహమైనది. పున్నమ్మ భర్త పోలవరపు వెంకటేశ్వరరావు కులవృత్తి వ్యవసాయం చేసుకుంటున్నాడుగాన, పిచ్చమ్మ భర్త శ్రీ గుమ్మడి రాజారావు ఎమ్. ఎస్‌సి. డిగ్రీని పొంది, అమెరికాలో కొంత అనుభవాన్ని సంపాదించియుండి, యిప్పుడు వ్యవసాయం డిప్యూటి డైరెక్టర్ హోదాలో, గుంటూరు జిల్లా అమరావతి లోని నాగార్జునసాగర్ ప్రాజెక్టు క్రింద నడిపే వ్యవసాయ పరిశోధన కేంద్రాన్ని నిర్వహించుచున్నాడు. ఆయన రెండవ కూతురు నళిని, రెండవ కొడుకు దుర్గాప్రసాదు యింకను పిన్నవయస్కులు. నా మూడవ మేనకోడలు వెంకట నరసమ్మ అట్లూరి జయ రామారావు భార్య అయినది. ఈ అట్లూరివారు మా నాయనమ్మ బాపమ్మ జ్యేష్ఠ సోదరీలలో ఒకరైన లక్ష్మీదేవమ్మ సంతతికి చెందినవారు. ఈ దంపతుల కొక కూతురు, ముగ్గురు కొడుకులు. ఈమధ్యనే కూతురి పెండ్లిచేశారు. శ్రీ జయరామారావు బ్లాక్ డెవలప్‌మెంట్ ఆఫీసరుగా ప్రస్తుతం గన్నవరం తాలూకా గన్నవరంలో వుంటున్నాడు. నాలుగవ మేనకోడలు భాస్కరమ్మ మా తల్లి నాల్గవ చెల్లెలు అక్కినేని రాజరత్నమ్మ మూడవ కొడుకు వెంకటేశ్వరరావు భార్య అయింది. వాళ్లకు ఒక కూతురు, యిద్దరు కొడుకులు. ఈమధ్యనే కూతురి పెండ్లి జరిగింది.

వెంకటేశ్వరరావు అగ్రికల్చర్ బి. ఎస్‌సి. ఇప్పుడు చల్లపల్లి షుగర్స్‌లో ఉద్యోగం చేస్తున్నాడు.

మా చెల్లెలు ద్రౌపదమ్మ నల్గురు కొడుకులలో పెద్దవాడు దేవీప్రసాద్, స్వగ్రామం సిద్ధాంతం కాపురస్థుడు అడ్సుమిల్లి చిట్టబ్బాయి అనే చౌదరి కూతురును వివాహ మాడాడు. అతనికి ఒక కూతురు, ఒక కొడుకు కలిగారు. కౌమారదశలో వుండిన అతని కొడుకు రక్తకాన్సర్ వ్యాధితో కొలదికాలం క్రిందటనే మరణించాడు. తన పెద్దక్క పున్నమ్మ కూతురిని వివాహ మాడిన రెండవవాడు పూర్ణచంద్రరావు కొక కొడుకు, యిద్దరు కూతుళ్లని పైన చెప్పాను. శివరామకృష్ణయ్య గుడివాడ తాలూకా యలమర్రు గ్రామంలోని ఒక రైతు కుమార్తెను వివాహ మాడినాడు. వాళ్లకొక కొడుకు, ఒక కూతురు కలిగినారు. నాల్గవవాడు రామచంద్రరావు శ్రీకాకుళంజిల్లా, విజయనగరానికి చెందిన పిల్లను చేసుకొన్నాడు. ఈమధ్యనే అతని కొక కొడుకు కలిగాడు.

నా ఏకైక సోదరుడు సత్యనారాయణకు చదువంతగా అబ్బలేదు. పల్లెటూరి చదువుతోనే విద్యార్జన విరమించాడు. మా బాల్యగురువు శ్రీ కోడూరి జోగయ్యగారివద్ద కలసి చదువుకొన్నాము. నేను 1913 సంవత్సరం జూలైలో బందరు నోబుల్ హైస్కూలులో 3-వ ఫారంలో చేరిన తరువాత, శ్రీ జోగయ్యగారు తిరిగి బొమ్మలూరుకు వచ్చివేసినప్పుడు, ఆయనక్కడుండిన కొలదికాలం ఆయనవద్ద చదివాడుగాని, అంతటితో అతని విద్యార్జన సమాప్తం. సహజంగా తెలివితేటలు కలవాడు. మంచి, చెడ్డలను తేలికగా అర్థంచేసుకొనే శక్తి గలవాడు. బాధ్యతలను గుర్తించగలవాడేగాని, మిక్కిలి బద్ధకస్తుడు. ఒళ్లు వంచి పనిచేయటంగాని, సరియైన అజమాయిషీ చేయటం గాని అలవరచుకొనలేదు. అతని కే చెడుగుణాలు లేవు. ఎక్కడికి వెళ్లేవాడు కాదు. కాలంగడచినకొద్దీ తన యింటి



గ్రంథకర్త అనుజుడు ( తమ్ముడు ) లింగం సత్యనారాయణ



గ్రంథకర్త తమ్ముని కొడుకు డాక్టరు లింగం సూర్యనారాయణ

కెదురుగావున్న తూర్పు చెరువుగట్టుమీది చెట్టుక్రింద కాలం గడిపేవాడు. అభిమానంకొద్దీ వారింటికీ, వీరింటికీ వెళ్ళేవాడు కాదు. చివరకు అభివృద్ధిదశలోవున్న తన పెద్దకొడుకు డాక్టర్ సూర్యనారాయణ యింటికి కూడా వెళ్ళి పదిరోజు లైనా వుండే వాడు కాదు. మధుమేహవ్యాధి పెద్దఎత్తున అతనిని ఆక్రమిం చింది. కొడుకెంత చెప్పినా, అత డింటికి వెళ్ళి, అత డిచ్చిన మందులు సరిగా ఉపయోగించేవాడు కాదు. చివరి కా వ్యాధికి బలియై హృదయస్పందనం ఆగిపోయి, అకస్మాత్తుగా గత సం వత్సరం (1973) ఏప్రిలు 12-వ తారీఖున గుంటూరులో పెద్ద కొడు కింట్లో చనిపోయాడు. నా కంటె 1½ సంవత్సరం మాత్రమే చిన్నవాడు. అందువల్ల అతనికి చనిపోవునప్పటికి 73 సంవత్స రాల వయస్సు నిండి వుంటుంది. అది చిన్నవయస్సు కాదుగాని, పెద్దవాడనైన నేను యింకను కొన్ని సంవత్సరాలు జీవించే స్థితిలో నుండగా, అతడు అకస్మాత్తుగా ఎగిరి పోవటం, నా హృదయం దెబ్బ తిన్న ట్లయింది.

అతని యందు నేను, నాయం దతడు ఆప్యాయత, అభి మానం కలిగియుండినాముగాని, నేను బందరు, ఇంగ్లండు విద్యా భ్యాసంలో చాలాకాలం గడపినందున, నా యింగ్లండు విద్యా భ్యాసంవల్ల కలిగిన ఆర్థిక క్లిష్టపరిస్థితులు మనోవ్యాకులతను కలిగించినందువల్ల, అంత సన్నిహితంగా వుండేవాళ్ళం కాదు. అయినా సోదరప్రేమ తరగలేదు. అతని భార్య నేను కుటుం బాస్తిని అస్తవ్యస్తంచేశానని సహజంగా వ్యతిరేక భావా న్నక్కడక్కడ ప్రస్ఫుటంజేసినా, అతడు మాత్రం ఏ మాత్రం నిష్ఠురవాక్యాలు పలకలేదు. నిజానికి నా హెచ్చు దుబారా ఖర్చుల వల్ల మా జాయింటు కుటుంబార్థిక వ్యవస్థ దెబ్బతిన్నది. అందు వల్ల నేను కట్టుబట్టలతో ఇంటినుండి వచ్చివేయటమేగాక, నా తమ్ము లిద్దరు కొంత నష్టపడ్డారు. అయితే, తర్వాత కొంత వరకైనా వారి నష్టానికి పరిహారం కలగజేశాను.

నా సోదరుడు సత్యనారాయణకు, అంగలూరుకు చెందిన శ్రీ దుగ్గిరాల అమరయ్యగారి మూడవ కుమార్తె సరస్వతమ్మనిచ్చి

వివాహంచేశారు. వారి కొక కూతురు కూడా పుట్టిందిగాని, పసితనంలోనే మరణించింది. కుమారు లిద్దరు సూర్యనారాయణ, వెంకటరత్నం అనేవారు. సూర్యనారాయణ శస్త్రచికిత్సలో పేరు ప్రతిష్ఠలు పొందినాడు. యమ్. యస్. డిగ్రీని పొందటమే గాక, అమెరికాలో ఒక సంవత్సరం నీరుడు సంబంధమైన వ్యాధులకు ప్రత్యేక శిక్షణ పొంది వచ్చాడు. అక్కడి సర్జన్ల సంఘంలో మెంబరు (యఫ్. ఎ. సి. యస్.) ఐనాడు. మనదేశపు సర్జన్ల సంఘంలో కూడా సభ్యుడైనాడు. (యఫ్. ఐ. సి. యస్.) అత డిప్పుడు గుంటూరు గవర్నమెంటు మెడికల్ కాలేజిలో శస్త్రచికిత్సకు ముఖ్యబోధకుడుగాను, అక్కడి గవర్నమెంటు జనరల్ హాస్పిటల్ ప్రథమ సర్జన్ గాను, మొన్నటి వరకు ఆ హాస్పిటల్ కు సూపరింటెండెంట్ గాను, యిప్పుడు మెడికల్ కాలేజికి ప్రిన్సిపాల్ గాను వుండుచున్నాడు. శస్త్ర విద్యలో నిపుణతకలవాడేగాక, రోగులను ఆశ్వాసించటంలోను, వారికి ధైర్యాన్ని కలిగించటంలోను నేర్పరి. ఇంగ్లీషులో బెడ్ సైడ్ మానర్స్ అంటారే, అందులో చాకచక్యంగలవాడు. ఆహ్లాదాన్ని కలిగించే నడవడితో, చిరునవ్వును చిందించే ముఖ కవళికలతో, మర్యాద మన్నసలతో ఎదుటివారి స్వభావాన్ని బట్టి నడచికొనే ప్రవృత్తికలవాడు. ఈమధ్య నెల్లూరువద్ద జరిగిన మోటారుకారు దుస్సంఘటనలో అతని ఎడమచేతికి తీవ్రమైన దెబ్బ తగిలింది. దెబ్బ పూర్తిగా రహితమైనది. యథాప్రకారం శస్త్రచికిత్సలను జరుపుకొనుచున్నాడు. అతని భార్య సౌభాగ్యవతి స్నేహలత, డా. సూరపనేని చంద్రమౌళిగారి కుమార్తె. వాళ్ళకిద్దరు కొడుకులు, ఒక కుమార్తె. పెద్దకొడుకు పాండురంగారావు వైద్య విద్యలో యమ్. యస్. డిగ్రీని పొంది అమెరికాకు (యు. యస్. ఎ.) అనుభవం కొరకు వెళ్లియున్నాడు. ఈ యువకునికి శ్రీ వెలగపూడి రామకృష్ణగారి మేనల్లుడు, సబ్ జడ్జిగా ఈ మధ్యనే రిటైరైన శ్రీ పున్నారావుగారి రెండవ కుమార్తె నిచ్చారు. అతను ఒక కూతురును, కొడుకును కలిగియున్నాడు. రెండవవాడు కృష్ణ మోహన్, బి. కాం. డిగ్రీని పొంది, గుంటూరు సమీపాన

నంబూరు వద్ద నున్న మెట్టభూమి సేద్యం చూచికొనుచు, ఇప్పుడు గుంటూరు సమీపంలో ఇద్దరు ముగ్గురుతో కలసి ప్రత్తి జిన్నింగు ఫ్యాక్టరీని నడుపుచున్నాడు. అతని భార్య రాజమండ్రివద్ద నున్న మోదుగుపల్లు గ్రామంలోని సంపన్న గృహస్థుని కుమార్తె. ఈ మధ్యనే వివాహమైంది. డా. సూర్యనారాయణ ఏకైక కూతురు విజయలక్ష్మి ఇంగ్లీషు సారస్వతం ముఖ్యాంశంగా బి. ఎ. పాసై ఒక సంవత్సరం మద్రాసు శాంతోమ్‌లోని విద్యాసంస్థలో వివిధ రంగాలలో తర్ఫీదుపొందింది. ఆమె ఇంగ్లీషులో ఘటికురాలు. ఆ సారస్వతంలో యమ్. ఎ. డిగ్రీకి యింటివద్దనుండి చదివి డిగ్రీని పొందింది. ఆమెకు వివాహమైంది. ఒక కూతురు, ఒక కొడుకు కలిగారు. ఆమె భర్త నా పినతాత కుమారుడు లింగం నాగభూషణంగారి మూడవ కుమార్తె శ్రీమతి వెంకటేశ్వరమ్మ మొదటి కొడుకు డాక్టర్ రామబ్రహ్మం. రామబ్రహ్మం కూడా యమ్. యస్. డిగ్రీని పొంది, తన బావమరది పాండురంగారావుకు కొన్ని దినములకు ముందు అమెరికాకు చేరుకొన్నాడు. ఆయన తండ్రి దివి తాలూకా కోడాలికి చెందిన తుమ్మల వెంకట కృష్ణారావుగారు. ఆయన కాంగ్రెసీయుడు. కొంతకాలం తూర్పు కృష్ణాజిల్లా కాంగ్రెస్ కమిటీకి అధ్యక్షుడుగా వుండినాడు.

నా అనుజుని రెండవ కొడుకు వెంకటరత్నం కష్టపడి చదివి, ఎట్టకేలకు కష్టతరమైన ఛార్టర్డు అక్కౌంటెన్సీ పరీక్ష పాసైనాడు. అతడు గండిగుంట పిల్లను వివాహమాడాడు. ఆ దంపతులకు ఒక కుమార్తె, ఒక కొడుకు కలిగారు. అతడిప్పుడు నవభారత్ ఎంటర్‌ప్రైజస్ అనే గొప్ప వ్యాపారసంస్థలో చీఫ్ అక్కౌంటెంట్‌గా హైదరాబాద్‌లో వుంటున్నాడు. అతడు ముక్కుకుసూటిగా మాట్లాడే నిజాయితీపరుడు, నిర్మొగమాటి, నిష్కల్మష హృదయుడు. మిక్కిలి కష్టపడే స్వభావం గలవాడు. అతని మాతామహుడు శ్రీ దుగ్గిరాల అమరయ్యగారు వేదాంతి యని పేరుపడ్డారు. 90 ఏండ్లు దాటిన వర్షాలు జీవించాడు. ఆయన నిర్మొగమాటం, నిర్భీకత, ముక్కుకుసూటిగా నడచుకోవటం ఈ మనుమడు వెంకటరత్నానికి అబ్బినవి.

మా తల్లి తన 32, 33-వ ఏటనే 1911-వ సంవత్సరము డిశంబర్‌లో పురిటిలో చనిపోయింది. పెద్ద సంసారం కాబట్టి మా తండ్రికి తిరిగి వివాహం చేసుకోవటం తప్పలేదు. మా రెండో మారుటితల్లి శ్రీమతి మాణిక్యమ్మగారు గుడివాడ తాలూకా ఇందుపల్లికి చెందిన కోగంటి వీరయ్యగారి కుమార్తె. వీరయ్యగారు అమాయకుడు. ఒక విధంగా ఋషి వంటివాడు. పినతల్లి మాణిక్యమ్మగారు చాలా ఉత్తమ స్త్రీ. ఆమె ఏ మాత్రం విసుగులేకుండా మిక్కిలి సహనంతో ఆ పెద్ద సంసారాన్ని గడుపుకొని వచ్చింది. సవతి కొడుకులం మా యిద్దరికి ఎట్టి లోపం రానీయలేదు. మా తండ్రిగారి ధామ్, ధూమ్‌లకు తల్లడిల్లక, తనయింటి పనులను తాను మామూలు ప్రకారం సవ్యంగా చేసుకొనిపోయేది. ఆమె వివాహమైన 12 సంవత్సరాలకే 1924 సంవత్సరము మార్చి 12-వ తారీఖున మా నాయనగారు పరలోకప్రాప్తులైనారు. నే నింగ్లండులో వుండిపోయాను. ఆమెకు కలిగిన ఏకసంతానం కొడుకు, చిన్నపిల్లవాడు. మారుటి కొడుకు సత్యనారాయణ, అతని భార్య సరస్వతమ్మతో ఎట్టి తగాదాలు లేక అనునయంగా కాలంగడుపుతూ వచ్చింది. నే నింగ్లండునుండి తిరిగివచ్చిన తర్వాత 1927 సంవత్సరము జూన్‌లో మిగిలిన కొలది ఆస్తులను అన్నదమ్ములం ముగ్గురం పంచుకొని ఎవరిదారి వారు చూచుకొన్నాము. కొడుకు శివరామకృష్ణయ్యకు పెండ్లై, సంతాన మారంభించి, పిల్లల సంఖ్య పెరుగుచున్నకాలంలో, కొడుకు అధిక ఖర్చువలన, ఫాన్సీ సరుకులషాపు, పొగాకుకొట్టు మొదలైన వ్యాపారాలలో నష్టపడటంవలన, అతని వాటాకు వచ్చిన 17 ఎకరాలు క్షీణించిపోసాగినవి. పైగా బర్మా పైగోసా టేకు స్తంభాలు, కలపతో, కొయ్య సరంబీతో మిక్కిలి బందోబస్తుగా కట్టబడిన మా తండ్రిగారి మండువా పెంకు టిల్లు అతని భాగానికి వదలిపెట్టాము. దానిని కూడా ఊడదీసి కలపను, పెంకు వగైరాలను అమ్మి, ఆ యింటి స్థలాన్ని, దాని నానుకొన్న పెంకుటి పశువులచావడి మొదలైన వానిని పరుల పరంచేసి, బీద స్థితిలోకి దింపి, పిల్లి తన



గ్రంథకర్త మారుటితల్లి శ్రీమతి లింగం మాణిక్యమ్మ మారుటి తమ్ముడు శివరామకృష్ణయ్య

కూనలను అక్కడికక్కడకు త్రిప్పినట్లు అక్కడిక్కడా యిల్లు మార్చిన స్థితిలోకూడా, ఆమె తన మనస్థైర్యాన్ని పోగొట్టుకొనలేదు. కలో గంజో త్రాగుతూ ఒక మనుమడు, ఆరుగురు మనుమరాళ్లు గల సంసారాన్ని ఈడ్చుకొంటూ వచ్చింది. బిడ్డల పెండ్లిళ్ల ఖర్చుల కని, దానికని, దీనికని ఆ మిగిలిన కాస్త భూమి చేజారిపోయింది. ఇట్టి స్థితిలో కూడా పూరిళ్లలో వుండవలసిన దుస్థితికి దిగజారి నప్పుడుకూడా ఆమె స్థిరచిత్తంతోనే నిలబడియున్నది. ఆమె కిప్పుడు వయస్సు 75 సంవత్సరాలకు మించియే యుండును. ఈ వృద్ధాప్యంలోకూడ వంటపని, యింటిపని తప్పలేదు. నిజానికి పురుషునికంటె స్త్రీలకే సత్వం, సహనం ఎక్కువని పెద్దలు చెప్పేది నిజం. సవతి బిడ్డలయందు ఆమె కెప్పుడూ ఆదరణయే. నేను కూడా చాలా ఆదరణతో, ఆప్యాయతతోనేగాక పూజ్య భావంతో ఆమెను చూస్తాను.

మారుటి తమ్ముడు శివరామకృష్ణయ్య, నా మేనమామ త్రిపురనేని రామశాస్త్రులు మారుటి పెద్దక్క శ్రీమతి అన్న పూర్ణమ్మ దంపతుల రెండవ కుమార్తె లక్ష్మమ్మను వివాహం చేసుకొన్నాడు. ఆ దంపతులకు ఒక కొడుకు వెంకటరత్నం, ఆరుగురు కూతుళ్లు కస్తూరిబాయి, దుర్గాంబ, సరోజిని, లలిత, సరళ, శాంతకుమారి అనువారు. ఈ ఏడుగురు సంతానాన్ని వాళ్ల బాల్యదశలోనే విడిచిపెట్టి, కొన్ని సంవత్సరాల క్రిందటనే లక్ష్మమ్మ చనిపోయింది. ఈ పెద్ద సంసార బాధలు పడుచు, కాన్సర్ వ్యాధిమూలంగా లక్ష్మమ్మ పిన్న వయస్సులోనే పోయింది.

కొడుకు వెంకటరత్నం తండ్రిమాట, నాయనమ్మ మాట వినని మూర్ఖత్వం, మకురుతనం అలవాటుపర్చుకొని ఏ ఫిఫ్త్ ఫారంవరకో చదివి, యింట్లో యాగంచేస్తూ, చివరి కెక్కడికో వెళ్లిపోయి, అక్కడక్కడా ఏపనో చేసుకుంటూ వుంటున్నాడు. అతనికి గుడివాడ తాలూకా పెదపాలపర్రు భ్రమరాంబ అనే పిల్లతో పెండ్లై ఒక కొడుకు కలిగాడు. అతని భార్య చదువు కొన్నది. పంతులమ్మపని చేస్తూ బిడ్డను సాకుకొనుచున్నది.

పెద్దమ్మాయి కస్తూరిబాయిని బొమ్ములూరుకు సమీప గ్రామం శేరీదింటకుర్రు పొట్లూరి జనార్దనరావు కిచ్చి వివాహం చేశారు. వాళ్లకు ముగ్గురు కూతుళ్లు. కొడుకులు లేరు. కస్తూరి బుద్ధిమంతురాలు. మంచి గృహిణి. ఇంటిపనులను జాగ్రత్తగా చూచుకుంటుంది. జనార్దనరావు నా సహాయంతో ఇన్ కంటాక్స్ డిపార్ట్ మెంట్ లో చేరి ఇన్ కంటాక్స్ యిన్ స్పెక్టరైనాడు. ప్రస్తుతం బాపట్లలో వుంటున్నాడు. అతడు మిక్కిలి కష్టజీవి. తన ఉద్యోగధర్మాన్ని మిక్కిలి శ్రద్ధగా, ఏ లోపం రానీయకుండా, ఏ తప్పుడుపనీ చేయకుండా నిర్వహించుకొని వస్తున్నాడు. మాట నెమ్మది. పని చురుకు. భార్యాభర్త లిద్దరూ అన్యోన్యంగా జీవితాన్ని గడుపుకొనుచున్నారు.

గుడివాడ సమీపం పెదపారుపూడి శివారు నివాసి, అట్లూరి రామమోహనరావు అనే యువకుడు శివరామకృష్ణయ్య రెండో కూతురు దుర్గాంబకు భర్త అయినాడు. రామమోహనరావు హైస్కూలులో టీచరుపనిచేస్తూ పొదుపుతో నాల్గుడబ్బులు కూడబెట్టుకుంటున్నాడని వింటున్నాను. అతని కిద్దరు ఆడపిల్లలు. మూడవ అమ్మాయి సరోజినికి గుడివాడ తాలూకా డోకిపర్రుకు చెందిన నిమ్మగడ్డ పరంధామయ్యగారి కుమారుడు లక్ష్మణరావు భర్త. అతడు వ్యవసాయం చూసుకొనుచున్నాడు. వాళ్లకు యిద్దరు మగపిల్లలు, ముగ్గురు ఆడపిల్లలు.

నాలుగవ పిల్ల లలితను (ఎర్రపాప) తామరకొల్లు గ్రామానికి చెందిన వెల్లంకి ఉమామహేశ్వరరావు కిచ్చి వివాహం చేశారు. అతడు కొంతకాలం హైదరాబాదులో కలప వ్యాపారంలో వుండి, 1969 సంవత్సరములో తెలంగాణా గొడవలలో వచ్చివేశాడు. ఇప్పు డొక చిట్ ఫండ్ సంస్థలో పనిచేస్తున్నాడు. వాళ్ల కిద్దరు ఆడపిల్లలు. ఉమామహేశ్వరరావు చాలా నెమ్మది, మంచితనం, తన స్థాయికి తగ్గ దక్షత వున్నవాడు. ఐదవ పిల్ల సరళ దివి తాలూకా పెదముత్తేవికి చెందిన నర్రా సుబ్బారావు భార్య అయింది. సుబ్బారావు ప్రస్తుతం గుడివాడ బస్సుల వర్కుషాపులో పనిచేస్తున్నాడు. వాళ్ల కిప్పు డొక కొడుకు, ఒక కూతురు. ఆరవ పిల్ల శాంతకుమారిని నూజివీడు తాలూకా

పోతురెడ్డిపల్లి అక్కినేని జగ్గయ్యకిచ్చారు. అతను వ్యవసాయం చేసుకుంటున్నాడు. ఆ దంపతుల కిప్పటికి ఒక ఆడపిల్ల కలిగి యున్నది.

తమ్ముడు శివరామకృష్ణయ్య తెలివితక్కువవాడుకాదు. కొంత వ్యవహారజ్ఞానం ఉన్నవాడే. దురదృష్టవంతుడు. ఏపని చేసినా కలసిరాలేదు. అన్నిటికంటె ముఖ్యం వ్యర్థుడైన కొడుకు, 6 గురు కూతుళ్లు. ఈ పెద్ద సంతానంతో కృంగిపోయాడు.

నా తండ్రి తరఫువారు నా పెదతండ్రులు, యితర బంధువులను గురించి కొంత చెప్పుతాను. మా లింగం కుటుంబంలో పెద్దవారియందు భయభక్తు లుండేవిగాని చనువు, స్నేహం వుండేవి కావు. పెద్ద వయస్సు వారిలో ఒకరైన మా పినతాత కుమారుడు (శ్రీ) పాపినీడుగారితో నాకు కొంత చనువుండినా, అది మర్యాదసూచకంగానే వుండేది. నా ఆరుగురు పెదతండ్రులలో, మేము పెదపెద్దయ్య అని పిలిచే అందరికంటె పెదతండ్రి వెంకటప్పయ్యగారిని, మూడవవారు ఆదినారాయణగారిని, ఐదవ వారు రామశేషయ్యగారిని బాగా ఎరిగియుంటిని. రెండవ వారు నాగభూషణంగారు నాకు బొత్తిగా గుర్తులేదు. నాల్గవ వారు, ఆరవవారు కొంత గుర్తుగాని, వారి నిప్పుడు చూస్తే గుర్తుపట్టలేనేమో అనుకుంటాను. మేము తండ్రిని అయ్య అని, పెద తండ్రిని పెద్దయ్యని పిలుస్తాము. కొన్నిచోట్ల బాబు, పెద బాబు అంటారు. నాన్న, పెదనాన్న అనేది ఈరోజులలోనే. నా తండ్రి సోదరులను గురించి, వారి సంతానాన్ని గురించి కొంతకు

గొంత నా మొదటి భాగంలో చెప్పాను. నాతరం వారిలో నా నాల్గవ పెదతండ్రి వెంకట శివుడుగారి ఏకైక పుత్రుడు సీతారామాంజనేయులుతో కొంత స్నేహ ముండేది. ఆయన నాకంటె సంవత్సరం లోపే పెద్దవాడు. ఆయన అకాలమరణం దురదృష్టం. ఆయనతో కంటె, నా ఆరవ పెదతండ్రి వెంకట సుబ్బయ్యగారి నాల్గవ కుమారుడు వెంకట కృష్ణయ్యతో ఎక్కువ స్నేహం, సన్నిహితత్వం వుండేది. మా పినతాత మూడవ కుమారుడు నాగభూషణంగారి యందు మిక్కిలి గౌరవభావము కలిగియుండే

వాడను. ఆయన స్వర్గస్థుడుకాగా, ఆయన స్మృతిని గౌరవించుచు ఈ పుస్తకం రెండో భాగం వారి కంకిత మిచ్చి యున్నాను. మా పెదతండ్రుల సంతానంలో రెండవ వారి కుమారుడు, మొదటివారి అభిమాన పుత్రుడు బుల్లి సుబ్బయ్య అనే వెంకట సుబ్బయ్యగారి యందు ఆదిలో మిక్కిలి భయ భక్తులు, తరువాత కొంత చనువు కలిగియుండేవాడను. నా సమకాలికులు నా ఆరవ పెదతండ్రి మూడవ కుమారుడు నాగభూషణం, నా పినతాత వెంకటరత్నం గారి ఆరవ కుమారుడు భద్రయ్య అని మామూలుగా పిలువబడే వీరభద్రయ్య నా మూడవ ఫారం చదువులో సహాధ్యాయులైనా, వారితో స్నేహం అనగా నెచ్చెలితనంవంటి సన్నిహితత్వం కలుగలేదు. పై జెప్పిన బుల్లి సుబ్బయ్య అనే వెంకట సుబ్బయ్య గారి పెద్దకొడుకు సత్యనారాయణ నా షడ్డకుడైనా, అత్త వారింటిలో మేము కలసివున్నా మే మెప్పుడూ నెచ్చెలికాండ్రుగా రూపొందలేదు.

మా తండ్రి ఆరవ అన్న వెంకట సుబ్బయ్యగారి ఏకైక పుత్రిక శ్రీమతి లక్ష్మీశ్వరమ్మ శ్రీ పర్వతనేని మల్లికార్జునుడు (గుడివాడ తాలూకా, నూజెళ్ల) గారి రెండవ కుమారుడు వెంకటరత్నంగారి భార్య అయినది. వెంకటరత్నంగారిని గురించి నా మొదటి భాగంలో వ్రాశాను. ఆయన వ్యవసాయంలోను, పశుపోషణలోను దక్షుడు. ముఖ్యంగా పశువిజ్ఞానం కలవాడు. మేలైన ఒంగోలుజాతివంటి దేశీయ ఆవులను, జెర్సీ, హాల్ స్టెయిన్ వంటి విదేశీ గోవులను, ముర్రాజాతి గేదెలను పోషిస్తాడు. సాహసం, పట్టుదల, మొండితనం కలవాడు, ఆరోగ్యం చాలా క్షీణదశలోవున్నా, మనోబలంతో పనులు సాగించుకొనుచున్నాడు. ఈ మూడవ భాగం మూడవ శీర్షికక్రింద కూడా ఆయనను గురించి కొంత చెప్పాను. ఆయనభార్య శ్రీమతి లక్ష్మీశ్వరమ్మ మిక్కిలి బంధు భావం, అభిమానం, మాట మంచి తనం గల ఉత్తమ యిల్లాలు. ఆమె సౌజన్య స్వభావురాలేగాక, మర్యాద బాగుగా తెలిసి మెలకువతో వర్తించే వైశిష్ట్యం కలది. నా పెదతండ్రుల కుమార్తె లందరిలోనూ ఆమె యందు నాకు

మిక్కిలి ఆప్యాయత, సుహృద్భావం కలదు. ఆమెను చూచి నప్పుడల్లా నా కెంతో సంతోషంగా వుంటుంది. ఈ దంపతులకు నలుగురు కుమాళ్లు, యిద్దరు కుమార్తెలు. పెద్ద కుమారుడు శివరామకృష్ణప్రసాదరావు 1920 లో స్కాట్‌లండ్‌లోని యాబర్డీన్‌కు వెళ్లి యింజనీరింగ్ చదువుకొని పెద్ద ఉద్యోగాలు నిర్వహించిన గన్నవరం తాలూకా కాటూరి వాస్తవ్యుడు శ్రీ వెల్లంకి అక్కయ్య చౌదరిగారి కుమార్తెను వివాహమాడాడు. అతడు వ్యవసాయం, కంట్రాక్టులు చేస్తూంటాడు. అతని కొక కొడుకు, ముగ్గురు కూతుళ్లున్నారు. రెండవవాడు సుబ్బారావుకు అతని రెండో మేనమామ నారాయణరావు కూతురు నిచ్చాడు. మూడవవాడు మల్లికార్జునరావు చంద్రాల అడుసుమిల్లి రామదాసుగారి కుమార్తెను చేసుకొన్నాడు. నాల్గవ వాడు నాగేశ్వరరావు తెనాలి తాలూకా దోనేపూడి నిమ్మగడ్డ రెడ్డియ్యగారి ఏకైక సంతానం కూతురును చేసుకొన్నాడు. శ్రీ వెంకటరత్నం దంపతుల పెద్దమ్మాయి సరోజిని, ఆమె నాల్గవ మేనమామ వెంకట కృష్ణయ్య కొడుకు వెంకట సుబ్బారావు భార్య అయినది. ఆ దంపతులకు ఒక కూతురు, ఒక కొడుకు. వారి రెండవ కూతురు జయప్రద గుడివాడ తాలూకా కొరిమెర్లకు చెందిన డాక్టర్ కరిపినేని రాఘవేంద్రరావుగారిని వివాహమాడింది. వారి పెద్దకుమార్తె వివాహం ఈమధ్యనే జరిగింది. డాక్టరు రాఘవేంద్రరావుగా రిప్పుడు దక్షిణ మధ్యరైల్వే చీఫ్ మెడికల్ ఆఫీసరు.

నా ఐదవ పెదతండ్రి రామశేషయ్యగారి ఏకైక కుమార్తె సరస్వతమ్మ గొల్వేపల్లి వల్లభనేని రామశాస్త్రులుగారిని వివాహమాడింది. వారి సంతానం పెద్దగా అక్కరకు రాలేదు. కుమార్తె వజ్రమ్మ పిన్నతనంలోనే వైధవ్యానికిపాలై, వయస్సుండగనే మరణించింది. రామశాస్త్రులుగారు సుగుణ సంపత్తి, స్నేహశీలం కలవారు. విద్యాగంధం కలవారు. వారు కూడా వయస్సుమళ్లక ముందే చనిపోయారు.

నా మూడవ పెదతండ్రి ఆదినారాయణగారి రెండవ కుమారుడు అంజయ్యగారున్నూ, రెండవ పెదతండ్రి నాగభూషణం గారి 4-వ కుమారుడు దుర్వాసులుగారున్నూ గుడివాడ తాలూకా తుమ్మలపల్లి గ్రామంలో స్థిరపడిపోయారు. మా 4-వ పెదతండ్రి వెంకట శివుడుగారు కొంతకాలానికి, తనవాటాకు వచ్చిన గుడివాడ తాలూకా రామనపూడి గ్రామంలో భూములను చూచుకొనుచు, అక్కడ స్థిరనివాస మేర్పరచుకొన్నారు.

మా పినతాత శ్రీ లింగం వెంకటరత్నంగారి మొదటి సంబంధం కూతురు శ్రీమతి సుబ్బమ్మను గుడివాడ తాలూకా పెయ్యేటి గ్రామం దుక్కిపాటి పున్నయ్యగారి కిచ్చి వివాహం చేశారు. వారి కుమారులలో నొకరు నాగభూషణం మా మూడవ ఫారంలో నా సహాధ్యాయుడుగా వుండినాడు. అతడు 1915-16 లలో మా బందరు బచ్చుపేట లాడ్జిలో వుండేవా డని మొదటి భాగంలో చెప్పాను. అతనికి మా పినతాత కుమారుడు నాగ భూషణంగారి ప్రథమ సంతానం రత్నమాణిక్యా న్నిచ్చారు. వారికి సంతానం కలుగలేదు. అన్నకొడుకును దత్తత చేసుకొన్నాడు.

పినతాత వెంకటరత్నంగారి పెద్దకుమారుడు పీచుగావుండటం వల్ల పీచ్చుబ్బయ్య అనే వాడుకపేరుగల వెంకట సుబ్బయ్యగారు అంగలూరులోని తూర్పుభాగం తిపిర్నేని లక్ష్మిపెరుమాళ్లుగారి సోదరి శ్రీమతి లక్ష్మిదేవమ్మను వివాహ మాడి, అంగలూరు ప్రాంతంలోని వారి తండ్రిగారి భూములను తన వంతుకు తీసుకొని, అంగలూరులో స్థిరపడిపోయారు. ఆయన పెద్దకుమారుడు నాగ భూషణం నాతో చనువుగా వుండేవాడు. అతడు చనిపోయాడు గాని, అతని కుమాళ్లు వృద్ధిలో వున్నారు.

పినతాత వెంకటరత్నంగారి రెండవ కుమారుడు శ్రీ వెంకట శివుడుగారి ప్రథమ కళత్రం యందు కలిగిన నాగభూషణం ఒక కుమార్తెను, భార్యను విడిచి పిన్నవయస్సులోనే చనిపోయారు. అతని మారుటితమ్ము లిప్పుడు గుడివాడ తాలూకా తుమ్మలపల్లిలో వుండుచున్నారు. మూడో కుమారుడు శ్రీ లింగం నాగభూషణం

భాబాయిగారి విషయం ఇదివరకు చెప్పియున్నాను. ఈపుస్తకం రెండవ భాగం వారి కంకిత మిచ్చాను. వారి కంకితంలో వ్రాసిన నా వాక్యాలు వారియందు నాకుగల పూజ్యభావాన్ని తెలుపుతవి. వారికి మొదటిభార్య వలన రత్నమాణిక్య మనే కూతురుగాక రెండో భార్య రుక్మిణమ్మగారివల్ల ముగ్గురు కొడుకులు, ముగ్గురు కూతుళ్లు కలిగారు. కొడుకులు వెంకటరత్నం, వెంకటేశ్వరరావు, బుచ్చయ్యలు వ్యవసాయం చూచుకొంటున్నారు. మొదటి సంబంధం కూతురు రత్నమాణిక్యమ్మను తన మారుటి సోదరి దుక్కిపాటి సుబ్బమ్మ కుమారుడు నాగభూషణం కిచ్చారని పైన చెప్పియున్నాను. రెండో సంబంధం కూతుళ్లలో పెద్దామెను, గన్నవరం తాలూకా నందమూరు గ్రామం గూడవల్లి బ్రహ్మయ్య గారి కుమారుడు నాగభూషణం కిచ్చారు. రెండవ ఆమెను వెంకటేశ్వరమ్మను, దివి తాలూకా కొడాలి గ్రామం తుమ్మల వెంకయ్యగారి కుమారుడు వెంకట కృష్ణారావుగారి కిచ్చారని, వారి పెద్దకొడుకు నా తమ్ముడు డాక్టర్ సూర్యనారాయణ కూతురు విజయలక్ష్మిని పెండ్లాడా డని పైన వ్రాశాను. మూడవ కూతురు గజలక్ష్మిని గుడ్లవల్లేరు చాపరాల శ్రీనివాసరావు కిచ్చారు. శ్రీనివాసరావు గుంటూరులో వకీలుగా వుంటున్నాడు.

శ్రీ నాగభూషణంగారి పెద్దతమ్ముడు పాపినీడుగారికి కుమారులు, కుమార్తె లున్నారు. కుమారులు ఆశించినంత వృద్ధిలో లేరు. రెండో తమ్ముడు భద్రయ్యఅనే వీరభద్రయ్యగారి ఏకైక సంతానం శ్రీమతి జయప్రదమ్మ ప్రస్తుతం ఆంధ్రప్రదేశ హైకోర్టు న్యాయమూర్తిగా వున్న శ్రీ ఆవుల సాంబశివరావుగారి భార్య. వారి కిద్దరు కుమార్తెలని, ముగ్గురు కొడుకులని, రెండో అమ్మాయి మంజులతతోను, మూడవ కుమారుడు శ్రీనాథతోను 1969 సంవత్సరంలో కొడైకెనాల్‌లో ఎక్కువ పరిచయం కలిగించు కొన్నానని పైన చెప్పాను.

మా తండ్రి తల్లి బాపమ్మగారి అక్క పెదబాపమ్మగారి కుమార్తె వియ్యమ్మగారు మా తండ్రితరపు బంధువులలో నొకరు. ఆమె వివాహ మాడింది మా బొమ్ములూరి, బొడ్డపాటి యింటి

పేరుగలవారిని. ఆమె అన్నలలో శ్రీ లావు బాపయ్యగారి విషయం మొదటి భాగంలో చెప్పాను. ఇంకొక సోదరుడు అప్పయ్యగారి నాల్గవ కొడుకు పిచ్చయ్య విషయం రెండవ భాగంలో చెప్పాను. మా తండ్రికి అక్కలుగాని, చెల్లెళ్లుగాని లేరు.

మా లింగం కుటుంబంలో యింతవరకు బాగా చదువుకొన్న వాళ్లు కొలదిమంది మాత్రమే. నా విషయం మినహాయించి, నా అనుజుడు సత్యనారాయణ యిద్దరు కొడుకులు సూర్యనారాయణ, వెంకటరత్నం పెద్దగా చదువుకొన్నారని పైన చెప్పాను. మేము ముగ్గురంగాక, నా మూడో పెదతండ్రి ఆదినారాయణగారి మూడవ కొడుకు శ్రీ సత్యనారాయణ కుమారుడు గోపాల కృష్ణయ్య (యల్. జి. కృష్ణయ్య) వైద్యవిద్యలో యమ్. యస్. డిగ్రీ, శిశువైద్యంలో నిపుణతను సంపాదించి, ఇప్పుడు గుంటూరు గవర్నమెంటు జనరల్ ఆస్పత్రిలో వైద్యంలో ప్రధానుడుగా, వైద్యకళాశాలలో ప్రథమ ఆచార్యుడుగా వుంటున్నాడు. అతడు గ్లాస్గోలో చదువుకొని, రైల్వే డిప్యూటీ చీఫ్ ఇంజనీరుగా పనిచేసిన తెనాలి తాలూకా తురిమెళ్ల గ్రామ కాపురస్థుడు పర్వతనేని శివలింగయ్యచౌదరిగారి ద్వితీయపుత్రికను వివాహమాడాడు. ఈదంపతులకొక కుమారుడు, యిద్దరు కుమార్తెలు. భార్యాభర్తలిద్దరు మర్యాద మన్ననలతో వచ్చినవారిని ఆదరిస్తూంటారు. డా. గోపాల కృష్ణయ్యకు బంధుభావం, కుటుంబాభిమానం మిక్కిలి హెచ్చు. నన్నెంతో ఆదరిస్తాడు, గౌరవిస్తాడు. అతని మేనమామ డా. బొబ్బా ధర్మారావుగారు మిక్కిలి సుగుణ, సౌజన్యవంతుడు, సౌమ్యమూర్తి. పెద్దమనిషి. మంచి ఎరుపు, పసుపు వర్ణంతో, మిక్కిలి అందమైనవాడు. మాట మంచియేగాక, నిర్దుష్టమైన నడవడిగలవాడు. నిజాయితీ, విధ్యుక్తధర్మ నిర్వహణ వారికి పట్టుగొమ్మ. నేను 1950లో హైదరాబాద్‌కు స్పెషల్ ఆఫీసరుగా వెళ్లినప్పుడు వారు వైద్య సహాయాన్ని పూర్తిగా అందించారు. స్నేహభావంతో వర్తిస్తారు.

మా లింగం కుటుంబంవారి నిం కొకరిని పేర్కొనాలి. అతడు మా 6-వ పెదతండ్రి వెంకటసుబ్బయ్యగారి నాల్గో కొడుకు పై జెప్పిన వెంకట కృష్ణ పెద్దకుమారుడు యల్. వి. సుబ్బారావు. అతడు అమెరికాలో కెమికల్ యింజనీరింగు విద్య నభ్యసించాడు. కొంతకాలం రాజమండ్రి పేపర్ మిల్లుకు జనరల్ మానేజరుగా నుండి, తర్వాత అక్కడిక్కడ ఉద్యోగంచేసి ఇప్పుడొక ఢిల్లీ కంపెనీలో పనిచేస్తున్నాడు. అతనికి కలిగిన కూతురు, కొడుకు విషయం పైన చెప్పాను. ఇతనిని నేను మిక్కిలి అభిమానిస్తాను. నిజానికి మా లింగం కుటుంబం పిన్నవాళ్లలో యితడంటేనే నాకు మిక్కిలి ప్రీతి. నెమ్మదిగా, కొంత బిడియపడినట్లు తెలిసినవారితో మాట్లాడుతాడు. తెలియనివారిని, కొద్దిగామాత్రమే తెలిసిన వారిని చొరవ దీసుకొని మాట్లాడించడు. ఏ దుర్గుణంలేనివా డని చెప్పవచ్చును. మంచి శరీరవర్ణంతో, అందంగా వుంటాడు. అతని పిన్నవయస్సులో, మా లింగం కుటుంబంలో అంత అంద మైన బిడ్డ లే డనుకొనేవాడను.

ఇక మా తల్లి కుటుంబ విషయం. మా మాతామహుడు త్రిపురనేని వెంకటాద్రిగారు అన్నదమ్ములు నలుగురిలో కడసారి వారు. వారి పెద్దన్న రామస్వామిగారికి మగసంతానంలేదు. ఇద్దరి కుమార్తెలలో పెద్దకుమార్తె కాంతమ్మగారిని 8-వ పెదతండ్రి ఆదినారాయణగారు వివాహ మాడారు. వారి పెద్దకుమార్తె శోభనాద్రమ్మగారిని, మా తాత వెంకటాద్రిగారి రెండో అన్న రామయ్యగారి రెండవ కొడుకు శేషాద్రిగారి కిచ్చి పెండ్లిచేశారు. ఆ దంపతుల పెద్దకొడుకు శివప్రసాదరావు గుడివాడలో న్యాయ వాదవృత్తిని జరుపుకొనుచు కొంత పెద్ద స్థాయినే సంపాదించాడు. గుడివాడ పట్టణ సహకార బ్యాంకుకు చాలా సంవత్సరాలు అధ్యక్షుడుగా సారథ్యం వహించాడు. నాటకకళను ప్రోత్సహించు టలో ఆయనకు కొంత భాగ మున్నది. గుడివాడలో కవిరాజు శ్రీ త్రిపురనేని రామస్వామిచౌదరిగారి స్మృతిచిహ్నంగా స్థాపించబడిన కవిరాజు సాహిత్య విహారం కొరకు పెద్ద బిల్డింగును కట్టటంలోను, విహారం కార్యకలాపాలను జరపటంలోను ఆయన

పినతాత చలమయ్యగారి నాలుగవ కుమారుడు పండితుడు, కవి శ్రీ సుబ్రహ్మణ్యంగారి కుమారుడు డాక్టర్ వెంకటేశ్వరరావుతో కలసి బాధ్యత వహిస్తున్నాడు. అతనికి, అతని పెద మేనమామ వీరభద్రయ్యగారి ఏకైక సంతానం సౌభాగ్యవతి పమిడమ్మ నిచ్చి వివాహంచేశారు. ఈ దంపతులకు ఇద్దరు కొడుకులు, ఇద్దరు కూతుళ్లు. శ్రీ శేషాద్రిగారి అన్న మాధవరాయుడుగారి కుమారుడు రామబ్రహ్మంగారి కుమార్తెను మా నాలుగో పినతల్లి రాజరత్నమ్మగారి రెండో కొడుకు అక్కినేని మల్లికార్జునరావు కిచ్చారు. ఇదివరలో చెప్పినట్లు సుప్రసిద్ధ కవివరేణ్యుడు, హేతువాది, మానవతావాది, సంఘసంస్కారి శ్రీ త్రిపురనేని రామస్వామిచౌదరిగారు మా తల్లి తండ్రి వెంకటాద్రిగారి మూడవ అన్న చలమయ్యగారి అయిదుగురు పుత్రులలో చివరి వారు. వారి అన్నలు నలుగురిలో పెద్దవారు కవికోకిల గోపాల కృష్ణయ్యగారు, రెండవవారు పండితుడు నరసయ్యగారు, మూడవ వారు సాత్వికస్వభావసంపన్నుడు శ్రీరాములుగారు, నాల్గవ వారు పైజెప్పిన డాక్టర్ వెంకటేశ్వరరావుగారి తండ్రి సుబ్రహ్మణ్యంగారు.

మా మాతామహుడు త్రిపురనేని వెంకట్రాదిగారి కొక కొడుకు, ఆరుగురు కుమార్తెలు. కొడుకు రామశాస్త్రులుగారికి నా పెద మారుటితల్లి ఏకైక సంతానం శ్రీమతి అన్నపూర్ణమ్మ గారి నిచ్చి, ఆమె చిన్నతనంలోనే మాతండ్రి పెళ్లిచేశా రని పైన చెప్పాను. ఆ దంపతుల కిద్దరు కుమార్తెలు, యిద్దరు కుమాళ్లు కలిగారు. రెండవ కొడుకుకు అతని తాత వెంకటాద్రిగారి పేరు పెట్టారుగాని, అతడు చిన్న వయస్సులోనే అవివాహితుడుగా చని పోయాడు. పెద్దవాడగు మల్లికార్జునరావుకు అయిదుగురు కుమారులు. రామశాస్త్రులుగారి పెద్దకూతురు శేషమ్మను మా పెద మారుటితల్లి చెల్లెలు శ్రీమతి చంద్రమ్మ పెద్దకొడుకు డోకిపర్రు గ్రామంలో పోలవరపు జగపతిరాయుడుగారి పెద్ద కుమారుడు శాయోజీరావు కిచ్చా రని పైనచెప్పాను. వారికి ఒక

కూతురు, నలుగురు కొడుకులు. శాయోజీరావు పిన్న వయస్సులోనే చనిపోయాడు. రెండవ కూతురు లక్ష్మమ్మను నా మారుటి తమ్ముడు శివరామకృష్ణయ్య కిచ్చి వివాహం చేసా రనికూడా పైన చెప్పాను.

నా మేనమామ త్రిపురనేని రామశాస్త్రులుగారు మధ్య రకం ఎత్తుతో పల్చగా, నాజూకుగా, పసుపురంగు శరీరంతో అందంగా వుండేవారు. ఆయన ఆజన్మ విలాస పురుషుడు. వేశ్యాలోలుడు. సుబ్బిచెరువు రాముడు వంటి వేశ్యల సాంగత్యం కొంతకాలం సాగించి, తర్వాత గుడివాడలో నివసిస్తుండిన భోగం హనుమాయమ్మ కూతురు వజ్రం అనే మిక్కిలి చక్కని పడుచు ఉపపత్నిగా కొంతకాలం గడిపాడు. ఏదో వెన్న వ్యాపారం అని మొదలుపెట్టి డబ్బు పోగొట్టుకున్నాడు. అంగలూరులో మా పినతాత కుమారుడు లింగం వెంకట సుబ్బయ్యగారి తర్వాత ఆ కాలంలో ఎక్కువ భూవసతి వున్నవా డాయనే. ఆ స్తిని పోగొట్టుకొని, స్వగృహమైన మేడను వదలుకొని, అంగలూరును విడిచిపెట్టి ఇందరు సమీపం పెడన కనతిదూరంలోవున్న నందమూరు గ్రామం చేరుకొన్నాడు. అక్కడ సంపాదించిన భూమి కూడా అక్కరకు రాలేదు. అదీ క్షీణించిపోయింది. ఆయన తద నంతరం ఆయన కొడుకు మల్లికార్జునరావు నందమూరు గ్రామం విడిచి పెడన, బందరులో వుండి ఇప్పుడు చల్లపల్లిలో వుంటున్నాడు. అతనికి నిలిచిన ఐదుగురు కొడుకులలో రెండవవాడు ఈమధ్యనే, పిన్న వయస్సులో వ్యాధిచేత మరణంపొందాడు. పెద్దవాడు బందరు ఒక రైసు మిల్లులో ఉద్యోగం చేస్తున్నాడు. తండ్రి, తతిమ్మా ముగ్గురు కొడుకులు చల్లపల్లిలో వ్యాపారం నడుపు కొనుచున్నారు.

నా మేనమామ భార్య, నా మారుటి అక్క శ్రీమతి అన్నపూర్ణమ్మ కొలది సంవత్సరాలక్రితం జారి క్రిందపడినందున, ఆమె తొంటె విరిగింది. ఆమె 80 ఏండ్లుదాటిన వృద్ధాప్యంలో చితికి పోయిన సంసారస్థితిలో, రోజులో చాలాభాగం మంచంలోనే

గడపవలసివచ్చింది. ఆమె చాలా భోగంతో పెరిగినామె. మా తండ్రిగారి ఆదరణయేగాక ఆమెతల్లి మేనత్త చిలకమ్మ అనేవారు, తన చిన్నతనంలోనే భర్తచనిపోగా, తన యావదాస్తిని ఈమె కొరకే ఉపయోగించింది. ఆ సహాయంకూడా ఫలించలేదు. కొన్నిరోజులక్రితమే కుమారుని యింట, చల్లపల్లిలో చనిపోయింది. శ్రాద్ధకర్మ ఈసంవత్సరం (1974) జనవరి 22-వ తారీఖున జరిగింది.

మా తల్లి ఆరుగురు అప్పచెల్లెళ్లలో మా అమ్మ పున్నమ్మ గారు అందరికంటె పెద్దది. ఆమె విషయం, మా తండ్రి విషయం విపులంగా నా మూడవ పుస్తకం "అభిప్రాయాలు - అనుభవాలు"లో "నా తల్లి- దండ్రులు" అనే శీర్షికక్రింద చెప్పాను. రెండో ఆమె చినపున్నమ్మగారు. ఆమెను అంగలూరులోనే దుగ్గిరాల పెదబసవయ్యగారి కిచ్చారు. పెదబసవయ్యగారిని మొదటి భాగంలో వర్ణించాను. చినపున్నమ్మగారు నెమ్మదిగా, ఎవరితోను తగాదాపెట్టుకోకుండా కాలంగడిపేవారు. ఆమెకు ఒకకొడుకు, నలుగురు కూతుళ్లు కలిగారు. ఆ కొడుకు వీరభద్రయ్యకు చిన్నతనంలోనే మతిచలించి, ఎక్కడకోపోయి, చాలా సంవత్సరాలకు తిరిగివచ్చి, వెళ్లిపోవకముందే పెండ్లాడిన భార్యతో కొలది సంవత్సరాలు కాపురంచేసి, బిడ్డలను కని, చెప్పకుండా ఎక్కడకో తిరిగి వెళ్లిపోయాడు. తిరిగి వెళ్లిపోయి చాలా సంవత్సరాలైంది. ఇక వస్తాడని నమ్మకంలేదు. కూతుళ్లలో పెద్దామె సీతమ్మ ఈమధ్యనే గతించింది. ఆమె ఏకైకసంతానం వీరప్రసాద్ సంతానవంతుడై సుఖంగా వున్నాడు. రెండోఆమె ద్రౌపది సంతానవిహీనంగా కొన్నిసంవత్సరాలక్రితం చనిపోయింది. మూడవ ఆమె ఈశ్వరమ్మకు సంతాన మున్నది. ఒకకొడుకు అభివృద్ధిదశలో నున్నాడు. ఆమె భర్త కొన్నిసంవత్సరాలక్రిందట గతించాడు. నాలుగవ ఆమె దమయంతి భర్త ఎర్నేని వెంకట కృష్ణారావు యింకాబ్రతుకవలసిన వయస్సుండగనే చనిపోయాడు. వారి సంతానంలో యిద్దరు కుమార్తెలు యమ్. బి., బి. యస్.



గ్రంథకర్త పినతల్లి కుమారుడు, కోగంటి దుర్గామల్లిఖార్జునరావు

పట్టాలను పొంది, వైద్యవృత్తిలో వృద్ధిలో నున్నారని విన్నాను.

మూడవ ఆమె వెంకట నరసమ్మగారు తన మేనత్తకొడుకు, అంగలూరు నివాసి శ్రీ కోగంటి దుర్వాసులుగారిని వివాహమాడారు. వారి కిద్దరు కుమారులు కలిగారు. కుమార్తెలు లేరు. పెద్దవాడు కోగంటి దుర్గామల్లికార్జునరావు. రెండవవాడు వెంకట సింహాద్రి అప్పారావు. రెండవవాడు అమాయకుడు. సంతానవిహీనంగా కొలది సంవత్సరాలక్రితం చనిపోయాడు. పెద్దవాడు దుర్గామల్లికార్జునరావుకు కూడా సంతానం లేదు. ఈమధ్య భార్యావియోగం కూడా కలిగింది. ఈయన బాల్యంలోనే కవిత్వం చెప్పుచు బాలకవి అని పేరు పొందాడు. ఇంగ్లీషు 5-వ ఫారం వరకే చదివాడుగాని, హిందీ సంస్కృతాంధ్రాలలో, ముఖ్యంగా ఆంధ్రంలో పాండిత్యం సంపాదించాడు. "విద్వాన్", "ఉభయభాషాప్రవీణ" అను పట్టాలను పొంది, గుడివాడ తాలూకా పామర్రు, గుడివాడ మొదలైన హైస్కూళ్లలో తెలుగు పండితుడుగా 25 సంవత్సరాలు పనిచేసి 10, 12 సంవత్సరాల క్రితం రిటైరైనాడు. 25 సంవత్సరాలకు పూర్వం పామర్రులో భారతీ సమితి, భారతీ సన్మాన సమితి, లలితకళా సమితులను స్థాపించి, వాని కార్యదర్శిగా సారథ్యంవహించి నడుపుచున్నాడు. 1½ సంవత్సరం క్రితం భారతీ సమితి రజతోత్సవం గుడివాడలో లలితకవి శ్రీ కొడాలి ఆంజనేయులుగారి అధ్యక్షతక్రింద జరిపించాడు. ఆంధ్రవాఙ్మయాలంకార, కవికోకిల మొదలైన అనేక బిరుదాలు ఆయనకివ్వబడినవి. చివరి బిరుదం "సన్మాన సమ్రాట్" అట. పండితులు, కవులు, సారస్వతాభిమానులందరకూ సన్మానంచేయటానికి వేచియుంటాడు. వారి జన్మదినోత్సవాలు, మరణ వర్ధంతులు జరుపుతూంటాడు. కవిసార్వభౌమ శ్రీ శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రి గారియందు మొనలేని భక్తి, పూజ్యభావం కలిగి వుంటాడు. వారు

కూడా తమ జీవితకాలంవరకు ఈయనను చాలా అభిమానించే వారు. వారి వర్ధంతికి ప్రతిసంవత్సరం రాజమండ్రికి వెళ్లి వస్తూంటాడు. ఈయన ప్రోత్సాహ, సహాయాల వల్లనే నాకు 1973 సంవత్సరం సెప్టెంబరు 17–వ తారీఖున గుడివాడలోని ఇండియన్ మెడికల్ అసోసియేషన్ హాలులో, అక్కినేని నాగేశ్వర రావు కాలేజి ప్రిన్సిపాల్ శ్రీ యెర్నేని వెంకటేశ్వరరావుగారి అధ్యక్షతన సన్మానం, బిరుదుప్రదానం జరిగింది. నేను ప్రచురించిన అయిదు పుస్తకాలను తప్పకుండా ప్రతిదానిని గుడివాడలో ఆవిష్కరణ చేయించాడు. ఈయనను గురించి విపులంగా నా ప్రథమ గ్రంథం " తాంబూలం – నైవేద్యంలో " వ్రాసియున్నాను.

నాలుగవ ఆమె అనగా నా మూడవ పినతల్లి శేషమ్మగారు గుడివాడ తాలూకా చౌటపల్లి గ్రామం అట్లూరి తాతయ్యగారి పెద్దకుమారుడు వెంకటప్పయ్యగారి భార్య అయింది. ఆమె కొక కొడుకు, ముగ్గురు కూతుళ్లు నిలిచారు. ఆ బిడ్డల కందరకు సంతాన మున్నది. కుమారుడు ధర్మారావు కోడూరు వాస్తవ్యుడు చాపరాల హనుమయ్యగారి కుమార్తె భర్తయై సంతానవంతుడుగా అభివృద్ధిదశలోవున్న ఆస్తితో వుంటున్నాడు. కుమార్తెలు వజ్రమ్మ, రంగనాయకమ్మ, ప్రభావతి అనే వారు. వజ్రమ్మను పెరిసేపల్లివారికి, రంగనాయకమ్మను కృష్ణా జిల్లా ఉంగుటూరి వారి కిచ్చారు. వా రిద్దరూ గతించి యున్నారు. మూడవ ఆమె ప్రభావతి తమిరిశ కాపురస్థుడు బొప్పన వెంకటేశ్వరరావుగారి భార్యయై, ఇప్పుడు భర్త, బిడ్డలతో గుడివాడలో వుండుచున్నది. ఆమె కుమారు డొకడు డాక్టరు చదువు పూర్తిచేసి యున్నాడు. పైన జెప్పినట్లు అతనికి నా చెల్లెలు ద్రౌపదమ్మ రెండవ కూతురు పిచ్చమ్మ పెద్దకూతురు ఉమారాణి నిచ్చి ఈమధ్యనే వివాహంచేశారు. ఉమారాణి మొన్ననే యం. బి. బి. యస్. కోర్సు పూర్తిచేసింది.

శేషమ్మ పిన్నిగారిని గురించి మొదటి భాగంలో చెప్పాను. ఆమె మరది వెంకట సుబ్బయ్యగారు, ఆయన భార్య సీతమ్మగారు

మిక్కిలి సజ్జనులు. నాయందు మిక్కిలి ఆప్యాయతతో వుండే వారు. నేను వెంకటప్పయ్యగారితో కంటె, వెంకట సుబ్బయ్య గారితోనే మిక్కిలి చనువుతో వుండేవాడను. సీతమ్మగారితో కూడా మిక్కిలి చనువుగా వర్తించేవాడను. మా పిన్ని శేషమ్మ గారు సహనమూర్తి. కష్టజీవి. ఉత్తమగుణ సంపన్నురాలు. ఉత్తమ ఇల్లాలు. ఆమె ఎరుపు రంగుతో అందంగా వుండేవారు. కలరా తగిలి అకాలమరణం పొందారు. ఆమె తోడికోడలు సీతమ్మగారు మిక్కిలి చక్కని చుక్క. పచ్చని శరీర వర్ణంతో, మిక్కిలి పొందికైన అవయవసంపదతో, లావణ్యంగల ముఖ కవళికలతో, చిరునవ్వుతో, అజంతా బొమ్మవలె భాగవతం లోని భామవలె వుండేవారు. ఆమె కూడా యింకను వయ స్సుండగనే వెళ్లిపోయారు. వారి పెద్దకుమారుడు జనార్ధనరావు కోగంటి దుర్గామల్లికార్జునరావు తోడి అల్లుడు. తన తోడి అల్లుని పెద్దకుమారుని మల్లికార్జునరావు తన అభిమానపుత్రుడుగా ఎంచుకొనుచున్నాడు.

నా తల్లి నాలుగో చెల్లెలు శ్రీమతి రాజరత్నమ్మ నా ముత్తవతల్లి లక్ష్మమ్మ అన్న అక్కినేని సొబ్బన్న ఏకైక కుమా రుడు శేషయ్యగారిని వివాహమాడారు. శేషయ్యగారిది అంగలూరే. ఆమెకు ముగ్గురు కొడుకులు నిలిచి యున్నారు. చివరివాడు వెంకటేశ్వరరావుకు నా చెల్లెలు ద్రౌపదమ్మ నాల్గవ కూతురు భాస్కరమ్మ భార్య అయినదని పైన చెప్పియున్నాను. పెద్ద కొడుకు సత్యానారాయణ, రెండవ కొడుకు మల్లికార్జునరావు సినిమారంగంలో పనిచేస్తున్నారు. రాజరత్నమ్మ పిన్ని, ఆమె కంటె మిన్నగా ఆమె అత్త బుల్లెమ్మగారు నన్నెంతో ఆదరించి, మిక్కిలి ప్రేమతో చూచేవారు. నిజానికి నా మేనమామగా రింట్లో కంటె రాజమ్మ పిన్నిగారింట్లోనే చనువెక్కువ. అక్క కొడుకుయందు ప్రీతి వుండటం రాజమ్మపిన్నికి సహజమేగాని, ఆమె ద్వారా బంధువైన ఆమె అత్త బుల్లెమ్మగారు నాయం దత్యంత ఆప్యాయత చూపటం మిక్కిలి విశేషం. అత్తా కోడండ్రు

మిక్కిలి అన్యోన్యంగా వుండేవారు. పినతండ్రి శేషయ్యగారు కూడా బంధుప్రీతితోనే వుండేవారు గాని, మితభాషి, భోజనం మిక్కిలి త్వరగా, కడుగుకొన్న కాళ్లతడి ఆరకముందే భుజించేవారు. వారికి ఆడపిల్లలు లేరు. పైజెప్పిన ముగ్గురుగాక యింకొక కుర్రవాడు కౌమారదశకు చేరుకునేకాలంలో చటుక్కున చనిపోయాడు. వాడు మిక్కిలి అందమైనవాడు. 'బ్రతుకని బిడ్డ బారెడు' అంటారు కదా! అత్తా కోడండ్రు స్వల్ప వ్యవధిలో ఎడబాటు సహించనట్లుగా, ఒకరివెంట ఒకరు దాటిపోయారు.

మా మాతామహి లక్ష్మమ్మగారి ముగ్గురు సోదరులలో పెద్దవాడు పైజెప్పిన సాబ్బన్నగారుగాక, రెండవవారు పుల్లయ్యగారు, మూడవవారు నారయ్యగా రుండేవారు. నారయ్యగారు సంతానవిహీనంగా చనిపోయారు. పుల్లయ్యగారు యిద్దరు కొడుకులను, ఒకకూతురును విడిచిపెట్టి చిన్నతనంలోనే మరణించారు. సాబ్బన్నగారి నెరుగనుగాని, నారయ్యగారు నల్లగా వుండేవారు. పుల్లయ్యగా రట్లుగాక మిక్కిలి స్ఫురద్రూపంతో, మంచి మీసకట్టుతో కురచగా, అందంగా వుండేవారు. ఆయన రెండవ కొడుకు లక్ష్మీపెరుమాళ్లు తల్లి నరసమ్మగారి నలుపురంగును పంచుకుని చామనచాయగా వుంటాడుగాని, పెద్దకొడుకు బలరామకృష్ణయ్య బంగారుఛాయతో కొంచెం క్రిందకువాలిన కోటేరు వంటి ముక్కుతో మిక్కిలి అందంగా వుండేవాడు. అతడు బాల్యంలో చక్కని ఆడపిల్లవలె వుండేవాడు. అతడు స్కూలు ఫైనల్‌వరకు చదివి, అక్క డక్కడ తిరిగి చివరకు గుంటూరు జిల్లా తెనాలి చేరుకొని, దాని మునిసిపాలిటీకి ఛైర్‌మన్‌గా వుండిన శ్రీ త్రిపురనేని రామస్వామిచౌదరిగారి ఆధ్వర్యంక్రింద మార్కెటింగ్ ఆఫీసర్‌గా పనిజేస్తూ చిన్న వయస్సులోనే గతించాడు. కూతురు పెండ్లికి సంబారాలు ఏర్పరచుకొనటానికి రిక్షాలో బజారుకు వెళ్లి తిరిగి వస్తూ, గుండె ఆగి ఆ రిక్షాలోనే చనిపోయాడు. అతని భార్య మనోహరం పైజెప్పిన బుల్లెమ్మగారి సోదరుని కుమార్తె. వారి కొక కొడుకు, నల్గురు కూతుళ్లు నిలిచియున్నారు. పెద్దకూతురు కొడుక్కే రాజమ్మపిన్ని

మూడో కొడుకు వెంకటేశ్వరరావు కూతురు నివ్వటం. బలరామ కృష్ణయ్య డ్రామా పద్యాలు బాగా చదివేవాడు. నాయం దభిమానంతో వుంటూ, అప్పు డప్పుడు నే నుండిన చోటికి వస్తూండేవాడు. నేను 1928 లో తెనాలికి శ్రీ కవిరాజుగారింటికి వెళ్లినప్పుడు నాకు తోడుగా వుండినాడు. నేను 1932 లో గుంటూరులో ఇన్‌కమ్ టాక్స్ ఆఫీసరుగావుండినప్పుడు శ్రీ కవిరాజుగారిని మాయింటికి తీసుకునివచ్చాడు.

మా తల్లి ఆఖరు చెల్లెలు శ్రీమతి తులశమ్మగారు అంగలూరు వాస్తవ్యుడు శ్రీ దుగ్గిరాల పురుషోత్తంగారి పెద్ద కుమారుడు అప్పుడు అంజయ్య అని పిలువబడే శ్రీ రాఘవ చంద్రయ్యగారికి భార్య అయ్యారు. శ్రీ పురుషోత్తంగారు గొప్ప సంస్కృతం, తెలుగు పండితులు. వారి విషయం మొదటి భాగంలో వ్రాశాను. శ్రీ రాఘవచంద్రయ్యగారి విషయం కూడా వ్రాసియున్నాను. తండ్రిగారి పాండిత్య ప్రకర్ష కొడుకుకు లభించక పోయినా, శ్రీ రాఘవచంద్రయ్య పిన్నవయస్సులోనే చక్కని కవిత్వం చెప్పుచు, అష్టావధానం చేయగలిగేవారు. 1914 లో శ్రీ కొమర్రాజు లక్ష్మణరావుగారి యాజమాన్యంక్రింద నడచుచుండిన విజ్ఞానచంద్రికా మండలి నవల పోటీలో వారు రచించిన "విజయనగర సామ్రాజ్యం" ప్రథమ బహుమతి (ఐదువందలరూపాయలు) గెల్చుకొన్నది. కాని, ఏవో వ్యాపకాలు, రాజకీయాలు పెట్టుకొని దేనిలోనూ రాణించక, పైకి రాక అట్టడుగునపడిపోయి నారేమో అనునట్లున్నారు. వారి తమ్ముడు శ్రీ రామకృష్ణయ్య సాత్వికసంపన్నుడు. మా బందరు 1915-1916 వసతిలో వుండేవాడు. నాయందు మిక్కిలి అభిమానం, ఆప్యాయత కలిగి వుంటాడు. మాపిన్ని తులశమ్మ, పినతండ్రి రాఘవ చంద్రయ్యలకు నలుగురు కొడుకులు, యిద్దరు కూతుళ్లు కలిగారు. పెద్దకూతురు శకుంతల అకాలమరణం పాలయింది. మిక్కిలి వృద్ధిలోకి వచ్చి తాతవలె పండితు డౌతాడనుకొన్న పురుషోత్తం అనే పేరుగల మూడవవాడు చిన్నవయస్సులోనే చనిపోయాడు. పెద్దవాడు విశ్వనాథబాబు యమ్. ఎ., లిటరేచర్ (ఇంగ్లీషు)

డిగ్రీని పొంది యున్నాడు. ఏదో తగాదా పెట్టుకొని కాలేజీ లెక్చరర్ పదవిని మానాడు. విద్యావతి, సంతానవతి, హెడ్ మిస్ట్రెస్‌గా హయ్యర్ ఎలిమెంటరీ స్కూలులో పనిచేయు చున్న భార్యతో సంబంధం వదులుకొని తల్లివద్దనే వుంటున్నాడు. రెండవవాడు కృష్ణబాబు ఏదో ఉద్యోగం చేసుకొనుచున్నాడు. మూడవవాడు సీతయ్య వ్యాపారం చేసుకుంటున్నాడుగాని, తల్లిదండ్రులతో విరోధంపెట్టుకుని, వారిని కోర్టుకీడ్చి సాగిస్తున్నాడు. "పండిత పుత్రః శుంఠకాయః" అని పూరకనే అన్నారా! వారి రెండవ కూతురు సంతానంతో విజయవాడలోనే వుండు చున్నది.

ఇక నా కుటుంబ విషయం: నా పెద్దబిడ్డ కూతురు వజ్రాంబను గుడివాడ తాలూకా చినపారుపూడి మలినేని వీరభద్రయ్యగారి రెండవ కుమారుడు రంగదాసు కిచ్చి 1931-వ సంవత్సరములో వేసవిలో వివాహం మా అత్త శ్రీమతి రంగమ్మ గారి ఆధిపత్యంక్రింద పెడసనగల్లులో జరిగింది. అప్పటికాలంలో చెలామణి అవుతున్న స్వల్పమొత్తం కట్నం, వివాహ ఖర్చులు రంగమ్మగారే భరించారు. వజ్రాంబకు ఒక కుమారుడు కలిగిన తర్వాత, భర్త రంగదాసు వ్యాధిగ్రస్తుడై కొలది సంవత్సరాలకే చనిపోయాడు. కుమారుడు వీరభద్రరావు 1933-వ సంవత్సరము మే 5-వ తారీఖున జన్మించాడు. తండ్రి వ్యాధిస్వభావాన్ని బట్టి వాడు రెండవ ఏటనో, మూడవ ఏటనో మావద్దకు వచ్చి 20 సంవత్సరాల పైచిల్కు 1957-వ సంవత్సరం వరకు మావద్దనే పెరిగాడు. నా భార్య అన్నపూర్ణమ్మ మనుమని అతిగారాబంతో, తన బిడ్డలయందు కంటె ఎక్కువ ప్రేమతో సాకి, పెద్దవానిని చేసింది. వానికి 1954 వేసవిలో తమిరిశగ్రామం మాగంటి వెంకట రామదాసుగారి రెండవ భార్య శ్రీమతి యశోదమ్మవల్ల కలిగిన రెండవకుమార్తె అన్నపూర్ణాదేవితో వివాహం జరిగింది. అన్నపూర్ణాదేవి కూడా పెండ్లయిన తర్వాత మా యింటికే వచ్చి వేసింది. అక్కడ వా రిద్దరకు 1956 మే 1-వ తారీఖున మా వద్దనే ప్రథమ సంతానం ఆడపిల్ల కలిగింది. ఆ పిల్లకు పేరు నా

సూచనమీద 'మంజూష' అని పెట్టాం. తరువాత ఆ దంపతులకు ప్రభాకర్, నళిని, సురేష్ అనే పిల్లలు కలిగారు. ప్రభాకర్ యిప్పుడు బందరులో ఇంటర్మీడియేట్ సీనియర్ క్లాసు చదువుచున్నాడు. మంజూష స్కూల్ఫైనల్ పాసై, ఇప్పుడు గుడివాడలోని స్త్రీల కళాశాలలో ఇంటర్మీడియేట్లో చేరింది. నళిని, సురేష్లు స్వగ్రామం చినపారుపూడిలో చదువు కొనుచున్నారు.

నా సంతానం 1916 అక్టోబరు 2-వ తారీఖున జన్మించిన మలినేని వజ్రాంబ గారికి పూర్ణచంద్రరావు, రాధాకృష్ణ, సుధాకర్ అను పేర్లు గల కొడుకులు, రెండవ కూతురు కమలకుమారి. వీరి విషయం పైన మొదటి శీర్షిక "గ్రామ జీవితం" లో చెప్పి యున్నాను. మా పెద్దకొడుకు పూర్ణచంద్రరావు 1938 నవంబరు 13-వ తారీఖున బెజవాడ కమ్మహాస్టల్లో అవివాహితుడుగా అకాలమరణం పొందాడని విపులంగా నా మొదటి పుస్తకం "తాంబూలం — నైవేద్యం" అను దానిలో "మా బాబు" అను శీర్షిక క్రింద చెప్పాను.

నా భార్య తరఫువారినిగురించి : నా భార్య అక్క పున్నమ్మ నా పెదతండ్రి కొడుకు బుల్లిసుబ్బయ్య అనే వెంకట సుబ్బయ్యగారి పెద్దకొడుకు సత్యనారాయణగారి భార్య అని పైన చెప్పియున్నాను. వారికి ఆరుగురు కొడుకులు, ఇద్దరు కూతుళ్లు. పెద్దకూతురు జగదాంబ నేను 1940-48 లో బెజవాడలో ఇన్కమ్టాక్సు ఆఫీసరుగా వుండి నప్పుడు మాతో వుండి, సెయింట్ యాన్ కాన్వెంటు స్కూలులో కొంతకాలం చదువుకొన్నది. ఆ బిడ్డకు మావద్ద వుండగనే దివి తాలూకా చల్లపల్లి దగ్గర కొప్తాన్ పాలెం వాస్తవ్యులు కొర్రపాటి శివరామయ్యగారి కొడుకు సత్యనారాయణ వరప్రసాద్తో వివాహ మైంది. ఆమెకొక కూతురు, ముగ్గురు కొడుకులు. కొడుకుల పేర్లు శివరామయ్య, జగదీశప్రసాద్, చంద్రశేఖర్. కూతురు అంకమ్మ అను పేరుగలది. వారందరు సలక్షణంగా వున్నారు. శివరామయ్య గుల్బర్గాలో మెడిసిన్ చదువుచున్నాడు. రెండవ కూతురు

లక్ష్మీబాయిని కూడా చల్లపల్లి కెప్టెన్ పాలెంలోని కొత్రపాటి యింటిపేరుగల యింకొక కుటుంబంలోని యువకుడు (శ్రీ) శివరామ కృష్ణయ్యగారి రెండవ కుమారుడు దుర్గారామచంద్రరావు కిచ్చి వివాహం చేశారు. వారి కిద్దరు కూతుళ్లు పున్నమాంబ, విమలాదేవి, ఒక కొడుకు కేశవరావులు కలరు. ఇద్దరు కూతుళ్లకు పెండ్లిండ్లైనవి. పున్నమాంబ కిద్దరు కూతుళ్లిప్పటికి. భర్త డాక్టర్ చంద్రమౌళి యమ్.బి. బి.యస్. విమలాదేవి వివాహం ఈమధ్యనే జరిగింది. ఆమె భర్త ఆమె నాలుగో మేనమామ వీరభద్రయ్య రెండో కొడుకు శివప్రసాద్. అతడు బి. ఇ. డిగ్రీని తీసుకొని పై చదువుకు అమెరికాకు వెళ్లాడు. కొడుకు కేశవరావు బందరులో చదువుకొనుచున్నాడు.

వదిన (భార్య అక్క) పెద్దకుమారుడు సూర్యప్రకాశ రావుకు గోవర్ధనరావు అను కొడు కొక్కడే. కూతుళ్లు లేరు. ఒక కూతురు 6, 7 ఏళ్లు బ్రతికి చనిపోయింది. గోవర్ధనరావుకు కొడుకులు లేరు. ముగ్గురు కూతుళ్లు. పెద్దకూతురు, రెండవ కూతురు ఇప్పుడు బెజవాడలో మేరీస్టెల్లా కాలేజిలో ఇంటర్ మీడియేట్ చదువుచున్నారు. రెండవవాడు, సీతారామారావుకు సంతానం లేదు. అతని భార్య సోమమ్మ ఈ ఊరి పిల్లే. ఆమె మాయందు మిక్కిలి అభిమానంగా వుంటుంది. మూడవవాడు పూర్ణచంద్రరావు అంగలూరు కాపురస్థుడు, దుగ్గిరాల నరసయ్య గారి కుమార్తె అమృతమ్మను వివాహమాడాడు. అతని కిద్దరు కొడుకులు. కూతుళ్లు లేరు. పెద్దవాడు వీరభద్రరావు బి. కామ్. చదివి ఆంధ్రబ్యాంకు సర్వీసులో చేరి, ఇప్పుడు బెజవాడ సూర్యారావుపేటలో దాని బ్రాంచి ఏజంటుగా పనిచేస్తున్నారు. అతని కొక కొడుకు, ఒక కూతురు. రెండవవాడు మధుసూదనరావు చదువు మధ్యనే ఆపివేశాడు. మొవ్వ కాపురస్థుడు (శ్రీ) మండవ కనకయ్యగారి కుమార్తెను వివాహమాడాడు. వాళ్ల కిద్దరు కుమార్తెలు. మా వదిన నాలుగో కొడుకు భద్రయ్య అని మామూలుగా పిలువబడే వీరభద్రయ్య. అతడు ఈ యూరి మునేదారుగా చాలా సంవత్సరాలు ఉద్యోగ నిర్వహణచేసిన

సూరపనేని ముత్తన్నగారి కుమారుడు వీరరాఘవయ్యగారి కుమార్తె మస్తానమ్మను వివాహమాడాడు. ఆ దంపతుల కిద్దరు కుమాళ్లు, ఒక కుమార్తె. పెద్దకుమారుడు శివకుమార్ మెడిసిన్ కోర్సు పూర్తిచేశాడు. రెండవవాడు పైజెప్పినట్లు అమెరికాకు వెళ్లియున్న శివప్రసాద్. కుమార్తె భవాని మెడిసిన్ చివరి సంవత్సరంలో వున్నది. ఈ యూరి సూరపనేని అక్కమ్మగారి పిచ్చయ్య అనేవారి పెద్దకొడుకు వెంకటరత్నం కుమారుని వివాహమాడింది. ఆమెకు కొన్నిరోజులక్రితమే ఆడపిల్ల కలిగినది. అయిదవవాడు వెంకటేశ్వరరావు మా పెద్దత్త కుమారుడు సూరపనేని వీరరాఘవయ్యగారి కుమార్తె కమలమ్మను వివాహమాడి, ఆమె యందు ముగ్గురు కూతుళ్లను, ఒక కొడుకును కన్నాడు. క్షయవ్యాధి సంభవించి అకాలమరణం పొందాడు. ఆరవవాడు నాగేశ్వరరావు తన రెండో అన్న సీతారామారావు మరదలు కమలామనోహరాన్ని చేసుకొన్నాడు. అతనికి ముగ్గురు కొడుకులు. పెద్దవాళ్లిద్దరు వైద్యవిద్య చదువుకొను చున్నారు. మూడవవాడు బందరులో ఇంటర్ మీడియేట్ కోర్సు చదువుచున్నాడు. నాగేశ్వరరావు బి. కాం., బి. యల్. డిగ్రీలు కలవాడు. కొంతకాలం అడ్వొకేట్‌గా శ్రీ పిన్నమనేని లింగయ్య చౌదరివద్ద జూనియర్‌గా పనిచేసి, తర్వాత లైఫ్ ఇన్సూరెన్సు కార్పొరేషన్‌లో చేరి అభివృద్ధిలో నున్నాడు.

మా పెద్దత్తకొడుకు సూరపనేని వీరరాఘవయ్యగారి కిద్దరు కొడుకులు, నల్గురు కూతుళ్లు. వీరరాఘవయ్యగారి తండ్రి శోభనాద్రిగారు. వారి విషయం మొదటి భాగంలో చెప్పాను.

నా రెండవ కుమార్తె కమలకుమారి మామ (శ్రీ) తెలమాటి (శ్రీ)మన్నారాయణమూర్తిగారిని గురించి ఇదివరలో అక్కడక్కడ చెప్పియున్నాను. వీరు మిక్కిలి ఉత్సాహవంతులు. సాహిత్య, లలితకళల యందు మిక్కిలి అభిమానం కలిగియుంటారు. మాట్లాడటం, ఉపన్యసించటం వారికి సర్దా. ధారావాహినిగా, గొప్పగా ఉపన్యసిస్తారు. వారి జ్ఞాతి పద్మనాభంగారు వారి స్వగ్రామం

కొవ్వలి గ్రామానికి మునిసిఫ్. వారు మాకాలనాడు బందరు హిందూ హైస్కూలులో చదువుకొన్నారు. వారి పరిచయ మప్పుడే నాకు కలిగింది. వారు మిక్కిలి సజ్జనులు, బంధుప్రీతి మిక్కిలి హెచ్చుగా కలవారు. ఎనలేని ఆప్యాయత కనబరచేవారు. వారి మర్యాద మన్ననలు చాలా గొప్పవి. మధురభాషి, మంచివక్త. వారు నాయందు ఎల్లప్పుడు మిక్కిలి అభిమానంతో వుంటూవుంటారు. వారి కుమారుడు శ్రీ రమేష్‌చంద్రచౌదరి శ్రీ ముక్త్యాల రాజా వారి కుమార్తెను వివాహమాడారు. వారు మద్రాసు గిండీ కాలేజిలో ఇంజనీరింగ్ చదివి, ఉన్నతస్థాయిలో బి. ఇ. డిగ్రీని పొందినా, వారి మామగారైన పెద్ద రాజాగారు శ్రీ చంద్రమౌళీశ్వరప్రసాద్ బహద్దర్ గారి కిష్టం లేనందున ఉద్యోగం చేయనే లేదు. వారిప్పుడు వ్యవసాయం చూచుకుంటున్నారు. ఆయనగారు చక్కగా వ్రాయగలరు, ధారాళంగా ఉపన్యసించగలరు.

నా కొవ్వలి వియ్యంకుని తమ్ముడు శ్రీ వెలమాటి సూర్యనారాయణను గురించి పైన చెప్పియున్నాను. ఆయన కిద్దరు కుమారులు, యిద్దరో, ముగ్గురో కుమార్తెలు. వారి పెద్దబ్బాయి రామకృష్ణారావు వ్యవసాయంలోను, పశుపోషణలోను దక్షుడు. ఆయనవద్ద కొన్ని ఉత్తమమైన ముర్రా గేదెలు, దున్నపోతులుండేవి. రెండో కుమారుడు రఘునాథరావు భూములు తండ్రికి ఒప్పజెప్పి తా నక్కడక్కడ కంట్రాక్టుపనులు చేస్తున్నాడు. శ్రీ రామకృష్ణారావుకు 5, 6 గురు పిల్ల లున్నారు. రఘునాథరావుకు మిక్కిలి చక్కని కుమార్తె, కుమారు డున్నారు.

నేనీ శీర్షిక ముగించేముందు ప్రఖ్యాత ఆడిటరు శ్రీ పర్వతనేని బ్రహ్మయ్యగారిని గురించి చెప్పవలసియున్నది. ఆయన బంధువే గాక మిత్రుడు కూడా. వీరు గుడివాడ తాలూకా నూజెళ్ల గ్రామ కాపురస్థుడు శ్రీ పర్వతనేని బ్రహ్మయ్యగారి 5 గురు కొడుకులలో మూడవవారగు అంజయ్యగారి రెండవకుమారుడు. మన దేశంలో డిగ్రీని సంపాదించి, ఇంగ్లండులో ఇన్ కార్పొరేటెడ్ అక్కౌంటెంటు పట్టాను పొంది, మద్రాసులో మొదట శ్రీ వెనిగళ్ల పిచ్చయ్య చౌదరితో కలసి ఆడిటర్‌గా వుండి, శ్రీ పిచ్చయ్య (వి. పి.

ఆడిటర్ శ్రీ పర్వతనేని బ్రహ్మయ్య ఇంగ్లండుకు విద్యాభ్యాసానికి వెళ్లుచున్నప్పుడు మద్రాసులో తీసిన ఫొటో

కూర్చున్నవారు - ఎడమనుండి: 1. శ్రీ పర్వతనేని గోపాలకృష్ణయ్య, 2. శ్రీ ఎ. రంగారెడ్డి, 3. శ్రీ పర్వతనేని అంకయ్య
4. శ్రీ పర్వతనేని బ్రహ్మయ్య, 5. గ్రంథకర్త, 6. శ్రీ పర్వతనేని భూషయ్య
7. శ్రీ పర్వతనేని సుబ్రహ్మణ్యం

నిల్చున్నవారు, ప్రథమ పంక్తి - ఎడమనుండి: 1. శ్రీ సుంకర శంకరరావు, 2. డా. నాగయ్య, 3. డా. సూ. చంద్రమౌళి
5. శ్రీ బొప్పన వటుంబరావు, 6. శ్రీ డి. మునికన్నయ్య, 7. శ్రీ చలసాని వీరభద్రయ్య

రెండవ పంక్తి: 1. శ్రీ పర్వతనేని రంగారావు, 2. శ్రీ జంపాల సాంబయ్య, 3. శ్రీ పర్వతనేని రామకృష్ణయ్య
4. శ్రీ ఆర్. కాసలేంద్రరావు, 6. శ్రీ లింగం వెంకట కృష్ణయ్య, 7. శ్రీ పర్వతనేని భీమయ్య

చౌదరి) కొలదికాలంలోనే ఇన్‌కంటాక్స్ డిపార్టుమెంట్‌లో చేరిన తర్వాత, బ్రహ్మయ్య అండ్ కంపెనీ పేరుతో అక్కౌంటెంట్సు అన్డ్ ఆడిటర్స్ ఫరమ్ పెట్టి, దానిని మిక్కిలి విస్తృతపరచి బెంగుళూరు, విజయవాడ, హైదరాబాద్ మొదలైనచోట్ల బ్రాంచి ఆఫీసులను నడపుచు, మిక్కిలి పేరు ప్రతిష్ఠలను గడించారు. ఈ సర్వీసులో ప్రథమశ్రేణికి చేరుకొని, ఉన్నతస్థాయికి వచ్చారు. వీరి మధ్య బ్రహ్మయ్య అండ్ కంపెనీ కార్యకలాపాలలో స్వయంగా పాల్గొనుచుండుట లేదుగాని, వారి మద్రాస్ ఆఫీసేగాక, బ్రాంచి ఆఫీసులు కూడా యథాప్రకారం పెద్ద స్థాయిని కొనసాగుచున్నవి.

శ్రీ బ్రహ్మయ్య, నా పెదతండ్రి కుమారుడు బుల్లి సుబ్బయ్య అనే వెంకట సుబ్బయ్యగారి అల్లుడు గోపాలకృష్ణయ్యగారి అన్న కుమారుడేగాక, పైనజెప్పిన పర్వతనేని వెంకటరత్నం (నా ఆరవ పెదతండ్రి వెంకట సుబ్బయ్యగారి అల్లుడు) గారి పినతండ్రి కుమారుడు. శ్రీ వెంకటరత్నం మా చెల్లెలి పెనిమిటేగాక, ఆయన చెల్లెలిని మా లింగం వెంకట కృష్ణయ్య కిచ్చారు. మరిన్ని, వెంకట కృష్ణయ్య మూడో కొడుకు మల్లికార్జునరావుకు. శ్రీ బ్రహ్మయ్య పెద్దకుమార్తె వేదవతి భార్య అయినది. ఆయన పెద్దకొడుకును వెంకట కృష్ణయ్య మూడో కూతురు నిచ్చారు. ఈవిధంగా శ్రీ బ్రహ్మయ్య నాకు బంధువు. ఆయన ఇంగ్లండు వెళ్లుచున్నప్పుడు వీడ్కోలిచ్చినవారిలో నేనొకడను. ఇంగ్లండునుండి తిరిగివచ్చిన తర్వాత నేను మద్రాసులో వుండిన కాలంలోను, తర్వాతను స్నేహితులుగా కూడా వర్తించుచున్నాము. ఉభయులకు ఒకరియందు మరొకరికి స్నేహభావమేగాక ఆప్యాయతకూడా కలదు.

శ్రీ బ్రహ్మయ్య చాకచక్యం, కార్యదక్షత, ఆకట్టుకొనే నేర్పు, మాటల నైపుణ్యం, సంఘటితపరచే (ఆర్గనైజ్) శక్తి కలవాడు. ఈ విశిష్ట గుణాలవల్లనే బ్రహ్మయ్య అన్డ్ కంపెనీని వృద్ధిలోకి తెచ్చి విస్తృతపరచాడు.

## ౮

## ౮. మిత్రులు

---

బంధువులు—మిత్రులు అను యీ శీర్షికక్రింద మొదట బంధువులను గురించి చెప్పాను. బంధుత్వంలో స్నేహం నెరపిన వారిని గురించి చెప్పాను. ఇప్పుడు బంధువులుకాని మిత్రులను గురించి చెప్పుతాను. మిత్రు లనగా ఎవ రని ప్రశ్న రావచ్చును. నా "అభిప్రాయాలు—అనుభవాలు" అనే పుస్తకంలో "మిత్రుడు-స్నేహితుడు" అని వివరణీకరించాను. ఆ వివరణ నటుంచి, సహవాసాన్ని గాఢంగా కాంక్షించువాడు, అరమరికలు లేక హృదయాన్నిచ్చి పుచ్చుకొనేవాడు, సుఖదుఃఖాలను పంచుకొనేవాడు, కష్టకాలంలో తన నష్టాన్ని లెక్కపెట్టక ఆదుకొనేవాడు అట్టివానిని మిత్రు డని చెప్పాలి. అట్టివారు మిక్కిలి కొలదిమంది వుంటారు. నా స్వభావాన్నిబట్టి కాబోలు, నా కట్టి మిత్రులు లభించలేదు. నెచ్చెలులవంటి వారంతకుముందే నాకు ప్రాప్తం కాలేదు. హృదయాన్నిచ్చిపుచ్చుకునే నెచ్చెలికా డొకడు దొరికాడని 1915 లో నే ననుకొన్నానుగాని, అతని స్వభావం అట్టి అదృష్టం నాకు కలిగించలేదు. కాబట్టి నాకు పరిచయులు, ఎక్కువ పరిచయులు, కొంత దగ్గరగా వచ్చినవారు ఎక్కువగానే వున్నారుగాని, నిజమైన మిత్రులుగాని, నెచ్చెలులవంటి స్నేహితులు



గ్రంథకర్త సహాధ్యాయి, ఆబాల్యమిత్రుడు
పండిత శ్రీ గొర్రెపాటి వెంకటసుబ్బయ్యగారు

గాని లేరనే చెప్పాలి. సరే, 'గ్రుడ్డిలో మెల్ల' న్నట్లు కొంత మందినైనా మిత్రు లనుకోనక తప్పదు. అట్టివారిని గురించి వ్రాస్తున్నాను.

నా బాల్య కౌమారదశలో స్నేహితు లెవరూ వున్నట్లు నాకు గుర్తులేదు. మా యూరివాళ్లు సూర్యచంద్రులని నేను పిలుచు చుండే మల్లాప్రగడ సూర్యనారాయణ, మల్లాప్రగడ చంద్ర శేఖరరావు అనే బ్రాహ్మణ కుర్రవాళ్లు మిత్రులై యుండినారు. అందులో చంద్రశేఖరరావు మరింత దగ్గరగా వచ్చి, నా మంచం మీద పడుకొనే చనువును ఏర్పరచుకొన్నాడు. అయితే, ఏ ఆట పాటలలోను నే నతనితో జతకట్టలేదు. ఈ సూర్యచంద్రులను గురించి మొదటి భాగంలో చెప్పాను.

నేను విద్యాభ్యాసం చేస్తున్నప్పుడు నా మేనమామల గ్రామం అంగలూరు వాస్తవ్యుడు శ్రీ కంచర్ల బసవకోటిలింగం పరిచయమై మిత్రుడైనాడు. ఆయన సహవాసంలో నా సాహిత్యాభిలాష పెరిగింది. బసవకోటిలింగంగారు విషయజ్ఞానం కలిగినవాడు, ప్రబంధాలు మొదలైన వానిని తరచినవాడు, కవి. అంతేకాదు, నిత్యప్రబోధకుడు. ఆయన తన జీవితాన్ని హైస్కూలు తెలుగు బోధకుడుగా చాలా సంవత్సరాలు గడిపాడు. ఆ బోధనా శక్తిని, నాయందు ప్రబోధంలోకూడా టుపయోగించారు. అందువలన నాకు సాహిత్యాభిలాషను రేకెత్తించి, పెంపొందించిన వారిలో బసవకోటిలింగంగారికి ప్రథమస్థాన మిస్తాను. ఆయనను 1961 వేసవిలో జరిగిన నా రెండవ కుమారుని వివాహానికి ఆహ్వానించి, సత్కరించాను. ఇంకొకసారి కలసికొనకముందే ఆయన శివ సాయుజ్యం పొందాడు.

నా బందరు నోబుల్ హైస్కూలు చదువులో నా సహాధ్యాయుడుగా వుండిన ఘంటసాల కాపురస్థుడు శ్రీ గొర్రెపాటి వెంకట సుబ్బయ్యగారు మిక్కిలి దగ్గరమిత్రు డైనాడు. వీరిని గురించి నా మొదటి భాగంలో వ్రాశాను. ఈ 1974-వ సంవత్సరము సంక్రాంతికి తిరిగి మిత్రమండలి సంక్రాంతి సాంస్కృతిక సమావేశా న్నేర్పాటుచేశాడు. "నిరుడు (1973) ఏర్పాటు

చేశారు కదా, ఈ కరువుకాలంలో తిరిగి ఎందుకు చేస్తున్నా!'' రని నే ననగా, ''నిరుడు రావలసిన మిత్రు లందరు రాలేదు'' అన్నారు. ఆయన మెత్తగా పైకి కనపడినా పట్టుదల, ధీరత్వం, సాహసం కలవాడని తోస్తుంది. ఆయన ప్రేరేపణవల్లనే ఈ సంక్రాంతి సమావేశా లారంభింపబడి జరుగుచున్నవి. అందువలన అవి నిర్విఘ్నంగా సాగాలని ఆయన దృఢసంకల్పం. ఇందులో కొంత తన ప్రతిష్ఠ, పెద్దరికం, పెత్తనం, కాంక్ష వున్నదని నేను 1965 లోనే మా యింట సమావేశం జరిగినప్పు డనుకొన్నాను. కీర్తి కాంక్ష హెచ్చుగానే వున్నా, చేసేది మంచిపని కనుక సంతోషించాలి.

పుణుకొల్లు (గుడివాడ తాలూకా, పెదపారుపూడి) సూర్యనారాయణ కూడా నా మూడవ ఫారంలో మిత్రుడైనాడు. ఆయన, నేను చాలా అరుదుగా కలసికొంటాం. అయితే, ఆయన నా యం దిప్పటికిని మిక్కిలి అభిమానం కలిగివుంటాడు. ఒక రోజున మాయింటి కాయన రాగా, ప్రస్తావనలో తనవద్ద 3, 4 ఫారాల గ్రూపు ఫోటో లున్నవని చెప్పాడు. వానిని తెప్పించుకొని, వాని కాపీలు తీయించి, బ్లాకులను చేయించి మొదటి భాగంలో ఉపయోగించాను. అప్పుడు బందరు నోబుల్ హైస్కూలులో చదువుకుంటూ, మా పై క్లాసులో విద్యార్థిగా వుండిన శ్రీ గొట్టిపాటి బ్రహ్మయ్యగారినిగురించి మొదటి భాగంలో ఘంటసాల మిత్రులను గురించి చెప్పినప్పుడు వ్రాశాను.

బందరు నోబుల్ కాలేజిలో చదువుకొనుచున్నప్పుడు నా సహాధ్యాయు లొకరు శ్రీ పడాల కోటయ్యనాయుడుగారు నాకు మిత్రులుగా పరిణమించారు. వారిని గురించి వ్రాస్తూ, వారు నాకు పంపిన పద్యాలను నాల్గింటిని నా మొదటి భాగంలో చేర్కొన్నాను.

నేను 1918-వ సంవత్సరము మార్చిలో స్కూల్ ఫైనల్ పరీక్షలో నుత్తీర్ణుడనైన తర్వాత ఆ సంవత్సరం జూలైలో గుంటూరు ఏ. వి. యల్. యమ్. కాలేజిలో చేరానని, సహాధ్యాయి కొత్త వెంకయ్యచౌదరిగారి మైత్రి కలిగిందని, తర్వాత

ఎడింబరో సబర్బ్ పోర్టో బెల్లోలో వారితో తిరిగి సాంగత్యం కలిగిందని నా మొదటి భాగంలో చెప్పాను.

నా ఇంగ్లండు చదువులో ఆక్స్‌ఫర్డులోను, లండన్‌లోను పరిచయమైన వారిని పేర్కొం, వారిలో కొందరిని గురించి కొంత మొదటి భాగంలో వ్రాశాను. నిజానికి "మిత్రులు" శీర్షిక క్రింద వ్రాయవలసినవారు ఆరుగురు మాత్రమే. (శ్రీ) ఆచార్య రంగా, డాక్టర్ వాసిరెడ్డి (శ్రీ)కృష్ణ, (శ్రీ) కూర్మా వేణుగోపాలస్వామి, (శ్రీ) ఒ. పుల్లారెడ్డి, (శ్రీ) టి. మురారి, (శ్రీ) డబ్లుయు. వలీథార్మి అనువారు. మాకు ఆక్స్‌ఫర్డులో రక్షకుడుగా 1920–21 లో నుండిన (శ్రీ) వెలగపూడి రామకృష్ణ, వారితో కలసియుండిన ఇంకొక ఐ. సి. యస్. ప్రొబేషనర్ (శ్రీ) టి. భాస్కరరావు ఈ శీర్షిక క్రిందకు రారు. పైగా వారిని గురించి నా మొదటి పుస్తకం "తాంబూలం – నైవేద్యం" లోను, ఈ పుస్తకం ప్రథమ భాగంలోను చెప్పియున్నాను.

ఆచార్య యన్. జి. రంగాగారిని గురించి "తాంబూలం – నైవేద్యం" లో విపులంగా వ్రాశాను. మరిన్ని, మొదటి భాగంలో వారి ప్రస్తావన వచ్చింది. అయినా, ఇంకా నాలుగు ముక్కలు వారిని గురించి చెప్పటం నా ధర్మ మనుకొను చున్నాను. వారొక నిస్వార్థ దేశభక్తుడు, సేవాతత్పరుడు, రైతు బాంధవుడేగాని, రాజకీయతంత్రజ్ఞత తెలియని వేల. ఎవరిని నమ్మవలెనో, ఎవరిని నమ్మకుండవలెనో తెలియని అలౌకికుడు. తనగొంతు కోసేవారినే ఎక్కువ నమ్ముతాడు. నావంటి మిత్రులు హెచ్చరించినా లాభం లేకపోయింది. తాను తినిపించిన నోరే తనచేతిని కరచింది. కులతత్వం బలసిన అనుచరులు, వీరి సాయం పూర్తిగా పొంది, రాజకీయంగా పైకివచ్చి వీరిని త్రోసివేసి, మంత్రి పదవులలో దూరి, లక్షలు సంపాదించుకొన్నారు. నిజాయితీ, నీతివర్తనగల వీరు పిత్రార్జితం, మేనమామ నుండి సంక్రమించిన 40 ఎకరాల పైచిలుకు మాగాణీ భూమిలో, ఇప్పుడు మిగుల్చుకొన్నది ఏ 7, 8 ఎకరాలో. ద్రోహంచేసిన అనుచరులు లక్షలు సంపాదించుకొన్నారని, వీరు తన సంపదను పోగొట్టు

కొన్నారని నా చింతకాదు. శ్రీ రంగా అలౌకికత్వాన్ని, విచక్షణలేని నమ్మకాన్ని చెప్పుచున్నాను.

సరే, వీరికి రాజకీయతంత్రజ్ఞత లేదు. అలౌకికుడు. అమాయకంగా నమ్మే స్వాభావికుడు. అంతటితో ఆగిపోతే వీరి ప్రతిష్ఠకు భంగం వుండదు. వీరి అఖిలభారత స్థాయికి లోటుండదు. కాని, వీరు తరుచు పార్టీలను మార్చటం వీరి వ్యతిరేకులకు వీరిని కించపరచటానికి గొప్ప సాధనమైనది. తాను నమ్మిన త్రోవను నడవటం, తన ధ్యేయాల కనుకూలంగా వర్తించటం, తన ధర్మాలను నెరవేర్చటం విజ్ఞులకు, విశిష్ట వ్యక్తులకు సహజమే. ఇదివర కిట్టి మార్పు లెట్లున్నా, ఈమధ్య వారు స్వతంత్రపార్టీనుండి మారటం సబబుకాదని నా గట్టి అభిప్రాయం. ఎందుకు మారినట్లు? శ్రీమతి ఇందిరాగాంధి ఆశయాలు, పద్ధతులు వారి కిప్పుడు నచ్చినవట. ఆమె నాయకత్వాన అట్టడుగున ఉన్నవారు, బీదలు బాగుపడతారట. ఎంత విచిత్రం! తన గొప్పతనమే పంథాగా, తన అధికారమే ధ్యేయంగా, మామూలు నీతి నియమాలకు, క్రమశిక్షణా పద్ధతులకు భిన్నంగా, తాను మాటిచ్చి, పైగా మద్దతు నిచ్చి నిలబెట్టిన శ్రీ సంజీవరెడ్డికి ద్రోహంచేసి, అనేక దేశభక్తుల రక్తంతో, త్యాగంతో నిలబడిన కాంగ్రెసును చీల్చి, చిందరవందర జేసిన శ్రీమతి ఇందిరమ్మా, ఈ నిజాయితీగల నిష్కల్మష హృదయునకు కావలసినది? ఈమెయా యీ నిస్వార్థపరునకు నాయకురాలు? ఆగర్భశ్రీమంతురాలు, భోగభాగ్యాలతో తులతూగుచున్న ఈమెగారా బీదల నుద్ధరించేది? బీదల నుద్ధరించటం కాదు ఈమె ధ్యేయం. కొంచెమో, గొప్పో వున్నవారి నందరిని బికారులనుజేసి, తన నిరంకుశత్వాన్ని కొనసాగించుకొనటం, స్థిరస్థాపితం చేసుకొనటం. విశేష మే మంటే శ్రీ రంగా రైతు ఉద్యమానికి పితామహుడు. సిసలైన రైతు బాంధవుడు. భూపరిమితులను పేర, కడుపుకు సరిపోయిన బువ్వను తినగలిగే మధ్యరకం రైతును నాశనంచేయటానికి పూనుకొనిన ఇందిరమ్మ కాంగ్రెసులోనా ఈయన చేరవలసింది! ఆంధ్రాకాశాన తోకచుక్కవలె పరిణామమొంది, రైతుల నందరిని కూలీల స్థాయికి



చిరకాల ప్రియమిత్రుడు శ్రీ ఆచార్య యన్. జీ రంగ

దిగజార్చుతాను, భూములు పోయిన వీళ్లు పాలమ్ముకొని బ్రతుకక ఏమిచేస్తారు ! ఎదురించిన వారిపైన జగన్నాథరథం తోలుతాను, మదించిన సింహాల నుసికొల్పుతానని అప్రాచ్యపు ధోరణులతో విజృంభించిన మాజీ ముఖ్యమంత్రి శ్రీ పి. వి. నరసింహారావు సాహచర్యమా వీరికి కావలసింది !

ఇందిరమ్మ మాటను నమ్మి స్త్రీధనాన్ని భూపరిమితినుండి మినహాయిస్తారని శ్రీ రంగా నాకు నమ్మకం చెప్పారు. ఇందిరమ్మ నమ్మకం యిప్పుడే గంగలో కలిసింది ! ఇంతగా నమ్మిన ఇందిరమ్మ కాంగ్రెసు యిప్పుడు జరిగిన రాజ్యసభ సభ్యుల ఎన్నికలో, తన ఊసైనా ఎత్తినదా ! ఇకనైనా శ్రీ రంగా విచక్షణతో వ్యవహరిస్తారని చిరకాలమిత్రుడనైన నేను, ఆశిస్తున్నాను.

దగ్గర బంధువునికంటె మిన్నగా నన్నాదరించిన శ్రీ రంగాగారి సతీమణి శ్రీమతి భారతీదేవిగారిని గురించి కొంత చెప్పాలి. అకాలంగా, అకస్మాత్తుగా 27-9-1972-వ తారీఖున పరమపదించిన వారి స్మృతికి నేను జోహారు లర్పించటం విధ్యుక్తధర్మం. 1924 లో అని జ్ఞాపకం, నాకు ఆక్స్‌ఫర్డ్‌లో పరిచయమైన ఆమెగారు, 1927 లో నే నింగ్లండు నుండి స్వదేశానికి తిరిగి వచ్చినప్పుడు, సోదరివలె ఆప్యాయతలో నన్నాహ్వానించారు. నేను ఈపుస్తకం మొదటి భాగంలో వ్రాసినట్లు నా కష్టకాలంలో నన్ను రక్తబంధువునివలె, కుటుంబసభ్యునివలె, ఆదరించి, ఆప్యాయతతో మూడు నాలుగు మాసాలు వారి అతిథిగా నుండునట్లు ఏర్పాటుచేశారు. వా రప్పుడు చూపిన ఆప్యాయత, ఆత్మీయత, శ్రీ రంగాగారు చూపిన ఆదరణ, అభిమానం వారి కిరువురకు నన్ను కృతజ్ఞుణ్ణి చేసినవి.

వారి ప్రతిభ, యింగితజ్ఞత, సమతూకం గల వ్యక్తిత్వం, కార్యదీక్ష, దేశసేవాతత్పరత, బీదసాదల యందు కారుణ్యం, వగైరా ఉన్నతగుణాలను అనేకమంది ప్రస్తుతించియున్నారు. నే నిప్పుడు వానిని పేర్కొనటం పిష్టపేషణమే కాగలదు.

వారి శ్రాద్ధకర్మకు 11-10-72 తారీఖున నిడుబ్రోలుకు వెళ్లి బాష్పాంజలి ఘటించాను. అప్పుడు జరిగిన సంతాప సభలో

నా గాథ సంతాపాన్ని వెలువరిస్తూ, వారి స్మృతికి జోహారు లర్పించాను. వారి సతీత్వం, సహధర్మచారిణీత్వం వారి ప్రథమ వర్ధంతి ( ఏడుగురు ) సందర్భంగా 21-9-1973 తారీఖున వెలువడిన "వాహిని" సంచికలో "సహధర్మచారిణి" అను శీర్షిక క్రింద ప్రస్ఫుటపరచియున్నాను.

ప్రతిభాశాలినియైన ఉత్తమస్త్రీరత్నాన్ని దేశం కోల్పోవటమేగాక, తన యావజ్జీవితాన్ని దేశసేవ, ప్రజాసేవలో గడపిన శ్రీ ఆచార్య రంగాగారు తమ కార్యతత్పరత కాసటయై నిల్చిన ఆమె తోడ్పాటును కోల్పోయి, చుక్కాని లేని నావికులైనారేమో అని నా సందేహం.

డాక్టర్ వి. యస్. కృష్ణగారిని గురించి మొదటి భాగంలో ఆయనను విద్యార్థిదశలో గుంటూరులో ఎరిగినప్పటి, మేము ఆక్స్‌ఫర్డ్ కాలేజీలో కలసియున్నప్పటి విషయాలు కొన్ని చెప్పానుగాని, అవి పూర్తిగా చెప్పినట్లు తోచనందున, ఇప్పుడు కొంత వివరిస్తున్నాను. ఆయన ఆక్స్‌ఫర్డ్‌లో 'మోడరన్ గ్రేట్స్' అనే తత్వశాస్త్రం, చరిత్ర, రాజకీయాలు కలసిన డిగ్రీకోర్సును చదివి, డిగ్రీని పొంది, ఆస్ట్రియా ముఖ్యపట్నం వియన్నాకు వెళ్లి తత్వశాస్త్రంలో పిహెచ్. డి. డిగ్రీని పొంది, డాక్టర్. వి. యస్. కృష్ణ అయ్యాడు. డాక్టరేట్‌ను పొందకముందు, కొలది కాలం బొబ్బిలిరాజాగారి ఆంతరంగిక కార్యదర్శిగాను, కొంతకాలం ఇండియా స్టేట్ బ్యాంకిలో ఉద్యోగిగాను వుండినాడు. ఆ ఉద్యోగానికి స్వస్తిచెప్పి డాక్టరేట్ డిగ్రీని గడించిన తర్వాత, ఆంధ్ర విశ్వవిద్యాలయం రెజిస్ట్రార్‌గా, డాక్టర్ సి. ఆర్. రెడ్డి, డాక్టర్ సర్వేపల్లి రాధాకృష్ణన్ మొదలైన వారి హయాంలో చాలా కాలం పనిచేశాడు. పిమ్మట ఆ విశ్వవిద్యాలయాని కుపాధ్యక్షుడు ( వైస్‌ఛాన్సలర్ ) అయినాడు. వారికాలంలో నూతన శాఖలను ప్రవేశపెట్టి, సైన్సు విషయాల కెక్కువ ప్రాముఖ్యమిచ్చి, భవనాలను విస్తరింపించి విశ్వవిద్యాలయాన్ని అభివృద్ధిలోకి తెచ్చి, పేరు ప్రతిష్ఠలు గడించాడు. తర్వాత యూనివర్సిటీ గ్రాంట్సు కమిషన్‌కు అధ్యక్షుడైనాడు. దానిలో తన ప్రతిభను పూర్తిగా

వినియోగించకముందే, తన సహోద్యోగులతో సంప్రదింపులు జరుగుచుండగా, అకస్మాత్తుగా గుండె ఆగి, తాను కూర్చుండిన కుర్చీలోనే ప్రాణం వీడినాడు. సమర్థుడనిపించుకొన్న డాక్టర్ కృష్ణ యింకను చాలా సంవత్సరాలు జీవించవలసిన కాల ముండగనే పరలోకప్రాప్తిచెందటం దురదృష్టం.

డాక్టర్ కృష్ణ సామాన్యంగా మితభాషి. ఎప్పుడూ ఏదో ఆలోచిస్తూవుండే స్వభావంకలవాడు. తనకు మిక్కిలి చనువున్న బంధుమిత్రులతో స్వేచ్ఛగా మాట్లాడటం, వేళాకోళాలు చేయటం వంటివి వుండేవి. అయితే, సామాన్యంగా గుంభన, హుందాతనం, ఠీవి వున్న వ్యక్తిత్వంకలవాడు. గుంటూరులో ఆయన ౫-వ ఫారం చదువుచున్న రోజులనుండి చనిపోయేముందు వరకు వారిని నేను సన్నిహిత మిత్రుడుగానే ఎంచుకొనేవాడను. కాని, శ్రీ ఆచార్య రంగాగారివలె వారు మిక్కిలి సన్నిహితులు కాలేదు. వారి స్వభావంలో విమర్శన భాగం, అనగా తప్పులను వెదికే పద్ధతి, చాలా వుండినదేమో అని నేనప్పు డప్పుడు అనుకొన్నాను. ఎప్పుడో విద్యార్థిదశలో నే నేదో పొరబాటుపడిన విషయం ఒకటి, రెండు సార్లు ఇతరులముందు కూడా గ్రుచ్చి ఎత్తి చూపించాడు. తారతమ్యాలు చూపటం తప్పుగావచ్చుగాని, ఈవిషయంలో రంగాగారి సుస్వభావం చెప్పకుండా వుండలేను. వారెప్పుడూ మిత్రులలో (ఇతరులలోకూడా) తప్పులను వెదకరు. ఎల్లప్పుడు మంచి గుణాలనే గుర్తుంచుకొని, ప్రస్తావిస్తూంటారు. డాక్టర్ వి. యస్. కృష్ణగారి ప్రస్తావన ఇంతటితో ముగిస్తున్నాను.

శ్రీ కె. వి. గోపాలస్వామిగారి ప్రస్తావన మొదటి భాగంలో కొంచెమెక్కువగానే వచ్చింది. ఆయన సుప్రసిద్ధ ఆక్స్ఫర్డ్ బెలియల్ కాలేజీలో చరిత్ర వగైరా అంశాలతో ఆనర్స్ డిగ్రీని తీసుకొని, లండన్ ఇన్నర్ టెంపుల్ ద్వారా బ్యారిష్టర్ పట్టాను పొందాడు. స్వదేశానికి తిరిగి వచ్చిన తర్వాత, కొంత కాలం న్యాయవాదిగా పనిచేసి, తర్వాత ఆంధ్ర విశ్వవిద్యాలయానికి చాలాసంవత్సరాలు రెజిస్ట్రారుగా వుండినారు. వారి కాలంలో, వారు ఆ విశ్వవిద్యాలయానికి చేసిన చెప్పుకోతగ్గ సేవ, నాటక

కళను ప్రవేశపెట్టి, విద్యార్థులను ప్రోత్సహించి, ఆ కళను విస్తృత పరచటం. బహిరంగ ప్రదేశంలో నాటకాలాడే పద్ధతిని ప్రప్రథమంగా మన ఆంధ్రలో ప్రవేశ పెట్టినది వారే అనుకుంటాను. నిజానికి వారు ఆ విశ్వవిద్యాలయ ఉపాధ్యక్షులు లవవలసిందిగాని, ఏవో కారణాలచేత వారి కా అదృష్టం పట్టలేదు. వారు రెజిస్ట్రార్ పదవినుండి విరమించుకొన్న కొంతకాలానికి, నెల్లూరుజిల్లాలోని కావలి జవ్వారు భారతి కళాశాలకు అధ్యక్షులు (ప్రిన్సిపాల్) అయినారు. ఆ పదవిని 2, 3 సంవత్సరాలు నిర్వహించి, దానినుండి మానుకొని, ఇప్పుడు హైదరాబాదులో వుంటున్నారు. వారికి వివిధ విషయాలలో విజ్ఞానమున్నదిగాని, వారికి మిక్కిలి అభిమాన అంశం నాటకకళ. దాని విషయమై ఎడతెగకుండా కృషిచేస్తూనేవుంటారు. స్వదేశానికి తిరిగివచ్చిన తర్వాత మేము అరుదుగా మాత్రమే కలసికొన్నాంగాని, కలసి కొన్నప్పుడు మిక్కిలి స్నేహభావంతో, చనువుతో మెలగుతాం. నే నీ మధ్య ప్రచురించిన ఇంగ్లీషు పుస్తకం "రిఫ్లెక్షన్స్ ఆన్ ది వెస్ట్" కు విషయ పూరితమైన దీర్ఘ ఉపోద్ఘాతం వ్రాసి, నా కృతజ్ఞతకు పాత్రులైనారు.

శ్రీ ఓబులరెడ్డి పుల్లారెడ్డి, ఐ. సి. యస్. గారు విశిష్టమైన వ్యక్తిత్వం గలవారు. వారు ఐ. సి. యస్. ఆఫీసరుగానేగాక ఒరిస్సా, జైపూర్ సంస్థానం దివానుగాను, మైసూరురాష్ట్ర మంత్రి మండలిలో సభ్యుడుగాను, కేంద్రప్రభుత్వ రక్షణశాఖ కార్యదర్శి గాను, ఐ. సి. యస్. ఉద్యోగంలో ఆంధ్రరాష్ట్ర ప్రభుత్వం ప్రథమ చీఫ్ శక్రటరీగాను, ఉద్యోగ విరమణానంతరం, మొన్నటివరకు చాలా సంవత్సరాలపాటు హైదరాబాదు రాజేంద్రనగర్‌లోని వ్యవసాయ విశ్వవిద్యాలయం వైస్‌ఛాన్సలర్‌గాను వుండినారు. వారినిగురించి ఈ "స్వవిషయం" మొదటి భాగంలోను, రెండవ భాగంలోను వివరించాను. ఆయన మిక్కిలి తెలివితేటలు కలవారు. వివిధఅంశాలలో విజ్ఞానంకలవారు. అన్నిటికంటే, చరిత్ర ఆయనకెక్కువ అభిమానాంశమని చెప్పాలి. మరిన్ని, రాజకీయాలలో ఆసక్తి, కొంత తంత్రజ్ఞత కలవారు. తాను తలంచిన విధానాల, కార్యాల సాధనకు ఎత్తులువేస్తూ, వాని

నెట్లుపయోగించు కొనవలెనో తెలిసినవారు. తన పంథాలను సాధించటంలో మెలకువ, దక్షత చూపగల సమర్థుడు. ఈమధ్య నొకసారి హైదరాబాదులో వారి ఉపన్యాసం వినటం తట స్థించింది. ఏవో చారిత్ర కాంశాలను చర్చించుచు, సందర్భశుద్ధి లేకపోయినా, రెడ్లు రాష్ట్రకూటులని, రాష్ట్రకూటులు చారిత్రక ప్రాధాన్యత కలవారని, అటువంటి వే వేవో చెప్పారు. ఆధోరణి రెడ్ల గొప్పతనాన్ని ప్రకటించినట్లుగా వుండినది. ఈ మన స్వతంత్ర్యమే వారివంటి వారి నావరించి, ఒకసీనియరు ఐ. సి. యస్. ఆఫీస రన్నట్లు రెడ్డిరాజ్యం పునఃస్థాపితం అయినదా, అనిపించింది. శ్రీ పుల్లారెడ్డి రెడ్డికులాధిక్యత యందేగాక, తనవ్యక్తిగత గొప్ప తనమందుకూడా పూర్తినమ్మకం కలవారు. ధీమా, దర్జా, బెట్టు, గుట్టు, హెచ్చుగానే కలవారు. అయితే, వ్యక్తిగతంగా నాయందెప్పుడూ స్నేహభావంతోనే వుంటారు. వారి కుమార్తె వివాహానికి నేను తిరుచానూరుకు వెళ్లటం, నా మనుమడు మలినేని వీరభద్రరావు వివాహానికి వారు కానుకపంపటం, జరిగినవి. నా రెండవభాగంలో వ్రాసినట్లు పబ్లిక్ సర్వీస్ కమిషన్ సభ్యత్వ విషయంలో నా పేరును బైటికి తీసుకునివచ్చి నారు, తాత్కాలికమే అయినదైనా, కొంత ప్రతిష్టను ఆపా దింపించారు. అది నేనెప్పుడూ మనసులో వుంచుకుంటాను.

శ్రీ లెఫ్టినెంట్ కల్నల్ టి. మురారి ఆక్స్ఫర్డ్ మాసెయింట్ కాథరిన్ కాలేజిలో మాతోబాటు అధ్యాపకుడు. ఆయన వ్యవసాయం, పశుపోషణ, పాలోత్పత్తి విషయాలలో అక్కడ చదివాడు. ఇండియాకు తిరిగి వచ్చినతరువాత కొన్నిసంవత్సరాలు బళ్లారిజిల్లాలోని హోస్పేట పశుకేంద్రానికి సూపరింటెండెంట్ గా వుండినారు. బళ్లారినుండి ఒకసారి వారిని చూచుటకు వెళ్లినప్పుడు వారి ఫారమ్‌లో ఒక పెద్ద అయిర్‌షైర్ ఆబోతును చూచాను. అంతపెద్ద విదేశీ ఆబోతును మనదేశంలో ఇంతవరకు చూడలేదు. పిమ్మట, కొన్నిసంవత్సరాలు ఉమ్మడి మద్రాసురాష్ట్రంలోను, విభజనానంతరం ఆంధ్రప్రదేశ్ రాష్ట్రంలోను, పశువులశాఖ డైరెక్టరుగా పనిచేశారు. వీరి ప్రస్తావన ఈ మూడవభాగంలోనే

"పశువులు - పాలోత్పత్తి" శీర్షిక క్రింద చెప్పాను. వారు రిటైరైన తర్వాత మద్రాసులోను, ఇంగ్లండులోను వుంటున్నారు. చాలా సంవత్సరాలు మద్రాసు నుంగంబాకం వీరియా వాసునాయుడు వీధిలో, తమ స్వగృహంలోనే వుండిపోయారు. వారి మొదటి భార్య వారి మేనమామ వాసునాయుడుగారి కుమార్తె. వారి వలన ఆయన కిద్దరు కుమారులు, ఇద్దరు కుమార్తెలు కలిగారు. ఒకాయన లండన్‌లో పాత్రికేయుడుగా వుండుచున్నాడు. ఈమధ్య బొంబే ఇలస్ట్రేటెడ్ వీక్లీ ఆఫ్ ఇండియాలో ఆయన వ్యాసం చూచాను. రెండవవాడు మద్రాసులో మందులషాపును నడుపుకొనుచున్నాడు. ఒక కుమార్తె కెనడాలో కొన్ని సంవత్సరాలనుండి ఏదో కళాశాలలో లెక్చరర్‌గా పనిచేయుచున్నది. రెండవ ఆమె ఇంటిపట్టునే వుంటున్నది. మొదటిభార్య చనిపోగా, ఇంగ్లండులో నివసించుచుండిన ఫ్రెంచి జాతీయ వనితను ద్వితీయ భార్యగా వివాహమాడాడు. ఆమెవలన ఒక మగసంతానం కలిగినట్లున్నది. పాలపథకాన్ని కదానిని నీలగిరి కొండలలో పెట్టాలని, బీరు అనే మత్తుపానీయాన్ని మద్రాసులో ఉత్పత్తి చేయాలని, చాలాకాలం నుండి ప్రయత్నించుచున్నారు గాని, సఫలీకృతుడైనట్లు లేదు. ఆయన డైరెక్టరుగా వున్నకాలంలోనే నాకు పశువులశాఖతో కొంత పరిచయం, దాని డిప్యూటి డైరెక్టరులు శ్రీ సి. కృష్ణారావు, శ్రీ పి. రాజ్ వంటివారలతో కొంత పలుకుబడి కలిగింది. మేమొకరి నొకరు అభిమానించుకొంటాము. ఈమధ్య వారిని మద్రాసులో ఒక వీధిలో కలుసుకొనటం తటస్థించింది. వారి కించుమించుగా నా వయస్సుండినా, మిక్కిలి దృఢకాయులుగా, ఉత్సాహవంతులుగా కనపడ్డారు. ఏదో పనిమీద వచ్చాననీ, ఇంగ్లండుకు తిరిగి వెళ్లిపోతాననీ చెప్పాడు.

శ్రీ డబ్ల్యు. వలీధార్మి జాంజిబారువాడు. ఆగాఖాన్ శిష్యకోటి ఖోజా ముస్లిం సంఘానికి చెందినవాడు. మిక్కిలి స్నేహశీలి. మంచితనం, మృదూక్తి, తొణకని స్వభావం కలిగి,

నెమ్మదిగా పనులు జరుపుకొనే స్వభావం కలవాడు. ఉండి, లేనట్లుండేవాడు. ఏ విధంగా మా కిద్దరకు స్నేహ మారంభ మైనదో నా కిప్పుడు గుర్తులేదు. ఆయన, నేను కలసి, దిస మొలతో స్నానాలు చేసేచోట్లకు వెళ్లి, స్నానాలు చేశామని మొదటి భాగంలో చెప్పాను. మా విద్యాభ్యాసం ముగించి, ఎవరిదేశానికి వారు వెళ్లిపోయిన తర్వాత, ఎప్పుడో ఒకప్పుడు తాను జాంజిబార్‌కు వెళ్లానని, ధార్మియింటికి వెళ్లానని శ్రీ కె. వి. గోపాలస్వామి చెప్పినది వినటమేతప్ప, అతని సంగతి మరుగుపడి పోయినట్లైనది.

ఆక్స్‌ఫర్డ్‌లో మా సమకాలికుడైన శ్రీ హెచ్. యమ్. పటేలును, శ్రీ ఎ. వి. పాయ్‌ను, 1954 లో నేను ఢిల్లీకి వెళ్లినప్పుడు, శ్రీ ఆచార్యరంగాగారితో కలసి, వా రింటికి వెళ్లి చూడటం తటస్థించింది. పటేలుగారు, శ్రీ వి. యస్. కృష్ణకు మంచి మిత్రుడు. శ్రీ కృష్ణగారిద్వారా నాకు పటేలుగారితో పరిచయమైంది. అప్పుడప్పుడు మేము మాటలు కలుపుకొన్నా, ఆ పరిచయం మైత్రిగా రూపొందలేదు. శ్రీ ఎ. విఠల్‌పాయ్ గారు కొంత స్నేహభావంతో చనువుగా మాట్లాడే స్వభావం కలవారు. అందువల్ల అప్పుడప్పుడు మాత్రమే ఆక్స్‌ఫర్డ్‌మజ్లిసు సమావేశాలవంటి వానిలో కలుసుకొని, మాటలు కలుపుకొని కొంత సుముఖత్వం చూపుకొన్నాముగాని అంతటితోసరి. వీరిద్దరిని మిత్రులని చెప్పుకోలేనుగాని, 1954 లో వారిళ్లకు వెళ్లి ప్రాత పరిచయాన్ని తిరిగి తోడుకొనటంవల్ల, ఇక్కడ వారిని పేర్కొన వలసివచ్చింది.

నే నింగ్లండునుండి తిరిగివచ్చిన క్రొత్తలో కలసికొన్న వారిలో అతిముఖ్యులు శ్రీ బెజవాడ గోపాలరెడ్డిగారు. "జగమెరిగిన బ్రాహ్మణునకు జందెంబేలా" అన్నట్లు శ్రీ గోపాలరెడ్డిగారిని గురించి చెప్పటం పిష్టపేషణమే అవుతుంది. వారు నాకు 1928 లో పరిచయులై అప్పటినుండి ఇప్పటివరకు కనపడినప్పుడల్లా స్నేహపూర్వకంగా, ఆప్యాయతతో మాట్లాడుతారు. పై జెప్పినట్లు నేను ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమి సభ్యుడ నైనప్పుడు,

శ్రీ రెడ్డిగారితో ప్రత్యక్ష సంబంధం కలిగింది. నన్ను ఆదరణతో చూచేవారు. శ్రీ గోపాలరెడ్డి సామరస్యానికి, సౌజన్యానికి పెట్టినది పేరు. వారెవరియందును విముఖత్వం ప్రకటించరు. అందరినీ మంచి మాటలతో, సుహృద్భావంతో పలుకరిస్తారు. అనునయంగా నడచుకొనటంలో, తద్వారా కార్యసాఫల్యమును సాధించటంలో మిక్కిలి నిపుణులు. వారు ఆంధ్రప్రదేశ సాహిత్య యకాడమి ఆరంభింపబడినప్పటినుండి దాని కధ్యక్షులుగా వుంటున్నారు. ఈ దఫాకూడా, కొలదిరోజుల క్రితం తిరిగి అధ్యక్షులుగా ఎన్నికైనారు. సాహిత్య అకాడమి వారికి, వారు సాహిత్య అకాడమికి, అతికినట్లుంటారు. విద్యావేత్త, సమర్థుడైన సాహిత్య యకాడమి కార్యదర్శి దేవులపల్లి రామానుజరావుగారి సహాయముతో, ఆ సంస్థను రెడ్డిగారు నిర్వివాదంగా, సానుకూలంగా నడుపుకొని వచ్చుచున్నారు. వారికి ఓపిక ఉన్నంత కాలం సాహిత్య అకాడమి వారిని దప్ప మరొకరిని వరించదు.

శ్రీ యెర్నేని లక్ష్మీనారాయణగారు నేను మొదటి భాగంలో చెప్పినట్లు గుడివాడ తాలూకా పసుమర్రు గ్రామ కాపురస్తులు. శ్రీ కాజ రంగయ్యగారి ద్వారా 1918లో పరిచయమైనారు. వారి ద్వితీయ వివాహ విషయంలో 1918-19 సంవత్సరంలో నేను సికింద్రాబాదుకు వెళ్లి వచ్చాను. నే నింగ్లండు నుండి తిరిగి వచ్చిన తర్వాత నాకప్పుడు సంభవించిన క్లిష్ట పరిస్థితులలో వారి అండ దండ లుండిన విషయం మొదటి భాగంలో చెప్పియే యున్నాను. నాకు మిక్కిలి సన్నిహిత మిత్రులైనారు. ఆ విషయాలన్నీ నా రెండవ భాగంలో విపులీకరించాను. ఆ విపులీకరణలో నిష్ఠురంగాను, కఠినంగానుకూడా వ్రాశాను. అయినా, వారు నా యిబ్బందులలో స్నేహ పూర్వకంగా, తోడుగా వుండినందుకు, నేను కృతజ్ఞుడనుగా వుండక తప్పదు.

నా వుద్యోగారంభంలో, నేను రాయపేటలోని ముత్తియప్ప మొదలి వీధిలో వుంటున్నప్పుడు, నూతక్కి వెంకటేశ్వరరావు అనే పేరుగల గుడివాడ తాలూకా పెదముద్దాలి గ్రామ కమ్మ యువకుని, నా పెద్ద కుమారుడు పూర్ణచంద్రరావు ఒక సాయంత్రం తీసుకుని వచ్చాడు. వెంకటేశ్వరరావు పూర్ణచంద్రరావు కంటె

6, 7 సంవత్సరాలైనా పెద్దవాడుగాని, పూర్ణచంద్రరావు కాలు కారు కుర్రవాడు. ఎత్తుగా వుండేవాడు. వెంకటేశ్వరరావు కూడా అప్పటి కింకను చిన్నవాడే. వెంకటేశ్వరరావును నాకు, నా భార్యకు పరిచయపరిచిన పూర్ణచంద్రరావు 1938 నవంబరులో కాలగర్భంలో కలసిపోయాడుగాని, వెంకటేశ్వరరావు పరిచయం మైత్రిగా వృద్ధిపొంది, ఇప్పటికిని కొనసాగుచున్నది. వెంకటేశ్వరరావు (శ్రీ) యస్. వి. రావుగా ఉన్నతస్థాయికి చేరుకున్నాడు. ఇంగ్లండుకు వెళ్లి ఆర్థికశాస్త్రం, బ్యాంకింగ్ వంటి వానిలో పెద్ద పట్టాలను, బారిష్టర్ పట్టాను గడించి ఇండియాలో మర్కన్‌టైల్ వంటి పెద్దబ్యాంకులలో పనిజేసి, రెండవ యుద్ధ కాలంలో మిలిటరీ అక్కౌంట్స్ డిపార్టుమెంటులో పనిచేశాడు. ఆ సందర్భంలో నేను కాకినాడలో ఉద్యోగం చేస్తున్నప్పుడు, తన ఉద్యోగరీత్యా అక్కడకు వచ్చి, మా యింట వారం రోజులు గడిపాడు. ఆయన వచ్చిన సమయంలో నేను క్యాంపుకు బయలుదేరవలసి వచ్చింది కాని, అతిథులను ఆహ్వానించి సత్కరించే నా భార్య ఆయనను హృదయపూర్వకంగా ఆహ్వానించి ఆతిథ్యమిచ్చింది. (శ్రీ) యస్. వి. రావు ఆకర్షణీయమైన విగ్రహంతో పాటు చనువుగా, అనునయంగా, కలసిగొట్టుతనంతో వ్యవహరించేవాడు. పైగా, మే మెక్కువగా ప్రేమించిన మా ప్రథమ పుత్రుడు పూర్ణచంద్రరావు మాకు పరిచయంచేసిన శ్రీ యస్. వి. రావంటే నా భార్య మిక్కిలి అభిమానంగా వుండేది. ఆయన కూడా 'పిన్నీ, పిన్నీ' అంటూ అరమరలేకుండా, మా బిడ్డ వలె వ్యవహరించేవాడు. రెండవ ప్రపంచ యుద్ధ విరమణానంతరం మనకు 1947 లో స్వాతంత్ర్యం లభించిన తర్వాత (శ్రీ) రావు లండన్‌లోని మన హైకమీషన్ ఆఫీసులో అసిస్టెంట్ ట్రేడ్ కమిషనర్‌గా కొంతకాలం పనిచేశారు. తర్వాత, డిప్లొమాటిక్ శాఖలోకి మారి, కొరియా యుద్ధవిరమణ సందర్భంగా ఏర్పడిన శాంతి కమిషన్‌కు అధ్యక్షుడుగా నుండిన మన జనరల్ తిమ్మయ్యకు కార్యదర్శిగా వెళ్లాడు. అక్కడక్కడా డిప్లొమాటిక్

సర్వీసులో ఉద్యోగాలు నిర్వహించి, చివరకు నార్వే దేశానికి మన రాయబారిగా నియమింపబడి 3, 4 సంవత్సరాలు ఆ పదవిని నిర్వహించి, ఈమధ్యనే రిటైరై, ఇప్పుడు హైదరాబాదులో స్థిరనివాస మేర్పరచుకొని యున్నాడు. ఈసంవత్సరం (1973) సెప్టెంబర్ 9-వ తారీఖున ఇక్కడకు తన తమ్మునితో వచ్చి కొన్ని గంటలుగడిపి వెళ్లాడు. ఆయన భార్య శ్రీమతి రేణుక యిక్కడకు రాలేకపోయింది. ఆమె ఆదరణ, అభిమానాలు చూపించే సుజనవతి. మా భార్యా భర్త లిద్దరి యందు మిక్కిలి ఆప్యాయత కలిగియుంటుంది. నా భార్యను 'అత్తమ్మ' అని సంబోధించుచుండేది. అందువల్ల, చూచి చాలా సంవత్సరాలైనందున, ఆమెను చూడాలని సెప్టెంబరు 17-వ తారీఖున నేను పెదమద్దాలి వారింటికి వెళ్లి, ఆమెతో కొన్ని నిమిషాలు గడిపి సంతోషించాను. శ్రీ రావు 60 ఏళ్ల వయస్సువాడైనా, నా ఉద్యోగం కంటె పెద్ద ఉద్యోగం నిర్వహించినవాడైనా, నా కిప్పటికిని కొడుకు వంటి వాడే. ఈ నా భావాన్ని తా నంగీకరించనట్లు డిప్లొమాటిక్ సర్వీసులో ఆరితేరి, మనోభావాలను ఎదుటివారికి సాధ్యమైనంతవరకు తెలియనీయకుండా, ముభావంగా వున్నట్లు మనస్తత్వం పెంచుకొని, తనకు పట్టనట్లుగా వ్యవహరించుట కలవాడైన శ్రీ రావు, మా యందు ఆయనకు గల ఆప్యాయతను చప్పున బయటపెట్టడుగాని, శ్రీమతి రేణుక భావోద్రేకసమ్మిళితమైన నా ఆప్యాయతను ఆమోదించి, ఆ విధంగా వర్తిస్తుంది.

శ్రీ సి. (చల్లగళ్ల) నరసింహంగారిని, నేను 1927 ఫిబ్రవరి ఆఖరుకు ఇంగ్లండునుండి తిరిగి వచ్చినప్పుడు, త్యాగరాయ నగర్ అని యిప్పుడు పిలువబడే మాంబళంలో భోజన వసతి గృహాన్ని నడుపుకొనుచున్న కొందరు కమ్మ విద్యార్థులు నన్నాహ్వానించి తమ అతిథిగా తీసుకువెళ్లినప్పుడు, మొట్టమొదటిసారి వారిని ఆ లాడ్జిలో కలసికొన్నానని మొదటి భాగంలో చెప్పాను. రెండవసారి, నేను 1932 అక్టోబర్‌లో



శ్రీ సి. నరసింహం, వారి భార్య శ్రీమతి రామాయమ్మ

ఇప్పుడు ఒరిస్సా రాష్ట్రానికి చేరిన గంజాం జిల్లా బరంపురంలో ఆ జిల్లా ఇన్‌కమ్‌టాక్స్ ఆఫీసరుగా వుండినప్పుడు కలుసుకొన్నాను. వా రప్పుడు గంజాం జిల్లాకు, జిల్లా పంచాయత్ ఆఫీసరుగా ఛత్రపూర్‌లో వుండినారు. ఒక ఉదయం కోర్టుపేటలోని మా యింటికి వచ్చి, పిచ్చా పాటి మాట్లాడి వెళ్లారు. తర్వాత నేను, వా రుండుచుండిన ఛత్రపూరుకు క్యాంపుకు వెళ్లినప్పుడు, వా రింటికి విందు భోజనానికి వెళ్లానని, వారి భార్య సాత్విక సంపన్న, ధర్మాధరిత్రి, ఉత్తమ ఇల్లాలు శ్రీమతి రామాయమ్మ గారిని మొదటిసారి చూచానని, ఆమె వంటలో మిక్కిలి నేర్పు కలదని, ఆమె పప్పునూనెతో చేసిన మాంసాదులు మిక్కిలి రుచికరంగా వుండిన వని, నూనెతో వండిన వంటకాలను అంత తృప్తిగా భోజనంచేయటం నా కదే మొదటి అనుభవమని రెండో భాగంలో చెప్పాను.

నేను శ్రీ నరసింహంను ఛత్రపూరులో కలసికొన్న కొలదికాలానికే, వారు బరంపురం మునిసిపాలిటీకి కమిషనర్‌గా బదిలీ అయి బరంపురంలో నివాస మేర్పరచుకొన్నారు. మా పరిచయం స్నేహంగా మారి, దినదినాభివృద్ధి చెందింది. 1934లో అని గుర్తు పంచమ జార్జి చక్రవర్తి సిల్వర్‌జూబిలీ జరిగిన సందర్భంలో వారికి చేదోడువాదోడుగా వుండినాను. ఆ సంవత్సరం డిశంబరులో నేను, నా భార్య, నా కుమారుడు పూర్ణచంద్రరావు (బాబు), శ్రీ నరసింహం కలసి క్రిస్మస్ సెలవుల్లో కలకత్తాకు వెళ్లాం. అక్కడున్న 7, 8 రోజులు కలసిమెలసి వుండినాం. ఈ విషయాలు రెండో భాగంలో చెప్పియే యున్నాను.

మేము మిత్రుల మైనప్పటికి వారి మొదటి నల్గురు పిల్లలు సుభద్రమ్మ, సత్యనారాయణ, నాగేంద్రప్రసాద్, లక్ష్మి చిన్న పిల్లలు, అప్పుడు పుట్టిన ఆడపిల్ల అన్నపూర్ణను నేను, నా భార్య చూచి సంతోషించాము. నా భార్యకైతే కుదమట్టంగా, ఎఱ్ఱగా, ముచ్చటగా వుండిన ఆ చంటిబిడ్డను చూచి గుండ్రని మామిడి

పండువలె ముద్దొస్తున్నదని సంతోషించింది. తర్వాత కలిగిన నల్గురు మగపిల్లల, ముగ్గురు ఆడపిల్లల పుట్టుకలను మే మెరుగుదుము. వారి మొత్తం కుటుంబం మాకు చిరపరిచితులైనారు.

శ్రీ సి. నరసింహం క్షీణదశలేని చంద్రునివలె దినదినాభివృద్ధి చెందాడు. మేము అనంతపురంలో వుండినప్పుడు వారు హిందూపురంలో మునిసిపల్ కమిషనర్‌గా వుండినారు. మేము బెజవాడలో 1940 నుండి 1943 వరకున్నప్పుడు బెజవాడకు మునిసిపల్ కమిషనర్‌గా వచ్చాడు. ఆంధ్రప్రాంతం పట్టణాలలో ఇప్పుడు విజయవాడ అనే బెజవాడ మునిసిపాలిటీ మిక్కిలి తగాదాకోరుది. దాని నప్పు డప్పుడు ప్రభుత్వంవారు రద్దు చేస్తూంటారు. అట్టి దౌర్భాగ్యపు మునిసిపాలిటీని అతిసమర్థంగా శ్రీ నరసింహం నిర్వహించాడు. తర్వాత మద్రాసు నగర కార్పొరేషన్ రెవిన్యూ ఆఫీసరుగా వెళ్లి శ్రీ పుల్లారెడ్డి వారి వంటి హయాంలో పని చేసి, తర్వాత ఆ మహానగర కార్పొరేషన్‌కు కమిషనరైనారు. దానిని మిక్కిలి సమర్థవంతంగా నిర్వహించి, పేరుప్రతిష్ఠలు గడించారు. 1953 లో మద్రాసు రాష్ట్రంనుండి ఆంధ్రప్రాంతం విడిపోయేముందు, అప్పుడు ఆంధ్రావనికి రాజధానిగా నిర్ణయించబడిన కర్నూలులో ప్రభుత్వంవారి ఆఫీసులను, వారి ఉద్యోగుల వసతులను ఏర్పరచటానికి స్పెషల్ ఆఫీసరుగా నియమింపబడి, పెద్ద గ్రామం వంటిది మాత్రమే అయిన ఆ మారుమూల కర్నూలును కొంతకు గొంతమైనా అనుకూల పరిస్థితులు కలదానినిగా రూపొందించారు. ఆంధ్రరాష్ట్రంలోను, 1956 లో రూపొందించిన ఆంధ్రప్రదేశ్ రాష్ట్రంలోను, ఆ యా డిపార్టుమెంటులకు కార్యదర్శిగా పనిజేసి, పరిపాలనాదక్షులని పేరుపొందారు. తర్వాత స్పెషల్ శక్రటరీగా ఆ యా విధులను నిర్వహించారు. కొంతకాలం ఎలెక్ట్రిసిటీ బోర్డు అధ్యక్షులుగా పనిచేశారు. వీరి ప్రతిభను, పరిపాలనా దక్షతను గ్రహించిన ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం వారి ఉద్యోగ జీవితాన్ని కొన్ని సంవత్సరాలు పొడిగించింది. వారు కొలది

కాలంక్రిందటనే ఉద్యోగనిర్వహణను పూర్తిగా విరమించు కొన్నారు. వారి కిప్పుడు 69 సంవత్సరాల వయస్సని గుర్తు.

శ్రీ నరసింహం తాను చేసే పనిలో మిక్కిలి నైపుణ్యం, దక్షత కనబరచేవాడేగాక, కార్యదీక్ష పూర్తిగా కలవాడు. మిక్కిలి శ్రమించి కాలం గుర్తులేకుండా, మామూలుగా పనిజేసే కాలానికంటె అధమం 40 శాతం అయినా ఎక్కువకాలం పని చేయువాడు. తాను కూర్చునే కుర్చీకి కట్టబడినట్లు, నడుము కదపకుండా, గంటల కొలది విసుగు, విరామం లేకుండా పనిచేయు వాడు. పనిలో నిమగ్నమైయుండినప్పుడు ఆకలి, దప్పులు లేవేమో అనుకొనునట్లు పనిచేస్తూనే వుంటాడు. తిరుపతి వెంకట కవులలో ఒకరైన శ్రీ చెళ్లపిళ్ల వెంకటశాస్త్రిగారు తాను కవనం కొరకు పుట్టినానని చెప్పుకొన్నారట. అలా బహిరంగంగా చెప్పుకొనకపోయినా, శ్రీ నరసింహం పనికొరకు పుట్టినా డన వచ్చును. దీనినే కెరియర్ మనిషి అంటారు. కెరియర్ మనిషి దృష్టి ప్రమోషన్లమీద వుంటుంది. కష్టపడి పనిచేసేవారికి అభివృద్ధిలోకి రావాలని వుండటం సహజంకదా! అభివృద్ధిలోకి రావాలని ప్రయత్నించేవారికి పై అధికారులయందు భయభక్తు లుంటవి, తప్పదు.

ఆయన తీరుబడి సమయంలో తన మిత్రులతో ఇష్టాగోష్ఠి చక్కగా నడుపుతాడు. బెజవాడలో వున్నప్పుడుగాని, మద్రాసులో వున్నప్పుడుగాని, క్యాంపుకు వెళ్లియుండిన హిందూపురంవంటి చోట్లగాని వారింటికి వెళ్లినప్పుడు వారి భార్యగారి ఉపాహార మర్యాదలతోబాటు, వీరి వాక్చాతుర్యం పానీయంగా వుండేది. వీరి స్నేహభావమేగాక, వారి సతీమణి సోదరీభావం మాకు మిక్కిలి సంతోషాన్ని కలిగించేది.

వారికి కొన్ని లోపాలు లేకపోలేదుగాని, అవి ద్రాక్షా రసంలో కనపడే చిన్ని చిన్ని గింజలు, తొక్కలు వంటివి. వారి పని నిమగ్నతలో, వారి పంద్రెండుమంది సంతానాన్ని సంబాళించుకొనుటకే యిబ్బంది కలుగునప్పుడు, యితరులకు తగినంత సాయంచేయలేదని అనుకొనటం పొరబాటు కావచ్చును. అయితే నా విషయంలో నా మాట ఆదరించి, షెనాయ్‌నగర్

కార్పొరేషన్ కాలనీలో ఆచార్య రంగాగారికి, శ్రీ గౌతు లచ్చన్నగారికి చిన్న యిండ్లు ఏర్పాటుచేశారు. నాకొక పెద్ద యిల్లు యిచ్చి, దానిని విస్తీర్ణపరుచుట కనుమతి నిచ్చారు. నాకు అసిస్టెంట్ కమిషనర్‌గా ప్రమోషన్ రాని సందర్భంలో, తనతో ఏదో పనివుండి వచ్చిన వారికి సిఫారసు చేశారు. వారి సిఫారసు, నన్నదివరకే బాగా ఎరిగి, నాయందు సదభిప్రాయం కలిగియుండిన అవతలవారికి మనోబలమిచ్చి, నాకు సాయపడునట్లు చేసింది.

శ్రీ నరసింహం విగ్రహం పొట్టిదిగాని, వ్యక్తిత్వం కలది. పసుపు శరీరఛాయతో, అవయవాల పొందికలతో, విశాల ఫాలభాగంతో, చురుకైన ముఖకవళికలతో చూపరులను ఆకట్టే వ్యక్తిత్వం కలవారు. వారికి కోపతాపా లుండవని చెప్పలేను. తన ఉద్యోగ హోదాను తాను బాగుగా గుర్తించినవారేగాక, ఉద్యోగనిర్వహణలో అధికారం, దర్పం చెలాయించేవారే. అయితే, మిక్కిలి లౌకిక స్వభావం కలవారు గనుక, సమన్వయం చేసుకొని, సామరస్యంగా నడువగల శక్తి గలవారు.

వారి కుమారు లందరూ వృద్ధిలోకి వచ్చారు. పెద్దవాడు సత్యనారాయణ ఇన్‌కమ్‌టాక్స్ అసిస్టెంట్ కమిషనరైనాడు. రెండవవాడు నాగేంద్రప్రసాద్ ట్రేడ్ వింగ్స్ అనే, ప్రయాణాలను ఏర్పాటుచేసే సంస్థలో డైరెక్టరై, ఆర్థికంగా ఉచ్ఛదశలో వున్నాడు. మూడవవాడు వెంకటేశ్వరరావు అమ్మకంపన్ను శాఖలో పెద్ద ఉద్యోగంలో వున్నాడు. నాల్గవవాడు నరసింహారావు అడవుల డిపార్టుమెంట్‌లో ఉద్యోగం నిర్వహించుచున్నాడు. అయిదవవాడు రజనీకాంతరావు సిండికేట్ బ్యాంకులో మంచి హోదాలోవున్నాడు. ఆరవవాడు నిర్మలకాంతరావు యింకను జీవితంలో స్థిరపడలేదనుకొంటాను. అతని కీమధ్యనే (1978) గత ఆగష్టునెలలో బెజవాడలో వివాహమైంది. నే నా వివాహానికి వెళ్లాను.

పెద్దకూతురు సౌభాగ్యవతి సుభద్రమ్మ భర్త గుడివాడ తాలూకా, ముదునూరు గ్రామం కొల్లి వీరయ్యగారి కుమారుడు రామచంద్రరావు. ఆయన అల్లోపతి వైద్య డిగ్రీలను పొంది,

గవర్నమెంట్ డాక్టరుగా యిప్పుడు కాకినాడలో పనిచేయు చున్నాడు. రెండవ కుమార్తె సౌభాగ్యవతి లక్ష్మి మిక్కిలి అభిమానం, ఆప్యాయతగల యువతి. ఆమె చాలా మంచి గృహిణి కూడా. సన్మానంతో ఆదరిస్తుంది. ఆమె భర్త చిత్తూరు జిల్లాకు చెందిన శ్రీ జి. రామచంద్రనాయుడు. ఆయన జిల్లా మునిసిఫ్‌గా కొంతకాలం పనిచేసి, ఇప్పుడు ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం లా డిపార్ట్‌మెంట్‌లో జాయింట్ శెక్రటరీ పదవికి చేరుకొన్నాడు. ఆయనకు, నాకు చక్కని మైత్రి. ఎంతో అభిమానంగా వుంటాడు. వారింటివద్ద నేననేకసార్లు భోజనం చేశాను. ఆయన మంచి వేటగాడు. ఇతరులతో వేట షికారుకు వెళ్లి కణుజులను, జింకలను, అడవి పందులను కూడా వేటాడి, తెచ్చుకుంటాడు. నేను హైదరాబాదులో వున్నప్పుడు అట్టి వేవైనా దొరికితే, నన్ను తప్పకుండా భోజనానికి పిలిచేవాడు. ముఖ్యంగా కణుజు మాంసాన్ని ఎండబెట్టి, కొంతకాలం నిల్వ జేసుకోవచ్చును. శ్రీమతి లక్ష్మికి ఆ ఎండిన కణుజు మాంసాన్ని, ఎలా రుచిగా వంటచేయాలో తెలుసును. ఆ ఎండిన మాంసాన్ని నేను కొన్నిసార్లైనా రుచిచూడ కల్గాను. మూడో కూతురు సౌభాగ్యవతి అన్నపూర్ణమ్మ పశ్చిమగోదావరిజిల్లా కొవ్వూరు, శ్రీ కోడూరు అప్పారావుగారి కుమారుడు రామమోహనరావును వివాహమాడింది. ఆయన హైదరాబాద్‌లో స్కూటర్లు, మొదలైనవానిలో వ్యాపారం చేసుకొనుచున్నాడు. నాల్గు, అయిదు కూతుళ్లు సౌభాగ్యవతులు అనసూయ, కమలలు అనంతపురం కళ్యాణదుర్గం వారిని వివాహమాడి, భర్తలతో అమెరికాలో వుంటున్నారు. ఆరవపిల్ల పెండ్లి ఈమధ్యనే జరిగింది. ఆమెకూడా భర్తతో ఇప్పుడమెరికాలోనే వున్నది. శ్రీ నరసింహంగారి పిల్లలలో చాలామంది పెళ్లిళ్లకు మేము హాజరైనాము. వారి మొదటిబిడ్డ సుభద్రమ్మ పెండ్లి సందర్భంగా నరసింహంగారితో కలసి ముదునూరు వెళ్లాను. రెండవకూతురు లక్ష్మి పెండ్లి సందర్భంగా చిత్తూరు జిల్లా గ్రామానికి వెళ్లాను. పెద్దకొడుకు సత్యనారాయణ, మూడోకూతురు అన్నపూర్ణమ్మ

పెళ్లిళ్లకు తిరుచానూరుకు వెళ్లాం. నరసింహారావు పెండ్లికి కాకినాడ సమీపం వేళంగి గ్రామానికి వెళ్లాను. అనసూయ, కమల పెళ్లిళ్లకు వెళ్లియుంటాను. గత ఆగస్టులో విజయవాడలో జరిగిన చివరి కుమారుని పెండ్లికి వెళ్లి వచ్చాను.

దురదృష్టవశాత్తు నరసింహంగారి తోడు నీడ, అండ దండ, సహధర్మచారిణి, వారి భార్య శ్రీమతి రామాయమ్మ కొలది కాలం క్రిందట పరలోకప్రాప్తురాలైంది. పిల్ల లందరుకూ రెక్కలు వచ్చి ఎవరి గూటికి వారు చేరుకొన్నారుగాని, తల్లిని పోగొట్టుకున్న బాధ ఆమె సంతానానికి సహజంగానే వుండునుగాని, పిల్లలకంటె భర్త నరసింహంగారికి తీరని కొరత. భార్య మరణించటంతో వారు సగం కృంగిపోయా రని చెప్పవచ్చును. వా రిపుడు రెండవ కూతురు లక్ష్మి వద్ద కాలక్షేపంచేస్తున్నారు. నిజానికి నా మిత్రులలో శ్రీ ఆచార్య రంగాను, శ్రీ గొర్రెపాటి వెంకట సుబ్బయ్యను తప్పిస్తే, శ్రీ నరసింహామే నాకు చిరకాలం నుండి తెలిసియుండి నాకు మిక్కిలి దగ్గరకు వచ్చిన మిత్రుడు.

నా ఉద్యోగారంభంలో, తర్వాత పోలీస్ సూపరింటెండెంట్ హోదాలో, వివిధ శాఖలలో పనిచేసిన శ్రీ సూర్యదేవర రామచంద్రరావు, శ్రీ యలమంచి సత్యనారాయణగార్లు నాకు పరిచితులై మిత్రులుగా మారారు. వా రిప్పటికిని నాయందు మిక్కిలి అభిమానంతో వుంటారు. అప్పు డప్పుడు స్నేహపూర్వకంగా మెలగుతాం.

నే నదివరలో ఒకటి, రెండుసార్లు చూచియుండిన తూర్పుగోదావరిజిల్లా కపిళేశ్వరపురం జమీందారు శ్రీ బలుసు బుచ్చిసర్వారాయుడుగారు, నేను కాకినాడకు 1943 లో ఇన్ కమ్‌టాక్స్ ఆఫీసరుగా వెళ్లినప్పుడు ఎక్కువ పరిచయులైనారు. వారి కాకినాడ గాంధీనగరం మేడలో నా నివాసం. వారు సౌజన్యమూర్తి, సుగుణసంపన్నులు, మృదుభాషి, ముక్కుకు సూటిగా నడిచే నిజాయితీ వర్తనులు. మిక్కిలి మర్యాద, మన్ననలతో, ఎవరి మనస్సును నొప్పించనివారు. అందరినీ ఆప్యాయతతో

పలుకరించే స్వభావం కలవారు. తాను చేపట్టిన పనిని నేర్పుతో, చాకచక్యంతో, అనునయంతో సాధించగల శక్తివంతుడు. జమీందారైనా, పెద్ద ధనవంతుడైనా నిగర్వి, నిరాడంబరజీవి. ఆయన మిక్కిలి స్ఫురద్రూపి. అందమైన ముఖకవళికలు కలవారు. కోటేరువంటి ముక్కు, దీర్ఘమైన చెవులు, అందమైన, విశాలమైన నేత్రాలు కలవారు. సామాన్య దుస్తులు వేసుకొన్నా, ఆయన తెల్లని తలపాగ ఆయన విశిష్టవ్యక్తిత్వానికి తగినట్లుగా అంద చందాలతో వుండేది. వారు చాలా సంవత్సరాలు తూర్పు గోదావరి జిల్లా బోర్డు అధ్యక్షులుగా వుండినారు. ఆ కాలంలో డాక్టర్ అంబేడ్కర్ కాకినాడకు రాగా, శ్రీ వెలగపూడి రామకృష్ణగారి ప్రోత్సాహంతో వారు పెద్ద తేనీటివిందు సమర్పారు అప్పు డక్క డుద్యోగంలో వుండిన నేను కూడా హాజరైనాను.

వారు కొంతకాలానికి మద్రాసు లజ్ చర్చి క్రాస్ రోడ్డులో ఒక భవనం కొని, అక్కడ స్థిరనివాస మేర్పరచుకొన్నారు. నేను మద్రాసులో కొన్ని సంవత్సరా లుద్యోగంచేశానుకదా! ఆ కాలంలోనే వారితోనే గాక, వారి సతీమణిగారితోకూడా నా భార్యకు, నాకు పరిచయ మైంది. వారి భార్యామణిగారిని, మే ముభయులం పెద్దమ్మగా రని పిలిచేవారం. జమీందారుగారు రెండు, మూడుసార్లైనా మా మద్రాసు యింటికి వచ్చియుంటారు. వారు నాతోనేగాక నా భార్యతోకూడా చనువుగా మాట్లాడే వారు. అరమరిక లేకుండా, ఆమె లోపల వుంటే లోపలికి కూడా వెళ్లి పలుకరించేవారు. నే నొకప్పుడు నే నుద్యోగంలోవున్న నెల్లూరునుండి మద్రాసుకువెళ్లి, వా రింట్లో 2, 3 రోజులు అతిథిగా వుండివెళ్లాను. వారు న న్నెంతో ఆదరించి, నాకు చక్కని అతిథి మర్యాదలు చేశారు. వారి స్నేహభావం, చనువుతోకూడిన మైత్రి నా కాహ్లాదాన్నేగాక, వారియందు నాకు పూజ్యభావం కలిగించింది. వా రింకను కొన్ని సంవత్సరాలైనా జీవించవలసిన వయస్సులోనే గుండెజబ్బు వచ్చి, కొంతకాలం చికిత్స పొంది

పరలోకప్రాప్తులైనారు. వారి మరణం నావంటి వారికి మిక్కిలి సంతాపం కలిగించింది. వారి దహనసంస్కారానికి, శ్రాద్ధకర్మలకు హాజరైనాను.

వారి పెద్దకుమారుడు శ్రీ యస్. బి. పి. పట్టాభి రామారావుగారిని మొదట బందరులో వారి విద్యార్థిదశలో చూచాను. తర్వాత, నా కాకినాడలోని ఉద్యోగకాలంనుండి వారితో పరిచయం ఎక్కువై, మైత్రిగా మారింది. ఆ స్నేహ భావాన్ని, ఆదరణను, అభిమానాన్ని యిప్పటికిని వారు చూపు తూంటారు. వారి చలవ వల్లనే, నేను ప్రథమంగా ఆంధ్రప్రదేశ లలితకళా అకాడమి సభ్యుడనైనాను, ఒరిస్సా రాష్ట్రం బెరాంగ్ లోని ఒరిస్సా ఇండస్ట్రీస్ కంపెనీకి నామినీ డైరెక్టరుగా ఇండియన్ ఇండస్ట్రియల్ ఫైనాన్స్ కార్పొరేషన్ వారిచే నియమింపబడ్డాను. వారు మద్రాసు రాష్ట్రంలోను, ఆంధ్ర ప్రదేశ్ ప్రభుత్వంలోను మంత్రిపదవులను నిర్వహించి, ఇప్పుడు లోక్‌సభలో సభ్యులుగా వుంటున్నారు. హైదరాబాదులో నైజాం ప్రభువు సేనాధిపతులలో నొకరి వారసుల నుండి మసాబ్ టాంక్ వద్ద "పెగాసస్ హౌస్" అను పేరుగల గొప్ప భవంతిని కొని, దానిలో స్థిరనివాస మేర్పరచుకొని యుంటున్నారు. వా రిద్దరి తమ్ములు శ్రీ యస్. బి. పి. వి. చలపతిరావుగారు, శ్రీ యస్. బి. పి. బి. కె. సత్యనారాయణరావుగారు నాకు చిరపరిచితు లైనారు, మిత్రులైనారు. శ్రీ చలపతిరావుగా రెక్కువ అభిమానం కనపరుస్తారు. 1959 మార్చిలో నా భార్యకు తల ఆపరేషన్ జరిగిన సందర్భంలో వారు మిక్కిలి సహాయకారిగా వుండినారు. వారు సర్వారాయ టెక్స్‌టైల్స్, శ్రీ సర్వారాయ షుగర్స్ అనే రెండు పారిశ్రామిక సంస్థలను సమర్థవంతముగా నడుపు చున్నారు. శ్రీ సత్యనారాయణరావుగారు కొన్ని సంవత్సరాల నుండి తూర్పుగోదావరి జిల్లా పరిషత్ ఛైర్‌మన్‌గా వుంటున్నారు. శ్రీ చలపతిరావుగారు, శ్రీ సత్యనారాయణరావుగార్లు ప్రస్తుత చల్లపల్లి జమీందారుగారి మేనత్త శ్రీమతి నీలకంఠేశ్వరమ్మ, వారి భర్త శ్రీ కొమ్మారెడ్డి పట్టాభిరామయ్యగార్ల ఇద్దరు కుమార్తె

లను చేరి ఒకరు చేసుకున్నారు. శ్రీ కొమ్మారెడ్డి పట్టాభిరామయ్య గారు నా రెండవ అల్లుడు శ్రీ వెలమాటి ఆంజనేయప్రసాద్ మేనమామ.

చిత్తూరు జిల్లా ఇన్‌కమ్‌టాక్స్ ఆఫీసరుగా 1931 లో నేను చిత్తూరులో ఉద్యోగం చేస్తున్నప్పుడు నాకు పరిచయస్థులై, స్నేహితులై, దగ్గర బంధువులవంటివారుగా రూపొందిన శ్రీ నలగాంపల్లి పాపుదేశు వెంకటస్వామి నాయుడుగారు, వారి కుమారులు వెంకటకృష్ణయ్యనాయుడు, చెంగల్‌రాయనాయుడును గురించి, ఆ కుటుంబాన్ని గురించి ఈ పుస్తకం 2-వ భాగంలో చెప్పియున్నాను. వెంకటకృష్ణయ్యనాయుడు సుజనుడు, సాత్త్విక సంపన్నుడు, మర్యాదస్థుడు, స్నేహశీలి. ఆయన భార్య శ్రీమతి వినాయకమ్మ తెలివితేటలు, ఔదార్యం కలిగిన మర్యాదస్థురాలు. వారి పెద్దకుమారుడు వీరరాఘవయ్యనాయుడు అనే అతడు, కొంత దక్షత కలిగి ఆంధ్ర శాసన మండలిలో సభ్యుడై యున్నాడు. వారి రెండో కొడుకు, మూడవ కొడుకు బస్సుల వ్యాపారం వంటి వానిని నడుపుకుంటున్నారు. శ్రీ వెంకట కృష్ణయ్యనాయుడు రెండో భార్య శ్రీమతి నీలామణి కుమారుడు సుధాకర్ కూడా బస్సులు నడుపుకొనుట వగైరా పనులు చూచు కొనుచున్నాడు. శ్రీ వెంకటస్వామినాయుడుగారి రెండో కొడుకు శ్రీ చెంగల్‌రాయనాయుడు రాజకీయాలలో ప్రముఖుడై, ఈమధ్యవరకు లోక్‌సభలో సభ్యుడుగా వుండి, ఆ సభ కార్య కలాపాలలో మిక్కిలి చురుకుగా పాల్గొనుచు, పదిమందికి తెలిసినవాడై 'హిందూ' వంటి పత్రికలలో పేర్కొనబడేవాడు. ఆయన భార్య సావిత్రమ్మ మిక్కిలి సరసురాలు. మాట మంచి, మర్యాద, మన్ననలు జాస్తిగ గలామె. వారిద్దరూ నాయందు మిక్కిలి అభిమానంతో వుంటారు. ఈ రెండు కుటుంబాలు మాయందు మిక్కిలి ఆప్యాయతతో వుంటవి. నేను, నాభార్య వారింట్లో పెండ్లి, పేరంటాలకు వెళ్లుచూండినాము. వారు మాయింటికి శుభకార్యములకు వస్తూన్నారు.

వెంకట కృష్ణయ్యనాయుడు యిద్దరు కుమార్తెలలో పెద్దామె సౌభాగ్యవతి ప్రమీల మిక్కిలి ఆప్యాయత, బంధు

భావం నాయందు చూపుతుంది. ఆమె భర్త శ్రీ వి. రామచంద్రన్, ఇప్పుడు ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ డైరెక్టర్ పబ్లిక్ ఆఫ్ ఇన్‌స్ట్రక్షన్‌గా వుంటున్నారు. వారు చాలా పెద్దమనిషి. మర్యాదస్తులు. ఏమాత్రం తొందర పడరు. దురుసుతన మించుకంతయు లేదు, మంచిగా మాట్లాడే స్వభావం గలవారు. సౌభాగ్యవతి ప్రమీల చెల్లెలు సౌభాగ్యవతి చిట్టెమ్మ (మనోరమ) తన భర్తతో కొన్ని సంవత్సరాలనుండి అమెరికాలో వుంటున్నది.

శ్రీ చెంగల్‌రాయనాయుడు కిద్దరు కుమాళ్లు రఘురామ్, వెంకటేశ్వర్లు అను వారు. పెద్దవాడు అమెరికాలో పెద్దగా చదువుకొని వ్యాపారం చేసుకొనుచున్నాడు. రెండవవాడు వ్యవసాయంలో దక్షుడు, సేద్యభూమి, మామిడి తోటలు వగైరా చూచుకొనుచున్నాడు. పైగా అతడు చిత్తూరు పంచాయతీ సమితి కధ్యక్షుడు. శ్రీ నాయుడు కిద్దరు కుమార్తెలు. పెద్దల్లుడు ప్రభుత్వం హైవేస్ డిపార్ట్‌మెంట్‌లో సూపరింటెండింగ్ ఇంజనీయర్‌గా వుంటున్నాడు. రెండో అల్లుడు భార్యతో అమెరికాలో వుంటున్నాడు. ఈమధ్యనే ఆ అమ్మాయి తలిదండ్రులను చూచుటకు వచ్చివెళ్లింది. ఏదో ప్రస్తావనగా "నాకు 75 సంవత్సరాలు నిండుచున్న"వని తమ్ముడు చెంగల్‌రాయనాయుడుకు వ్రాశాను. ఆయన భార్యతోను, రెండో కూతురు, పెద్దకొడుకు చిరంజీవి రఘురాంతోను మద్రాసుకు మా షెనాయ్‌నగర్ ఇంటికి 25-6-73 తారీఖున వచ్చి నాకు పండ్లు, మంచి పట్టుబట్టలు బహూకరించినారు. అంత ఆప్యాయత నాయందు వారికి.

నా మద్రాసు ఉద్యోగ కాలంలో పరిచయమై, ఇప్పటికిని స్నేహం జరుపుచున్న డాక్టర్ చిట్టూరి సత్యనారాయణగారు ఒక విశిష్ట వ్యక్తి. వారు ఇ. యన్. టి. స్పెషలిస్టు. ఆ వైద్య శాఖలో వారు మిక్కిలి పేరు ప్రతిష్ఠలు సంపాదించారు. ఆ డిపార్టుమెంటుకు వారు చాలా కాలంనుండి ముఖ్యులుగా వున్నారు. వారు కొలది సంవత్సరాలక్రితం, రాజాజీ అని యావద్భారత దేశానికేగాక, విదేశాలకు కూడా తెలిసిన మహామేధావి, బహుళ గ్రంథకర్త, సోక్రటీసు వంటి విజ్ఞానఖని, శ్రీ చక్రవర్తుల రాజగోపాలాచారిగారి వైద్య సహాయకుడుగా అమెరికాకు వెళ్లి,




గ్రంథకర్త శ్రద్ధేయ మిత్రుడు శ్రీ ఎస్. సంజీవదేవ్‌గారు

అప్పటి అమెరికా ప్రెసిడెంట్ శ్రీ జాన్ ఎఫ్. కెన్నెడీని శ్రీ రాజాజీ కలుసుకొని సంభాషించినప్పుడు, శ్రీ రాజాజీ వెంట వుండినారు. వా రిద్దరితోపాటు వీరుకూడా పత్రికలలో ప్రచురించిన ఫోటోలో వున్నారు.

డాక్టరు సత్యనారాయణ ఇ. యన్. టి. శాఖలో ప్రముఖులైనా వారి పాండిత్యం, కౌశలం వైద్యంలో కూడా బహుముఖమైనది. అంతేకాదు, వారు సారస్వత, లలితకళాభిమాని. అభిమాని మాత్రమేకాదు, ఆ విషయాలను బాగుగా తెలిసినవారు. తెలుగులో కొన్ని గ్రంథాలు వ్రాశారు. వానిలో చిత్రకళకు సంబంధించినవికూడా వున్నవి. స్వయముగా చిత్రపటాలను రచించగలరు. కొన్నిటినైనా లిఖించారు. మనిషి తెల్లని శరీర వర్ణం కలవారు. చక్కని కవలికలుగల గుండ్రని ముఖం. మధ్య రకం ఎత్తుతో, దృఢమైన శరీరం కలిగి మిక్కిలి అందంగా కనపడతారు. మిక్కిలి మాటకారి. ఒక్కొక్కప్పుడు అధికంగా మాట్లాడుచున్నారేమో అనిపిస్తుంది. అయినా, హావభావాలతో మాట్లాడుతారు కాబట్టి సరిపోతుంది. వచ్చినవారిని మర్యాద మన్ననలతో ఆదరిస్తారు.

నా ఉద్యోగ విరమణానంతరం, నాకు మిక్కిలి ముఖ్య మిత్రులైనవారు గుంటూరు జిల్లా, తెనాలి తాలూకా, తుమ్మపూడి గ్రామం వాస్తవ్యులు శ్రీ సూర్యదేవర సంజీవదేవ్ గారు. వారు తమంతట తాము తమ యింటిపేరు చెప్పుకొనరు, వ్రాసుకొనరు. ఇంకొక విశేషం. తుమ్మపూడి కుగ్రామం. అక్కడ బ్రాంచి పోస్టాఫీసు మాత్రమే వున్నది. దాని సబ్ పోస్టాఫీసు దుగ్గిరాల. వారి ఉత్తర ప్రత్యుత్తరాలు దుగ్గిరాల సబ్ పోస్టాఫీస్ నుండియే బట్వాడా అవుతవి. అయినా, వారు సంజీవదేవ్, తుమ్మపూడి, గుంటూరు జిల్లా అని మాత్రమే తమ పేరు, చిరునామా తెలుపుతారు. వారి విశిష్ట వ్యక్తిత్వంవల్ల శ్రీ సంజీవదేవ్, గుంటూరు జిల్లా అని మాత్రమే వ్రాసినా, వారికి చేరుతుందని నా నమ్మిక. కాకపోయినా, వారి ఉనికి వల్ల తుమ్మపూడి గుంటూరు జిల్లాలో సుప్రసిద్ధమైనట్లున్నది. నా "అభిప్రాయాలు - అనుభవాలు" అను గ్రంథంలో వారు వ్రాసిన "అవలోకన" అనే ఉపోద్ఘాతానికి

నా కృతజ్ఞత తెలుపుతూ, నా తొలిపలుకులో వారి గుణగణాలను వర్ణించియే యున్నాను. అది హ్రస్వముగా వారి పూర్తి చిత్రణమే. అది చాలదనుకొని, మరికొంత వ్రాయుచున్నాను. వారు మేధావి. బహుముఖప్రజ్ఞ కలవారు. తర్క, తాత్త్వికదృష్టి కలవారు. బెంగాలీ, హిందీ, ఉరుదు భాషలను బాగుగా అర్థంచేసుకొని సమర్థవంతంగా వానిలో మాట్లాడే శక్తి గలవారు. ముఖ్యంగా బెంగాలీ భాషలో వారు పాండిత్యం సంపాదించుకున్నట్లున్నారు. ఆ భాషలలోని పదాలను తెలుగురూపంలో వాడుతూంటారు. నిజానికి వారు పదబ్రహ్మ. అనగా క్రొత్త క్రొత్త పదాలను వారి ఉత్తర, ప్రత్యుత్తరాలలోను, రచనలలోను యిమిడిస్తూంటారు. వానిలో కొన్నైనా, నాకర్థంగాక వారినే అడుగవలసి వస్తున్నది. పదాలనే గాక, శీర్షికలనుకూడా క్రొత్తక్రొత్తగా వుండేటట్లు అవలంబిస్తారు. మిత్రులకు సూచిస్తారు. ఇంతమాత్రమేకాదు. తెలుగులో పద కవిత్వం, గేయ కవిత్వం వ్రాస్తారు. ఇంగ్లీషులో ఆయన కవిత్వం కొంతవరకైనా పద్య కవిత్వంగానే వుంటుంది. వారు రసదృష్టి కలవారు. ప్రకృతి వివిధభంగిమల రామణీయకాన్ని బాగుగా అవగాహన చేసుకున్నవారు. అందువలన వారి కవిత్వం, రచన రంగులను వెదజల్లుచు, వర్ణనలతో, చిత్రీకరణలతో నిండి వుంటుంది. వారు మిక్కిలి మనోజ్ఞమైన ప్రకృతి చిత్రాలను చిత్రిస్తారు. ఒకప్పుడు కొంతకాలంపాటు హిమాలయ పర్వత శ్రేణిలో కులు లోయవంటి వానిలో ప్రపంచఖ్యాతిని పొందిన నికలస్ రోరిక్, శ్వేతస్లావ్ రోరిక్ తండ్రి కొడుకులవద్ద నివసించారు. వారినుండి ప్రత్యేకంగా చిత్రకళను నేర్చుకొనకపోయినా, వారి ప్రభావంవల్లకాబోలు, తర్వాత ఆ కళ త్రోసుకువచ్చింది. మొదట ఫొటోగ్రాఫర్ గా కొంతస్థాయిని, పేరును సంపాదించి, తర్వాత శ్రీ ఆచంట జానకిరామ్ వంటి మిత్రుల ప్రోత్సాహంతో, తమంత తామే చిత్రకళ నారంభించి, దానిని గొప్పగా వృద్ధిచేసుకొన్నారు. మిత్రులకు కార్డులమీద చిత్రించి పంపటం వారికానందం. కార్డుల సైజు నుండి పైకి మెట్లెక్కినట్లు మధ్యరకపువి, కొంత పెద్దవి, తర్వాత మరీపెద్దవి, చిత్రాలను రచించారు.

ఇవన్నియు ప్రకృతి చిత్రాలే. వారు ప్రయత్నించి సంతృప్తిపడ లేదేమోగాని, మానవ లేక జంతుజాలం ప్రతిమ రూపాలను వారు చిత్రించినట్లు లేదు. అయితే, ప్రకృతి చిత్రాలను లిఖించుటలో వారు సిద్ధహస్తులైనారు. ఈమధ్యవరకు నీటిరంగులలోనే తమ చిత్రాలను లిఖించారుగాని, యిప్పుడు తైలవర్ణాలతోకూడా చాలా చిత్రాలు చిత్రించుచున్నారు. మరియు నీరు, నూనె మిశ్రమంచేసిన రంగులతో చిత్రపటాలను సృజించుచున్నారట. వారు ఎక్కువగా హిమాలయ దృశ్యాలవంటివానిని, కొండలు, లోయలు, చెట్లు, పొదలు, పువ్వులు మున్నగు వానిని చిత్రిస్తారు. వానిలో ముఖ్య విశేషం లాలిత్యం. అంత సుకుమారంగా, సున్నితంగా గీయబడ్డ, చిత్రింపబడ్డ ప్రకృతి చిత్రాలు అందరు ప్రకృతి చిత్రకారులనుండి బైటపడవు. వారు మామూలు రూప చిత్రాలనే చిత్రిస్తారుగాని, యాబ్‌స్ట్రాక్ట్ పేరుతో బయల్వెడలే అరూప, లేక నైరూప్య చిత్రీకరణజోలికి పోరు. కాని, ఈ నైరూప్య చిత్రాలనుకూడా అభిమానిస్తారు. వారు చిత్రకారులే కాదు, పేరుపడ్డ చిత్రకళావ్యాఖ్యాత, విమర్శకుడు. ప్రతి చిత్రకారుడు వారి సదభిప్రాయాన్ని కాంక్షిస్తాడు.

చిత్రకళ, వాని సంబంధమైన వ్యాసాలను వారు "రసరేఖలు" అను పేరుతో వారి మొదటి పుస్తకం ప్రచురించారు. తర్వాత వారు మిత్రులకు వ్రాసిన లేఖలలో కొన్నిటిని శ్రీ పండిత గొర్రెపాటి వెంకట సుబ్బయ్యగారు సమీకరించి "సంజీవదేవ్ లేఖలు" అని పేరుపెట్టి, ఆ పుస్తకాన్ని నాకు 1965 జనవరి 13-వ తారీఖున (శ్రీ) వెంకట సుబ్బయ్య అంకిత మిచ్చారు. తర్వాత (శ్రీ) సంజీవదేవ్ చిత్రకళను గురించి "రూపారూపాలు" అనే పుస్తకాన్ని రచించారు. వారి జీవితచరిత్రను ప్రారంభించి, కొంతవరకు వ్రాసి, ప్రచురింపించారు. ఈమధ్య "స్మృతి బింబాలు" అను పేరుతో వారు వ్రాసిన తమ జీవితానుభవాలు, పరిచయమైన మిత్రులు, వారు వెళ్లినచోట్లు, చేసిన పనులు వగైరాలను తెలిపే వ్యాసాలను ఆంధ్రజ్యోతి దినపత్రిక చాలా భాగాలను ప్రచురించింది. ఈ "స్మృతి బింబాలు" చాలా బాగున్నవి. "ఇంకా వ్రాయవలసినవి వుంటే పూర్తిచేసి, వానికి

పుస్తకరూపా న్నివ్వం" దని కోరుచున్నానుగాని, వా రెందులకో ఆ విషయాన్ని నా కిచ్చిన జవాబులలో దాటవేస్తున్నారు.

శ్రీ సంజీవదేవ్ గారు వారి రచనలను, లేఖలను ముఖ్యంగా వారి వ్యాఖ్యలు, సమీక్షలు, పీఠికలు, ఉపోద్ఘాతాలను మామూలు ధోరణిలో మొదలుపెట్టరు. ముందే వో సూత్రాలను వల్లించి, ఆ సూత్రాలు ప్రాధాన్యంగా విషయనిర్ణయం చేస్తారు. అంటే, వారి దృక్పథాన్ని కొన్ని ధోరణులలో, పద్ధతులలో, సూత్రాలలో అలవర్చుకొని, వాటిలో తాము వ్యాఖ్యానించే విషయాలు యిముడుతవా, లేవా అని నిర్ణయించి, తమ అభిప్రాయాలను తెలుపుతారు. వ్యాఖ్యాతలు మామూలుగా గ్రంథ విషయాలను చెప్పి, వాని అంతరార్థాలనుగాని, పైకి కనిపించే గుణావ గుణాలనుగాని సూచించే సూత్రాలనో, సాదృశాలనో చెప్తు తారు. సంజీవదేవ్ గా రట్లుగాక, తమ ధర్మాలను అనగా తన దృక్పథాన్ని ముందుగా బహిర్గతపరచి, దానిప్రకారం తాము అవలోకనచేస్తున్న విషయాన్ని గురించి తెలుపుతారు. ఈ పద్ధతివలన సంజీవదేవ్ గారి వ్యాఖ్యలలోను, పరామర్శలలోను, సమీక్షలలోను వారి వ్యక్తిత్వమే, వారి సూత్రాలే, లేక ధర్మాలే ప్రధాన మాతవి.

ఈ పద్ధతినే వారు మిత్రులకు ఉత్తరాలుకూడా వ్రాస్తారు. ఏదో తత్వచింతన మొదలుపెట్టి, పైఎత్తునుండి క్రిందకు జారిపోయే నీరులాగా వారి వుత్తరాలు వారు చెప్పదలుచుకున్న ధర్మాలలోకి జాలువారుతాయి. అందువలన నేను, అవి ఉత్తరాలుకావు. బైబిల్ లోని శ్రీముఖాలు ( ఎపిసిల్స్ ), సువార్తల ( గాస్ పెల్స్ ) వంటి వనుకుంటాను. నా నిశ్చితాభిప్రాయం, మామూలు ఉత్తరాలు జ్ఞానవిజ్ఞాన ప్రబోధానికిగాక సంగతులను తెలపటానికి మాత్రమే అని. నేను చేసినవి చేయబోవుచున్నవి, జరిగినవి జరుగబోవు చున్నవి సాధ్యమైనంత పూర్తిగా వ్రాయునట్టిది నా ధోరణి. నేను వచ్చిన ఉత్తరం తిరిగి చదివి, దానిలోని ప్రతిసంగతిని ఎత్తు కొని, ప్రతిదానికి జవాబు వ్రాసే స్వభావం కలవాడను. అందు వలన ఏవో నీతులు బోధించే వుత్తరాలు నా కసంతృప్తిని కలిగిస్తవి. జ్ఞానోపదేశాలుచేసేవి, తాత్త్విక చింతనలను తెలిపేవి,

ఎంతమాత్రం ఉత్తరాలు కావని నేను యింకొకసారి ధృవీకరించు చున్నాను. అయితే, శ్రీ సంజీవదేవ్ గారు, నా కిప్పుడు వ్రాసే వుత్తరాలు మామూలు ఉత్తరాలుగానే వుంటున్నవి. అందుకు నేను సంతోషిస్తున్నాను. వారి రచనాభాష ముందుకు, వెనుకకు దండాలు తీసినట్లు జరుగుచుంటుంది. ఒక వాక్యాన్ని వ్రాసి, ఒక భావాన్ని తెలిపి, దానిని తర్కించినట్లు క్రిందికి, మీదికి త్రోస్తుంటారు. వారి రచనా విధానంలో తార్కికం హెచ్చు పాళ్లలో వుంటుంది. అందువల్ల యీ కుస్తీలు శ్రీ బుచ్చిబాబు, శ్రీ సంజీవదేవ్ "రూపారూపాలు" పుస్తకంలో చెప్పినట్లు మాటలగారడి, గజిబిజి కలుగుతుంది. ఈపద్ధతి పాఠకులకు అనాసక్తిని కల్గిస్తుంది. ఇందువల్లనే కాబోలు, కొంతమంది శ్రీ సంజీవదేవ్ రచనలో తెలుగు నుడికారం తక్కువంటారు.

వారి సతీమణి శ్రీమతి సులోచన మిక్కిలి సాత్త్విక సంపన్నురాలు, ప్రియభాషిణి, అతిథి మర్యాదలను చక్కగా ఎరిగినవారు. వా రింటి కెంద రెందరో మేధావులు, విజ్ఞాన వేత్తలు, కవిపుంగవులు, కళాకారులు వస్తారు. అప్పు డప్పుడు పాశ్చాత్యులుకూడా వచ్చి, 2, 3 రోజులు గడపి వెళ్లటం కలదు. వా రందరికీ ఉచిత ఉపాహార భోజనాల నమర్చి, స్నాన పానాదుల నేర్పరచి, ఎంతో దక్షతతో వారి నందరిని ఆదరించి, సంతృప్తులను చేస్తున్నా రామె. ఆమె నిజంగా మంచి గృహిణి. నేను రెండుసార్లు వా రింటివద్ద రెండు, మూడు రోజులు గడపి, సంతోషించాను. వారి కిద్దరు కుమారులు. జోగేంద్ర, మహేంద్ర అనువారు. ఆ బిడ్డ లిద్దరు హెచ్చుస్థాయిలోనే విద్యాభ్యాసం చేస్తున్నారు.

సంజీవదేవ్ గారి కుటుంబం పెద్ద అంతస్థు కలది. వారి ఏకైక సోదరి శ్రీమతి శారదాదేవిని గుంటూరు, చింతపల్లి రాణీగారి దత్తపుత్రుడు వాసిరెడ్డి హరిహరప్రసాద్ గారి జ్యేష్ఠ పుత్రుడు శ్రీ రామ్‌భూపాల్ గారి కిచ్చి, వివాహం చేశారు. శ్రీమతి శారదాదేవి అందగత్తెయేగాక, సుగుణవంతురాలు, సౌజన్యవతి.

చాలా నెమ్మదిగా, ముక్తసరిగా మాట్లాడటం, మర్యాదతో నడచుకొనటం, ఆమె విశిష్ట గుణాలు.

శ్రీ సంజీవదేవ్‌గారిని నేను 1961 ఆగస్టులో ప్రథమం కలుసుకొన్నాను. అప్పు డేర్పడియున్న ఆంధ్రప్రదేశ లలితకళా అకాడమిలో మే మిద్దరం సభ్యులం. ఆ అకాడమి ప్రారంభోత్సవం, అప్పటి ముఖ్యమంత్రి శ్రీ దామోదరం సంజీవయ్యగారి ఆధ్వర్యాన జరిగింది. శ్రీ సంజీవయ్యగారు ఆంధ్ర సాహిత్యంలో ఎక్కువగా కృషి చేసినవారు. కవిత్వంకూడా వ్రాసేవారనుకొందును. పాండిత్యం తప్పకుండా వున్నది. మంచి వక్త. వారు హావభావాలతో మిక్కిలి చక్కగా హాస్యాన్ని మేళవించి కావ్యాలనుండి పద్యాల నుదహరిస్తూ, ఎంతో ముచ్చటగా, హృదయాహ్లాదకరంగా, ఏకధారగా వుపన్యసించారు. అది అటుంచి, అప్పుడు పరిచయమైన సంజీవ్ దేవ్‌గారు సన్నిహిత మిత్రులైనారు. వారింటికి నేను వెళ్లటమేగాక, వారు, వారి భార్య శ్రీమతి సులోచన మా యింటికివచ్చి చూచిపోవటం జరిగింది. శ్రీ సంజీవదేవ్, నేను రెండుసార్లు హైదరాబాద్ అబీద్ రోడ్డు తాజమహాల్ హోటల్‌లో కొలదిరోజులు కలసి వుండినాము. మరిన్ని, మిత్రమండలి జరిపే సంక్రాంతి సాంస్కృతిక సమావేశాల్లో కలుసుకుంటూ వుంటాము. ఈ మధ్యనే ఈ "స్వవిషయం" పుస్తకం మొదటి భాగాన్ని చదివి, చాలా బాగున్నదని సంతోషించారు. వారు సాంస్కృతిక కలాపాలలో, చిత్రకళా కలాపాలలో ఉపన్యసించటం, వారి చిత్రపటాలను ప్రదర్శించటం, తరుచు చేస్తున్నారు. వారిని ఎక్కడెక్కడికో వారు, వీరు ఆహ్వానించి తీసుకొని వెడుతుంటారు. ఈమధ్య ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం సాహిత్య, సంగీత, నాటక, లలితకళ, విజ్ఞానశాస్త్ర అకాడమీల బాగోగులను, వానినినడిపే విధానాలను పరిశీలించుట కేర్పాటుచేసిన సంఘంలో వారు సభ్యులు. చివరి సమావేశం హైదరాబాదులో జరుగుతుందని, తాను 17-వ తారీఖు రాత్రి ఎక్స్‌ప్రెస్‌లో బయలుదేరి హైదరాబాదుకు వెళ్తున్నానని, 16-10-78-వ తారీఖున వ్రాశారు. మరిన్ని, తాము నవంబరు 12-వ తారీఖున

బయలుదేరి బెంగుళూరుకు వెళ్లుతానని, అక్కడ సుప్రసిద్ధ అంతర్జాతీయ ఫోటోకారులు డాక్టర్ థామస్‌గారింట్లో ఒక వారంరోజు లుంటానని, 15 నుండి 18 వరకు, తాము లిఖించి యుండిన తైలవర్ణ చిత్రాలను ప్రత్యేకంగా ప్రదర్శిస్తానని, అక్కడి యిండియన్ యిన్‌స్టిట్యూటు ఆఫ్ వరల్డ్ కల్చర్‌లో తమ యింగ్లీషు కవితను చదివి వినిపిస్తానని, ఉపన్యసిస్తానని వ్రాశారు. ఒకరోజు బెంగుళూరు రేడియో స్టేషన్‌లో వారి కార్యక్రమం ఏర్పరచారట. కొన్నిరోజుల క్రితమే బందరులో ఫోటోగ్రాఫి ప్రదర్శన ఆరంభించారు, ఉపన్యసించారు. ఈవిధముగా వారు పెద్ద ఎత్తున సాహిత్య, చిత్రకళ వ్యాసంగాలను కొనసాగించుకొంటున్నారు. వారి కివే నా జేజేలు!

నా సాహిత్య మిత్రులలో ఏలూరు, వేగుంట కనకరామ బ్రహ్మంగారు, శ్రీ కాసుమిల్లి రామచంద్రరావుగారు, (శ్రీ) వెలగా వెంకటప్పయ్యగా రున్నారు. (శ్రీ) వేగుంట కనకరామబ్రహ్మం గారు సజ్జనుడు, స్నేహశీలి, అమిత మర్యాదస్థుడు. వారి హృదయం కనకం వంటి శోభాయమాన మైనది. అయితే, బంగారంకువున్న కఠినత్వం దానికి లేదు. దీప్తికి తోడు పరిమళం గల హృదయం కాబట్టి, బంగారానికి సువాసన అబ్బినట్లైనది. వారు కావ్యాలు, ప్రబంధాలు చదువుకొన్నారో లేదోగాని, వారి ఆంధ్రసాహిత్య విజ్ఞానం, పరిశీలనాశక్తి, వ్యాఖ్యానదక్షత పెద్దతరహాలోనివి. వారి కిప్పటికి వెలువడిన నా ఐదు పుస్తకాలను అందించాను. సంతోషంగా చదివి, బాగున్నవని సహృదయంతో వ్రాశారు. వారు ఏలూరు కేంద్ర తనఖా బ్యాంకి శక్రటరి అని పైన చెప్పియున్నాను.

శ్రీ కాసుమిల్లి రామచంద్రరావుగారు ఏలూరులో ప్రాక్టీసు చేస్తున్న వకీలు. వారు "మంజువాణి" అనే ఇంగ్లీషు వారపత్రికను నడుపుచుంటారు. తెలుగులో వారికెంత పాండిత్యమున్నదో తెలియదుగాని, వారు సౌజన్యవంతులు, సౌమ్యులు అని వారిని చూచినప్పుడల్లా అనుకుంటాను. వారు మిక్కిలి స్నేహశీలి. నా పుస్తకాలు బాగున్నవంటారు.

శ్రీ వెలగా వెంకటప్పయ్యగారు పశ్చిమ గోదావరి జిల్లా కేంద్ర పుస్తక భాండాగార కార్యదర్శి. వారీమధ్య ఒకటి, రెండు పుస్తకాలు ప్రచురించారు. గ్రంథాలయాల పుట్టు పూర్వోత్తరాలను గురించి వ్రాసిన పుస్తకం నాకొకటి బహూకరించారు. వారిప్పుడు బాపట్ల తాలూకా, కారంచేడు వాస్తవ్యులు, చాలా సంవత్సరాలు గుంటూరు జిల్లా బోర్డు అధ్యక్షులుగా పరిపాలించిన వారు, సద్గుణ వంతులు, పేరు ప్రఖ్యాతులు పొందిన శ్రీ జాగర్లమూడి కుప్పుస్వామి చౌదరిగారి జీవిత చరిత్ర వ్రాస్తున్నట్లు విన్నాను. వారు నా పుస్తకాలను చదివి, సంతోషించే వారిలో నొకరు.

నేను 1953లో ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమి సభ్యుడ్నైనప్పుడు శ్రీ బిరుదు రామరాజుగారితో ఎక్కువ పరిచయమైంది. అంతకుముందే, వారింటికి రెండు మూడు సార్లు వెళ్లియున్నాను. మొదటినాడు నన్నక్కడకు తీసుకొని వెళ్లినది శ్రీ సంజీవదేవ్ గారు. ఇంకొకసారి వారింటిలో శ్రీ దువ్వూరి వెంకటరమణ శాస్త్రిగారిని కలసికొన్నాను. మరిన్ని, హనుమకొండకు చెందిన "కాళోజీ" అని మామూలుగా పిలువబడే శ్రీ కాళోజీ నారాయణరావుగారిని ప్రథమం అక్కడ చూచాను. ఇంకొకసారి హైదరాబాదు శక్రటేరియట్ లో పని చేస్తుండిన శ్రీ త్రిపురనేని సుబ్బారావుగారు వ్రాసిన కవిరాజు త్రిపురనేని రామస్వామి చౌదరిగారి జీవిత చరిత్ర నేను ప్రయత్నించినా దొరకలేదనగా వారి వద్ద నుండిన ప్రతిని చప్పున, స్నేహపూర్వకంగా తీసి యిచ్చారు. నేను సాహిత్య అకాడమి సభ్యుడుగా నున్నప్పుడు, వారింటి కప్పుడప్పుడు వెళ్లుచుండే వాడను. వారివద్ద కొన్ని ప్రాత వ్రాతగ్రంథా లున్నవనగా చూపండని కోరాను. వారి వద్ద తాళపత్రాల మీదనేగాక, కాగితాలమీద వ్రాసినవి కూడా చాలా వున్నవి. రెండు మూడు మూటలను ఊడదీసి, కాగిత వ్రాతప్రతులను చూపించారు. అదివరలో ఒకనాడు మద్రాసులో శ్రీ ఆరుద్రగారు చెప్పిన దానినిబట్టి, ఎవరో వ్రాసిన శ్రీ కృష్ణచరిత్ర వ్రాతప్రతి మీవద్ద

నున్నదట, అది చాలా బాగున్నదని ఆరుద్రగారు చెప్పారు. అది ఎక్కడనగా, దానిని ఎత్తి చూపించారు. ఈ పుస్తకమైనా ముద్రణ భాగ్యమునకు యింతవరకు నోచుకోలేదు.

శ్రీ బిరుదు రామరాజుగారు రప్పుడు ఉస్మానియా యూని వర్శిటీలో తెలుగుశాఖలో రెండవవారుగా వుండేవారు. కొంత కాలానికి వరంగల్లులో మొదలుపెట్టిన పోస్టు గ్రాడ్యుయేట్ కాలేజి తెలుగు సెక్షన్‌కు అధిపతిగా వెళ్ళి, హనుమకొండలో వుండుచున్నారు. ఈమధ్య ఉస్మానియా విశ్వవిద్యాలయ తెలుగు శాఖ కధ్యక్షులుగా నుండిన శ్రీ దివాకర్ల వెంకటావధానిగారు రిటైరైనారు. శ్రీ రామరాజుగారిని ఆస్థానే నియమించారు. అయితే తాను వరంగల్లు పోస్టుగ్రాడ్యుయేట్ కాలేజీలో నిర్వ హించుచున్న పని ఈ సంవత్సరం పూర్తి అయ్యేవరకు, అనగా 1974 మార్చి ఆఖరువరకు హనుమకొండలోనేవుండి, ఉస్మానియా యూనివర్సిటీపనిని కూడా చూస్తూ వుంటాను, తరువాత హైదరాబాదు వెళ్లుతానని వా రీమధ్యనే వ్రాశారు.

శ్రీ రామరాజుగారు మిక్కిలి సహృదయులు, స్నేహ స్వభావం కలవారు. సాత్విక గుణసంపన్నులు. సాత్వికగుణాన్ని ప్రస్ఫుటంజేసే వారి ముఖం, వారి హృదయ నైర్మల్యాన్ని తెల్పు తుంది. వారు తెలుగు జానపదులగేయ సాహిత్యాన్ని మథించి 800 పేజీలుగల పెద్ద పుస్తకాన్ని "తెలుగుజానపద గేయ సాహిత్యం" అను పేరుతో ప్రచురించారు. ఆ థీసిస్ వల్ల ఉస్మానియా విశ్వవిద్యాలయం వారికి డాక్టరేట్ డిగ్రీని ప్రసాదించింది. వారు తెలుగు సాహిత్య పరిశోధకులు. అపూర్వమైన మరుగు పడిన తెలుగు మాణిక్యాలను వారి పరిశోధనచే బయటికితీసి ప్రచురించారు. వానిలో నొకటి సారసము వెంకటనాధకవి అనే కమ్మప్రభువు రచించిన ఉత్తమకావ్య మున్నది. వారు పరిశోధకులు కాబట్టి వారివ్యాఖ్యలు కొన్ని చురకలు కలిగినవిగానే వుంటవి. పట్టినదల్లా బంగారం అనుకోరు, చూచినదల్లా కాంతి పుంజం అనుకోరు. విమర్శించినా, అవతలివారి మంచి కొరకే. వారిస్నేహం మిక్కిలి ప్రీతికరమైనది.

హనుమకొండ వాస్తవ్యులు "కాళోజీ" అని మామూలుగా పిలువబడే శ్రీ కాళోజీ నారాయణరావుగారు, వారి అన్న శ్రీ కాళోజీ రామేశ్వరరావుగారు నాకు సన్నిహితులే అయినారు. శ్రీ కాళోజీ నారాయణరావుగారు పేరుపొందిన ప్రజాకవి. "నాగొడవ" అను శీర్షిక క్రింద ఋతువుల పేర్లతో రకరకాల గేయాలను రచించారు. మరిన్ని గాలిబ్ గీతాలను అనువదించారు. మంచి మాటకారి, అరమరలేకుండా మిత్రులతో మెలగుతారు. తెలంగాణా సంగతి, రాయలసీమ సంగతి తెలియదుగాని, వారికి కోస్తాజిల్లాలలో చాలమంది స్నేహితులున్నారు. ఆ మిత్రుల యిండ్లకు తరచు వస్తూ పోతూంటారు.

శ్రీ రామేశ్వరరావుగారు ఉత్తమ గుణసంపన్నులు, విషయ విజ్ఞానియేగాక, జ్ఞానసంపన్నులు, మంచి చెడులు తెలిసినవారు. వారిని చూచినతోడనే, ఎవరికైనా పూజ్యభావం ఏర్పడుతుంది. వారు ప్రాంతీయ ప్లీడరు పట్టాను పొంది, మిక్కిలి సమర్థవంతంగా న్యాయవాద వృత్తిని కొనసాగించి, ఈ మధ్యనే అనారోగ్య కారణాన వృత్తిని విడిచిపెట్టి, విశ్రాంతి పొందుచున్నారు. వారు తెలుగులో చాలా చక్కగా, మిక్కిలి హాస్యపూరితంగా, హృదయాహ్లాదకరంగా వ్రాయగలరు. వారు రచించిన "ఫోటోగ్రాఫర్" అనే కథను ఒకటి రెండుచోట్ల సంక్రాంతి సమావేశాలలో చదివి, వినిపించగా, సభికులందరు మిక్కిలి ఆనందించారు. తెలుగురచనా సామర్థ్యమేగాక, వారికి ఉర్దూ భాషాపాండిత్యం మిక్కిలి హెచ్చుగా వున్నది. ఉర్దూభాషలో వారు వ్రాసి చదివిన పద్యాలు ఉర్దూభాష తెలిసినవారిని మిక్కిలి సంతోషపెట్టినవి. వారు 1969 సంక్రాంతి సమావేశానికి ఘంటసాల, శ్రీ గోరెపాటి వెంకటసుబ్బయ్యగారింటికి వెళ్లి, తిరిగివస్తున్నప్పుడు, నా అభ్యర్థన మీద 14-వ తారీఖు జనవరి సాయంత్రం మా యింటికి వచ్చి మర్నాడు మధ్యాహ్నంవరకుండి వెళ్లారని పైన చెప్పాను. మా ఆతిథ్యానికి, మర్యాద, మన్ననలకు చాలా సంతోషించి, ముఖ్యంగా నా భార్యను ప్రశంసిస్తూ హనుమకొండనుండి జాబు వ్రాశారు. ఈ మధ్యనే కాళోజీగారు వచ్చిపోయారుగాని, రామేశ్వరరావు

గారి దర్శనం తిరిగి కాలేదు. వారిని వెళ్లి చూద్దాం అనుకుంటూ కాలాయాపన చేస్తున్నాను.

వరంగల్లులో 1967 సంక్రాంతి సమావేశంలో కలుసుకొని, 1969 సంక్రాంతికి ఘంటసాలనుండి తిరిగి వెళ్లుచు మా యింటికి వచ్చియుండిన (శ్రీ) అనుముల కృష్ణమూర్తిగారు మంచికవి. వారి "సరస్వతీ సాక్షాత్కారము" ను 1967 సంక్రాంతి సమావేశంలో రామప్ప చెరువువద్ద చదివి, వినిపించినప్పుడు నాకు సరస్వతి సాక్షాత్కారమైనట్లే తోచింది. మధురమైన ఉత్తేజాన్ని కల్గించే కవిత్వమేగాక, వారు మిక్కిలి శ్రావ్యంగా చదివినరీతి, నావంటివానిని మైమరపించిన ట్లైనది. వారు స్నేహశీలురు, మర్యాదస్థులు. వారిని తిరిగి కలుసుకోవాలని వున్నది. ఎప్పటికి సంభవించునో.

(శ్రీ) కలిదిండి నారాయణరాజుగారు (పెదపుల్లేరు, భీమవరం తాలూకా, పశ్చిమ గోదావరిజిల్లా) 1965 జనవరి 14-వ తారీఖున, మాయింట సంక్రాంతి సమ్మేళనం జరిగినప్పుడు వచ్చి ప్రథమంగా పరిచయమైనారు. వా రప్పు డప్పుడు వస్తుంటారు. నేను రెండుమూడుసార్లు వారింటికి అతిథిగా వెళ్లాను. శ్రీ నారాయణ రాజు కలుపుగోలుతనం ఎక్కువగా కలవారు. స్నేహంలోనే గాక చనువులోకూడా వుంటారు. పచ్చని శరీరంతో, దృఢ కాయంతో, సామాన్యపు ఔన్నత్యంతో, నిండుగా పండిన గుమ్మడి పండువలె వుంటారు. వారి మందహాసం ఆకర్షణీయంగా వుంటుంది. వారు చిరునవ్వుతో మాట్లాడుచుంటారు. వారు భూస్వాములే గాక, బాగా డొక్కశుద్ధియైనవారు. అన్నిటికి మించి చక్కని చిత్రాలు సంప్రదాయపద్ధతిని లిఖించే కళా కారులు. భీమవరం అంకాల ఆర్టు అకాడమికి పట్టుకొమ్మ. మరిన్ని, వారు చక్కగా వ్రాయగలరు, మాట్లాడగలరు. ఈమధ్య కొంత తత్త్వచింతన ఎక్కువై తరచు పాండిచ్చేరి శ్రీ అరవింద ఆశ్రమానికి వెళ్లుచున్నారు. పై సంక్రాంతికి (1973), ఈ సంక్రాంతికి (1974) ఘంటసాలలో వెంకట సుబ్బయ్యగా రింటి వద్ద జరిగిన సాంస్కృతిక సమావేశంలో అరవిందుని తత్త్వ

చింతనలను గురించి మాట్లాడారు. ఆయన మంచిస్నేహితులు. కాని, వ్యాపకాలవలన కాబోలు, ఇచ్చిన మాటను నిలబెట్టుకో లేకపోవుచున్నారు. అనేక వ్యాపకాలు పెట్టుకొనేవారి విషయంలో యిట్టి లోపం జరుగుతూంటుంది. అయినా, కలసికొన్నప్పుడు చనువు, ఆప్యాయత చూపించే స్వభావంకలవారు. 1966 సంక్రాంతికి వారింట జరిపిన మిత్రబృందం సమావేశాన్ని మిక్కిలి జయప్రదంగా 3, 4 వందల అతిథులతో జరిపారు. వారి ఆతిథ్యం పెద్దగా వుంటుంది. అతిథులకు ఏలోటు రాకుండా శ్రద్ధ తీసు కుంటారు.

పై వారుగాక, శ్రీ యార్లగడ్డ రామకృష్ణప్రసాద్ గారు నాకు మిత్రులైనారు. వారు పిన్నవయస్సులో నుండగా, 1936 లో వారి అన్నగారగు శ్రీ చల్లపల్లి రాజా శ్రీమంతు యార్లగడ్డ శివరామప్రసాద్ బహద్దర్ గారితో కలసి, ఈ వూరు వచ్చి నప్పుడు ప్రప్రథమం వారిని చూచాను. అప్పు డీ యూరిలో ప్రారంభింపబడిన స్కూలు భవనానికి గృహప్రవేశం చేయటానికి, వారిపేరను వున్న ఈ యూరి పుస్తక భాండాగారం వార్షికోత్సవం జరపటానికి, శ్రీ రాజాగారు పెదసనగల్లుకు వచ్చారు. అప్పుడు శ్రీ రామకృష్ణ ప్రసాద్ గారు బక్క పల్చగా, పొడుగ్గా పచ్చని శరీర ఛాయలో మిక్కిలి నాజూకుగా, అందంగా వుండేవారు. తరువాత వారి నప్పు డప్పుడు చూచినా, వారితో ఎక్కువ పరిచయమైనది నేను 1957 జూన్‌లో చల్లపల్లి షుగర్స్ లిమిటెడ్ కంపెనీకి డైరెక్టరు నైన నప్పుడు. క్రమేపి, మా పరిచయం మైత్రిగా పరిణతి చెందింది. ఇప్పుడు మిక్కిలి స్నేహభావంతో ఒకరి నొకరు కలసికొనుచు మాట్లాడుకొను చుంటాము. ఒక సారి వారి కారులో తిరుచానూరుకు ఒక పెండ్లికి నన్ను తీసుకొని వెళ్లారు. పెండ్లి జరిగినరాత్రి వారు, వారి కుమారుడు శ్రీ హర్ష వర్ధనప్రసాద్, నేను తిరుమల కొండపైకి వెళ్లి, వా రేర్పాటు చేసిన గదిలో విశ్రమించాం. మర్నా డుదయం వారికి కల్పించిన అనుకూలాలను వారితోబాటు పంచుకొని, స్వామివారిని

సేవించాను. సాయంకాలము వారితోబాటు మద్రాసుకు తిరిగి వెళ్లాం. దీనిని వారికి, నాకు కలిగిన సన్నిహితత్వాన్ని గూర్చి తెల్పుటకు వ్రాయుచున్నాను. వారు, నేను కలసికొన్నప్పుడు ఏ అరమరికలు లేకుండా ప్రాత స్నేహితుల రీతిగా సమాన స్థాయిలో మాట్లాడుకొంటాము, వర్తిస్తాము. నాకు 75 సంవత్సరాల వయస్సు పూర్తికి సాదరంగా, నాకు పట్టుబట్టలను బహూకరించి ఆదరించారు.

వారు మిక్కిలి శ్రీమంతులేగాక, హెచ్చుగా చదువు కొన్నవారు. బి.ఎ. ఆనర్స్ డిగ్రీతోబాటు, బి.ఎల్. డిగ్రీని కూడా పొందినవారు. తెలుగులోకూడా తగినంత ప్రవేశం, గుణదోషాలను తెలుసుకొనే సమర్థత వారి కబ్బినవి. ఇంగ్లీషు లోను, తెలుగులోను చక్కగా మాట్లాడగలరు. మామూలు సంభాషణకూడా బాగుంటుంది. చిరకాల జమీందారీ సంప్రదాయ పద్ధతులు, ఆ మనస్తత్త్వం కొంత హెచ్చుగా వుండినా, వారి అన్నగారికంటె ఆ సంప్రదాయాలను వీరెక్కువగా గౌరవించినా, తరుచు జ్ఞాపకానికి తెచ్చుకొనుచుండినా, కాల మార్పునుబట్టి సామాన్య ధనికవర్గానికి చెందినవారు వలెనే ప్రవర్తిస్తున్నారు. వయస్సువచ్చిన వారికుమారుడు శ్రీ హర్షవర్ధనప్రసాద్ మిక్కిలి దీక్ష, పట్టుదల గల యువకుడు. ఏభేషజం లేక సంపన్న రైతువలె దగ్గరుండి వ్యవసాయం చేయించుకుంటాడు. వారి తండ్రిగారి భూములనేగాక, వారి మాతామహులు శ్రీ అమరావతి రాజాగారు తమ ఏకైకపుత్రికకు సంక్రమింపజేసిన చల్లపల్లిలోని భూములను, దొడ్లు, చావిళ్లను నేర్పుతో యాజమాన్యం జరుపుకొనుచున్నారు. మారిన పరిస్థితులకు మిక్కిలి అనువైన ప్రవర్తన కలవారు. మద్రాసు నుంగంబాకంలోని వారి తండ్రిగారి గొప్ప భవంతిలోగాక, చల్లపల్లిలో వారి మాతామహుని పేర కట్టించిన మధ్యరకం కంటె పెద్దదైన మేడలో తరుచు నివసిస్తూ వ్యవసాయం వగైరా చూచుకొనుచున్నారు.

శ్రీ యార్లగడ్డ రామకృష్ణ ప్రసాద్‌గారు పారిశ్రామిక వేత్తగా ప్రారంభించి కొన్ని సంస్థలను నడిపారుగాని, ప్రస్తుతం హైదరాబాదు సమీపాన 12 ఎకరాల పై చిల్కు విస్తీర్ణంలో, కొన్ని పెద్ద కట్టడాలతో విలసిల్లుచున్న వారి "సారథి స్టూడియోస్" అను చలన చిత్రాలను తీసే సంస్థ ప్రవర్థమాన మగుచున్నది. దానిని కొన్న తర్వాత కట్టడాలు వగైరాలను విస్తృతం చేసి, అభివృద్ధి పరచి, దాని నిప్పుడు తెలుగు సినిమా రంగంలో అత్యుత్తమ స్థానానికి చేరిన శ్రీ అక్కినేని నాగేశ్వరరావుగారి భార్య శ్రీమతి అన్నపూర్ణాదేవి పేరున నడుప బడుచున్న సినిమా డిస్ట్రిబ్యూటర్స్ వారి కద్దె కిచ్చియున్నారు.

శ్రీ కుమార రాజాగారని చివర వరకు పిలువ బడిన శ్రీ ముక్త్యాల రాజా, శ్రీ రామ గోపాల కృష్ణ మహేంద్ర ప్రసాద్‌గారు, నేను 1940-43లో బెజవాడ ఇన్‌కమ్‌టాక్స్ ఆఫీసరుగా నుండినప్పుడు పరిచయు లైనారు. నేను బెజవాడలో కాపురమున్న యింటికి 1, 2 సార్లు వచ్చారు. చిన్న పిల్లగా నుండిన నా రెండవ కుమార్తె కమలకుమారి కొరకు కొన్ని కొండపల్లి బొమ్మలను తెచ్చియిచ్చి, మమ్మాదరించారు. 1943 వేసవిలో నేను నందిగామ తాలూకా, జగ్గయ్యపేటలో క్యాంపు జేస్తూ 6 మైళ్ల దూరంలో వున్న ముక్త్యాలలోని చిన్న కోటవంటి వారి రాజప్రాసాదానికి వెళ్లి, మూడు రోజులు వారి అతిథిగా వుండి, చుట్టు ప్రక్కల కొన్ని చిన్న కేసులను విచారించాను. అప్పుడు వారి తండ్రిగారు శ్రీ రాజా చంద్రమౌళీశ్వర ప్రసాద్ బహద్దర్ వారు జీవించి యుండినారు. ఈ విషయ మంతయు రెండవ భాగంలో వ్రాశాను. పెద్ద రాజావారు పరలోక ప్రాప్తులైన తర్వాత కూడా వీరిని కుమారరాజాగారనే సంబోధిస్తుండేవారు. నేను మాత్రం తప్పనివిధిగా పెద్దరాజాగారి స్థానంలో, ఆ జమీనీకి ప్రభువైన వీరిని ముక్త్యాల రాజావారనే సంబోధిస్తూ, మాటల సందర్భంలోగాని, వారికెప్పుడైనా వ్రాసినప్పుడుగాని రాజాగారనే వాడుచుండేవాడను. రెండవభాగంలో కొంత వీరినిగురించి చెప్పి నందున, కొలది మాటలతో ముగిస్తాను. వీరు ఆంగ్లభాషను పెద్దగా

చదువుకొనకపోయినా, తెలుగులో పాండిత్యం సంపాదించారు. అంతేకాదు, మిక్కిలి స్వచ్ఛం, ప్రస్ఫుటమైన వాగ్ధాటితో ఉపన్యసించేవారు. ఎట్టి ఆడంబరం లేక, సామాన్యవేషంతో అందరితోనూ కలసిమెలసి వుండేవారు. స్నేహపూరితంగా, చిరునవ్వుతో మాట్లాడుచుండేవారు. ప్రజారంజకుడై 1972 ఆరంభంలో జరిగిన ఆంధ్రప్రదేశ శాసనసభ ఎన్నికలలో దిగ్విజయం సాధించిన కాంగ్రెస్ పార్టీ అభ్యర్థిని మాంచి మెజారిటీతో ఓడించారు. ఇది గొప్ప విశేషం. కాని, బ్రతుకని బిడ్డ బారెడన్నట్లు, పుణ్యాత్ములు త్వరలో పుణ్యలోకాలకు చేరుకుంటారన్నట్లు, వారు శాసనసభ్యులైన కొలదికాలానికే గుండె ఆగి, తలవని తలంపుగా, అకస్మాత్తుగా దివంగతులైనారు. పైన మూడవ శీర్షిక క్రింద చెప్పినట్లు 1958-వ సంవత్సరంలో కొందరం కలసి స్థాపించిన కృష్ణాజిల్లా పశుపోషకుల సంఘానికి వారిని అధ్యక్షులుగా, వారు హాజరుకానప్పటికీ, ఎన్నుకొన్నాం. వారు 60 ఏండ్లు నిండుటకు, కొన్ని సంవత్సరాలకుముందే మరణించటం ఆంధ్రులకు, ముఖ్యంగా కోస్తాజిల్లాలవారికి మిక్కిలి దురదృష్టకరం.

నేను 1957 లో చల్లపల్లి షుగర్సు కంపెనీలో డైరెక్టరై వచ్చాను, శ్రీ చల్లపల్లిరాజావారి సతీమణి సోదరుడు, శ్రీ చెరుకూరి రామనాథబాబుగారు పరిచయులైనారు. వారప్పుడు కార్యదర్శిగా వుండిన టి. నాగేశ్వరరావుగారితో కలసి 1953-54 లో ప్రారంభింపబడిన ఆ ఫ్యాక్టరీ భవనాలను కట్టించి, మెషినరీని స్థాపింపజేసి, 1957 డిశెంబర్ లో మిల్లు ఉత్పత్తి నారంభించేటట్లు శ్రమించారు. వారిద్దరి శ్రమఫలితంగా, పరస్పర సహకార పర్యవసానంగా, తర్వాత కట్టబడిన చెరుకు మిల్లుల కంటె రూ 40 లక్షలైనా చౌకగా ఆ మిల్లు పూర్తిచేయబడింది. బందరు జాతీయ కళాశాల, ఆంధ్రసైంటిఫిక్ కంపెనీ టెక్నిషియన్ల సహాయాన్ని పొంది, కొన్ని సామానులను ఫ్యాక్టరీ ఆవరణలోనే చేయించటంవల్ల కొంత కలసివచ్చింది. శ్రీ రామనాథబాబు మిక్కిలి చురుకైనవాడు, తెలివితేటలు కలవాడు. కార్యాన్ని సాధించటంలో గట్టివాడుగానే తన యువకజీవితం ప్రారంభించాడు. మాట కటువైనా,

ధోరణి, ప్రవర్తన, అప్పుడప్పుడు చిరాకు కలిగించేటట్లుండినా, ఆయనకు స్నేహాభిలాష లేకపోలేదు. చనువుగా వుండే పద్ధతి వున్నది. సహజమైన మంచితనం ఆయనలో మిళితమైయున్నది. అదృష్టం లేకపోతే ఏనుగుకూడా ఎలుకై పోతుంది. అందువలన ఆయన అధ్యక్షుడుగా ఎంతో శ్రద్ధతీసుకొని, అభివృద్ధిచెందించాలని ప్రయత్నించిన బందరులోని ఆంధ్ర సైంటిఫిక్ కంపెనీ దివాళా తీసింది. వారు చేబట్టిన కొండై కెనాల్ వద్ద నిమ్మగడ్డి పెంపకం వంటివి సాఫల్యానికి వచ్చినట్లు లేదు. వారితో నాకు కొంత స్నేహం, చనువు వున్నవి.

శ్రీ టి. నాగేశ్వరరావు నా యందు మిక్కిలి గౌరవ, ఆదరణభావం కలిగి యుంటాడు. చల్లపల్లి నుండి వెళ్లిపోయి, హైదరాబాద్‌లో స్థిరపడినారు. ఒకప్పుడు, హైదరాబాద్‌లో వా రింటివద్ద కొంతమంది స్నేహితులను పిలిచి, నాకు విందు భోజన మమర్చి గౌరవించారు. ఆయన కార్యసాధన సమర్థుడు. అయితే, ప్రస్తుతం అదృష్టం ఆయనను నిరాకరిస్తున్న ట్లున్నది. ఆయనను కలసి కొన్నప్పుడు నా మనస్సు సంతోషిస్తుంది.

శ్రీ కాసుమిల్లి సుబ్బారావుగారు నా ప్రేలువిడిచిన మేనమామ, కవిరాజు త్రిపురనేని రామస్వామి చౌదరిగారి అల్లుడు. వారిని చాలా సంవత్సరాల క్రితం, వారు బందరులో రెవిన్యూ ఇన్‌స్పెక్టరుగా వుంటున్నప్పుడు ప్రథమంగా చూచాను. వారు ఆ యా ఉద్యోగ విధులను నిర్వహించి ఐ. ఎ. యస్. ఆఫీసరై, కొన్ని సంవత్సరాలు ఆంధ్రప్రదేశ ప్రభుత్వానికి ఎలెక్షన్ కమిషనర్‌గా వుండినారు. తరువాత ప్రభుత్వ శక్రటరి హోదాకు చేరుకుని కొంతకాలం మిక్కిలి ప్రముఖమైన పి. డబ్ల్యు. డిపార్టుమెంటు శక్రటరీగా పని చేశారు, చివరకు మన రాష్ట్రం పబ్లిక్ సర్వీస్ కమిషన్ అధ్యక్షులై, దానిని ఐదేండ్లు నిర్వహించారు. ఇప్పుడు హైదరాబాద్ శాంతినగర్‌లో కట్టుకున్న తమ యింటిలో విశ్రాంతి తీసుకుంటున్నారు. వారికి పి. డబ్ల్యు. డిపార్ట్‌మెంటు శక్రటరీగా వున్నప్పుడు పెద్దగా గుండె పోటు జబ్బు కలిగి అపాయస్థితిలో పడ్డారు. దైవానుగ్రహంవలన

ఆ జబ్బు పూర్తిగా రహితమై, వారికి పబ్లిక్ సర్వీస్ కమిషన్ అధ్యక్షపదవి పట్టంకట్ట కలిగింది. వారు సౌమ్యులు. ఏమాత్రం మాటలలోను, చేతలలోను దుందుడుకుతనం లేకుండా నెమ్మదిగా, శాంతంగా, మెత్తగా నడుచుకుంటారు. తన పనేమో, తానేమోగాని, ఇతర ప్రశంసలను పెట్టుకొన్న ట్లగపడదు. స్నేహభావం, ఆప్యాయత చూపించగలరు. వారిభార్య శ్రీమతి సరోజినీదేవి బంధుత్వభావంచేత నైతేనేమి, సహజ సుగుణ సంపత్తివల్ల నైతేనేమి, నన్నాప్యాయంగా చూస్తుంది. ఆ దంపతులిద్దరు నాకెంతో కావలసిన వారుగా నా యెడల ప్రవర్తిస్తారు. వారికొక కుమారుడు, ముగ్గురు కుమార్తెలు. కుమారుడు సివిల్ ఇంజనీరయి, నాగార్జునసాగర్ వద్ద ప్రస్తుతం పని జేస్తున్నాడు. పెద్దకుమార్తెను, శ్రీమతి సరోజినీదేవి మారుటితమ్ముడు శ్రీ త్రిపురనేని గోకుల్‌చంద్ కిచ్చి వివాహం చేశారు. రెండవ అమ్మాయిని బైటికిచ్చినా, మూడవ అమ్మాయిని శ్రీమతి సరోజినీదేవివైపు బంధువులేగాక, నా మూడవ పెదతండ్రి ఆదినారాయణగారి రెండో పుత్రుడు అంజయ్యగారి కూతురు సౌభాగ్యవతి సుబ్బమ్మ కొడుకుకిచ్చి పెండ్లిచేశారు. వారి పిల్లలకందరకూ సంతానమున్నది. నేను హైదరాబాదుకు వెళ్లినప్పుడల్లా వారింటికి వెళ్లి చూచి రాక మానను. 1969 నవంబర్‌లో హైదరాబాదులోని సరోజినీదేవి కన్ను ఆస్పత్రిలో ఆస్పత్రి సూపరింటెండెంట్ డాక్టర్ పి. శివారెడ్డి గారిచేత, 1958 అక్టోబరులో మద్రాసులో కాటరాక్టు తీయించుకోగా మిగిలిపోయిన చిన్న పొరను తీయించుకొన్నప్పుడు, ఆ దంపతులు మూడు, నాలుగు రోజులు నాకు భోజనమమర్చి సత్కరించారు. ఆ సత్కారానికి నేను కృతజ్ఞుడను.

ప్రస్తుతం ఆంధ్రప్రదేశ్ డైరెక్టర్ ఆఫ్ పబ్లిక్ ఇన్‌స్ట్రక్షన్‌గా వుండిన శ్రీ వి. రామచంద్రన్‌గారినిగురించి పైన చెప్పియే యున్నాను. వారి మంచితనం, ఆయన భార్య సౌభాగ్యవతి ప్రమీల ఆప్యాయత, నన్ను ముగ్ధుడను చేస్తుంటవి. వారి కిద్దరు కొడుకులు, యిద్దరు కూతుళ్లు. పెద్దపిల్లకు యుక్త

వయస్సు వచ్చినది, చదువుకొనుచునే వున్నది. తతిమ్మా పిల్ల లింకను చిన్నవాళ్లు. పబ్లిక్ ఇన్‌స్ట్రక్షన్ డైరెక్టర్‌గారి పిల్లలకు చదువు తక్కువౌనా, వారు చదువకుండా వుంటారా!

ఇక, ప్రఖ్యాత పాత్రికేయుడు, వైదగ్ధ్యం, పటిష్ఠత, విస్పష్టత, ఉరవడి, ప్రవాహంగల సంపాదకీయాలను వ్రాసేవారు, పిన్నవయస్సులోనే "మాటా మంతీ", "పిచ్చాపాటి" అను పేర్లతో విజ్ఞాన పూరితమైన వ్యాసరచనలను కావించినవారు, తర్వాత "కొత్తగడ్డ" మొదలైన ఏకాంక నాటకాలను వ్రాసిన వారు, కేంద్ర సాహిత్య అకాడమి తరఫున ఇంగ్లీషులో వీరేశలింగం పంతులుగారిని గురించి, వేమనయోగిని గురించి గ్రంథాలను రచించినవారు, ఇతర ఉత్కృష్ట గ్రంథాలనుకూడా వ్రాసి బహుళ గ్రంథకర్తయని పేరుబడ్డవారు, వైదుష్య సంపన్నులైన మేధావిగా ఎంచబడేవారు. శ్రీ నార్ల వెంకటేశ్వరరావు గారినిగురించి ప్రశంసిస్తూ నా మొదటి గ్రంథం "తాంబూలం - నైవేద్యం" లో వ్రాశాను. వారి సంపాదకీయ పటుత్వాన్ని, వారి చిత్రకళాపిపాసను అందులో వివరించాను. ఇక్కడ చెప్పవలసినదంతగా లేదుగాని. రెండు, మూడు మాటలు చెప్పవలసి వుంటుందనుకుంటున్నాను. వారు విస్తారంగా చదువుతారు. అక్కడక్కడ సంపాదించిన 10 వేలు పైచిల్కు వివిధరకాల గ్రంథాలు వారివద్ద వున్నవి. ఎప్పటికప్పుడు తమ చేతికందిన నూతన ఇంగ్లీషు, తెలుగుపుస్తకాలను చదివి, వారి సంపాదకత్వాన ఇప్పుడు వెలువడే ఆంధ్రజ్యోతి దినపత్రికలో వ్యాఖ్యానించుచుంటారు. ఆ వ్యాఖ్యానాలను చదివి, నేను కొన్ని ముఖ్యమైన పుస్తకాలను తెప్పించుకొన్నాను. ఈ వ్యాఖ్యానించే పద్ధతి ఆంధ్ర పాఠకులకు, ముఖ్యంగా నావంటివారికి, గట్టి మంచిని చేకూర్చుచున్నది. ఆవిధానానికి పాఠకు లందరు వారికి కృతజ్ఞులై వుండాలి.

వర్తమానంలో ఆంధ్రప్రదేశ్‌లోనేగాక, ఇతర భారత భాగాలలోనేగాక విదేశాలలోకూడ సంభవించుచున్న సంఘటనలను వారు విశదముగా చర్చించుచుంటారు. అయితే, ఆంధ్ర

ప్రదేశ్ కు సంబంధించినవానిలో కొన్ని సమయానుకూలంగా, గాలిపాటునుబట్టి వ్రాసినవేమో అనిపిస్తవి. సంపాదకుల కుండవలసిన ఖచ్చితాభిప్రాయాలు, గుండెనిబ్బరం, ఎవరేమనుకొన్నా నగ్నసత్యాన్ని బైటపెట్టగల సాహసం, ఉత్తమ పత్రికా సంపాదకున కవసరం. వారి కట్టి ధీరత్వం లేదని చెప్పనుగాని, ఒక్కొక్కప్పుడు విశాలదృక్పథంతోగాక, కుంచిత మనస్తత్వంతో, తాత్కాలిక లాభాలకొరకు వ్రాస్తున్నారేమో అని చెప్పటానికి సందేహించను. భారతీయ విషయాలను ఏ విధముగా వారు అర్థం చేసుకొని చిత్రించినా, వానిని ఉద్ఘోషించినా, విదేశీ విషయాలలో సర్వసామాన్యంగా మంచి వ్యక్తిత్వాన్ని ప్రస్ఫుటం చేస్తారు. నేను వారిని గురించి నా "తాంబూలం - నైవేద్యం"లో వ్రాసినట్లు కీర్తిశేషులైన ముట్నూరి కృష్ణారావుగారి తర్వాత అంత ఉజ్జ్వలంగా, ఘాటుగా, సూటిగా, అద్వంద్వంగా వ్రాసే వారు శ్రీ నార్లవా రొక్కరే. వారిని పాత్రికేయుడుగా, సంపాదకీయుడుగా, గ్రంథ రచయితగా, వ్యాఖ్యాన నిపుణుడుగా శ్లాఘిస్తున్నాను. ఉత్తమ యిల్లాలు, సుగుణవతి, సౌజన్యవతి, మృదుభాషిణి, తల్లివంటి నిండుప్రేమగల వారిసతీమణి శ్రీమతి సులోచనమ్మగారు, నార్లవారు జ్ఞాపకం వచ్చినప్పుడల్లా నా స్మృతిపథంలోకి వస్తుంటారు. ఆ స్త్రీరత్నానికి పూజాకుసుమా లర్పించుచున్నాను.

కేంద్ర మంత్రి శ్రీ కొత్త రఘురామయ్యగారిని చాలా కాలము నుండి ఎరుగుదును. వారిని గురించి, వారి సతీమణిగారిని గురించి పొరపాటున ఈ క్రింది 9-వ శీర్షికలో వ్రాశాను.

పామర్రు భారతీ సమితి, భారతీ సన్మాన సంఘం, లలితకళా సమితిలను పట్టుదలతో ధైర్య స్థైర్యములతో 25 సంవత్సరాల పై నుండి నడుపుచుండిన నా పినతల్లి కుమారుడు శ్రీ కోగంటి దుర్గా మల్లికార్జునరావును గురించి, నా "తాంబూలం—నైవేద్యం"లోను, పైన వ్రాసిన "బంధువులు" అను శీర్షిక క్రిందను చెప్పియున్నాను. "గ్రంథ రచన" అనే శీర్షిక క్రింద వారి సహచరులైన శ్రీ కోడూరి శ్రీరాములు

కవిగారిని గురించి వ్రాసియున్నాను. శ్రీరాములుగారి పద్యాలను కూడా ఈ భాగంలో ఉదహరించియున్నాను. భారతీ సమితి సభ్యులలో శ్రీ మల్లంపల్లి రామలింగేశ్వరశర్మ, శ్రీ నూతులపాటి రాఘవయ్య, శ్రీ వేదం రామప్రభువు, శ్రీ సుంకర శివరామయ్య, శ్రీ వారణాసి లక్ష్మీనారాయణ వంటివా రున్నారు. వా రందరు నాయం దభిమానంగానే వుంటారు. శ్రీ రామలింగేశ్వరశర్మగారు మా యింటికి వచ్చి వెళ్లారు. స్త్రీ సభ్యులలో, శ్రీమతి పిండికంటి అన్నపూర్ణమ్మ, శ్రీమతి ఇవటూరి మాణిక్యాంబ వంటివారు పరిచయు లైనారు. పిండికంటి అన్నపూర్ణమ్మగారు కూడా మా యింటికి వచ్చి వెళ్లారు. వీ రందరి అభిమాన మొకఎత్తు, కవిరత్న కోదూరి శ్రీరాములుగారి అభిమాన మొకఎత్తు. వారిది వట్టి అభిమానమే కాదు, గౌరవ భావంతోకూడిన సౌహార్దం, స్నేహపూరిత భావం, ఆప్యాయతకూడా. వారు నాతో దగ్గర మైత్రియే పెట్టుకున్నారు. నా భార్య చనిపోయినప్పుడు వచ్చి సముదాయింపు మాటలుచెప్పి వెళ్లారు. ఆమె శ్రాద్ధకర్మకు హాజరై, వారి గాఢసానుభూతిని విశదపరచినారు. వా రింతకుముందు వరకు ప్రభుత్వ స్థానికసంస్థల శాఖలో ఉద్యోగంజేసి విరమించుకొని, విశ్రాంతిగా వుంటున్నారు. వారు తమ సాహిత్య కళాపాలను, పామర్రు భారతీ సమితిద్వారా, ఉద్యోగ కాలంనుండి కొనసాగించు చున్నారు. ఇతరపని లేనందువలన వాని నిప్పుడు ద్విగుణీకృతం, త్రిగుణీకృతం చేసుకొన్న ట్లున్నారు. వారు భారతీ సమితి ఆస్థానకవిగా వెలయుచున్నారు,

గుడివాడ కాపురస్థులు, మధురకవి బిరుదాంచితులు శ్రీ కాకాని నరసింహారావుగారుకూ నాకు కొలది సంవత్సరాలనుండి మాత్రమే తెలియును గాని మే మొకరినొకరు చూచుకొనిన వేళావిశేషం కాబోలు, చప్పున మా హృదయాలు కలసిపోయి నట్లైనవి. వారిని ఈ గ్రామం పెదసనగల్లు జిల్లా పరిషత్ హైస్కూలు సాంవత్సరికోత్సవం సందర్భంలో మొట్టమొదట

కలసికొన్నాను. అప్పటినుండి మా స్నేహం వర్ధిల్లుచున్నది. వారు మధురంగా కవిత్వం చెప్పటమేగాక, మిక్కిలిహాయిగా, శ్రవణానందంగా పద్యపఠన మొనర్చగలరు. వారి విశేషం, పెద్ద కవుల వేర్వేరుగ్రంథాలనుండి చదువుకొన్న పద్యాలను అమృత ధారగా వర్షించటం. వారి అభిమాన కవులలో తిరుపతి వెంకట కవులు ప్రథమస్థానం ఆక్రమిస్తారు. వారు నన్నదివరకు కలసి కొనకపోయినా, మా స్వగ్రామం బొమ్ములూరువారికి చిర పరిచితమే. నిజానికి మాయూరికరణం మల్లాప్రగడ శేషగిరిరావు గారు వారి పెదతల్లి కుమారుడేనట. మరిన్ని మా బందరు నోబుల్ హైస్కూలు 3, 4 ఫారాలలో మాకు క్లాసు టీచరుగానే గాక, మాకు మూడవఫారంలో ప్రైవేటు చెప్పిన శ్రీ చోడవరపు జగన్నాథరావుపంతులుగారి భార్య వారి పినతల్లియట. గుడివాడ, బొమ్ములూరుకు 2 మైళ్లలోపు దూరం. తెల్లవారితే, మా బొమ్ములూరు జ్ఞాతులు వగైరా, సాయంత్రంవరకు గుడివాడకు వెళ్తూ వస్తూంటారు. మాదగ్గర బంధువులలో చేరిన శ్రీ మాగంటి అంకినీడు, యమ్. పి. గారికి, ఆయన మిక్కిలి సన్నిహితుడు. ఏదోవిధంగా మా వాళ్లతో ఆయనకు బాదరాయణ సంబంధాలు ఎక్కువే. గత సెప్టెంబరు ( 1973 ) 17-వ తారీఖున నాకు జరిగిన సన్మానసభలో శ్రీ కాకాని నరసింహారావు చక్కగా మాట్లాడి నట్లు పైన చెప్పాను. వారు కొలదిరోజుల క్రితమే ఇక్కడకు ( పెదసనగల్లు ) వచ్చి కొన్నిగంటలు గడపి వెళ్లారు.

మిత్రుడని చెప్పుకునేటంత పరిచయం, చనువు, సాంగత్యం లేకపోయినా, డాక్టర్ సి. నారాయణరెడ్డిగా రొక విధంగా మిత్రులే. మేము కలసికొన్నప్పుడు స్నేహభావంతో మెలగటం, నా గ్రంథాల నన్నిటిని నేను వారి కందజేయటం, వానిని చదివి వారు సదభిప్రాయాన్ని వెలిబుచ్చటం, వంటివి స్నేహ సంబంధ మైనవనియే చెప్పాలి. వారు మిక్కిలి ప్రఖ్యాతి గడించిన ఆధునిక కవిశిరోమణి అని ఆంధ్ర పాఠకుల కందరకు

తెలుసును. వారిని గురించి ప్రత్యేకంగా శ్లాఘించ నవసరం లేదు, వారి పే రెత్తితేనే చాలును.

శ్రీ గూడవల్లి నరసింహారావుగారు నా యందు మిక్కిలి గౌరవభావం కల్గివుంటారు. అభిమానంతో "బాబాయి" అని సంబోధిస్తారు. వారు హిందీ పండితులేగాక, తెలుగు బాగా చదువుకొన్నవారు. మిక్కిలి చక్కగా వ్రాయగలరు. వారు 1966 పెదపుల్లేరు సంక్రాంతి సాంస్కృతిక సమావేశంలో "తింటే గారెలే తినాలి, వింటే భారతమే వినాలి" అనే వ్యాసం సభికుల నందరిని ముగ్ధులను చేసింది. ఈ సంక్రాంతి (1974) సమావేశంలో తిరిగి వారిని కలసికొని సంతోషించాను.

శ్రీ పల్లా సుబ్బారావుగారు వయసు మళ్లినవారు. మిక్కిలి ధారాశుద్ధి, మాధుర్యంతో, చక్కని కవిత్వం చెప్పగలిగే కవి పుంగవులు. ఏలూరు నివాసి. శరీర పటుత్వం తప్పినా, ఆకాంక్షవల్ల సంక్రాంతి సమావేశాలకు హాజరౌతూంటారు. ఈ సంక్రాంతి (1974) ఘంటసాల సమావేశంలో, నా యందు మిక్కిలి అభిమానం చూపించే వారిని కలసికొని, సంతోషించాను.

శ్రీ బి. వి. నరసింహారావుగారు బాలలసాహిత్యరచనలో సిద్ధహస్తులు. ఒకప్పుడు సంగీతంతో కూడిన నృత్యంలో ప్రఖ్యాతిని గడించినవారు. వారి స్వగ్రామం గుడివాడ తాలూకా కౌతరం. వారు గవర్నమెంటు విద్యాశాఖలో ఉద్యోగంచేసి, విరమించుకొన్నారు. బాలలసాహిత్యం రచిస్తూ, దానిని హాయిగా, హావభావాలతో పాడుతారు. నృత్యం మానుకొన్నా, ఆ ధోరణి పోలేదు. వారి గేయాలు, పాటలు గానసంబంధంగానే గాక, దరువులతో కూడినవిగా వుంటవి. వారు నన్నభిమానిస్తారు. మా యింట 1965 సంక్రాంతి సమావేశానికేగాక, ఒకటి రెండు సార్లు వచ్చి వెళ్లారు.

"సాహిత్యవల్లభ" శ్రీ ముళ్లపూడి తిమ్మరాజుగారిని చాలాకాలం నుండి ఎరుగుదును. వీరి విషయం ప్రథమ భాగంలో వచ్చింది. వారు నరేంద్ర మండలి పేరుతో సాహిత్య సేవ

హెచ్చు స్థాయిలో చేయుచున్నారు. ఈ మధ్య తిరిగి వారికి, నాకు ఉత్తర ప్రత్యుత్తరాలు జరిగినవి. నా ప్రథమ భాగం వగైరా, నేను వారికి పంపగా, వారు జాయపసేనాని రచించిన "సంస్కృత నృత్త రత్నావళి," జమ్ములమడక వారి తెలుగు సేతను, వారి యితర గ్రంథాలను కొన్నింటిని పంపారు. వారి సాహిత్యాభిలాష, సేవ మెచ్చుకో తగ్గవి.

శ్రీ ఆచంట జానకిరాం గారి ప్రస్తావన పైన వచ్చింది. వారిక్కడకు వచ్చి వెళ్లుటయే గాక, నా ప్రథమ పుస్తకం "తాంబూలం—నైవేద్యం" ను సమీక్షించారని వ్రాసి యున్నాను. రెండుముక్క లింకా వారిని గురించి చెప్పుతాను. వారు సాహిత్యోపాసకులేగాక, కళాభిజ్ఞులుకూడ. ఇంతేకాదు, రసపిపాసులు. వారిది సున్నితమైన తత్వం. ఆర్ద్రహృదయం, మంచితనం, స్నేహశీలం కలవారు. విద్యాధికులు, భాషాసేవకులు. మరిన్ని మిక్కిలి చక్కగా, తేట తెల్లంగా తెలుగురచన కావిస్తారు. వారి "నాస్మృతి పథంలో", "సాగుతున్న యాత్ర", వారి సులువైన, మధుర, తెలుగు వచన రచనకు తార్కాణం. వారు పద, గేయ కవిత్వం మనోహరంగా రచించగలరు. వారి కింగ్లీషు భాషాపాండిత్యమేగాక, వంగభాషకూడా బాగావచ్చును. కొన్ని యితరభాషలుకూడా వారి స్వాధీనంలో వున్నవని నానమ్మకం. కొలదికాలంక్రితం శ్రీ అరవిందుని గీతాంజలిని వీరు తెలుగులోకి మిక్కిలి నైపుణ్యంతో అనువదించి, పేరు గడించారు. వీరు చిత్రకారులుకూడా. శ్రీ సంజీవ దేవ్ చిత్రాలను లిఖించుటకు ప్రేరకులు వీరేనట. వీరు గ్రంథసమీక్షా దక్షులు. తరచు ఆంధ్రజ్యోతి దినపత్రికలో సమీక్షిస్తుంటారు.

శ్రీ డాక్టర్ కాసరనేని సదాశివరావుగారు గుంటూరులో సుప్రసిద్ధ వైద్యులు. వీరు "ప్రజల చికిత్సాలయం" ను నడుపుచు బీదజనులపాలిటి ధర్మదేవతగా అవతరించియున్నారు. వీ రుచితముగా అందరుబీదలకు చికిత్స చేయకపోయినా, వీరి రుసుంమిక్కిలి స్వల్పం. ధనవంతులకుకూడా వీరిఛార్జి రూపాయలు 10 మాత్రమే. చౌకైన రేట్లతో రోగులుండుటకు వసతు లేర్పరచి యున్నారు.

దయాదాక్షిణ్యాలుగల వీరు, అంతటి కరుణార్ద్ర హృదయ, సహధర్మచారిణి, డాక్టర్ జయప్రదాదేవిగారి సహాయంతో, తెరపిలేకుండా వచ్చే రోగులకు రోజుకు 10, 11 గంటలైనా మిక్కిలి సానుభూతితో, ఓర్పుతో చికిత్స చేస్తుంటారు.

డాక్టరు సదాశివరావుగారు సాహిత్యాభి మానులు, ప్రేరకులు. "సాహితీ సదస్సు" అను పేరుతో ఒక సంస్థను స్థాపించి, శ్రీ కొల్లా కృష్ణారావుగారి సాయంతో కొన్ని సంవత్సరాల నుండి నడుపుచున్నారు. సాహితీ సదస్సు సమా వేశాని కొకటి రెండుసార్లు వెళ్లానని పైన వ్రాసియున్నాను. వారి పాండిత్య మెంతో నాకు తెలియదు గాని, వారు రెండు, మూడు పుస్తకాలను ప్రచురింపించియున్నారని తెలియును. గుంటూరు లక్ష్మీపురంలోని వారింటికి రెండు, మూడుసార్లు వెళ్లి, వారి శ్రీమతి జయప్రదాదేవిగారి ఆదరణను పొంది, వారందించిన ఉపాహారాలను స్వీకరించి, సంతోషించాను. నేను మద్రాసులో ఉద్యోగంలో వున్నప్పుడు, అప్పుడు విద్యార్థినిగావున్న జయప్రదా దేవిగారి కేదో సిఫారసు సాయం చేశానని వా రన్నారు. ఆమె సాత్త్వికగుణ సంపన్న. మిక్కిలి అభిమానం చూపిస్తారు.

డాక్టరు సదాశివరావుగారు పై కంతగా చూపని ఆప్యాయతకల్గిన స్వభావం కల్గినవారు. కార్యదీక్ష, దక్షత, కలవారు. వైద్య విద్యాచరణ, (మామూలు వైద్యం, శస్త్ర చికిత్స, రెంటిలోను నిపుణులు) సాహిత్యోపాసనయే గాక, విద్యా విషయాలు, ఇతర ప్రజోపకర కార్యాలు వారి కాలాన్ని, శక్తిని, ధనాన్ని కూడా ఉపయోగించుకొంటవి. అభిమానుల ప్రోత్సాహంచేత వా రీ మధ్య ఆంధ్ర విశ్వవిద్యాలయ సెనేటు సభ్యత్వానికి అభ్యర్థికాగా, మే మంటే మేమని అయాచితంగా ముందుకు వచ్చిన ఓటర్లు వారికి దిగ్విజయం కలిగించారు. శ్రీమతి జయప్రదాదేవిగారు రాలేదుగాని, వారొకటి, రెండుసార్లు తిరిగి గుంటూరుకు వెళ్లుచు, మా యింటికి వచ్చి వెళ్లారు.

కొందరి పేర్లను విడిచియుండవచ్చును. జ్ఞప్తికి వచ్చిన కొందరిని గురించి చివర ప్రకరణలో వ్రాశాను.

౯

# మిగిలిపోయినవి

ఈ శీర్షిక క్రింద మిగిలిపోయిన వవీ, యివీ చెప్పుతాను. వానికి వరుసక్రమంగాని, ఒకదానికి మరొకటి సంబంధంగాని, వుండవు. జ్ఞాపకంవచ్చినట్లు వ్రాస్తున్నాను. ఎగుడు, దిగుడులను పాఠకులు క్షమింతురుగాక !

ఈ ఊరుకు మొదట ఏర్పడిన పోస్టాఫీసు బ్రాంచి పోస్టాఫీసు. దానికొరకు ప్రయత్నించిన వారిలో నేనొకడను. అది మొదట మొవ్వ సబ్ పోస్టాఫీసు క్రింద వుండేది. మొవ్వనుంచి ఉత్తరాలు రావటం ఆలస్యమవుతున్నదని, పామర్రు సబ్ పోస్టాఫీసుక్రిందకు చేర్పిస్తే మాకు ఉత్తరాలు సకాలంలో అందుతవని గ్రామస్థులు పిటీషన్ పెట్టుకొనటంతోపాటు, నేను కూడా కల్పించుకొని, పై వారికి వ్రాశాను. మా కోరికను మన్నించి మా బ్రాంచి పోస్టాఫీసును పామర్రు సబ్ పోస్టాఫీసు క్రింద చేర్చారు. తరువాత దానిని సబ్ పోస్టాఫీసుగా మార్చారు. మాకు కొంత బెడద తప్పింది.

మాకు సబ్ పోస్టాఫీసు రాకపూర్వం, మా ఉత్తరాలు సరిగా అందుతుండేవి కావు. మర్నాడో, మూడోనాడో రావలసిన ఉత్తరం, 5, 6 రోజులకుగాని వచ్చేదికాదు. మరిన్ని, నాకప్పుడు పోస్టులో వస్తుండిన "హిందు" ఇంగ్లీషు దినపత్రిక,

అప్పు డప్పుడు 4, 5 రోజులు ఆలస్యంగా అందేది. ఈ ఆలస్యం విషయమై అనేకసార్లు బందరు పోస్టాఫీసుల సూపరింటెండెంటు గారికి వ్రాయవలసి వచ్చింది. ఉత్తరాలు రెజిస్టర్డువి కావని, వానిని వ్రాసినవారు ఎప్పుడు పోస్టులో పడవేశారో, అవి మీ కెప్పుడు అందినవో దాఖలా లేదని, మీరు చేసిన ఫిర్యాదును గమనించామని—ఇటువంటి కళ్లు తుడిచే జవాబు లేవో వస్తుండేవి. మాకు సబ్ పోస్టాఫీసు వచ్చిన తర్వాత కూడా, విజయవాడ రైల్వే పోస్టల్ సర్వీసులో ఏవో యిబ్బందులు వచ్చిన వను నెపంతో అప్పుడప్పుడు ఉత్తరాలు, పత్రికలు, ఆలస్యంగా వస్తుంటవి. నేను వారానికి ఏ 20 ఉత్తరాలైనా వ్రాస్తుంటాను. వానికి జవాబులేగాక, తెలుగు, యింగ్లీషు మాసపత్రికలు, పక్ష పత్రికలు, వారపత్రికలు పోస్టులో వస్తుంటవి. అందువల్ల ప్రత్యేక శ్రద్ధ తీసుకొని, అనేకసార్లు పోస్టల్ సూపరింటెండెంట్ గారికి వ్రాయవలసివస్తున్నది.

నేను మూడు, నాలుగు సంవత్సరాలక్రితం టెలిఫోనును పొందగలిగాను. అయితే, దానివలన నాకు అనుకూలం కలుగ లేదు. తప్పుడు పిలుపులు (ఫాల్స్ కాల్స్) వస్తుండేవి. ఉద్యోగ విరమణానంతరం, ఉదయ భోజనమైన తర్వాత, ఒక గంట, గంటన్నర విశ్రమించటం నా కలవాటైపోయింది. నేను నిద్రలో నుండగా టెలిఫోను మ్రోగటం, చప్పున లేచి ఆదరాబాదరాగా నా ఆఫీసుగదిలోకి వెళ్లటం, తీరా అది ఏ నంబరుకో చేసినఫోను అవటం తరుచు జరుగుచుండేది. ఈ యిబ్బందేగాక చాలాసార్లు ఉయ్యూరువద్ద చెడో, లేక కూచిపూడివద్ద చెడో, నేను ఫోనులో మాట్లాడటానికి, ఎవరైనా నా ఫోనుచేస్తే అందుకుంటానికి వీలుండేది కాదు. మా అత్తగారు చనిపోగా, మద్రాసులోవున్న నా పెద్ద కొడుకుకు, రెండవకూతురుకు ఎన్నిసార్లు ప్రయత్నించినా ఫోను అందనేలేదు. వారి కిద్దరి కింటివద్ద ఫోనులున్నవని వేరే చెప్ప నక్కరలేదు. ఎట్లో ఓపికపెట్టి ఫోను వుంచుకొన్నా, నాకు చెప్పకుండా ఫోను డిపార్టుమెంటువారు నా ఫోన్ కనెక్షన్ ను తీసి వేశారు. కారణం ఒక సంవత్సరం బాలూకు డబ్బును ఫిబ్రవరి

మాసంలో కట్టాను. ఆ మార్చిలోనే, ఇంకొక సంవత్సరానికి కట్టమని తాఖీదు వచ్చింది. మొన్ననేగదా కట్టింది, 1, 2 మాసాలు పోయిన తర్వాత కడతానని చెప్పాను. నేను ఏప్రిల్ ఆరంభంలో మద్రాసుకు వెళ్లి కొన్నిరోజులక్కడుండి తిరిగి వచ్చాను. నేను వచ్చే టప్పటికి ఫోనును ఫిరాయించారు. దీనికొక కారణం కూడా వుండవచ్చును. ఫోను సరిగా పని చెయ్యటం లేదని, మా అత్తగారు చనిపోవటంవంటి అవసర సమయాల్లో కూడా దాని ఉపయోగం లేకుండా పోయిందని, అప్పుడప్పుడు ఫిర్యాదు చేస్తుండేవాడను. ఈ బెడద తప్పుతుందని కాబోలు ఫోనే ఎత్తివేశారు.

ఈ యూరు పెడసనగల్లుగుండా బెజవాడ నుండి, గుడివాడ నుండి బస్సులూ అక్కడకు రెండు మైళ్ల దూరంలో వున్న అయినం పూడి రేవుకు నడుస్తవి. ఈ బస్సులు అయినంపూడి నాగిలేరు రేవు వద్దకు వెళ్లే ముందు, దారిలో వున్న భట్లపెనుమర్రు గ్రామ మధ్యకు వెళ్లి అక్కడ ప్రయాణీకులను దింపి, రేవుకు వెళ్లి, అక్కడ ప్రయాణీకులను ఎక్కించుకొని, తిరిగి భట్లపెనుమర్రు వెళ్లి అక్కడ ప్రయాణీకులను ఎక్కించుకొని, మాఊరు అయ్యంకి, పామర్రుల మీదుగా బెజవాడ బస్సు బెజవాడకు, గుడివాడ బస్సు గుడివాడకు చేరుతవి. రేవు నుండి బయలుదేరే బస్సులో భట్లపెనుమర్రువారు తగినంత మంది ఎక్కినప్పుడు, మా గ్రామ సెంటర్‌లో అది ఆగకుండానే వెళ్లిపోతుంది. ఒకొక్కప్పుడు బస్సు ఆలస్యంగా బయలుదేరితేనో డ్రైవర్‌కు ఆకలి వేస్తుంటేనో, విసుగు కలిగితేనో, బస్సును ఆపకుండా అతడు దూసుకుపోతాడు. కండక్టరుంటాడు గాని వారిద్దరు ఏకాభిప్రాయంతోనే వుంటారు. బస్సులను జాతీయంచేసిన క్రొత్తలో, హైదరాబాదు డ్రైవర్లు, కండక్టర్లు, బెజవాడ ప్రాంతంలో పనిచేస్తుండేవారు. వారు ప్రయాణీకుల అవసరాలను గమనించేవారుకాదు. ప్రైవేటు బస్సుల కాలంలోవలెగాక, జాతీయం చేయబడిన తర్వాత, ఒక రూట్‌లో ఆ బస్సులే రావు. ఆ డ్రైవర్లు, కండక్టర్లే వస్తూవుండరు. బస్సుల డిపోలలో ఆసమయానికి ఏబస్సు సిద్ధంగావుంటే దానిని, ఏ డ్రైవరు,

కండక్టరు సిద్ధంగావుంటే, వారిని పంపిస్తారు. అందువల్ల మాటి మాటికి మారుచున్న బస్సుల కండక్టర్లు, డ్రైవర్లు తమకు పట్టనట్లు నడచుకొంటారు. ప్రైవేటు బస్సుల డ్రైవర్లు, కండక్టర్లకు తాము నిరంతరం వెళ్లే త్రోవలలోని గ్రామాలలోని చాలామందిని ఎరిగి యుంటారు. అందువల్ల సానుభూతిని చూపటాని కవకాశ ముండేది. ఇప్పుడు ఎప్పటికప్పుడు క్రొత్తముఖాలే. ఒకనాడు మధ్యాహ్నం బస్సుకు, ఆ మర్నాడుదయం కాలేజీకి హాజరు కావలసిన విద్యార్థు లొకరిద్దరు, చిన్న చేతి సంచులతో బస్సు ఎక్కటానికి కాచుకొనియుండగా, బస్సు ఆగకుండా దూసుకుని పోయింది.

గుడివాడనుండి బయలుదేరే కొన్ని బస్సులు పామర్రునుండి తిరిగి పోవటమో, లేక బెజవాడ ముఖంగానో, బందరు ముఖంగానో, అవనిగడ్డ ముఖంగానో ప్రయాణించటమో జరుగుతుంది. ఉదయం ఒకటి, సాయంత్రం ఒకటి రెండు బస్సులు, గుడివాడ నుండి పామర్రును దాటి అయ్యంకి, పెదసనగల్లు మీదుగా భట్ల పెనుమర్రు, అయినంపూడి రేవుకు చేరుకుంటవి. ఈ బస్సులను ముఖ్యంగా పామర్రు కివతలి ఈ మూడు ఊళ్ల ప్రయాణీకుల కొరకు కుద్దేశింప బడినవి. అయినా, ఒకటి, రెండుసార్లు నేను గుడివాడనుండి పెదసనగల్లుకు ప్రయాణించుచున్నప్పుడు మిక్కిలి యిబ్బంది పడవలసి వచ్చింది. నే నొక్కడనే కాదు, ఈ గ్రామాలకు చెందిన యితరులుకూడా. దీనికి కారణం గుడివాడ పామర్రు మధ్యవున్న అడ్డాడ, గొల్వేపల్లి, కొమరవోలు గ్రామాలవారి నెక్కించుకొని, పామర్రు కివతలి గ్రామాల వారికి ఖాళీలేదని కండక్టరు చెప్పేవాడు. పై ఊళ్లకు గుడివాడనుండి వెళ్లే బస్సులు వుండికూడా, దొరికిందే చాలన్నట్లు చప్పున ఎక్కి కూర్చున్న ఆ గ్రామాలవారిని ఉండనిచ్చి, మా గ్రామాల వారికి ఖాళీలేదు పొమ్మనేవాడు. గుడివాడనుండి సాయంత్రం బస్సు 4½, 5 గంటలకుగాని బయలుదేరేది కాదు. ఆ బస్సు తప్పితే, పామర్రుదాటి యివతలకువచ్చే బస్సు యింకొకటి లేదు. అందు వలన ఆ రాత్రి గుడివాడలో వుండిపోవటమో, లేక పామర్రు వచ్చి అక్కడనుండి ఏ తంటాలో పడటమో సంభవిస్తుండేది.

ఈ యిబ్బందుల ననుభవించి, నేను కొన్ని సార్లైనా బెజవాడ డెప్యూటి కంట్రోలర్ గారికి బస్సుసర్వీసు పెంచాలని, సాయంత్రం బస్సులో ప్రయాణించే పామర్రు కివతలి గ్రామస్థులకు ముందు స్థాన మివ్వాలని వ్రాయవలసివచ్చింది.

వ్యవసాయానికి నీరు సకాలంలో అందటం లేదనో, పూర్తిగా అందటం లేదనో, అసలే మావైపుకు రావటంలేదనో, వీరంకిలాకు సూపర్వైజర్కు, బందరు డివిజనల్ ఆఫీసరుకు, మరిన్ని బెజవాడ ఎగ్జిక్యూటివ్, సూపరింటెండింగ్ ఇంజనీర్లకు వ్రాయవలసివచ్చింది. ఈగోడును పై రెండవ శీర్షిక క్రింద చెప్పియే యున్నాను.

విజయవాడ స్టేట్ బ్యాంక్ ఆఫ్ ఇండియా నా కప్పుడప్పుడు శ్రమ యిస్తుంటుంది. ఈమధ్య జమపద్దులు ఖర్చులోను, ఖర్చు పద్దులు జమలోను వ్రాసి, లెక్కలలో చికాకును కల్గించింది. 1960 డిశెంబర్లో, మీపేర రూ. 5–51 పైసలు నికర ఖర్చున్నది, దానిని వెంటనే కట్టండని బ్యాంకువారు వ్రాశారు. నేను వెంటనే జవాబు వ్రాస్తూ, మీ బ్యాంకులో నాఖాతా కొన్నిసంవత్స రాలుగా వుండుచున్నది, అప్పుడప్పుడు పెద్దమొత్తాలు నాపేర నిల్వ జమ యుండి యున్నవి. ఈ చిన్నిమొత్తాన్ని వెంటనే కట్టండని మీరు వ్రాయటం సమంజసంగా లేదు. ఒక్కదమ్మిడి జమ వుంటే మీరు దానిని, క్రొత్త లెక్క పుస్తకంలోకి తీసుకుని పోతారుకదా, ఈ రూ. 5–51 పైసలకు ఆవిధంగానే ముందు లెక్కలో ఖర్చు వ్రాసి యుంచవలసింది అని. వ్రాస్తూ పైగా, నేను ఇంతకుముందే పంపించియుండిన రూ. 200 పై చిల్లు డివిడెండు వారంటును మీ రెందుకు లెక్కలోకి చేర్చలేదు? దానిని లెక్కలోకి తీసుకుంటే, నాపేరున వందలలోనే జమ వుంటుందికదా, అని మందలించవలసి వచ్చింది. నిజానికి ఆ డివిడెండు వారంటు డిశెంబర్ నెలకు పూర్వమే నాలెక్కలో పడవలసింది. నేను చెప్పినతర్వాతగాని, ఆ విడిచిపెట్టటాన్ని వారు గమనించలేదు.

మద్రాసు మౌంటురోడ్డు స్టేట్ బ్యాంకువారుకూడా ఎన్నడూ లేనిది, ఈ మధ్య కొన్ని పద్దులను సకాలంలో నమోదుచేయక పోవటం, కొన్నింటిని తారుమారుచేయటం జరిగింది. ప్రైవేటు బ్యాంకులను జాతీయంచేసిన తర్వాత ఉద్భవించిన నిర్లక్ష్యం, కాలయాపన, అవకతవకల ప్రభావం, చిరకాలంనుండి సమర్థ వంతంగా నడపబడుచున్న స్టేట్ బ్యాంక్ ఆఫ్ ఇండియా మీాద కూడా పడినట్లున్నది. బెజవాడ బ్రాంచి ఆఫీసులోని ఉద్యోగులు చీటికీ, మాటికీ సమ్మెలు చేయటం మిక్కిలి శోచనీయం. ఈ సమ్మెల మనస్తత్వం ఆ బ్రాంచి విషయంలో నేను గమనించిన అవకతవకలకు కారణమైవుంటుంది.

నే నుద్యోగ విరమణానంతరం పెడసనగల్లులో స్థిరనివాస మేర్పరచుకొనియున్నా, నా పింఛనును ఇప్పటికిని మద్రాసు యకౌంటెంట్ జనరల్ ఆఫీసునుండి మద్రాసు మౌంట్‌రోడ్డు స్టేట్ బ్యాంక్ ద్వారా తెప్పించుకుంటున్నాను. ప్రతినెలా నా పెన్షన్ బిల్లును మౌంట్‌రోడ్డు స్టేట్ బ్యాంకికి పంపటం, వారు దానిని యకౌంటెంట్ జనరల్ ఆఫీసుకు పంపి, యసిస్టెంటు పే అండ్ యకౌంట్స్ ఆఫీసరునుండి డబ్బు తెప్పించుకోవటం జరిగే పద్ధతి. అయితే, నా బిల్లులను ఏదో వంకబెట్టి ఈ మధ్య ఆ యసిస్టెంటు పే అండ్ యకౌంట్స్ ఆఫీసరు తరుచుగా త్రిప్పి పంపిస్తున్నాడు. ఉదాహరణకు నా పింఛను రూపాయలతోపాటు, 69 పైసలుండేవి. 69 పైసలు కాదు, నిండు 70 పైసలుండాలని, ఒకసారి త్రిప్పి పంపివేశాడు. సంవత్సరం సంవత్సరం పింఛను మొత్తం మీాద రేటును నిర్ణయించి, యింత ఇన్‌కమ్ టాక్స్‌ను మినహాయించ వలసి వుండినది. ఆ విధముగా మినహాయించి పంపిస్తే ఇప్పుడు ఇన్‌కమ్‌టాక్స్ మినహాయింపు పూర్తి రూపాయలలో వుండాలని ఒకసారి, అసలే మినహాయించ కూడదని మరొకసారి దానిని తిరగ గొట్టాడు. వాళ్ల రూల్సులోగాని, పద్ధతిలోగాని మార్పు వస్తే, ఆ మార్పును నా బ్యాంకు వారికి తెలియ పరచటం, బ్యాంకువారు నాకు తెలియ పరచటం, చేయవలసిన పని. అట్లు చేయకుండ పింఛనుదార్లు లోకువన్నట్లు అధికార గద్దెమీాద కూర్చున్న ఈ ఆఫీసరు నిరంకుశంగా

ప్రవర్తిస్తాడు. ఇట్టి చేతలు ఈ మధ్యనే జరుగుచున్నవి. జాతీయవిధానం దుస్థితి ఏర్పడిన ప్రభావం కాబోలు.

1962 లో చైనాతో మనకు సంభవించిన యుద్ధ సందర్భంగా, భారత ప్రభుత్వం జాతీయ రక్షణ నిధి ( నేషనల్ డిఫెన్సు ఫండు ) ని, ఏర్పాటు చేసింది. వివిధ రాష్ట్రాలలో జాతీయ రక్షణ నిధులను ఏర్పరచారు. జిల్లా జిల్లాకు జిల్లా కలెక్టర్ ఆధ్వర్యాన జాతీయ రక్షణ నిధికి విరాళాలు ప్రోగు చేశారు. పెదసనగల్లులో కూడా విరాళాల సేకరణ, రెవిన్యూ ఆఫీసర్ల ప్రోత్సాహం వల్ల చురుకుగానే సాగింది. ఆ సమయంలో ఒక సాయంత్రం శ్రీ చల్లపల్లి రాజావారి అధ్యక్షత క్రింద గ్రామస్తుల సమావేశం, మర్నాడుదయం వారి పర్యవేక్షణ క్రింద విరాళాలు వసూలుచేయడం జరిగింది. నా పేర, నా భార్యా బిడ్డల పేర్ల 1001 రూపాయలు రొఖ్ఖం విరాళ మిచ్చాను. మరిన్నీ నే నొక బంగారం ఉంగరాన్ని, నా భార్య తన రెండు ముక్కు పుడకలను, నల్లపూసలను ఆ నిధికి సమర్పించుకొన్నాం. అయితే, అంతకు ముందే నన్ను జిల్లా రక్షణ సంఘంలో సభ్యుడనుగా చేర్చారు. ఆ కమిటీకి నేను రెండు సార్లైనా బందరులో హాజరైనాను. నేను 22-2-1965-వ తారీఖున కృష్ణాజిల్లా కలెక్టర్‌కు వ్రాసిన ఉత్తరంలో, రక్షణ నిధికి ఈ యూరునుండి బంగారం వస్తువులుగాక రొఖ్ఖం 10,001 రూపాయలు వసూలు చేశామని తెలియపరచాను. ఊళ్లో శ్రీమతి లింగంనేని చంద్రమ్మ, మైనర్ అని పిలువబడే లింగం నేని వెంకటరత్నంగారి కుమార్తె, పంచాయతి ప్రెసిడెంట్ సూరపనేని తారకబ్రహ్మానందంగారి భార్య మొదలైనవారు పెద్ద ఎత్తుగానే తమ బంగారు గాజులు, హారాలు మొదలైనవి ఇచ్చారు. ఈ యూరి జిల్లాపరిషత్ హైస్కూలు టీచర్సు 115 రూపాయలు వసూలుచేసి యివ్వటం ఒక విశేష మను కొన్నాను.

1968 మార్చి 10, 11, 12 తారీఖులలో, తెనాలి తాలూకా దోనేపూడిలో, రేణిగుంటవద్ద యేర్పేడులోని

మలయాళ స్వామివారి వ్యాసపీఠం 37-వ వార్షికోత్సవం, సనాతన వేదాంత జ్ఞానసభలు జరిగినవి. ఆ సభలకు నేను హాజరైనాను. యేర్పేడులోని వ్యాసపీఠాన్ని నేను చూడలేదుగాని, దాని స్థాపకులు శ్రీ మలయాళ స్వామివారి గొప్పతనాన్ని గురించి విని యున్నాను. వేదాంత సభలకు, మతపీఠాల ఉత్సవాలకు వెళ్లే మనస్తత్వం కలవాడను కాదుగాని, ఏ బుద్ధి పుట్టిందో అక్కడకు వెళ్లాను. దోనేపూడి నా పెద్దకుమారుడు రాధాకృష్ణ అత్తవారి యూరు. వాని అత్తమామలు శ్రీ వెనిగళ్ల బసవయ్యచౌదరి, శ్రీమతి రాజ్యలక్ష్మి, మర్యాద మన్ననలను పొందవచ్చును. ఇంకొకసారి వారింటికి వెళ్లినట్లుంటుందనే భావంకూడా కలిగి వుంటుంది. ఉత్సవాలు సక్రమంగా, సవ్యంగా, ఉత్సాహకరంగా జరిగినవి. అప్పటి పీఠాధిపతులు విమలానందస్వామివారు. వారు, వారి పూర్వాశ్రమంలో కమ్మకులస్థులట. వారు మలయాళస్వామివారి శిష్యులై విజ్ఞానాన్ని, విమలత్వాన్ని సంపాదించి, విమలానంద స్వామి అయినారు. వారు మిక్కిలి సాత్వికమూర్తి. బ్రహ్మ జ్ఞానసముద్భవమైన తేజంతో వారిముఖం మిక్కిలి వర్చస్సుకలిగి యుండేది. (వా రిప్పుడు పరమపదించారు.) వారు మృదుభాషి. మిక్కిలి నెమ్మదిగా, శాంతంగా మాట్లాడినారు. ఒకనాడు భోజనానంతరం, పదిమందిమి కలసి వారి ఎదుట కూర్చుండి, వారినుండి విషయాలను తెలిసికొన్నాం. నేను నా అభిప్రాయాలను తెలుపుచు, మధ్య మధ్య ఇంగ్లీషు ముక్కలను నా సంభాషణలో దొర్లించాను. నాకెవరో వారు యమ్. ఎ. డిగ్రీని పొందియున్నా రని చెప్పినారు. నా ఇంగ్లీషు పదాలకు వారు చిరునవ్వు నవ్వు చుండగా ప్రక్కవారితో వారు ఇంగ్లీషులోకూడా పండితులు కదా, అన్నాను. వారు యమ్. ఎ. అంతస్థుకు చేరుకొన్నది, ఇంగ్లీషులో కాదు, హిందీలో అని జవాబు వచ్చింది. నేను కొంచెం చకితుడనై స్వామివారిని, నేను ఇంగ్లీషులో మాట్లాడి నందుకు, క్షమాపణ వేడుకొన్నాను.

తిరిగి, వ్యాసపీఠ విజ్ఞానసభల కొకనాడు ఈ సంవత్సరం 1974 మార్చి 9-వ తారీఖున గన్నవరం తాలూకా, చిన

ఓగిరాలలో హాజరైనాను. సభలను జరిపించినవారు, నా రెండవ కొడుకు సుధాకర్ పెద్ద షడ్డకుడు శ్రీ సూరపనేని రాఘవేంద్రరావు, వారి భార్య శ్రీమతి వెంకట్రామమ్మ. వారి ఆహ్వానాన్నిబట్టి వెళ్లి, యిప్పటి పీఠాధిపతులు శ్రీ విద్యానందస్వామివారిని, ఇతర స్వాములను చూచి, వారి అభిభాషణలను విని సంతోషించాను.

నా దీర్ఘకాల జీవితంలో ఎంతోమందిని కలసికొన్నాను. చాలామందిని మరచిపోయాను. ఎన్నో విశేషాలను చూచాను, వానిలో ముప్పాతిక, మూడువంతులు మరుగుపడిపోయాయి. నెమరువేసుకుంటుంటే కొన్ని కొన్ని జ్ఞప్తికివస్తుంటాయి. కొంత మంది చటుక్కున జ్ఞప్తికి వస్తారు, కొన్ని గుర్తులు కళ్లకు కనపడతవి. ఈ మూడవభాగంలో సోదెవంటిది చాలా వ్రాశాను. ఏటి ఒడ్డునో, సముద్రతీరానో, యిసుక త్రవ్వినట్లైంది. అయినా ఇంకా కొంత చెప్పాలనే వుంది. ఉదాహరణకు ఆచార్య రంగాగారు నన్నెన్నోసార్లు తమ స్వతంత్రపార్టీ రాజకీయాల్లో చేదోడు వాదోడుగా వుండమన్నారు. వారికి ఏవేవో విరాళా లిచ్చినా, రాజకీయాలలో ప్రవేశించటం నాతరం కాదని చెప్పవలసివచ్చింది. వారి కుడిభుజంవంటివారు ఘంటసాల వాస్తవ్యులు శ్రీ గొర్రెపాటి వెంకటసుబ్బయ్యగారనే, నల్ల లేక కిసాన్ వెంకటసుబ్బయ్యగా రప్పుడప్పుడు వస్తూ, నన్ను హెచ్చరిస్తుండేవారు. వారి విగ్రహపుష్టి, సూటిగా మాట్లాడే తీరు, సాహసంతో చేపట్టే పనులు, దిటవుతో వానిని సాధించే పద్ధతి నా కెప్పుడూ గుర్తుకువస్తుంటవి. వారు నీరుడు వ్యాధికి గురియై గుంటూరు ఆస్పత్రిలో చికిత్సపొందుచు ఈ మధ్య అకాల మరణం పొందటం రైతుల దురదృష్టం. వారి శ్రాద్ధకర్మకు ఘంటసాలకు వెళ్లి, అచట జరిగిన సంతాపసభలో వారిస్మృతికి జోహారు లర్పించాను.

నా ఇంటర్‌మీడియేట్ చదువులో నా సహాధ్యాయిగా వుండి, నాతో మైత్రిని నెరపిన పడాల కోటయ్యనాయుడుగారు, నిండు ముసలితనం రాకుండానే చనిపోవటం నావంటి మిత్రుల దురదృష్టం. రెండు, మూడు సంవత్సరాలక్రితం వారి గుంటూరు యింటికి అతిథిగా వెళ్లి ఒకరోజంతా వారితో గడపి సంతోషించా

నని పైన వ్రాశాను. వారు పైకివచ్చిన న్యాయవాదియే గాక, మిక్కిలి చక్కని కవిత్వంచెప్పే శక్తికల్గియుండినారు. వారి చక్కని పద్యాలు నాల్గింటిని నా మొదటిభాగంలో చేర్చాను.

భాషా సంబంధమైన మా విభాగం (గ్రూపు) లో నల్ల శాస్త్రులుగారనే శ్రీ మొక్కపాటి సూర్యనారాయణశాస్త్రిగారి వద్ద రెండు సంవత్సరాలు చదువుకొన్న మా సహాధ్యాయి శ్రీ విన్నకోట ఉదయభీమరాజుగారిని, వారు న్యాయవాది వృత్తిని కొనసాగించుచున్న బందరులో ఈ మధ్య కలసికోవాలని ప్రయత్నించి విఫలుడ నైనాను. అయితే, వారు, నేను రెండు, మూడు ఉత్తర ప్రత్యుత్తరాలు జరుపుకొన్నాం.

మూడు, నాలుగు ఫారాలలో మా డివిజన్ లోనే సహాధ్యాయుడుగా వుండిన శ్రీ యద్దనపూడి సత్యనారాయణ ఈ యూరిలో చాలా సంవత్సరాలు బడి పెట్టి పిల్లలకు చదువు చెప్పు చుండినా, మొన్న మొన్నటివరకు ఆయన మా సహాధ్యాయి అన్నమాటే గుర్తులేకుండా పోయింది. గుర్తుకు వచ్చిన తరువాత కలుసుకొనుటకు ప్రయత్నించగా, ఆయన విజయవాడకు వెళ్లిపోయాడని, అక్కడ మరణించాడని తెలిసింది.

కొందరు సహాధ్యాయులు చనిపోగా, కొల్లిపర సూరయ్య, కొల్లిపర నాగయ్యగార్ల వంటివారిని కొన్ని సంవత్సరాలుగా కలసికొననేలేదు. నా బందరు కాలేజీ చదువులో, నాతో కొంత స్నేహం నెరపిన సుందరం, అర్భుదనాదన్ వంటి క్రైస్తవ యువకులు నాకు తిరిగి కనపడనే లేదు. ఇంగ్లండులో చదువుకునేరోజులలో పరిచయమైన వారిలో చాలా మందితో నాకు సంబంధం లేకుండా పోయింది. వారిలో బేనీప్రసాద్, ఫాన్సె, ఆలీ ఎవార్ జంగ్, ఆలీబేగ్ మిర్జా, టేక్ చంద్ దండా, బి. ఎ. రెడ్డి వంటి వారిని తిరిగి చూడటం తటస్థపడనేలేదు.

నేను 1920 చివరిలో ఎడింబరో సబర్బ్ పోర్టొ బెల్లోలో మొదటిసారి కలసికొన్న శ్రీ వై. జి. క. గోపాలకృష్ణరావును ఇంగ్లండు నుంచి తిరిగి వచ్చిన క్రొత్తలో ఎక్కడనో ఒకసారి కొన్నట్లు గుర్తు గాని, ఆయనను తిరిగి చూడనట్లే వున్నది.

వారి భార్యను రెండు, మూడు సార్లు చూచాను. వారిద్దరి కుమారులలో నొకరు హైదరాబాదులో లెఫ్టినెంటు కల్నల్ గా వున్నారని శ్రీ కె. వి. గోపాలస్వామిగారివల్ల ఈ మధ్య తెలిసింది.

అయితే పైన జెప్పినట్లు కొందరు క్రొత్తమిత్రులు సమకూరక పోలేదు. అట్టి వారిలో ముఖ్యులు (శ్రీ) బెజవాడ గోపాలరెడ్డి, (శ్రీ) సి. నరసింహం, (శ్రీ) కానుమిల్లి సుబ్బారావు, (శ్రీ) హనుమోర రామ (హెచ్.ఆర్.) శాయోజీరావు, శ్రీ మాగంటి బాపినీడు, (శ్రీ) కొత్త రఘురామయ్య వంటి వారున్నారు.

(శ్రీ) మాగంటి అంకినీడు నా దగ్గర బంధువుల వర్గంలోకి వస్తాడు. ఆయన పినతల్లులిద్దరు నా మూడో పెదతండ్రి కుమారుడు సత్యనారాయణగారి కొకరు తరువాత మరొకరు భార్యలగుటయే గాక, ఆయన మారుటిచెల్లెలు అన్నపూర్ణాదేవి నా పెద్దకూతురు మలినేని వజ్రాంబ కుమారుడు వీరభద్రరావుభార్య అయినది. బంధుభావంచేతనేగాక, మాటమంచితనంచేత, స్నేహాభిలాషచేత, శ్రీ అంకినీడు నా స్నేహవర్గంలో చేరాడు. పెద్ద చదువులు చదవకపోయినా, తెలివితేటలు, చాకచక్యంచేత గుడివాడ నియోజకవర్గంనుండి వరుసగా మూడుసార్లు లోక్ సభకు ఎన్నికైనాడు. శ్రీ హెచ్. ఆర్. శాయోజీరావుగారికి నాతో ప్రత్యక్షబాంధవ్యం లేదుగాని, నా పెదమారుటితల్లి సంబంధంగా నా చిన్నతనంలో వారి స్వగ్రామం పెయ్యేరుకు వెళ్లుచుండేవాడను. అప్పుడు వారితండ్రి హనుమోర రామస్వామిగారు, వారి పినతండ్రులు వెంకయ్య. అప్పయ్యగార్లు పరిచయమైనారు. నేను బందరు బచ్చుపేటలో విద్యార్థిగా నివసించుచున్నప్పుడు, అప్పయ్యగారు కాలేజి విద్యార్థిగా బచ్చుపేటలో వుంటుండేవారు. శ్రీ శాయోజీరావుగారు చాలా మంచివారు. సౌహార్ద్రహృదయం, సౌజన్యం, స్నేహశీలం పూర్తిగాకలవారు. నిజాయితీ, నిక్కచ్చి, ఉదారబుద్ధి, న్యాయబుద్ధి, త్యాగం వారి సొమ్ము, చీఫ్ యింజనీయరువంటి పెద్ద ఉద్యోగం చేసినా కించిత్తైనా గర్వం, అహం లేని పెద్దమనిషి.

1918-వ సంవత్సరంలో శ్రీ కొత్త వెంకయ్యచౌదరిగారు, నేను గుంటూరు ఎ. ఇ. యల్. యమ్. కాలేజి అని ఆ రోజుల్లో పిలువబడే ఆంధ్ర క్రైస్తవ కళాశాలలో సహాధ్యాయులంగా వున్నప్పుడు, వారి స్వగ్రామం సంగం జాగర్లమూడికి ఒకసారి వెళ్లాను. అప్పుడు వారి తండ్రి జగన్నాథంగారితోపాటు, వారి తమ్ముడు శ్రీ రఘురామయ్యగారినికూడా చూచాను. వారప్పుడు పిన్నవారు. తర్వాత వారు ఇంగ్లండునుంచి బారిష్టరుపట్టాను పొంది, కొంతకాలం డిస్ట్రిక్ట్ మున్సిఫ్‌గావున్నప్పుడు, పిమ్మట మద్రాసు ప్రభుత్వ శక్రటేరియట్‌లో వుద్యోగిగా వున్నప్పుడు శ్రీ వెలగపూడి రామకృష్ణగారి క్రింద నలుగుచున్నప్పుడు, నే నప్పుడప్పుడు చూడటం, మాట్లాడటం తటస్థించింది. కొంత కాలానికి వారు రాజకీయాలలో ప్రవేశించాలనే ఉద్దేశంతో ప్రభుత్వోద్యోగం మానారు. మాని, ఆప్రయత్నంలో నుండగా, నేను వారింటికి వెళ్లటం తటస్థించింది. అప్పుడు వారున్నారో లేదోగాని వారిభార్య శ్రీమతి లక్ష్మీరఘురాంగారితో మాట్లాడిన సందర్భంలో, మనవాడు మంచిపనే చేశాడు. చురుకుదనం, తెలివితేటలు, సూక్ష్మజ్ఞత, సమయస్ఫూర్తి, విషయగ్రహణాశక్తి వున్నవాడు. పైగా, ధారణాశక్తి చాలాగొప్పదని విన్నాను. బాగావున్న సంసారంకదా, ఉద్యోగంచేసి గడించుకుంటేగాని, భుక్తి జరగని సందర్భం కాదుగదా, అందువల్ల రాజకీయాలలో గొప్పగా ప్రకాశించటాని కవకాశమున్నది. ఏకాలాని కేదో చెప్పలేం. అదృష్టముంటే భారత ప్రధానికూడా ఎందుకు కాకూడదు అనే ధోరణిలో ఉల్లాసకరంగా మాట్లాడాను. నా జోస్యం కొంతవరకైనా ఫలించినట్లే. ఉత్తరహిందూస్థాన బలగంవారు, దక్షిణాదివారు ప్రధాని స్థానానికి చేరుకోకుండా అడ్డుతగిలే పరిస్థితు లున్నవి. అందువల్ల శ్రీ రఘురామయ్యగారికి ప్రధానిపదవి ఔన్నత్యం లభించదనే చెప్పాలి. కాని, వారు కొంతకాలంనుండి కేంద్ర డెప్యూటి మంత్రి, స్టేట్ మంత్రి, యిప్పుడు క్యాబినెట్ మంత్రిగా వుంటున్నారు. తమ పదవిని

కార్యదక్షతతో, చాకచక్యంతో నిర్వహించుచున్నారనటంలో అతిశయోక్తిలేదు. వారి సతీమణి శ్రీమతి లక్ష్మీరఘురామ్‌గారు ఇంగ్లీషు విద్యలో బి. ఎ. డిగ్రీని పొందినవారే గాక, ఆంధ్ర సారస్వతంలో మంచి పాండిత్యం సంపాదించి, చేయి తిరిగిన గ్రంథకర్తగా కొన్ని చక్కని గ్రంథాలను రచించారు. ఆమె మృదుభాషిణి, సుగుణవతి, సౌజన్యవతి, స్నేహశీలి, కార్యదక్షురాలు. ఆమె విద్యా, సాంస్కృతిక, సాంఘిక విషయాలలో ఎక్కువగా పాల్గొంటారు. మద్రాసు ఆంధ్ర మహిళా సభలో ప్రముఖ వ్యక్తిగా వ్యవహరించుచు, దాని అభివృద్ధి కన్నివిధాల తోడ్పడినారు. భర్తతోపాటు వారు ఢిల్లీ చేరుకొన్న తర్వాత వారి సేవాసంపత్తి వల్ల, వారి అంతస్థు క్రమేణా పెరిగి, యిప్పుడు అఖిల భారత మహిళా మండలికి అధ్యక్షురాలుగా వున్నారు. వారి ఏకైక సంతానం, పుత్రిక, శ్రీమతి దివ్యజ్ఞాన సరోజని వరదరాజన్‌గా రీమధ్య మిక్కిలి ఉత్తమమైన "చిత్ర కళ" అనే విషయపూరిత గ్రంథాన్ని ప్రచురించారు.

శ్రీ లక్ష్మీరఘురామ్‌గారి తండ్రి శ్రీ జంపాల వెంకటేశం గారు విశిష్టవ్యక్తి. వారు నెమ్మదిగా సరళంగా మాట్లాడుచు, తణుకు బెణుకు లేక గంభీరంగా, హుందాగా పనులు జరిపే, జరిపించుకొనే కార్యదక్షులు. వారు స్ఫురద్రూపంతో వర్చస్సుగల గుండ్రని ముఖంతో నిండు కుండవలె, ఒక విధంగా చెప్పవలసివస్తే పెద్ద గుమ్మడిపండువలె, చూచుటతోడనే విశిష్టవ్యక్తిత్వంకల వారివలె తోచేవారు. వారు ప్రభుత్వ ఉద్యోగంలో డిప్యూటీ కలెక్టర్‌గా కార్యదక్షుడని ఖ్యాతిని గడించారు. వారింకను ప్రభుత్వోద్యోగంలో డిప్యూటీ కలెక్టరుగా వుంటుండగనే, శ్రీ చల్లపల్లి రాజాగారు ప్రభుత్వాన్ని అర్థించి, వారిని తమ ఎస్టేటు దివానుగా తెప్పించుకొన్నారు. ప్రస్తుత జమీందారు శ్రీమంతు రాజా యార్లగడ్డ శివరామప్రసాద్ బహద్దర్ వారు చాలా ఖర్చుచేయు స్వభావం కలవారు. వారు మద్రాసులో వుంటూ, దివానుగారికి ఫోనుచేసో, కబురు పంపో, యిన్ని వేలుకావాలి, అన్ని వేలుకావాలి పంపండని కోరుచూంటే,

ఎస్టేటు రైతు లివ్వవలసిన బకాయీలను గ్రామాలవెంట తిరిగి, వసూలుచేస్తూ రాజాగారి అక్కరను తీర్చేవారు. నిజానికి ఈ బకాయీలు రైతులు తమంత తాము నిల్వబెట్టినవికావు. జమీందారుగారి తాతగారు శ్రీమంతురాజా మల్లికార్జున ప్రసాద్ బహద్దర్ గారు రైతులతో "యిప్పుడేమి తొందర వచ్చిందయ్యా, ఆ డబ్బు మీ దగ్గరే వుంచండి, ఏదో స్వల్ప వడ్డీతో మాకు కావలసివచ్చి అడిగినప్పుడిద్దురుగాని" అని, రైతు లిస్తామన్నా అనేవారట. వారి కుమారులు శ్రీమంతు రాజా అంకినీడు ప్రసాద్ బహద్దర్ గారుకూడా ఆ ధోరణినే అవలంబించారు. యస్. ఆర్. వై. శివరామప్రసాద్ బహద్దర్ వారు, ఎస్టేటు పాలనకు వచ్చినప్పటికి రైతు లివ్వవలసిన బకాయీలు గాక, చాలా డబ్బు నిల్వ వుండినదట. వీరి పట్టాభిషేకానికి హెచ్చుగా ఖర్చుచేశారు. పైగా, మీర్జాపురం జమీందారు గారితో జిల్లాబోర్డు ప్రెసిడెంట్ పదవికి తీవ్రమైన పోటీచేసి, కొన్ని లక్షలు ఖర్చుపెట్టారు. ఈవిధంగా నిల్వవున్న లక్షలు కరిగి పోయాయి. కాగా, వారి ఖర్చులు తగ్గలేదు. అందువలన ఊళ్లవెంట తిరిగి దివాన్ గారు శిస్తులు వసూలుచేయటమేగాకుండా, అవసరంవచ్చినప్పుడు వారికి బ్యాంకులో నిలువఉన్న డబ్బును కూడా అడ్డువేసేవారట. ఈవిధంగా కార్యసాఫల్యం కావించిన వారు శ్రీ రావుసాహెబ్ జంపాల వెంకటేశంగారు. వారి కడుపున బుట్టిన శ్రీమతి లక్ష్మీరఘురామ్‌గారు అసమర్థు లెట్లాతారు? వారి తండ్రిగారినిబట్టి, నేను బాగుగా ఎరిగియుండిన శ్రీమతి లక్ష్మీరఘురామ్‌గారు నన్నాదరించగా, నాకు మిక్కిలి చనువుగల స్నేహితుడైన వారి అన్న శ్రీ కొత్త వెంకయ్యచౌదరిగారితోశ్రీ రఘురామయ్యగారు అభిమానం చూపిస్తూండేవారు. ఉభయులూ యిప్పుడుకూడా అభిమానం చూపిస్తున్నారు.

లలితకళ సంస్థల మూలకంగా శ్రీ కొండూరి వీరరాఘవాచార్యులు, శ్రీ నూకల రామానుజరావు, శ్రీ ఆకుల సత్యనారాయణ, శ్రీ ఉమామహేశ్వరరావు వంటివారు పరిచయులు, అభిమానులైనారు. శ్రీ కొండూరి వీరరాఘవాచార్యులుగారు శిల్పకళను బాగా తెలిసినవారు. వారు ఆంధ్ర శిల్పకళా

క్షేత్రాలను గురించి మూడు సంపుటాలు వ్రాసియున్నారు. మరిన్ని వారు సంస్కృతాంధ్రపండితులు, తత్వశాస్త్రాన్ని మధించినవారు, వ్యాఖ్యాన నిపుణులు. వీరు స్థాపించి తెనాలిలో కొనసాగించుచున్న ఆంధ్ర శిల్పకళా సంస్థకు నేనొకసారి వెళ్లి, దానికి స్వల్ప విరాళ మిచ్చియుండినాను. వారు తమ ఆంధ్ర శిల్పకళా క్షేత్రం మొదటి భాగం ప్రచురించుటకు ఆంధ్రప్రదేశ్ లలితకళా అకాడమి నుండి ఆర్థికసహాయం కోరగా, ఆ సహాయాన్ని పొందుటకు నేను కొంత శ్రమించి తోడ్పడినాను. రెండవ భాగానికి కూడా లలితకళా అకాడమి నుండి కొంత ఆర్థిక సహాయాన్ని పొందినారుగాని, మూడవ భాగాని కట్టి సహాయ మందినట్లులేదు. అది ఇంకను అముద్రితమేమో అని అనుకొనుచున్నాను.

భీమవరం అంకాల ఆర్ట్సు అకాడమిని ఆంధ్రప్రదేశ లలితకళా అకాడమి అనుబంధ సంస్థగా చేర్చుకొనటానికి, దానికి గ్రాంటును సంపాదించటానికి నేను తోడ్పడినానని పైన చెప్పాను. ఆసందర్భంలో ఆ అకాడమి అధ్యక్షుడు శ్రీ ఆకుల సత్యనారాయణగారు, కార్యదర్శి శ్రీ నూకల రామానుజరావుగారు, కోశాధికారి శ్రీ ఉమామహేశ్వరరావుగారు పరిచయమైనారు. వారు ముగ్గురూ స్నేహభావంతో మర్యాద మన్ననలు జరుపుతారు. నేను వెళ్లినా, వెళ్లకపోయినా ఆ అకాడమి ఉపాధ్యక్షుడనుగా ఎన్నుకుంటున్నారు. శ్రీ రామానుజరావుగారు ప్రాక్టీసుచేస్తున్న న్యాయవాది. మిక్కిలి నెమ్మది, సౌమ్యస్వభావం కలవారు. పైకి కనపడని మంచితనం కలవారు. వారు నాయందు ప్రత్యేకాభిమానం కలిగియుంటారని నాకు తోస్తుంది. వారు పిన్నవయస్కులు. వారి వివాహం ఈమధ్యనే రెండు, మూడు సంవత్సరాలక్రితమే, బందరు యువతితో జరిగినప్పుడు, నేనా పెండ్లికి హాజరై సంతోషించాను. వారి అన్న శ్రీ సత్యనారాయణరావుగారు కూడా న్యాయవాదియే. అయితే, వారికి రాజకీయాల వ్యాపకంకూడా వున్నది. ఇప్పటి సంగతి చెప్పలేనుగాని, శ్రీ రామానుజరావుగారి పెండ్లివరకు, శ్రీ సత్యనారాయణరావుగారు స్వతంత్రపార్టీ రాజకీయాలలో చురుకుగా పాల్గొనుచుండేవారు.

నాకు సాహిత్యంలో అభిరుచివల్ల, సాహిత్యపరులైన వారియం దభిమానంగా వుంటాను. కొందరు మిత్రులకు వారి గ్రంథ ముద్రణకొరకు కొద్ది సహాయం కూడా అందించాను.

1970 సెప్టెంబర్ 6-వ తారీఖున ఉయ్యూరు కె. సి. పి. లిమిటెడ్ పంచదార ఫ్యాక్టరి ఆవరణలో భారతదేశాధ్యక్షుడు శ్రీ వి. వి. గిరిగారు, అప్పటికి కొలదికాలంక్రింద దివంగతులైన శ్రీ వెలగపూడి రామకృష్ణ కాంశ్యవిగ్రహాన్ని ఆవిష్కరించారు. ఆసందర్భంలో శ్రీ ఆచార్య రంగాగారు చాలా చక్కగా ఉపన్యసించారు. నేను కూడా ఒక ప్రేక్షకుడనుగా చూచి సంతోషించాను. అంతకుముందే ఎరిగియున్న ప్రెసిడెంటు గిరిగారిని తిరిగి పరిచయపరుచుకొన్నాను. ఆ కాంశ్యవిగ్రహం బాగుండలే దనుకొన్నాను. శ్రీ రామకృష్ణగారి కుమారులు ఏర్పాటుచేసిన విందులో పాల్గొన్నాను.

మా తాత, పినతాత మా స్వగ్రామం గుడివాడ తాలూకా బొమ్ములూరులో ప్రతిష్ఠించిన శ్రీ బాలాత్రిపురసుందరీ సమేత సోమేశ్వరస్వామివారి దేవాలయానికి సంబంధించి, మా తాత మనుమలకు, మా పినతాత మనుమలకు జరిగిన తగాదాలలో, అప్పుడు దేవాలయ ధర్మాదాయాల కమిషనర్ గా వుండిన శ్రీ పైడి లక్ష్మయ్యగారికి ''మీరు కల్పించుకొని న్యాయం చేయించం'' డని 1961 లో వ్రాశాను. వారిని నేను అనంతపూరు జిల్లాలో ఉద్యోగంలో నున్నప్పు డెరిగియుంటి నని పైన జెప్పాను.

మద్రాసులో అడయార్ బ్రిడ్జిరోడ్డువద్ద శ్రీ వెనిగళ్ల హనుమంతరావు దంపతులచేత స్థాపింపబడిన ఈశ్వరప్రసాద్ దత్తాత్రేయ ఆర్థోపెడిక్ సెంటర్ కు ఇద్దరు రోగుల చికిత్స, సంరక్షణ కొరకు మూడువేల రూపాయలు 1969 లో చల్లపల్లి షుగర్స్ కంపెనీ నుండి డైరెక్టర్లకు నచ్చజెప్పి, విరాళ మిప్పించాను. 1970 సంవత్సరమునకు ఆవిధంగా ఇప్పించండని శ్రీహనుమంతరావుగారు 1970 మార్చి 23-వ తారీఖున నాకు ఉత్తరం వ్రాశారు. ఆ సంవత్సరం కూడా మూడువేలు విరాళం యివ్వబడింది. ఇప్పటికీ ఆ విరాళం కొనసాగిస్తున్నారు. శ్రీ హనుమంతరావు

దంపతులు ఉత్తములు, వారి వివాహానికి నేను హాజరయ్యానని మొదటి భాగంలో చెప్పాను.

నేను హైదరాబాద్‌లో, వాయిదాబందీమీద అప్పుడు సంజీవరెడ్డి కాలనీలో హౌసింగ్ బోర్డు కట్టిన ఇండ్లలో మధ్య తరగతి ఆదాయంగలవారి కిచ్చే యిళ్లలో నొక దానిని సంపాదించుకోవాలని, 1964 జనవరి 13-వ తారీఖున బోర్డువారికి దరఖాస్తు పెట్టుకుంటూ, వేయి రూపాయలు హైదరాబాద్ స్టేట్ బ్యాంక్‌లో డిపాజిట్ చేశాను, ఆ యిళ్ల ఎలాట్‌మెంట్ విషయంలో తగాదాలు వచ్చి ఇళ్ల నివ్వటం ఆపివేశారు. తగాదా ముఖ్యంగా మంత్రులు పెద్ద పెద్ద యిళ్లు చౌకగా కట్టించు కొన్నారని. ఆ తగాదా సమసిపోయిన తర్వాతకూడా ఇల్లు దొరికే అదృష్టం నాకు పట్టలేదు. కొంతకాలానికి నా డిపాజిట్‌ను వాపస్ తీసుకున్నాను. ఈ సందర్భంలో నేను హౌసింగ్ బోర్డు వారి కార్యాలయానికి వెళ్లగా, చాలాసేపు వేచియుంటేనేగాని, డిపాజిట్‌ను వాపసుతీసుకొనుట కవసరమైన ఆర్డరు లభించలేదు. అప్పుడు హైదరాబాద్ ఉద్యోగులు ఏవిధంగా పనులు సరిగా చేయక కాలహరణంచేసేది గమనించాను. ఆఫీసువేళకు ఒక్క గుమాస్తా రాలేదు. వచ్చిన తర్వాత బాత్‌రూమ్‌కు వెళ్లి, ముఖం కడుక్కొని, తలదువ్వుకొని, పిమ్మట ఇతర గుమాస్తాలతోకలసి టీ సేవించిన తర్వాతగాని, నెమ్మదిగా పనిని మొదలుపెట్టలేదు.

కొన్ని చిన్న చిన్న విషయాలున్నవి. నా మొదటి పుస్తకాల సమీక్షలను పత్రికలో చదివిన అపరిచితులొకరు పి. డి. యన్. రావ్ అనేవారు బొంబాయినుండి వ్రాయుచు వానిని పంపండని కోరారు. నేను రిజిస్టర్డ్ పోస్టులో (వి. పి. పి. గా కాదు) ఆ రెండు పుస్తకాలు "తాంబూలం-నైవేద్యం", "మారినకాలం"లను పంపాను. వారు వానిని అందుకొని 1971 ఫిబ్రవరి 15-వ తారీఖున కృతజ్ఞత తెలిపారు.

నేను 1929 లో ఇన్‌కమ్‌టాక్స్ డిపార్టుమెంటులోచేరి నప్పుడు ఇన్‌కమ్‌టాక్స్ ఇన్‌స్పెక్టర్‌గా పనిజేస్తుండి, తరువాత

కాలంలో ఇన్‌కమ్‌టాక్స్ కమిషనర్ ఉద్యోగంచేసి, విరమణ చేసిన శ్రీ వి. యస్. కె. దొరైస్వామినాడార్ గారు, వారి కుమారుని వివాహ సందర్భముగా మద్రాసు న్యూవుడ్‌లాండ్స్ హోటలులో ఏర్పాటుజేసిన రిసెప్షన్‌కు హాజరైనందుకు కృతజ్ఞతలు తెల్పుతు 1966 సెప్టెంబరు 30-వ తారీఖున ఉత్తరం వ్రాశారు.

ఆచార్య రంగాగారు నాకు వ్రాసిన ఉత్తరాలలో నొక దానిలో వ్యవసాయం ఆదాయంమీద పన్ను వేసే విషయం ప్రస్తావించగా, నేను నా తీవ్రమైన అభ్యంతరాలను 1967 జూలై 3-వ తారీఖున తెల్పుచు, శ్రీ రాజాజీ అభిప్రాయంకూడా అదే అని వ్రాశాను.

1962 మార్చి 13-వ తారీఖున, ఇంగ్లీషు పక్షపత్రిక "కారవాన్" సంపాదకుడు " 'ఇన్‌కమ్‌టాక్స్ - దాని ప్రస్తుత అమలు' వగైరాల మీద వ్యాసంవ్రాసి మా జర్నల్‌కు పంపం"డని వ్రాశారు. నేను 19-వ తారీఖున వారికి జవాబు వ్రాస్తూ, "నేను 1953 లో ఉద్యోగం నుండి విరమించుకొన్నాను. అంతకు సుమారు నాలుగేండ్లకు పూర్వం పన్ను వేసే అధికారిపదవిని విడిచిపెట్టాను. 1953 తర్వాత ఇన్‌కమ్‌టాక్స్ యాక్టు, రూల్సు, ప్రొసీజర్‌లో చాలా మార్పులు వచ్చాయి. గిఫ్ట్ టాక్స్, వెల్త్ టాక్స్, ఎక్స్‌పెన్సస్ టాక్స్, ఎస్టేటు డ్యూటీ వంటివి క్రొత్త ప్రకరణాలు అమలులోకి వచ్చాయి. అందువల్ల శ్రీ కాసుమిల్లి పట్టాభిరామయ్య గారి వంటి వారికి వ్రాయండి. వారు మొన్నమధ్యవరకు ఇన్‌కమ్‌టాక్స్ జర్నల్‌ను నడిపా"రని వ్రాశాను.

నేను నెల్లూరులో ఉద్యోగంలో నుండగా 1949 ఏప్రిల్ 18-వ తారీఖున శ్రీ కాటూరి వెంకటేశ్వరరావుగారు వచ్చి శ్రీ చెళ్లపిళ్ల వెంకటశాస్త్రిగారి సన్మాన ఖర్చులకు విరాళ మివ్వం డని కోరారు. ఇచ్చి పంపాను.

అభినవ తిక్కన, తెనుగులెంక శ్రీ తుమ్మల సీతారామ మూర్తిచౌదరిగారి కవితాప్రభయందు నాకు మిక్కిలి గౌరవం.

వారి నదివరకు రెండు, మూడుసార్లు మాత్రమే చూచియున్నాను. వారు గాంధేయులు. సరసులు. వారిని 1966 అక్టోబరులో శ్రీ చల్లపల్లి రాజావారి షష్ఠిపూర్తి సందర్భంగా చల్లపల్లిలో కలసికొన్నప్పుడు మేము మర్యాదగా మాట్లాడుకొన్నాము. అయితే, నేను నెల్లూరులో ఉద్యోగంలో నుండగా, ఎవరో వచ్చి వారికి సన్మానం చేస్తున్నాం, విరాళమివ్వండనికోరితే, "మీ ముక్కు మొగం నే నెరుగ"నని యివ్వలేదు. దానికి, తనను తిరస్కరించినట్లు శ్రీ సీతారామమూర్తిచౌదరిగా రభిప్రాయపడినా రేమో అని నా కనుమాన ముండినది. వా రట్టి కుంచితస్వభావం కలవారు కా దని నా కిప్పుడు తెలియవచ్చింది. ఈ సంవత్సర సంక్రాంతి (14-1-1974) ఘంటసాల సమావేశంలో వారు (శ్రీ సీతారామమూర్తిగారు) తలవనితలంపుగ తటస్థపడ్డారు. వా రిదివర కే సంక్రాంతి సమావేశానికి హాజరు కాలేదు. వారిని చూడగానే నా కెంతో సంతోషం కలిగింది. "మా యింటికి దయచేయం"డని కోరాను. మరునాడు ఆ తర్వాత, వారి కెక్కడనో కార్యక్రమ మున్నదని చెప్పారు. ఆ మధ్యాహ్నభోజనానికెవరో ఘంటసాలపాలెంవారు ఆహ్వానించగా, పెందలకడనే వెళ్లిపోయారు. "ఎప్పుడైనా ఒకసారి మీ యింటికి తప్పక వస్తా" నని సెలవిచ్చారు. వారిని 1966 లో శ్రీ చల్లపల్లి రాజాగారి షష్ఠిపూర్తి ఉత్సవంలో చల్లపల్లిలో కలసికొనటమేగాక, శ్రీమతి భారతీ రంగా శ్రాద్ధకర్మ సందర్భంగా 1972 అక్టోబరు 11-వ తారీఖున నిడుబ్రోలులో జరిగిన సంతాపసభకు వారు అధ్యక్షత వహించి నప్పుడు వారిని చూచాను. తిరిగి వారి నీ సంక్రాంతి సమావేశంలో చూడటమేగాక, వారితో మాట్లాడగలగటం నా అదృష్ట మనుకొన్నాను. తర్వాత వారితో ఉత్తరప్రత్యుత్తరాలు జరుపుకొనటం, వారికి నా పుస్తకాలు పంపటం, వారు నాకు వారి పుస్తకాలు పంపటం, నా పుస్తకాలను గురించి వారి అభిప్రాయం తెలుపటం జరిగింది.

ఇట్లుండగా, తలవనితలంపుగా ఈ నెల (మార్చి, 1974) 8, 9, 10 తారీఖులలో గన్నవరం తాలూకా (కృష్ణాజిల్లా)

చినఓగిరాలలో జరిగిన యేర్పేడు వ్యాసపీఠం 48–వ సనాతన వేదాన్త జ్ఞానసభల 9–వ తారీఖు సమావేశంలో కలసికొన్నాం. "మా ప్రాంతానికి వచ్చారు కదా, మా యింటికి (పెదసనగల్లు చినఓగిరాలకు 15 మైళ్లు దూరం మాత్రమే) రం"డని కోరాను. "నేను 10–వ తారీఖు సాయంత్రం గుడివాడ కవిరాజు సాహిత్య విహారంలో మాట్లాడవలసియున్నది. 11–వ తారీఖు ఉదయం మీ యింటికి వస్తా" నన్నారు. ఆవిధంగానే 11 ఉదయం వచ్చి, 12 ఉదయం బెజవాడలో పనివున్నదని వెళ్లిపోయారు.

వారి రాక నాకు మిక్కిలి ఆనందాన్ని కలిగించింది. వారి అనారోగ్యం వారిని మృష్టాన్నంతో తృప్తిపరచాలనే నా కోర్కెయేగాక, ఆతిథ్యమిచ్చుటకు మిక్కిలి ఉత్సహించు నా కోడలు భవాని కోర్కెకూడా తీరలేదుగాని, వారు తృప్తిపడినట్లు చెప్పారు. భవాని మర్యాద మన్ననలకు సంతోషించారు.

శ్రీ సీతారామమూర్తిగారిని మహాకవి లేక కవిశేఖరులుగా నేను వర్ణించుట అనవసరం. యావత్తు ఆంధ్రప్రపంచ పాఠక లోకానికి సుప్రసిద్ధులైనవారుకదా! ఆత్మకథ, మహాత్మునికథ, రాష్ట్రగానం వంటి ఉద్గ్రంధాలను రచించినారుకదా! అభినవ తిక్కన, కళాప్రపూర్ణ మొదలైన బిరుదము లున్నవికదా! కేంద్ర సాహిత్య అకాడమి నుండి మొదటి బహుమతిని పొందినవారుకదా!

శ్రీ తుమ్మలవారితో నా కిప్పుడు కొంత సన్నిహితత్వం కలిగింది. అందువలన వారి వ్యక్తిత్వాన్ని గురించి రెండు ముక్కలు చెప్పుతాను. వారీమధ్య "చౌదరి" నామాంతరాన్ని వదులు కొన్నా వారు అసలైన, సిసలైన కమ్మ. ఈకాలం కమ్మకాదు. ప్రాతకాల ఋజువర్తనం, నీతి, నిజాయితీగల కమ్మ. పౌరుషం, స్వాభిమానం, త్యాగబుద్ధిగల కమ్మ. పైగా బోళాతనం, నిరాడంబరత్వం, అల్పసంతోషం, కలుపుగోలుతనంగల చనువుతో వర్తించే గ్రామీణ కమ్మ. వారెంత గొప్ప పండిత కవులైనా, అభినవతిక్కన, కళాప్రపూర్ణ మొదలైన బిరుదముల నందినా, కులభేదం, వర్ణభేదం పాటించకపోయినా, మహాత్మాగాంధి అనుచరుడై సర్వోదయ భావాల నములులో పెట్టుట కుత్స

హించినా ఇవన్నీ వారిని నుంచి కమ్మగానే తీర్చిదిద్దినవి. వారి కున్నదని నే నూహించిన స్వల్ప క్రోధ, లేక కష స్వభావం కమ్మ కుల స్వభావంలో అంతర్భాగమే.

మా బొమ్ములూరు శివాలయం పూజారి యడవల్లి పుల్లయ్య గారి అన్న వీరభద్రయ్యగారు మా లింగం వంశవృక్షం వ్రాసిన సందర్భంగా వారిని తగినట్లు సన్మానించం డని గుడివాడ తాలూకా చౌటపల్లికి చెందిన శ్రీ సూరపనేని కాకుళయ్యగారు 1938 అక్టోబరు 31-వ తారీఖున నాకు వ్రాశారు. వారి పద్యాలలో రెంటిని ప్రథమ భాగంలో జేర్చాను. నేను వీరభద్రయ్యగారిని సత్కరించా లను తలంపుతో నుండగా వారు పరలోకప్రాప్తు లైనారు. వారి సంతాన మెవ్వరో, ఎక్కడ దున్నారో ఇప్పటికిని తెలియలేదు.

ఇప్పుడు జ్ఞాపకం వచ్చిన విషయం మరొకటి చెప్తాను. నేను తిరుమల శ్రీ వేంకటేశ్వరస్వామి దర్శనం అనిగాక, అక్కడి తిరుచానూరులో మరునా డుదయం జరిగే ఒక వివాహానికి హాజరగుటకు ప్రత్యేకంగా తిరుపతి చేరుకొన్నాను. నెల్లూరులో నే నుద్యోగంలో నున్నప్పుడు నాకు వ్యక్తిగతంగా మిక్కిలి పరిచితులైన శ్రీ పెళ్లకూరు దశరథరామిరెడ్డి, వారి భార్య శ్రీమతి అనసూయమ్మగార్ల యిద్దరు కుమార్తెలలో పెద్దకుమార్తె వివాహం 1958 ఫిబ్రవరి 8-వ తారీఖున జరిగింది. ఆ వివాహానికి ఫిబ్రవరి 7-వ తారీఖు సాయంత్రానికి తిరుపతి చేరుకొని, ఆరాత్రి అక్కడ విశ్రమించి, మరునా డుదయం తిరుచానూరులో జరిగే వివాహం చూడవలసియున్నది. అందువలన ముందుగా తిరుపతి-తిరుమల దేవస్థానాల ఎగ్జిక్యూటివ్ ఆఫీసర్ శ్రీ సి. (చలికాని) అన్నా రావుగారికి వ్రాసి, తిరుపతి పెద్దసత్రంలో ఒక గది రిజర్వు చేయించుకొన్నాను. తీరా ఆ సత్రానికి చేరుకొన్నప్పటికి నాకొరకు రిజర్వు చేసిన గదిని ఎవరికో యిచ్చివేశారట. శ్రీ అన్నారావుగారి ఉత్తరం నేను చూపించినా, ఆగది ఖాళీ లేదని, వేరే ఒక మూలనున్న ఏ సౌకర్యం లేని గది నిస్తా మన్నారు. నేను ఘర్షణ పడినా, లాభం లేకపోయింది. నేను నా కారులో మద్రాసు నుండి అక్కడకు వెళ్లియున్నాను. వెంటనే ఆరాత్రే మద్రాసుకు తిరిగి

పోదామని అనిపించింది కాని, అది మంచిపద్ధతి కాదని తోచింది. అంతలో మద్రాసు పచ్చయప్ప కళాశాలలో తెలుగుశాఖకు ప్రొఫెసర్‌గాను, అధ్యక్షుడుగాను చాలా సంవత్సరాలు పనిచేసి యుండిన సజ్జనుడు, మిక్కిలి స్నేహశీలుడు శ్రీ మాదిరెడ్డి రామానుజరావు నాయుడుగారు గుర్తుకు వచ్చారు. వారప్పుడు తిరుపతి విశ్వవిద్యాలయానికి రెజిస్ట్రార్‌గా వుండి, ఆ కళాశాల ఆవరణలో వుంటుండినారు. అందువల్ల సరాసరి వారింటికి వెళ్లాను. వారు బ్రహ్మచారి. ఆ సమయానికి వారు రేపూరో వెళ్లియుండినారు. అయినా, వారి నౌకరుకు నేను ఫలనా, నాయుడుగారు నాకు బాగా తెలిసినవారు అని చెప్పి పరిస్థితి వివరించి, ఆ రాత్రి అక్కడ విశ్రమించి, ప్రొద్దుననే వెళ్లి పోతానని చెప్పాను. అతడు సమ్మతించి అన్ని వసతులతో కూడిన గది నాకిచ్చాడు. మరునాడుదయం కాలకృత్యాలు తీర్చుకొని, స్నానం వగైరా పూర్తి చేసుకొని, నా కృతజ్ఞత తెల్పుచు రామానుజరావునాయుడుగారికి ఒక ఉత్తరం వ్రాసి, ఆ నౌకరు కిచ్చి, పెండ్లికి హాజరై పెండ్లి జరిగినతర్వాత కొండకు వెళ్లి, స్వామిదర్శనం చేసుకొని, ఆసాయంత్రానికి మద్రాసుకు తిరిగి వెళ్లాను. నేను తిరుపతిలోని సత్రానికి వెళ్లినప్పుడు నాకు బాగా తెలిసియుండిన మైకా వ్యాపారంచేసే రెడ్లు ముగ్గురు, నలుగురు నాకు కనపడి పలకరించారుగాని, నా యిబ్బందిలో వారి నుండి ఎట్టి సహాయం నాకు కలుగలేదు. వారుకూడా గదుల కోసమే కాచుకొని వుండినారనుకొందును. అయినా, సర్వసామాన్యంగా నెల్లూరి రెడ్ల మనస్తత్వమే అంత. ఏరుదాటి తెప్పతగలేసే రకం, 5 ఏళ్లకు ముందు ఉద్యోగవిరమణచేసిన నాతో పని వారికి వుండదుకదా.

ఈమధ్య నేను పాల్గొన్న రెండు సమావేశాలను గురించి చెప్పటం యుక్తమనిపించుచున్నది. మొదటిది, ఈ సంవత్సరం (1974) జనవరి 11 నుండి 13-వ తారీఖు వరకు కూచిపూడి (భాగవతుల కూచిపూడి) లో శ్రీ సిద్ధేంద్ర కళాక్షేత్రం వారు జరిపిన శ్రీ త్యాగరాజ ఆరవ ఆరాధనా మహోత్సవాల

సందర్భంగా బాల బాలికల నృత్య, సంగీత, వక్తృత్వ పోటీలు జరిగాయి. ఈ ఉత్సవాల బాధ్యతను వహించిన అక్కడి సంగీత కళాశాల ప్రిన్సిపాల్ శ్రీ పసుమర్తి వేణు గోపాలకృష్ణ శర్మగారు "పోటీలలో గెల్చినవారికి 13-వ తారీఖు ఉదయాన మీరు బహుమతులను పంచిపెట్టుటకు రం"డని కోరారు. నే నంగీకరించి, సిద్ధేంద్ర కళాక్షేత్రంవారి శ్రీ వెంకటేశ్వర భవనంలో నాకు నియమించిన పనిని నెరవేర్చాను. ఆసంద ర్భములో రెండు అభిప్రాయాలు వెలిబుచ్చాను. ఒకటి, నృత్యంలో లాలిత్య ముండాలి, వట్టి నేర్పు చాలదని. రెండోది, యక్షగాన నాటకాలలో వేసే స్త్రీపాత్రలను యిప్పటివరకువలె గాక స్త్రీలే ధరించాలని. కొందరు బాలికలు మిక్కిలి ఉన్నత దశకు వచ్చేవారుగా తోచారు. అట్టివారు స్త్రీ పాత్రలు ధరిస్తే మిక్కిలి రాణింపుగా వుంటుంది.

నేను పాల్గొన్న రెండవ కార్యం (ఫంక్షన్) ఉయ్యూ రులో 25-1-1974 తేది సాయంత్రం జరిగిన రాజాజీ స్మారక గ్రంథాలయ ప్రారంభోత్సవం. శ్రీ వడ్డే శోభనాద్రీశ్వరరావు, శ్రీ గొర్రెపాటి వెంకట సుబ్బయ్య (ఆంధ్రబ్యాంకి ఉద్యోగి) గార్ల ఆహ్వానంమీద ఆ ప్రారంభోత్సవాని కధ్యక్షత వహించాను. ఏవో నాలుగు ముక్కలు చెప్పి నా కప్పజెప్పిన పనిని నెరవేర్చాను. ఈ గ్రంథాలయం కొద్దిస్థాయిలో మొదలిడబడింది. త్వరలోనే పత్రికలు, జర్నల్సు, మాగజీన్సే గాక తగినన్ని మంచి పుస్తకాలను సంపాదించుకొని అభివృద్ధిచెందుతుం దని ఆశిద్దాం.

పై విధంగా రకరకాలుగా నా జీవిత మిప్పటి వరకు (మార్చి 1974) కొనసాగింది. మాకు 1919 జూలై 24-వ తారీఖున జన్మించిన పెద్దకుమారుడు "బాబు" అనే పూర్ణచంద్ర రావు గతించినాడుగాని, సజీవంగా మాకు పుట్టిన బిడ్డలు, మా సంతానానికి పుట్టిన బిడ్డలు సుఖముగనే వున్నారు. నా భార్య అన్నపూర్ణమ్మ 1972 జనవరి 23-వ తారీఖున తన 72-వ ఏట పరలోకప్రాప్తి చెందింది. నాకు 75 సంవత్సరాల వయస్సు, గత (1973) జూన్ 25-వ తారీఖుతో నిండింది. వెంటనే గాని,

త్వరలో గాని మరణించే చిహ్నాలు లేకపోయినా, కొంతకాలం నుండి నా ఆరోగ్యం క్షీణదశలోనే వుంటున్నది. క్రమేపి దిగ జారుచున్న ట్లనిపించుచున్నది.

1968 అక్టోబరులోను, తిరిగి 1969 నవంబర్‌లోను కుడి కన్నును మద్రాస్‌లోను, హైదరాబాద్‌లోను డాక్టర్ టి. టి. రామలింగంగారిచేత, డాక్టర్ పి. శివారెడ్డిగారిచేత బాగు చేయించుకొన్నాను. అయినా, సుమారు 40 సంవత్సరాల నుండి నాలో పాదుకొనియుండిన మధుమేహవ్యాధి ప్రభావంవల్ల ఎంత జాగ్రత్తగావున్నా, జవసత్వాలు తగ్గుస్థాయిలో వుండటం, దృష్టిమాంద్యం కలగటం, నడచుచున్నప్పుడు తూలు కలగటం వల్ల పెద్ద ఆరోగ్యంగా వున్నానని చెప్పలేను. పళ్లవ్యాధి వలన నా పైని క్రింది పళ్లన్నీ ఎప్పుడో ఊడలాగబడినవి. వాని స్థానే కృత్రిమ పళ్ల సెట్టును అమర్చుకొని వుంటున్నాను. అప్పు డప్పుడు క్రొత్త సెట్టును కట్టించుకొనుచుండినా, కృత్రిమ పండ్లు అసలు పండ్లౌతవా? ములగకొమ్మ చింతకొమ్మౌతుందా? విశేషమేమిటంటే వృద్ధాప్యం వచ్చినా, శరీర మింకను ముడుతలు పడలేదు. గడ్డం, మీసం చాలావరకు నెరిసినా, తలవెంట్రుకలు పలుచనైనప్పటికీ నల్లగానే వున్నవి. బొత్తిగా ముసలి ముఖం ఏర్పడలేదు. సుఖంగా నిద్రపోయి, గడ్డం చేసుకుని, చక్కగా దువ్వుకొని ఉల్లాసంగా వున్నప్పుడు 75 ఏళ్ల వాడ నంటే క్రొత్తవారు నమ్మరు. 5, 6 సంవత్సరాలక్రితం, 60 సంవత్సరాల లోపువాడనుగా కనపడతానని వారు, వీరు అనే వారు. ఇప్పుడా స్థితి మారినా, మరీ అంత ముసలివాడనని ఎవరూ అనుకోరు. నేను యిప్పుడు ఈ "స్వవిషయం" మూడు భాగాలను వ్రాయటమే నేను వ్రాయుటకుగాని, చదువుటకుగాని అంత యిబ్బంది పడటంలేదని తెలుస్తుంది. ఏదో విధంగా మొత్తం మీద ఇప్పటివరకు నా జీవితానుభవాలను, సంఘటనలను, దృక్పథాలను వెలువరించగలిగాను. ఇకపైన ఈశ్వరేచ్ఛ.

లింగం వీరభద్రయ్య చౌదరి

24 - 3 - 1974